శ్రీరస్తు



# కళాపూర్ణోదయము

పింగళి సూరనామాత్యప్రణీతము

[illegible] కథాసంగ్రహసహితము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే బ్రకటితము.

 | Price Rs. 6-50

శ్రీరస్తు

# కళాపూర్ణోదయము

పింగళి సూరనామాత్యప్రణీతము





చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే బ్రకటితము.

1965

# ప్రకాశక విజ్ఞప్తి

1910-వ సంవత్సరమున నీ కళాపూర్ణోదయము మొదటి కూర్పును బ్రకటించుచు, ఆంధ్రాంగ్లభాషావిశారదు లగు మ-రా-రా-శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి, ఎమ్. ఏ. గారి విమర్శనమును పాఠకులకు శీఘ్రకాలములో నందఁజేయుదుమని ప్రకటించియుంటిమి. శ్రీ రెడ్డిగారు విమర్శనము వ్రాయుటకుఁ బ్రారంభింపఁగనే వారు శ్రీమైసూరు శ్రీయువరాజులుంగారితో ఇంగ్లాండునకు వెళ్లుట తటస్థించినది. అట్లు వెళ్లినను వారు సంచారమునందుఁ గూడ నీపనిపై శ్రద్ధవహించియే యుండిరి. కొంతకాలమున కిది గొప్ప గ్రంథ మయ్యెను. దీని నీ గ్రంథముతో ముద్రించుటకన్నఁ బ్రత్యేకగ్రంథముగఁ బ్రకటించుటయే మంచి దని నేను హెచ్చరింపఁగా వారు కవిత్వతత్త్వవిచార మను పేరుతో దానిని బ్రకటించిరి. దీని పీఠికలో నీ యుదంతము నంతయు వారే వ్రాసియున్నారు. ఈ కళాపూర్ణోదయమును గురించియే కాక, శ్రీపింగళి సూరనార్యకృతము లగు నితర గ్రంథములను గురించియు విపులముగ విమర్శించియున్నారు. ఈ రెండవకూర్పున కుద్యమించుచు వారికి వ్రాయఁగా నపుడు వారు కొన్నిమార్పులతో నిందుతోఁ బ్రకటించిన పీఠికను దయచేసిరి. బాల్యమునుండి శ్రీ రెడ్డిగారు

పింగళి సూరనార్యకృతగ్రంథముల నెంతో యాసక్తితోఁ జదువు చుండువారు గావున వారిచేతనే పీఠిక వ్రాయించి ప్రకటింప వలయు నను కోరిక గలిగి సఫల మైనందున కెంతయు సంతసించు చున్నారము. ఈ గ్రంథమును బ్రచారమునకుఁ దెచ్చుటయందు సహాయపడిన శ్రీ శ్రీ శ్రీ పిఠాపురము మహారాజులుంగారికిని, పీఠికను వ్రాసిపంపిన శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారికిని కృతజ్ఞులము.

తండయార్పేట,
చెన్నపురి.
25-5-1957

ఇట్లు,
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

# మొదటికూర్పు భూమిక

ఈ కళాపూర్ణోదయ మను కల్పిత ప్రబంధమును సహృదయ హృదయానురంజకముగా నపూర్వ కథాకథన వైచిత్రీ ధుర్యంబుగా శృంగారాదిరసములను దత్తదుచితభంగిని బొందుపఱచి మంచి శైలిని రచించి తన పాండిత్యమును బుద్ధిచాతురిని లోకుల కత్యాశ్చర్యం బగునట్లుగా వెల్లడిచేసిన మహానుభావుఁడు పింగళి సూరన యను మహాకవి. ఈతఁడు రచించిన గ్రంథములలో నెల్ల నిదియే ముఖ్యమైనది.

ఈకవి కృష్ణదేవరాయల యాస్థానములోని కవీశ్వరులలో నొకఁడని కొంద ఱందురు గాని యది సరిగాదు. ఈయన నంద్యాల సంస్థానాధిపతి యైన కృష్ణరాజు నాస్థానములో నున్నవాఁడని గ్రంథమే చాటుచున్నది. కృష్ణదేవరాయలు 1530-వ సంవత్సరమున మృతినొందె ననియు, నంద్యాల కృష్ణరాజునకు 1560 ప్రాంతముల నీగ్రంథము కృతి యీయఁబడి యుండె ననియు మ-రా-రా-శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులవారి యాంధ్రకవులచరిత్ర నుడువుచున్నది.

తెలుఁగు ప్రబంధములలోఁ బ్రాముఖ్యతను గన్న యీ ప్రబంధమును ముద్రింపింపవలయు నని మేము చాలదినముల నుండి కృతప్రయత్నుల మయ్యును నితర గ్రంథములఁ గొన్నిటిని ముద్రింపించి పిమ్మట దీని ముద్రింపింత మనుకొనుచుండఁగా,

నింతట శ్రీమత్పిఠాపురసంస్థానప్రభువు లగు శ్రీరాజా శ్రీరావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహాదరువారీగ్రంథ ముద్రణమునకుఁ దగిన ధనసహాయ మొనర్చి మాకెంతయుఁ బ్రోత్సాహము గలిగించినందున నిప్పటికి దీనిని వీలగునంతవఱకు సవరించి ముద్రింపించితిమి. ముద్రణావస్థలోఁ దటస్థించిన లోపము లెవ్వియైన నున్నచో మన్నింపవలయు నని చదువరులఁ బ్రార్థించుచు మ మ్మింకను నుద్గ్రంథముల ముద్రించుచుండున ట్లై ప్రోత్సాహము కలిగించుచుందురు గాక యని శ్రీవారికిని గృతజ్ఞతాసూచకముగా ననేక ధన్యవాదములఁ జేయుచున్నారము.

ఈగ్రంథముపై శ్రీమైసూరుమహారాజావారి కాలేజీలో హిస్టరీప్రొఫెసరగు మ-రా-రా-శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి, ఎమ్. ఏ., గారు వ్రాసిన విపులమగు విమర్శనము కొలఁది దినములలోనే ముద్రించి కళాపూర్ణోదయ పాఠకమహాశయుల కందింతుము.

1910 సంll జూన్. } ఇట్లు,
చెన్నపురి. } వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

# పీఠిక

కళాపూర్ణోదయము రచించిన మహాకవి పింగళి సూరన్న. ఇతఁడు శ్రీకృష్ణదేవరాయలకాలమునకుఁ దరువాతివాఁడు; ప్రాయశః రామరాజభూషణకవికిఁ బూర్వుఁడు; మఱియు నింగ్లాండుదేశములోని కవులలో నగ్రగణ్యుం డైన షేక్స్పియరునకు నితఁడు సమకాలికుఁ డై యునికియు సుసాధ్యమే.

ఆకాలమున నాంధ్రదేశమునఁ బ్రబలముగా నుండిన కవితారీతి ప్రబంధరచన. ప్రబంధకవులకు మధ్యకవు లనియుఁ బేరు గలదు.

పింగళి సూరనార్యుఁడు మధ్యకవులకుం జేరినవాఁడు గావునఁ బ్రాచీనగ్రంథములను ముఖ్యముగా భారతమును బహుశ్రద్ధతోను భక్తితోను బఠించియుండును. ఇందుల కమ్మహేతిహాసములలోనిగుంభనలక్ష్మికిఁ దేఁజాలినంత సాదృశ్యముగల రచనలఁ దాఁ జేసియుంట యొకసాక్ష్యము. చూడుఁడు.—*

కణ్వాశ్రమవర్ణనావసరమున నాదిపర్వములోని—

సీ. "శ్రవణసుఖంబు గా సామగానంబులు
చదివెడుశుకములచదువు దగిలి
కదలక వినుచుండుకరులును గరికర
శీతలచ్ఛాయఁ వచ్చికరాంబు

---

* నాకవిత్వతత్త్వవిచారమునందలి ముఖ్యాంశములు మాత్ర మిం దెత్తఁబడినవి. విస్తరముగా నందుఁ జూడఁదగును.

కణములచల్లనిగాడ్పానపడి వానిఁ
　　　　జెంది సుఖంబున్నసింహములును
భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి
　　　　పెట్టునీవారాన్నపిండతతులు
తే. గడఁగి భక్షింప నొక్కటఁ గలసియాడు
　　చున్నయెలుకలుఁ బిల్లులు నొందుసహజ
　　వైరివర్గంబులయు సహవాస మపుడు
　　చూచి మునిశక్తి కెంతయుఁ జోద్యమంది."

అను పద్యములు జూచి మణికంధరుని తపోవనమును వర్ణించుచుఁ బింగళిసూరన్న పైరీతి ననుకరింపం జూచియు యమకమునకై స్వారస్యముఁ జెడఁగొట్టుకొన్నాఁడు.—

సీ. "ఆవులు నాకఁ గన్నరమోదుప్పులులును
　　　　బులులచన్గుడువంగఁ బోవులేళ్లు
　　లేళ్లచెల్లాట రంజిల్లెడుహరులును
　　　　హరులు గోళ్లను గోఁక నలరుకరులు
　　కరులకటాళివైఖరి నాడుపాములు
　　　　పాములఁ బాలించుబభ్రుతతులు
　　బభ్రుతతులప్రక్కఁ బాయనియెలుకలు
　　　　నెలుకలఁ బెంచుపిల్లులును గలిగి..."

భీష్మాటోపమును వర్ణించుచున్న భారతములోని కొన్ని వచనముల ననుసరించి కళాపూర్ణోదయములో నష్టమాశ్వాసము నందలి 'ఇత్తెఱంగున నప్పార్థివోత్తముఁడు' ఇత్యాది దీర్ఘవచనములు వ్రాయఁబడియున్నట్లు దోఁచెడిని. మఱియు "సూరనార్యుఁడు కొన్నియెడల నన్నెచోడుని ననుక్రమించియున్నాఁ"

డని శ్రీమానవల్లి రామకృష్ణకవి గారు వ్రాసియున్నారు; కాని సందర్భము లభిన్నములుగ నుండుచోట్ల భాషయుఁ గొంత సాదృశ్యముం దాల్చుట యప్రకృతముగాదు. కావునఁ బోలికలం బట్టి చౌర్యము నొడికట్టుట తగదు.

ఇట్లు మన సూరన యుత్కృష్టులైన గ్రంథకర్తల జాడల నెఱిఁగినవాఁడయ్యుఁ గొంతవఱకు నంత మంచివి కాని మార్గముల నవలంబించియున్నాఁడు. దీనికిఁ గారణము సమకాలికుల మెప్పింపఁ జూచుట. మఱియు మన కవి మిగుల బీదవాఁడు గాఁబోలు. కుటుంబరక్షణార్థము ద్రవ్యార్జనకై యత్నించుట దోషము కాదుగదా! ఆకాలమున నిప్పటియట్లు ప్రజలు పుస్తకములు గొనుటచే నాదాయము గడించి జీవింపఁ జూచుటకు వీలు శుద్ధముగ లేమిం జేసి యతఁడు రాజుల నాశ్రయింపవలసిన విధికి లొంగినవాఁ డాయెను. ఇఁక నారాజుల యిష్టానుసారము వ్రాయక యేమిచేయును? పరిపాలన కార్యమునఁ దగిలి కాలము గడుపు రాజులు స్వబుద్ధితో విమర్శింపఁ జాలినంత పండితు లగుట యరిది గావున, నట్టివా రాచారముంబట్టి గుణ దోషనిర్ణయముఁ జేయుట నైజము. సూరనకాలమునఁ బ్రాచుర్యమునకు వచ్చిన కవితారీతి ప్రబంధరచన కావునఁ దానును ప్రబంధధోరణినే వ్రాయవలసినవాఁడయ్యె. ఐనను భావగంభీరుఁడును వివేకవంతుఁడు నగుటంబట్టి పూర్తిగఁ బ్రబంధకూపంబునఁ బడలేదు. రాజుల యిష్టమునకుఁ దన యిష్టమునకును నడుమ నిలిచి కవితాస్వర్గమునఁ ద్రిశంకుస్థితిం దాల్చియున్నాఁడు. తనకు శరణ్యులైన ప్రభువుల చిత్తవృత్తి ననుసరించువాఁ డనుటకుఁ గళాపూర్ణోదయముసుండియే యొక

యుదాహరణముఁ జూపవచ్చును. చూడుఁడు. కృతికర్త కైవుఁడు. ఇందు కితఁడు దారపుత్రాదిబాధ లేని యౌవనకాలములో వ్రాసిన దని యూహింపఁదగిన రాఘవపాండవీయమున నితనిని చినవెంకటాద్రి "లలాటేక్షణ భక్తిశీల" యని సంబోధించుటయే సాక్షి. ఇఁక కళాపూర్ణోదయ భర్తలైన నంద్యాల వారన్ననో వైష్ణవము కొంత ముదిరిన మహనీయులు. అందును కృతిపతి యగు కృష్ణమహీపాలుఁడు వైష్ణవమతశీలుఁడు. తిరుమల తాతార్యవంశీయుఁ డగు శ్రీనివాసగురువు శిష్యుఁడు. కావుటంబట్టియే రాఘవపాండవీయ ప్రభావతీప్రద్యుమ్నములలో శివస్తుతితోఁ గావ్యారంభముఁ జేసిన భక్తుఁడు కళాపూర్ణోదయమున విష్ణువునకు నగ్రార్చనం జేసెను. తుదకు వైష్ణవమత ప్రధానతత్త్వమును బోధించు 'లక్ష్మీనారాయణ సంవాద' ముచేఁ బ్రబంధమును ముగించెను. పాపము! దారిద్ర్యముచేఁ గుంచింపఁబడనివాఁ డెవఁడు? ఇట్లు యౌవనమున స్వాతంత్ర్య మవలంబించియున్నను మధ్యకాలమున దారపుత్రాదిపోషణమునకు వీలులేక చాలాకాలము పారతంత్ర్యప్రవృత్తుఁడై యుండి విసికినవాఁ డౌటఁ గాఁబోలు వార్ధకమునందు ప్రభావతీప్రద్యుమ్నమునందు స్వాతంత్ర్య మవలంబించుటయ కాదు, గంభీరముగ నిట్లు వాక్రుచ్చుటయు—

మ. "జనము ల్మెచ్చఁగ ముద్రచించితి నుదంచద్వైఖరిం గారుడంబును శ్రీరాఘవపాండవీయముఁ గళాపూర్ణోదయంబుం దదాదెనుఁగుంగబ్బము లెన్ని యేనియును మత్పిత్రాదివంశాభివర్ణన లేమిం బరితుష్టి నా కవి యొనర్పం జాల వత్యంతమున్."

ఈపద్యముం జదువునపుడు కవి యాదిని బడినపాట్లకు దుఃఖమును, తుదకు నిరంకుశక్రీడకుం జొచ్చెం గదా యని సంతసమును బొందక మానము. ఈధైర్యమహిమచే నితఁడు సర్వజనశ్లాఘనీయుఁడు.

కళాపూర్ణోదయ మాంధ్రంబున నద్వితీయమైన గ్రంథము. భారత మనుచరిత్రాది గ్రంథములవలెఁ బరివర్తనముగాని ప్రాచీనకథామూలకము కాని కాదు; మఱి కవియొక్క స్వసృష్టి. ప్రబంధకవు లెవ్వరియందును గనఁబడని ప్రతిభయు, భావనాశక్తియు, సందర్భశుద్ధియు, పాత్రోచితపద్యరచనయు నిందు సుప్రసిద్ధములు. ఐనను కాలదోషము తప్పించుకొనరాని దగుటచే ప్రబంధకవులయందలి స్ఖాలిత్యము లిందును బెక్కులు గలవు; కాని దోషములకన్న గుణము లెన్నియో మడుంగు లెక్కువ. సూరన రచించిన గ్రంథములలో నెల్ల నిది యుత్తమోత్తమము ఐనను రాఘవపాండవీయమును బ్రశంసించినంత, సూరన దీనిని బ్రశంసింపకపోవుటచేఁ గళాపూర్ణోదయముకన్న రాఘవపాండవీయమే ప్రశస్తమని తలఁచెనేమో యని సందేహింపవలసియున్నది; కాని రాఘవపాండవీయరచనానంతరము శ్లేష నంతగా వాడక చాలించుటం జూడ దానియం దితనికి శక్తియున్నంత రక్తి లేదని మన మూహించుట యుక్తము.

ఈకావ్యముయొక్క గుణదోషములు రెంటికి నాస్పదమైనది సూరనార్యుఁడు ప్రారంభమునఁ జేసికొన్న ప్రతిజ్ఞయ. చూడుఁడు. "సకలలక్షణలక్షితంబైన మహాప్రబంధంబు కీర్తికారణం బని" తలఁచి "అపూర్వకథాసంవిధానవైచిత్రీ మహనీయంబును శృంగారరసప్రాయంబును బుణ్యావస్తువర్ణనాకర్ణ

వంబునకు నగు కళాపూర్ణోదయం బను మహాకావ్యంబు'' రచింపఁ గడంగెను. కవియొక్క యుద్దేశమే యీగ్రంథ మిన్నిలక్షణములు గల్గియుండవలెనని. కవి తన యభిమతము నెఱవేర్చికొన్నాఁడు గాని, యిట్లు పంతముఁ బట్టి వ్రాసినందున నిష్కళంక మైనకృతి యేర్పడినదా యనుట సందేహము. కథయుఁ బ్రకృతియందలి వస్తువులవలెఁ దనంతఁ దనయందలి సత్త్వముంబట్టి పుట్టి పెరుఁగు గుణము గలది. దానిని సాజముగఁ బెరుఁగనిచ్చి యప్పుడప్పుడు సవరించుచు సంస్కరించుచు దోహదము చేయుచు వచ్చిన మేలా? మొదటినుండియే యీ యీరసములు తప్పక యీఁగలదానిని గల్పించెద నని సంకల్పించుకొని, పిమ్మట దానియుత్పత్తిఁ జేయఁ జూచుట మేలా? యోచింపుఁడు.

సూరనార్యున కీయుద్యమముచేఁ గలిగిన మేలు గీడు లెవ్వి యన: అపూర్వకథాసంవిధానముం బూనుటచే నుహజ్ఞకును భావనాశక్తిని మంచి ప్రవేశము దొరకినది. కళాపూర్ణోదయము సామాన్యప్రబంధములకన్న నెక్కువ రసవంతముగా నుండుట కిది యొక కారణము. మఱి భారత మంత సరసము గాని దగుటకు మూలమే యనఁగా, సర్వలక్షణములును బలాత్కారముననైనఁ దెచ్చి వ్రాసివేయవలయు నని సందేశముఁ జేసికొన్నవాఁడగుటచేఁ గథను సహజముగఁ బక్వతను రానియ్యక యచ్చుటచ్చుట నూఁదర వేసియుండుట. అయిన నొక్కటి, ప్రబంధములలోఁ గథ కంటెకిఁ గానశానంతకృశత్వముఁ జెంది యుండును. ఈలోపమును చాలమట్టుకుఁ బూరించి ఈకావ్యములోని కథను పుష్టికిఁ దెచ్చిన తంత్రములలో సకలలక్షణసంపన్నతా సమయము ప్రముఖము. ప్రబంధములలో శృంగార మనఁబడు

నొక రసముతప్ప తక్కిన రసములు సామాన్యముగ వ్యంగ్యములు. మన సూరనకవి కళాపూర్ణోదయమున నన్నిరసముల కును స్థాన మేర్పఱుచు కోరిక గలవాఁ డగుటచే వాని కన్నింటి కిని చోటు దొరకునంత విశాల మగు కథను గల్పింపవలసినవాఁ డయ్యె. కావున నిందు కథ తుచ్ఛము గాదు; మఱి మిక్కిలి ప్రబలము. అయినను నొక దురదృష్టము. ఒకేకథలో నన్నిరసములు నిముడ్పవలయు నన్న నా కథను తాఱుమాఱుగా నీడ్వనిది కాదు. అనఁగా, అసంగతము లైనయంగములఁ దెచ్చిపెట్టి, సారస్యము నక్కడక్కడఁ జెడఁగొట్టి కథకు వికారము గల్పించినాఁ డని నామనవి. అయినను ఈసంకల్పము లేకున్నఁ గళాపూర్ణోదయము ప్రబంధములలోఁ జేరినగ్రంథముగా నుండి యుండదు నేమో! కావున నాదుర్గతికి దప్పించిన మంత్రము నింద్యపడన రాదు.

కల్పనాసామర్థ్య మీకవికిఁబలె నాంధ్రులలో మఱెవ్వరికిం గానము; తిక్కనాదుల కుండ వచ్చునేమో? సూరనయందు ప్రబంధకవులకుం గల వర్ణనాశక్తితోడ వారికి లేని కథాకల్పనాశక్తియు, వివిధము లైనసందర్భములను సంధానమునకుం దెచ్చుప్రతిభయు, సహవాసములు, మఱియు భావనాశక్తికి దోడు భాషాశక్తియు నీతనికిఁ గలదు. కవితాస్వరూపమునుఁ బ్రభావమును వర్ణించుచు వ్రాసిన యీపద్య మిందునకు నిదర్శనము.

లయవిభాతి.—

"చలువ గలవెన్నెలలచెలువునకు సౌరభము
గలిగినను సౌరభము చలువయుఁ దలిర్పం

బొాలు పెసఁగుకప్పురపుఁబలుకు కుఁ గోమలత
నెలకొనిన సౌరభముఁ జలువపసయుం గో
మలతయును గలిగి జనముల మిగులఁ బెం పెసఁగు
మలయపవనంపుఁగొదమలకు మధురత్వం
బలవడిననీడు మఱి కల దనఁగ వచ్చుఁ గడు
వెలయఁ గల యీసుకవిసలుకులకు నెంచన్."

(ఆ. ౧. ప. ౮౩

భావము శైలిని మించినదా? శైలి భావమును మించినదా? యని వెఱఁగొనరించు నగ్రగణ్యపద్యములలో నిది యొకటి. మఱియు సూరన తన సమకాలికుఁడైన షేక్స్పియర్ వలె నందంపు శైలిం గూర్చినవిచారములను తనకును కథకు భంగము రానిమాడ్కిఁ బాత్రములచాటునఁ జేసియున్నాఁడు. బయటఁ బడకయ తన కృతిని దానే విమర్శించియున్నాఁ డను దృష్టాంతము: మణికంధరుఁడు చేసిన దండకరూప మగు కృష్ణస్తవముంగూర్చి కలభాషిణి ప్రశంసించిన తెఱంగు.—

సీ. పొసఁగ ముత్తెపుసరుల్ పోహళించినభంగిఁ
దమలోన వర్ణయుక్శబ్దములఁ గూర్చి
యర్థంబు వాచ్యలక్ష్యవ్యంగ్యభేదంబు
లెఱిఁగి నిర్దోషత నెసఁగఁ జేసి
రసభావములకు నర్హంబుగ వైదర్భి
మొదలైనరీతు లిమ్ముగ నమర్చి
రీతుల కుచితంబులై తనరారెడు
ప్రాణంబు లిమ్ముగాఁ బాదుకొల్పి

తే. యమర నుపమాదులును యమకాదులు నగు
నట్టియర్థశబ్దాలంక్రియలు ఘటించి
కవితఁ జెప్పంగ నేర్చుసత్కవివరునకు
వాంఛితార్థంబు లొసఁగనివారు గలరె?

(ఆ. ౧. ప. ౧౮౫.)

ప్రభావతీప్రద్యుమ్నమునందు ఇట్టి దొకటి గలదు; కాని కథలో నీపద్యమున కున్నంత కలయిక దానికి లేదు. ఇంద్రుఁడు శుచిముఖిని గొనియాడుచు నాడిన పద్యము:—

సీ. "శబ్దసంస్కార మెచ్చుటను జాఱఁగ నీక
పదమైత్రి యర్థసంపదలఁ బొదలఁ
దలఁపెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ
బునరుక్తిదోషంబుపొంతఁ బోక
యాకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శా
ఖాచంక్రమక్రియఁ గడవఁ జనక
ప్రకృతార్థభావంబు పాదుకో నడుకుచు
నుపపత్తి యెందు నతూర్జితముగ
తే. నొకటఁ బూర్వోత్తరవిరోధ మొందకుండఁ
దత్తదవయవవాక్యతాత్పర్యభేద
ములు మహావాక్యతాత్పర్యమునకు నొనరఁ
బలుక నేర్చుట బహుతపఃఫలము గాదె?"

(ప్రభా. ఆ. 2. ప. 3.)

ఈ రెండుపద్యములం బోల్చి చూచితిమేని, రెండవపద్యము రచించులోపల కవి కొంతమట్టుకు శైలిం గూర్చిన యభిప్రాయము మార్చినాఁడనియు చెప్పుట కవకాశమయ్యెడి. కళాపూర్ణోదయపద్యముంబట్టి చూచినఁ గవి యర్థాలంకార

ములు మాత్రమే కాక శబ్దాలంకారములును అవశ్యానుష్ఠేయము లని భావించినట్లు గానఁబడియెడి. రెండవపద్యములో నేయలంకారములను ధ్యానింపలేదు. భావములు, అర్థములు, అవయవసంయోగము మొదలగు తలఁపులతోఁ జేరినలక్షణముల మీఁద నేకాగ్రమగు దృష్టిని నిలుపుట యుత్తమ మని యెంచెనేమో! కావుననే ప్రభావతీప్రద్యుమ్నమునఁ జిత్రకవిత్వమించుమించు శూన్యము. కళాపూర్ణోదయమునఁ గొంత యధికమే. ప్రభావతీప్రద్యుమ్నము రచనావిషయమునఁ గళాపూర్ణోదయమునకన్న మిన్నకాని, బహుశః కవి వయసు ముదిరినవాఁడైనందున రాగములు కృశించెఁ గాఁబోలు! భావనాశక్తి కొఱవడినది. కళాపూర్ణోదయమునందుఁ గల నూతనకల్పనలిందు లేవు. విషయముం బట్టి చూచిన గళాపూర్ణోదయము సాటిలేనిది; కాని శైలి ప్రబంధసంబంధి. శ్లేషము, అంత్యప్రాసము, యమకము, భాషాద్వయానులోమవిలోమశ్లేషచిత్రములు మొదలగునవి కళాపూర్ణోదయమునఁ దఱుచు ప్రయోగింపఁబడినవి. రగడలు దండకములును లేకపోలేదు.

కథను వివరించుపద్ధతులు రెండు: విషయముల జరిగినట్టి కాలక్రమానుసారముగాఁ జెప్పుట. కాలప్రమమును వదలి సరసమగు నేసందర్భముననైనఁ బ్రారంభించి పిదప వెనుక ముందుగా కథను బెంచి పూర్తి చేయుటయు. మొదటిది కాలక్రమమనియు, రెండవది కార్యకారణక్రమ మనియుఁ బేర్కొనఁబడవచ్చును. వస్తుతత్త్వపరిశీలకశాస్త్రములలోఁ గాలక్రమమునకుఁ బ్రసిద్ధి యెక్కువ. కావ్యములందు రసము ప్రధానము గాన, మొత్తముమీఁదఁ గాలక్రమమును విసర్జించిన

బాగు. కార్యకారణక్రమముగఁ గథను వర్ధిలఁజేసినవా రాంధ్ర కవులలో నాకుఁ దెలిసి సూరన్నతప్ప నింకెవరును లేరు. ఈ మార్గసంచారమునకు మొదలిడినవాఁ డితఁడే యేమో! స్వతంత్రముగ నవీనభంగుల రచించుట మహాకవియొక్క ప్రతిభకు ఫలమును సాక్షియును.

కాలక్రమముంబట్టి చూచిన నీ కథకు నాదిమభాగము పంచమాశ్వాసములోని సరస్వతీచతుర్ముఖుల లీలాకేళి. అనఁగా సామాన్యకవులు వ్రాసియుండినఁ బంచమాశ్వాసము ప్రథమాశ్వాసమై యుండును. చూచితిరా! ఈ కవియొక్క కూర్పులోఁ గథాప్రారంభమునకుఁ గావ్యప్రారంభమునకు నెంత దవ్వో! ఇట్లు దూరస్థము లయ్యు నల్లిక చెదరక జిగిబిగిగా నున్నందున నియ్యవి గాఢాశ్లేషముం గాంచియున్నవి. కథ పూర్తిగాఁ దెలియుటకు నైదాశ్వాసములు చదివి తీఱవలయు. ఇఁకఁ గథ నెఱుంగవలె నన్న కుతూహలమన్ననో ప్రథమాశ్వాసములోనే యంకురితము! రంభానలకూబరులవలనఁ గడపట వినంబడిన వాక్యం బొక్కటిఁ దలంచికొని కృతాంజలియై కలభాషిణి నారదునితోఁ దావిన్న ప్రకారంబు నీరీతి విన్నవించుచున్నది.

సీ. " ... ... ...
ఏను వృథాభ్రాంతి నింత నంతను దాని
వెంబడిఁ జని పల్కు వింటి నొకటి
వినుఁ డది యర్థశతనయుఁ డోయబల! యి
న్నారదుమాటలు నమ్మ వేఱ
తే. పొడమె నేమయ్యె "నలకళాపూర్ణసుద్ది"
కడమ చెప్పుమన్న రంభ యప్పుడ తెలుపనె

నీకు మఱి చెప్పరా కుంట నీ కథయును
నీకు నాతోడ నసుఫ్ముబ్బ నీకు పనియె."

(కళా. ఆ. ౧. ప. ౮౮.)

ఇదియే కళాపూర్ణుని గూర్చిన తొలుతటి ప్రస్తావన. ఔత్సుక్యముఁ బ్రేరేచువిధములు చూడుఁడు. రంభ తన ప్రియునికి నైనఁ జెప్పరానికథ యెట్టిది? ఏ కారణముచేత నామె మౌనధారిణి యాయె? నను మొదలగు ప్రశ్నలు తమంతట నావిర్భవించి సమాధానము దెలియువఱకు గథనుండి మనలఁ గన్నెత్తనీక చేయును. కావ్యములలోని యేకీభావ మనఁబడు గుణంబదియ. అనఁగా నొక పట్టున, నొకగుక్కఁగా సర్వముఁ గ్రోలమేనిఁ దనివి నీయమి భాగభాగముగాఁ జదువఁబోయినఁ దృప్తి లేదు. ఏలన: సమాప్తివఱకు నేభాగమును అఖండముగాఁ దెలియఁబడమిచే

తే. "ఏనెఱుఁగ వేడ్కపడుచున్న దానవో త
పోధనోత్తమ యాకళాపూర్ణుఁ డనఁగ
నెవ్వఁ డాతనిసుద్దు ము న్నేమి చెప్పె
నెద్ది చెప్ప రా దనియె నాయిగురుఁబోఁడి."

(కళా. ఆ. ౧. ప. ౮౯.)

యని పలికిన కలభాషిణి పలుకు లాయమవే కావు. మనవియును. మందుకొఱవి నెగఁద్రోసినట్లు నారదుఁడు "ఇదియంతయు నపూర్వంబు నాకునుం జెప్పరాదు." అని యానతిచ్చుతఱికి మన యుద్రేక మాపరాని దయ్యెను! నారదుఁడు ఈ కథ యత్యపూర్వ మనుటయును కవి పాత్రములమూలమునఁ దన కృతిని దానే యట నట విమర్శించుట కింకొక ప్రమాణము. రంభా

నలకూబరులకు నీ యపూర్వవృత్తాంతముం గూర్చి ప్రసంగ సమయమును వివరింపుచు నారదుండు కలభాషిణితోం దన ప్రియునకైనం దాం దెల్పనికి నాయప్సరస చెప్పినవిధంబు వినుమని యిట్లనియె.—

సీ. ..."యోపౌరుషాభరణ తత్కథలు వచ్చిన
నేమి యంటేని వినుము దెలియ
నాకథ లీకఁ జెప్పినట్టివాఁడను విని
నట్టివాఁడను ధాత్రియందుఁ బుత్ర
పౌత్రప్రపౌత్రాది బహుసంతతిని దన
యప్పుడుఁ జిరకాలంబు ప్రచురసంప
దభివృద్ధిశోభితశుభసౌఖ్యములు గాంతు
రనుమాట యున్నది యాదియందు
తే. యేను నీకది చెప్పిన నేనికొఱకు
నవనిఁ బుట్టంగవలయునో యని వెఱచెదఁ
బ్రాణవల్లభ యది భావకాంగసంగ
సౌఖ్యమునఁ జేర్చువాఁడు నిష్టంబు లగునె.
తే. 'అదియు వింటివి గద' యని యనియె దేని
యేను వినినట్టిపిమ్మట నిట్టిమాటఁ
బలికె నొక్కయమోఘవాగ్విలసనుండు
కావున వచింప విన నీకుఁ గాదు నాకు."

(కళా. ఆ. ౧. ప. ౯౮-౯౯.)

ఈ మాటలతో మనయొక్క యుత్కంఠ గొంతునకు మీఁదుగాఁ బోవును. ఉత్కంఠకుఁ దోఁడు అద్భుతము వచ్చి చేరును. ఎట్లన: కేవల నిరర్థకవ్యాఖ్యానమైన ఫలశ్రుతిఁ గూడ

గథలో ముఖ్యాంగముగఁ జేర్చినాఁడే యనువిస్మయ మొక్కటి; మఱి, యీఫలములు దేవతల కశోభము లగుటచే దేవత లీకథను వక్కాణింపరు. మనకు శోభములు గావున వినవలయు నను సంభ్రమ మింకను నుద్గాఢ మగును. ఒక పక్షమువారికి మేలు గను, మఱియొక పక్షమువారికిఁ గీడుగను అవతరించిన యీ చరిత్ర మేరీతి భూలోకములో వ్యాపింపఁగల దని యాశ్చర్య పడమా? కథ దేవలోకములోఁ బుట్టి యుండుట ఈ వఱకే స్పష్టము. ఇఁక దేవతలు చెప్పనిది మనకుఁ దెలియు టెట్లుగిని? కథ యేమో తెలిసియే యున్నది. లేకున్న నీకావ్య మెక్కడిది? నారదుఁడును...

తే. "అతివ విను రంభకును గలయట్టిభయము
నాకుఁ గల్గుటఁ బత్కాఢ నీకుఁ జెప్పఁ
గూడ దట్లయ్యు మిక్కిలి కువలయమున
వెలయఁ గల దది వెలయుత్రోవలును గలుగు."

(కళా. ఆ. ౧. ప. ౧౦౧.)

అని చెప్పుచున్నాఁడు. ఆతని వాక్య మమోఘము. అట్లగుట నెవ్వరికి నపాయంబు నాపాదింపని యే మంత్రముచేఁ గవి యీక్రియ సమర్థించునో యని యబ్బురపాటును దొట్రుపాటును జదువరులకుఁ బలమున్కలౌఁగదా! మనల నేకాగ్రావధానులం బరాకృష్టచిత్తులం జేయుటకన్న శిల్పసౌభాగ్య మెయ్యది? కల్పన యనఁగా నిట్లుండునదే కల్పన. ఊపిరియాడకుండునంత యుద్వేగముం గల్గించునది.

షష్ఠాశ్వాసములోని 189-వ పద్యమువఱకు నుండు నంత ప్రాఢముగ లేదు. దనువాతి భాగములు ఈ గ్రంథ

మంతటితో సమాప్తిం జేసియున్న సమ్మాన్యతరమై యుండును. ఏడవ, ఎనిమిదవ యాశ్వాసములలో భావనాశక్తి, ప్రతిభ మొదలగు కవిత్వమూలశక్తులు బలహీనములు. తుదకు మధురలాలసాపరిణయాదులు వర్ణింపఁబడకున్నను తత్పూర్వ కథచే నూహ్యములు కావున వానిని బొందించి యుంట పున రుక్తిం బోనిది. ప్రధానాఖ్యానముతో నైక్యము వీని కత్యల్పము. అట్లుండియు నీ నిరర్థక ప్రస్తావనకుఁ గవి యేల ప్రవర్తించినాఁ డనుట చింతనీయము.

కథాంగము లేక భావముం దాల్చి యొక శరీరముగా నేర్పడి యున్నఁ గళకు ప్రాశస్త్యము. అట్టి గాఢసంయోగ మునకు షష్ఠాశ్వాసములోని పూర్వోదితపద్యమునకుఁ దరువాతి భాగము లన్నియు విచ్ఛేదహేతువులు. ఇది యెట్లేంగి ప్రతి క్రియ చేయ నెంచినవాఁడై కాఁబోలు! కథయొక్క యాది నుండి యంత్యమువఱకు పూసలలో దార మిమిడి యుండు నట్లు మణిహారవృత్తాంతముం గూర్చియున్నాఁడు. ఈ హార వృత్తాంతముం దిలకింపుదు.

## మణిహారవృత్తాంతము

దీనికి నాదిమప్రభువు విష్ణువు. అతనిని తపస్సుచే మెప్పించి దానిని బడసినవాఁడు సుగ్రహుఁడు. పిమ్మట బ్రాహ్మణ శాపమున నతఁడు తన తొల్లిటి మెఱుకయంతయు హతము గాఁగా, నూతనావతార మెత్తినవానియట్లు సత్వదాత్ముఁ డను పేరఁ బరఁగి, రాజుగాఁ గొంతకాల ముండి పిమ్మటఁ గళా పూర్ణునికి మంత్రిగాఁ గుదిరె. సుగ్రహుఁడు మున్ను దేవ తాలయములోఁ బెట్టి మఱచిన యామణిహారమును మధురా

పురపు బ్రాహ్మణుఁ డొకఁడు తీసికొనిపోయి తనయింట బహు వర్షములు పూజసేయుచు నుంచుకొని ద్వారక కరిగి శ్రీకృష్ణునికి సమర్పించెను. శ్రీకృష్ణుఁడును "దండకాకృతి సముజ్జ్వల సంస్తవలీల కెంతయు, ఘనముగ మెచ్చియిచ్చె మణికంధర నామునకున్." మణికంధరుఁ డలస్సుప్రతునకు, నతఁడు కళాపూర్ణునకును, నాతఁడు శిశుప్రాయయగు మధురలాలసకుం గ్రమముగ నొసంగిరి. అట్లగుటఁ నీహారమును సరస్వతీచతుర్ముఖవిలాస క్రీడయుం బోలెఁ గథ నేకీభూతముం జేయుకల్పనలలో నొక్కటి. పూర్వోత్తరభాగంబు లన్నిటకిని ఈ హారము సామాన్యము. కథ నెల్లఁ బ్రాఁకి యుండు తీఁగవంటిది.

ఈరీతి నీకల్పన మహోత్తర మైన దయ్యు నిష్కళంకంబు గాదు. ఎట్లన: ఆహారము యొక్క నాయకమణి యెవ్వారి హృదయస్థలంబును నెంతవఱకు సోఁకియుండునో, యంతతడవును వారికి సర్వజ్ఞత్వము, వాక్యపటుత్వమును సిద్ధించు నని విష్ణువు వరము. దానిసత్యము ననుభవమునకుఁ దెచ్చికొనులోపల సుగ్రహుండు శాపహతుఁ డాయె. మధురాపురి బ్రాహ్మణుఁ డన్ననో దానిని గంతములో ధరింపక పూజసేయుచు బహు వర్షము లుండినాఁ డఁట! వానిభార్యయొక్క చిత్తస్థైర్య మెంత దృఢమో! ఆపెగూడ దొంగతనముగానైన దానిని వేసికొనలేదు. శ్రీకృష్ణుఁడు మణికంధరుని మెడలో వేసినాఁడు గాని యది "బాలతఁ గనుపట్టు విష్ణునికలాపము గావునఁ దద్భుజాంతర స్థితికి చాల కొప్పి గళసీమన యెంతయు గుప్తమై" యుండెనఁట! 'బాలతఁ గనుపట్టు,' అను విశేషణము సమంజసమా? పూజారి బ్రాహ్మణుఁ డిచ్చినది బాలకృష్ణునకా? షోడశసహస్రమహిషీ

యుతునకా? పిమ్మట శిశువుగా నున్న మధురలాలసకుఁ గళాపూర్ణుఁడు వేయఁగా నాయకరత్న మాపె హృదయంబు సోఁకునట్లు పడినది. సమయముఁ జూచి పడవలసినచోటఁ బడినది గదా! ఎంత తెలివిగలపతకము! అట్లు సర్వజ్ఞయైన యబ్బాలికామణి యనేకుల పూర్వవృత్తాంతముం జెప్పి సర్వదాత్మునిచరిత్రమునకు వచ్చునప్పటి కామె "యటు నటుఁ గదలఁగఁ దన్మణి హృదయస్థలముఁ బాసి కడ కేఁగుటఁ దెలివి యుడిగెను." ఇట్లు వ్రాయుట కామరూపధారణముకన్న నభావ్యము. ఏలన: సత్యముగా నుండునా యను శంకఁ గలుగఁజేసి కథయందు నమ్మికను భ్రమను బోఁగొట్టుఁ గావున ఇఁక ముందటి వృత్తాంతమింకను ప్రాయోభావమునకు దూరము.

వ. "నాఁ డట్లు బోధోదయం బగుటయు నుడుగుటయు నే తన్మూలంబు లని యెవ్వరు నెఱుంగకుండుటను నది సామాన్యహారంబ యను తలంపున మావారు దాఁచి మఱచుటం జేసి, నాఁటనుండి నేఁటిదాఁక నద్దివ్యహారం బెన్నఁడును ధరియించుటయు లేదు. నేఁ డాభరణాభరణసమయంబునఁ బ్రసంగవశంబునఁ దలంచికొని చెలులు తత్ప్రాప్తిప్రకారం బెఱింగింప నది సుముహూర్తలబ్ధం బైన ప్రథమభూషణం బనియు భవద్దత్తం బనియు నత్యాదరంబునఁ దెప్పించి హృదయభాగస్పర్శి నాయకరత్నంబుగా నిపుడు ధరించియున్నదాన."

(కళా. ఆ. ౮. ప. ౧౯౧.)

ఇంతలే యసంభావ్యములు రెండు. కన్యగానుండునపుడు ఆరాజు గాలిమైన సోఁకునా దేవుఁడా! యని వ్యథఁ గూరుచున్న విరహావేదనకాలమునకు పెండ్లినాఁడును ఎన్నఁడును

రాని ప్రసంగవశమున ఇప్పు డేల ప్రైఁబడవలయును? రెండవది. 'హృదయభాగస్పర్శి నాయకరత్నంబుగా' ధరింప బుద్ధి నిష్కారణముగా నేల పొడమవలయును ? లోకములో నదృష్టములు, నిర్హేతుకములు నైన యాకస్మికములు లేకపోలేదు గాని, పదేపదే వలసినచోట్ల నెల్లఁ గాకతాళీయన్యాయముల నాశ్రయించుట కల్పనకు మిక్కిలి కొఱంత. కామరూపములు, దివ్యదృష్టి ఇత్యాదులు అన్నికష్టములకు ననుకూలించు సాధనములు గానఁ బ్రశస్తములు గావు. సర్వసందర్భములలోఁ జేరఁ జాలినవి యీకథలోఁ దప్పక చేర్పఁదగిన యంశము లని చెప్పవీలులేదు గనుక, నిట్టి వేసందర్భములను జేర్పకుండుట మేలు. కథ కెల్ల సూత్రమువలె నుండు నీహార మిన్నివక్రముల కాస్పద మగుట చింతావహము.

నాటకరీతిని సంభాషణాదులచే వృత్తములం బ్రకటించుటయందు నీగ్రంథము అసదృశము.

కథాప్రారంభముననే యెంత నడిగా నెన్ని ప్రాంతములం బ్రవేశింపఁ జేసినాఁడో తలపోసి యానందాశ్చర్యముల భరింపుఁడు. ఉద్యానవనములోఁ గలభాషిణి చెలికత్తెలతోఁ గూడి డోలావిహారంబు సల్పుచుండఁగా, నారదునితో నాకాశమార్గంబునఁ బోవుచుండు మణికంధరుఁడు—

మ. "తమిఁ బూఁదీఁగలఁ దూఁగుటుయ్యెలలఁ బంతాలాడుచుం
దూఁగునా, కొమపుం బ్రాయపుగబ్బిగుబ్బెతలయంఘ్రుల్ చ
క్కఁగాఁ జాఁగిమింటిమొగంబై చనుచెందుఁదీవిఁ గనుగొంచే
దివ్యమౌనీంద్ర! నా,కమృగీనేత్రలమీఁదఁ గన్యమునకుం
గాల్చాఁచులా గొప్పెడిన్." (కళా. ఆ. ౧. ప. ౮౩.)

అని ప్రశంసించిన ప్రకారము సరిగా వని నారదుండు.—

మ. "బళిరా సత్కవి వౌదు-నిక్కమ తగం భాషింప నీ వన్నయ
ల్లిలప్రాయంపుమిటారికత్తెలబెడం గే నెందునుం గాన, వా
రలడోలాచలనోచ్ఛలచ్చరణముల్ త్రైవిష్టపస్త్రీలయా
దలఁవన్నం జనునట్లు మించెననిర్వాదప్పేమి యొప్పేయగున్."

(కళా. ఆ. ౧. ప. ౪౫.)

క. "అని పలుకునపుడు నికటం
బున నలకూబరుఁడు దాను మొగిలుమఱుఁగునన్
ఘన మగుదివ్యవిమానం
బునఁ జనుచున్ రంభ విశదముగ నది వినియెన్."

(ఆ. ౧. ప. ౪౬.)

ఆదినే యీరీతి నైదుగుర నెదుర నిల్పుటయ గాదు. మాటమాటకును గథ పెరుఁగునట్లు చేయుమాహాత్మ్యమున సూరన నిస్తులుఁడు. ప్రథమాశ్వాసము ముగియుసరికిఁ గథా మధ్యమున మునిఁగినవారమై యెట్లు వచ్చితిమో, యాది యెయ్యది, అంత్య మేదిక్కున నుండు నని విస్మయానందముల నోలలాడుచుందుము. మణికంధరుని స్తుతి వ్యర్థచేష్ట గాదు. ఆకాశమునఁ జేయఁబడి యుండినందునఁ గలభాషిణి విని యుండదు. అటు వినమి యావశ్యకము. లేమిచో నలకూబరుని పైని వలపుచే నైనదైన్యముతో నారదు నాశ్రయించియుండదు. మఱియు నాపొగడిక రంభకు నసూయాకారణము. ఆ యసూయచేఁ గదా యాపె నారదునితో మాటలాడుటకై వచ్చి నలకూబరుఁడు "నర, భామలపోఁడుముల కిరఁడు భ్రమయక యున్నె"యని పరిహాసము చేయుట నారదుండును బ్రతిహాసముఁ జేయఁబూని.—

క. "నిను బోలువనిత నీకును
వనజముఖీ ! యితనిఁ బోలువాఁ డితనికి నెం
దును గల్గి కలఁచునో యి
ట్టినిగాఢపుముదమునొంపురీవులు చనునే!"

(కళా. ఆ. ౧. ప. ౬౧.)

అని పల్కు తలకిఁ గథయొక్క యస్తిభారములో సగము సంపూర్ణమయ్యెను. పిమ్మట లెక్కకు వచ్చునో రాదో యనునట్టి చిల్లరవిషయముం బోని.

వ. "అంత నమ్మహాముసీంద్రుని యాజ్ఞానుసారంబునం దద్విమానంబు కలభాషిణి విహరించుచున్న యెలదోఁటలోనికిం దిగియె; నట్టియెడ రంభానలకూబరులునువినయపూర్వకంబుగా నతనిచేత ననిపించుకొని యప్పు డెదుటఁ గాన్పించు వాసుదేవుని ప్రాసాదరాజంబునకుం జేయెత్తి మ్రొక్కి, తమ విమానంబుతోడ నిజేచ్ఛం జనిరి.

(కళా. ఆ. ౧. క. ౬3.)

అను వాక్యముతోఁ గలభాషిణి నలకూబరుని వలచుటకును, కళాపూర్ణుని సుద్ది వినుటకును సహజమైన సమయముఁ గల్పించి తక్కిన సగము ననాయాసముగ ముగించిన యీకవియొక్క ప్రతిభ యవాచ్యము గదా! ప్రథమాశ్వాసము కథకు నాలవాలము. సమస్తము లైనకార్యములయుఁ గారణబీజంబులందుఁ జల్లఁబడియున్నవి.

ఐక్య మనులక్షణము

సామాన్యకవులతోఁ బోల్చి చూచిన సూరన్నకళాకౌశలమింకను వైశద్యముతో వెలుఁగును. మనప్రబంధములు తలుచు

కథానాయకుఁ డగు రాజు అను నొక్క పాత్రముతోఁ బ్రారబ్ధములు. ఆయనను గూర్చిన యప్రస్తుతవర్ణనము ముగియుటకుఁ బట్టునది యొక గంట. పిమ్మట నర్మసచివుఁడో యెవఁడో యొకఁడు వచ్చుట. అటుతర్వాత వేఁట వెడలుదురేమొ. అక్కడ నొక సఖీజనపరివేష్టితయగు కోమలాంగిని జూచి రాజును, విదూషకుఁడును (నర్మసచివులు విదూషకులుగ నుండుటయు, విదూషకులు నర్మసచివులుగ నుండుటయు హిందూరాజధర్మము కదా!) రెండుగంట లొకరితో నొకరు శ్లేషలు, అతిశయోక్తులు, ఉత్ప్రేక్షలుఁ జెప్పునప్పటికి నివి దయ్యాలతో నిండినకావ్యమని దూరముగఁ బాఱవైతుము. కళాపూర్ణోదయము నుపమింపఁ దగినది, మూలము స్కంధము సామాన్యములయియ్యు, వివిధగతులను దెసలను వ్యాపించుశాఖోపశాఖలు గలిగి కనుపండువుగ నుండుమహావృక్షము. సామాన్యప్రబంధములు కొలుకులు ఒకదానివెంట నింకొకటి యతికించుటచే నేర్పడిన గొలుసులవంటివి. ఐక్యము వీనిలో లేదు. ఎన్నికొలుకులైనఁ జేర్పవచ్చును. ఎన్నియైనఁ దీసివేయవచ్చును. వైపుల్యము దక్క నింకెద్దానికిని లాభనష్టము లుండవు. ఆకృతి మాఱదు. వృక్షములు మొదలగుసజీవములవలె నుండు కావ్యముల నేయంగమునైన ఛేదించుటకుఁ గాదు. నూతనాంగములఁ జేర్చుటకుం గాదు. ఎట్లు చేసినను పరిమాణభేదమే కాదు, ఆకారమును వికృత మగును. ఐక్య మను కథాలక్షణమును పరీక్షించుపద్ధతియే మనఁగా: ఉన్నభాగములఁ దీసివేయవచ్చునా? క్రొత్తవియేవైనఁ జేర్పవచ్చునా యని విమర్శించుట. ఈ కార్యములు

షాసఁగని వైన నైక్యము స్ఫుటము. సాధ్యము లైననైక్య భావ మశక్యము.

'మానవప్రకృతిని అద్దమువలెఁ జూపుశక్తి గలవాఁడు. సంభాషణలఁ దీర్చుటలోఁ దిక్కన్నకు సరివచ్చువాఁడును.' అని సూర్యనారాయణుని ప్రశంసింపఁగలందులకు దార్కాణమైన ముఖ్యభాగములలోఁ గొన్ని యేవనఁగా: నిరువురు రంభలును నలకూబరులును బ్రవేశించి చిత్రవిచిత్రగతులఁ బొరపాటుతో సంచరించియు నేయనుచితములకు ననీప్సితములకును బాల్పడక కృతార్థ లగుతృతీయచతుర్థాశ్వాసములలోని ఘట్టములు.

సూరన్నయు షేక్స్పియరును ఒకరిపే రొక రెఱుంగనైనఁ జాలనియంత దవ్వులనున్న సమకాలీనులు. జాతిమతవేష భాషాదుల వ్యత్యస్తులు. అట్లుండియు నీ వింత నేమి చెప్ప ? షేక్స్పియరు వ్రాసిన 'కామెడి ఆఫ్ ఎరర్స్' అనఁగా "తబ్బిబ్బుల ప్రహసనము" అను నాటకమునకును, రంభానలకూబరద్వయవిలాసమునకును పెక్కుపోలిక లున్నవి. రెంటియందును భేదము లేనిరూపము గలనాయకు లిరువురు, నాయిక లిరువురు. అన్యోన్యపాత్రముల నిరూపించుటకు నసాధ్య మైన భ్రమ తటస్థించి, నాయికానాయకులు తమ వలచినవా రని యొండొరులతోఁ జేరియుండువేళ. అయ్యో! పాపము, అన్యునిచే నీ తరుణి చెఱుపఁబడియెనా యను సంశయము మనకుఁ దోఁచి మనసును కలఁతపొందించును. కాని, కథ యామూలాగ్రముగ విశదీకరింపఁబడుసరికి తమ తమ యభిమతముల కనుకూలము లైన విధంబుల దాంపత్యము లేర్పడినవని చూపి, మనకు దిగ్భ్రమము వాయుటతోడన పట్టరాని నవ్వును సంతోషమును నవి గలిగిం

చును. ఇట్టి కథాసందర్భ మెంతో యపురూపము. అట్టిదానిని హిందూదేశములో సూరన్నయు, నాంగ్లద్వీపమ్మున షేక్స్పియరును నెట్టి సంబంధములును లేనివా రయ్యు నేకకాలమునఁ దలపోయుటఁ దలంచితిమేని, యిది కాలయోగప్రభావమా? ఆకస్మికవిచిత్రమా? యని విస్మయభరితాంతఃకరణుల మగుదుము.

కళాపూర్ణోదయమున నైదునకుఁ దక్కువకానివిధముల శృంగారము ప్రదర్శింపఁబడియున్నది. ఇందు జావళీలకుఁ జేరినది యొకటి మాత్రమ. అయ్యది యప్రశస్త మనఁదగిన భాగములో నుండుటచే దాని ప్రస్తావన నిప్పుడు చేయను. తక్కినవానిలో నొకదానివలె నొకటి యుండదు. అన్నియు రమణీయముల స్వశక్తియే గురువుగ నూతనమార్గములం ద్రొక్కి సూరనార్యుఁ డందుఁ బ్రకటించిన యాయసాధారణ శృంగారములకు ముఖ్యనిదర్శనములు:—శల్యాసురవిషయము, సుగాత్రీశాలీనులవృత్తాంతము, సరస్వతీచతుర్ముఖవిలాసము, కలభాషిణీచరిత్రమును.

## (౧) శల్యాసురచరిత్రము

మృగేంద్రవాహనాశక్తి తన బంధువగు మహిషాసురుని జంపినసూడు మనంబునఁ బాయమిచే శల్యాసురుఁడు పగ దీర్చునుపాయ మన్వేషించు చుండఁగా, నభినవకౌముది యను నప్సరస యెదురైనఁ జూచినమాత్రాన, హృదయమును ఆహ్లాదయముతోడ నిన్నాళ్లుగాఁ బట్టినపట్టును గోలుపోయినవాఁడై, నన్నేలుకొమ్మా యని కాంతను వేఁడుకొనఁగా, నామెయుఁ జలంబు దాల్చినదై,

క. ... ... ...
... ... నిన్ను మఱియుంచినవా
నిని దక్క నే వరింపను
విను మది నా ప్రతిన దీని విడ నిఁక ననియెన్.

చ. అనుడుఁ దదుక్తిక్రూరతకు నద్దనుజుండు కడుం ఘనంబుగాఁ
గినిసియుఁ బోవ నిచ్చె నొకకీడును జేయక యవ్విలాసినిన్.

(ఆ. ౬. ప. ౩౯, ౪౦.)

ఎంత బలవంతు లైన నేమి? కామినీకటాక్షపాశబద్ధు లేమి చేయఁగలరు? మరల మృగేంద్రవాహనాశక్తి యిచ్చిన యమోఘమైనకత్తిం దాల్చి మణికంధరుని నరయుటకై పోవు నభినవకౌముదిం గాంచి తన్నే చంపుటకు వచ్చుచున్నదో, యట్లైనఁ జంపువారు చత్తురను నమ్మహాశక్తివర మున్నదిగదా! యశ్లేఁగుట నాపె నాశమొందునో యని తనపాటు మఱచి ప్రియురాలి శుభాశుభములం దలపోయుచు నాసాధువు—

చ. "...మతి కలఁగంగ నిట్లనియె! నాపయి వచ్చిన నీకు నిష్టదై వతములయాన సుమ్ము! వరవర్ణిని! యెందుఁ దలంక నేను దుర్గతి వయి నీవు నాకుఁ దెగి మ్రగ్గెదవో యని తల్లడిల్లెదన్."

(ఆ. ౬. ప. ౬౨.)

అభినవకౌముది యతని మంచిమాటల మోసగించి వెంటఁ గొనుచుఁ జన్నది. నమ్మినవాఁడు! కపుడు లేనిమానిసి! వానిని మోసగించుట యేమి కష్టము? ఇట్లు తన్నలయించుచుం బోవు చుండఁ దన ప్రతాప మాపె కెఱుకపఱుచువాఁడై యాపెను

దాఁకకుండునట్లు శిలలప్రయోగమునఁ జేసి జంతుజాలంబుల సంహరించి యిట్లనియె. "నన్ను వరింపుము, లేనిచో నీవు చనెడు చోటు లెల్ల నాబలముచే నాశముచేయుదును. దాన నీకు నప కీర్తి. కాన నన్నుఁ గూర్చి కరుణ లేకున్నను భూతకోటుల రక్షింపవలయు నను దయచేనైన నాకు పత్నివగుము." అయ్యో! వానియార్తి యెట్టిది! కాఠిన్యము మార్దవము రెండును వాని యందున్నవిగదా! మోహమాహాత్మ్య మట్టిది! వెన్న ఱా యగును; ఱాయి వెన్న యగును. అతనిని మణికంధరునిచే నభినవకౌముది చంపించినది. వానిది వ్యసనకరమును వ్యర్థము నైన శుష్కజీవితము! నిష్కళంకప్రీతిచే విశోభితము!

## (౨) సుగాత్రీశాలీనులవిచిత్రకథ

సుగాత్రి శారద పూజారియైనయొకబ్రాహ్మణుని కూఁతురు. దానిపురుఁడు శాలీనుఁడు. ఇల్లటపు టల్లుఁడు. అలంకారములు, డంబములు, అట్టహాసములును వీనికి సరిపడవు. పట్టణవాసుల కుర్చీలు, మేజాలు, నిలువుటద్దములను జూచి పల్లెటూరివాఁడు వెఱఁగు వెఱపు నంది పోవుమాడ్కి నేయలంకారములు లేక యుండువారినే కాని, తళతళలు, పళపళలు, ఘులఘులలు, ఘుమ ఘుమలు మెఱయవచ్చుస్త్రీలఁ దిలకింపఁడు. సర్వశృంగారసన్నా హములతో భార్య పడుకటింటికి రాఁగా, ఇదేమి కొఱవి దయ్యమో, గజ్జల పిశాచమో యని కన్నెత్తియైనఁ జూడ కుండెను. ఆభార్య కా పురుషునితిక్క తెలియదు.

అత్తగారు ఇంకను శ్రద్ధతో సొగసులు దిద్దిదిద్ది కూఁతును రెండు మూఁడునాళ్లట్ల యనిపిరి. వృథాప్రయాస! "వట్టి రాక పోక లానర్చె వానిసతియు." పెండ్లికూఁతు రూరకుండినను

జెలికత్తె లూర కుందురా? జీతములకుఁ బ్రతిఫలముగా బోధనలు చేయనిచోఁ గృతఘ్నత యని యేమో! "ఆ లజ్జావతికి నేకాంతంబున ని ట్లనిరి."

ఆ. "పొలఁతి! యాలిమగనిపోఁడుము లేమియుఁ
గలిగినట్టిచొప్పు గానరాదు
మీ తెలుంగు చూడ మేల్మేలు దంపతు
లిరువురును వివేకు లేమి చెప్ప?"

(కళా. ఆ. ౪. ప. ౬౫.)

క. కాంతుఁ డుచితజ్ఞుఁ డైనను
గాంతకు సిగ్గువడఁ జెల్లుఁ గాక కటకటా!
కాంతుఁడు సిబ్బితికాఁడై
కాంతయు నట్లైన నెట్లు కాఁపుర మింకన్. ౬౬

క. గారామునఁ దోడ్తోఁడన
రా రమ్మనఁ డనుచు మగిడి రానేటికిఁ గ
ర్పూరంబుతోడి బాగా
లీరాదో యాకు మడిచి యీరావో! చెలీ! ౬౯

క. "అన విని యీ పెడమాటల
నను నేటికిఁ జంపెదరు వినన్ సైపవు నా
కని సిగ్గునఁ బలుకుచు నాఁ
డోనరిచి చూచెను దదీయయుక్తుల తెలుఁగున్. ౭౧

ఈ సంభాషణ యతిమధురము. అశ్లీలవాక్యములు లేవు. జాతీయములు, లోకోక్తులు వీనిచే సువాసితము. చెలికత్తె లిట్లు గరువముగాఁ బలుకుట కావ్యములలో నరిది, కడపటిపద్య

మత్స్యదృష్టితము. ముగుదకన్నెయొక్క బయటిసిగ్గును, లోని యాశను సొగసుగఁ జూపుచున్నయది!

ఈ నూతనచికిత్సలు ఫల మీయకపోయెను. హా! సుగాత్రి యేమిచేయును? రాజకుమారిగా నుండినచోఁ జంద నాకులఁ బట్టించుకొని చిగురుటాకుఁ బాన్పుపై హాయిగా మూర్ఛవోయి యుండును! పూజారిబిడ్డ శాస్త్రప్రకారము శృంగార మను పథ్యము దప్పక సేవించి ప్రకటింపవలయు నన్న నుద్యానవన ముండవలెను. శీతలోపచారములకు సేవకురాం డ్రుండవలయును. సరస్సు లుండవలయును. మఱియు పచ్చ కర్పూరము, పునుఁగు, జవాది, అరఁటిబొందెలు, చందనము మొదలగు సంబారములు లేనిది శాస్త్రోక్తముగాఁ గామము నావాహన చేయనగునా! అట్టి నీటులు ధనికులకే కాని సామాన్యులకుఁ జెల్లదు. ప్రబంధములోని మోహము మాత్రము నిక్కమైనయెడల, రాజులయిండ్లలోనే కాని యిం కెక్కడను రతిమన్మథులు వాసము చేయ రని చెప్పవచ్చును! సుగాత్రి కీడిగఁదీపు లెవ్వియుఁ బట్టలేదు. "నాకును మంగళ సూత్రం బీపాటిశుభస్థితి నుండుటయె పదివే లనుచు నెంచి కొనియు వేఱొకలాగున నుండక యతనికి నాయురభివృద్ధికరంబు లని వివిధాలంకారంబుల నెప్పుడు నేమరకయ తాల్చుచుఁ దన తల్లి యేమియు నతని నిట్టిట్టాడకుండం బ్రార్థించుచుండె."

(కళా. ఆ. ४. ప. ౭3.)

భర్తకు నొకపిచ్చి యైన భార్యకు నొకపిచ్చి! తన యలం కారము లాయనకు నాయురభివృద్ధికరము లను పిచ్చియైనను మేలుచేయు మంత్రములలో నొకటి గాన ననింద్యము. ఈ

యొప్పును, వినయమును, సుఖపరిత్యాగబుద్ధియు, సంతుష్టియు శృంగారభావములు గావా? పతిపైఁ గల ప్రీతి సూచింపవా? అత్తగారి కీమాత్రమున శాంతము గుదరదాయె! మనుమఁడు గలుగకున్నఁ దనకు మోక్షము గలుగ దని యేమో! ఈ దౌర్భాగ్యపుటల్లుఁడు తోఁటలో నైనఁ గృషి చేసి ప్రయోజకుఁడు గానీ యని, యాతనిని బూఁదోఁటలో మాలిపనికి నియోగించెను. శాలీనుఁడు సత్వగుణుఁడు చెప్పినసంతయుఁ జేసి రచ్చ లేక యుండ మనెడువాఁడు. మఱియు ఇల్లటపల్లుఁడు. అట్టి యల్లురకు మర్యాద లెక్కువ యుండునా; ఒక్క భేదముఁ జెందక నిత్యముఁ దోఁటపనులఁ జేయుచుండెను. అప్పుడు సుగాత్రి

తే. తల్లిమాటలచే నిట్లు తనవిభుండు
దనువు బడలంగఁ బూఁదోఁటపనులు సేయఁ
జూడ నోర్వక లానునచ్చోఁటి కరిగి
తోడుపడియెద నని సూచు వ్రీడ నుడుగు.

(ఆ. ४. ప. ౧౪.)

పిమ్మటఁ గొన్నాళ్లకు లజ్జఁ బాయఁ ద్రోచి పురుషునకు సహాయముగఁ దానును దోఁటపనులను జేయ

ఉ. " ... ... ... ...
... ... ఎప్పటియట్ల యలంకృతాంగి యై
యెంతయు నింపుతోడఁ జని
యేఁగ బ్రియుఁ డున్నవనంబులోనికిన్.

(ప. ౯౨.)

క. చని యాతఁడు దాఁ జలిపెడు
పనులకు|నీయకొన కున్న బలిమిఁ గడంగెన్
దన సొమ్ము లెల్ల నొక మఱుఁ
గున నిడి పిరిసుట్టుసుట్టికొనినవలువతోన్. (౯౬)
సీ. తోరంపుఁ జనుదోయి త్రుళ్లింతల నడంగఁ
దగుచోట్ల గుద్దంటఁ ద్రవ్వి త్రవ్వి
వ్రేఁ గైనపిఱుఁదు బల్విడిఁ జలింపంగను
వడి నిట్టునట్టును నడిచి నడిచి
యడుసుతుంపురు చెక్కుటద్దంబులను బర్వ
మళ్లకు మడవలు మార్చిమార్చి
నడుము లేఁదీవియ నకనక ల్గుడువ నిం
పునఁ దగుమోఁపులు మోసి మోసి
తే. చిఱుచెమటఁ బేర్చుసంతక్రొమ్మెఱుఁగుతోడఁ
గోమరు మేనొప్పసారెకుఁ గొప్పు వదల
నేమిటికి నైనఁ దా మున్న యేఁగి యేఁగి
యెల్లపనుల నొనర్చె నిం పెసక మెసఁగ." (౯౭)

ఇన్నాళ్లుఁ గరఁగని యాతని మనసు ఈనవ్యమోహన మూర్తిచే జయింపఁబడెను.

చ. " ... ... ...
... ... యంత నా
బడలిక చూడ లేకిడుము
పాట్లకుఁ జొచ్చి నలంగి తంచు నె
క్కుడుతమకంబుతోడఁ దలఁ
గ్రుచ్చి కవుంగిటఁ గూర్చె నత్తఱిన్." (౯౮)

పశుప్రాయ మగు శృంగారమున కన్న నిది యెంత మేలు! చూచి చూడకమునుపే కామినుఁ గవయ నుంకించుట లోలత్వము నీచము; ఇక్కడ, భార్యయెడఁ గూరిమి. ఆమె తన సహాయమునకై స్వయముగా వచ్చినందుకు మెప్పు; బడలినందుకు గనికరము; గొప్పబుద్ధిఁ జూపినందుల కుదారవర్తన యను గౌరవము. ఇట్లు స్నేహము, మర్యాద వీని కనుకూలము లైనభావములతోఁ గలసినశృంగారము చూపఁబడియున్నది. ఇది శ్రేష్ఠము. మానసికము. శాశ్వతము. పిఱయః యంగరాగములు. తుచ్ఛములు. చంచలములు. మనసుతోఁ గలసినట్టు కామేచ్ఛ వర్ణించుట మనలో నంతగా లేదు గాన నీచరిత్రము నవ్యలీలాలలితంబు.

## సరస్వతీచతుర్ముఖవిలాసఘట్టము

ఒక విషయముంబట్టి చూచిన సరస్వతీచతుర్ముఖవిలాస ఘట్టమువంటిది యాంధ్రంబున నెక్కడను లేదు. ఏవిషయ మనఃప్రకృతిని పాత్రముల జీవితముతోఁ గలిపినట్లు వర్ణించుట.

రంగము సరోవరము. శారదాదేవి ప్రణయకోపమున నవ్వలి మొగంబుగాఁ బొరలినందున, నామె ముఖచంద్రమండలము ఆకాసారములోని మణిస్తంభమునఁ బ్రతిబింబిత మగుచు, బ్రహ్మయు దానినిం జూచుచున్నైన నానందింత మని కొంతసే పట్లేయుండి, యెంతకును బ్రియురాలి కోపము దీఱనందున సమీపవృక్షశాఖాధిష్ఠిత మగు రాచిల్కతో "చెలువ! యుబుసు పోదు, కథ యొక్కటి చెప్పవుగా" యనుటయు "...నోదేవ! మీకు చెప్పెద రని వినియెద" నని యాశుకంబు విన్నవింప, విను మని యాహంసను అప్పుడు జరిగిన శృంగారలీలల నేదో కథఁ జెప్పినట్లుగా శ్లేషచేసి వివరింపఁ దొడంగెను. ఎట్లనః కాసా

పురములో నొక రాజు; అతని పేరు కళాపూర్ణుఁడు; (ముఖ చంద్రుఁడు) అతఁడు స్వభావునిచే (స్వభావముచే) నొక యెఱ్ఱని మణిశలాకము (మోవిని) విల్లును (కనుబొమలును) బాణములును (చూపులు) బడసి పరిరాజులనెల్ల జయించెను. ఈ రీతిగాఁ దాను మన్మథావేశముచే నామెం గదియుట మొదలైన రాగంపుఁజెయ్వు లెల్లఁ బ్రకటించుచు భాషాయోషయు కృత్రిమకోపంబును నిజమైన యుల్లాసంబునుగా, చిట్లింపఁబడిన కనుబొమలతోను వెల్లివిరిసి వచ్చు చిఱునవ్వులతోను, ఆచిలుకం జూచి "యాకళాపూర్ణుఁడు మఱియేమి యయ్యె, నతని తలిదండ్రు లెవ్వరు, అడుగుము" అనవుఁడు, చిలుకయు నట్లడుగ బ్రహ్మదేవుం డికను జమత్కారముగా నేమనుచున్నాఁడు! అతనికిఁ దండ్రి సుముఖాసత్తి. తల్లి మణిస్తంభుఁడు (స్తంభ శబ్దము పుంలింగముగనుక నందు ప్రతిబింబితంబనుట) అట్లనుసరికి.

సీ. ... ... ... ...

... ... వాణీహాసమ్ముతో

గ్రక్కునఁ గ్రమ్మఱి కౌఁగిలించి

... ... ... ...

యింతలోనన యూర యెన్ని తబ్బిబ్బులు

దద్దరిల్లకుఁ డంచు ధవుని వీఁపు

తే. చరిచి యెట్టిటు లారాజు జనని మగడి

యును జనకుఁ డాఁడువాఁడునా యనుచు మఱియు

మిగుల నవ్వుచుఁ జెప్పఁ డామీఁదు ప్రాణ

రమణ! మఱి యేమి యయ్యె నారా జనుటయు.

(కళా. ఆ. గీ. ప. ౨౮.)

పాలయలుక సగము విరిసినది. పిమ్మట మఱికొన్ని స్నేహ క్రీడలు నడువఁగా, నిదేమి యూరకుండ రని కోపించుకొన్న సరస్వతీదేవికి హృదయప్రమోదంబుగా నీ క్రొత్తసంగతులను జేర్చి శతానందుఁడు కథ పెంచి చెప్పిన, శారదాదేవియు కపట కోపంబుతో "చాలుఁ జాలు మీ కథ. ఇప్పటి మన వృత్త మంతయుఁ జెప్పు చున్నారు. ఇం కెంత దూరము చెప్పెదరో యని యూరకుంటిఁ గాన తొలినుండి నాకుఁ దెలియ దను కొన్నారా ?" యని యా కథయందలి ప్రస్తుతవర్తమానమును మృదుమధురవచనముల వ్యాఖ్యానముఁ జేసి చూపుచున్నది. వినవయాశ్వాసములో నలువదియవ వగునీవచన మెల్లరుఁజదువఁ దగినది. వచనరచనలకుఁ దండ్రి యట్టివాఁడు నన్నయభట్టు. అతని ప్రౌఢిమ యన్యులకును లేదు. ఒక్క చిన్నయసూరి మాత్రము ఇంకొకవిధమైన వచనశైలిని బక్వమునకుఁ దెచ్చి నన్నయతో సమానుఁడై యున్నవాఁడు. ఈ యిరువురి దానికన్నఁ దక్కువ యని చెప్పఁదగినదయ్యును, సూరన్న వచనము సామాన్యము గాదు. వాణీదేవి వ్యాఖ్యానము చక్కెర లొలుకునది.

సరస్వతీ చతుర్ముఖుల సంభాషణాలు చర్యలు పొగడ్తకు మీఱినవి. అతఁడు తన సతి నెన్నోవిధముల కేళీహేళనములఁ దేల్పఁగ, నీమెయు నవ్వు నడంపఁ జాలకున్నను కినుక నటిం చుచు వలదు వల దని ప్రార్థించు పద్యములు మనలం బరవశులఁ జేయునవి.

### కలభాషిణియొక్క మనోహరచరిత్రము

ఈ కథయందలి పాత్రములపైకి నాకుం బ్రియతమ కలభాషిణి. నిక్కవమైన శృంగార భావములకు బ్రకాశకురాలు.

శాస్త్రకారుల శృంగార మను దయ్య మంతగా సోఁకనిది. జన్మమున వారకాంత. గుణములఁ బ్రబంధనాయిక లగు కులస్త్రీల కన్న మే లైనది. ఏకకాలంబున నిరుపురియెడ మనసుదగిలిన దానిఁగా వర్ణించుట కాధారముగా, కవి యీపెను గణికం జేసినఁ దప్పు లే దని యిట్టి పుట్టుక నారోపించినాఁడో ? పరిశీలింపుఁడు. ఎట్లును ఈపె నీచపాత్రము గాదు. మఱి మహోదార చరిత్ర. సర్వజన స్తవనీయ. కృష్ణుని కొలువునకు నప్పుడప్పుడు నారదుఁడు వచ్చుచుండ నతనితోడనవచ్చు శిష్యుఁ డగు మణికంధరుని సాహిత్యాదికమునకు గుణసంపదలకును మెచ్చి వాని యెడ బద్ధానురాగయై యుండియు, జాతిదోషంబుచేఁ గాఁబోలు, నలకూబరుని రూపలావణ్యాదిసౌభాగ్యంబులకు మెచ్చి తదాలోకనంబునం దనియక వాని విమానంబుతోఁ గొంత దవ్వరిగి యంత మగిడి యాతని తెఱం గెఱుంగంగోరి నారదుం జేరి ప్రార్థింపుడు, నమ్మునియు రంభకు వైరిణి నొక్కర్తు నిల్ప నెంచిన వాఁడు గావున

క. "సవతి యన నింక నొకతె
భువిలోపల వేఱ వెదకి బోవలయునె ? యో
ధవళాక్షి ! నీవ కానే
రవె దైవనియుక్తిఁ గొంత ప్రాప్తిగలిగినన్." (అ.౧.ప.౭౪.)

అని పల్కుచున్నాఁడు. వినయము, అధైర్యము, దైన్యము మొదలగు భావములతో హృదయపూర్ణమైన వలపుఁ గలసియుండును. విఱ్ఱవీగదు. అభీష్టసిద్ధి నిశ్చయ మని యుదాసిన తయు గర్వముఁ గాంచదు. దీనికి దృష్టాంతముగఁ గలభాషిణి యిచ్చిన ప్రత్యుత్తరముఁ జూడుఁడు:

క. "   ...   అంతటి రూప
శ్రీవైభవవతికిఁగాక సిద్ధించునె యా
దైవనియుక్తియు మాబోం
ట్లేవిధమునఁ బొట్లు వడిన నిద్ధవివేకా!"

(ఆ. ౧. ప. ౭౫.)

నారదుఁడు సర్వజ్ఞుఁడు. మణికంధరునికి నాపైఁ గోరిక యుండుట నెఱింగినవాఁడు గావున, నీ నూతన రాగజ్వాలలో నా ప్రాఁతవల పెక్కడ భస్మమగునో యని దానికిం బ్రతిక్రియ చేయుటకో యన, 'నాశిష్యుఁడు చేసిన దండకము చదువుమమ్మా! వింటము' అని యాపెచేఁ జెప్పించుచున్నాఁడు. అది యట్లుండె. ఈ తరుణియు నారదునిమూలముగ వాంఛితంబు సఫలంబౌనను నుద్దేశముచే నాతనికి శిష్యురాలుగా నేర్పడి యతనితో గాన విద్య నభ్యసించెను. నారదుండును గానశిక్షానంతరమున నిజ కళాపాండిత్యముంజూచ్చి కృష్ణునికాంతలు మఱుఁగున నే మను కొనుచున్నారో విని రమ్మని యాజ్ఞాపించిన, నలకూబరునిఁ గైవ సము చేసికొను మంత్రమున కిదియు యవసరమని కలభాషిణియుఁ దన గుట్టునోఁ ఁసీక

తే.   ...   ...   ...   ...
...   ...   ...   ...
నేను మీఁదాన నగుట మీఁగానకథలు
వడిన నవ్వేళఁ గొదవలు దడవరేమొ!

(ఆ. ౨. ప. ౪౫.)

సీ. నాకపేక్షితమైననాతిరూపు ధరింప
సామర్థ్య మబ్బిన నామగువల .

సఖులరూపముఁ దాల్చి సముచితంబగు వేళఁ
జని వారిహృదయంబుఁ గనఁగవచ్చు.

(ఆ. ౨. ప. ౪౬.)

అనఁగా నారదుండును దాను రంభ కిచ్చిన శాపమునకు నిది యనుకూల మని యా వరము నిచ్చెను. నలకూబరవర్ణనము మొద లిదివఱకుఁ గడచినకాలము నాలు గేండ్లు.

పిమ్మట నలకూబరచింతతోఁ బరితపించుచు నొక్క నాఁడు కాలయాపనార్థము వీణెయఁ గొని యుద్యానవనములో వాయించుచుండఁగా, మణిస్తంభుండు గానాకర్ణనవ్యాజమున వచ్చుడు, నతని సహాయమునఁ గృతార్థత నొంద నెంచినదై, యతఁడు నేఁ బోయివచ్చెద నని పల్కినఁ దన దుఃఖము దైన్యము బయలుపడునట్లుగా విన్నవించినది.

తే. ... ... ... ...
మహాత్మ నిన్ను నాపాలిభాగ్య
దేవతగ నమ్మియుంటి నాజీవితంబు
నేమిగాఁ జేసి పోయెద వెఱుఁగఁ జెప్పుమ ?

(ఆ. ౩. ప. ౫౫.)

క. ఈవేళనయాతనికడ
కేవిధముననైనఁ జేర్చు పింతియ తక్కం
ద్రోవ మఱి లేదు నన్నుం
గావక క్షణభంగురము గాంతలతాల్గుల్.

(ఆ. ౩. ప. ౬౦.)

క్షణభంగురము లనుచున్నది యిన్నాళ్లు గాచియుం డియు! ఇదియు సహజము. గొప్పవారు తమ గొప్పతనమును

తా మంతగ నరయరు. అల్ప మని యుందురు. మఱి దైన్యము హెచ్చుచుఁ బోయిన పిఱికిపట్టువంటిసాహసము పొడమును. ప్రాణకంటక మగు సంకటము. ఇంకను సిగ్గు నభిమానమును మర్యాదను బాటింపనౌనా? కావున నన్యములం దనాదరయై యే మనుచున్నది?

సీ. ఓసిద్ధపురుష! మీరేసరణిని గొని
చన్న నే మగుఁ దక్కఁ శంకఁ గలదె
నీమహత్త్వముఁ గానని జడాత్ము లే మన్న
నేమి కన్నమహాత్ము లింపకయును
వేఱొక్కగతిగ భావింపర మముబోంట్ల
సంస్పర్శమాత్రంబు సమ్మతింప
నుచితంబు గాదంటి రుచితంబె మఱి నాదు
ప్రాణహానికి నోర్చు టరసిచూడఁ
తే. బలుపలుకు లేల యింక నాచెలులు గిలులు
నేఁగుదెంచి విఘ్న మొనర్తు రిత మెఱుఁగక
కావునం గొనిపొమ్ము శీఘ్రింబ నీదు
వెనుక నిడికొని నన్ను మద్విభానికడకు.

(ఆ. 3. ప. ౭౭.)

వీఁడు కపటసిద్ధుఁడు. ఈ చెలువంపురాశిని మృగేంద్ర వాహనాశక్తికి బలియియ్య నెంచినవాఁడు. 'శుద్ధముగాఁగ నీ మనసు శోకము సర్వముఁ బుచ్చివైచెద' నని మిథ్యా ప్రత్యయముఁ బలికి, యాపెం బిలిచికొనిపోయి, యమ్మవారి గుడియొద్ద నిలిపి పూజాద్రవ్యములు దేఁబోయెను. అప్పుడు సుముఖాసత్తి మిక్కిలియు ముసలిది వచ్చి, సిద్ధుని చరిత్రం

బెజేంగినదిగాన, ప్రియమును దయయును దోఁపఁ గలభాషిణిం జూచి యి ట్లనియె.

క. ... ... ... ...
లతాంగీ యెచటనుండి చేరితి వకటా!
కలుషపు బావురుఁబిల్లిని
జిలుకయుఁబలె నిద్ధురాత్ము సిద్ధం డనుచున్.

(ఆ. 3. ప. ౯౦.)

క. ఆ కలుషాత్ముఁడు కృష్ణకే
రాకమునుపె తొలఁగి పోవరాదా యెటకే
నోకూన! యీమనోజ్ఞత
రాకృతి యేఁ జూడఁ జాల ననిపా ల్గాఁగన్. (౯౨)

స్త్రీసహజమగు రహస్యజ్ఞానవాంఛయు నడఁచిపెట్టుట సుముఖాసత్తియొక్క వాత్సల్య ఘనతను సూచించెడిని. నల కూబరుని సంగమంబుఁ గాంక్షించి వచ్చిన యాబాలకు నీ వృత్తాంత మెంత చింతావహంబుగా నుండదు! తాను ద్వారకా పురిలో ననుభవించిన వైభవమును, దుదకుఁ దన కిట్టు ప్రాపించిన పశుమరణమును దలపోసి దుఃఖితమానస యై, తదనంతరంబు డెందంబు డిందుపఱిచికొని, యావృద్ధురాలితో గద్గద కంఠముగా.

శా. "అమ్మా! నీపలుకెల్ల నెంతయు నిజంబై యిప్డు గాన్పించె నే
నిమ్మాయావి ప్రకార మిట్లగుట నూహింపంగలే కొక్క య
ర్థమ్ముఁ బీనికృపం గడింతు నని యత్యంతాశ ప్రేరేపఁగా
నిమ్మాడ్కిం దెగి వచ్చితిం దెరువు లేనిపాటుఁ దప్పింపఁగన్."

(ఆ. 3. ప. ౧౦౨.)

అని యెట్టకేని నిరాశవలని ధైర్యముం దాల్చినదై,

సీ. ... ... ... ...

... ... ... ... ...

మీఁదట రాఁగల మేలు కీ శ్లేరికిఁ

దప్పింపరామి యెంతయు ధ్రువంబు

ఆ. ఇంక వాఁడు వచ్చి యేమేమి సేయునో

చచ్చు టెట్లో యను విచారమునను

బెగడుచుండ నేల జగదంబయాశక్తి

చేయవలసినట్లు సేయుఁగాక." (ప. ౧౧౧.)

అని పల్కుచుండ సిద్ధుఁడు క్రమ్మఱి యాపెం డాసి "యిఁక శక్తిం బూజించి పోవుదము రా" యని పిల్వఁగా, నయ్యో పాపము! మరణము అట్లు ప్రత్యక్షభీకరముగా నిలిచిన నెవరి గుండియలు నీఱుగావు? గడ్డిపరకనైన శరణ్యమని యూఁతగాఁ గొనఁజూడమా! అట్లగుట నీబాలభీరువు, దారుణమ్ముల నెన్నఁడుఁ జూచియైన నెఱుంగనిది; ధృతి నీఱయిపోఁగా నా వృద్ధాంగనం జూచి,

క. "ఏనొంటిఁ బోవ వెఱతుఁ

లోనికి నోయమ్మ! నీవునుఁ రాఁగదె నా

తో" నన "నెవ్వరు నేటికి

నే నుండఁగ" ననుచు సిద్ధుఁ డింతిం బలికెన్.

(ఆ. 3. ప. ౧౨౫.)

పలికి, దాని భయచేష్ట భావించి యింకఁ దడసిన విఘ్నంబగు నని లోనికి బల్మినీడ్చికొనిపోవుట కాక, కన్నెను గొప్పువట్టి యీడ్వఁగా, నప్పడఁతి

తే. " ... ... ... ...
ప్రాణభయమునఁ గలఁగి యో యవ్వ! నీకు
బిడ్డనే కావవే నాకు నడ్డపడవె!
యనుచు నావృద్ధనారి మాటునకు నొదిఁగె." (౧౨౬. ఎ. గీ.)

సుముఖాస్త్రియుఁ దన మెడఁ గత్తి కడ్డముచేసి యామెను గాపాడినది. మృగేంద్రవాహనయుఁ గలభాషిణి వెంట్రుకలు దృఢముష్టింబట్టి మఱియుఁ బైకెఁగత్తినెత్తిన యాసిద్ధు ననతి దూరంబునఁ బడవైచెను. వాఁడు కత్తినిగాని కలభాషిణినిగాని విడువక యట్లే చని, మాయానలకూబరుఁడు రంభయుఁ గ్రీడించుచుండిన భూసామీప్యమున "మెత్తని క్రొత్తలిరు పాన్పుమీఁదఁ బడెను."

తలిరులను దాఁకినఁ గాఁక రాక మానునా? సిద్ధత్వ మెటఁ బోయెనో! కామవికార మూదేశమయ్యెను. పాండవమహిమింం గూర్చి కీచకుఁడు కంపిత మానసుఁడైన ఘట్టంబునఁ దిక్కన పాంచాలియొక్క సౌందర్యము వర్ణించిన యవాచ్యమాధురీధురీణంబు లగు సీసపద్యములంబోనివి యొకటి రెండు ఈ సందర్భమునఁ గన్పట్టెడు. రసికులుపోల్చి పరికింతురుగాక!

"అమృతంబు దొలఁకున ట్లమరంగ వెల్వోలఁ
బాఱుముఖేందుబింబంబుతోడఁ
బాలకర్ణద్వయీకూలంకషంబు లై
తల్లడంబందు నేత్రములతోడఁ
గడుఁ జెమర్చినయట్టికలికి లేఁ జెక్కుల
నంటెడు. విగళత్కచాళితోడ

వలిగుబ్బపాలిండ్లు నిలువ క్రిట్టు సం
క్షోభించుపయ్యెదకొంగుతోడ

తే. వెఱపు నొకయొజ్జరైయె వింతపిలుపనములఁ
గలుపఁ జూపట్టుసౌందర్యగరిమతోడ
సరభసాకర్షణక్షోభచకిత రైన
మదనుజయలక్ష్మిరీతి నమ్మగువ దనర."

(అ. 3. ప. ౧౫౫.)

సిద్ధుఁడు చూచినాఁడు. చూచినదే రెండవమాటలేక పరిరంభణమునకు మొదలిడినాఁడు. ఋషుల రసికత యీమాత్రమే గదా! సౌమనస్యమున ఋషులకును బాళయగాండ్రకును మృగములకును భేదము శూన్యము. ఆబాలయు నది సైరింపక రక్షణార్థము పేరెలుంగున నాక్రోశించిన మాయానలకూబరుఁడగు మణికంధరుఁడు వచ్చి,తలసింహనాదము విని పాఱిపోయెడు సిద్ధుని వెంబడించి పట్టుకొని తిరిగి వచ్చు లోపల, కలభాషిణి మునుపు నారదుఁ డిచ్చిన వరప్రభావంబునం జేసి రంభారూపంబు దాల్చి యతని కెదురుగాఁ జనుదెంచెను. ఆశీవిఁ బరికింపుఁడు.

సీ. తిరముగా ముడువమి విరియఁబాఱెడుకొప్పు
దోడ్తోడ నొకకేలఁదుఱిమికొనుచు
వల్లెవాటుగఁ గొంత వలువ చన్గవ నిల్పి
పెఱచేత నీవి గల్పించుకొనుచు
నుదుటిపై క్రొక్కింత చెదరినముంగురుల్
పాపటకును బొందు పఱుచుకొనుచు
సారెకు జారెడు శ్రవణకహ్లారంబు
లందంద మూఁపున నానుకొనుచుఁ

తే. జెమటనంటిన పానుపుఁ జివురుఁ దునుక
లెడనెడ నఖక్షతాశంకఁ దడవికొనుచు
రంభ యేతెంచె మిగుల సంరంభ మమరఁ
నొలుతఁ బ్రియుఁ డేఁగుదెంచిన త్రోవఁబట్టి.

(ఆ. ౩. ప. ౧౬౫.)

ఏతెంచి, "కేలం గైదువుగీదువేమియును లేకేయిమ్మెయిఁ బత్తురే, చాలుం జాలుఁ గరంబు మెచ్చుఁ దగునీచందంబునం బ్రాణేశ్వరా!" యని ప్రేమయుఁ బక్షపాతంబును దోఁపఁ బల్కు భార్యచందంబునఁ బల్కి, "నీవు నిర్బంధించిన స్త్రీ యెక్కడ? చూపు" మని ధట్టించి యాసిద్ధు నడుగుచున్న నలకూబరాకారుని దియ్యని మాటలఁ దేర్చి, సిద్ధునిఁ బోవిడుచునట్లు చేసి, యిఁక నిజమైనరంభ వచ్చి యెక్కడ కార్యభంగ మొనర్చునో యని శంకించి, యతఁడు బయలు వెడలి వచ్చినచోటికి దూరముగాఁ దీసికొనిపో నుంకించినదై, యేశంకకు నవకాశమియ్యని యుక్తిగా "దానికి మన మిఁక వెరకుద మని తాను నతఁడు సిద్ధుఁడు" తో ల్తఁ బరుగెత్తిన తెరువునఁ గడు దవ్వుగాఁ జనియె. ఇట్లు కష్టములనెల్లఁ దరించి యభిమతకేళిం దేలి నాయకసంయోగ మహానందయై

"...లోలత్వంబున నుండ నచ్చటికి నాలోలత్వదశ్రేణిచాప్పాలోకించుచు రంభ వేటొకతె డాయఁగ వచ్చెఁజిత్రంబునన్."

ఈ పెయ యప్సరస యయిన రంభ. "నలకూబర విడువిడురా? యన్నమాటకు మనసు చివుక్కురు మని మణికంధరుఁడు తన్నుఁ బట్టిన శనివలె వెడలిపోఁగా, హృదయకాంతుఁడగు నలకూబరుం గదిసి యుండ మని పయనమాతటికి నామణి

కంధరుఁడు తనివిఁ దీఱనివాఁ డగుటంజేసి, తన తపశ్శక్తి విని యోగించి నలకూబరాకారుఁ డై తనుఁ గలసికొనఁగా, కుబేర నందనుఁడే యని భ్రమించి త్రికరణ సుఖముల ననుభవించుచు నీవఱకు నుండిన యది. అట్లు నలకూబరుఁ డార్తస్త్రీప్రలాపంబు విని తద్రక్షణార్థై వెళ్లి కొంచెమున రాక చాలకాలము మన లఁగా, తమిఁబట్ట లేక తామసము నోర్వక యతని రోయుచు వచ్చి యతనిఁ గన్నులారఁ జూచుటయే కాదు; అతనియొద్ద తన ప్రతిబింబ మనఁదగు నింకొక రంభను గన్ను లుబుకునట్లు పొడ గన్నది. నలకూబరుఁడును నీయిరువురఁగని విభ్రాంతుఁ డయ్యెను. అయ్యో! కలభాషిణికి వచ్చిన కష్టము! లేక లేక క్లేశపడి సంపా దించిన యర్థము క్షణభంగుర మయ్యెడు తెఱంగైన నాదైన్యము చెప్పఁదీఱునా! ఇఁకపై నీయిద్దఱు సవతులకొట్లాట వర్ణింప బడియుండు తెఱఁగు వర్ణింప నాతరము గాదు! ఇది యద్భుతా వహము! స్త్రీ ప్రకృతికి దర్పణము! ఎన్ని సామెతలు! తిట్లు! తల త్రిప్పులు! తుట్టతుదకుఁ గన్నీళ్లును! కడపట సత్యరంభ తమ "తథ్యమిథ్యాభావం బేర్పఱుప" "రా! దేవసభకుఁ బోవుదము" అని పిలిచినది. పాపము! కలభాషిణికి నారదువరమున కామ రూపము కలదే కాని కామగమనశక్తి లేదాయె. కావున రంభ చేతిలోఁ జక్కఁగఁ జిక్కినదై చిన్నతనము రాకుండు నట్లు బింకము లైనఁ బలికి త్రోవఁ జూచి కొంచ మను స్త్రీసహజ మైన గరువతనంబు మెఱయ నే మనుచున్నదో చూడుఁడు.

సీ. "అప్సరస్త్రీలలో నగ్రగణ్యత్వంబు
జగదుపశ్లోకితంబుగ వహించి

యూర్వశీమేనకాద్యుత్తమస్త్రీలు రా
వమ్మ పోవమ్మ నా నతిశయిల్ల
నెన్నండు నెచ్చోట నెవ్వారిచే వ్రేలఁ
జూపించుకొనక ప్రస్తుతికి నెక్కి
నలకూబరుండు ధన్యతముండు నాగరు
వతనంబుచే నీకు వన్నెఁ దెచ్చి

తే. యొప్పునే యింకఁ గడపట నిప్పు డొచ్చి
నాకు సరిచేసికొని దేవలోకసభకు
నీవు సూ నీవు సు మ్మని యేవిధమునఁ
గలహమాడెద విది నీవె తలఁచి చూడు!

క. ఈకలహ మపుడ వినఁబడు
నాకంబున సురలయాననము లేగతి నా
లోకింతుఁ దెగినఁ దెగనీ
నాకు మరుఁడు నిన్ను నిలు మనక రాకునికిన్.

ఇప్పుడే కాదు; ఇఁకముందును "నీయాన ధరణి విడిచి దివికి నడుగటు వెట్ట" ననుచున్నది! మనుష్యాంగన! పోఁజాలదు. ఈలోపముఁ గప్పిపుచ్చుటకై యేమి యుక్తి! సరి; నలకూబరుఁడు సంకేయాత్మునకై యామెను మెడవట్టి పాయం ద్రోసెను. నిర్నిద్ర మోహాఫలమా యిది? పత్యరంభయు నాయమను 'కత్తిచేతఁ గాయము వాయుము' అని శపించెను. ఉదారచిత్తులకుఁ గష్టములే కదా ప్రాప్తి!

మనోరథ మొకరీతి ఫలించెనే కాని పరిపక్వ మయ్యె ననుట నిర్వివాదము గాదు. అయిన నేమి? ఈమె ప్రబంధముల రాచకన్నె గాదు గావున, కొంచెముతోఁ దృప్తినొందఁగల

కోమలహృదయ! ఆ క్రౌంచెమునకు మాఱుబేరముగ మరణ శాపము వచ్చిపడినను, 'ఎట్లును గాంక్షితంబు సిద్ధించె; ఇఁకఁ జావు గలిగిన నేమి? శక్తిగుడియొద్ద దేహత్యాగం బొనర్చెద' నని యచటికివచ్చి, యా స్థానంబునఁ దనవలెనే శాపగ్రస్తుఁడైన మణికంధరుఁడును, దేవీకటాక్షమున ముదిమి పీడి కుమారీ రూపంబున విరాజిల్లు సుముఖాసత్తియు, మణిస్తంభుఁడును గుమిగూడ, వారు వారు చెప్పిన వృత్తాంతములంబట్టి తన్నుం గలసిన యతఁడు కుబేరనందనుండుగామి శోకభరాలసయగుడు, నాపెం జూచి మణికంధరుం డిట్లనియె.

క. " ... ... ... ...
... ... తరుణి! యట్లపురూపం
బున నున్నవాఁడ నేఁజుమ్ము
... ... ... ... ..."

(ఆ. ౪. ప. ౧౦.)

అని పలికి,

చ. "జలజదళాక్షి! యేను మునిశాపభయంబున నెందు నేరికిం
దెలివిపడంగనీక మది ధీరతఁ ద్రిప్పుదుఁ గాని నీపయిం
గలదుసుమీ తలంపు మనగానకళాభ్యసనంబు వేళలన్
ఫలమిటులొందెదానికిని భాగ్యవిశేషవశంబునన్ దుదన్."

చ. "అనుచుఁ గృతార్థనైతిఁ గుటిలాత్మకుఁ డెవ్వఁడు నన్ను నట్లు వంచనమునఁ గూడెనో యను విచారమువాసెను నీదు పొందు నాకు నభిమతంబె నీకుఁ దగనన్నతలంపున నీతలంపు

నేఁ గనమి నిద్రపుచుఁ హృదయకాంతుఁ నినుం గనుఁగొన్న
వేళలన్.
౧౮

అని చెప్పి, ఇక్కడను 'నీకుఁ దగనన్న తలంపు' నలకూబరుని యందుంబదెఁ గలదు; అని తన మాటల నమ్ముదురో! మొగమాటము లని వాపోవుదురో యను శంకంజేసి, గరువము నభిమానముఁగల కోమలమానస యగుటచే శపథంబులు ప్రమాణంబులు ననుచితంబు లని భావించి,

"యాసుద్దుల్ హృదయైకసాక్షికము లే మన్నన్ వృథా
యి త్తఱిన్"

అని వచించి, నలకూబరునిపై మనసుపోవుటకుఁ గారణ మొండు చూపునదియై,

ఉ. ... ... ... ... సముచితతావకరూపరేఖ దా
ప్పెనొక కొంత గల్గఁగని యిచ్చఁ గుబేరతనూజుఁ గోరితిన్.

క. శాప భయంబున నెఱయఁగ
నీపైఁ గోరిక మఱల్చి నిధిపతిసుతు నే
పాపపు వేళను జూచితి
నో పయిసాబ గేను మఱి గనుంగొన గుఱిగాన్. ౨౧

క. ఆయక్షతనయుఁ డని ని
న్నే యేఁ బొందితిఁ దురక్ష వనిత మనభాగ్య
శ్రీ యేమని చెప్పుదుఁ బదఁ
బోయినఁ బూఁబొన్నునఁబడుబోలికయయ్యెన్. ౨౨

ఉ. శ్రీయుత మైనదివ్యమణి చేతికి నబ్బఁగఁ బాఱవైచి త
చ్ఛాయ యొకింత యున్కిఁ గని చాలఁ గ్రహించితి గాజు

పూసకై, నాయవివేక మేమనుకొనం దుదఁ దన్మణి యబ్బె
నన్న న,త్యాయతతత్సమాగమసుఖాప్తికి నోఁచమి నెంచి
కుందెదన్. ౨౩

ఆ. ఇట్టి మాట లిప్పు డే నాడుకొనుటయు
నసుచితంబ వారవనితపలుకు
లిచ్చకంబు లనక యెవ్వారు నమ్మెద
రదియుఁగాక దృష్ట మన్యవాంఛ. ౨౪

అని లజ్జాశోకంబు లడర నవనతముఖియై యున్న కలభాషిణికి సమాధానముఁ జెప్పి నివర్మనముగా సుగాత్రీ శాలీనుల చరిత్రంబు వక్కాణించి, మణికంధరుం డావెకుందును బోఁగొట్టెను. ఈనిదర్శన మెద్దానికనఁగా, ఒకరిపైఁ బ్రేమయుండినను వారేదే నొక క్రొత్తరీతినుండినంగాని మతిసమ్మతింప దను శృంగారన్యాయమునకు! ఇది శృంగారవిశేషములకుం జేరిన భావప్రకృతి. భార్యయందైనఁగాని, సర్వకాలముల సర్వావస్థల నేకరీతి యగు మక్కువందాల్చిన వా రుండరు. ఏదే నొక విలాసము వహించి యొప్పారిరేని తమి తనంతట రేఁగును. మనుష్యులును బలుమూర్తులు గలవారు. అందు హృదయవికాసముం గలిగించునవి కొన్నిమాత్రమ. మఱి ఒకరి కొకమూర్తిపైఁ బ్రీతి. ఇంకొకరికింకొకమూర్తిపైఁ బ్రీతి. రేఖలు, లీలలు, విలాసములును తత్తద్హృదయసారములప్రకారము సుఖదుఃఖావహము లగుట వింత గాదు.

అయిన నొక్కటి. పైఁ జెప్పిన న్యాయము ఏకపురుషునంగను వివిధకాలముల స్త్రీలకు రాగము మాఱుచుండుటకు హేతుభూతము. ఒకనియందలి ప్రీతి వానిమూర్తి ననుసరించి

హెచ్చుతగ్గులు తెలిసెను; కాని కలభాషిణివృత్తము వేఱు. ఏక కాలమునందే యిరువురియెడఁ జిత్తము హత్తిన ట్లున్నది. ఇది భావ్యమా? మనసు ఒకేకాలమున నిద్దరపై సమముగఁ బాఱునా? అనేకులపై మోహముంచుట నిజమా? ఇది కష్టతరమైన ప్రశ్న. మణికంధరుని వలచినది. నలకూబరునిని వలచినది. ఈరీతి నిరువురి మీఁద దుర్భరమోహముం బూనియుండిన యొకస్త్రీని చరిత్రముం జదువుటచే నెఱుంగుదుము. ఆమె యెవ్వరన, సుమారు నూఱు సంవత్సరముల క్రిందట ఫ్రాన్స్ దేశములో గణ్యయు విద్యాగంభీరయుఁ గానుండి వెలసిన లెస్పినాస్ అను నామె. కాఁబట్టి యిట్టి వర్తనము అస్వాభావిక మనరాదు. అపురూప మనవచ్చును. అపురూపశృంగారముల సూచించిన సూరన్నయే 'కవి గాననిచోఁ గాంచె కవి!'

కలభాషిణియొక్క తదనంతరవృత్తాంత మింకను గౌరవార్హము. తనశాపంబు దలఁచికొని త్వరలో జీవంబు విడుచుటయ కర్తవ్యమని యెంచి సిద్ధునిఁజూచి, ఇంక జాగేల? నీఖడ్గము అకుంఠితోద్యోగము. రంభాశాపమును దానికి సహాయకారి. కానఁ ద్వరలోఁ గార్యంబు ముగించి తత్ఫలంబగు సామ్రాజ్య సుఖంబు ననుభవింపుమా! యని ధృతిమైఁ బలికిన, సిద్ధుఁడు ప్రత్యుత్తర మిచ్చుచున్నాఁడు. నాభార్య నిన్ను ప్రేయఁగూడదని కాళికాదేవిపై నానపెట్టియుండుటచే మునుపే నలుకఁ బోయి యన్ని పాట్లఁబడితిని. ఇంక నామాట వలదు. ఈకత్తిని మణికంధరున కిచ్చెదను. అతఁడు దానిని నీపైఁ బ్రయోగించి రాజ్యలక్ష్మీమహనీయుండగుఁగాక! అట్లని మణికంధరుని నతి ప్రయాసమైె యాక్రూరకర్మమునకు ననుమతుం జేసిన, కలభాషి

ణియు కోరికోరి కామించిననరుఁడు విధిప్రేరణంబునఁ దనకు యముఁడు కాఁగా కాలవైపరీత్యంబునకు చోద్యంబును అప్ర మేయశాంతియుం జెంది ధీరభావయై

వ. " ... ... ... మణిస్తంభునకుఁ దదంగ నకుం బ్రణామంబుసేసి కన్నీళ్లు గ్రుక్కికొనుచు "నీకలంక పాటు తక్కినభయమునకుఁ గాదు సుండు. మిమ్ము నెప్పుడు గురుభావంబున నారాధించుచుండలేమికిం గాని' యనుట యును సుముఖాస్త్రీయు 'నోయమ్మ మననెమ్మనంబుల కోరి యింతటన పోయెనే మీఁదటనైన నీపతియు నీవు గోరినట్లు మమ్ము గురుభావంబున నడుపుకొనియెద రనఁ గలభాషిణి పునఃపునః ప్రణామంబు లాచరించి ముకుళితకరకమల యగుచు ని ట్లనియె.

(ఆ. ४. ప. ౧౮౨.)

శా. పూతం బైన మదీయపుణ్యయుగమో పుణ్యంపు టిల్లాల! నీ
పాతివ్రత్యముచందముర్వి నెన మదిఁ భాషింపఁగా నెట్టి దు
ర్నీతిప్రక్రియ వారికైనఁ గృపతో నీ విచ్చినం గల్గు నా
పాతివ్రత్యము నాకు మీఁద నయినం బ్రాపింప దీపింపవే!

(ఆ. ४. ప. ౧౮౩.)

క. నావుఁడు బరమపతివ్రత
వై వెలయుము రాజ్యవైభవానుభవం బెం
తే వర్తిల్లఁగ నలరుచుఁ
బ్రోవుదు మముబోంట్ల నీవిభుండును నీవున్.

(ఆ. ४. ప. ౧౮४.)

ఉ. అట్టిటులఁ జంచలింపకు దృఢాత్మత నుండు మటంచు నిప్పుడే
మిట్టివి నీకుఁ దెల్పునవి యెయ్యవి? పెండ్లికిఁ బోవునట్లు గ
న్పట్టుచు నున్నదాన వతిభవ్యవికాసము నుబ్బఁ జూడ నీ
గట్టిగ నెన్న దేవతవుగాని నరాంగనవే మృగేక్షణా!

(ఆ. ౪. ప. ౧౯౫.)

చ. అని తనుఁ బల్కు నజ్జలరుహాక్షిని వీడ్కొని సిద్ధవక్త్రముల్
గనుఁగొని నన్ను నంపితిరె ఖడ్గము నిచ్చెదరే యటంచు నా
తనిబలుక త్తిఁ బుచ్చుకొని నామణికంధరుచేతి కిచ్చి యో
గ్యనియమగంధమాల్యవతి యై కలభాషిణి నిర్విశంకతోన్.

(ఆ. ౪. ప. ౧౯౬.)

శక్తికి నభిముఖియై కూర్చుండెను. స్వహస్తముతోఁ గత్తి నిచ్చుటేల? ప్రియమునకు మనస్సంకోచము వాయుట కొఱకు. సత్యమైనవలపునకు లక్షణ మిదియ. తమ కెన్నివచ్చిన నేమి? ప్రియులు సుఖం బున్నఁజాలు. ఖడ్గప్రదానాంతరము అతని మనసు గట్టిపడునట్లుగా

క. "సమరంబున నెదిరించిన
సమదాహితవీరవరులఁ జక్కడఁచుట నై
జము మీకు నిట్టియెడలఁ
భ్రమయక చేమఱవకునికి పటుశౌర్యమునన్."

అని తెలిపి కలభాషిణీదేవి యతనిచేత నిరస్తజీవయాయెను!!

ఈపాత్రముంగూర్చి యింత విపులముగ వ్రాసినందుకు క్షమాపణార్థమై కారణములఁ జూపవలయు. సూరనార్యుని వాఙ్మయసృష్టినెల్ల నియ్యది నిస్సంశయముగ నగ్రగణ్యము.

దీనికిం దీటగు చరిత్రమింకెయ్యదియు లేదు. శృంగారవర్ణనముం జేయుటలోను ప్రబంధముల వెఱ్ఱు లేవియు వేయలేదు. నల కూబరునికై నాలుగేండ్లకన్న నెక్కువగఁ గాచియుండెఁగదా! ఇష్టముండినఁ జెలికత్తెలతో మొఱలిడుట, ఉద్యానవనములోఁ బడి పొరలుట, చంద్రాదిదూషణము, ఇట్టి వికారచేష్టలన్నియుఁ జేసినట్లు చెప్పియుండవచ్చును. కాని, కవి యీవిషయములఁ దలంపనైన లేదని తోఁచుచున్నది. భావనాశక్తిమై వ్రాయు వారలకు మనసు పాత్రములయంద లీనముగ నుండుఁగావున సహజరాగములుదప్ప నితరములు దట్టవు. మఱియు, నీ శాస్త్రీయఘోషలకు మధురలాలసాచరిత్రములోఁ బ్రవేశ మున్నది గాన నిట ననవసరములని కవి వానిని విడిచిపెట్టెనేమో! కారణము లేయేటనైనఁ బోనిండు; మనకు లభించినదన్నో మనసు వశముగాకపోవునంత రమణీయమైనకథ. కవికిఁ గృతజ్ఞ తమై నమస్కారము; రసికులకు స్వాగతమును!

ఇంత మంచి సుందరమగు పాత్రము వర్ణనము శోకాంత ముగాఁ జెప్పుట కిష్టములేమిచేతనో! మఱి, మనకవులకుం బట్టిన దౌర్భాగ్యమతంబు కతంబుననో మణికంధరఖండితమస్తకయగు నాలలనాశిరోమణి కాళీదేవి కరుణాప్రసాదంబున "పునస్సహిత మస్తకము, నిజపురీవర్తినియునై తనబంధుమిత్రాదుల నల రించుచు" సుమారు రెండుసంవత్సరమునుండి పిమ్మటఁ గాల ప్రాప్తమరణ యాయె నన కరుణరసప్రధానమగు నీభాగము యొక్క సొంపును గవి వికలం బొనర్చి యుండుట భాషాదుర్దశ గదా? రసములలో శోకమునొక్కటి. ఇదిమాత్రము నిషేధ్య మననేల? శోకప్రధానముగా వ్రాసినఁ గవిత్వము యొక్క

పోవునా ? మొత్తముమీఁద భారతమే శోకాంతమఁట! దానికి రాని తక్కువ పెఱవానికి వచ్చునా ?

ఇట్టి యుద్గ్రంథమునఁ గల్పనాభంగము లుండుట చింతనీయము! కృష్ణునిభార్యలయొద్ద కలభాషిణి నారదులు గానవిద్య నేర్చికొనుటకై కడపినకాలము నాలుగేండ్లు. మణికంధరుఁ డంతఃపురములోనికిఁ బోఁగూడ దని యేమో, వాని కీప్రయాస మావంతయు లేకయ "పుండరీకాక్షుని యనుగ్రహావిశేషంబున సకల రహస్యసంగతవిద్యాసంపన్నతచేత నారదకలభాషిణుల యట్ల యత్యధికుండవు" భాగ్యము లభించినది! ఈయనుగ్రహావిశేషముం బ్రయోగించి వారికిని సద్యఃకాలవిద్యావహనీయత ఘటించి కలభాషిణివిరహకాలమును మట్టుచేసి యుండరాదా? కృష్ణకాంతలశిక్షయు ననావశ్యకమాయె, దానితోఁ గల్పనయు న్యూనమాయె.

ఇట్లే మధురలాలసాచరిత్రము మొదలు తక్కిన భాగములలోఁ గల్పనాలోపములు పెక్కులు గలవు. ఇందు కవి శృంగారమునకు దిగి పాడు ప్రబంధధోరణికిం జేరిన ముఱికి నంతయు సుగంధ మని దట్టముగఁ బట్టించుచున్నాఁడు. గతానుగతికముగా వ్రాయుచున్నాఁడే గాని, స్వబుద్ధిపొంతఁబోవునట్లు గానము. భావములు నవ్యములు గావు; రుచిరములు గావు; పాట ప్రాఁత, మాట రోఁత. మధురలాలస చిన్ననాఁటినుండి కళాపూర్ణుపై మోహోద్రేకముఁ గొనియుండుట, ఆకస్మికముగా నిదురకుఁ బరస్పరదర్శనము లభించుట, ఉద్యానవనగమనము, జలక్రీడాదులు, శైత్యోపచారములు, చంద్రాదిదూషణము, వివాహము, సాంగోపాంగరతివర్ణనము మొదలగునవన్నియు

లక్షణానుసారముగాఁ బొందింపఁబడినవి. నిష్కారణముగా సూర్యచంద్రోదయవర్ణనములు, కళాపూర్ణుని దిగ్విజయము, యుద్ధము, దౌత్యము మొదలగువానిని గూడ వర్ణించి కవి సకల లక్షణసంపన్నతా ప్రతిజ్ఞను జెల్లించుకొనుచున్నాఁడు. ఆ ప్రతిజ్ఞ దుష్ప్రకృతి యిట తేటతెల్లము. సంభాషణమూలమున కథకు నభ్యుదయము గల్పించుట మొదలగు కవితాశక్తులన్నియు నీ ఘట్టములకు వచ్చుసరికి సూరన్నలో నుండక లేచిపోయినట్లున్నది. ప్రతిభలేని పాడుకొంపలీభాగములు నిరర్థకపద్యపూరితములు! అలంకారాదిశాస్త్రములయందలి మూఢభక్తి పటుతమము!!

భావనాశక్తిచే ననర్గళముగ ప్రభవిల్లుభాగములయొక్క చక్కఁదనము పాండిత్యబలంబుమై నేర్పడినవానికి రా వనుట యీభాగవిమర్శనముచే విదితంబు. సూరనార్యుఁడు రెంటి యందును ప్రగల్భుఁడు. రెంటినిం జూపింప నిశ్చయించిన వాఁ డగుట నాంధ్రంబున నసదృశంబగు కావ్యంబు కళాపూర్ణోదయంబు సృజింపఁబడియె. ఇది నిర్దోషంబు గాకపోయినను అనన్యసాధారణగుణగణవిభాసితం బగుటఁ గావ్యోత్తమం బనఁ జెల్లునది. ఇందు నవరసము లున్నవి. అష్టాదశవర్ణనము లున్నవి. ఏకరసంబుగా కునికి మేల. అయినను సర్వరసములవర్ణనలఁ జేర్చి యొక కథ వ్రాయఁజూచుట యసాధ్యము గాకపోయినను, సామాన్యసాధ్యంబు గాదు. భారత రామాయణము లట్టి విస్తారేతిహాసములం దప్ప నన్యంబుల సర్వసౌభాగ్యములకు నాస్పదం బుండదు. అపారపారావారంబుం బోనిమహాచరిత్రముం గల్పించినఁగాని, రససంచయంబు లెల్ల నందు యుక్తగతిని

నిలువఁజాలవు. అట్లగుట నీగ్రంథమున నసంగతప్రశంసల వేయవలసెను. అపరభాగము ప్రబంధములకుఁ జేరినది. పరిమితప్రాశస్త్యము. పూర్వభాగము (అనఁగా నాలవయాశ్వాసము నందుఁ గొంతవఱకు) అమేయప్రభావము. దానింగూర్చి యెంత నుతించినను అత్యుక్తి గలుగదు. అంపలికల్పనలు, సందర్భములు మహేంద్రజాలములట్లు ఆశ్చర్యకరములు. శైలిప్రావీణ్య మన్ననో వాచాతీతము! మౌనముగఁ గ్రోలి హృదయము పరవశముగా నానందింపవలయునే కాని, మాటలఁ దమి. యాఱదు. పాత్రముల వచనములు మధురసుధాధారలు!

అట్లగుట శ్రీ పింగళి సూరనార్యుని యెడఁ గృతజ్ఞతయు భక్తియుఁ జూపనెంచినవారును, సహజముగఁ దమకుం గల రసతృష్ణను దృప్తిఁబొందింపఁ దలంచువారును నైన రసికు లెల్లరు నీ కవికులోత్తంసునికృతులఁ బలుమాఱు పఠించి కృతార్థు లగుదురు గాక!

మైసూరు
16-6-1917 } కట్టమంచి రామలింగారెడ్డి.

☞ నాల్గవకూర్పు అచ్చుగుటకు ముందే నామిత్రులు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు అస్తమించిరి.—వా వి శ్లో.

# ఏతద్గ్రంథస్థనామావళి



## పూర్వకథ *

1. కలభాషిణి (కథానాయిక.)
2. నారదుఁడు
3. మణికంధరుఁడు (నారద శిష్యుఁడు.)
4. రంభానలకూబరులు
5. కృష్ణుఁడు - మొ.
6. మణిస్తంభుఁడు
7. దేవలోకపుచిలుక
8. ఇంద్రుఁడు
9. మృగేంద్రవాహన
10. మాయారంభ
11. మాయానలకూబరుఁడు
12. సుగాత్రి (సుముఖాసత్తి)
13. శాలీనుఁడు (మణిస్తంభుఁడు)
14. అలఘువ్రతుఁడు (మళయాళపు బ్రాహ్మణుఁడు)
15. మణికంధరహారము

## ఉత్తరకథ *

1. కళాపూర్ణుఁడు (కథానాయకుఁడు)
2. మధురలాలస (నాయిక)
3. బ్రహ్మ
4. సరస్వతి
5. మదాశయుఁడు (నాయిక తండ్రి)
6. రూపానుభూతి (నాయికతల్లి)
7. అభినవకౌముది (గంధర్వస్త్రీ)
8. ప్రథమాగమాదులు నలుగురు (మంత్రులు)
9. స్వభావుఁడు (సిద్ధుఁడు)
10. సత్త్వదాత్ముఁడు
11. దత్తాత్రేయుఁడు
12. యజ్ఞశర్మ
13. దేవవిమానము

* ఈగ్రంథమందలి మొదటి నాలు గాశ్వాసములు పూర్వకథగ వక్కినవి యుత్తరకథగ నూహించునది.

61

# పింగళి సూరన

పింగళి సూరన కవి యిప్పటికి మూఁడువందల యేఁబదియేండ్లను. పూర్వపువాఁడైనను కావ్యనిర్మాణవిషయమున నొక క్రొత్తపుంత ద్రొక్కిన వాఁడు. ఇతని రచనలు గరుడపురాణము, రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్నము అనుక్రమమున వెలసినవి. వీనిలో గరుడపురాణము ప్రస్తుతము లభింపదు. అది కవి ప్రథమరచనయు బాల్యరచనయు నని చెప్పెదరు. రాఘవపాండవీయము మధ్య కాలరచన. కళాపూర్ణోదయమునాటి కతని కపరవయస్సు. ప్రభావతీప్రద్యుమ్న రచన జీవిత సంధ్యాసమయమున.

పింగళి సూరన క్రీ. శ. 1520 ప్రాంతమున జన్మించి సంపూర్ణశతమానకాలము జీవించి యుండవచ్చు నని చరిత్రకారులయూహ. బహుకాలమితఁడు కృష్ణరాయల యాస్థానములోని యష్టదిగ్గజ కవులలో నొకఁ డను భావము విస్తరిల్లియుండినది *గాని దాని నాక్షేపించినవారు శ్రీకందుకూరి వీరేశలింగం పంతులుగారు. దానిని బలపఱుచుచు డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు అష్టదిగ్గజవర్ణంత్యుపన్యాసములలో పాల్గొనుచు కృష్ణరాయల యస్తమయసమయమున నీతఁడు విద్యాభ్యాసమునకుఁ గడఁగి యుండు నని నిర్ధారించుచు 'అష్టదిగ్గజకవులలో నొకఁడు కాఁజాలఁ' డని రూఢిపఱచి యున్నారు.

---

* 'Dekkan Poets' అను గ్రంథకర్త ఆంగ్లములో నిట్లు వ్రాసియున్నాఁడు:

Surana was a Niyogi Brahmin of the Pingala family. He flourished during the reign of Krishna Rayaloo,

సూరనను గూర్చి శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు "తిక్కనను యుగకర్తృభావమున శ్రీనాథుఁడు రెండవవాఁడు; ధర్మోపదేష్టృభావమున పోతన రెండవవాఁడు. శిల్పాచార్యభావమున సూరన రెండవవాఁడు. కొన్నిచోట్ల ప్రగమ్ముఁడుగాఁ గూడ తిక్కనతో పోటీ చేయఁగలఁడు. సూరనను కాదని తిక్కనప్రక్క నిల్వఁగల కవి శిల్పులుమాత్రము లేరు." అని అభిప్రాయము వెలిపుచ్చియున్నారు.

ఇతని రాఘవపాండవీయ రచన 16-వ శతాబ్దమధ్యకాలము. ఈ కృతిభర్త ఆకువీటి పెదవేంకటాద్రి. ఆ పెదవేంకటాద్రి ప్రభువు కవి నిట్లు ప్రశంసించియున్నాఁడు.

"దక్షతయింతగల్గి విశదంబుగఁ గాంచియు నీమదిన్ ఫలా
పేక్ష ఘనంబుకామి నిది యిట్టనఁ గొంకెద నీకు నోలలా
టేక్షణ భక్తశీల; రచియించుట యిష్టముకాదె శ్రీ విరూ
పాక్షున కంకితంబుగ శుభార్థము రాఘవపాండవీయమున్."
"రెండర్థంబుల పద్యమొక్కటియు నిర్మింపంగ శక్యంబుగా
కుండుం దద్గతిఁ గావ్యమెల్ల నగునే నోహో యనం జేయదే

---

sovereign of Vijayanagar. He was well versed in Telugu Grammar and a perfect master of that language. In the Course of time he proceeded to the Court of Krishna Deva, who retained him in his service. Surana composed a work which he entitled "Raghava Pandaviyam" which is an abridgment of the Ramayana and the Mahabharat, the whole being comprised in six books. He ended his days at his usual residence."

దీనింబట్టి విచారించిన నీగ్రంథకర్తను సూరన రచనలో రాఘవపాండవీయము దక్క తక్కినవి తెలియరావని విశదము గదా!

పాండిత్యంబున నందునుఱ్ దెనుఁగు కబ్బం బద్భుతంబం డ్రు ద
త్కుండెవ్వాఁ డిల రామభారతకథల్ జోడింప భాషాకృతిన్."

సంస్కృతభాషయం దొక రాఘవపాండవీయ మున్నను దానికి దీనికి నే మాత్రమును సామ్యములేదు. ద్వ్యర్థి కావ్యనిర్మాణమునకు అలంకారికలక్షణములకు మఱి కొన్నిటినిగూడ సూచించినాఁడు: అతని నియమములు చూడుఁడు:

సీ. ఆంధ్రభాషాసంస్కృతాభిభాషాశ్లేష యొక్కొకచోట నొక్కొక్కచోట
నుచితశబ్దశ్లేషయొక్కొక్కచోట నర్థశ్లేష యొక్కొకతఱిని ముఖ్య
గౌణవృత్తిశ్లేషఘటన యొక్కొకతఱి నర్థాన్వయము వేఱెయగుచు నునికి
శబ్దాన్వయవిభేదసంగతి యొక్కొక్కతఱి నివి యొక్కొక్కతఱిని రెండు
మూఁడుగూడుటయు ననసముజ్జ్వలముగ
నాకుఁ దోఁచినగతిఁ బెక్కుపోక లమర
రామభారతకథలు పర్యాయదృష్టిఁ
జూచు సుమతుల కేర్పడ నాచరింతు."

క. "ఒకకథ వినియెడు తఱి వే,ఱొక కథపై దృష్టియిడిన నొకయర్థముఁ దోఁ
పకపోవుఁగాన నే కా,ర్థకావ్యమెట్లట్లు వినఁగఁ దగు నొకటొకటిన్."

ఈ నియమములు కల్పించుకొనియు సూరన అర్థసౌలభ్యమును విపులముగా సాధించినాఁడు.

ఇఁక నితని రెండవ కృతి కళాపూర్ణోదయము: దీనింగూర్చి బ్రౌను దొర యిట్లు ప్రశంసించినాఁడు:

"Kala Purnodayam or The Metamarphoses, being the adventures of Kala Purna. This is a poem in eight

books by Pingali Suranna. A Telugu Commentary was written, at my desire, explaining it. The work is well worthy of publication."

కళాపూర్ణోదయ రచన కాలమునకు ప్రాచీనములు కాని మనుచరిత్రాదులకు వ్యాఖ్యానములు వ్రాను దొరనాటికి వెలసియుండఁగా నీ సూరన కావ్యము పేరే తెలియరానిస్థితిలో నుండుట శోచనీయము గదా! బ్రౌను దొర కుపలబ్ధములైన వ్రాతప్రతులు ఏరెండు మూఁడో మాత్రమే అయి యుండవలెను. వానినుండి యతఁడొక ప్రతి వ్రాయింపఁగా నిది వెనుకటి వారికి ఆధారమైనది. ప్రాచ్యలిఖితభాండాగారములోని ప్రతులు దీనికి తర్వాత పుట్టిన వని యెన్నఁదగియున్నవి.

కళాపూర్ణోదయ రచనాకాలమును గూర్చి భిన్నాభిప్రాయములు ప్రబలియున్నవి. ఆంధ్రకవుల చరిత్రకారుఁడు క్రీ. శ. 1560 ప్రాంతమున నని యు, సరస్వతీ ముద్రణాలయమున (1909 లో) ప్రచురించిన ప్రతి పీఠికలో 1614 ప్రాంతమున నని యు, 1938-లో మల్లాదివారు ప్రకటించిన ప్రతిలో క్రీ. శ. 1620 ప్రాంత మని నిరాక్షేపముగా విశ్వసింపనగు నని యు నభిప్రాయములు వెల్లడించియున్నారు. అష్టదిగ్గజవర్ధంత్యుపన్యాసములలో పింగళి సూరనను గూర్చిన యుపన్యాసములో ఆచార్యఖండవల్లి లక్ష్మీరంజనంగారు 1560 యే నని యభిప్రాయపడియున్నారు. కనుక వాని సత్యాసత్యములు వారువారు చూపిన ప్రమాణముల బలాబలముల ననుసరించి పాఠకలోకమే నిర్ధారించుకొనవలసియున్నది.

కళాపూర్ణోదయ ప్రథమ ముద్రణము 1888-లో శ్రీ బరూరు త్యాగరాయశాస్త్రులవారిది. రెండవది సరస్వతీ ముద్రణాలయమువారిది. మూఁడవది 1910-లో వావిళ్ల వారిది. వారప్పు డాధారపడినది 1888-వ

సం॥ మందలి బరూరివారి ప్రతి. అదియు పీఠికాపురసంస్థాన ప్రభువుల ధనౌదార్యముచే నెరవేఱినట్లు తెల్పియున్నారు. దీని కిటీవలిది మల్లాదివారి ముద్రణము లఘువ్యాఖ్యతోఁగూడినది. శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారి 'కవిత్వతత్త్వవిచార' ప్రకటనానంతరమే కళాపూర్ణోదయ ముద్రణమునం దుత్కంఠత మెండయ్యెననుటలో నతిశయోక్తి లేదు.

ఇప్పటి ముద్రణమునకు పూర్వముద్రణమున వావిళ్లవారు లఘుటీకయు కథాసంగ్రహమును చేర్చియున్నారు. ఇన్ని వెలసినను తక్కిన మహాకావ్యములకు సంపూర్ణవ్యాఖ్యావిషయకమైన యదృష్టము దీనికి పట్టలేదు.

కళాపూర్ణోదయము సర్వతోముఖ చాతుర్యమును చాటుచు వాఙ్మయ ప్రపంచమున సంక్షోభము కావించినది. కథ పూర్తిగా కల్పితము. పూర్వకవులవలె నుత్తమకులజను స్వీయనాయికగా గ్రహింపక శాస్త్రవిరుద్ధముగా హీనకులజాతను కలభాషిణిని సామాన్యను నాయికగా శృంగారరచన చేయుట వలన నాటి కవులలో నేవగింపు ప్రబలినది. కవియా తన భావముల కనుగుణముగ పుట్టవలసిన కాలమునకు మూఁడు నాల్గు శతాబ్దములు ముందే పుట్టినాఁడు. "రసభావమయమైన జీవితమున కెక్కువవారికంటె తక్కువవారే ఆధారభూతులు కాఁగల రను రహస్యమును తెలుఁగుజాతిలో మొదట గ్రహించినవాఁడు సూరన."* స్వతంత్రరచనలు విదేశములలో వెలయుటకు మూఁడువందలయేండ్లకు పూర్వమే సూరన పాడసూపి ఆంధ్రదేశమునకు ఆంధ్రభాషకేకాక ప్రపంచమునకే యుత్తమ నవలను సారస్వతమున కేన్యూనతయు రాసేయక సృష్టించినవాఁడు. ఈ కవికి సమకాలికుఁడు షేక్స్పియరు. అతఁడు నాటకరచనలో పేరెన్నికగాంచెను. నవలాసృష్టిలో ఖ్యాతిగాంచిన

---

*పింగళివారు.

ఫ్రెంచికవులు విక్టర్ హ్యూగో, అలెగ్జాండర్ డ్యూమాస్ అను వారలు స్వతంత్ర రచయితలై పాశ్చాత్యప్రపంచమున మహాసంచలనమునకు కారకులైనను సూరనకు సాటి కాఁజాలరు. సూరన తన కావ్యమున ఆదిసృష్టికి మూలకారణమైన ప్రణయము అధికారతారతమ్యమునుబట్టి యెన్నిరకముల మాఱునో యెన్ని రూపసాదృశ్యము లందునో చక్కఁగా వివరించినాఁడు. ఈయొక్క యర్థము ననుసరించియే యిది ప్రపంచసాహిత్యములలో నొకటి యగుటకు ఒప్పియున్నది. సాధారణముగా కారణరూపమై భూతార్థమును ముందు నిర్దేశించి కార్యరూపమైన వర్తమానార్థమును తర్వాత వివరించుట లోక సహజము. కాని యీ కావ్యమున సూరన ముందు వర్తమానకథను ప్రారంభించి తత్కారణభూతార్థమును తర్వాత నిర్దేశించియున్నాఁడు. ఇది ఋతనియం దొక విశిష్టత. అంతే కాదు, తన్మూలమున కథా సంవిధానమునకొక సొగసును, పాఠకుల కుత్కంఠయు పెరుఁగుచునే యుండును. కథకు బీజము సరస్వతీ బ్రహ్మల ప్రణయకలహాఘట్టము. తక్కిన యాశ్వాసములన్నియు దాని కవయవములు. పాఠకుల కడుగడుగునఁ గన్పట్టు వక్రత కావ్యనిర్మాణ రహస్యమును గ్రహించుచోఁ దొలఁగును. ఇంత శ్రమించి యుండినను కవిని సమకాలికులు మెచ్చుకొనరైరి సరిగదా వారి యుపేక్షాభావమే వెనుకటివారికిని సంక్రమించి కావ్యము మూలఁబడుటకు హేతువైనది.

ఏది యెట్లయినను కావ్యము మృదుపదగుంభితమై ద్రాక్షాపాకము గలిగి నిరుపమానమైనది. ఆఱవ యాశ్వాసము దనుక కథ కుంటుపడక సాగినను తరువాత మాత్రము వక్రించినది. పూర్వాశ్వాసములలో కథ నగు నాటకరీతి సంభాషణములు పాత్రముల మూలముననే చేయించి పాత్రపోషణమును సాధించిన కవి తర్వాత దీర్ఘవర్ణనములలో మునిఁగిపోయెను.

ప్రభావతీప్రద్యుమ్నము తన పితృదేవుని పేర ఆ జన్మసిద్ధమైన తన యాత్మగౌరవము నిలఁబెట్టుకొనుటకై రచించెను. కావ్యారంభమున నతని ప్రసంగము కనుఁడు:

క. తండ్రియు సుతులకు దైవం
బండ్రు గదా వేదవాదు లది వినియును నే
వీండ్రును వాండ్రును బలె నా
తండ్రిఁ బరమపూజ్యుఁగాఁగఁ దలపమి తగునే.

ఇందలి కథావిధానము కళాపూర్ణోదయము ననుసరించినది. కావ్యము రస భాండమైనది. మిశ్రకథా రచయితల కిది మార్గదర్శకమైనది.

సూరన పాత్రరచనావిషయమున పాత్రల గుణముల ప్రత్యక్షముగా నిర్దేశింపక పాత్రల చర్యలను వారి సంభాషణలనుబట్టియే ప్రకటించెను. ప్రతియోగసంఘటనచే పాత్రలకు వికాసము కల్పించినాఁడు. సూరన యూహించిన ప్రణయరీతులు ముఖ్యముగా నాలుగు: మొదటిది సరస్వతీ బ్రహ్మల ప్రణయము: రెండవది కలభాషిణీ మణికంధరుల ప్రణయము. మూఁడవది సుగాత్రీ శాలీనుల శృంగారము. నాలవది మధురలాలసా కళా పూర్ణులది. ఎన్నివిధముల శృంగారమును వర్ణించినను విషాద మొక్కింత యంటకున్న నది పుష్టికెక్కదని పూర్ణత నందదని సూరన యాశయము. అట్లే యద్భుతముగూడ దానితో సంయోగ మందిననే ప్రణయశృంగారము రసవత్తర మగు ననుటయు నతఁడు ప్రకటించిన రహస్యములలో నొకటి. ప్రేమ కవస్థావిశేషమే కాని కేవలము గుణరూపములు కావను రహస్యము నితఁడు వెలిపుచ్చెను.

"సూరన మూఁడుకావ్యములును మూఁడు రత్నములు. రాఘవపాండ వీయమున కవిత్వమును పాండిత్యమును సమభావమంది చిందులాడెను. కళా

పూర్ణోదయములో కవితాప్రతిభ యతిశయించి వెలుఁగొందినది. శేము షియుఁ గల్పనయుఁ దగ్గి సాహితీపటిమమాత్రము మిగిలియున్న వార్ధకమును తలఁపించుచున్నది ప్రభావతీప్రద్యుమ్నము." (ఆ. వా. సం. కర్త.)

సూరన చేసిన ప్రతిజ్ఞలు రెండు."

1. "క. ......ఏయర్థమును దగు,
లోకానదివియక వెలివోని,
చ్చనె బుధుఁ డూహించి చేయు సుకవిత్వంబుల్.

2. అచ్చపుబుద్ధికి లేవగమ్యముల్.

ఇవి కేవలశక్తిహీనుని ప్రతిజ్ఞలు కావు. ప్రజ్ఞావిశేషములు. సూరన రచన యంతట నీప్రజ్ఞ ప్రతిఫలించుచునే యుండును.

క. కొలఁది యిడరాని పాండితి
గల పింగళి సూరనార్యుకవనంబునకా
శల మున్నదెల్ల నెఱుఁగఁగ
నలవియె మాదృశున కర్హులందుఁ గవీంద్రుల్.

ఇట్లు,

చెన్నపురి,
10-9-62.

సమస్తబుధజనవిధేయుఁడు
వేదము లక్ష్మీనారాయణశాస్త్రి.

శ్రీరస్తు

# కళాపూర్ణోదయము

## పీఠిక



లావణ్యవతీకుచద్వితయకా
శ్మీరప్రభాచారువ
క్షోలంకారమణిప్రకాండము నవీ
నాప్కుండు గా సన్మనో
నాళీకావిరతప్రభాత మగుచున్
భాసిల్లుతత్త్వంబు నం
ద్యాలశ్రీనరసింహకృష్ణవిభు ని
త్యశ్రీయుతుం జేయుతన్. 1

చ. ప్రసవవిలాసనర్తనవిభాసురగోపకిశోరమూర్తితోఁ
దనరు కిలువేలు పై వెలయుతాండవకృష్ణపదాబ్జసేవ ను
న్నతసుతనయాదిసంపదలు తామరతంపర లై ప్రవర్ధిలన్
దనరఁగ వనవచ్చుఁ గాపుత ధరన్ నరసింగయకృష్ణుఁడెంతయున్.

మ. పలుకేల్ దారులికిం గుచస్తబకసేవాలోలతం బోవ వా [గ్లో
పలుకేల్ సిగ్గున మాన్ప [1]నల్కనదితత్త్వాభ్యర్ణంపులేఁజెక్కుఁ

1. నల్కనవి తత్త్వా.

మలపాదంబును ముట్టుచుఁ [1]దెలచు బ్రహ్మం బర్ధనారీశ్వరుం
దెలమిఁ నిత్యముఁ బ్రోచుఁ గృష్ణవసుధాధీశున్నృసింహాత్మజున్.

చ. అనయముఁ బ్రేమ సంధిలఁగ నాస్యచతుష్టయయోగపవ్య
చుం, బనఘునకాంక్షఁ బోలె నిగమంబుల పేరిట నాల్గుహాపులం
దనరెడుభార్యమాట జవదాఁటక సృష్టి యొనర్చు వారిజా
సనుఁడు నృసింహకృష్ణవిభుఁ జాలఁ జిరాయువుఁ జేయుఁ గావుతన్.

చ. ఒనరఁగ నూర్ధ్వలోకమునుండి ధరిత్రికి డిగ్గు గంగకుఁ
మనసిజవైరిమౌళియు హిమక్షితిభృత్కటకంబుఁ బోలె శో
భనరసభవ్యకావ్యమయభారతికిఁ వసతిస్థలంబులై
తనరెడు వామలూరుభవ తాపసు సాత్యవతేయుఁ [2]జెల్చెదన్.

చ. పలుకఁ దలంప దవ్వు లగు భారతరామకథార్థముల్ విభా
సిలఁగ నరంటపం డొలిచి చేతికి నిచ్చినరీతి నాంధ్రవా
క్సులలితశక్తి నందఱకు సుప్రథితంబులు చేసినట్టి ధ
న్యుల నుతియింతు నన్నయబుధోత్తముఁ దిక్కన నెఱ్ఱసత్కవిన్.

ఉ. మెచ్చియొకింత గౌరవము మెచ్చకయుండి లఘుత్వలేశముం
దెచ్చుటకుం సమర్థులె కృతిక్రియకుం గుకవిత్వగర్వితుల్ ?
తచ్చరితం బుపేక్షకుచితం బగుఁ గాక ! నగంగ నైన వా
క్రుచ్చి యజాగళస్తనసగోత్రుల వారల నెన్న నేటికిన్ ? 7

సీ. విశ్రామ విహతి గావింపక సారవ
త్సాహిత్యసౌమనస్యంబు లెడఁగి
సమయంబు దప్పక శ్రవణకఠోరంబు
లైనశబ్దముల నత్యాకులాత్మఁ

1. వలచు. 2. గొల్చెదన్.

జేయక సత్పరిచితసుకుమారవా
క్సరళితాభిప్రాయఁగా నొనర్చి
పదబంధశిథిలత వాటిల్లఁగా నీక
యేచందములయందు నేమరిలక
ఆ. పరఁగుకవియు దోషాకరుఁడును యశము దు
గ్ధము బడయు; నట్లు గానినాఁడు
కృతిపరాపమొదవుఁ గీర్తియుఁ బాలు నీ
రుంప గాదు హాసయోగ్యుఁ జేయు. 8

వ. అని యిష్టదేవతాప్రార్థనంబు గావించి సుకవుల సేవించి కుకవు
లుపేక్షామాత్రసంస్తవ్యు లగుట భావించి, సకలలక్షణలక్షితం
బైనమహాప్రబంధంబు కీర్తికారణం బనియు నిరతం బుపహాస
కారణం బనియు నూహించి, యుద్ధియేనియు నొక్కసరస
ప్రబంధనిబంధనంబునకు జాతకౌతూహలుండ నై యుండు
నంత. 9

సీ. తనకీర్తి సకలదిగ్దంతిదంతాంత
కాంతపంక్తికిఁ జెలికత్తె గాఁగఁ
దనప్రతాపంబు మార్తాండమండలచండి
మోపదేశమునకు నొజ్జ గాఁగఁ
దననీతిపస యుగంధరభట్టిచాణక్య
ఘనచాతురికి నిదర్శనము గాఁగఁ
దనవిలాసంబు కందర్పప్రసంపన
వార్తకు ఖండనవాది గాఁగ
తే. నెలయు మనుమార్గవర్తనావిరతనిహిత
ధరణి పరిపాలనాపరిస్ఫురితరాజ్య

వైభవుండు నృసింహభూవరసుతుండు
జిష్ణుతుల్యుండు నంద్యాలకృష్ణవిభుఁడు.

వ. అనర్ఘ్యమణిమయాభరణకిర్మీరితదిగంతరుండును, గంధసారకస్తూరికాద్యనులేపసౌరభసంవాసితపర్యంతభాగుండును నగుచుం జెలువు మీఱి కొలువుకూటంబున గురుశుక్రనీతిచాతురీ విఖ్యాతివంచనాచుంచుపంచాంగనయజయాతిశయభూషితశేముషీవిశేషవైయాత్యు లగునమాత్యులును, సవనూచానసంప్రదాయసిద్ధాధ్యయనశుద్ధిగరిమపరిపూర్ణశక్తివిభ్రాజమాననానావేదమంత్రతంత్రసంతాయమానశాంతికర్మదూరవారితదైవికాత్యాహితు లగు పురోహితులును, కాణాదకాపిల గౌతమీయ జైమినీయ వైయాసిక పాతంజలతంత్రరాద్ధాంత పూర్వపక్ష వైపరీత్యకరణచణయుక్తికల్పనానల్పకల్పిత ప్రతివాదిబుద్ధి విధ్వంసులగు విద్వాంసులును, బ్రాహ్మపాద్మవారాహవైష్ణవమాత్స్యమార్కండేయభాగవతబ్రహ్మకైవర్తకౌర్మగారుడస్కాందాదినిఖిలపురాణకథాకథనపాండిత్యపరితోషితాంతర్వాణికులగు పౌరాణికులును, ఆశుమధురచిత్రవిస్తారకవితావిజృంభణస్తంభితబాణభవభూతి కాళిదాసముఖ్యవిఖ్యాతిగౌరవులగుకవులును, బహువిధపురాతనజ్యౌతిషసిద్ధాంతసంఘృష్టనిశితమతిచతురిమ సమధిగతకళాకాష్ఠానిమేషాదిసూక్ష్మసూక్ష్మతరసూక్ష్మతమకాలకలనాకౌశలప్రకాశకీర్తికులగు మౌహూర్తికులును, ధన్వంతరిదస్రచరకప్రముఖనిఖిలాప్త వైద్యవైశారద్యస్పష్టాంతభావభాజనాయుర్వేదవేదిత్వవైభవాలంకారు లగునగదంకారులును, విశ్వావసుతుంబురునారదాంజనేయభరతమతంగకోహలదత్తిలప్రభృతి

గాంధర్వకౌశలగౌరవస్మరణకారణగాన మాధురీధురీణతా ప్రీణితబుధశ్రేణికు లగువైణికులును, రూపలావణ్యవిభ్రమ విలాసవిభవ విస్మాపితవివిధజనస్వాంత లగువారకాంతలును, నిరంతర పరిణతబహువిధప్రహరణవ్రణకిణగణకాఠిన్యఖండిత కంకటాపేక్షవక్షోవిభాగజోఘుష్యమాణ శౌర్యసాహసోద్భటులగుభటులును యథోచితప్రదేశవర్తు లగుచుం గొలువ వేత్రహస్తజనసనామాఖ్యాన సందర్శిత సామంతకుమారుల సేవలు కటాక్షహాసభాషణాదుల నాదరించుచు గీతవాద్య తాళానువర్తినర్తకీనర్తనప్రవర్తనంబు లవధరించుచు, ననేక విధరాజ్యకార్యవినియుక్తులైనయధికారిపురుషుల విన్నపంబు లాలించుచు వందిబృందపఠ్యమానబిరుదావళీ ప్రబంధబంధుర శబ్దార్థచమత్కారంబులు పరికించుచు నొడ్డోలగం బై కూర్చుండి కావ్యప్రసంగవశంబున. 11

సీ. శోభితాపస్తంబసూత్రు గౌతమగోత్రు
సుచరిత్రుఁ బింగళిసూరసుకవి
పౌత్రు నన్నమపతిభావనదౌహిత్రు
నమరధీనిధికి నంబమకుఁ బుత్రు
ననుజన్ములైనట్టియమరనయెఱ్ఱనా
ర్యులు భక్తి సేవింప నలరువాని
సత్కావ్యరచనావిశారదుం డగువాని
సూరననామవిశ్రుతుని నన్నుఁ

ఆ. బ్రియము సంధిలంగఁ బిలిపించి బహువస్త్ర
భూషణాదిదానములఁ గరంబు

సంతసం బొనర్చి యెంతయు గౌరవ
మెసఁగ మధురఫణితి నిట్టు లనియె. 12

శా. "నీచే నొక్కమహాప్రబంధముఁ గడున్ నిశ్ఛిద్రసారస్యశ్రీ
లాచిత్రం బగుదాని నోయనఘ, వాలాయంబుఁ జేయించుకో
మాచిత్తంబున వేడ్కయుండు; నది నీమాధుర్యధుర్యోరువా
గ్వైచిత్రిన్ సఫలంబుసేయుము సుధీవర్గంబులో హో యనన్!

మ. ఇటమున్ గారుడసంహితాదికృతులీవింపొందఁగాఁ జెక్కొన
ర్చుట విన్నారము; చెప్ప నేల యవి? సంస్తుత్యోభయశ్లేషసం
ఘటనన్ రాఘవపాండవీయకృతి శక్యంబే రచింపంగ నె
చ్చుట నెవ్వారికి? నీకచెల్లెనది భాషాకావ్యముం జేయఁగన్."

క. అని యాదరణము మిగులం
దనర నియోగింప నేను నాకొలఁది గనుం
గొన కీయకొంటిఁ దగ నా
యనఘుఁడు సంకల్పసిద్ధుఁ డనునమ్మికచేన్. 15

వ. ఇవ్విధంబునం బూనియమ్మహాప్రభువు సగౌరవనియోగంబునకు ననుగుణంబుగ మదీయశక్త్యనుసారంబున విచారించి యత్యపూర్వకథాసంవిధాన వైచిత్రీ మహనీయంబును శృంగారరసప్రాయంబును, బుణ్యవస్తువర్ణనాకర్ణనీయంబును నగుకళాపూర్ణోదయం బనుమహాకావ్యంబు నిర్మింపం గడంగితి, నట్టి మదీయకృతి కధీశ్వరుం డగుచుం బెంపొందునంద్యాలకృష్ణభూవల్లభునివంశావతారం బెట్టి దనిన. 16

తే. సకలకువలయపాలనైశ్వర్యయుతుఁడు
చండధామకృతశ్రీఘనుండు నైన

రాజచంద్రుండు జగతిఁ గరంబు వెలయు
సంతతోదయసౌభాగ్యశాలి యగుచు. 17

తే. అత్రిలోచనభవుఁ డయ్యు నతఁడు మీఱె
నపరిమితతారకావళి కధిపుఁ డగుచుఁ
దాఁ ద్రిలోచనభవుఁ డయి ధరఁ గుమారుఁ
డేకతారకజయ మొందు టేమి యరుదు? 18

క. ఆచంద్రమునివంశంబున
భూచంద్రుం డారవీటిబుక్కనరేంద్రుం
డాచక్రవాళశైల
క్ష్మాచక్రస్ఫూర్తకీర్తిసాంద్రుఁడు పుట్టెన్. 19

క. ఆబుక్కనృపాలునిబా
హాబలముకొలంది తపసిహతరిపువీర
ప్రాబల్యనిరాకృతనల
కూబరునకుఁ దెలియుఁ, దెలిసికొనఁగలఁడేనిన్. 20

చ. మతి నజుఁ డంచు రూపమున మన్మథుఁ డంచు నయోన్న
తిన్ బృహస్పతి యనుచున్ వదాన్యతను భానుసుతుం డను
చున్ నుతించు నా, ర్యతతి 'నిరంకుశాః కవయ' యం చది
యొప్పుటగాని బుక్కభూ, పతికి సముండు లేఁడు తలఁపన్
భువనంబుల నేగుణంబులన్. 21

క. పావనగుణ యగునబ్బల
దేవిని గులశీలగుణనిధిన్ మఱి బల్లా
దేవిని వివాహమయ్యె మ
హావిభవుఁడు బుక్కనరవరాగ్రణి వేడ్కన్. 22

క. అందును బల్లాదేవికి
నందను లుదయించి రింద్రనందనసదృశుల్
చందనవిశదయశుల్ సం
క్రందనవైభవులు రామరాజప్రముఖుల్. 23

ఉ. భూమహనీయశీలుఁ డగుబుక్కయయగ్రవధూటి కబ్బలాం
బామణికిన్ జనించిరి సమస్తగుణాఢ్యుఁడు సింగరయ్యయున్
రామనిభుం డహోబలధరారమణుండును విక్రమాన్వయో
ద్దామత నొప్పునీతికి నుదగ్రజయాభ్యుదయంబులుం బలెన్.

ఉ. అందును సింగభూరమణుఁ డౌబళదేవిని బెండ్లియాడి సం
క్రందనతుల్యవైభవులఁ గాంచెఁ దనూజుల ముప్పురన్ బుధా
నందవిధాయి నిర్మలగుణప్రకరున్ నరసింగ రాజు శ్రీ
నందనతుల్యు నారవిభు, నవ్యపురూరవుఁ దిమ్మపార్థివున్. 25

ఉ. [1]వాలినకీర్తిఁ బెంపెసఁగి వారలలో నరసింగరాజు నం
ద్యాలపురాధిపత్యవిభవాతిశయంబు వహించి మించె ను
ద్వేలనిరూఢి నెల్లెడల విశ్రుతమై తనవంశమెల్ల నం
ద్యాలపదప్రసిద్ధిఁ దనరారుచు నెంతయుఁ దేజరిల్లఁగన్. 26

క. ఆనరసింగక్షితిపతి
మానవతీతిలక మైనమాచమదేవిన్
భూనుత సమస్తగుణాల
క్ష్మీనిధిఁ దగఁ బెండ్లియాడెఁ గీర్తి దలిర్పన్. 27

సీ. మందారమందాక్షసందాయి దానప్ర
సిద్ధుండు సింగరక్షితివరుండు

---

1. ప్రాలిన.

గర్వితారాతిదోర్గర్వనిర్వాపణో
దీక్షుండు నారధాత్రీవరుండు
భూభువనప్రశంసాభిశోభితమహా
ప్రాభవాఢ్యుఁడు కుమారరాంబళుండు
శరదిందుచంద్రికాపరిశుద్ధవిహాసన
స్ఫురదనర్గళకీర్తి వరదరాజు
తే. ప్రచురవిక్రమరఘుపతి రఘుపతియును
దనయు లేవురు గల్గి రుదాత్తసకల
గుణగరిష్ఠులు నరసింగకుంభినీత
లాధినాథున కమ్మాదమాంబయందు. 28

క. నరసింగవిభునిసింగరి
నరవరుఁ డసమానుఁ డధికనయసారత ని
ర్భరశూరత నతిధీరత
నరు వగుదానక్రియాభిహారణ నిలలోన్. 29

క. నారాయణభక్తుఁడు సుజ
నారాధనపరుఁడు జలరుహాక్షీసుమనో
నారాచుఁడు నరసింగయ
నారావనిపాలకుండు నరనిభుఁ డాజిన్. 30

సీ. స్వారాజభావంబు కారణంబుగ నేమొ
శత్రుండు నెలవున జడియ కునికి;
మిత్రపుత్త్రతఁ దాను మిత్రుండ నని యేమొ
యముఁ డాత్మపురమునఁ దెమల కునికి.
వారుణీసేవామదారూఢిచే నేమొ
జలభర్త తనవీటఁ గలఁగ కునికి;

తల్లడం బేల? యే ధనదుండ నని యేమొ
ధనరాజు నిజపురిఁ దలఁగ కునికి;
తే. తమకు మఱి దిక్కు లేమిని దలఁకి యేమొ
కడమనలువురు మూలల నడఁగి యునికి,
వీరవరుఁ డైన నంద్యాలనారవిభుని
యాజి ఘోరభేరీధ్వను లడరునపుడు. 31

చ. పగ లనుశబ్దమాత్రము నభఃకుసుమంబు నిజంబు నారభూ
జగదధిపప్రతాపగుణసంపదచే; రవిఁ దత్సమానుఁగాఁ
దగునె నుతింప? నారవిప్రతాపమహత్త్వముచేతఁ బేర్చుచుం
బగ లొకనాఁడుఁ దప్పక యపారతఁ జొప్పడుఁ గాకమాను నే?

చ. వదలక యుత్కలేంద్రుని సవాయిబరీదు నడంచు దుర్జయుం
గుదుపనమల్కుఁ దల్లడిలఁ గొట్టి మహాద్భుతసంగరంబులో
నెదిరిచి కొండవీటికడ; నెవ్వరు సాటి విచిత్రశౌర్యసం
పదపస నారసింహవిభుపట్టికి నారనృపాలమౌళికిన్? 33

సీ. శ్రీవిష్ణుపదభక్తిచే ధర్మసంపత్తి
ధర్మసంపత్తిచేతను జయంబు
జయసిద్ధిచేత నుజ్జ్వలబాహుశౌర్యంబు
శౌర్యగౌరవముచేఁ జతురనీతి
నీతి పెంపున మహనీయసామ్రాజ్యంబు
సామ్రాజ్యమహిమచే శాంతగుణము
శాంతిచే వేదాదిసకలసద్విద్యలు
విద్యలచే బుద్ధివిలసనంబు
తే. దానఁ బాత్రవివేకంబు దాన నీగి
దానఁ బ్రవిమలకీర్తియు దానఁ గులముఁ

ప్రేమ నత్యంతము నలంకరించుకొనియె
బళిర! నంద్యాలనారభూపాలకుండు. 34

చ. ఘనతరదానచాతురిన కాదు శ్రుతిస్మృతి శాస్త్రనైపుణం
బునను బుధానురంజనుఁడు భూరిశుచిత్వమునంద కాదు శో
భనప్రఁబ్రతాపసంపదను బావకుఁ డానరసింగభూపనం
దనుఁడు కుమారయోబవసుధాతలనాయకుఁ డివ్వసుంధరన్.

ఉ. సాత్త్వికలాపరాయణుఁడు సత్యవచస్కుఁడు దానశాలి దో
స్సత్త్వవిజృంభితుండు రణశౌర్యధురీణుఁ డకల్మషుండు ధీ
రత్వమునన్కుపట్టు చతురత్వనిధానము నీతిపద్ధతీ
తత్త్వవిశారదుండు వరదక్షిణిపాలుఁ డలోలుఁ డెయ్యెడన్. 36

క. కరుణాఘనవీక్షణమునఁ
శరణాగతరక్షణమున సంగరశౌర్యా
భరణాహితశిక్షణమునఁ
దిరముగ రఘుపతియ రఘుపతిం దలపోయన్. 37

ఆ. అందు సింగరయ్య యనవద్యగుణ గౌర
మాంబఁ బెండ్లియాడి యాత్మజులను
గనియె నారసింహజననాథు రఘుపతి
క్ష్మాతలేంద్రు నోబమనుజవిభుని. 38

క. ఆనారసింహవిభుఁ డస
మానగుణుఁడు రఘుపతిక్షమాపుఁడు యశ
శ్శ్రీనిధి యహోబలాఖ్యధ
రానాథుఁడు సకలగుణవిరాజితుఁ డయ్యెన్. 39

క. ఆముప్పురలో నగ్రజుఁ
డై మించునృసింహునకుఁ దదంగన యగుశ్రీ

రామాంబకు నుదయించె మ
హామతి హావళిచిన్నోబళాఖ్యుఁడు వెలయున్. 40

ఉ. దేవవిభుండు భోగమునఁ దీవ్రమయూఖుఁ డఖండచండతే
జోవిభవంబునం దపనసూనుఁ డనూనవితీర్ణి పెంపునన్
దైవతమేదినీధరము ధైర్యమహత్త్వమునం దలంపఁగా
నావళిచిన్నయోబమనుజాధిపముఖ్యుఁడు రాజమాత్రుఁడే !

క. ఇది సింగరయ్యసంతతి;
తదనుజుననుజుఁ డగునోబధరణీపువంశా
భ్యుదయక్రమ మభివర్ణిం
చెద నిఁక భువనప్రసిద్ధి చెన్నెసఁగంగన్. 42

ఆ. ఆకుమారయోబభూకాంతుఁ డింపుతోఁ
బెండ్లియాడె గుణగభీరచరితఁ
దిరుమలాంబ నెందుఁ బరమపాతివ్రత్య
పావనతఁ దనర్చుభాగ్యనిధిని. 43

సీ. నానాగుణైకనిధానంబు నా నొప్పు
నరసింగమేదినీనాథవర్యు
నిద్ధంపుగీర్తులఁ దద్దయు విలసిల్లు
నట్టిపెద్దయహోబళాధిపతిని
నాదిమనృపగతి మేదినీజనములఁ
బ్రోది సేయుచు నొప్పుమాధవవిభుని
సన్నుతోన్నతవృత్తి నెన్నికఁ గన్నట్టి
చిన్నయహోబలక్షితితలేంద్రు

తే. సారతరచారుచారిత్రు నారనృపుని
నాకుమారోబళుండు తిమ్మాంబయందుఁ

గనియె నేవురుసుతుల సత్కాంతియుతుల
విష్ణుసేవాభిరతులఁ బ్రవీణమతుల. 44

క. అందు నరసింగవిభుఁ డిం
పొందఁగఁ దాఁ బెండ్లియాడె నుభయకులశ్రీ
సౌందర్యగుణచరిత్రము
లం దిరమై తనకుఁ దగినలక్ష్మీదేవిన్. 45

స్రగ్ధర. ఆలక్ష్మీదేవియం దాయతమతి నరసిం
గావనీశుండు గాంచెం
ద్రైలోక్యస్తుత్యులన్ నందనుల నుదయశో
[1]ధన్యు నోబాహ్వయక్ష్మా
పాలోత్తంసుం గవిత్వప్రముఖబహుకళా
పారగుం దిమ్మరాజున్
బాలాదిత్యోపమానప్రచురతరరుచి
స్ఫారు నారక్షితేంద్రున్. 46

ఉ. వైభవజృంభణావమతవాసవుఁ డిందుముఖీనవీనచే
తోభవమూర్తి కల్మషవిదూరుఁడు నిత్యరమావిహారసీ
లాభవనాయమానసువిలాసకటాక్షనికేతుఁ డాకుమా
రాభళునారసింహసుతుఁ డౌభళుఁ డెన్నిక కెక్కె నెంతయున్.

శా. అత్రాసోజ్జ్వలశూరతాగుణకుమారాహోబళక్ష్మాపస
త్పుత్ర శ్రీనరసింహతిమ్మవిభుకీర్తుల్ మీఱె యత్యంతమై
చిత్రం దిక్తటులన్ నటింప నవి తా శీలింపుచున్నట్లు తత్
స్తోత్రాకారసరస్వతీసతి నటించున్ సూరిరాజిహ్వలన్. 48

1. ధన్యు (యతితప్పినది.)

క. ఏసీమ నెదురు లేక వి
భాసిలు నంద్యాలతిమ్మపార్థివుబలముల్
వాసి గలయతివిభాసి
ప్రాసాదులతోడ సత్ప్రబంధములగతిన్. 49

ఉ. భూలలనాలలామ కడుఁ బొల్పెసలారెడువేడ్కతోడ నం
ద్యాలకుమారయోబనరనాథునృసింహునినారశౌరియు
త్తాలభుజాగ్రమెక్కటియుఁదక్కక యెక్కుఁడదీయ[1]కీర్తియన్
బాల సుమేరుశృంగము సపత్నికి మచ్చర మెచ్చ కుండునే.

ఆ. అతనిపిన్నతండ్రి యగుపెద్దయోబభూ
నాయకుండు గాంచె నందనులను
సారసుగుణమణిపయోరాశి నుద్దండ
యోబళేంద్రుఁ జిన్న యోబళునిని. 51

ఉ. ధీరజనాభివర్ణ్యుఁడు తదీయకనిష్ఠపితృవ్యుఁ డుజ్జ్వలాకారుఁడు
[2]పిన్న యోబళుఁడు గాంచెఁ దనూజుల మువ్వురన్ మనో
హారిగుణోన్నతుం దిరుమలయ్యను రాజమనాముఁ గృష్ణభూ
మీరమణోత్తముఁ దిశల మించి నిజాన్వయకీర్తి వర్తిలన్.

క. ఇల నంద్యాలకుమారా
బళువంశచరిత్ర మిది సుపావనవృత్తం
బొలు పొందుతదనుజన్ముని,
విలసితవంశక్రమంబు వివరింతు నికన్. 53

ఉ. సంగరపార్థుఁ డావరపశౌరి సుతత్రితయంబుఁ గాంచె నా
త్మాంగన యైనశ్రీతిరుమలాంబికయందు మహాగుణాఢ్య శ్రీ

1. కీర్తియున్. 2. చిన్న యోబ.

రంగజనాధిపుఁ బుధవరప్రణుతుఁ నరసింగమేదినీం
ద్రుం గవిపోషణాతిచతురుం గనకక్షితిపాలశేఖరున్. 54

తే. అందు శ్రీరంగరాజు సమస్తగుణాని
కేతనుం డా శ్రితసుపర్ణకేతనుండు
తనకుఁ గులరూపగుణములఁ దగినయట్టి
తిరుమలాంబికఁ బెండ్లియై తేజరిల్లె. 55

సీ. శోభనజయలాభసౌభాగ్యభూభర
ణాభిశోభితుఁ డైనయాభళేంద్రు
నిర్మలసత్కర్మధర్మనిర్మితబుధ
సమ్మోదుఁ డై యొప్పుతిమ్మవిభుని
సురదంతిశరదభ్రహారకంతిరిపునిభ
స్ఫురదమందచిరకీర్తి వరదవిభుని
విష్ణుసేవాఘ్యంభవిష్ణు నిత్యాచార
నిష్ఠాత్మహృదయుని గృష్ణనృపుని

తే. నందనులఁ గాంచె నలుపుర నందనద్రు
మానువర్తనకీర్తనీయానవరత
దానముదితార్యతతుల ననూనమతుల
రమణిఁ దిమ్మాంబయందు శ్రీరంగరాజు. 56

తే. అట్టిశ్రీరంగవిభుద్వితీయానుజునకుఁ
గనకవసుధాధిపతికిని గలిగె సుతుఁడు
ధరఁ గనకగిరియాబళేశ్వరుఁ డనంగ
నభినుతాహ్వయుఁ డగుచుఁ బెంపారు ఘనుఁడు. 57

వ. ఇది వరదరాజువంశక్రమంబు. 58

తే. ఇట్టివంశాభివృద్ధికి హేతువు లయి
తనరుసౌజన్యనిధు లన్నదమ్ము లెపుడుఁ
దనదుసౌభ్రాత్రమునకుఁ జిత్తముల నలర
వెలసె నంద్యాలనారపృథ్వీవరుండు. 59

క. ఆనారక్షితిపాలుఁ డ
నూనశ్రీవిభవసముచితోద్వాహవిధిం
బూని వరియించె నిజరూ
పానుగుణం దిరుమలాంబ నధికప్రీతిన్. 60

తే. పుణ్యకులశీలమహిమలఁ బ్రోక యనఁగ
నిష్కళంకపాతివ్రత్యనిధి యనంగ
వెలయు నంద్యాలనారభూవిభునిదేవి
పరమశుభగుణనికురుంబ తిరుమలాంబ. 61

క. ఆతిరుమలాంబయందుఁ బ్ర
భూతయశుఁడు నారవిభుఁడు పుత్రులఁ గనియెం
బూతాత్ముల నరసింగ
క్ష్మాతలవిభు మాదనృపునిఁ గనకక్షితిపున్. 62

ఉ. ఉన్నతిఁ బేర్చి [1]యందు వెలయుం నరసింగవిభుండు శౌర్యసం
పన్నుఁడటంచు విద్యఁ బ్రతిపన్నుఁ డటంచుఁ గవీంద్రకోటికిం
సన్నిధియంచు నిత్యహరిసన్నిధియంచు విపన్నరక్షణా,సన్నుఁ
డటంచు నెప్పుడుఁ బ్రసన్నుఁ డటంచు జనుల్ నుతింపఁగన్.

క. నారయనరసింహుఁడు మది
నారయ నరసింహుఁడే యథార్థము కవజ

1. యెందు.

శ్రీరచితార్థస్థితి నై
భూరిప్రస్తావభరణమున శోభిలుటన్. 64

శా. స్ఫూర్తిప్రౌఢి నిరంతరం బగుచు నెచ్చోటం బ్రకాశింపఁగా
వర్తిల్లున్ భువనంబులందును సహావస్థానవత్కాముకీ
మార్తండద్యుతివైభవంబు లన; నిర్మర్యాదవైచిత్రితోఁ
గీర్తింపన్ వశమే నృసింహవిభుసత్కీర్తిప్రతాపోన్నతుల్.

ఉ. భానుసమాన తేజుఁడు విభాసురరూపమనోజుఁ డుజ్జ్వలా
మానయశోవిభాసి విభవోదయనిత్యవిలాసి విశ్వస
న్మానితవర్తనుండు కవిమండలనిర్మితకీర్తనుండు ల
క్ష్మనవమాధవుండు నరసింహునినారయమాధవుం డిలన్. 66

క. వితరణమున రణమున ను
న్నతవినయంబున, నయంబునం దన కిలలోఁ
బ్రతి లేక నారభూపతి
సుతుఁ డామాచప్రభుండు శోభిలు మిగులన్. 67

క. కనకమహీభృద్వరుఁ డల
కనకమహీభృద్వరుండ గట్టిగ [1]శౌర్యం
బున విబుధాధారత్వం
బునఁ బరహితధర్మభావమునఁ దలపోయన్. 68

శా. స్థానం బెన్నఁడుఁ బాయ దుత్సవఘనస్వస్త్రీసుఖక్రీడ పై
పై నొందన్ భువి నర్థిలోకము దివిం బ్రత్యర్థిలోకంబు న
న్యూనంబుం డాకనకయ్య యుద్యతకృపాణుం డైనమాత్రం
బునన్, దానశౌత్రము లింత యంత యనుచుం వర్ణింపఁగా
శక్యమే. 69

---

1. ధైర్యం.

సీ. సంతానసురధేనుచింతామణిశ్రీకి
లజ్జఁ దా నొనరించు నొజ్జ యగుచు
నలకాధిపతిసూనునలకామునకు దర్ప
రహితత్వ మొనరించు మహితలీల
నరభీష్మకోదండగురుభీష్మసమరంబుఁ
బక్కువ యనిపించు నిక్కువముగఁ
గుంభీనసక్రోడకుంభీనగిరులకు
విశ్రమంబు నొనర్చు నశ్రమమున
తే. సంతతౌదార్యసౌందర్యశౌర్యధరణి
భరణనైపుణగుణములఁ బ్రౌఢి మెఱసి
వసుధ నరసింగమేదినీశ్వరునినార
నరవరేణ్యునికనకభూనాయకుండు. 70

క. ఆముప్వరందు నగ్రజుఁ
డై మించిననారసింహుఁ డతులితవిభవ
శ్రీ మెఱయఁ బెండ్లియాడెం
బ్రేమం బెదకొండమాంబఁ, బినకొండాంబన్. 71

చ. నిరుపమవిక్రమంబును వినీతియు నీతియుఁ బోలెఁ దత్త్వవి
త్పరిచయమున్ విరక్తియునుభక్తియుఁబోలెసుయోగవర్తనా
దరవిభవంబు శాంతియును దాంతియుఁబోలెఁగరంబలంకరిం
చిరి తమనిత్యసేవ నరసింగయ నిద్దఱుకొండమాంబలున్. 72

ఆ. అందుఁ బెద్దకొండమాంబయం దానర
సింగభూవరుండు శిష్టమతుఁడు
గాంతియుతుల సుతులఁ గనియె మూర్తిమా

రమణుఁ డిమ్మవిభుని రమణ [1]మీఱు. 73

ఉ. ఆనరసింగభూపతి ప్రియం బెసగం బినకొండమాంబయం
దానమితాఖిలాహితసమాజుఁ దనూజునిఁ గాంచె బంధుసం
తానసురావనీజు సముదంచితభోగబిడౌజు సూరిమై
త్రీనవభోజు భానునిభతేజునిఁ గృష్ణమరాజు నున్నతిన్. 74

వ. అందు. 75

సీ. శేషుదర్పము చిక్కి శీతాంశురుచి నొక్కి
పాలమున్నీటిపైఁ గాలు ద్రొక్కి
యాదిత్యుపస యాఁచి హాలహాలంబును లోఁచి
హుతవహుగర్వ ముబ్బూఁత లూఁచి
కల్పశాఖిని గెల్చి కర్ణకీర్తి మరల్చి
ఖచరువార్తఁ దరల్చి ఘను నదల్చి
కందర్పు మఱపించి యిందుని నిందించి
నలకూబరు హసించి నలుని మించి

తే. తనదుకీర్తిప్రతాపవదాన్యతాసు
రూపవిలసనములచేత రూఢి కెక్క
ధరణి నంద్యాలనరసింగనరవరేణ్యు
పట్టి యైనట్టిమూర్తిభూపాలకుండు. 76

వ. [2]తదనుజుండు. 77

క. తిమ్మక్షితిపతి శోభిలు
నిమ్మహిలో మిగుల వాసి కెక్కె సుగాంభీ
ర్యమ్మున ధైర్యమ్మున శౌ
ర్యమ్మునఁ బ్రఖ్యాతుఁడై జనావళి పొగడన్. 78

1. మీఱి. 2. ఇది కొన్నిప్రతులఁ గానరాదు.

సీ. శ్రీపుత్రతులనానురూపంబు రూపంబు
నిర్మలాంగిరసనీతి నీతి
మహనీయతానుపమానంబు మానంబు
భూతిమద్రిపుదావహేతి హేతి
ధాత్రీసురశ్రీనిదానంబు దానంబు
తులితమారుతిభీమబలము బలము
గోవిందచింతాస్వభావంబు భావంబు
కోవిదబంధుసంకులము కులము
తే. తరమె వర్ణింప వసుభృత్తటకుటీర
కటురటజ్ఝిల్లికాచ్ఛటాఘటితబిరుద
కాహళారవశంకాప్రకంపితప్ర
తీపనృపజాలు నంద్యాలతిమ్మవిభుని! 79

ఉ. [1]చెన్నెసఁగన్ నృసింహనృపశేఖరుతిమ్మనృపాలమౌళి యా
భ్యున్నతకీర్తి ముజ్జగము నూనఁగ మానవకన్యలట్లు తా
రెన్నఁడుఁ బోనిపున్నమసమృద్ధులఁ గాంచితిమంచునుబ్బుచున్
వెన్నెలకుప్ప లాడుదురు వేలుపుఁగన్నెలు నాగకన్యలున్.

ఉ. శ్రీయుతుఁడైన యట్టినరసింహునితిమ్మనికీర్తివైభవ
శ్రీ యనుమౌక్తికావళికిఁ జెల్వధికంబుగ దిక్కులన్ నిజ
స్థాయదకీర్తినీలపటసంవరణం బొనరించు మున్నుగా
నాయనశత్రు[2]వర్గము ప్రియం బిఁకనెవ్వఁడు నేయకుండెడున్.

మ. క్షితి నంద్యాలనృసింహుతిమ్మవిభుసత్కీర్తిప్రతాపంబు లు
న్నతిఁ బర్వన్ నవఫేనవిద్రుమములై నానాబ్ధులన్ సింహాసం

1. చెన్నెసఁగెన్. 2. గర్వము.

తతిధాతుప్రకరంబులై వలయగోత్రంబుల్ ప్రవచ్ఛామరో
ర్జితసిందూరములై దిశాగజతతిం జెన్నొందఁ గైసేయుచున్.

మ. అతిధన్యుం డగునారసింహవిభుతిమ్మాధీశుహస్తాబ్జసం
గతిచే వింతగ దానవారి సముదగ్రప్రౌఢిచే విప్రసం
తతియందుల్ నెఱపుల్ ధ్రువస్థితినిదానత్వంబుఁ బ్రస్తావపో
షితయుంగాకయశేషభోగపదతం జెన్నొందుసౌభాగ్యమున్.

ఆ. ఇట్టితిమ్మమేదినీశ్వరుం డనుఁగుఁద
మ్ముఁడు సభక్తివినయమోహగరిమఁ
దను భజింప నలరుఁ బినకొండమాంబగా
రాపుఁబట్టి కృష్ణభూపవరుఁడు. 84

సీ. ఆఖండలాహంక్రియాఖండదోర్దండ
తాఖండవిభవోదయాంచితుండు
వారణారిత్రపాకారణాజిస్థలా
వారణాంచద్భుజాపౌరుషుండు
మందేహరిపుదీప్తిసందేహఘటనాత్య
మందేహ తేజస్సమన్వితుండు
బంధురాజీవయస్సింధురాజీభవ
ద్బంధురాజీజయభ్రాజితుండు

తే. వెలయు నిఖిలదిగంతపృథ్వీతలాధి
పతిశిరగకంపకంపితశ్రుతివలక్ష
మణిమతల్లీఘృణిప్రతిమల్లఫుల్ల
కీర్తివిభవుండు నంద్యాలకృష్ణవిభుఁడు. 85

మ. అనఘాత్ముల్ నరసింహకృష్ణవసుధాధ్యక్షుల్ విరాజన్గుణై
కనిధుల్ వర్ణన సేయఁగాఁ దరమె? దిక్చక్రంబునం దెల్ల శో

భనతత్కీర్తినదీమతల్లి ప్రవహింపం బూన మున్మున్నుగా
ఘన మై యుబ్బుఁ గవీంద్రులన్ చెలమలం గావ్యామృతం
బెంతయున్. 86

చ. అవిరళనిత్యభోగవిభవాతిశయోల్లసితుండు నారసా
ర్థిపునరసింహకృష్ణజగతీపతి నిత్యసువర్ణములా
కవినికరంబుపైఁ గురియఁగాఁ బ్రవహించును హృద్యగద్యప
ద్యవివిధకావ్యరూపత ననంతసువర్ణమహాప్రవాహముల్. 87

ఉ. దానమునందుఁ గృష్ణవసుధావరుఁ డప్రతిముండు యుక్త
ముల్, దీని గణించినన్ సురమణీతతి గొల్చుచు నున్కి
స త్తసం, తానసమృద్ధి చేకుఱుటఁ దద్వినయాదిగుణంబు
లన్నియుం, బూనిక మీఱఁగా ననయమున్ సురభిత్వముఁ
దాల్చి యుండుటన్. 88

మ. తమి నంద్యాలనృసింహకృష్ణునిమహాదానక్రియాకౌశలం
బు మహత్త్వంబున నర్థిబృందము ధనంబుం జెందఁ బ్రత్యర్థి
బృందము చెందున్ నిధనంబు నింతయు మదిం దర్కింప
యుక్తంబ తథ్యము "వర్ణాధికు లెందుఁ గోరుదురువర్ణా
ధిక్యవద్యోగమున్." 89

మ. ఒకప్రద్యుమ్నునిఁ గాంచెఁ దొల్లి యదువంశోద్భూతిఁ
బెంపొందుచున్, సకలక్ష్మాసురులం గరం బిపుడు శ్రీనంద్యాల
కృష్ణక్షితీంద్రకరాబ్జాన్వయసంభవంబుకతనం బ్రద్యుమ్ను
లం జేయుచుం, బ్రకటం బయ్యెడు దానవారి యవతారం
బొంది ధాత్రీస్థలిన్. 90

చ. కలన నృసింహకృష్ణుఁ డతికౌశలతన్ జళిపించుఖడ్గ మ
గ్గలికఁ దటిల్లతల్ వెడలఁ గ్రాయు "నరాతినరాధిపుల్మనన్

వలసిన వీనిఁ గైకొనుఁడు వక్త్రములం” దని పండుఁబూరిపు
ల్లలు వెదచల్లెనో యనుతలంపులు చూపఱకుం జనింపఁగన్.

క. బల్లిదుఁడు కృష్ణభూపతి
వెల్లుగ జళిపించువాలు వెనుధాకకు భీ
తిల్లినఁగవాఁ డడవిని
భిల్లవిలాసినులచూపు బెళుకుల కులుకున్. 92

చ. పొలుపుగ నారసింహనృపపుంగవుకృష్ణుఁ డనంతవైభవో
జ్జ్వలుఁడు ప్రతాపకుంకుమపుఁజర్చలఁ బాండుయశఃప్రసూన
పూజల నలరించు విశ్వమును జక్రి విరాడ్తనువౌటఁజేంగియా
బళి యది వో మహాద్భుతపుభక్తి మనంబున నెన్ని చూడఁగన్!

చ. సుమధురమూర్తిఁ గృష్ణవిభుఁ జూడనియింతు లెటన్న నంద్రు
గా, ని మది యొకింత చేర్చి యతనిం గనుఁగొన్న తువర
సుధాంశురూపము ప్రియ మన్న వారు మఱి భావజు వే
లనువారుఁ గల్లు ట,బ్ర మిదియ సాక్షి యానృపతి రాజ
మనోజులరూపువాసికిన్. 94

మ. అవనీకాంత కరంబు రంజిలెడు నంద్యాలాధిపుం గృష్ణపా
ర్థివునిం జేరి సదా యనంతవిభవాధిక్యంబుసొంపుఁ వరా
హావసతౌ-శలజృంభణంబుఁగులగోత్రౌన్నత్యముఁ మానసో
త్సవ మైనట్టియనేక పావనగుణోదారత్వముం గల్గుటన్. 95

సీ. శ్రీవిష్ణుభజనైకశీలుం డలోలుండు
వైదికమతరక్షణావరుండు
నెఱబంటుతనమున మెఱయుఁ [1]జోదులయందు
గజహయారోహవిహారుండు

---

1. బోరులయందు.

కీర్తిప్రియుండు సంగీతసాహిత్యాది
సకలకళావిచక్షణుఁడు రసికుఁ
డీవిపట్టునఁ గొంచెమెఱుఁగఁడు తగవరి
కల నైన నెఱుఁగఁడు కల్ల లాడ
తే. ధీరుఁడు గభీరుఁ డుచితవిహారుఁ డార్య
వర్తనుఁడు శరణాగతవత్సలుండు
శేషునకు నైన వర్ణన సేయ వశమె
యనఘు నంద్యాలకృష్ణధరాధిపతిని. 96

షష్ఠ్యంతములు

క. ఈదృశగుణరమ్యున క
న్యాదృశధరణివరదురభినయసామ్యునకున్
వైదికపథరతునకు న
లాదికనృపనయతిరస్క్రియాదక్షునకున్. 97

క. ఆధునికరామభద్రున
కాధిక్యచణాహనక్రియారుద్రునకున్
మాధవపదపద్మసమా
రాధనవిధిసాధితావిరతభద్రునకున్. 98

క. జయలక్ష్మీపరిణయసహ్యా
దయకీర్తిసతీసమర్పితస్ఫుటతేజో
మయహారిద్రాక్షతసం
చయమధురితదిక్పురంధ్రిజననిటలునకున్. 99

క. దానోదకధారామహి
మానారతశతలీకృతాంగణభూభా
గానుష్ఠితయాచకసం

తానాకించన్యజన్యతాపకుతికిన్. 100

క. ఇభకర్ణతాళవృంత
ప్రభవానిలసుఖితపరన్నృపప్రహితసువ
స్తుభరవహాజనసమాగీ
ర్ణభవనగోపురబహిర్ధరాభాగునకున్. 101

క. శ్రీనంద్యాలనృసింహ
క్ష్మానాథతనూజునకు సమంచితవిభవ
శ్రీనవ్యబిడౌజునకును
దానకళాతులితదైవతక్ష్మాజునకున్. 102

క. ఆత్రేయమానిగోత్రప
విత్రునకు విరోధిమదలవిత్రునకు దిశా
జైత్రునకు లోచనోత్సవ
గాత్రునకును గొండమాంబికాపుత్రునకున్. 103

క. విశ్రుతతిరుమలతాతా
ర్యశ్రేష్ఠాన్వయసుదర్శనాచార్యతనూ
జశ్రీనివాసగురుచర
ణాశ్రయణసమార్జితాఖిలాభ్యుదయునకున్. 104

క. జిష్ణుయశోధిక్షేపణ
ధృష్ణుమహాశౌర్యపద్ధతీఖేలునకున్
వైష్ణవమతశీలునకున్
గృష్ణమహీపాలునకును గృతిలోలునకున్. 105

వ. అభ్యుదయపరంపరాభివృద్ధియు, నాయురారోగ్యసమృద్ధియు
నగునట్లుగా నాయొనర్పంబూనినకళాపూర్ణోదయంబనుమహా
ప్రబంధంబునకుం గథాక్రమం బెట్టి దనిన: 106

శ్రీరస్తు

# కళాపూర్ణోదయము

## ప్రథమాశ్వాసము

### కథారంభము



ద్వారకావర్ణనము



లకు నాకరమై వి
ద్యాలతలకు నాలవాలమై హరికి సదా
[1]కేళీభవనంబై మహిఁ
జాలఁగ ద్వారవతి యొప్పు సౌభాగ్యములన్. 1

ఉ. తోయధియంకభాగమునఁ దోరపుఁ బెంపులతోడఁ దత్పుర
శ్రీ యతఁ డూర్మిహస్తములచేఁ దను నిట్టటు ముట్టి లాలనల్
సేయఁగ నొప్పు నంగగుణలీలల నెంతయుఁ బెద్ద యయ్యె "నే
ప్రాయము లైనఁ దండ్రి యెడఁ బట్టరు వేఱొకరీతి రాజనుల్."

చ. సుచిరవస్తుసంపదల సొంపునఁ బెంపు వహింపుచున్నయ
ద్వారపురి యాత్మసామ్యపువివాదముఁ దీర్చుకొనంగఁ బిల్చుని
ర్జరనగరిన్ సువర్ణమయసౌధకరప్రసరంబుచేత నం
బరము గ్రహించి భూరితరపౌరజనాదరగౌరవంబుచేన్. 3

1. కేళీసదనం.

చ. అహిమకరప్రచారసుదురాసదమై నిబిడాంధకారసం[బుచే
న్నహనముపోల్పఁ దెల్పుచుఁ దనర్పఁ సముద్రమహోదకం
బహిరభివేష్టితం బగుచు భాసిలుఁ దత్పురికోటమిక్కిలిన్, మ
హిమను జక్రవాళగిరిమాడ్కిని జూడ్కికి వేడ్కసేయుచున్.

చ. నలుగడలందుఁ గంబము లనం దగి రైవతకాదిపర్వతం
బులు దయికప్పుతాచలుదపోలికి నింగియు నందుఁ జిత్ర భం
గులు దచరించుసౌధమణికూటమరీచులు నొప్ప నొప్పు మి
క్కిలిఁ బురలక్ష్మి కొల్వుచవికెం గొలువున్నగతిన్ శుభస్థితిన్.

చ. కొలఁదికి నెక్కుడై పసిఁడికోటలు మేడలు గోపురంబులుం
గొలువఁగ వచ్చునప్పురముకోటలు మేడలు గోపురంబులున్
జలనిధితుంగభంగచయసంగతతత్ప్రతిబింబసంతతి, చ్ఛలమున
నంత మ్రొక్కుఁ ధరఁ జాగిలి యీడనువారు చిన్నవోన్. 6

ఉ. శైవలనీలముం గమలశాలియు నైనయగడ్తనీరు ప
ద్మావళి ప్రాంతతోడికరకంచుగ నొప్పుచుఁ గోట శాటిలా
గై వలలంగ హర్మ్యకనకాంశునికాయము పేరఁ దత్పుర
శ్రీ విలసిల్లు నభ్రచరసింధువు మౌళికి మల్లెదండగన్. 7

చ. విలసితపచికాయతరవిప్రతిబింబమిషంబునన్ మహా
జలనిధి లక్ష్యపార్శ్వశయచక్రిపయిం జెయి సాఁచియొప్పు సం
ధ్యలఁ బురలక్ష్మిధర్మవిధు లన్నియు "నోజలపుచ్చుకాయ" గా
వలయు విడం దతండు రసవత్పరిఖామిష బాహుబంధమున్. 8

చ. అగణితలీల నప్పురమునందు విరాజిలుచుండు నెంతయున్
మృగమదలేపపంకముల మేలిమికోటలుఁ బుష్పదోఁటలున్

నిగనిగ మన్విటంక[1]ములు నీలపుమేడలుఁ బైఁడిగోడలుం
బగడపుటంచుపాంకముల పచ్చలతిన్నెలు వింతపన్నెలున్. 9

లయవిభాతి.—

అలికులము నీలములచెలువము వహింప నవ
దళములు హరిన్మణులపొలుపునఁ దలిర్పం
దలిరుగమి కెంపులుగఁ బలుదెఱఁగుక్రొవ్విరుల
విలసనము ముత్తియపుగుళికలకుఁ దక్కుం
గలమణులకుం బసిఁడికళుకులకు నీడగుచు
వెలయఁగఁ బరాగములు లలితపువితానం
బులుగ గృహముఖ్యములచెలువు ప్రతిబింబములు
బలెఁ బురమునద్దెసలఁ బొలుచును వనంబుల్. 10

చ. "అనుపమితస్వవాద్యనివహంబులతో సరిమ్రోయుటల్ సహిం
పనియదిగ్గై పురం బెదురుపోఁజులు దీర్చెనొ మచ్చరంబునన్
వనధి"కనంగ నయ్యుపవనంబులు పొల్చు మిళిందబృందముల్
ఘనమకరాకృతిం దనర గొప్పలఁ జింద మరందబిందువుల్.

చ. కొలఁదికి మించు కెంజిగురుగుత్తుల మొగ్గలఁ బుష్పగుచ్ఛకం
బులఁ బువుఁదేనెఁ బుప్పొడులఁ బూపలఁ బిందెలఁ గాయలన్
ఫలం,బుల నెపుడున్ సమగ్రపరిపూర్తి వహింపుచుఁ దద్వన
వ్రజం, బెలమి రహించు నందనసమృద్ధికిఁ గోటిగుణాధికంబు
గన్. 12

శా. చాతుర్యాధిగతాఖిలశ్రుతిచయుల్ షడ్దర్శనీపారగుల్
శ్రౌతస్మార్తవిధిప్రసిద్ధపదవీసంచార[2]పీలాధ్వగుల్

---

1. ముల. 2. సన్మార్గణుల్.

చేతో నామవిలోచనాచరితలక్ష్మీనాథసంజ్ఞాదిమ
జ్యోతిర్నిత్యనికేతు లప్పురములో నున్నట్టియుర్వీసురుల్. 13

శా. నానాయుద్ధవిహారశూరులు గుణానందజ్జయశ్రీనఖాం
కానూనభ్రమదాయుధవ్రణికిణోదంచచ్ఛరీరుల్ సదా
దానప్రౌఢియశోవిశేషజితమందారు ల్గభీరు ల్మహామానాథా
రులు రాకుమారు లతిభూమర్మ మింతు రవ్వీటిలోన్. 14

చ. తమతమపెద్దవారు మును దాఁచినద్రవ్యము లున్నయట్ల
యుం,డ మితము లేక యెప్పుడుధనంబులు తారు గడించి
యుర్వి ని,త్యము నమితంబుగా నవనిధానము లున్నచు
నప్పురంబులో, నమరెడుకోమటుల్ నగుదు రల్లకుబేరు నిక్షి
శ్వరత్వమున్. 15

క. ద్విజులను శాస్త్రనియుక్తిని
భజియించుచు నిండ్ల సకలభాగ్యవిభవ మ
క్కజమై తనర సుఖింతురు
సుజనులు తత్పురములోనిశూద్రులు నెమ్మిన్. 16

క. ఎప్పట్టున ఘనసారపుఁ
గుప్ప లగుగజాశ్వసుభటకోటులచేతం
గప్పురపుఁగ్రోవి యనఁ దగి
యప్పురము కరంబు వెలయు నవనీస్థలిపై. 17

బంధుకము:—

అపదాగఁ బిడికిట నడఁగెడునడుముల్
హస్తిసమానపుయానములున్

గురుజఘనములును గుచములభరముం
గొప్పులగొప్పతనంబులు మే
గరగరికలు సిరి గలనగు మొగముల్
కల్కి మెఱుంగుఁగనుంగవలున్
ఓరయఁగ వెలపడఁతులు విటధనములు
దోఁతురు చొప్పడ నప్పురిలోన్. 18

చ. అమరఁగ నింతయిం పొసఁగు నందు విటాలికి వేశవాటిహా
ర్మ్యములు విమానమానహరహారిశిరోగృహభాగభోగభా
గమరభుజంగసంగహృదయంగమరంగదనంగసంగర
క్రమరమణీమణీమణితకల్పన నేర్చినపారువాలచేన్. 19

ఉ. మాటలు వేయు నేటికి రమావరుఁ డుండఁ బదాఱువేల పై
నూటెనమండ్రు భార్యలు దనుం బరిపూర్ణరతోత్సవంబులన్
గాటముగాఁ దనర్చుకుతుకంబు[1]లఁ గొల్వఁ గడున్ సుఖించు నే
నాఁట నెఱుంగు నివ్విలసనంబు లతం డలతెల్లదీవిలోన్? 20

ఉ. అందును వీడు వా రనక యందఱు ధర్మధురీణు లైనవా
రందఱు శుద్ధభాగవతు లందఱు వేదనిరూఢి నున్నవా
రందఱు సాత్త్వికప్రవరు లందఱుఁ దత్త్వ మెఱింగినట్టివా
రందఱు సత్కృపానిరతు లందఱుఁ బావను లెన్నిచూడఁగన్.

కలభాషిణి

క. ఇట్టట్టన నేటికిఁ ద
త్పట్టణమున నున్నయట్టిప్రజ లేజాతిం
బుట్టిన వారలు వంద్యులు
గట్టిగఁ దద్విమతి నెల్లకలుషము వాయున్. 22

1. నఁ.

క. అందోకనటముఖ్యునిప్రియ
నందన శైశవమునంద నానాగుణరే
ఖం దనరారుచుఁ గ్రమమున
నందంబుగ యౌవనోదయముఁ బ్రాపించెన్. 23

క. కలభాషిణి యనుపేరా
వెలఁది మును వహించు సహజవిలసత్కలభా
షలకుఁ దగఁ జాల దిప్పుడు
కలికితనముఁ జతురతయును గలపలుకులకున్. 24

వ. ఆసమయంబున. 25

క. బాలిక కేళిక తాలస
తాలసపచిరావతరణతరుణిమతరుణీ
లోలాలసాలసవిలస
నాలోకనములు విటాళి నట్టిటు చేసెన్. 26

ఉ. కూఁకటివేణితోఁ గుచులు గూడకమున్న కుచప్రరోహముల్
పోఁకలతోడిసామ్యమును బొందకమున్న నితంబసీమకున్
ప్రేఁకఁదనం బొకింత ప్రభవింపకమున్న ప్రసూనబాణుఁ డ
జ్ఞాఁకలఁ బెట్టెఁ దా [1]నరవనామెత బాలికకై విటావళిన్.27

చ. తనదుమెఱుంగుఁజెక్కుఁగొలు దాఁకఁగనీక మొగంబునాఁపుచుం
జనుబొగడల్ నఖాంకలనఁ జక్కిలిగింతలు వోవ లోఁగుచున్
మనసిజు మించుభీతియును నానయుఁ బూనుచు నీమృగాక్షి
యిం, పొనరుచు నున్నఁడో కొ? యని యువ్విళులు గుదు
ర త్తరిజ్ఞ విటుల్. 28

1. నటవనావెలబాలిక.

క. తొలుఁబ్రాయపుమగకోవమల
తలఁపుల తమకములు మిగులఁ దను నెమకొనఁగన్
జలజాక్షిజవ్వనము కడు
వెలసెఁ బ్రతిక్షణము వింతవింతగ నంతన్. 29

తే. మొదల బలు రేఖ గలదఁట; యదియుఁ గాక
వయసు క్రొత్తఁట; వెలయాలివంగడ మఁట;
వనితచక్కఁదనంబును వన్నెలాఁడి
తనముఁ గల్కితనంబును దరమె పొగడ? 30

సీ. మెఱుఁగుటద్దముమించుమించు బాగుల నింపు
నింపుచక్కనిముద్దునెమ్మొగంబు
నవచంద్రికలనవ్వు నవ్వుతీవులఁ జూపు
చూపులచొక్కంపుసోయగంబు
నారూఢిఁ బలుమాఱు మారువిండ్లకు నేర్పు
నేర్పుకన్బొమదోయి నెఱతనంబు
కటికిచీఁకటి [1]కప్పుకప్పు పూనిక కొప్పు
కొప్పు తోరంపు[2]జక్కవజోడంగు
తే. గుబ్బపాలిండ్లు లేఁగౌను గొప్పపిఱుఁదు
బాహులతికలు మృదుపదపల్లవములు
బంగరుసలాకపస భంగపఱచు మేనుఁ
గలిగి చెలు వొందుచుండు నాచెలువ మిగుల. 31

చ. బెళుకులు చిమ్ముచుం గలికిబిత్తరిచూపు సరత్నకుండలాం
చలకషణోజ్జ్వలత్వముపసల్ నెఱపన్ జళిపించుచున్ భుజం

1. కప్పుఁగప్పు. 2. జక్కువ.

గులహృదయస్థలుల్ వాడిచి కొంచక తోడన పోటుగండ్లఁ
దూ,ఱె లలన "యౌర యొక్కొక తతజెం బువుఁబోండ్లు కటారి
కత్తియల్." 32

ఉ. కీర్తనపాత్రచిత్రమృదుగీతకళాకలనప్రవీణతన్
నర్తననైపుణీలలసనంబున పెంపున నత్యపూర్వని
ర్వర్తితపంచబాణసమరక్రియలన్ హరిణాక్షి యప్సరః
కీర్తిబలేన్ హరింపఁ దొడఁగెన్ విటసంచయచిత్తవిత్తముల్.

ఉ. ఆరమణీశిఖామణి మహావిభవంబున నొక్కనాఁడు సిం
గారము లెంతయున్ మెఱయఁగాఁ జెలికత్తెలతోడఁ జేటికా
వారముతోడ వింతచెలువం బనయంబుఁ దలిర్పఁగా వసం
తోరువిలాసభాసురపురోపవనం[1]బున కేఁగి యచ్చటన్. 34

సీ. "క్రొన్ననల్ వలరాచమన్ననల్[2]గర గర
మల్లికల్ గొనియున్న మల్లికలును
సంతానముల కలిసంతానముల యాట
[3]పాటలములు చూపుపాటలములు
తీవి చేకొన్న పూఁదావిచేఁ బథికాంత
రంగముల్ నొంచునారంగములును
మూఁదు మేలైనబంగారుమేడలఁ బోల్ప
భంగి యై మించుసంపంగిగములు

తే. మంజులములై కనంబడువంజులములుఁ
గుందములును వాసంతికాబృందములును
గేసరములును నవనాగకేసరములుఁ
గాంతలార కంటిరె కడువింత" లనుచు. 35

1. బుల. 2. గనఁగర. 3. పాటలములో సూపు.

క. "పూఁబోఁడి యొరసికొని చనఁ
గాఁ బయ్యెద యొడిసి పట్టఁ గనుఁగొంటె చెలీ
లేఁబొన్నను; బళిరా యిది
గోఁ బురుషాహ్వయము నిలుపుకొనుసమయంబున్. 36

క. "ఆలికుచంబులు నాగ
య్యాలికుచంబులును వాదు లాడెడురొద గాఁ
బోలు! ననఁ దనరె నూపుర
కోలాహలచకితకీరఘోషము; వింటే." 37

క. "లేఁగురువలిచే [1]ముంగలి
పూఁగొమ్మలు పాయవడుచు భుజగతి నెఱపం
గాఁ గురువక మిదె తివిరెడుఁ
గాఁగిటికిఁ నీకుఁ దగునె కైకొనమి చెలీ!" 38

చ. "పయఁటచెఱంగు శాఖ యనుపాణిఁ దెరల్చుచు నోలతాంగి
తాఁ, బ్రియమున భృంగకైతవనిరీక్షణముల్ కుచకుట్మలం
బులం, గయికొన నొప్పుపల్లవశిఖామణి మామిడి రిత్త
వోవునే?, భయ మిఁక నేల? యే మిచటఁ బత్రముఁ బుష్పము
వేడ్క నందితో!" 39

వ. అని యీప్రకారంబుల మఱియుఁ (దానుం జెలికత్తెలు)
నొండొరులతో ననేకవిధసరససల్లాపంబులం బిసాళింపుచు
నింపు దళు[2]కొత్తఁ గ్రొత్తవిరిగుత్తులచేత నేత్రపర్వం బగు
చున్న యాపువ్వుఁదోఁటఁ దఱియం జొచ్చి. 40

సీ. అరవీడుకొప్పుల విరులవాసనకుఁ దో
రపుటూర్పుఁదావులు ప్రాపు గాఁగ

1. ముందరి. 2. కొత్తు క్రొత్త.

నడలమంచతఁ బెంచుబడలికలకుఁ బిఱుం
దులప్రేఁగుఁ జనుప్రేఁగుఁ దోడుపడఁగఁ
జెమటచిత్తడిఁ గ్రొత్తచెలువు గాంచినవళుల్
మొలనూళ్లకాంతికి బలిమి నొసఁగఁ
బయ్యెద లాడింపఁ బ్రభవించుకంకణ
నాద మందెలమ్రోఁతఁ బ్రోది సేయ
తే. మిగుల రొదగాఁ గికాకిక నగుచు రతుల
యాయములు సోఁక నెద్దియే నాడుకొనుచు
సందడించుచుఁ బుష్పాపచయము సలిపి
యంతఁ గడఁగిరి డోలావిహారములకు. 41
వ. అప్పు డాకాశమార్గంబునం గృష్ణసేవాలాలసుం డగుచు
నేఁగుదెంచు నారదమహామునీంద్రుని మణికంధరుం డను
గంధర్వకుమారుండు గానవిద్యావిశేషాభిలాషంబులం గొ
లిచి వచ్చుచు నుండి యమ్మగువలప్రగల్భతాగరిమకు వెఱఁ
గందుచు శతానందనందనున కిట్లనియె. 42
మ. "తమిఁ బూఁదీఁగెలఁదూఁగుటుయ్యెలలఁ బంతా లాడుచుం
దూఁగు నా, కోమరుం బ్రాయపుగబ్బిగుబ్బెతలయంఘ్రుల్
చక్కఁగాఁ జాఁగి మింటిమొగం బై చనుదెంచుఠీవిఁ
గనుఁగొంటే దివ్యమౌనీంద్ర నా,కమృగీనేత్రలమీఁదఁ
గయ్యమునకుం గాల్ [1]దాఁచులా గొప్పెడున్. 43
వ. అనుటయు నారదుండు. 44
మ. "బళిరా సత్కవి వౌదు [2]నిక్కమతగ౯ భావించి నీ వన్న యా
యెలప్రాయంపుమిటాకికత్తెలబెడం గేనెందునుం గాన వా

1. చాఁచు. 2. నిక్కము.

రలడోలాచలనోచ్ఛలచ్చరణముల్ త్రైవిష్టపస్త్రీలయా,దలఁ
దన్నం జనునట్లు మించె ననినం దప్పేమి? యొప్పేయగున్."

క. అని పలుకునపుడు నికటం
బున నలకూబరుఁడుఁ దాను మొగులుమఱుఁగునన్
ఘన మగుదివ్యవిమానం
బునఁ జనుచున్ రంభ విశదముగ నది వినియెన్. 46

ఆ. విని యొకింత కనలి మన సొకలా గైన
నతని నారదుఁ డని యాత్మ నెఱిఁగి
భావవికృతి యెఱుకపడనీక యడఁచి య
మ్మగువ తనదుప్రియుని మొగముఁ జూచి. 47

క. "ఆలించితే? యాపలుకుల
పోలికఁ దెలియంగఁ గలహభోజనముని గాఁ
బోలు! మన మితనిఁ గని యుచి
తాలాపము లాడి చనుట యభిమత" మనియెన్. 48

ఉ. నారదుఁడుం దదీయవచనంబు వినంబడు దిక్కుఁ జూచె "నె
వ్వారలొ మాట లాడుచును వచ్చుట తోఁచె" నటంచు [1]నచ్చటన్, వారివిమానరత్నమును వారిధరంబుమఱుంగు వాసె బాలారుణభానుబింబ ముదయాద్రిమఱుంగును బాయుచాడ్పునన్. 49

క. ఆరంభయును గుబేరకు
మారుఁడు నవ్వేళఁ దమవిమానోత్తమమున్

1. నంతటన్.

నారదమౌనీంద్రుపదాం
భోరుహముల క్రిందిచాయఁ బో నిచ్చి తగన్. 50

ఆ. పారిజాతకుసుమసౌరభంబులు వెద
చల్లుతమశిరంబు లల్ల నల్ల
నద్దుచును దదీయ మగుపాదయుగళి వా
సించి రంతఁ గొంతసేపు నిలిచి. 51

క. ఆవర మౌనియు "నొండొరు
పై వదలనిప్రేమ గలిగి భాసిలుఁ" డనుచున్
దీవించె రంభ యపు డా
దైవతమునివర్యుఁ జూచి దరహాసముతోన్. 52

క. "ఓమునివర! మీదీవన
చే మాపైఁ బ్రేమ కొంత చెడక నిలుచునో
యేమో కాని యిఁకన్ నర
భామలపొందుముల కితఁడు భ్రమయక యున్నే." 53

వ. అని తన మనంబునం గలయీరసంబు సైరింపం జాలక యెక్కసక్కెంబుగా నాడుమాటలకు సందియంబు నొందుచు "నిది యేమి యనుట; వివరింపు" మని మునివరుండు నిలిచి యడుగుటయు "దేవరకుం బ్రస్తుతగమన నిరోధంబు గాకుండ విచ్చేయుఁడు; విమానంబుమీఁదికి రా నవధరింపుఁ; డన్నియు వివరించుచు నరుగుదెంచెద; మహానుభావులం గొంతమేరయైనం గొలిచి వచ్చుట భాగ్యంబు గాదె!" యనుచు శిష్యసమేతంబుగా నతనిం దమవిమానంబునందు నునిచికొని తదలంకారచామరంబులు రెండును విచ్చి పుచ్చుకొని తన ప్రియుండునుం దాను నిరుగెలంకుల నిలిచి యల్ల

నల్లన వీచుచు నప్పుడంతి "మౌనివర్యా! యప్పుడు మీర
లాడోలికావిహారిణులప్రసంగంబున శిష్యుతోడ నేమని పలి
కితి, రది యానతీవలయు" ననుటయుఁ జిఱునగవుతో
నతండు. 54

వ. "బలిరాసత్కవి వాదు; నిక్కమతగఁ భావించి నీ వన్నయా
యెలప్రాయంపుమిటారికత్తెలబెడం గే నెందునుం గాన; వా
రలడోలాచలనోచ్ఛలచ్చరణముల్ త్రైవిష్టపస్త్రీలయా
దలఁ దన్నం జనునట్లుమించె ననినం దప్పేమి యొప్పె యగున్.

క. అని పలికితి నిం దేమై
నను గాని తెలుంగు గలిగినం జెపుమా యో
వనజాక్షి! యింక దాఁపం
బని యేమి మనంబులోనిభర?" మని పలికెన్. 56

వ. అని పలికిన నవ్విలాసిని యతనిం జూచి. 57

క. "మీరలు పెద్దలు త్రైలో
క్యారాధ్యుల రేమి యన్న నంటిరి గా కె
వ్వారలు మాన్చెద? రిట నే
మూరసి యాడితిరొ?" యనుచు నడిగితి ననఘా! 58

ఉ. "ఊహ యెఁనర్పరో? యతిశయోక్తులవర్ణనలందు నిట్టియ
వ్యాహతి చెల్లునంచునో యి టాడితి? రింతియ కాక యేవరా
రోహలు మమ్ముఁ బోలమికి రూఢిగ నిమ్మెయి నున్నయీజగ
న్మోహనమూర్తి యర్థపతిముద్దుకుమారుఁడె సాక్షి" నావుడున్.

ఉ. అల్లన నవ్వుచుఁ మని సురాంగనఁ జూచి "యె టాడు
కొన్ననుం, జెల్లుఁ గదమ్మ నీకుఁ గడుఁ జెల్వోఁడు నిబ్బర మైన
ప్రేమ రాఁజిల్లఁగ నిట్లు వర్తిల్లుటఁజేసి మృగేక్షణ! యైన

నిట్లు రా, వెల్లదినంబులుఁ సవతి యేగతిఁ గల్గునో మీఁదు
గంటివే? 60

క. నినుఁ బోలువనిత నీకును
వనజముఖి యితనిఁ బోలువాఁ డితనికి నెం
దును గల్గి కలఁచునో? యి
ట్టినిగాఢపుముదము సొంపులీవులు చను నే?" 61

క. అనుటయు "నవ్వుల కనినఁ
మునివర మీమాట [1]యి ట్లమోఘం బగునో!
వినలే నిట్టివి మానుఁడు
నను మన్నన చేసి" యనుచు నాతుక మ్రొక్కెన్. 62

వ. అంత నమ్మహామునీంద్రుని యాజ్ఞానుసారంబునం దద్విమానంబు కలభాషిణి విహరించుచున్న యెలదోఁటలోనికిం దిగియె, నట్టి యెడ రంభానలకూబరులు వినయపూర్వకంబుగా నతనిచేత ననిపించుకొని యప్పుడెదుటఁ గాన్పించువాసుదేవుని ప్రాసాద రాజంబునకుం జేయెత్తి మ్రొక్కి తమవిమానంబుతోడ నిజేచ్ఛం జనిరి. కలభాషిణియు నట మున్ను తన కనతి దూరంబున వినంబడువారల సల్లాపంబు లాలకించియుఁ దద నంతరంబ ధగధగితదిగంతరం బగుచుం జేర నేతెంచు విమానంబు నవలోకించియు నాశ్చర్యంబు నొందుచుండి యప్పు డట్లరుగు నలకూబరుని రూపలావణ్యాదిసౌభాగ్యంబు[2]నకు మిక్కిలి మెచ్చుచుఁ దదాలోకంబునం దనియక కొంతమేర తద్విమానంబు క్రిందటిచాయం బూఁ బొదరిండ్ల యారమి

1. యట్ల. 2. లకు.

మఱుంగున వారిసల్లాపంబు లాలకించుచుఁ జని యంత నది మిక్కిలి దూరంబుగా [1]నేఁగుటయుఁ దిరిగి వచ్చుచుఁ దన మనంబున. 63

ఆ. "ఇంత రూపవంతు నెంతయుఁ దనకుఁ గై
వసము చేసికొని యవార్యగర్వ
[2]మతిఁ జెలంగు భాగ్యవతి యాలతాంగి యె
వ్వతెయొకో? మనంగవలదె యిట్లు?" 64

చ. మునుపు నిజేశు నర్థపతి ముద్దుకుమారుఁ డటంచు నానితం
బిని పలుకంగ వింటిని గుబేరతనూజునకుం గరంబు మో
హన యగుకాంత రంభ యని యాడుకొనంగ వినంబడుం
మనంబున నిపు డెన్న నా మెఱుఁగుఁబోఁడియ కావలయుం
నిజంబుగన్. 65

క. ఇప్పు డిది [3]నిశ్చయంబుగ
నప్పరమమునీంద్రుఁ జేరి యడుగఁగ వలయుం
దప్పఁ డతఁ డమరమౌనియ
యప్పటి కప్పటికి వచ్చు యదుపతికడకున్." 66

క. అని చింతించుచు నాయం
గన తా నొక్కతియ యేఁగి కడుఁ జేరువ నా
యనుపమతేజుని నారద
ముని గాఁగ నెఱింగి వినయమునఁ బ్రణమిల్లెన్. 67

వ. ప్రణమిల్లి లేచి విరచితాంజలియై. 68

క. "మౌనీంద్రచంద్ర యిపుడు వి
మానముతో నేఁగినట్టి మహితాత్ములు రం

---

1. నెగయు. 2. మతిచెలంగు భాగ్యవతి యా. 3. నిశ్చితం.

భానలకూబరులే?" యన
నానారదుఁ "డట్లు యగుదు" రని యాయకతోన్. 69

క. "నీ వెట్లెఱిఁగితి చెప్పుమా!"
నావుడు "మీ రాడుకొన వినంబడు మాటల్
భావింప న ట్లయి నా
భావమునకుఁ దోఁచె" ననుచు భామిని పలికెన్. 70

చ. పలికిన "మింట నాడుకొను పల్కులు వింటివా!"యన్న "వింటి
నో యలఘుతపోనిధాన! తనయత్యధికం బగు రూపసంపదం
జెలువుఁడు కైవసం బనుచుఁ జెల్లఁబడిం బచరించి పల్కె నా
కలికి తదుక్తి కోర్వమి ప్రకాశిత మయ్యెను మీవచఃస్థితిన్."

క. అనుటయు మునినాయకుఁ "డో
వనితా! యెట్లోర్వ వచ్చు వలవనిగర్వం
బునఁ గన్న గాన కాడెడి
యనుచితవాక్యంబు లేరి కైనం దలఁపన్? 72

క. తరుణీ! యేరికిఁ జెల్లునె
యరయఁగ నే మింతవార మనుకొన? నిదిగోఁ
బిరువీఁకుగ నున్నది తాఁ
గర మద్భుత మైనసవతికయ్యముచేతన్. 73

క. సవతి యన నింక నొకతె
భువిలోపల వేఱ వెదకఁ బోవలయునె యో
ధవళాక్షి! నీవ కానే
రవె దైవనియుక్తిఁ గొంత ప్రాప్తి గలిగినన్?" 74

క. నావుడు నంతటిరూప
శ్రీవైభవసతికిఁ గాక సిద్ధించునె యా

దైవనియుక్తియు, మాబోం
ట్లెవిధమునఁ బాట్లఁ బడిన నిద్ధపివేకా ?" 75

తే. అనుడు "నామాట కేమి యోయంబుజాక్షి !
రంభ మొదలైన యచ్చరలకు నైనఁ
దక్కువే నీదురూపసౌందర్యమహిమ
లెక్కడే కాక మిగుల నూహించి చూడ. 76

ఆ. అది యటుండనిమ్ము ముదిత నిన్నును జూచి
నట్లు దోఁచుచున్నయది యొకింత
నలిననాభుకొలువునకు వత్తువా" యన
"వత్తు మిమ్ము జూతు వరమునీంద్ర." 77

సీ. అని యింతి పల్కిన ముని పల్కె "నవునవు;
నెలఁత నిన్నెఱుఁగుదుఁ; దలఁచుకొంటి;
మాశిష్యుఁడైన యీ మణికంధరాహ్వయుఁ
డిటఁ గొన్నినాళ్లక్రింపటను గ్రొత్త
గాఁగ హరిం బాడఁ గానంగఁ దా వచ్చి
దండకరూపసంస్తవనరచన
యొనరింప [1]నేకసంథన గ్రహించి పఠించి
నట్టినేర్పరివి గదమ్మ నీవు
తే. పేరు కలభాషిణివి గద బిరుదుచదుర
వగుదు బళిబళి! యిపుడు నీ కది ముఖస్థ
మగుచు నున్నదియే శక్య మగునె చదువ ?"
ననుడు "శక్యంబు గా కేమి" యనుచుఁ బలికి. 78

వ. అమ్మదిరాక్షి మధురగంభీర[2]స్వరంబున నిట్లని చదివె. 79

---

1. ఏకసంతన. 2. స్వనంబు.

దండకము. “శ్రీకామినీకామితాకార, సాకారకారుణ్యధారా నవాంకూరశంకాకరాశ్రీఱరేఖామయూఖాళికిమ్మీరితాలోకనాలోక, లోకైకసంస్తుత్యనిత్యప్రభావా, విభావైభవాధిక్యధిక్కారితానంతమార్తాండకోటీర(క), యాటీకమానామలాస్తంభశుంభద్వ్యశఃపూరకదూర్వారసౌరభ్యమైత్రీపవిత్రీకృతామ్నాయ,వాయుప్రచారా,నిశాపాదితాపారసంసారసంతాపనిర్వాపణా, పాపనిర్వాపణోపాయనామప్రశంసానుభావా, భవాభావలోభాకులీభూతచేతస్సుధీవ్రాతనిర్ణీత సంప్రాప్తసద్భక్తిమార్గైకవిశ్రామభూమీభవత్తత్వరూపా, సురూపావళీదుర్నిరూపస్వరూపా, గురూపాసనాసాదితానారతానన్యసాంకర్యకైంకర్య మాధుర్యధుర్యప్రపన్నా, ప్రపన్నావళీమానసోదస్తభోగాపవర్గాభిలాషా, హృషీకేశ, యీశానవాణీశముఖ్యుల్ సువిఖ్యాత మైనట్టినీదివ్యచారిత్రచారుప్రచారంబు పారంబు ముట్టన్ నుతింపంగ లేరంచు నెంచంగవించుం బ్రపంచస్వభావంబు భావంబునన్ మాన కిట్లేము. నీముందటన్ జాటువాచాటతల్ చూపుచున్నార; మిన్నేరముల్ మన్ననంజేసి సైరింపు మోవాసుదేవా! సదానంద! గోవింద! [1]సేవించు మాపింద వైడెంద మానంద మొందింపనెందున్ విచారంబు లేమిన్, వచోగోచరాగోచరత్వంబు లూహింపలేమైతి; మోదేవ! మీపాదసేవాదరంబున్ మదిం గోరుచున్ వేదవాదుల్ శమాదుల్ కడుం జాల నార్జించి భోగేచ్ఛ వర్జించి నానాతపశ్చర్య (లాశ్చర్య) తాత్పర్య

1. సేవిందు.

పర్యాకులత్వంబునం గైకొనన్, మాకు నేయత్నముల్ లేక యో కృష్ణ! యీ కైవడిన్ మీకృపాలోకసంసిద్ధి సిద్ధించుటల్ బుద్ధిఁ దర్కింప నత్యంతచిత్రంబుగాదే! జగన్నాథ! యీరీతిఁ జెన్నార ముక్తి నైఋషుల్ మిమ్ముఁ గన్నారఁ గన్నారు! మాకన్ను లెన్నంగ నేపుణ్యముల్ చేసెనో యీ విశేషంబుఁ గాంచెన్ విరించోదయస్థాననాభీసరోజా! సరోజాతజాతాండముల్ తండతండంబులై యుండ నొండొండ నీరోమకూపంబు లేపారఁగాఁ దాల్చుటల్ చెప్పఁగా నీవు గోవర్ధనంబెత్తి తంచున్, వరాహావతారంబునన్ ధారుణీచక్రముం దాల్చి తంచున్, మహాకూర్మభావంబునన్ మందరగ్రావమున్ మోచి తంచున్, జగంబుల్ సమస్తంబుఁ ద్రైవిక్రమప్రక్రియావేళఁ బాదత్రయిం జాలఁ బూరించి తంచున్, నుతింపంగ యుక్తంబె? భక్తప్రజాధీన! దీనిన్ వివేకించి లోకంబులోఁ గొంద ఱార్యోత్తముల్ సర్వవేదంబులున్ సర్వవాదంబులున్ సర్వయాగంబులున్ సర్వయోగంబులున్ సర్వమానంబులున్ నర్వదానంబులుం జూడ నీదాసదాసానుదాసాంఘ్రిసంసేవలోఁ గోటికోట్యంశముం బోలఁగాఁ జాలవంచుం దదాచారముం బూని వర్తింతు రత్యున్నతిన్; సత్యసంకల్పనిత్యోదయా! యేము నీ నామమాత్రంబు మానాలుకం జేర్చుటల్ దక్క నొక్కింతయున్ దక్కఁ త్రోవల్(న్) భవన్మాయ దాఁటంగలే, మవ్యయా! భవ్యయోగీంద్ర[1]సాంద్రాదరా కాంక్షితైకాంతసంసేవనా![2]భావనాతీతకల్యాణ నానాగుణశ్రీసముద్భాసితాంగా! మముం

1. సాంద్రాదరా! కాంక్షితైకాంత. 2. భావనాతీత! కల్యాణ.

గేవలంబైనకారుణ్యదృష్టింగటాక్షించి (చు) రక్షించు, లక్ష్మీ
మనోవల్లభా! దేవదేవా నమస్తే నమస్తే నమస్తే నమః.”30

మ. అనియీవైఖరి నంతయుం జదివి “దైత్యారాతి యీదండక
బునకుఁ మెచ్చుచు నిచ్చినట్టిది గదా భూరిద్యుతిఁ నీదుశి
ష్యునికంఠంబున నొప్పునావిమలరత్నోదారహారంబు సన్ముని
లోకోత్తమ!”యంచుఁబల్కిమఱియుంబూఁబోఁడిదానిట్లనున్.

సీ. “పోసఁగ ముత్తెపుసరు లొప్పహాళి(ణి)ంచినలీలఁ
దమలోన దొరయుశబ్దములు గూర్చి
యర్థంబు వాచ్యలక్ష్యవ్యంగ్యభేదంబు
లెఱిఁగి నిర్దోషత నెసఁగఁ జేసి
రసభావములకు నర్హంబుగ వైదర్భి
మొదలైనరీతు లిమ్ముగ నమర్చి
రీతుల కుచితంబులై తనరారెడు
ప్రాణంబు లింపుగాఁ బాదుకొల్పి
తే. యమర నుపమాదులును యమకాదులు నగు
నట్టియర్థశబ్దాలంక్రియలు ఘటించి
కవితఁ జెప్పంగ నేర్పుసత్కవివరునకు
వాంఛితార్థంబు లొసఁగనివారుఁ గలరె? 82

లయవిభాతి:—

చలువ గలవెన్నెలలచెలువునకు సౌరభము
గలిగినను సౌరభముఁ జలువయుఁ దలిర్పం
బొలు పెసఁగుకప్పురపుఁబలుకులకుఁ గోమలత |
నెలకొనిన సౌరభముఁ జలువపసయుం గో

మలతయును గలిగి [1]జగముల మిగులఁ బెంపెసఁగు
మలయపవనంపుఁగోదమలకు మధురత్వం
బలవడిన నీదు మఱి కల దనఁగ వచ్చుఁ గడు
వెలయఁ గలయీసుకవిపలుకులకు నెంచన్. 83

వ. కావున. 84

క. ఊరక యటు మిముబోఁటుల
చేరువఁ జరియింపఁ గనిన సిద్ధింపవె యే
కోరిక లైన నజస్రముఁ
గోరుదు మీవీణ మోసికొని కొల్చుటకున్. 85

సీ. మునినాథ యిటమున్ను వనజదళాక్షుని
యంతఃపురంబున కరుగువేళ
మణికంధరునిఁ బ్రాంగణమున నిల్పి మీ
వీణియ మీకరలే పాణిఁ బూని
పోవఁగాఁ జూతు నప్పుడు 'దాని నేఁ బుచ్చు
కొని కొల్చి వత్తునో?' యని తలంతు
దేవరచిత్తంబు దెలియమి 'నట్లు సే
యఁగ నేమి తోఁచునో?' యనుచు వెఱతుఁ

తే. గరుణ నంతమాత్రపుటూడిగంబు నాకు
ముదల వెట్టుఁ డటంచుఁ గేల్మోగిచి మిగుల
వినయ మొప్పఁగ నాయింతి వేఁడుకొనియె
నతఁడు "నట్ల కాని" మ్మని యనుమతించె. 86

చ. అనుమతించుటయు "నిమ్మహాత్ముని యనుగ్రహం బీపాటి కలిగె; దీనం జేసి నావాంఛితంబును సఫలం బగు" నని సంత

1. జన.

సిల్లి రంభానలకూబరులవలనఁ గడపట వినంబడినవాక్యం
బొకటి దలంచుకొని, యది తెలియుటకుఁ గృతాంజలి నై
వినయభరంబునఁ గొంకుచు దానను మణికంధరుండు రహస్య
శంక నెడగలుగఁ జనఁగ నమ్మహాముని కిట్లనియె. 87

సీ. "మహితాత్మ! మీర లిమ్మహి నుండ సంకోచ
పడి యేమొ మిక్కిలి పొడవు చనఁగ
నీక విమానంబు నిలచేర్పునన కొంత
మేరఁ బోనిచ్చె నమ్మిథున మిప్పు
డేను వృథాభ్రాంతి నింతనంతను దాని
వెంబడిఁ జని పల్కు వింటి నొకటి
వినుఁ డది యర్థేశతనయుఁ" 'డోయబల! యి
న్నారదుమాటలు నడుమ వేఱ

తే. పొడమె నేమయ్యె నలకళాపూర్ణుసుద్ది
కడమ చెప్పు' మన్న రంభ "యప్పుడ తెలుపనె
నీకు మఱి చెప్ప రాకుంట! యీకథయును
నీకు నాతోడ [1]సుమ్ముబ్బనీకు" మనియె. 88

తే. ఏ నెఱుఁగ వేడ్కపడుచున్నదాన నోత
పోధనోత్తమ! యాకళాపూర్ణుఁ డనఁగ
నెవ్వఁ డాతనిసుద్ది ము న్నేమి చెప్పె?
నెద్ది చెప్పరా దనియె నాయిగురుఁబోఁడి. 89

వ. ఇది యానతీవలయు ననిన నతండు వెఱఁ గంది "యిది
యంతయుఁ గడు నపూర్వంబు దీనిఁ దెలిసెదం గాక! యని
కొంత[2]దవ్వు నిశ్చలుం డగుచు విశ్వప్రపంచంబునం గల

1. సుముసుబ్బనీకు. 2. తడవు.

భూతభవిష్యద్వర్తమానవర్తనంబు లన్నియు విమర్శించి
తత్ప్రకారంబుఁ గాంచి కలభాషిణిం జూచి "యారంభ
ప్రియునకుఁ జెప్పరా దనినకథ యత్యపూర్వంబు ; నాకునుం
జెప్పఁ దగ" దని పలికిన. 90

తే. "అనఘ చెప్పరానికథాంశ మట్లు యుండ
నిమ్ము నలకూబరునకు నయ్యింతి యేమి
కారణమ్మున నీప్రసంగము వచించె
దెలుపుఁ"డన దాని కిట్లని తెలిపె మౌని. 91

సీ. "ఈరంభయును వీఁడు నేవేళయును రతి
క్రీడాపరాయణుల్ కేవలమును
వీరి నొండొరుహాసవీక్షణోక్తులుఁ దక్కి-
నట్టిచేష్టితములు నెట్టివైన
మన్మథోద్దీపనమహిమఁ జొక్కించు నొ
క్కొకప్రేమచొప్పిది యుర్విఁ గలదు
కావున మము నేఁడు కనుఁగొనుటకుమున్ను
రంభ నవీనమార్తాండుపంష

తే. శుభ్రఘనరేఖ వర్తిల్లఁ జూచి నగుచు
బ్రహ్మతో నున్నశారదారమణిఁ బోల్చె
ధనదసుతుఁడు నమ్మాటకుఁ దరుణిమోవి
దంతశిఖనొత్తె నత్తఱిఁ దనవుతమిని. 92

క. ఒత్తుటయు నెందుఁ గలుగని
క్రొత్తతెఱంగునఁ జెలంగుకోమలకలవా
గ్వృత్తి యపు డొకటి బహువి
చ్ఛిత్తిక మై దానికంఠసీమం బొడమెన్. 93

ఉ. ఏయెడ నెన్నఁడుం గననియింపులు గుల్కెడుతద్దళస్వనం
బాయతమైనకౌతుకము నద్భుతముం మొలపింప "నేది యే
దీ! యిదిచాలఁ గ్రొత్త బళి! యింకొకమాఱిఁక నొక్కమా"
అటం,చాయలినీలవేణి నలకాధిపసూనుఁడు వేఁడె వేఁడినన్.

క. "నాచేత నింకఁ గా దిది
యోచెలువుఁడ" యనఁగఁ "గాక యున్నం విడ నే
నోచెలువ" యనఁగ వచనా
గోచరసల్లాపరసము కొం తపు డొకవెన్. 95

వ. అంత నక్కాంత కాంతునికి సంతసంబుగాఁ గొంతకొంత తత్ప్రార్థనంబు సఫలంబు చేసె; నతం డంత "నింతకు మున్నిది యెన్నండును విన్నయది గా; దిప్పు డెప్పగిది నొదవెఁ జెప్పు" మని గ్రుచ్చి గ్రుచ్చి యడుగ నిది నేఁడు నేర్చినది కాదు; తడవులనుండి నే నెఱింగినదియ; యొక్కకారణంబున నిది యెఱుకపఱుపక నెఱయ మఱచియు నేఁడు బాలభానుపాండుమేఘసంసర్గవిశేషవీక్షణంబునం [1]దలరిచిన మానసంబులోనన పూనియుండి యిప్పటికినీదుండగంబువలనఁ గలఁగి వెలివింయ నిచ్చితి" నని పలికిన నతం డి ట్లనియె. 96

తే. "ఏమికారణమున దాఁచి తిన్నినాళ్లు ?
తరుణి యెఱిఁగింపు" మనుడు నే తత్ప్రసంగ
మునఁ గళాపూర్ణుకథలు వచ్చునో యనియెడు
తలఁపుచే దాఁచితి నటంచు వెలఁది పలికె. 97

సీ. పలికి "యోహారపహాభరణ! తత్కథలు వ
చ్చిన నేమి ? యంటేని వినుము తెలియ

1. దలంపైన.

నాకథ లీఁకఁ జెప్పినట్టివారును విని
నట్టివారును ధాత్రియందుఁ బుత్ర
పౌత్రప్రపౌత్రాదిబహుసంతతిని దన
ర్చుచుఁ జిరకాలంబు ప్రచురసంప
దభివృద్ధిశోభితశుభసౌఖ్యములు గాంతు
రనుమాట యున్నది యాదియంద

తే. యేను నీ కది చెప్పిన వానికొఱకు
నవనిఁ బుట్టంగ వలయునో యని వెఱచెదఁ
బ్రాణవల్లభ! యవి తావకాంగసంగ
సౌఖ్యమునఁ బేర్చునాకు నిష్టంబు లగునె? 98

తే. 'అదియు వింటివి గద' యని యనియెదేని
యేను వినినట్టిపిమ్మట నిట్టిమాట
పలికె నొక్కయమోఘవాగ్విలసనుండు
కావున వచింప విన నీకఁ గాదు [1]నాకు. 99

వ. అని చెప్పె" నని చెప్పి నారదుండు. 100

తే. అతివ విను రంభకును గలయట్టి భయము
నాకుఁ గల్గుటఁ దత్కథ నీకుఁ జెప్పఁ
గూడ దట్లయ్యు మిక్కిలిఁ గువలయమున
వెలయఁ గల దది వెలయుత్రోవలును గలుగు. 101

వ. అది యట్లుండె రంభానలకూబరు లవ్విధంబున సల్లాపం బొన
రించినయనంతరంబ తద్విమానంబు మత్సమీపంబున కేతేర
మీఁదోలికాప్రసంగంబులు వడియె" నని కలభాషిణికిం జెప్పి
యప్పుడు తద్వనలక్ష్మీవిలోకనకౌతుకంబున నెడఁగాఁ జని

1. నీకు.

యున్నమణికంధరుం బిలిచి "యంబుజాక్షునికొలువువేళ దప్ప కుండం బోవలయు ర" మ్మనుచు నచ్చటం గదలి చనియెం గల భాషిణియు నంతఁ దనుఁ జేర వచ్చిన నెచ్చెలులుం దానును నిజగృహంబున కేఁగి వేగంబ కొలువుసింగారంబు సంఘ టించుకొని కృష్ణునగరి కరిగె. 102

శా. శ్రీనంద్యాలపురాంక వాగ్విభవలక్ష్మీనాథపర్యంక సు
జ్ఞానశ్రీమిథిలేంద్ర సూనృతవచస్సంధాహరిశ్చంద్ర వి
ద్యానైపుణ్యసముత్కటోత్కటికవివ్రాతవాచాలితా
స్థానీమందిర యిందిరారమణసత్పంకేరుహేందిందిరా! 103

క. అంభోనిధిసాధారణ
గాంభీర్య యరాత్యసుప్రకంపనచయకు
క్షింభరితరవారిమహా
కుంభీనసవర్య సమరగుంభుజశౌర్యా. 104

మాలిని. శేషసుభాషణ శీలవిభూషణ సేవకపోషణ చిత్తరిపూ
న్మేషనివర్తన నిర్మలకీర్తన నిత్యసువర్తన నీతికళా
పోషవిచక్షణ పుణ్యవిధిక్షణ భూసురరక్షణభూరిమన
ద్వేషణశాసన ధీజలజాసన దీప్తివిభాసన ధీరమతీ! 105

గద్య. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళి యమరనార్యతనూభవ సౌజన్య[1]జేయసూరయనామధేయ ప్రణీతం బైన కళాపూర్ణోదయం బనుమహాకావ్యంబు నందుఁ బ్రథమాశ్వాసము.

---

1. గేయ.

శ్రీరస్తు

# కళాపూర్ణోదయము

## ద్వితీయాశ్వాసము



ఖండాద్రిహిమాచల
మేఖలికావిలసదపరిమితహయరింఖా
లేఖితజయలాంఛన నృప
శేఖర నంద్యాలనారసింహునికృష్ణా. 1

వ. అవధరింపు మవ్విధంబునం గలభాషిణితోడ సంభాషించి యరుగుచు నారదుండు తనమనంబున. 2

చ. "హృదయముప్రేఁ గొకింత శమియించెను జెల్వపుఁగ్రొవ్వు
పెంపునం, బొదలెడు రంభకుఁ సవతిపోరు ఘటించుట కంకు
రార్పణం, బిది యిటు గొంత చేసితి నపేక్షిత మంతయునైన
యట్ల యయ్యా, సువతియ చాలు దీనికి నసూయయు నున్నది
మాట లారయన్. 3

క. ఎంచఁగ నాగమనమునకు
నించుక చుట్టయిన నయ్యె నిది యోగ్యమ సా
ధించుట కెవ్వారిని బో
ధించనిక్షణ మొక్కటియుఁ దరింపఁగ వశమే!" 4

వ. అని తలపోయుచు శిష్యులుం దానును బురప్రవేశ
మార్గంబున నడచుచుండె నప్పుడు. 5

సీ. దవుదవ్వులనె నేఁడు ధరణికి దిగివచ్చు
చున్నవాఁ డిది యేమి యొక్కొ యనియుఁ
గయ్యంబు లిడ నెందు గతి గల్గునో యని
వెదకుచు నేతెంచువిధమొ యనియుఁ
బవనేరితము లైనపాదపాంసువుల నిం
దఱఁ గృతార్థులఁ జేయుకొఱకొ యనియు
నీమార్గమహిపుణ్య మెట్టిదియో ఫలం
బునకు రాకది రిత్త చనునె యనియుఁ
తే. దను నెఱుఁగువార లతిదూరమునన లేచి
రెండుచేతులు మొగిచి వర్తిల్లుచుండ
నికటమునఁ గన్నవారలు నేలఁ జాఁగి
యాదరమునఁ బ్రణామంబు లాచరింప. 6

చ. అలఘువినీతిసంభ్రమసమాకులతన్ వెసఁ బల్లకీలు నం
దలములు వార్షవంబులు నుపంతులు నాదిగఁగల్గువాహనం
బులుడిగివచ్చి మ్రొక్కుదొరముఱఁకలపెల్లునఁ ద్రోవచాలసం
కులముగ నందుఁగొంద ఱొకకొంతబరాబరిచేసి కొల్చిరాన్.

మత్తకోకిల:—
కొందఱం గడకంటి [1]చూపులఁ గొందఱన్ నెఱచూడ్కులం
గొందఱం జిఱునవ్వుడాలునఁ గొందఱం దగుదీవనం
గొందఱం జెయి సాఁచి లెమ్మని కొందఱం గయిదండ గొం
చుం దపోధనుఁ డాదరించెను సొంపుగాఁ బ్రణతాత్ములన్. 8

1. దృష్టుల.

వ. ఇవ్విధంబున సకలజనసేవ లాదరించుచు శిష్యుండునుం దాను నమ్మునివరుండు పరస్పరవిఘట్టనవాచాలవీచీహస్తసమార్జిత చర్చరీమచర్చికాచర్చాంకురంబులవలనను, సంకులకలహంస చక్రవాకపుష్కరాహ్వాయప్రముఖ జలపక్షిసందోహకోలాహలంబువలనను, నవిరళపరిధావమానడిండీరఖండమండలీ పాండిమచ్ఛలవిలసితప్రహసితంబులవలనను, నికటంబున నం బొదలుజలధివిలసనంబులం జెలరేఁగి గేలిసేయుసోయగంబునం బరఁగుపరిఖావలయంబులును, బరిఖావలయసలిలనిధిసము త్తాలకల్లోలశీకరావకీర్యమాణంబు లగుచుం దమయం దుభయతస్సమాకృష్యమాణభోగీంద్రభోగవేష్టన ప్రకారానుకారపారీణంబులై రాణింపుచుందిరుగు మెఱుఁగుదీఁగలు ప్రకాశింప పైశాఖపర్వతనితంబడంబరవిడంబనచతురంబులై చూడ నొప్పువైదూర్యప్రాకారంబులును, బ్రాకారవలయ విపుల కపిశీర్షసముదయ సముత్కీర్యమాణ మాణిక్యనివహ వివిధకాంతిసంతానసౌమనస మాలికాస్తోమాభిరామపర్యంత భాగం బగుచుం బౌరవిభవలక్ష్మికిం బట్టినయాతపత్రంబురీతి నుద్ద్యోతించు గగనమండలంబునకుం బాండురత్వసంపాదనం బున సొంపానప్పు సమున్నతశిఖరసంసక్తనిర్ణిక్తమౌక్తిక భక్తివిశేషంబుతోడం బసిండికామచెలువు నలవరించు వాసు దేవప్రాసాదరాజంబును, వాసుదేవప్రాసాదరాజకైతవద్యోతి మానశాతకుంభకుంభినీధరంబునకుఁ బ్రత్యంతపర్వతభంగినంగీ కరించి యలంకారంబు గావించు వసుదేవసంకర్షణ సాత్యకి ప్రద్యుమ్నాది యాదవసంఘసౌధయూధంబులును, సౌధ యూధభూధరవ్రాతజాతమహాతరంగిణిబృంద సందేహంబు

ప్రభవింపం జేయునుభయపార్శ్వభాగ హీరమయగృహ
భిత్తిసంతతతంతన్యమానమరీచినిచయ [1]పూర్ణరాజమార్గంబు
లును, రాజమార్గసజ్జితశైవాలినీశైవలభావభాసురంబులై
పాలుపారుగారుత్మతబహిర్వితర్దికానికాయంబును, బహిర్వి
తర్దికానికాయవిరచిత కురంగనాభి గోముఖోపరి తరంగిత
రంగవల్లి మతల్లికా మనోజ్ఞ మౌక్తికమండలీ పాండిత్యంబు
లత్యంతకాంతంబు లగుచు నుత్తుంగహర్మ్యశిఖర కేతుసంఘ
సంఘర్షణాశకలిత పతితాంతరిక్షఖండలక్ష్యమాణనక్షత్రసము
త్ప్రేక్షాసంధుక్షణవిచక్షణంబు లై వీక్షణపర్వంబు నిర్వ
హింపం బెంపుమీఱుచుం బదవలంబనలంబమానవివిధాంబుద
కదంబకంబుడంబుఁ జూపుకలువడంబులును, గలువడంబులం
దవిలినమిళిందంబులచందంబు నంపఱచు చంద్రశాలాఖేలనా
లోల నాళీకలోచనా లోచనంబుల మరీచివీచికల పెల్లు
చిల్లునం జిమ్మనగ్రోవులఁ జిమ్ము గంధసారకస్తూరికానీరధారా
ప్రసారంబుల తెఱం గెఱింగింప బంగారురంగుపసలఁ బసుపు
వసంతంబు లాడుభావంబున ఠీవి నెఱపు భర్మహర్మ్యశ్రీల
ఖేలసంభ్రమోచ్ఛ్వసిత విశరారు కేశబంధంబులో యనంగ
బంధురంబులగుమంథరగంధవహావిహారణ విసృమర కాలాగరు
ధూపధూమంబులును, ధూపధూమశ్యామికామిషంబున నిజ
స్వామికొలువునకు నిబ్బరంపుఁ జే రుబ్బునం బ్రబ్బికొనుచుఁ
జేరినశృంగారరస సముద్రంబునకునిర్ణిద్రవిద్రుమకుడుంగసంఘ
సాంగత్యసౌభాగ్యంబు ననుగ్రహించుచుఁ బ్రత్యగ్రజాగ్ర
దగ్రస్థలస్థాపితకురువిందకలశకందళచ్ఛవిచ్ఛటా జటాలితంబు

1. పరిపూర్ణ.

లగుగోపురంబులును, గోపుర ద్వారతోరణ వ్యాజ విభ్రాజ
మాన మంగళసూత్రసువ్యక్తనిర్వర్తితపరిగ్రహాగృహావైభవ
శ్రీసముపభోగనిస్తంద్రు లగుసకలజనులును నత్యంతచిత్ర
తరమహత్త్వంబునం బ్రవర్తిల్లనుత్తమోత్తమకీర్తులం బొగ
డొందు తద్ద్వారకానగరంబుఁ దఱియంజొచ్చి యంత. 9

సీ. మహనీయకురువిందమాణిక్య కాంతుల
చేతఁ బల్లవితమై చెలువు మీఱి
మరకతమణిసముత్కరమరీచిచ్ఛటా
పత్రసంతతిచేత బాగు మీఱి
నకలంకనవ్యమౌక్తికచాకచక్యప్ర
సూనసంపదచేత సొంపు మీఱి
నింద్రనీలజ్యోతిరిందిందిరశ్రేణి
విలసనంబులచేతఁ బొలుపు మీఱఁ

తే. దనసమున్నతిచే నభస్తపువుఁ బ్రోచి
విమలశిఖరాగ్రకనక కుంభములచేత
సఫలితంబుగఁ జేయుచుఁ జాల వెలయు
నంబుజాక్షునికొలువుకూటంబుఁ గాంచె. 10

క. కాంచి మణికంధరునితోఁ
గాంచనగర్భజుఁడు వలికెఁ "గలకాలము వీ
క్షించిన నిది నిచ్చలు నొక
యంచితరుచి నెఱపుచున్నయది కనుఁగొంటే. 11

శా. ఆవైకుంఠముఁ జూచినట్లు కడు నింపై యీసభామంటప
శ్రీసుస్ఫూర్తికతంబునన్ మిగుల నాచిత్తంబు నానందము
ద్రావైచిత్రిఁ గరంచుచున్నయది యేతద్ద్వారకాపట్టణం

బీవిశ్వంబునఁ గల్గుమే లిడియహో యెందుఁ వివేకించినన్."

వ. అని పల్కుచుఁ జేరం బోవునంత. 13

క. ఆఋషియాగమనం బపు
డారసి చని చెప్పి రంబుజాక్షునకు బహి
ర్ద్వారిణు లగుపరిచారిక
లారీతిని జెప్ప నతని యానతికల్మిన్.[1] 14

సీ. బంగారుగొలుసులుఁ బవడంపుఁ[2]దఱిమెన
కోళ్లును వింతబాగులబొగడలు
రత్నంపుఁజిలుకలు రాయంచప్రతిమలుఁ
బసిఁడిపువ్వులప్రాఁతపనుల సొబగు
వివిధంబు లగు చిత్ర విరచనలును దసి
లీనూలిపట్టె యల్లికబెడంగు
బలు దెఱంగులపట్టుతలగడబిల్లలు
మవ్వంపుఁ గుంకుమపువ్వుపఱపుఁ
తే. గలిగి మెఱుఁగులు దిక్కులఁ గడలుకొనఁగ
మించు దంతపుటుయ్యెలమంచమునను
బొలుపుమీఱుచుఁ దనయంతిపురముసతుల
యూడిగంబులు గైకొంచు నున్న శౌరి. 15

ఉ. అప్పలుకుల్ చెవిం బడినయంతన దిగ్గున లేచి "యెట్టెటూ
యప్పరమేష్ఠినందనుఁడె? యానె? హజారపుఁద్రోవ వచ్చెనే!
యెప్పుడు నంతరిక్షగతి నిచ్చటికే చనుదెంచు; నివ్విధం
బిప్పుడు చాలఁ జిత్ర మిది యేమొకొ!" యందు ససంభ్ర
మంబునన్. 16

---

1 వ. ఇట్లు చెప్పిన. 2. దరవణి, తరువడి.

సీ. తూఁగుటుయ్యెలఁ దూఁగుచోఁ గొంత చెదరిన
యరవిరివన్నెబా గట్లయుండ
నడపంబు తొయ్యలి మడిఁచి యిచ్చిన తెల
నాకుఁజీలిక చేతియంద యుండ
నట్టిటు తొడిగిన యంఘ్రిలత్నంబు
సమ్మాళిగలు సారె జాఱు చుండ
రాణివాసపుఁ జామరగ్రాహిణులు గూడ
నరుగుదెంచి తమంత మరలు చుండఁ
తే. దనకుఁ గైదండ యొసఁగిన తరుణికేలు
వదల నెఱుఁగమి నది తోన వచ్చుచుండఁ
గనిన వా రెల్ల నొదుఁగుచుఁ గలఁగుచుండ
మురరిపుఁడు వాకిటిహజారమునకు వచ్చె. 17
తే. ఇట్లెదుర్కొని ప్రణమిల్లి యింపుఁ బెంపుఁ
దనరఁ గైదండ యొసఁగి తోడ్కొనుచు నేఁగి
యతని యాజ్ఞ వెంబడిని శుద్ధాంతనికట
భాసి యగునొక్క మణిసభాభవనమునను. 18
మ. జగదీశుండు తపోధనాగ్రణికిఁ బూజావర్తనల్ నాఁడ క్రొ
త్తగ నేతెంచినవానికిం బలె మహాతాత్పర్యసంయుక్తుఁ డై
తగఁ జేసెం "గడుఁ గ్రొత్తక్రొత్తగుచు నత్యంతాదరం బెక్కుధ
ర్మగరిష్ఠాత్ములబుద్ధి పూజ్యు లగువారల్ పల్మఱున్ వచ్చినన్.
ఉ. అప్పుడు తత్సభాగృహసమాగమనార్హులు కొల్వునేఁతకై
యెప్పటియట్ల యందఱు బహిఃస్థితులై యొఱఁగించి పంపఁ దా
నప్పరమర్షి పీడ్కొలుపునంతకు రమ్మనఁ [1]గొంకి యచ్యుతుం

1. గొంచి.

డప్పలుకుల్ గణింపక తదంచితగోష్ఠిన యుండె నింపుతోన్.
వ. అప్పు డది యెఱింగి. 21

ఉ. మౌనివరేణ్యుఁ డిట్లనియె "మా కొక పెద్దతనం బొనర్చి రా
జ్యానుగుణప్రవర్తనల కక్కట యిమ్మెయిఁ గొంకి తేని న
న్నో నలినాక్ష! పొమ్మనుట యుక్తము నీ కిపు, డట్లు గాక మీ
వానిఁగఁ జూచితేనిఁ గొలువం బిలిపింపుము వారి" నాపుడున్.

మ. చెలులం జుట్టల దండనాథుల విపశ్చిద్వర్యులన్ సత్కవీంద్రుల
మంత్రీశులఁ[1] బౌరముఖ్యుల ముకుందుం డెంతయుం బ్రీతితోఁ
బిలిపించెం బొడగాంచి రవ్విభవశోభిన్ వారలున్ వేత్రహ
స్తులు దమ్మందఱ నప్డు పేరెలుఁగుతోఁ దోడ్తో నెఱింగింపఁగన్.

తే. కమలనాథుండు నపుడు శీఘ్రింబ తనదు
కొలువు వీడ్కొంచు మౌనిఁ దోడ్కొనుచు నేఁగె
నంతిపురమున, కాతండు నాత్మశిష్యు
వెలుపలన నిల్పి తాఁ దనవీణెఁ గొనియె. 24

ఆ. అప్పు డతనిచేతి యావీణెఁ దాఁ బుచ్చు
కొనియె సంభ్రమమునఁ గూడ నేఁగి
కరము వినయ మొప్పఁ గలభాషిణి ముకుందుఁ
డపుడు దానిఁ జూచి యల్ల నగుచు. 25

క. "ఏమీ శిష్యత్వంబున
నీమునివరు సేవ సేయ నిచ్చ వొడమెనో
యోమగువ" యనిన విని "యది
యేమియు లే" దని వినీతి నిటు నటు నొదిఁగెన్. 26

1. వారముఖ్యుల.

చ. ఒదుఁగుటయున్ యదుప్రవరుఁ "డో హరిణాక్షి తలంక
నేల? నీ, కిది కడు లెస్సబుద్ధి కృప నిట్టిమహామహు లాత్మ సేవ
కున్, హృదయమునందు నియ్యకొను టెవ్వరి కున్నది?
వేయు నేటికిం?, బ్రదికితి; సేవసేయుము శుభప్రదు నిమ్ముని
నిట్ల యెప్పుడున్. 27

ఉ. నీమతి పెంపుఁ బాడుకొను నేరుపులున్ మృదుమంజులస్వర
శ్రీమధురత్వముం గనుచుఁ జిత్తములోపల నేను నెంతు "ని
క్కోమలి కొంత నారదునకుం బరిచర్య యొనర్చునేని వి
ద్యామహిమం గడున్ వెలయు" నంచు నినుం గనుఁగొన్న
వేళలన్. 28

మ. అనుచున్ జాంబవతీగృహంబునకుఁ దా నమ్మౌనిలోకాధినా
థునివెంటం జని "శిష్యురాలి నొకతెం దోడ్తెచ్చితిం; దీనిఁ గై
కొని శిక్షింపు" మటంచు నల్లనగుచున్ గోవిందుఁ డాయింతిఁ
బిల్చి నయం బొప్పఁగ బల్కెఁ; నమ్మగువయుం జిత్తంబు రం
జిల్లఁగన్. 29

క. "నాకు మును మీరు చెప్పెడి
యాకలభాషిణియె యిది?" యటంచును వినయో
త్సేకమునఁ బలికి మునికి వి
వేకిత నుచితోపచారవిధు లొనరించెన్. 30

సీ. అంతట గోవిందుఁ డాయింతిఁ జూచి "యో
వనజాక్షి యిచటి కిమ్మునివరేణ్యుఁ
డేతేర వోరఁగొని యెన్ని[1]యోనాళ్లయ్యె
నీ వేమి దిద్దితి వెఱుఁగఁ జెపుమ!

1. యేనాళ్లయ్యె నేమేమి.

గానచాతురిఁ దాను గడుఁ బ్రోడ యయ్యుఁ దుం
బురుమీఁదిమత్సరంబునను జేసి
'మనవిద్య సాధింతు' నని పూనినాఁ డిది
యెందు నెవ్వరును ము న్నెఱుఁగకునికిఁ
తే. గావున "విశేషములు నీకుఁ గలవి వరుసఁ
దెలిపి నీ నేర్చిన ట్లెల్ల దిద్దు మనుచు
నొప్పగించితి నిమ్మహాయోగివర్య"
యనుచు జాంబవతీసతి వినయ మొప్ప. 31

క. "ఎప్పుడును మీవచస్స్థితిఁ
దప్పక యే నడపుచున్నదాన నిపుడు నా
తప్పొప్పులు మీ రరయుట
యొప్పుగ విన నవధరింపుఁ డోకకాం" తనుచున్. 32

క. కుందనపుఁగమ్మిఁ దిగిచిన
యందంబున జవరఁదనము నలవుం దేనెల్
చిందినగతి మాధుర్యముఁ
బొందుపడఁగ వీణె మ్రుట్టి పొలఁతుక పాడెన్. 33

సీ. ప్రౌఢితో సరిగమపధనిస్వరంబుల
ప్రతినియతశ్రుతిక్రమము లెఱిఁగి
రాగభేదములవర్జ్యములు దొలంగించి
లయతాలశుద్ధి నెంతయుఁ దలిర్ప
గ్రామవిశేషమూర్ఛన లేరుపడ మంద్ర
మధ్యమతారసామగ్రి దనర
ధాతుమాతువులు గీతప్రబంధములందు
నసమానలీలమై నతిశయిల్లఁ

తే. దోర మగుప్రేమరసమునఁ దోఁచి తోఁచి
వీనులకు నింపుఁ జలువయు విస్తరిల్ల
నాకరణిఁ దనకాంత యనేకగతుల
నాత్మగుణగానములు సేయ నచ్యుతుండు. 34

ఆ. "ముదిత మేలు మేలు కోదవ లే దెందు! నీ
యనఘచరితు దిద్దు" మనుచుఁ జనియె
జాంబవతియు నొక్కసంవత్సరముదాఁకఁ
బాట నేర్పె మునికిఁ బాటవమున. 35

ఉ. అంతఁ గ్రమంబునం బ్రియునియాజ్ఞను సత్యయు భోజకన్య
యర్థిఁ, సంతస మొప్ప నప్పరమసంయమి నొక్కొకయేఁడు
దిద్ది ర,త్యంత మనోజ్ఞగానపటిమాతిశయోన్నతుఁ గాఁగ
నవ్విభుం, డంతటఁ దాను దిద్దె నొకయబ్దము పూర్ణము
గాఁగ నాతనిన్. 36

వ. అప్పుడు మణికంధరుండు కలభాషిణికిఁ బోలె నంతఃపురకాం
తలవలనికిఁ యేమియు లేకుండియుఁ బుండరీకాక్షునియను
గ్రహవిశేషంబున సకల రహస్య సంగీతవిద్యాసంపన్నతచేత
నారదకలభాషిణులయట్ల యత్యధికుం డయ్యె. 37

క. అమ్మగువకు గానము హరి
యిమ్మెయి నఖిలంబు నేర్పి "యింక మీసంగీ
తమ్మునకు నీడు లేదు జ
గమ్ముల" నని పలికి మోదగరిమం దేల్చెన్. 38

ఆ. అంతిపురములోని కరిగినప్పుడు తదీ
యాంగనలును దత్ప్రసంగ మైన

మౌనితోడ "నీదు గానవిద్యకు సరి
లే" దటంచుఁ బలికి రాదరమున. 39

వ. అంత. 40

క. మణికంధరుఁడును గలభా
షిణియుఁ గొలిచి రాఁగ నాఋషిప్రవరశిఖా
మణి యొక్కనాఁడు యదుభూ
షణు వీడ్కొని వేడ్క నవనిసంచారమునన్. 41

ఆ. చనుచు నుండి తనదుసంగీతచాతురి
గరిమపసకు మున్ను సరసిజాక్షు
చెలువ లాత్మ మెచ్చి పలికినయట్టి ప్ర
శంసవచనముల ప్రసంగ మైన. 42

వ. వారతో ని ట్లనియె: "నివ్విధంబున నవ్వరవర్ణినులు ముప్వురుం బెక్కుమాఱులు మదీయసంగీతచాతుర్యంబురీతు లతినూతనంబు లనియు నీతెఱంగు లెవ్వరికిని దొరక వనియుఁ బలుకుట గల దది నిజహృదయంబునఁ గలవిధంబో నాదుమదికి ముదం బొనరించుకొఱకునో యెఱుంగరాదు. చదురు 'లెదిరి మదికి నెట్టిపగిదినైన సమ్మదం బొదవించుట పరమధర్మం' బని తలంతురు. కావున నట్టి కథలు గట్టిగ నమ్మరాదు. తమచెలుల తోడ నేతత్ప్రసంగంబున నేమిపలికి రది నిజంబు. తదవబోధంబు గలుగునంతదాఁక డెందంబు సందియంబు నొందుట తప్ప" దనుటయు నప్పరమతపోధనునకుం గలభాషిణి యి ట్లనియె.

క. మీవెంట రాకపోకలు
గావింపఁగ నగరిలోనఁ గలజనములు న

నోన్న వాచంయమ యెఱుఁగుదు
రావనితలకడకు నాకు నరుగఁగ వచ్చున్. 44

తే. ఇట్లరిగి వారు సఖులతో నిష్టగోష్ఠి
నాడుకొనుమాటలను వినఁ గూడు నైన
నేను మీఁదాన నగుట మీఁగాన కథలు
వడిన నవ్వేళఁ గొదవలు తడవ రేమొ. 45

సీ. నా కపేక్షిత మైననాతిరూపు ధరింప
సామర్థ్య మబ్బిన నామగువల
సఖులరూపముఁ దాల్చి సముచితంబగువేళఁ
జని వారిహృదయంబు గనఁగవచ్చు"
నన "నిది నెపముగాను నిధీశసుతునిఁ దా
రంభ యై కూడుట రమణికోర్కి
యదియు మదీయకార్యానుకూలమకదా"
యని యాత్మ నలరి యాయతివఁ జూచి

తే. "యువిద! నీ కిట్టిసామర్థ్య మొదవుటకును
వర మొసంగితి నేను నీవలసినట్టి
యంగనలరూపుఁ దాల్చి యాయబ్జనాభు
వనితలతలంపుఁ దెలిసిర" మ్మనుచుఁ బనిచె. 46

సీ. పనిచిన నాచెల్వఁ వనజదళాక్షుని
సతులపాలికిని దత్సఖులరూపు
ధరియించి వార లొద్దను లేనివేళలఁ
జని ప్రసంగము దెచ్చి సంయమీంద్రు
సంగీతచాతుర్యభంగు లనన్యసా
ధారణం బగుట తద్వాక్యసరణి

చేత నెంతయు సునిశ్చితముగాఁ దెలిసి య
మ్ముని కవి యెఱిఁగించి మునితుఁ జేసె

తే. సంయమియు నాయకం జూచి "జాంబవతియు
సత్యభామయు భోజాత్మజయును హరియు
గురువులుగ గానకళ లెల్ల గరిడిముచ్చఁ
దనముతో నేర్చితివి గద!" యనుచుఁ బలికె. 47

తే. "కొమ్మ మున్ను నీ వాత్మలోఁ గోరినట్టి
కాంతు రంభామనోహరాకారుఁ డగుచు
మెఱయువానిని గూడి రమింపఁగలవు
నమ్ము పామ్మిఁక నీభవనమున" కనియె. 48

వ. అని యవ్వనిత ననిపి మణికంధరుండుం దానును సముచిత
సంభాషణంబులు గొంతతడవు నడపి నారదుండు నిజేచ్ఛం
జనియె. మణికంధరుండును దదాదేశంబునఁ దీర్థయాత్ర కేఁగె
నటమున్ను కలభాషిణియు నట్లు నారదుచేత ననిపించుకొనినిజ
గృహంబునకుం జని [1]గానాభ్యాసం బుడుగుటం జేసి (మున్ను
వోలె) నగరిరాకపోకలతగులంబు చాలమిఁ గ్రమంబునఁ దన
చిత్తంబు నలకూబరచింతాయత్తం బగుచుండం దత్సమీప
గమనంబున కుపాయంబు గానకఁ బహుకాలంబు గడపి కాల
యాపనంబు దుష్కరం బగుటయు నొక్కనాఁడు దా నొక్క
తియ వీణెఁ గొని గృహారామంబున కరిగి యుండునంత. 49

చ. లలితపుభూతిపూఁతయునులాతపుఁగోలయుఁ గక్షపాలయుఁగ్
మలఁగొనుచిన్ని కెంజడలు మందులపొత్తము నాగబెత్తముఁగ్
లలిఁ గనుపట్టుకిన్నెరయు లాహిరిమోవము సింగినాదముం

1. గానాభ్యసనం.

జెలు వలరంగ నొప్పు నొకసిద్ధుఁడు సింగపువారువంబుతోన్.

తే. అభ్రపదవి నేతెంచి యయ్యబల యున్న
తోఁటలోనికి డిగియె నద్భుతము గాఁగ
నదియుఁ దన్మహిమకు వెఱఁ గందుమనము
నల్ల నూల్కొల్పి యర్ఘ్యపాద్యాదు లొసఁగె. 51

తే. అతఁడు "నోకలభాషిణి! యాత్మగురునిఁ
గృష్ణుఁ గొలువఁగ నేఁగుదే? గీతవిద్య
పూర్ణముగ నేర్చితే? రాకపోక లిపుడు
మానినాఁడుగదా దివ్యమౌనివరుఁడు!" 52

క. దానం జేసియు నీకును
మానస మితరప్రచింత మాని తిరముగా
నానలకూబరునంద య
ధీనం బై నిలిచి యున్నదియె తరలాక్షీ? 53

చ. కడపటినాఁడు నిన్ను నిటు కాంచనగర్భతనూజుఁ డంపుచోఁ
గడమయభీష్టసిద్ధియును గాఁ దగుదీవన యిచ్చెఁ గావునం
బడఁతియమోఘ మాయనఘుపల్కు చలింపఁగ నీకు తాల్మి; నీ
బడలుటచూడనోపుదు రెప్రాణసఖుల్ క్షణమాత్ర మేనియున్?

సీ. తడవులనుండియుఁ దపము సేయఁగఁ బూని
మణికంధరుఁడు పాట మానియునికి
నుపవాసఖేదంబు నపనయింపఁగలేక
వేఁగుచున్నవి నాదువీను లిపుడు
వీణె వాయింపు మోవెలఁది [1]నేఁ డైనఁ దు
ష్టిగ విని పారణసేయుఁ గాని

1. యిం డైనఁ.

యీభువనముల మీయిరువురగానంబ
కాని యన్యము లింపు గావు నాకు"

తే. నని పలుక మాటమాటకు నద్భుతంబు
చాలఁ బ్రబలంగ విని విని యాలతాంగి
కరసరోజముల్ ముకుళించి కరము వినయ
మతిశయిల్లఁగ ని ట్లను నతనితోడ. 55

క. "ఓయనఘ దేవుఁడవో యో
గాయతకపిలాదిసిద్ధులందు నొకఁడవో
నీయనుభావం బద్భుత
మై యున్నది! నామ మెద్ది యానతి యీవే." 56

క. అని పలుక "మణి స్తంభుం
డనుసిద్ధుఁడ నేను జలరుహానన నీ వెం
చినవారలలో నెవ్వాఁ
డను గా" నని యతఁడు వల్కుటయు వినయమునన్. 57

ఉ. "ఓమహితాత్మ! మీవచన మొక్కొక టే పరికించి చూచినన్
నామదిలోన నెంతయు ఘనం బగుచున్నది యద్భుతంబు! మీ
రేమహిమన్ యథార్థముగ ని ట్లిది సర్వముఁ గంటి? రిట్టిమీ
కీమహిఁ గానరానియది యేమియు లేదు గణించిచూడఁగన్.

తే. నాకుఁ దార్కాణ యయినయంతయును దిరుగ
నడుగఁ జెప్పంగ వలవదో యనఘచరిత!
యిపుడు మణికంధరుని మీరు తపము సేయఁ
[1]జెప్పితిర యది మొదలుగాఁ జెప్పవలయు." 59

1. జెప్పితిరి మొదల్కొని యది చెప్పవలయు.

వ. అనుటయు నతం డాయింతిం జూచి "యోకాంత! నాకు దూరదృష్టి దూరశ్రవణంబులు గలవు దానం జేసియే నున్న చోటన యుండి సమస్తంబునుం గంటి నిందు నీయెఱింగిన యర్థం బెల్ల సరిదాఁకెను గదా! ఇంక నీ వనిపించుకొని పోయిన వెనుకటి నారదమణికంధరసంభాషణప్రకారంబును దపగిపర్యంతం బైన మణికంధరవర్తనంబును వివరించెద విను" మని యి ట్లని చెప్పం దొడంగె "నట్లు నారదుండు గానశిక్షా పరిపూర్తి యైనవెనుక నిన్ను నీగృహంబున కనిపి యంత మణికంధరుం జూచి. 60

క. "నీసంగీతవిశేషా
భ్యాసము సఫలముగ విష్ణుఁ బరమేశ్వరు న
త్యాసక్తితోడఁ బాడుచు
వేసరక భజింపు మెల్లవేళలయందున్. 61

క. 'ఆదేవున కెంతయుఁ బ్రియ
మై దురితవినాశహేతు వగు నిది' యని యే
నాదరమున నామోహా
పాదిన్ వీణియ ధరించి పాడుచు నెపుడున్. 62

సీ. బృహతీసమాఖ్యతోఁ బెంపుమీఱెడువీణె
వహియించి యెపుడు విశ్వావసుండు
జగతిఁ గళావతీసంజ్ఞ నొప్పెడివీణె
తోడ నేప్రొద్దును దుంబురుండు
మహతీసమాహ్వయమహనీయ మీవీణె
మానక నిత్యంబుఁ బూని యేను

గచ్ఛపి యనుపేరఁ గరము శోభిలువీణె
సవరించి జగదంబ శారదయును
తే. బాయ కెంతయుఁ బాటించుభంగు లరయ
విద్యలం దెల్ల సంగీతవిద్య మిగుల
నుత్తమము గాదె! యిది పురుషోత్తమునకు
నర్పితం బగు నేని యే మని నుతింతు! 63
ఉ. నీదుకృతార్థతామహిమ నెమ్మది నెన్నఁగ నంత యింత నా
రాదు తపంబులం గనఁగ రానిజగత్పతి కృష్ణుఁ డెట్టి భా
గ్యోదయశాలికిన్ దొరకు? నుల్లమునం బరికించి చూడుమా!
శ్రీదయితుండు నీకుఁ గృపచేసె గురుం డయి గానసత్కళల్.
క. కావున నీవిద్య సదా
యావర్తింపుము కుమార! యది సకలాభీ
ష్టావాప్తికిఁ గారణ మిం
పావహిలం జేయు నప్పు డటు మనమునకున్. 65
శా. ఏనున్ వేగమ యేఁగి నాపడినపాట్లీడేర నాకంబులోఁ
గానీ కాంచనగర్భుకొల్వునడుమం గానీ పురద్విట్సభం
గానీ తొల్లిటివిష్ణుదేవుకడనే కానీ మదీయోల్లసద్గానప్రౌఢిని
వాదుఁ బూని గెలుతున్ గర్వోన్నతుం దుంబురున్. 66
వ. అనిన నాపలుకు లాకర్ణించి మణికంధరుం డమ్మునీంద్రునకు
ముకుళితకరకమలుం డగుచు ని ట్లనియె 'మీకు గానవిద్య
చేతఁ దుంబురుని గెల్చుసంభ్రమం బిప్పటి మాటలవలన
నెఱుంగంబడియె; నతనియం దిట్టిబద్ధమత్సరం బేల పుట్టెఁ?
దజ్జయంబున కేమిపాట్లుం బడితిరి? నాకు నింతయు నెఱింగింప
వలయు' ననుటయు నతం డి ట్లనియె. 67

శా. వైకుంఠంబున నొక్కనాఁ డతులితైశ్వర్యుండు విష్ణుండు నా
ళీకప్రోద్భవముఖ్యదేవగణముల్ సేవింప యోగీశ్వరా
నీకంబుల్ నిగమాంతసూక్తులను వర్ణింపంగ నొడ్డోలగం
బై కూర్చుండె మహాసభన్ సవనవ్యాపారపారీణుఁ డై. 68
వ. అప్పుడు: 69
శా. కౌండిన్యాత్రిమరీచిదక్షకపిలాగస్త్యాక్షపాదాంగిర
శ్శాండిల్యక్రతుకణ్వకుత్సభృగువిశ్వామిత్రమైత్రేయమా
ర్కండేయాసురివామదేవకపిదుర్వాసోబకవ్యాఘ్రపా
న్మాండవ్యాదిమహామునుల్ చనిరి ప్రేమన్మ్రొక్క దత్సేవకున్.70
క. అరిగితి మపు డేనును దుం
బురుఁడును విశ్వావసుండు మొదలుగవీణా
ధరుల మొకకొందఱము త
త్పరతయు భక్తియుఁ దలిర్పఁ దత్సేవకు నై. 71
వ. ఇవ్విధంబున దేవమునిసంఘంబులువచ్చి సేవింప విష్వక్సేనుండు వేత్రహస్తుం డగుచు [1]సంపతి నెడ గలుగ జడియుచు బరాబరి యొనరింప దివ్యవారాంగనా నాట్యంబు లవలోకించుచు నద్దేవదేవుండు పేరోలగమ్మున నున్నసమయంబున. 72
ఉ. వారిదపంక్తిలో వెడలివచ్చు మెఱుంగులపిండు నా సఖీ
వారముతో రమారమణి వచ్చెను హెగ్గడికత్తె లెంచఁగా
గౌరి భజింప నా కొలువుకూటముముందఱివంక నొప్పు సిం
గారపుఁదోఁటనుండి యధికం బగువైభవ మింపు మీఱఁగన్.
ఉ. నెచ్చెలిపిండుఁ దానును వనీస్థలిదండ నొకింత గానఁగా
వచ్చెనొ రాదొ యాకమలవాసిని యంతనె యేమిచెప్పుదున్!

1. సందడియెడ.

హెచ్చినసంభ్రమంబున ననేకులు బద్ధలవార లెక్కడన్
వచ్చిరియొ మోఁది రాకొలువువారిఁ గకాపికలై చనన్ వడిన్.

క. అప్పుడు మముబోంట్లకతల్
చెప్పఁగ నేమిటికిఁ? దారసిలి వేత్రధరుల్
రొప్పఁగఁ జనియెన్ నిలుపక
యప్పరమేష్ఠియును నచటి కతిదూరము[1]గన్. 75

క. ఆతఁడని వేత్రహస్తు 'లా
హా తుంబురుఁడా' యటంచు నుచ్చైస్స్వర ము
ద్ఘోషింపఁ బిల్చి క్రమ్మఱ
నాతనిఁ దోడ్కొనుచుఁ బోయి రతివేగమునన్. 76

వ. అట్లు తోడ్కొని పోవుచుండ. 77

చ. కని తమలోనఁ దా 'రితనిఁ గ్రమ్మఱఁగాఁ బిలిపించె నేమొకో!'
యనియెడువారు 'గానవిధులందుఁ బ్రసంగము లేమి గల్గెనో!'
యనియెడువారుఁ 'దచ్చతుర లన్యులు లేరె యితండ కాని
యిం?' దనియెడువారునై మనములందును సందియ మొంది
రందఱున్. 78

ఉ. అప్పుడు నేను నామనమునం 'దితనిం బిలిపించు టెట్లొకో
యిప్పు!' డటంచు నిల్చి యరయింప వినంబడియెన్ నిజంబుగా
'నప్పురుషోత్తముండు తనయంగనతో వినుచున్నవాఁడు సొం
పొప్పఁ దదీయగాన' మని యొద్దఁ జరించెడివారు చెప్పఁగన్.

క. మ మ్మెల్లఁ దోలి యొక్కని
నిమ్మెయిఁ బిలిపించి హరియు నిందిరయుఁ గడన్

1. నన్.

సమ్మదమునఁ దుంబురుగా
నమ్మును వినుచునికి విని మనం బెరియంగన్. 80

వ. ఏనొక్కమఱుంగునం గొంతతడవు కనిపెట్టుకొని యుండ. 81

సీ. 'అనిపెనా యే మిచ్చె?' ననుచును సంభ్రమం
బున సంపడించుచు మూఁగువారు
'సర్వేశ్వరుండు శ్రీసతితోడ గానంబు
[1]వినుట యడుగ నేల' యనెడువారుఁ
'గడునను గ్రహము నెక్కడ లేనియీయీఁగి
[2]పసయ తెల్పెడు' నంచుఁ బలుకువారు
'నీ వొక్కఁడవొ మఱి యేవార లైన న
య్యెడ నుండిరో?' యని యడుగువారు

ఆ. నగుచు సురలు మునులు నరుదంద మేపూఁత
డంబుతోడ వచ్చెఁ దుంబురుండు
కడలవారిని గనకస్నాన మాడించు
పదకమును సునేత్రపటముఁ దాల్చి. 82

వ. అప్పుడు. 83

క. దగదగ యనుపదకంబున
నిగనిగ యనుక్రొమ్మెఱుంగునేత్రపటమునన్
బుగబుగ యనుమేపూఁత
న్బగబగ యనిపించె నతఁడు నాహృదయంబున్. 84

సీ. "తనుఁ గ్రమ్మఱంగఁ బిల్చినవేళయంద నా
తో విచారింపక పోవు టెట్లు

1. వినునఁట యడుగనే లనెడు. 2. పసయుఁ దెల్పెడు.

పోయెం బో నను బిల్వఁ జేయక తా నొక
నెఱ[1]జాణయై విద్య నెఱపు టెట్లు
నెఱపెం బో ప్రభువు మన్నించినాఁ డని మీఁదు
పరికింప కీ సొమ్ము పట్టు టెట్లు
తే. లేఁడు తగవరి యెందును" మూఁడిఁ జొచ్చి
వాత వెళ్లెడువాఁడె యెవ్వాఁడు నంచుఁ ।
'బాపి తుంబురుఁడా' యంచుఁ బంక్తి గొలుకు
కొంచు లోలోన నుడికితిఁ గొంతతడవు. 85

క. "నాకంటెఁ దాను ఘనుఁడే ?
యాకొలఁదియు బయలు సేయునంతకు నేయే
పోకలఁ బోయినఁ బోని
మ్మీకరణిం జణఁగి పోవనిత్తునె పీనిన్ ?" 86

వ. అని యాగ్రహించుచు 'నతనితోడ నెంతేనియు వాదు వెట్టుకొని భంగపఱచి యతులితంబైన మదీయసంగీతచాతుర్యంబు వార్తలు క్రమంబున నిజ్జగన్నాయకునకు వినంబడునట్టి యుపాయంబు వెట్టవలెంగాక!' యని యూహించితి యనంతరంబ.

చ. 'తలఁగక యిప్పు డిట్లు సముదగ్రతఁ బేర్చినయీర్ష్య బుద్ధిలో
పలన యడంచి మైత్రి గనుపట్టఁగ [2]నింతన కొంత రాకపో
కలు ఘటియించి యే నతనిగానములో గుణదోషవర్తనల్
దెలియుట నీతి యా తెలివి లేకగునే జయ!'మంచు నెంచితిన్.

ఆ. ఎంచి యతనియింటి కేఁగితి నొక్కనాఁ
డతఁడు నపుడు పాట కాయితముగ

1. గాణ. 2. నింకనుగొం.

వీణె మేళగించి వెలుపలిమోసల
నునిచి లోని కరిగియున్న వాఁడు. 89

ఉ. ఏనును "దుంబురుం డెచటి కేఁగె? గృహంబున నున్న
వాఁడె!" యం,చానికటంబునన్ మెలఁగునట్టి జనంబులఁబల్కి
"వీణె యి,చ్చోఁ నిడి లోని కేఁగె" నను సుద్ది వినంబడ "నీవి
పంచి యె,వ్వానివో యంచు [1]నుండి తమి వానిదె చూత"
మటంచు నల్లనన్. 90

తే. పుచ్చుకొని పలికించి యపూర్వమైన
శ్రుతులపెంపు నిర్దోషత నతుల మగుచుఁ
గడు వెలుఁ గొనర్ప దాని నక్కడన పెట్టి
మిగుల లజ్జించి వచ్చితి మగిడి యపుడు. 91

వ. ఆసమయంబున నంతర్గతంబున. 92

మ. "కడుఁ బ్రావీణ్యధురీణుఁ డితఁ డయినన్ గాంధర్వసంపూర్తి
నె, ల్లెడఁ బ్రఖ్యాతి వహించునాకు నకటా యీతుంబురుం
డంతయె,క్కుడుగాఁ గానము నేఁటిదాఁక!" నని సంక్షో
భించుచున్ "దాడిఁద,న్నెడువానిం దలఁ దన్నువాఁడు
గలఁ డన్వేషింప" నం[2]చెంచితిన్. 93

చ. అటమును చెల్మి పెంపు తనరారఁగ నేనును దాను నప్పట
ప్పటికిని గూడి పాడుదుము పద్మభవాదులయొద్ద నప్పు డె
చ్చుటఁ దన కింతగానకళసంపదకల్మి యెఱుంగనీఁడ ము
చ్చటపడి యిట్లు విష్ణుఁడు ప్రసన్నతఁ దాఁ బిలిపించునంతకున్.

క. తమవిద్య నెవ్వ రేమా
త్రముఁ గనఁజాలుదురు వారిదండను దన్మా

---

1. నుండితిమి. 2. చెన్నితిన్.

త్రమ ప్రకటింతురు బుధు "లు
త్తములమహిమ నీరుకొలఁదితామరసమ్మీ!" 95

క. ఇటు గాక వినుజనంబుల
పటిమకు నెక్కుడుగ విద్య పచరించుట య
క్కట విఫలము గాదే యె
చ్చటఁ "జెవిటికిఁ బట్టినట్టిసంకునుబోలెన్"? 96

వ. అది యట్లుండె నేను నది మొదలుగాఁగ నెక్కడెక్కడ
నక్కజపుగానవిద్య గలవారు గలరు వారి నరసియరసి త
ద్విద్య సాధించుచు నెందునుం దుంబురునకు నీడుగాఁజాలమి
యెడనెడం బరికించుచు బెద్దకాలంబు ప్రవర్తిల్లితి; యీ
మనోరథంబు సర్వజ్ఞుండైనపుండరీకాక్షునియనుగ్రహంబునన
కాని ఫలియింపనేర దని నిశ్చయించి తద్దేవునిం గూర్చి చిర
కాలంబు తపంబొనర్చితి నంత. 97

సీ. అంజనాచలగర్వభంజనాచలలీల
నీలవర్ణపుమేనిడాలు దనరఁ
బుండరీకముల నుద్దండరీతుల గెల్చి
చెన్నొందునిడువాలుఁగన్ను లమర
మకరకుండలరుచిరప్రకరకుంఠితము లై
దినకరప్రభలు వెన్వెనుక కొదుఁగ
నురమురత్నమునందుఁ గరము రంజిలునీడ
తోడునీడగ లక్ష్మి క్రీడ లాడ

తే. శంఖచక్రాదిపరికరసహితుఁ డగుచుఁ
మఘవముఖదేవతాసేవ్యమానుఁ డగుచుఁ

బతగరాజాధిరోహణోద్భాసి యగుచుఁ
గృప దలిర్పంగఁ గాన్పించెఁ గేశవుండు. 93

ఆ. కానుపించి "యేమి కావలయును వరం
బడుగు ?" మనిన నేను నాత్మశక్తి
కొలఁది నతులు నుతులుఁ జలిపి "తుంబురు గాన
కలనవలన గెలువవలయు" నంటి. 99

చ. అనుటయు నన్నుఁ జూచి కృప నచ్యుతుఁ డిట్లను "నేను
ద్వాపరం,బునవసుదేవనామునకుఁ బుత్త్రుఁడ నై యుదయింతు
శిష్టపా, లనమున దుష్టశిక్షను నిలాస్థలి బ్రోవఁగ నప్డు ద్వా
రకా,ఖ్యనగరియందు నీ కభిమతార్థ మొనర్చెద రమ్ము నాఁ
టికిన్." 100

క. అని యంతర్ధానము నొం
దినఁ జిరకాలంబు నేఁ బ్రతీక్షించుచు నం
తను వాసుదేవుకడ ని
ట్లనుపమసంగీతకౌశలాఢ్యుఁడ నైతిన్. 101

వ. అని చెప్పి మఱియు ని ట్లనియె. 102

క. "ఏ నిన్ని పాట్లఁ బడి యీ
గానమహిమఁ గంటి నీవు గలభాషిణియున్
మేను చెమర్పక యుండం
బూనితి రిది యప్రయాసమున హరికరుణన్." 103

క. అనుఁడు "మిముఁ గొలుచుపుణ్యం
బున కిది యరుదయ్య ఘనతపోధన! 'తన్నం
దినవాఁడు తనంత' లనన్
వినరే లోకోక్తి మీఱు విశ్వంభరలోన్ ! 104

మ. అవి యట్లుండె నొకప్డు తుంబురునిఁ దా నారీతిఁ బిల్పించి
యిం,పు దలిర్పన్ హరి పాటవింట మిగులం బూజ్యంబుగాఁ
జెప్పి తే, కొదయున్ లేక సదా నివాసముగ వైకుంఠంబులో
నుండి యా, సదయున్ విష్ణునిఁ గొల్వఁగ ల్గెడుమహాసౌభాగ్య
మెట్లబ్బునో !” 105

క. అనుటయు నమ్మాటకు నె
మ్మన మలరఁగ నతనిఁ జూచి మణికంధర య
త్యనఘుఁడవు మేలు మే! లీ
యనుపమసద్బుద్ధి యేరి కైనను గలదే! 106

క. వినరే యెవ్వరుఁ బాపం
బనఁ బుణ్యం బన నిషేధ మన విధి యనఁ గీ
డన మే లనఁ బరలోకం
బనఁ దలఁపఁగ లేరు గాక యాత్మహితంబున్? 107

చ. అలయక వేదశాస్త్రసతతాభ్యసనవ్యసనప్రసంగతిం
దెలివి యొకింత గాంచినగతిన్ నుతి కెక్కియు “వెట్టిదీ రెరోఁ
కలి దలఁజుట్టు”మన్న క్రియఁగా నొకకొందఱు దాల్తురప్పటిం
గలుషపథప్రవర్తనమె కర్మపువాసన [1]నన్యుఁ గొల్వఁగన్.

సీ. వినుము గంధర్వనందన “భూతములయందుఁ
బ్రాణు లుత్తమములు ప్రాణులందు
బుద్ధిజీవులు మేలు బుద్ధిజీవులయందు
మనుజులు శ్రేష్ఠులు మనుజులందు
బ్రాహ్మణు లధికులు బ్రాహ్మణులందు వి
ద్వాంసులు విద్వాంసులందు

1. లన్ను గొల్వఁగన్.

విదితార్థకృతిలోలహృదయులు ముఖ్యులు
విదితార్థకృతిలోలహృదయులందుఁ

తే. గర్త లెంతయుఁ బూజ్యులు కర్తలందు
బ్రహ్మవిదు లెక్కు; డామీఁదఁ బరమ మొకటి
గలుగ" ననుచును మున్నుదాఁ బలికె మనువు
ధర్మశాస్త్రప్రసంగవర్తనలవేళ. 109

ఉ. నీవిధ మారయం బరిగణించినయిప్పటితారతమ్యపుం
ద్రోవకరంబు దూరముగఁ ద్రొక్కినవాఁడవు నిక్కవంబు ల
క్ష్మీవరనిత్యసన్నిధివిశేషమహత్త్వ మెఱింగినంతనే
యావిభవంబుఁగాంచుటకు నాస యొనర్చితి గాన నిమ్మెయిన్.

క. కావున నీవడిగినయ
ద్దేవునియనవరతసన్నిధిమహత్త్వవిశే
షావాప్తికిఁ బెద్దలచే
నేవినినయుపాయ మిప్పు డెఱిఁగింతుఁ దగన్. 111

క. అధికారి గానివానికి
నధికపదవిఁ దెలుపఁ బ్రాప్త మయ్యెడుపాపం
బధికారి యైనవానికి
నధికపదవిఁ దెలుపకున్న నగు నిక్కముగన్." 112

వ. అని యిట్లని చెప్పె. 113

సీ. "తనశక్తికొలఁది సత్కర్మముల్ ఫలవాంఛ
మాని కృష్ణార్పణమతిఁ జలుపుట
ప్రతిషిద్ధకర్మంబు పరిహరించుట విష్ణు
భక్తి పైక్రమమునఁ బాదుకొనుట

తద్భక్తిగలపుణ్యతములసంసర్గంబు
దుర్జను లున్నట్టిత్రోవఁ జనమి
విష్ణుసన్నిధికళావిఖ్యాతవివిధ ది
వ్యక్షేత్రతీర్థయాత్రాచరణము
తే. బ్రహ్మచర్యంబుఁ దపము వైరాగ్యగుణము
వలయు వైకుంఠమును గోరువారి కెల్ల
వీనిలోపలఁ గొన్ని కావింపఁగనిన
వృథ చనవు చేర్చుఁ గ్రమమున విష్ణుపదము. 114

వ. అని చెప్పి, "నీవు నిజశక్తికొలఁది నిందుఁ బ్రవర్తిల్లుము; కృష్ణానుగ్రహంబునం గలిగిన యీయనన్యసాధారణసంగీత చాతుర్యంబు వృథసేయక శ్రీపురుషోత్తమ శ్రీరంగాదిదివ్య క్షేత్రములందు ముకుందుసన్నిధిం దద్దివ్యగుణనామసంకీర్తన గానంబు గావింపు మది సకలశ్రేయోనిదానం" బని పలికి తత్ప్రసంగవశంబున. 115

ఉ. అక్కజ మైనభక్తి తనరార నతం డనయంబుఁ గృష్ణునిం
దక్కక యాత్మఁ జూచి ప్రమదంబునఁ బొంగుచుఁ జెంగ
లించుచుం, జొక్కుచు మ్రొక్కుచుం బొగడుచుం బుల
కించుచుఁ గన్ను మోడ్చుచుఁ, మిక్కిలి చోద్య మందు
చును మెచ్చుచుఁ బాడుచు నాట్యమాడుచున్. 116

క. కేవలము నతిప్రేమర
సావేశవశంవదాత్ముఁ డై తద్గుణముల్
భావించుచు నొకరీతిం
ద్రోవఁ గనుచు నేఁగె నారదుండు నిజేచ్ఛన్. 117

వ. మణికంధరుండును దచ్చరితంబులకు నతివిస్మయప్రమోద హృదయుం డగుచు, "నితం డింతధన్యతామహిమంబున నొప్పునే?" యని కొనియాడుచుం దనదృష్టిమార్గంబు గడచునందాఁక వీక్షించి యంత నెట్టకేలకు నాలోకనంబులం ద్రిప్పుకొనియె; నివ్విధంబున గురుం డరిగిన నతండుఁ దదుక్త ప్రకారంబునఁ బుణ్యకర్మంబులు నడపుచుఁ గ్రమంబున విష్ణు భక్తి హృదయంబునం బొదలఁ దీర్థయాత్ర గావించె నందు.

మ. యమునన్ జూచెను వీచికాచయమునన్ భ్రాంచద్ఘనశ్యామ
తో,యమునన్ సారసకైరవోచ్చయమునన్ సారావభృంగీనికా
యమునన్ జక్రమరాళసంచయమునన్ వ్యాఘోషితాఘవ్య
పా,యమునన్ సంతతపుణ్యనిశ్చయమునన్ హర్షప్రకర్షంబుగన్.

శా. నిధ్యానోత్సవకారణంబు లగుచు న్మించెం గరం బానదీ
మధ్యేతీరవనద్విజప్రకరసమ్యగ్వర్తితారణ్యక
స్వాధ్యాయాధ్యయనస్వరాభినయలీలాందోళనభ్రూలతా
బుధ్యాపాదననైపుణీవిలసితాంభోవీచిచాంచల్యముల్. 120

చ. ఇసుగడలందు మించినయహీశ్వరశయ్య తెఱంగుఁ దాల్చి క్రొ
న్నురువులపంక్తి రాజిలఁగ నూతనపీతపటంబుకైవడిం దరళ
సరోజరేణుసముదాయము సొం పెసగంగఁ జూడ్కి కాతరణి
తనూజ యొప్పె శయితం బగువిష్ణునిమూర్తియో యనన్.

క. ఆవైణికుఁడు తత్తీ
ర్థావళిఁ దగువిధు లొనర్చి యాయాచోట్లన్
శ్రీవరుగుణములు వీణా
ప్రావీణ్యము పొలుపు మీఱఁ బాడుచు నంతన్. 122

వ. మధుర సేవించి యంతట హరిద్వారంబును, సాలగ్రామ పర్వతంబును, బదరికాశ్రమంబును, నైమిశారణ్యంబును, గురుక్షేత్రంబును, బ్రయాగయుఁ, గాశియు, నయోధ్యయు, గంగాసాగరసంగమంబును స్నానదానాదివిధు లనూనంబుగా నడపుచు దర్శించి, యంత నుదధితీరంబున నీలాచలసన్నిధికి నేతెంచి. 123

క. "ఇది సాక్షాద్వైకుంఠం
బిది నానామునితపస్సమృద్ధివిపాకం
బిది పరమం బిది శరణం
బిది పుట్టినయిల్లు సిరుల కెల్లఁ దలంపన్." 124

తే. అని నుతించి యింద్రద్యుమ్న మనుసరపిని
రోహిణీకుండమున సమారూఢభక్తిఁ
దీర్థమాడుచు నాతఁ డాత్మీయగాన
నైపుణి వెలార్చుచును జగన్నాథుఁ గొలిచె. 125

సీ. ఇత్తెఱంగునఁ బురుషోత్తమశ్రీజగ
న్నాథునిసంసేవనమునఁ దనరి
శ్రీకూర్మవిభునియంఘ్రిసరోరుహంబులు
కనుఁదమ్ములకు విందుగా నొనర్చి
సింహాచలాధీశసేవావిశేషలీ
లలను జన్మంబు నలంకరించి
శ్రీమదహోబలస్వామిపావనఖోడు
జాలసంఘము ఫాలశశికి నొసఁగి

తే. వేంకటేశ్వరచరణారవిందగంధ
నందదిందిందిరశ్రేణినైల్యమునను

నిజశిఖాకాంతికిని బుష్టి నిర్వహింపఁ
జనియె నాదరమేదురస్వాంతుఁ డగుచు. 126

మ. కమనీయోజ్జ్వలశీలశాలి యగునాగంధర్వుఁ డంతట్ ఘన
ప్రమదప్రేమవిశేషసంభృతపరీరంభక్రియాసంభ్రమ
భ్రమకారాభిముఖప్రసారలహరీబాహాసమూహాసమా
నమనోజ్ఞం బగుస్వామిపుష్కరిణికిన్ వచ్చెన్ గదుర్ వేడుకన్.

తే. అంత హరిసంతతాశ్రితస్వాంత మైన
స్వామి పుష్కరిణియును నాశౌరిభక్తు
తనువు ననోన్యపావనత్వము భజించె
మిగుల మజ్జనసమయసమ్మేళనమున. 128

ఉత్సాహ.—
అంత నిత్యనియమములు సమస్తమును నొనర్చి యా
చెంతఁ జెలువుమీఱుచున్నక్షితివరాహమూర్తి శ్రీ
కాంతుఁ గొలిచి భక్తివినయకౌతుక ప్రమోదసం
క్రాంతిశబలతావిశేషకలితచిత్తవృత్తి యై. 129

సీ. మణిమయప్రాకారమంటపగోపురో
దీర్ణ కాంతులచేతఁ దేజమునకుఁ
జారు[1]నదీహస్తచామరవీజన
వ్యాపారములచేత వాయువునకు
నారాధనార్థయాతాయాతజనవిభూ
[2]షణరజోవృష్టిచే ధారుణికిని
హృద్యచతుర్విధవాద్యస్వనోపయో
గప్రవర్తనముచే గగనమునకు

1. నటీ. 2. పారజో.

తే. నిజనవాగరుధూపజనీరవాహ
జననసంబంధమహిమచే సలిలమునకుఁ
బావనత్వంబు గలుగంగఁ బరఁగు వేంక
టేశునగరు దాఁ జేరి యిం పెసక మెసఁగ. 130

క. మునుపు పరివార దేవత
లను దగ సేవించి నిర్మలప్రేమభరం
బున మేను గగురు పొడువఁగ
ననఘుఁ డతఁడు లోని కరిగి యగ్రమునందున్. 131

సీ. మృదుపదాంబుజములు మెఱుఁగుటందెలుఁ బైఁడి
దుప్పటియును మొలముప్పిడియును
మణిమేఖలయు బొడ్డుమానికంబును వైజ
యంతియు నురమున నలరుసిరియు
వరదహస్తముఁ గటి వర్తిలుకేలు శం
ఖముఁ జక్రముఁ దాల్చుకరయుగంబుఁ
దారహారంబులుఁ జారుకంఠంబు ని
ద్దపుఁజెక్కులును నవ్వు దళుకుపసలు
తే. మకరకుండలములును దామరలఁ దెగడు
కన్నులు మనోజ్ఞనాసయుఁ గలికిబొమలు
ముత్తియపునామమును రత్నముకుటవరము
నెసఁగ గనుపట్టు శ్రీవేంకటేశుఁ జూచె. 132

వ. ఇట్లు చూచి. 133

శా. ప్రత్యంగంబును మిక్కిలిం వడవుగా భావించి భావించి యా
దైత్యారాతితనూవిలాసము సమస్తంబుఁ విలోకించెఁ దా
నత్యంతంబును వేడ్కఁ బొంగుచు నితాంతాశ్చర్యముం

బొందుచుం, గృత్యం బేమియుం గొంతప్రాద్దెఱుంగ కక్షీణ
ప్రమోదంబుతోన్. 134

వ. పదంపడి నిజానుభవం బిట్లని యుగ్గడింపం దొడంగె. 135

సీ. పదపద్మములం జిక్కి పాయదు నాదృష్టి
కనకాంబరమున కేకరణిం దెత్తుం
గనకాంబరముం గీల్కొనినం జలింపదే
నుదరబంధమున నెట్లొనరం గూర్తు
నుదరబంధమున నింపొంది ఖేదిల్లదు
శ్రీవత్సమున కెట్లు చేరం దిగుతు
శ్రీవత్సమునం దారసిలిన రానేరదు
కేలుందామరల కేక్రియ మరల్తుం

తే. గేలుదామరలను గళశ్రీల మోవి
మకరకుండలముల గండమండలముల
నాసం గనుంగవ బొమలం గుంతలములందు
నెందుం బర్విన విడంజాల దేమిచెప్ప! 136

వ. అని పరమానందంబున నితరప్రపంచంబు సర్వంబును మఱచి
కొంతతడవు నిరీక్షించి తదనంతరంబ దండప్రణామంబు లనే
కంబులు గావించి విపంచీసమంచిత మృదుమధురనినదంబును
గంతస్వరంబును నేకం బగుచు లోకుల నస్తోకసమ్మదాశ్చర్య
సంభృతస్తంభభావులం గావింప నద్దేవునిదివ్యమంగళగుణ
గానంబు లొనరించె నివ్విధంబున మూండహోరాత్రములు
సేవించి వేంకటనగంబు డిగ్గి చనిచని ముందట. 137

సీ. ఏపట్టణము ముక్తిహేతుసప్తపురాంత
రభిగణనాతివిఖ్యాతిశాలి

ఏపట్టణము ఖేలదేకామ్రవిభుశిర
స్సింధుమత్సరిసరశ్శ్రీవిభాసి
ఏపట్టణము సముదీర్ణకామాక్షీత
పఃపరిపాకసంపద్విధాయి
ఏపట్టణము సరిద్రూపవాగ్దేవతా
సంశ్రయాంచితసమస్తద్విజాళి
తే. బ్రహ్మయజ్ఞవపాహోమపరిమళసహ
జాతసాత్మ్యోత్పరబ్రహ్మసన్నిధాన
భాగ్యసౌభాగ్యయోగ్య మేపట్టణంబు
పుణ్యతర మైనయాకాంచిపురముఁ గనియె. 138
తే. కని మనంబున మోదంబు గడలుకొనఁగ
నందు నేకామ్రనాథుఁ గామాక్షిఁ దక్కఁ
గలుగు వేల్పుల [1]నర్చించి కరిగిరీంద్ర
మునకుఁ జని యుక్తగతి నెక్కి పోవ నెదుట. 139
సీ. తనశంఖరుచికి నాతనిమనస్సతోద్వద
యంబు ప్రత్యుత్థాన మాచరింపఁ
దనచక్రమునకు నాతనిదివ్యతేజంబు
గురుభావమున నెదుర్కోలు సేయఁ
దనకృపాలక్ష్మి కాతనిభక్తి నెనరు పెం
పెసఁగఁ గౌఁగిటఁ జేర్చి యెత్తుకొనఁగఁ
దనకౌస్తుభమున కాతనిశుద్ధచిత్తవృ్రికా
శము మైత్రి నెఱపుచు సరస మాడ

1. దర్శించి.

తే. వరదరాజదేవుఁడు భక్తవత్సలుండు
మిగులఁ గనుపట్టె నతఁడు నజ్జగదధీశుఁ
గని పులకితాంగుఁ డగుచును వినుతి చేసి
పాడుచు భజించె నెంతయు భక్తి మీఱి. 140

వ. అంత. 141

శా. ఆకాంచీనగరంబు వెల్వడి సముద్యత్పూగపున్నాగరం
భాకంకేళిరసాలసాలసుమనఃపాళీజధూళీమధూ
ళీకేళీపరగంధవాహపృథుకాళీచంక్రమాలంకృత
ప్రాకప్రాంగణచోళమండలమహాగ్రామంబులీక్షించుచున్. 142

చ. చెఱకును రాజనంపువరిచేలును దట్టపుఁబోకతోఁటలుం
దఱచగుపూవుఁదోఁటలును దమ్మికొలంకులు నేటికాల్వలుం
బఱపగునారికేళవనపంక్తులు మామిడితోఁపులుం గడుం
మెఱయుచు నాత్మకుం ముదము మెచ్చును నచ్చెరువుం
ఘటింపఁగన్. 143

శా. ఆవీణాధరుఁ డేఁగి కన్గొనియెఁ బుణ్యఖ్యాతిదర్పోల్లస
ద్దైవద్వీపవతీసమత్సరవివాదప్రౌఢిమానర్గళ
వ్యావల్గత్కరభావభృల్లహరికావర్గావృతవ్యోమమున్
గావేరీతటినీలలామము నమోఘౌఘౌళనోద్ధామమున్. 144

ఆ. కని తదీయ మైనయనితరసదృశపా
వనతరప్రభావఘనత దనకుఁ
గరము మెచ్చొనర్పఁ బరమనిరూఢి నా
దరముతోడ భక్తిగరిమఁ దనరి. 145

క. "పావనగుణానుభావము
భావనగావింప నెట్టి పరమనదులు నీ

కావేరికి సదృశంబులు
గా వేరికి నైనఁ బొగడఁగా వెర వగునే? 146

లయగ్రాహి.—

ఈనది ప్రవాహయుగళీనిభవిభాసితభు
జానియతరంగసదనూనపరిరంభం
బీనది భజన్నిఖిలమానవమనఃకలుష
తానిరసనాతిపటుతా నుతజలౌఘం
బీనది సమస్తతటినీనికరదుష్కరత
రానుపమచిద్విభవదానమహనీయం
బీనది పవిత్రతర మీనది శుభైకనిధి
యీనది విముక్తికి నిదానము గణింపన్. 147

ఉత్సాహ.—

అమితరంగధామలక్ష్మి నరయఁ బృషతమణినికా
యములఁ బూజసేయఁ దాల్చినట్టి నేత్రభుజసహ
స్రములు గాని జలరుహములు జలరుహములు గావు భం
గములు భంగములును గావు గణన సేయ నీ నదిన్. 148

మానిని.—

బంగరుచేలముఁ బద్మనిభాక్షులు
బాహుచతుష్కము భవ్యవిభో
త్సంగితశంఖసుదర్శనశార్ఙ్గగ
దాముఖచిహ్నము తత్త్వము నీ
లాంగము నీనది యారసృజించు ని
జాశ్రితదేహికి నంతికస

ద్రంగశయానుఁ దిరంబుగఁ జూచి క
రం బిడివో చతురత్వ మనన్.” 149

వ. అని ప్రశంసించుచున్న యచటి జనులవాగ్జన్మసాఫల్యంబునకు
నుల్లసిల్లుచు నరవిందకుముదకల్హారతల్లజసముల్లసితగంధసం
బంధబంధురగంధవహకిశోరవారంబులు దూరంబునన యెదు
ర్కొనఁ జక్రచక్రాంగబకక్రౌంచసారసారావంబులు సారస్య
వికస్వరస్వాగతభాషణంబు లశేషంబు నుపచరింప, నుత్కంప
మానకల్లోలజాలంబులుసమాలింగనలీలాలోలబాహుకాండ
[1]పాండిత్యంబు లత్యంతంబుఁ బ్రకటింపఁ, దటస్థలస్థాపిత స్థూల
డిండీరఖండమండలవిలాసంబులు రజతాసనసమర్పణప్రకా
రంబు నేర్పరింప నింపు మీఱుచు, నిష్టబంధు సందోహంబుల
లాగున నాగంతుకజనసంతతులు సంతసంబున నుపశ్లోకింపఁ
బెంపుమీఱుచున్న యాకావేరియం దుచితవిధులు దీర్చి
యందు మిక్కుటంబగు పెక్కువ నుక్కుమిగులు జక్కవల
చక్కఁదనంబును వెక్కిరించునిరుత్తరీయవర్తులోత్తుంగ రంగ
త్కుచయుగంబుల సరసవరసంబులాడం జేసిన తెఱంగునం
గానుపింపఁ జంకల నిడిన కనత్కనకకలశంబులతోడఁ బోలు
పారుచు [2]నీరాట రేవున ఠీవి నెఱపు ద్రావిడ యువతీవితతుల
యతులచతురిమపరిమళితలలితవచనరచనరుచులు గొనవలసి
తెలిసియుం దెరువడుగు [3]తెరువరులం గూడుకొని పురంబు
ప్రవేశించి వేదాధ్యయన శబ్దంబులతోడి యుద్దులై [4]యుద్దీ
పించు షడ్దర్శనవ్యాఖ్యాన ఘోషంబులచేతఁ బూతాతిథి

1. పాండిత్యంబు ప్రకటింప. 2. నీరాటి. 3. తెరువునం.
4. యుద్దిఁబెంచు.

శ్రోత్రంబు లగుబ్రాహ్మణగృహవాటికలు దాఁటి కోటానఁ
గోటు లై కోటకొమ్మలయందు నవ్యుత్పన్ననిర్వాణంబు లగు
మాణిక్యదీపంబులు మార్తాండమండలమునకు మాఱుమం
డుచుఖండితబహిరంతరతమస్సముచ్చయంబు [1]లగుహెచ్చు
నచ్చెరువున'నాలోకించుచు [2]శ్రీరంగరాజభజనయాతాయా
తవర్తననర్తకీమణివిభూషణఘోషణపోషణంబుల నినుమడిం
చి యేపారుపారావతారవాపారపారంపర్యంబులం బర్యాకు
లాంకణంబు లగువిశంకటవిటంకంబుల నలంకృతంబు లగు
గోపురంబులు విలోకించుచుఁ బ్రాకారంబులు సొత్తెంచి
యథోచితక్రమంబున వైనతేయాదుల సేవించుచు రంగ
సంజ్ఞితం బైనదివ్యధామంబు డగ్గఱ నేఁగి యందు. 150

సీ. ఒసపరిపస మించు పసిఁడి దుప్పటివాని
 శుభ మైనయురము కౌస్తుభమువానిఁ
దెలిదమ్మి రేకులఁ దెగడుకన్నులవానిఁ
 గమ్మకస్తురితిలకంబువానిఁ
[3]దొలుపల్కుగిల్కుపావలఁ జరించెడువానిఁ
 జలువతావులసెజ్జ నలసువాని
నింద్రనీలపుడాలు నేలువర్ణమువాని
 సిరి మరుల్గొలుపు మై చెలువువాని
తే. మకరకుండలదీప్తిడంబరమువాని
డంబు నెఱపెడు మణికిరీటంబువాని

---

1. లగుహెచ్చ. 2. విలోకించుచు. 3. దొలుఁబల్కు.

రంగనాయకుఁ గాంచి సాష్టాంగనతులు
సలిపి తన్మూర్తి యంతయుఁ గలయఁ [1]జూచి. 151

చ. "తమి యమరంగ నొక్కొకటి దక్కఁగ నేలెడు నౌర మద్విలో, కముల మణీకిరీటమును గస్తురినామము నవ్వు మోము హారములును వైజయంతియు నురస్స్థలరత్నము శంఖచక్రము,ఖ్యములును బొడ్డుఁదామరయుఁ గంకణకాంచి పదాంగదాదులున్. 152

సీ. దివ్యసంయమి మనస్థితిఁ బొల్చుమత్కల
దైవంబుపదముఁ దలఁపుఁ జేర్తు
నఖిలలోకస్రష్ట యగుబ్రహ్మఁ గన్నమ
త్ప్రాణబంధునాభి నాత్మఁ జేర్తు
దైతేయకంఠనిర్దళనంబు లైన నా
స్వామిహస్తముల భావంబుఁ జేర్తు
లక్ష్మిచన్నవకు నలంకార మైననా
తండ్రివక్షమునఁ జిత్తంబుఁ జేర్తు
తే. నుల్లమునకును జూడ్కికి వెల్లగొలుపు
నావరదు మోమునందు మనంబుఁ జేర్తు"
ననుచు గీతరూపములుగా నాశుకవిత
నుతులు రచియించి పాడుచు నతఁడు గొలిచె. 153

వ. అంత నా గంధర్వుం డచ్చటు వాసి యొక్కించుక తూర్పుగాఁ జని చని. 154

చ. అలరుచుఁ గాంచె ముంగట నహమ్మతినిర్మథనప్రవీణముక్
విలసితసాధవజ్రరుచినిర్జరనిర్ఝరిణీప్రవాహసం

1. జూచె. వ. ఇత్తెఱంగునం జూచి.

వలనమిళత్ప్రియమత్తరఘుపవారమతిప్రదచంద్రశాలికా
లలితవతీవిలోలదృగలంక్రియమాణముఁ గుంభకోణమున్.

వ. అందుఁ గంపళదమందసందీప్తి ప్రవాహసంక్షాళితదిగంతరాళ సంతమసజంబాలంబు లగు గోపురప్రాకారంబుల దీపించు. మాణిక్యమయమందిరంబునందు. 156

సీ. నునుగాడ్పుదూది నించినయట్టిచల్లని
పానుపుపైఁ లీలఁ బవ్వళించి
పటువులై హారంబట్టుబటువులో యననొప్పు
రమచన్నుదోయిఁ బాదములు సేర్చి
చెలువు దీపింపంగ శిరములక్రింపట నొక్క-
కేలుఁ దలాడగాఁ గీలుకొలిపి
బంగారువలువున రంగారుకటిమీఁదఁ
జక్కఁగా నొక్కహస్తంబు చాఁచి

తే. యన్యకరయుగ్మమునఁ బాంచజన్యమును సు
దర్శనంబును దాల్చి సుదర్శనమున
నచటిజనములఁజూడ్కి ధన్యముగఁ జేయు
శార్ఙ్గపాణిని గొల్చె సుత్సవ మెలర్ప. 157

వ. మఱియు నందుఁ గుంభేశ్వరుని సేవించి దర్భశయనంబున కరిగి యందు రామభద్రు నిర్నిద్రభక్తితాత్పర్యంబుల సేవించుచు వీణావాదనానువాదమేదుర గానకౌశలంబుతోడ ని ట్లని. స్తుతించె. 158

తురగవల్గనరగడ.—

"దశరథావనీశవిమలతరతపఃఫలావతార
నిశితశరలఘుప్రయోగనిహతతాటకావిహార

కపటపటుసుబాహుదళనఘటితగాధిసూనుయాగ
అపరిమేయగౌతమాంగనాఘదమనపదపరాగ
కోమలేక్షుదళనసదృశఘోరశంభుచాపభంగ
భూమిజావివాహవిభవపూర్ణసమ్మదాంతరంగ
పరశురామగర్వపవనపానపీనబాహునాగ
గురువచోనుపాలనాతికుతుకవిధుతరాజ్యభోగ
పాదభజనవితరణాతి ఫలితగుహాసమస్తపుణ్య
పాదుకాప్రదానవిహితభరతసౌహృదానుగుణ్య
ఘనవిరాధమదవినాశకలితబహువిపన్నిరాస
వినుతపదనివేశపూతవివిధమౌనికులనివాస
తతనిశాచరీవిరూపతాకృతప్రియావినోద
అతులబలఖరాదిదనుజహననజనితవిబుధమోద
హరిణరూపధారిదారుణాసురాసుహరణబాణ
పరమఘోరబాహుబలకబంధమర్దనప్రవీణ
అమలశబరికాఫలోపహారరుచిఘనాభిముఖ్య
సమదవాలిదర్పదమన సఫలితార్కతనయసఖ్య
శరణవరణపరపరానుజప్రదీపితప్రసాద
అరుణితాక్షికోణవిరచితాంబురాశిగర్వసాద
పర్వతౌఘరచితసేతుబంధసుతరసింధుకాండ
గర్విపంక్తికంఠకంఠఖండనప్రచండకాండ
సకలదివిజనుతచరిత్ర సాధుభవలతాలవిత్ర
సకరుణాతరంగనేత్ర జానకీమనోజ్ఞగాత్ర
యతిజపార్హపుణ్యనామ యతివితీర్ణభక్తకామ
సతతసితయశోభిరామ సర్వలోకపూర్ణధామ

అహితవిదళనాతిరౌద్ర యార్తపాలనావినిద్ర
మహితనిఖిలగుణసముద్ర మమ్ముఁ బ్రోవు రామభద్ర. 159

క. పరమం బగు [1]నీ నామము
కర మామ్నాయములు తారకబ్రహ్మముగా
నిరతిఁ వినుతింపఁగ నా
తరమే [2]నిను నభినుతింప దశరథరామా." 160

వ. అని వర్ణించి యచటు గదలి, సేతుబంధంబునకుం జని యందు రామేశ్వరు బహుభక్తివిశేషంబుల నారాధించి, యనంత శయనంబున కరిగి యందుఁ బద్మనాభునిం గొలుచుచు నతని సన్నిధిం గొన్నినాళ్లు తనదు గాంధర్వవిద్య హృద్యంబుగా నెఱపె. నేను గానప్రియత్వంబునం జేసి చెవి యొగ్గి తత్తత్ప్రదేశంబుల నతండు పాడెడు పాటలు వినుచు దృష్టియుం బాఱ విడిచి యిది యంతయుం గనుంగొంటి నివ్విధంబున ననంతపద్మనాభునిసన్నిధినుండి యతం డంత. 161

క. ఆపడమటిదిశ దళకళి
కాపుష్పఫలాదిగరిమకతన సమీప
శ్రీపకలాపమణీపట
లీపటిమస్పర్ధ వర్ధిలెడువనవాటిన్. 162

క. హరిఁ గూర్చి తప మొనర్పఁగ
దొరఁకొనియెను దానఁ జేసి తోయజముఖి! యా
సరసునిగానకళా మా
ధురి యేమియు ననుభవింప దొరకదు నాకున్. 163

1. మీ. 2. మిము.

క. అని యాదిక్కునకు విలో
కనములు నిగుడించి "యదె నిగాఢపుఁ బద్మా
సనమునఁ గూర్చున్నాఁ డో
వనిత! యిప్పుడు దృఢసమాధివర్తన మీఱన్. 164

చ. అనుటయు నాలతాంగి "కడునద్భుతమింతయు నో మహాత్మ! మీ
కనుఁగవ కిప్పు డిమ్మెయిఁ బ్రకాశతఁ దత్సకలప్రవర్తనల్
కనఁబడుచున్న వే?" యనినఁ "గంజముఖీ! యనుమానమున్న ని
ష్డనుపుము దవ్వుగాఁ జెలులనచ్చటి తత్క్రియ లెల్లఁ జెప్పెదన్."

సీ. అనుడు "మహాత్మ మి మ్మంత నే నొఱయంగ
నర్హనే? మీపల్కులందుఁ గలదె
యనుమాన?" మనుటయు "నైన నిం దేమిత
ప్పిదియు పినోద మోయింతి" యనుచు
బలిమి నాయకచేతఁ జెలుల నిద్దఱఁ గడు
దవ్వుగా నంపించి తత్క్రియలను
దద్వాక్యములు సెప్పి "తార్కాణ చేసి యో
యబ్జాక్షి! యిది యెట్టు లట్టు లతని

తే. తీర్థయాత్రయుఁ దపమును దేటపఱుప
నొదపినప్పుడుగదా మది కొదవ దీఱు
దూరతాతారతమ్యవిచార ముండు
నేమొ? [1]లే దొక తెర వది యెఱుక పఱుప." 166

చ. అన విని యట్టివేళ నికటావనిజంబున నున్న చిల్క "యో
యనఘచరిత్ర! నీపలుకునం దొకచోట నసత్యశంక గ

---

1. లేదొకో తెరు విది యెఱుపఱుప.

ల్గునె? మును చెప్పినట్టికతలుం దలపోయ యథార్థముల్ మనం
బున సరిదాఁకె నా''కనినఁబల్కుఁగనుంగొనియద్భుతంబుతోన్.

క. కలభాషిణి యిట్లను "నీ
తలఁపున కెట్లు సరిదాఁకెఁ? దథ్యము చెపు మో
చిలుక; మును యెచట నుండుదు?
తలపోయఁగ నీవు చతురతరమతివి కదున్." 168

సీ. అనుడు నాపక్షి యిట్లనియె "నో పూఁబోఁడి!
నానివాసంబు నందనవనంబు
వనజాక్షుఁ డిచటికి మును పారిజాతంబుఁ
దెచ్చుచోఁ దత్పక్షు లిచ్చ గలిగి
మరలి పాఱుచు నుండ మద్భార్య యవ్వేళఁ
బ్రసవార్త యైయున్కిఁ బఱవలేక
"యెట్లైన నయ్యె నే నిచటన యుండెద"
నని యొక్కతొఱ్ఱలో నడఁగి యుండె

తే. వెనుకఁ దోడ్కొనిపోవ నా కనువుపడద
పిల్లలీఁకలు వచ్చి వర్ధిల్లుదాఁక
నంత బలుమాఱు వచ్చి రమ్మనుచు మిగుల
నెత్తురిడియెదునన్ను నాయింతి చూచి. 169

క. "ఈభవ్యోద్యానంబుల
సౌభాగ్యముగతిని మానసమునకుఁ గడు నిం
పై భాసిల్లదు నందన
వైభవ మం దెట్లు ప్రేమ వదలదొ నీకున్!" 170

తే. అనుడు "నీ వనినట్ల యానైన మనకుఁ
గలుగుబంధువు లెల్ల నక్కడనె యునికి

నచటు నెఱయంగఁ బాయ లే" నని యొనర్తు
రాకపోక లిప్వీటికి నాకమునకు. 171

వ. అట్టి యే నిప్పు డప్పుర[1]వీది నేగుచుండి "మణికంధరుం" డనుచు మీఱ లాడుకొనుమాట చెవిం బడిన "నతనిసుద్ది యిక్కడఁ గలుగుటకు నిమిత్తం బేమి కలిగెనో తెలిసెద." నని నిలిచితి; నీసిద్ధుండు నీకుం జెప్పినతీర్థయాత్రాతపశ్చర్యల వృత్తాంతంబు నిక్కువంబుగాఁ దెలిసినప్రకారంబు వివరించెద; వినుము. 172

సీ. "శచియును దాను వాసవుఁ డలనందన
వనములోనికి నేఁడు వచ్చియుండ
నొకచారుఁ డేతెంచి" యోదేవ! నే నున్న
వనములోనికిఁ దీర్థవాసి యొక్కఁ
డిటకొన్నినాళ్లక్రిందటవచ్చి యచ్చోటఁ
దపము సేయఁగఁ బూనె దానికొలఁది
యెఱుఁగునంతకు నేను నిన్నినాళ్లాలసిం
చితి; నది నానాఁటి కతుల మైనఁ

తే. జెప్ప వచ్చితి నతఁడు కాశీ గయా ప్ర
యాగపురుషోత్తమాహోబలాదు లైన
పుణ్యభూములు బహుతీర్థములును జూచి
నాఁడఁట వచించె మొదల నే వేఁడుకొనఁగ. 173

ఉ. ఉగ్రతపఃప్రభావవిభవోద్ధతి నుప్పవ మందె నోసుప
ర్వాగ్రణి! యిప్పు డాతపసియాదల నిత్యజలావగాహని
ష్ఠాగ్రహణాభిపాటలజటాపటలస్ఫుటలాలనాభృశ

1. వీథి.

వ్యగ్రసమగ్రదీప్తినివహప్రవహద్దహనాంకురచ్ఛటల్. 174

క. "ఇది మాసాష్టకమున సి
ద్ధిద మిచ్చుటి కెవ్వ రేఁగుదెంచి తపమునన్
బొదలినఁ జెప్పుము నా కని
త్రిదశేశ్వర! నన్ను నంపితిరి తద్వనికిన్." 175

క. అని చెప్పినఁ "గలదు కలదు
నిను నట్ల వచించి యంపు నిలిపితి" నని యా
యనిమిషవిభుండు చారుని
ననుపుచుఁ బిలిపించె రంభ నచటికి వేగన్. 176

క. పిలిపించి యవ్వధూటికి
నలఘుతరం బైనయట్టి యాతపసితపో
బల మెల్లఁ దాను జారుని
వలనన్ విని నట్ల చెప్పె వాసవుఁ డంతన్. 177

ఉ. "ఓలలితాంగి! యాతపసి యుగ్రత నింత నితాంత[1]దుర్గమా
భీలతపోధురంధరతఁ జేస్చుట నాసురరాజ్యలక్ష్మిఁ దా
నేలఁగఁ గోరి కావలయు నిప్పుడ దీనికిఁ బ్రత్యుపాయముం
జాలఁగ నెంచి చేయఁదగు సంశయ మంతయు మానునట్లుగన్.

క. చింత యొనర్పక యిది యొ
క్కింత యుపేక్షించి యున్న నె ట్లగునో? "గో
రంతాలస్యంబునఁ గొం
డంతప్రయోజనము దప్పు" ననఁ గా వినమే. 179

క. విను మిట్టిపనుల కెంతయు
ననుకూలం బగుసహాయ మచ్చర లిపు డీ

1. దుర్దమా.

పని కరయ వారిలోనఁ
ఘనతరముగ నీకు నేర్పు కల దని తోఁచెన్. 180

సీ. కడునల్లికలుగొనుకలికిబిత్తరపుఁజూ
పుల క్రొమ్మెఱుంగులు పలలు గాఁగఁ
నెఱయంగఁ బర్వెడునిద్దంపులేనవ్వు
తెలినిగ్గుతరఁగలు తెరలు గాఁగఁ
గొమరొందునవవిలాసములకన్బొమ లులి
వాడుచొప్పుడుఁగోల లగుచుఁ దనరఁ
దేనె లుట్టెడుమాటతేటలపసలు వా
కట్టుమంత్రంబులకరణి నమర

ఆ. నీవు గడఁగి యమ్మునీంద్రశార్దూలు త
పోమహత్త్వదర్పమును హరించి
కీరవాణి! యతనిఁ గ్రీడామృగంబుగాఁ
జేయవలయుఁ గుసుమసాయకునకు." 181

వ. అనిన విని యారంభ జంభవైరిం జూచి "యమ్మునీంద్రు డనఁగ నెవ్వాఁ డని దేవరచిత్తంబున నున్నదియో? యతండు నారదశిష్యుం డైనమణికంధరుం డని మాకు వినంబడియె; నతని నిటమున్ను పరికించుచుండుదు మస్మదాదులవిలాసంబు లెవ్వియు నెన్నండును సరకుగొని చూచినవాఁడు గాఁడు; నేఁడు విశేషించి తపశ్చర్యాతాత్పర్యంబునం బ్రవర్తిల్లుచున్నవాఁడు గావున నవశ్యంబు దేవకార్యంబు నిర్వహింతు నన లే" ననుటయు, నతం డవ్వాలుఁగంటిం జూచి "నీకుఁ దొంటికంటె [1]వయోరూపలావణ్యవిలాసంబు లెక్కుడుగ

1. నవవయో. చూ. లేబ్రాయపుఁజెలువంబు. 3-25.

వరం బొసంగితి! సందియంబువలదు పొమ్ము; కార్యసిద్ధి
యయ్యెడు; నీచాతుర్యమహిమంబు నెఱపుము." 182

క. అనుపలుకుల నలరించుచు
ననుప మహోత్సాహ మాత్మ ననుపమలీలం
దనర మణీభూషణములు
దనరమణీయాంగకాంతిఁ దద్దయు మెఱయన్. 183

క. నెచ్చెలులఁ దాను ధరణికి
నచ్చెలువ కృతప్రయాణ యయ్యె నపుడ యా
యచ్చరపదవు బెడంగు వి
యచ్చరపదనికి మెఱుంగులై కనుపట్టెన్. 184

వ. అని చెప్పి "దీనం జేసి యోకొమ్మ! యిమ్మహాత్ముని వాక్యపద్ధతియం
తయు సత్యంబ యగుట యేర్పడియె" నని పలికి యి ట్లనియె.

శా. "ఏ నానందన మంతటన్ వెడలి యిం దేతెంచితిన్ మున్నుగా
నోనారీమణి యిప్పు డేఁ గెడువిధం బూహించినం దత్తరస్
స్థానం బింతకుఁ జేరఁ బోవునను తద్రంభాదులున్" నాపుడుం
దా నాచిల్కవచోవిలాసమున కత్యంతంబు రంజిల్లుచున్.

సీ. "అఖిలంబునందు నత్యంతంబు వెలసి వ
ర్తిల్లెడుశుకసంజ్ఞఁ దేజరిలుచు
నత్యుదారాగమాఖ్యవ్యాపనందన
భూరియోర్జితానందమునఁ దనరుచు
ఘనపక్షవిలసనంబున హరితత్వంబుఁ
దెల్లంబుగాఁ జేసి యుల్లసిలుచు
నొరయ నైసర్గికం బైనవిష్ణుపదైక
గతికత్వమునఁ జాల నతిశయిలుచు

తే. నున్న యొచిల్క నీమధురోక్తిమహిమ
వీనుల కమృతరసములు వెల్లిగొలుపు
చునికి యుచితంబ మిగుల నీయోగవిభవ
మింత యంతని పొగడ నే నెంతదాన? 187

క. కావున నినుఁ బెడఁబాయఁగ
నోవిహగవరేణ్య! కొలుప దుల్లం బైనం
బోవలయుఁ గదా నీకును
నీవనితం జూడ" ననుచు నెలఁతుక యనిపెన్. 188

ఉ. వాసుకిపూర్వజన్మకిటివర్యదిశాగజకచ్ఛపేంద్రఖే
లాసుఖసక్తతత్తదబలాహృదయాంతరసంతతాదరా
శాసితనిత్యభూభరణశక్తిలసద్భుజదండ కీర్తిసం
వాసితపద్మజాండ పరివర్ధితభూసుర కాంతిభాసురా. 189

క. కృష్ణక్ష్మానాయక శ్రీకృష్ణధ్యానామృతాబ్ధిఖేలనలీలా
తృష్ణ జ్ఞానదయావహ, ధృష్ణద్బాహాబలావధీరితభీమా! 190

మంగళమహాశ్రీవృత్తము.—

శీలితశుభాచరణ శిష్టజనతాశరణ చిత్రవిజయాభరణ యుద్ధా
భీలభుజవిస్ఫురిత భీరుదయనత్వరితప్రేమపద సచ్చరిత భావా
లోలకరుణాసహితలోకభరణావహితలోభకలనారహితవిద్యా
ఖేలనసముచ్ఛ్వసిత కేవలసుఖోల్లసిత కేశవనుతిప్రసితధీరా.

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ
పింగళి యమరనార్యతనూభవ సౌజన్యజేయసూరయనామ
ధేయ ప్రణీతంబైన కళాపూర్ణోదయం బనుమహాకావ్యంబు
నందు ద్వితీయాశ్వాసము.

---

శ్రీ ర స్తు

# కళాపూర్ణోదయము

## తృతీయాశ్వాసము



నిత్యవిహారస్థల
తానుతలీలాకటాక్ష ధర్మవిధానా
నూనాపేక్షవిలాస
శ్రీనవ్యమనోజ నారసింహతనూజా. 1

[1]వ. అవధరింపుము. 2

క. అంతట సిద్ధుం డాసీ
మంతిని నీక్షించి "యేను మదిరేక్షణ మీ
చెంతకు వచ్చుట చెవులకు
వింతచెలువు గులుకుపాట వినుటకె సుమ్మీ. 3

క. కావున విపంచిఁ గైకొని
నీ వించుక గానపటిమ నెఱపఁగ వలయుఁ"
నావుడు "నట్టుల కా" కని
యావిద్యం బ్రొద్దు పుచ్చె నతనికి మిగులన్. 4

వ. ఇవ్విధంబునఁ గలభాషిణి తన గానవిద్యాకౌశలంబున నతని [2]నుబుసు పుచ్చె; నంతకమున్న రంభాదులును మణికంధరుని తపోవనంబు డగ్గఱం జని యవనికి డిగ్గి రప్పుడు. 5

1. ఈవచనములేదు. 2. యుబుసు.

చ. వనదచయంబుతో నలిగి వచ్చుచునున్న మెఱుంగుఁదీఁగెలో
యనఁగఁ దనూలతల్ మెఱయఁ దద్విరహంబున కోర్వలేక వెం
టన చనుదెంచునంబుదగణం బన వేణిభరంబు లింపుగా
ననయము భూజనంబులకు నచ్చెలువల్ గనుపట్టి రంతటన్.

చ. కరపదపల్లవద్యుతు లకాలపుసంజ ఘటింపఁ దన్నఖ
స్ఫురణలు తారకానికరముం దలఁపింపఁగ వారిమోముఁదా
మరలబెడం గనేకవిధుమండలవిభ్రమకారిరై మహీచరులకు
నెల్ల నద్భుతము సౌఖ్యము నెంతయుఁ జేసె నయ్యెడన్. 7

క. ఇలమీఁదికి డిగి వేలుపుఁ
బోలఁతులు మణికంధరునితపోవనమున కిం
పలరఁ జనిరి తమచూడ్కులు
తోలుతగ నీలోత్పలముల[1]తోరణ కట్టన్. 8

వ. అంత. 9

చ. ప్రసవపరాగముల్ పసుపుఁబయ్యెదచాడ్పున నుద్గమింప ను
ల్లసదళిపుంజముల్ కచకలాపములీలఁ జలించుచుండఁ బ
ల్లవసముదయంబు భూషణవిశేషములుం బలెమ్రోయవారి కిం
పొసఁగ వనాంతలక్ష్మి ప్రియ మొప్ప నెదుర్కొన లేచెనో
యనన్. 10

చ. అళులుఁగచంబులుఁ లతలు నంగములుం బువుగుత్తులుంగుచం
బులును జిగుళ్లుఁ బాణులును బుష్పవిలాసము మందహాసముం
గలసి తడంబడన్ విబుధకామినులు లావనలక్ష్ములందు శో
భలు మిగులం బ్రవర్తిలిరి పాలును నీరునుబోలె నేకమై. 11

1. దోరణ.

సీ. ఆవులు నాకఁ గన్నఅమోదుప్పులులును
బులులచేఁ గుడువంగఁ బోవు లేళ్లు
లేళ్ల చెర్లాట రంజిల్లెడుహరులును
హరులు గోళ్లను గోఁక నలరుకరులుఁ
గరులకటాళి వైఖరి నాడుపాములుఁ
బాముల లాలించు బభ్రుతతులు
బభ్రుతతుల ప్రక్కఁ బాయనియెలుకలు
నెలుకలఁ బెంచుపిల్లులును గలిగి
తే. యపుడు వెలుఁ గొనరించె నాయంగనలకుఁ
గీరభాషితపోషితాఖిలతపస్వి
పటలతారక బ్రహ్మవిభావనంబు
భావితశుభావనంబు తపోవనంబు. 12

సీ. ప్రత్యక్ష మైనట్టి పావనత్వంబు నాఁ
బుంజీభవించినపుణ్య మనఁగ
సాక్షాత్కరించిన శాంతరసంబు నాఁ
గరుడు గట్టినతపోగరిమ యనఁగఁ
గవునఁ బోసినపరమసత్వంబు నా
రాశియై యున్న వైరాగ్య మనఁగఁ
గరచరణాదులు గలయోగవిద్య నాఁ
బూదె గట్టినతత్వబోధ మనఁగఁ
తే. బరఁగునమ్మౌనిఁ గనిరి తచ్చరణనఖర
చంద్రచంద్రికాముకుళితచారుహస్త
నలినసంగభృంగాయమాణభ్రమరక
నికర లగుచు నావేలుపునెలఁత లంత. 13

క. కని యాతనియసమసమా
ధినిశ్చలత నుగ్ర మైనదృష్టి కెదురుగాఁ
జనఁ గొంకుచు భయవశమున
వెనువెనుకకుఁ జని రొకింత వేలుపుచెలువల్. 14

ఉ. అప్పుడు రంభ చాలభయమందుచు "నిమ్మునియుగ్రరూపముం
దప్పకచూడ మేనుగరు దాల్చుచునున్నది యింద్రుకార్య మే
చొప్పున నౌనొకో!యరసి చూడఁగ నేరక యియ్యకొంటి నే
నిప్పని?"కంచుఁ బుద్ధిఁ బొరయించెదృగంచలచంచలత్వమున్.

క. తదనంతరంబ మగుడం
ద్రిదశాధిపకార్యమునకు ధృతి పాదుకొనన్
మది నిలిపి చెలులుఁ దానున్
ముదిత మెలఁగెఁ దత్సమీపమున వనకేళిన్. 16

ఉ. లోఁగక వార లవ్వనములో విహరించి రొక ళ్లొకళ్లకై
యేఁగుచుఁ గమ్మపూఁబొదలు లీఁగుచుఁ దేనియసోనవానలం
దోఁగుచుఁ దూఁగుటుయ్యెలలఁ దూఁగుచు నొక్క తెకోయు
గుత్తికిన్,మూఁగుచుఁ గంతుపీణె లన మ్రోఁగుచు నొండొరు
చేతు లాఁగుచున్. 17

సీ. "చిగురాకుఁబోఁడి యీచిగురాకుపోఁడిమి
మఱి లేదె యెచటికి మరలె దేమి!"
"కయ్యంబు వలదు నీ కయ్యంబుజాక్షితోఁ
గేలికి మఱియుఁ గంకేళి గలదు"
"లీలాగుళుచ్ఛంబు లీలాగునఁ దలిర్పఁ
గలహంసగమనరో కలహ మేల?"

"కుందరాజికి నింకఁ గుంద రాజీవాక్షి
యేటికిఁ! జాలు నీయేఁటి కెల్ల"

తే. ననుపలుకు లెంతయును హాళాహాళిఁ జెలంగ
రహి వసంతహిందోళాదిరాగకలిత
గానములు మీఱ భూషణక్వణన మమర
నమరకాంతలు విహరించు నవసరమున. 18

ఉ. అంచితలీల రంభ మునియగ్రమునన్ విహరించె నెంతయున్
మించునొయారమున్ గులుకునెన్నడయున్ విడఁ బాఱు
కొప్పు నొ,క్కించుక జాఱుపయ్యెదయు నిట్టటుఁ దూలెడు
హారముల్ మిటా,రించు కుచంబులున్ జలదరించువలగ్నముఁ
బొల్పు మీఱఁగన్. 19

వ. అట్టియెడ. 20

ఉ. దైవనియుక్తిఁ జేసి విరతం బగుచున్న మనస్సమాధితోఁ
బావనమూర్తి యాతపసి భామల యారొదవించు నక్షిప
క్ష్మావళు లంత విచ్చుచుఁ దవంగనఁ గన్గొని దానిరూపు చే
తోవికృతిన్ ఘటింప ధృతితోఁ గనుమోడ్చి హరిం దలంచు
చున్. 21

ఉ. కొమ్మబెడంగుసొంపుఁ గనుఁగొన్న కనుంగవ తత్తఱింపఁగా
నమ్ముని యాఁప నోపకపు డల్లన ఱెప్పలు విచ్చుఁ గ్రమ్మఱన్
గ్రమ్మఱఁ గృష్ణకృష్ణ యని గ్రక్కున మోడ్చు మగుడ్చుఁ
గ్రమ్మఱన్, గ్రమ్మఱ మూయు మన్మథవికారము ధైర్యముఁ
గ్రుమ్ములాడఁగన్. 22

ఉ. అంతట భావికార్యఘటనానుగుణంబుగ నీశ్వరేచ్ఛచేఁ
గంతుఁడు మిక్కిలిం బ్రబలి కాంతపయిం బరఁగంగఁ జేసె న

త్యంతము మానిమానసముఁ దద్ఘనధైర్యకఠోరశృంఖలా
సంతతి యెంతయుం గుసుమశస్త్రికలం దెగఁ గోసి వైచుచున్.

తే. దర్పకోగ్రప్రతాపసంతప్తమైన
తాపసునిచిత్త మప్పు డాతలిరుఁబోఁడి
చెలువ మనియెడునమృతంపుఁ గొలనిలోన
నోలలాడుచుఁ దిరిగిరాఁ జాలదయ్యె. 24

వ. ఇత్తెఱంగున బద్ధానురాగుం డగుచు మణికంధరుం డాగంధ
గజయాన యాకారరేఖావిలాసంబు లెంతయుఁ బరికించి. 25

తే. "రంభయే యిది కాదో? లేఁ బ్రాయపుఁజెలు
వంబు నుజ్జ్వలరూపలావణ్యములును
నగుమొగముసొంపు నింత యెన్నఁడును గాన
దీని కీవింతమహిమ సంధిలుట యెట్లు." 26

వ. అని యాపల్లవాధరసల్లాపపరిరంభణాదులకు నువ్విళ్లూరుచుఁ
దదీయలీలావిహారంబు లత్యాదరంబున విలోకించుచుఁ దన
మనంబున. 27

సీ. "చెలువ మోమెత్త నాసికఁ జూచియో వింత
గతులపువ్వులు చంపకము సృజించె
వెలఁదికౌఁగిట నదె వికసించెఁ దొలుమేనఁ
గురువకద్రుమ మెంత పరమమునియొ
గల్లున నందియల్ గదలంగ నదె తన్నెఁ
గాంత యక్కజ మశోకంబ యగును
నాతి కెంగేల నంటఁగఁ బులకించు చు
న్నది చూత మెంతపుణ్యంబుఁ దరువొ!

తే. యెంతజాణయొ ప్రేంకణ మింతిపాట
కలరె నూర్పుఁదావులకు వావిలియుఁబోలె
మగువనగుచూపులఁ దనర్చుమ్రాఁకులార
పురుషతిలకవిఖ్యాతి మీ కరుదు గాదు. 28

క. ఆనెలఁత తేటమాటలఁ
దేనియ లుట్టుటలు తేటతెల్లమ; యదిగో
దానికి గుఱు తామాటల
చే నలరెడుగోఁగులందుఁ జిప్పిలెఁ దేనెల్. 29

క. మగువముఖాసవవాసనఁ
దగ నలరఁగ నేర్చురసికతకు సుకవీంద్రుల్
పొగడం బొగడం బొగడం
బొగడంబుల కలరుతరులు పొగులవె లజ్జన్. 30

క. ఈనెలఁతతోడిసంగతిఁ
గానియపవర్గపదము గలుగుటకంటెన్
దీనివిహారంబుల నిం
పూనెడువనతరుపు లగుట యుత్తమ మరయన్. 31

మ. మునిధర్మంబుల కెల్ల దవ్వని జనంబుల్ నవ్విరన్ నవ్వనీ
ఘన మైస్త్రీతపోధనంబు నెఱయం గాఁ బోయినం బోవనీ
మునుముట్టంగఁ బ్రబోధవాసనల పెంపుల్మాసినన్ మాయనీ
వనితారత్నముఁ గూడ కెట్లును దమిన్ వారింపలే నియ్యెడన్.

క. అని సాహసమున నాతం
డనుమానము లెల్ల విడిచి యచటు గదలి యా
వనజాక్షి వనవిహారం
బొనరించుసమీపమునకు నొయ్యన చనియెన్. 33

తే. చని "చకోరాక్షి యిచ్చనంబునకు నెచట
నుండి వచ్చితి నెచ్చెలిపిండుతోడ ?
రాకకు నిమిత్త మెయ్యది ? నాకుఁ జెవుల
పండువుగ వినుపింపు నీపలుకు" లనియె. 34

తే. [1]అనుడు నది "తనరాక క్రీడార్థ" మనిన
వినుచు "నదియెల్లఁ గల్ల యోవెలఁది నాత
పఃఫలంబవు నీ" వని పల్కె మౌని
ముదిత ముసిముసినగవుతో మోము వంచ. 35

ఉ. చంచలనేత్ర యిట్లు తనసంగతి కొప్పుటఁ గాంచి మౌని దాఁ
గొంచక పట్టెఁ బైచెఱఁగుఁ గొమ్మయు "మీ రెటువంటి
పెద్దవా, రెంచ రొకింతయుం గెలనియింతుల" నంచు
బెనంగె నాత్మచే, లాంచలముం దదీయ మగుహస్తముఁ
జన్నుల నూఁది పట్టుచున్. 36

ఉ. అయ్యెడ నింత నంత గుసుమాపచయం బొనరించుచుండ్రుఁ
బోఁ,ద్లొయ్యన దవ్వుగా నరిగి రొండొరుమోములు చూచి
"యద్దిరా, యయ్యకు మన్మథాభ్యుదయము" మంచుఁ "గరం
గనివాడుఁ గల్గునే, యెయ్యెడ రంభ దాను మెఱయించు
బెడంగుల" కంచు నవ్వుచున్. 37

చ. బలిమిఁ దపోధనాగ్రణియుఁ బైకొనుకోర్కులఁ దత్తరిల్లుచుఁ
జెలువను గౌఁగిలించుకొని చెక్కును జెక్కును సంఘటిల్లఁ
ద్రొక్కి త్రిలుచుఁ బదంబు లొక్కటొకటిఁ బెనఁగఁ మెలు
పొప్పఁ దార్చె లేఁ,దలిరుల జొంపముల్ గలుగుదట్టపుఁ
బూఁబొదరింటిలోనికిన్. 38

---

1. అనుడుఁ దనరాక క్రీడార్థ మనియె రంభ.

వ. ఇట్లు తార్చి. 39

తే. క్రొవ్వి కలహించుతుమ్మెదకొదమకదుపు
[1]రాయిడిని గడుదళముగా రాలినట్టి
ప్రసవదళములు వఱవనివఱపు లగుచు
నెసఁగ నిం పొందునాపొదరింటిలోన. 40

సీ. బెరు కెఱుంగనిగాఢపరిరంభముల నల్లి
బిల్లిగొంచుఁ బెనంగుపెనఁకువలను
బెఱిఁగెడివేరాసవేర్మి ననర్గళ
లీలఁ బర్విడుకుచాస్ఫాలనముల
నడ్డమాఁకలు లేక యబ్బినయక్కిళ్ల
నమరించునఖరరేఖాంకములను
గోదగోన్నతమిఁ గొంకు కొసరు లేకొనరించు
వివిధదంతక్షతవిభ్రమముల

తే. మన్మథావేశవిలసనమహిమ నెఱపు
తపసిఁ గని "సాదు రేఁగినఁ దల పొలాన
నిలువ దనుమాట నిజ మయ్యె నేఁ" డటంచు
మగువ నవ్వుచుఁ జేతకు మాఱు సేసె. 41

వ. ఆసమయంబున నటమున్న ద్వారకానగరంబునం గల కల
భాషిణిగానంబువినుచున్నసిద్ధుండు తత్ప్రశంసాప్రసంగంబున
మణికంధరునిమాటఁ దడవుటయుఁ దలఁచుకొని యాచంచ
లాక్షి సిద్ధుని నభివీక్షించి. 42

తే. "అమరపతిపంపునను వచ్చినట్టిరంభ
కతన నే మయ్యెనో మణికంధరుని త

---

1. రాయఁడి.

పం బిపుడు మీర లటు దృష్టిపఱపి చూడుఁ"
డనిన నొకకొంతతడ వతఁ డట్లచేసి(సె). 43

వ. ఇట్లు దివ్యదృష్టిం జూచి. 44

క. నగుచు "నిఁక నేమితపమో
మగువ సలుపుచున్నవాఁడు మణికంధరుఁ డా
మృగలోచనతో నదె యొక
చిగురుంబొదరింటిలోనఁ జిత్తజలీలల్." 45

వ. అనిన విని కలభాషిణి యమ్మణిస్తంభునిబోధమహిమకు వెఱఁగందుచు ననేకప్రకారంబులఁ బ్రశంసించి "యో మహాత్మ! యొకటి రెండుపూఁటలు మాయింట నిలిచి యేము సేయుపరిచర్యఁ గైకొనవలయు." ననిన నతండు "గాన లోభంబున నీభవనంబునకు వచ్చుటింతియ కాని, మఱి వీసువాసునుం బఱెఁ బట్టాంబుల నెట్టుకొని యిట్టునట్టు మహిమలు ప్రచరించువారము గాము. గూఢప్రకారంబున నిలుపనోపుదేని నీయుపచారంబులు గైకొనియెద." ననుటయు "నట్లు సేయుదు," నని తన గృహారామంబునందు నిలిపి యతిరహస్యంబుగా నాసిద్ధునకు నిష్టంబులైనయన్నపానాదుల మోదం బొనర్చుచు నచ్చటికి నెవ్వరిం బోనీక తాన పరిచర్య సేయుచు రెండుమూఁడుదినంబులు హృదయంబు రంజిల్లఁ జేసి యంత నంతరంగంబున నలకూబరసంగమాభిలాష యతిశయిల్ల నతని ప్రియవనితయైనరంభ తెఱం గెఱుంగుటకుఁ గ్రమంబునఁ బ్రసంగంబు దిగిచి సిద్ధునితో నిట్లనియె.

తే. "అనఘ! మణికంధరుం డట్లు తన[illegible]ము
విఘ్న మొందించుకొనుటకు వెఱ పొడమెడుఁ;

దిరుగఁ దప మొనరింపంగ దొరఁకొనియె నొ;
యిపుడు రంభతో నున్నాఁడొ; యెఱుఁగవలయు." 47

క. అనుటయు నతఁ డమ్మునిదెసఁ
దనదృష్టి నిగుడ్చి నగుచుఁ "దరుణి యిఁకఁ దపం
బనుమాట గలదె! యిదె యా
ఘనుఁ డున్నాఁ డిపుడు రంభ[1]కౌఁగిట" ననియెన్. 48

ఆ. అనిన "వార లింక నచ్చోటువాసి పో
యెదరొ యుండువారొ యెఱుఁగవలయు
మఱియుఁ జూచి చెప్పుఁడు మాకిఁకఁ దదభివీ
క్షణము వెలయ నేఁడు శంక విడిచి. 49

ఆ. అనుఁడు "లేవు నాకు నాశంక లెవ్వియు;
నెన్నిమార్లు చూడు మన్నఁ జూతుఁ;
బడఁతి "కలదె జాతిపతిమకుఁ జక్కిలి
గింత?" నామధృతికి గెంటు లేదు." 50

సీ. అని పల్కి మణికంధరునిదిక్కునందు దృ
ష్టి నిగుడ్చి యొక్కింత చెవియు నొగ్గి
యొకకేల మాటలాడక యుండఁ గలభాషి
ణికి సంజ్ఞ చేయుచు నిశ్చలత్వ
మున నొక్కించుకసేపు విని "యౌర వారకా
మునులమే లిట్టిదె!" యనుచు నగిన
"నది యేమి యెఱిఁగింపు"మని యాలతాంగి త
న్ననయంబు నడుగ నిట్లనియె నతఁడు
తే. "నీకు నే మని చెప్పుదు నీరజాక్షి!
యడఁచుకొనియెద ననిన న వ్వాఁపఁ రాదు!

1. కౌఁగిటిలోనఁ.

పరమసంయమిఁ దా నట్లు [1]బతము చెఱచి
మిగులఁ దుది రంభ చేసినతగవు వినుము. 51

క. కళ లంటి [2]కరఁచి తనచె
య్యిలఁ జొక్కెడుతపసిమది చివుక్కురు మనఁగా
"నలకూబర! విడు విడు రా
యలసితి"నని పల్కె మన్మథాతివివశతన్." 52

మ. అనిచెప్పఁగా విని సిద్ధుఁజూచి"నగనేలా యింత భవ్యాత్మ! యా
వనజాతేక్షణ యేమి సేయును? మహావాల్లభ్యసౌభాగ్యవ
ర్తన నర్థేశకుమారుఁ డంతరహింగాఁవ న్నేలుకోఁబోలు! నా
యన తాని త్తఱినట్టివల్లభకు దవ్వై యెందు నున్నాఁడొకో!

వ. అతనిఁ బరికించి చూడవలయు." ననుటయు సిద్ధుండు నవ్వుచు
"నీ కిదియ కదా ప్రధానప్రయోజనంబు"నని పల్కి, యిటు
నటు పరికించి చూచి యతఁ డున్నచోటు గని కలభాషిణి
కి ట్లనియె. 54

ఉ. "తా వెనువెంటఁ బాయక సదా చరియించినఁ దద్వినోదమో
దావృతిఁ జిక్కి రంభ తగినట్టితపోహతి సల్పలేదు; కో
పావహ మింద్రబుద్ధి కది; యట్లగుటం బ్రియుఁ గూడియట్టికా
ర్యావసరంబులందుఁ జనఁడాతఁడు; మానఁడు వెన్విరాళిచేన్.

క. కావున మణికంధరునిత
పోవనముసమీపభాగమున నొక[3]వనిఁ జూ
తావళిలో నున్నాఁ డదె
పూవులను జిగుళ్లనొప్పుభూజము క్రిందన్." 56

వ. అని చెప్పి యి ట్లనియె. 57

---

1. పరము. 2. కఱఁచి. 3. వనచూతావళిలో.

క. "తరుణీ! యిపు డాతనిపైఁ
బరాకుచే నీవు గానపాటవగుణముం
గరము మెఱయిం[1]ప వేనే
నరిగెద మఱి లేద యితర మగుపని యిచటన్. 58

తే. అంపితేఁ బోయి వచ్చెద," ననుటయుఁ గల
భాషిణి "మహాత్మ నిన్ను నాపాలిభాగ్య
దేవతగ నమ్మియుంటి; నాజీవితంబు
నేమిగాఁ జేసి పోయెద వెఱుఁగఁ జెపుము." 59

చ. అనుటయు "నన్ను నిప్పుడనునట్టిదియెయ్యది నాకుఁజెప్పుమా
వనిత! క్రమక్రమంబునను వచ్చినయట్టుల వత్తుఁ గాక!" నా
విని "బళి! లెస్సమాట యిది వేఱొకనాఁ డిఁక మీరువచ్చియే
ననుఁ గృపఁగాచుటల్? వినుఁడు నామదిలోఁబలిచంప మేర్పడన్.

క. ఈవేళన యాతనికడ
కేవిధమున నైనఁ జేర్చు టింతియ తక్కం
ద్రోవ మఱి లేదు నన్నుం
గావన్ క్షణభంగురములు కాంతలతాల్ముల్." 61

క. తదుపాయము దిద్దుటకున్
మది నెన్నఁ బ్రభావఘనులు మఱి లేరు మహా
భ్యుదయానుభావగుణసం
పదఁ బొదలినమీపక్కఁ బావనచరితా!. 62

చ. అన విని సిద్ధుఁ డిట్లనియె "నంబుజలోచన! నిన్ను నేఁడ యా
యనకడఁ జేర్చునంతటియుపాయము నేర్చిన నేను డాఁతునే?

---

1. పలేవే.

యనుకొనరాదు గాకనినుఁబ్రాణ విభుం దగఁగూర్చిప్రోచియా
వెనుకటినీదుపాట వినువేడుక నెట్లగుచున్నవాఁడనో! 63

తే. చింత సేయుము నీవ యనంతశయన
పద్మనాభసమీపభూభాగవర్తి
యైనకాఁబేరి యెక్కడ; యతని ద్వార
కాజనులు నేఁడ చేరు టెక్కడ లతాంగి! 64

క. మించుగ మాగురువులు శి
క్షించిన యీయెక్కిరింతసింగమునకు నూ
హించ నొక నాల్గుగడియల
సంచారము వలయు నతనిసన్నిధిఁ జేరన్. 65

వ. దీని కెంతవలసిన నేమి? యిది తడవం బని లేదు. నిన్ను దీనిపై నునిచికొనిపోయెద నంటినేని, యోపూఁబోఁడి! తోడిసిద్ధు లిది వేఱొక్కలాగుగా నెంతు; రెవ్వరి యంతస్సారం బెవ్వ రెఱుంగుదు? రదియునుం గాక, మీబోంట్ల సంస్పర్శమాత్రంబు నస్మదాదులకు సమ్మతింప నుచితంబు గాదు; మఱి వేఱొండుసామర్థ్యంబు లేదు. నాకుఁ గల దూరదృష్టి దూరశ్రవణ[1]శక్తి యిం దేమియు నుపకరింప దింక నీవు చెప్పిన ప్రకారంబు గావించెదఁ జెప్పు." మనుటయు నాసిద్ధునకుఁ గలభాషిణి యి ట్లనియె. 66

సీ. "ఓసిద్ధపురుష! మీ రేసరణిని గొని చన్న
నే మగుఁ? దక్కుశంక గలదె?
నీమహత్త్వముఁ గాననిజడాత్ములే మన్న
నేమి? కన్నమహాత్ము లించుకయును

1. శక్తి లిం దేమియు నుపకరింప వింక.

వేఱొక్కగతిగ భావింపర మముబోంట్ల
సంస్పర్శమాత్రంబు సమ్మతింప
నుచితంబుగా దంటి రుచితంబె మఱి నాదు
ప్రాణహానికి నోర్చు టరసిచూడఁ?
తే. బలుపలుకు లేల? యింక నా చెలులు గిలులు
నేఁగుదెంచి విఘ్న మొనర్తు రిత మెఱుఁగక
గావునం గొనిపొమ్ము శీఘ్రంబ నీదు
వెనుక నిడుకొని నన్ను మద్విభునికడకు." 67

సీ. అన నియ్యకొని సిద్ధుఁ డరు దైనపులితోలు
పల్లంబుతోడ నిబ్బరపుబిగిని
బొట్టపట్టెడ గాఁగఁ గట్టినపెనుఁబాఁప
తట్టంబుతోడ వాదపుఁబసిండి
యంకపన్నెలతోడ సంకుపేరులతోడ
వశ్యౌషధపుఁదీఁగె వాగెతోడ
నేకపార్శ్వమున భల్లూకచర్మపుటాఱ
ఘుటియించినట్టిబల్లత్తితోడ
తే. వఱలు నేనికదిండి వార్వమును దొలుతఁ
గాఁగఁ దా నెక్కి "నన్నుఁ దాఁకకయ దీని
పటివిభాగంబు నెక్కి రాఁగలవె యబల
వెనుక మరగొమ్ము నూఁతఁగా గొనుచు?" ననియె. 68

క. అన విని "యీపాటిగ మీ
యనుగ్రహము గల్గె యుండ నక్కట యింక నేఁ

జనుదేక యేమి?" యని తన
కనువుగ హరి నతఁడు నిలుప నంగన యెక్కెన్. 69

తే. ఎక్కి "సిద్ధేశ యెవ్వరు నెఱుఁగకుండ
నెట్లు గొనిపోయెదో?" యన "నేల శంక?
యెందు నెద్దులు బండియు నేకమైనఁ
గొండమీఁదికిఁ బోవు నోకొమ్మ" యనుచు. 70

క. నింగికి "ధే!" యని కదలిం
చెం గడు వడిగలుగుతనదుసింగముఁ బలుమా
ఱుం గలభాషిణిఁ దేటి క
నుంగొని "పదిలమ్ము సు"మ్మనుచు శీఘ్రగతిన్. 71

ఆ. మగులు గోడమీఁద మ్రాఁకులు చిగురుజొం
పములు వానిమీఁదఁ బ్రచురదోహ
దములధూపములును దనకు మాటుగ గూఢ
గతిని గాంతఁ గొనుచు నతఁడు సనియె. 72

చ. చని చనియొక్కచో నతఁడు [1]చాలుగ నక్కజ మందుచుం
గనుం,గొనఁ దమమేఘురంజిఁ బొది గొన్నఘనావళిలోననుండి
దా,రున నెదు రైరి వైభవనిరూఢిఁ జెలంగెడు కొంచఱంగ
నల్, ఘనతరచాతురీమధురగానకళాకలనాకలాప లై. 73

క. తమపాటఁ జినుకుచినుకుల
దుమదుమగాఁ బడిసినట్టిదువ్వాలువలతో
గుమగుమ యనుపరిమళబ్భం
దముతో నప్పు డొకయిం పొనర్చిరి వారల్. 74

1. చాలఁగ.

వ. ఇట్లింపొనర్చుచు నెదురైన నతండు వారిని సంభాషణ
క్రమంబున రంభాసఖు లగుట యెఱింగి "యిది యేమి
యనుంగునెచ్చెలి నచ్చట విడిచి వచ్చితి? రచ్చెలువ మణికం
ధరుమీఁది యనుగ్రహంబు వదలక యింకనుం గొన్నినాళ్లు
తద్వనంబున నిలుచునో?" యనుటయును నగుచు వార లి
ట్లనిరి. 75

క. "ఎక్కడి మణికంధరుఁ? డతఁ
డెక్కడఁ బోయెనొ యెఱుంగ? మిపుడు ముదముతో
నక్కొమ్మ పొదలుచున్నది
తక్కక నలకూబరుండుఁ దానుఁ రతులన్. 76

చ. ప్రియునిసమాగమోత్సవము పెంపున నింపలరారునామృగా
క్షి యిపుడు తద్వనిఁ రతివిశేషముసొంపులఁ జిక్కి యున్కి
యా,రయుచుఁ దదిష్టముఁ విడిచి రమ్మనఁ జాలక యాకె
నుంచి యేము యరుగుచున్నవార" మని మానిను లచ్చటు
వాసి పోవుచున్. 77

క. "వేళాకోళపుఁదీఁగలుఁ
బేలికలుఁ గళాసములును బీఱ[1]జడలుఁ దాఁ
దాలుచు టెట్లొకొ మింటఁ
లీలాహరిఁ దోల నింత నేర్పరి యయ్యెన్! 78

ఎక్కడ దొరకెనొకో యీ
వొక్కపుగుబ్బెత [2]బెడంగుజోగికి? నహహా
యిక్కలికి గుత్తగొనుఁ బో
తక్కక దివి నిమిష మున్న దైవతవిటులన్!" 79

1. జడలుచుం. 2. వెడంగు.

వ. అని చెప్పికొని రంత. 80

క. నలకూబరుండు రంభం
గలయుట విని చిన్నవోవు కలభాషిణిరీ
తులు దిరిగి చూచి "దీనిం
గలఁచెర యివ్వార్త తాపకరమై" యనుచున్. 81

ఉ. సిద్ధుఁడు నవ్వి "యోచెలువ చింతిలఁగా వల దిప్పు డెంత
యున్, బుద్ధిఁ దిరంబు గాఁగ ధృతిఁ బూను మొకించుకసేపు
లోన నే, శుద్ధముగాఁగ నీమనముశోకము సర్వముఁ బుచ్చి
వైచెదన్, సిద్ధము నాదుప" ల్కనియెఁ జెల్వయు మోము
వికాస మందఁగన్. 82

క. "ఏరీతి నింతమిక్కిలి
చేరికగా నాడి" తనియె సిద్ధుఁడు "చూడం
గారాదె కుసుమఁ బోవుచుఁ
గూరలచవియడుగ నేల కోమలి?" యనియెన్. 83

క. కంఠీరవ మట్టియెడం
గంఠం బెగ నెత్తిచూచి కదలక నిలిచెం
గుంఠితగతియై యెందు న
కుంఠితగతి యనఁగఁ దొల్లి గుణము నెఱపియున్. 84

వ. అప్పుడు.

సీ. హుంకారములతోడ నుచ్చాటనపుబద
నికతీఁగతఱటున్ వ్రేసి వ్రేసి
కడుడాక మీఱంగ మడమలు దాఁటించు
చును ముందఱికి లివ చూపి చూపి

మొగము పార్శ్వములకు మగుడింపకుండ వా
కట్టుమూలికవాఁగెఁ బట్టి పట్టి
వడి నూర్ధ్వగతిని లేవకయుండఁ దననాగ
బెత్తాన మూర్ధంబు మొత్తి మొత్తి

తే. సిద్ధుఁ డధిక ప్రయత్నసన్నద్ధుఁ డగుచు
నెంత చేసిన నాసింహ మెదుటి కడుగు
పెట్టదయ్యెను [1]గర్జావిభీషణముగఁ
దోఁకఁ ద్రిప్పుచుఁ గడువెన్కఁ ద్రొక్కుఁగాని. 86

ఉ. అప్పుడు చాల సంక్షుభితయై పడజాతి "యిదేమిదేమయా
యిప్పుడు దీనిచంద?" మనియెం గలభాషిణి [2]మేచెమర్పఁగాఁ
గొప్పు విడంగఁ బాలిఁ జనుగుబ్బలఁ బయ్యెద వాయసుస్థితిం
దప్పి పిఱుందు పల్లటిలఁ దా మరగొమ్మిరుగేలఁ బట్టుచున్.

వ. సిద్ధుండు నంతఁ దద్గమననిరోధకారణంబుం దలంచుకొని యా చంచలాక్షితోడ. 88

క. "తరుణి! వెఱవకు పల్లవ
మరగొమ్మెఱుకు నాకు మర్యాదావి
స్మరణంబైనది మాటల
పంకుచే" ననుచుఁ దనదుపారీంద్రంబున్. 89

వ. కొన్నియడుగులు దిరుగఁ బట్టి ధరణికి డిగఁ దోలుకొనివచ్చి యచ్చట నచ్చెలువతోడ నవరోహణంబు సేసి కేసరిని మేఁతకు విడిచి 'యోపడఁతి యీముంవరినికటంబునంద మృగేంద్రవాహన యనుశక్తి గలదు. తన్మందిరంబు ముందఱ నున్నమృగేంద్రంబునకుఁ గ్రిందమీఁదం జుట్టుపట్టున నెట్టిబెట్టి

1. గర్జాది. 2. మైచెమ.

దంపు సింగంబులుం జన వెఱచు నిది మఱచియే నెంతతోలిన
మనవాహనం బచటి[1] కట్టెదురు నడచు; మనము నమ్మహాశక్తికి
నభివందనంబు సేసి పోయినం గార్యసిద్ధి యగు; న మ్మనుచు
నల్లనఁ దనభల్లూకచర్మకోశంబుతోడిఖడ్గంబు పుచ్చికొని
సింగపుఁ[2]బల్లనముపోక యక్కడన యొక్కమఱుంగున డాఁచి
యాచపలలోచనను మృగేంద్రవాహనగుడికిం దోడ్కొని
చని తద్బాహ్యమంటపంబున నునిచి "యద్దేవిపూజకుఁ
బువ్వులు దెచ్చెద" నని పూఁదోఁట కరిగె నప్పు డత్తెఱంగు
గనుంగొని. 90

సీ. పసిమి పో నెండినకసవుబుట్టయుఁబోలె
నరవెండ్రుకలు పర్వ శిరమువలన
నులి గొన్న చెలఁదిపువ్వులనూలివల్లు నా
నమరెడు ముడుతకన్బొమలవలనఁ
గడుఁ జిక్కినట్టిబంగరుపూఁత పొక్కిళ్ల
వడువు సూపెడి మేనివళులవలనఁ
దునిసిప్రే లెడుమ్రాఁకుతునుకలఁ దలపించు
బాహులవక్షోజలంబనమువలన

తే. ఘూకరవములచాడ్పున ఘోరవృత్తిఁ
దనరు ఘనకాసకుహికుహిధ్వనులవలనఁ
భావజుఁడు వెళ్లిపోయినపాడుమేడ
పగిదిఁ గాన్పించు ముదుసలి పడఁతియొకతె.

క. కలభాషిణిఁ జేరఁగ వ
చ్చి "లతాంగీ! యెచటనుండి చేరితి వకటా

---

1. బెట్టిదిరి నడచు. 2. బల్లంపుసంజోకలతోడనయొకమఱుం.

కలుషపుబావురఁ బిల్లిని
జిలుకయుఁబలె నిద్దురాత్ము సిద్ధుం డనుచున్. 92

ఉ. ఎంతయు వింతచెల్వమున నివ్వన మెల్ల నలంకరించుచుం
గాంతత నొప్పుమేనిపసఁ గన్నులపండువు సేయు నిన్ను న
ల్లంతన చూచి "దైవ మకటా దొరకించెనె యిట్టినిర్దయ
స్వాంతునిచేతి కీభువనసారము" నంచుఁ గడుం గలంగితిన్.

క. ఆకలుషాత్ముఁడు క్రమ్మరి
రాకమునుపె తొలఁగి పోవరాదే యెట కే
నోకూన యీమనోజ్ఞత
రాకృతి యేఁ జూడఁ జాల నసిపాల్ గాఁగన్! 94

తే. అమ్మ విను మింక నొకయించుకంతతడవు
నీతెరువుఁ జూడ నీపేరు నీతెఱంగు
నడిగి పరికింప మది యున్న దైనవాఁడు
రాకమును నీవు తొలఁగుట నాకుఁ బ్రియము. 95

శా. నీకెంతే నితఁ డాప్తుఁడో జనకుఁడో నెయ్యంపుఁదోబుట్టువో?
నీకార్యార్థమె పూని తా నెచటికేనిం గొంచుఁ బోచున్నవాఁ
డో? 'కాఁగా దిటువంటిప'ల్కనక తోడ్తో నింతబెట్టాడ నే
నోకాంతామణి! వెఱ్ఱిఁగా నితనిచెయ్వుల్ మున్ను వీక్షిం
పుదున్." 96

అనుపలుకు లన్నియు విని కలభాషిణి తనమనంబున. 97

"ఈయవ్వవాక్యములు దలఁ
పోయఁగ నాయుల్లమునకుఁ బొందుపడినయ
ట్లై యున్నవి యీసిద్ధుఁడు
మాయావియొ యొక్కమాట మది నూహింపన్. 98

తే. "ఇంక నొక్కింతసేపున కెల్ల వగపుఁ
బుచ్చి వైచెద" నని పల్కె నిచ్చటికిని
జేరునపు డది యీయమ్మ చెప్పినట్లి
శక్తి కిడియెడు ననుట నిస్సంశయంబు. 99

సీ. ప్రజల కంబఱకు నాపదలు వాపెడునట్టి
చక్రిపట్టణములో జనన మంది
వారకామిని నయ్యు గౌరవంబున సభ్య
జను లిటు చేర రమ్మనఁగ బ్రదికి
త్రైలోక్యగురుఁడు నారదమౌని ప్రియశిష్య
నిర్విశేషముగ మన్నింప నలరి
జగదీశురాణివాసపుసతుల్ శిష్య గా
వింపంగ సంగీతవిద్య నేర్చి

తే. తుద కొకానొకకపటసిద్ధుం డొనర్చు
శక్తిపూజకుఁ బశు వైతిఁ జర్చ సేయ
నెంతవారికిఁ దప్పింప నెట్లువచ్చు
బ్రహ్మ దా మున్ను వ్రాసిన వ్రాఁతఫలము!" 100

క. అని మది నడలుచుఁ బ్రియసఖు
లను మొఱఁగుట దలఁచి కడుఁ గలంగుచుఁ "దెగునే
యనుభావ్య మెంత యంతయు
ననుభవమునఁ గాక!" యనుచు ననయముఁ గుందెన్. 1

వ. తదనంతరంబ డెందంబు డిందుపఱచుకొని ధైర్యబలం
గంఠగద్గదిక వారించుచు నావృద్ధభామినితో నిట్లనియె. 1

శా. "అమ్మా నీపలు కెల్ల నెంతయు నిజం బై యిప్డు గాన్పించె నే
నిమ్మాయావిప్రకార మిట్లగుట యూహింపంగలే 'కొక్కయ

ర్థమ్ముగా వీనికృపం గడింతు' నని యత్యంతాశ ప్రేరేపఁ గా
నిమ్మాడ్కిం [1]డెగివచ్చితిం డెరువు లే దీపాటు దప్పింపఁగాన్.

క. ఎక్కడికిఁ బాఱిపోయెదఁ
జిక్కపడక యేను వీనిశీఘ్రగతికి నో
యక్క యింక దూరదృష్టియు
నెక్కుడు వీనికిని గాంచు నెచ్చట నున్నన్." 104

సీ. అన విని యాకె "యోవనిత! నీవు నెఱుంగు
దే వీని యాదూరదృష్టి?" యనిన
"దానన కాదె యాతఁడు నన్ను భ్రమయించి
రీతిఁ దాఁ దెచ్చె నిచటి" కనుచుఁ
బలికి యాతఁడు తన్నుఁ బ్రథమంబునందు గృ
హారామమునఁ గాంచు టాది గాఁగ
నది తుద గాఁగ సమస్తంబు వినిపించి
తత్ప్రసంగంబునఁ దనదు పేరుఁ

తే. గులము విద్యయు నప్పటికోరికయును
జెప్పి "యాకోర్కి సాధించుచింతఁ దక్క
చింత యెఱుఁగక యేఁగుదెంచితిఁ గోరకకుఁ
బోవఁ బడిగల్లు వడియె" నోపాలఁతి, యనియె. 105

చ. అన విని "యట్లయేని యది యథార్థము నీ కటు లాస చూపి
తోడ్కొని చనుదెంచెఁ దాఁ దనదుకోర్కి యొనర్పుట
కీవినిందవ్యవర్తనుఁడు మనుష్యయత్నమునఁ దక్కఁగ నేరఁడు
దూరదృష్టిసాధన మయినట్టిపిమ్మట నితం డొనరించువిచార
మారయన్. 106

1. డెగి.

వ. అది యెద్ది యంటే నప్పు డితండు. 107

తే. "ఇంతపాట్లను బడి కన్న యీవిచిత్ర
మహిమకుం దగ రాజ్యసంపదలు గనిన
నెంత యిం పగునో" యని యేను వినఁగఁ
బలుమఱును వీఁడు ముచ్చటపడుచు నుండు. 108

క. ఆకోరికకై "కల దొకొ
లోకో త్తరగానయుతయు లోకో త్తరర
మ్యాకృతియు నొకతె వార
స్త్రీకులమున" ననుచు దూరదృష్టిఁ వెదకున్. 109

క. తానును గిన్నర యొకటి వ
హానంతత మీటుచుండు ననిశంబును ద
ద్గానరసజ్ఞత నిలఁ గల
గానము దూరశ్రవణముకతమున నరయన్. 110

వ. అని చెప్పిన వృద్ధవనితకుం గలభాషిణి యి ట్లనియె. 111

సీ. "తొల్లి యిచ్చటన యాదూరదృష్టియును దూ
రశ్రవణము నిద్దురాత్మకుండు
సాధించి నాఁడె? తత్సాధన కెంచటెం
దఱకుత్తుకలు గోసి చెఱిచె నొకొ!
యది కొంత యెఱుఁగుదే నంగన యెఱిఁగింపు
వినియెదఁ గాలయాపనముకొఱకు
మీఁదటఁ గాఁగలమేలుగీ ళ్లెరికిఁ
దప్పింపరామి యెంతయు ధ్రువంబు

ఆ. 'ఇంక వాఁడు వచ్చి యేమేమి సేయునో
చచ్చు టెట్లొ' యనువిచారముననుు

బెగడుచుండ నేల జగదంబ యీశక్తి
నేయవలసినయట్లు నేయుఁ గాక." 112

క. అన విని యాయమ మెచ్చుచు
"ఘనధైర్యవివేకమహిమగలయుత్తమభా
మిని వౌదు మేలు మేలీ
వనినట్లు వచింతు నీకు" నని యి ట్లనియెన్. 113

క. "ఓరమణి దూరదృష్టియు
దూరశ్రవణంబుఁ బడయుత్రోవ లితరముల్
ఘోరముల యైనఁ బరహిం
సారూపంబు లవి కావు సాహసపువిధుల్. 114

క. ఆ రెండు నిశేఁడు వడసెం
గోరిక నలగోరుగల్గుఁ గొని నిజనయనో
ద్ధార మొనర్చియు వీనుల
ఘోరపునారసముఁబఱపుకొనియుఁ వరుసన్. 115

వ. అనుచుఁ [1]దన్మంటపాగ్రభాగంబున మృగేంద్రవాహనంబు
దండ నేకాకురపంక్తిచిహ్నితశిలాస్తంభంబున వ్రేలఁ గట్టిన
యాశస్త్రయుగ్మంబును మఱియు నచ్చట గంధపుష్పాద్యర్చి
తంబులై యున్నయొక్కసురియయు గండకత్తెరయు డగ్గఱం
దోడ్కొని పోయి చూపి యి ట్లనియె. 116

" 'ఈకోరిక కిది తెరు విది
యీకోరిక' కనుచు వ్రాసి యిడినా రదె యా
ఆకంబంబునఁ జదువుము
కాలిపి తెలియునేని నీరజవదనా!" 117

---

1. దన్మందిరాగ్ర.

సీ. అనుడు నమ్మాట దా విని కలభాషిణి
యందు నున్నర్థ మిట్లనుచుఁ జదివె
"నిచట రెండేండ్లు జితేంద్రియత్వంబున
భువనేశ్వరీమంత్రమును జపింప
నెల్లకోర్కులు నిచ్చు నిద్దేవి మఱి యట్లు
గాక సర్వసిద్ధి గావలసిన
దూరవీక్షార్థి యీగోరుగంట వ్రాతాకుఁ
డయ్యు దూరశ్రవణార్థి చెవిని
తే. ఘోర మైనట్టియీబలునారసంబు ,
పఱపుకొనియు సారస్వతప్రాధిమార్థి
యీసురియచేత నాలుకఁ గోసికొనియు
నిమ్మహాశక్తి మెప్పించి యిష్టమొందు. 118
క. ఈమెఱుఁగుగండకత్తెర
చే మిడిదల యిచ్చుసాహసికుఁడు శిరం బ
ట్టే మగుడఁగ నదుకుకొనం
గా మని చంపుఁ దనుఁ జంపఁ గడఁగినవానిన్. 119
క. పదిలముగ నిర్విపక్షా
భ్యుదయమహారాజ్యలక్ష్మి పొందుఁ వశితఁ
సకమలరూపసుగానా
స్పద వారవధూటి నిచట బలిగా నిడినన్." 12
తే. అని చదివి దానఁ దలఁపులో నాత్మనిధన
శంక నిస్సంశయం బయి చాలఁ బ్రబలఁ
గలిగెఁ జలియించుతద్ధైర్యగౌరవంబు
నంత మగుడ్చి కడమ యిట్లనుచుఁ జదివె.

ఉ. "ఈవిధులందు నెందును నొకింత సమర్థత లేనివృద్ధు లి
ద్దేవతయొద్ద నిర్భయత దేహము నెమ్మెయిఁ బాసినం గ్రొ
త్త్వావనరూపసిద్ధి యగు నప్పుడ యంగవిమోక్షవేళ ని
చ్ఛావృత మెద్ది వారి కది సంఘటిలుం దిరమై తపాదిగన్."

క. అని చదివిన నంతఁ దుదం
విసఁబడినవిధానమునకు వృద్ధాంగన యిం
పున నవ్వుచు "నిది విను సు
మ్మనిశము నే నిచట నునికి యంబుజనయనా! 123

తే. అబ్జముఖి సుముఖాసక్తి యందు నన్నుఁ
గరము కాశ్మీరభూమిఁ బ్రఖ్యాత మైన
శారదాపీఠమున సరస్వతిని గొల్చు
నట్టిపూజరి బ్రాహ్మణుపట్టి నేను. 124

వ. అనునంతట సిద్ధుండు దేవీపూజకుఁ దగినగంధమాల్యాదులు సంపాదించుకొని వచ్చి యమ్ముదుసలిపడఁతిం జూచి, "యో యవ్వ! కుశలంబున నున్నదానవే? నిర్మనుష్యం బైనయీ శక్తిస్థానంబునఁ జిరకాలంబునం బట్టి యెట్టు వేగించు చున్న దాన?" వని పలికి కలభాషిణిం బిలిచి, "యోచెలువ! మనకు నవ్వాల చనవలయుఁగద; మిక్కిలి ప్రొద్దు పోవు చున్నయది; శక్తిం బూజించి పోవుద మాయమ్మచేత ననిపించుకొని ర" మ్మనుటయు నది భయాకులమానస యగుచు వృద్ధాంగనం జూచి. 125

క. "ఏ నొంటిఁ బోవ వెఱతుం
లోనికి నోయమ్మ! నీవునుం రాఁగదె నా

తో" నన "నెవ్వరు నేటికి
నే నుండఁగ" ననుచు సిద్ధుఁ డింతిం బలికెన్. 126

సీ. పలికి యప్పటిదానిభయచేష్ట భావించి
"యిమ్మువిజంతచే నిపి యొకింత
యే మైన నాతలం పెఱిఁగెఁ గాఁబోలు వి
ఘ్నం బేమి యగునొ విలంబ మైన"
నని సిద్ధుఁ డాత్మలో ననయంబు వేగిరిం
పుచు "నోసిబెల్లి ! యిమ్ముసలివగ్గు
నీకుఁ దో డైవచ్చునో? కలదో మఱి
యే మైన" ననుచు నాయిగుఱుఁబోఁడి

తే. కొప్పువట్టి తివంబోవ నప్పడంతి
ప్రాణభయమునఁ గలఁగి "యోయవ్వ! నీకు
బిడ్డనే కావవే నాకు నడ్డపడవె"
యనుచు నావృద్ధనారిమాటునకు నోదిఁగె. 127

క. ఆవృద్ధనారియును గరు
ణావిలమతి యగుచు నాభయార్త మృగాక్షిన్
దా వెనుక నిముడుకొనుచుం
"గావుము కావు"; మని వానికరములు పట్టెన్. 128

సీ. పట్టిన నతఁడు "లోపలికి రాకుండ వి
ఘ్నము సేసె, దింతియ కద!" యటంచుఁ
"దద్దేవి కిచటు ముంపర గాదె!" యంచు న
ప్పడఁతిచేతులు నుల్చి పాఱఁ ద్రోబ్బి

బలిమిఁ దార్కొని కలభాషిణివేనలి
యొకకేలఁ బట్టి వే యొక్కకేల
నొఱఁ గత్తి నెఱికి "నీ కొప్పన మిదె" యంచు
సత్తికిఁ గత్తిచే యెత్తి మ్రొక్కి
ఆ. ప్రేయఁ బూన, "[1]దీని వ్రేసితే నిద్దేవి
యానసుమ్ము నీకు!" ననుచు డాసి
యానెలంత మెడకు నడ్డంబుగా మెడ
యొగ్గె వృద్ధసతి యనూనకృపను. 129

వ. ఇవ్విధంబునం గలభాషిణికంఠంబునకుఁ దనకంఠంబు నడ్డంబు సేర్చి వ్రేటు కనువీక దాని నిడుఁగేలం బోదుగఁ బట్టుకొని పరమకరుణాపరవశత్వంబునఁ దొలంగక యావృద్ధభామిని "యోయిసిద్ధుండ! నీకుం గార్యసిద్ధిగాదుసుమీ! యిద్దేవి మీఁదియాన నతిక్రమించిన!" ననుచు "నోమహాశక్తి! నన్ను సత్యవచనం గాఁపుమీ!" యనుచు నుండ నతం డఖండరోషంబున మున్ను దానిమెడ ఖండితంబు సేసి విచిత్ర వేగంబునఁ గలభాషిణికొప్పువట్టి పట్టంబు జళిపించి వ్రేయ నెత్తుటయు, నెత్తినచేయి తత్క్షణంబ యంటుకొని మృగేంద్ర వాహన నిజ శపథసముల్లంఘనోత్సాహసాహసదోషదూషితుం డగు నతని నతి దూరంబునం బడవైచె. సుముఖాసత్తియు నట్లు సంప్రాప్తం బైన యసిఘాతంబునం దనజరద్దేహంబు వడి నట్టి క్షణంబునందు. 130

సీ. నిండుచందురు నవ్వునెమ్మోముసిరితోడ
నిడుదలు గ్రమ్మెడు వేణిభరముతోడ

---

1. దీన.

నాకర్ణలోలంబు లగునేత్రములతోడఁ
దళుకొత్తుచెక్కుటద్దములతోడ
మిగుల మిటారించుబిగిచనుంగవతోడ
లలితంపుబాహువల్లరులతోడ
నతికృశత్వమున జవ్వాడుమధ్యముతోడ
నభినవంబైననూఁగారుతోడ
తే. పలువమీఁదికిఁ దొలఁకుసువర్ణపులిన
గురునితంబప్రభాపరంపరలతోడ
మహితసర్వాంగలావణ్యమహిమతోడ
నమరుప్రాయంపురూపు చిత్రముగఁ దాల్చె. 131
తే. తాల్చి యావికచోత్పలదళనిభాక్షి
కనుఁగొనియె నభ్రమున శక్తికరవినున్న
గాత్రు సిద్ధుని నొకకేలఁ గత్తి యొక్క-
కేలఁ గలభాషిణిని విడకే చనంగ. 132
క. ఆకరణిఁ జూచినదియై
యాకలభాషిణియవస్థ కాత్మఁ గలఁగుచుఁ దా
వ్యాకులత నొందెఁ దనదు చి
రాకాంక్షితసిద్ధిపెంపు నరయనిమదితోన్. 133
సీ. అంతఁ గ్రమంబున నా సరోజాక్షి సం
సారస్వభావవిచారమహిమ
వలనఁ దద్దుగఖంబు వారించికొని దానఁ
దాను భోగార్థచింతనము వదలి
దేవి సత్కృపఁ బ్రసాదించినయట్టి జ
వ్వనపుసత్వము వృథా చనకయుండ

యోగవిద్యాభ్యసనోపయోగంబునఁ
గడపెదఁ గాకంచు విడువ కెపుడు
తే. యమనియమవర్తనములతో నాసనాదు
లభ్యసింపఁగఁ దొడఁగె నత్యాదరమునఁ
దాను మును విన్నభంగులు దాఁపు గాఁగ
నచటిశక్తిని గురువుగా నాత్మ నునిచి. 134

వ. అంతటం గలభాషిణి యచ్చటి కేఁగుదెంచి యాచంచలాక్షి నీక్షించి "నీ వెందుండి వచ్చి? తెట్టిదాన?" వని యడుగుటయు, నప్పుడంతి "యేను మును నీకు నడ్డపడి సిద్ధునిచేత ఖండితయైన సుముఖాసక్తి యనువృద్ధవనితం జుమ్ము; క్రమ్మఱ నిమ్మహాశక్తి కారుణ్యశక్తివలన నిట్టి యెలప్రాయంపుసొంపు వడసియున్న దాన." నని తత్ప్రకారం బెఱింగించి "యో కలభాషిణి! యట్లు సిద్ధునితోడ నిమ్మహాశక్తిచేత దూరవిక్షిప్తవై యొచటం బడి తేమియు నొవ్వక యిట్లు తిరిగి వచ్చుట యద్భుతం బగుచున్నది" యనుటయుం గలభాషిణి "యో యమ్మ! ధర్మగుణంబున నిమ్మహాదేవిని మెప్పించి యిప్పగిది నీవు తిరుగం [1]బ్రాయంబు గనుట యద్భుతంబు గాక; యింతటి మహాపుణ్యనిధి వైన నీదుకారుణ్యంబు గలుగ నేఁ దిరిగివచ్చుట యేమి యద్భుతంబు? నావిధం బంతయు విన్నవించెద." నని పలుకుచుండ. 135

క. బంధురవీణాసహిత
స్కంధముతో రత్నమాలికాఘటితజటా

1. బ్రాణంబు.

బంధముతో నంతట మణి
కంధరుఁ డచ్చటికి వచ్చె గంభీరగతిన్. 136

క. వచ్చినఁ గని యతిమోదము
నచ్చెరువుఁ దలిర్ప మ్రొక్కె నతని; కతఁడుఁ దా
నచ్చెలువఁ జూచి మోదము
నచ్చెరువుఁ దలిర్ప వికసితాననుఁ డగుచున్. 137

క. "ఓహోహో! మా బంధు
వ్యూహం బంతయును వచ్చియున్న ట్లయ్యెన్
నా హృదయమునకుఁ బరమ
స్నేహనిధీ నిన్నుఁ గనుట నేఁడు లతాంగీ. 138

మత్తకోకిల. మచ్చెకంటి మముం దలంతువె మానసంబున? నిందనీ
వచ్చు టెట్లు? కదన్ విచిత్రము ద్వారకాపురి వాయ నీ
కిచ్చ పుట్టుట? యెన్నఁడున్ మఱి యిట్టు లేఁగి యెఱుంగ వీ
వచ్చెలుల్ మణిగేహముల్ సిరు లట్ల యున్నవియేకదా!

సీ. ఉత్తమశ్లోకుఁ బయోజాక్షు సేవింప
నేఁగితే యీ వెన్క నెన్నఁ డైన?
నాజగత్పతి తోంటియలవజ్రమణిసభ
కేతెంచి కొలువు సేయించుకొనునె?
తన సేవఁగాఁ బురందరుఁడు గట్టించికెం
పులహజారము కడముట్టె నొక్కొ?
వనవీథియ లడంచుకొని భ్రమయించు నీ
లపుటరుంగులకుఁ బో నిపుడు గలదె?

తే. యంతకంతకు వర్ధిల్లుహారికుమాళ్ల
బలఁగమున కిది చాల దన్తలఁపుతోడఁ

దిరుగఁ గట్టింత మనుపైఁడి¹గరిడిసాల
యట్లయున్నదియే వికచాబ్జవదన ? 140

మ. చిగురుంబోఁడి యెఱుంగుదే ‘యదుపతి స్త్రీ లెవ్వరే నిందలే
రు గదా!’ యంచును శంకఁ గ్రమ్మఱితిఁ జానద్యూత
గేహంబు క్రొత్తగ నీ వొక్కటి చూపఁ దోడ్కొని చనం
దచ్చోక చౌపంచ యిత్తిగ బారా దుగ యంచుఁ జిల్క
రొద లుద్దీపింప దా దవ్వులన్ ? 141

చ. కుటిలకచా! యెఱుంగుదువె గొబ్బున నేఁ జని కొల్వుకూట
మొక్కటి కడ నున్కి యారయక కట్టెదుటం బటికంపుగోడఁ
బ్రస్ఫుట²ముగ దానియందు హరిఁ జూచుచు మ్రొక్కఁగ
వెన్కనుండి ³“యిట్టిటు మొగ?” మంచు నవ్వె సభయెల్లను
దన్మణిభిత్తి యున్నదే?” 142

క. అని యడిగిన “నన్నియు శో
భనవర్తనఁ దొంటియట్ల భాసిల్లెడు నో
యనఘ! సురరాజుసేవయు
ననుపమముగఁ బూర్ణ మయ్యె” నని యది పలికెన్. 143

వ. అని పలికిన నతండు. 144

సీ. “సంగీతవిద్యాప్రసంగంబునం దైన
మముఁ దలంతువొ లేదొ మనసునందు?
దనుజారి కే నొనర్చినదండకంబు నీ
వెందైన మఱి వెలయించి తొకొ ?
యిప్పుడు నారదుం డప్పటప్పటికి వ
చ్చునొ రాఁడొ వసుదేవసూనుఁ గొలువ ?

---

1. గరడి. 2. మగుదాని నందు. 3. యట్టిటు.

నాలోకవిభుసతుల్ మే లేర్చి యిచ్చిన
వీణె యే మయ్యె, దే విచ్చటికిని!

తే. నేమి యేమియొ నాఁడు నీహృదయమునను
గోర్కె యొక్కటి గలుగుట కొమ్మ వింటి
నది ప్రవృద్ధంబుగాఁ బెంచి యాత్మలోన
విడిచిపెట్టితొ వీణెపై వేడ్క లెల్ల." 145

చ. అనుటయు లజ్జ నజ్జలరుహానన యించుక యించుక యోర
గాఁగ వంచినమొగ మొప్ప "నే మనుచుఁజెప్పెద! దానన
చేసి కాదె యో, యనఘచరిత్ర! నాకుఁ గలయట్టి
బలంగము లెల్లఁబాసి యీ ఘనగహనప్రదేశములఁ గష్టపుఁ
బాటులఁ గుందితిం గడున్." 146

వ. అని పలికి తనగానవిద్యాభ్యాసపరిసమాప్తి యైనపిమ్మటఁ దన యున్నచోటికి మణిస్తంభుండు వచ్చినప్రకారం బెఱింగించి యతండు దూరదృష్టి దూరశ్రవణశక్తిబలంబునఁ దనకుం జెప్పిన యర్థము సకలంబునుం జెప్పి తన్ను నతండు మృగేంద్రవాహనాభవనంబునకుం దెచ్చినతెఱంగును బలిపశూకరణోద్యమప్రకారంబును సుముఖాసత్తి తన్ను రక్షించుటయు వివరించి "యాపుణ్యసాధ్వి యీయమ" యని యాయకం జూపి తత్కులస్థానవర్తనంబులు దెలిపి "యోగంధర్వోత్తమ! యింక నాకు నీచందంబు వినవలయు నవ్విధంబున రంభచేత నీతపంబు విఘ్నంబునొందుట యామణిస్తంభునిచేత నేను విన్నప్రకారంబు వింటివి కదా! యటమీఁదటి భవదీయవర్తనం బెఱింగింపు"మనునంతట మణిస్తంభుండు వచ్చుటయు "నిప్పుఁ డేఁ జెప్పినసిద్ధుం డితం" డని చూపిన

నితండా! యని దరహసితవికసితాననుం డగుచు మణి
కంధరుం డతనిం దగు తెఱంగున సంభావించె; నతండును. 147

క. ఇచ్చఁ దదాగమనమునకు
నచ్చెరువు జనింప "నిది మహాశ్చర్యము! మీ
రెచ్చోటనుండి యిచటికి
విచ్చేసితి?" రని వినీతవృత్తిం బలికెన్. 148

సీ. పలికి యంతటఁ గలభాషిణిఁ జూచి "యో
యింతి నీ వెదకితి నెల్లచోట్ల
నెందుఁ గానక చోద్య మందితి నప్పు డె
క్కడ నుండి తిప్పు డిక్కడికి వచ్చి
తని పల్కుచును సుముఖాసత్తిఁ జూచి యె
చ్చటనుండి వచ్చి తిచ్చటికి నీవు?
పే రెద్ది? యని తత్ప్రకారంబు దానిచే
తన విని వెఱఁ గంది వినుతి చేసె

తే. నాసతి యతనిఁ గనుఁగొని యపుడుపడుచు
ని ట్లనియె "నోయి సిద్ధుండ యెచటఁ బడితి
[1]రీవుఁ గలభాషిణియును నిద్దేవిచేత
నట్లు సరభస విక్షిప్తు లగుచుఁ బోయి? 149

వ. మీర లేమియు నొవ్వక తిరిగి వచ్చుటయు నచ్చెరు వై
యున్నయది. నాకు నింతయు వినిపింపవలయు" ననిన విని
మణిస్తంభుం "డోయంబుజముఖి! నీకు నట్ల వినిపించెద విను
మదియ కాదు మఱియు నెన్నియేని విచిత్రంబులు గని వచ్చి
నాఁడ; నది యొక్కరితోడం జెప్పెదునందాక హృదయంబు

1. వీవు.

వేగిరపడుచున్నది గావున, నన్నిటం బూజ్యురాల వైననీకు
వినిపించెద" నని యిట్లనియె. 150

ఉ. "ఆవిధి నీపయిం దెగి మదాతిశయంబునఁ గన్నుఁ గానమిన్
దేవతమీఁది యానయు గణింపక యీకలభాషిణిన్ శిరో
జావళి పట్టి త్రుంచుటకు నాయుధ మెత్తితి నెత్తినట్టికేల్
దేవి వహించి వైవఁ జనితిం గడు దవ్వుగ నివ్వధూటితోన్."

మ. అనుడున్ "నీ విది చెప్పఁగా వలవ దేనామున్న యీరూపుఁ గై
కొని వీక్షించితి నన్ను నీచిగురుటాకుంబోఁడి మూర్ధంబు ప
ట్టిన కేల్ పట్టినయట్ల యుండ దృఢముష్టిం బూని బల్గత్తియె
త్తినకే లెత్తినయట్ల యుండ దివి నుద్వేగంబునం బోవుచోన్.

క. వినుపింపు నాకు నట మీఁ"
దన నతఁ డిట్లనుచుఁ జెప్పె "నట్లురువడి [1]వం
చనమున వైచినగతి నభ
మునఁ జని మణికంధరుని తపోవనభూమిన్. 153

క. ఇత్తరుణియు నేనును నొక
మెత్తనిక్రొత్తలిరుఁ బాన్పుమీఁదఁ బడితి మో
మత్తేభగమన యట్లే
సత్తియుఁ గృపసేయఁ బోలుఁ జావక యుండన్. 154

క. మునుపటిభయమున మ్రాన్పడి
యునికి నపుడు చేతికత్తియును దనదుశిరం
బును విడువఁగ నెఱుఁగనినను
గనుఁగొని నెమ్మేను మిగుల గడగడవడఁకన్. 155

1. దంచనముగ.

సీ. అమృతంబు దొలఁకున ట్లమరంగ వెల్వెలఁ
బాఱు ముఖేందుబింబంబుతోడ
జాలఁగర్ణద్వయీకూలంకషంబు లై
తల్లడం బందు నేత్రములతోడఁ
గడుఁ జెమర్చినయట్టికలికి లేఁజెక్కుల
నంటెడువిగళత్కచాళితోడ
వలిగుబ్బపాలిండ్ల నిలువ కి ట్టట్టు సం
క్షోభించుపయ్యెదకొంగుతోడ
తే. వెఱవు నొకయొజ్జ యై యింతవిలసనములు
గఱపఁ జూపట్టుసౌందర్యగరిమతోడ
సరభసాకర్షణాక్షోభచకిత యైన
మదనుజయలక్ష్మిలీల ని మ్మగువ దనర. 156
క. కనుఁగొంటిం గనుఁగొనునం
తన మన్మథవశుఁడ నగుచుఁ దగఁ బరిరంభం
బును గావించితి నేఁ జే
సిన పాపముఁ జెప్పవలయు శీతాంశుముఖి! 157
మ. అది సైరింపక [1]బాలఁ బేరెలుఁగుతో నాక్రోశముం జేసె "న
న్ని దెయాపాతకి బల్మిఁ బట్టెపుఁ గృపన్ వీక్షింపరే కావరే
[2]సుదయత్వంబున నొప్పుసత్పురుషులిచ్చో నెవ్వరున్ లేరెయా
పద వారింప శరణ్యులార" యని యాపద్మాక్షియత్యంతమున్.
వ. అప్పుడు. 159
క. నెఱయఁగ నసహ్య మగున
మ్మొఱ వీనులఁ బడిన మిన్నుముట్టు నెలుఁగుతో

1. చాల. 2. స (యతి తప్పినది.)

"వెఱవకు వెఱవకు మే నిదె
పఱతెంచితి సత్వరముగ భామిని" యనుచున్. 160

క. వెఱవక యెవ్వఁడురా వెత
పఱచెదు ని ట్లితివ? నెందుఁబాఱినఁ గూడం
దఱిమెదఁ దల నరములతోఁ
బెఱికెద" ననుచున్ నితాంతభీషణగతితోన్. 161

చ. ఒకపొదరిల్లు వెల్వడి రయోద్ధతుఁడై నలకూబరుండు రాఁ
బ్రకటముగాఁ గనుంగొని యభంగురభీతిఁ గలంగి దీని నే
వికలమనోధృతిన్ విడిచి వేగమ దవ్వుగఁ బాఱిపోయితిం
బ్రకుపితుఁడై యతండు ననుఁబాయక వెన్కొని పట్టెనుగ్రతన్. 163

వ. అట్లు కూడముట్టి పట్టుకొని.

శా. "ఓరీ యెవ్వఁడ వీవు? పోతరముతో నున్మాదివై యిప్పు డే
నారిం బట్టితి బెట్టుగా మొఱ యిడన్? నాదండ నీదుండగం
బా? రారమ్మటు దానిఁ జూపుదువు ప్రాయశ్చిత్త మామీఁద నీ
కేరితిం దగు నట్లొనర్తు" నని తా నెంతే నమర్షంబునన్. 165

వ. కొంతమేర నన్నుం గ్రమ్మఱఁ దెచ్చునంత.

సీ. తిరముగా ముడువమి విరియఁ బాఱెడుకొప్పుఁ
దోడ్తోడ నొకకేలఁ దుఱిమికొనుచు
వల్లెవాటుగఁ గొంతవలువ చన్గవ నిల్పి
పెఱచేత నీవి గల్పించుకొనుచు
నుదుటిపై నొక్కింత చెదరినముంగురుల్
పాపటకును బొందుపఱచుకొనుచు
సారెకు జాఱెడుశ్రవణకల్హారంబు
లందంద మూఁపున నానుకొనుచుఁ

తే. జెమట నంటినపానుపుచివురుఁదునుక
లెడనెడ నఖక్షతాశంకఁ దడవుకొనుచు
రంభ యేతెంచె మిగుల సంరంభ మమరఁ
దొలుతఁ బ్రియుఁ డేఁగుదెంచిన త్రోవపట్టి. 166
శా. ఈలిలం జనుదెంచి "యక్కటకటా యేమంచునిట్ దూలుచుం
గేలం గైదువు గీదు వేమియును లేకే యిమ్మెయిన్ వత్తురే?
[1]చాలున్. దూరముగాఁగనే నిదె పరిశ్రాంతింగదున్ నొచ్చితిం
జాలుం జాలుఁగరంబు మెచ్చుఁ దగునీచందంబు ప్రాణేశ్వరా!"
వ. అని తనదుప్రియుం బలికి నన్నుం గనుంగొంచు నతనితోడ.
క. "పేఁడా య ట్లన్యాయపుఁ
బోఁడుములకుఁ బూనినట్టిపుఱుష్యఁడు! పూవి
ల్కాఁ డోవల్లభ యెంతటి
వాఁ డైన నగున్ విశంకవర్తనుఁ డెందున్. 169
క. ఆయింతి యెందుఁ బోయెనొ
కో?" యనుటయు "దానిఁ జూపుకొఅకునె కాదే
యీయయ్యఁ బట్టి తెచ్చుట
యోయంగన యిప్పు" డనుటయును గృప వొడమన్. 170
వ. "ఆయింతిం జూపక యితం డింక నీముంచట నెందుఁ
బోయెడుఁ జెయి వదలు" మనుచు బ్రార్థించి. 171
తే. విభునిచే విడిపించె నవ్వెలఁది నన్ను
నేను వారలఁ దోడ్కొని యీ నెలంత
యున్నచో టారయుచు మును పున్నతలిరుఁ
బొన్నుఁ జూపితిఁ గాన [2]నిప్పడఁతి నచట. 172

---

1. చాలన్. 2. మిప్పడఁతి.

వ. అట్లు చూపినం దనయింతితోడ. 173

క. "తానును మనతో ల్త్రటియియా
పానుపుఁ జేర్చుకొనఁ [1]బోలుఁ బడఁతుక" ననుచున్
"బోనీ సిద్ధుఁడు గాన న
నూనం బగుసిద్ధశయ్య కుచితుఁడ" యనుచున్. 174

క. అట్టియెడ నచ్చటన్ నా
[2]పట్టముఁ గని పుచ్చుకొనియెఁ బౌలస్త్యసుతుం
"డిట్టివియుఁ దనకుఁ గొన్నియె?
గట్టిగ నీజోగి బంటు గదె!" యని నగుచున్. 175

తే. బంటు గా కున్న నిది యిందుఁ బాఱవైచి
వెళ్లునే! యని నవ్వె నవ్విబుధకాంత
యంత నన్నియు నమ్మె; నయ్యతివ నెచట
నడఁచి తని నన్ను దట్టించి యడిగె నతఁడు. 176

సీ. కినుకతో న శ్లింతయును బెదరించుచుఁ
బిరువీఁకుసేయఁ దత్ప్రియవధూటి
వీనితో డిది యేమి? విడిచిపెట్టుము వీఁడు
తను నట్లు డించి వెళ్లిన నెడ గని
యాయింతి డాఁగి యెం దరిగెనో? యెచటఁ జూ
పెడు నంచు నను విడిపించి దాని
మన మిఁక వెదకుద మని తాను నాతండు
నేఁ దోల్త్రఁ బాఱిపోయిన తెరువునఁ

తే. జనియెఁ గడుదవ్వుగాఁ గుచస్తబక మొకటి
వరునిభుజముతో నొరయ నవ్వలితదంస

1. బోవుఁ. 2. పట్టెము.

భాగమునఁ దనకోమలపాణిఁ జేర్చి
యనుపదంబును రోమాంచితాంగి యగుచు. 177

ఉ. ఏనును వారివెంబడిన యేఁగితిఁ బాయక యింత నంత "నెం.
దేని మనోభవక్రియల నింపున నేమఱి పెట్టిపోవునో, యానల
కూబరుండు మదుదగ్రకృపాణము" నంచు దాని న, న్యూన
గురుప్రసాదమహిమోన్నతిఁ గాంచుటఁ బాయఁజాలమిన్.

చ. అదియును గాక యావిపిన మంతయు నెంతయు సావధాన.
తన్, బదిలము గాఁగ నప్పుఁడతిఁ బాయక యప్పుడు దూర
దృష్టిచే, వెదకి కనంగ లేక కడు విస్మయ మందుచు "నేమి
మాయయో!, యిది యని, వీరి కైన నొక యీగడ
వెళ్లునో?" యంచు నేఁగితిన్. 179

క. అంతట నా యిరువురు న
త్యంతము నంగాంగసక్తినాత్మలు గరఁగన్
గంతుక్రీడలు గైకొని
రెంతయు నెడ గలుగ నేఁగి యేను నిలిచితిన్. 180

శా. ఆలీలన్ రతికేళిఁ దేలి తుదయం దాయిద్దఱుం గేలిభి.
న్నాలంకారము లొక్కరొక్కరికి నిం పౌనట్లుగా దిద్దుచున్
లోలత్వంబున నుండ నచ్చటికి నాలోఁదత్పదశ్రేణిచో, స్సావ.
లోకించుచు రంభ వేఱొకతె డాయన్ వచ్చెఁ జిత్రంబుగన్.

ఆ. వచ్చి యచ్చువడియె నచ్చెరు వందుచు;
నచ్చకోరనయన వచ్చు టరసి
యద్భుతంబు నొందె యక్షేశసుతుఁడు; న
వ్విధముఁ జూచి యేను వెఱఁగుపడితి. 182

ఉ. అంతట యక్షరాజసుతుఁ డాకరణిం జనుదెంచి యున్న యా
కాంత ప్రకారముం దనదుకాంత ప్రకారముఁ గొంత ప్రొద్దు వి
శ్రాంత మహావధానమునఁ గ్రమ్మఱ క్రమ్మఱ చూచె నెందు
[1]నొ, క్కింతవిభేద మేర్పడమి కెంతయు నద్భుత మావ
హిల్లఁగన్. 183

క. ఈమాడ్కిఁ జూడ "నను న
క్కామినిఁ గడుఁ దిరిగి తిరిగి కనుఁగొనియెదు నీ
వేమి యిది? నాకుఁ జెపుమా
నీమది?" యని యతని నతనినెలఁతుక పలికెన్. 184

వ. ఇట్లు పలికిన నతండు. 185

తే. "నీదు ప్రతిబింబ మదియొ దాని ప్రతిబింబ
మీవొ యే మని చెప్పుదు నిగుఱుఁబోఁడి!
యేర్పఱుపరాక యున్నవా రీవు నదియు
దీని కరుదంది చూచెదఁ దిరిగి తిరిగి. 186

క. తుద నేమి చెప్ప! నాదం
డ దొలంగిన దాని నినుఁ దడంబడకుండన్
మదిలోన నేర్పఱించుట
సుదుర్లభ!" మ టన్న నతని సుదతి గలఁగుచున్. 187

సీ. "అక్కటా నఁ బ్రాణనాయక నినుఁ గౌఁగిటఁ
బాయనే వెఱతు నీ మాయలాఁడి
యీరూపుతో మన కెడ సేయ నేతెంచి
నదియొ! తొల్లియు నొక్క యసురజంత

1. నొకింతయుభేద.

జనకనందనకు రామునకును నెడసేయఁ
గడఁగి వచ్చుట వినఁబడుచు నుండుఁ
గావున దీని నిక్కడఁ జుట్టుపట్టున
నుండంగ నిచ్చిన నొప్పకుండు
తే. వట్టి మొగమోట సాలించి గట్టిగాఁగ
నవర [1]వైచుచుఁ జను మంచు నౌర నీవు
కదలెదు సు!" మంచు సంభ్రమం బొదవ నపుడు
కాంతుకంఠంబు నొకకేలఁ గౌఁగిలించె. 188

క. క్రొత్తగ వచ్చినరంభయు
నత్తెఱఁ గంతయును గని కరాంగుళి నాసన్
హత్తించి తలఁ గదల్చుచు
నుత్తలపా టేర్పడంగ నుస్సురు మనియెన్. 189

ఉ. అక్కమలాక్షిఁ జూచి యలకాధిపనందనుఁ "డోపడంతి! నీ
వెక్కడనుండి వచ్చి? తిది యేటికి నుస్సురు మంటి? నీకు నీ
యక్కజ మేల వచ్చెను? [2]మదంగనరూపముఁదాల్చి తేగతిన్?
రక్కసివో పిశాచివో కరం బిది చిత్ర! మెఱుంగఁజెప్పుమా."

క. అన నయ్యంగన "నా కే
మన నోరున్నయది? మీర లనినంతయుఁ జె
ల్లున మీ కౌఁగాములు దె
ల్ప నుపాయం బొకటి గానఁబడునందాఁకన్. 191

ఉ. రక్కసి నన్నఁ గా ననఁగ రాదు పిశాచియు నౌదు నాదురూ
పెక్కడఁ దాల్ప నేరిచిమొ యిమ్మెయి నెంతయు హత్తుకొన్న

1. వైచి పొమ్మను మంచు. 2. సురాంగన.

యీ, చక్కనిముద్దరాలు తనసత్యము లోక మెఱుంగ నింకఁ
దా,రక్కసియో పిశాచియొ తిరంబుగ నేర్పడి పోవునంతకున్.

క. విను మా యేర్పాటు దనం
తన యగుచున్నయది యెట్లుఁ దప్పదు సత్యం
బనఁగా దైవం బనఁగా
జనులకు లేకున్న నెట్లు జగములు [1]నడుచున్. 193

క. దైవం బనఁగా నా కిఁక
నోవల్లభ వేఱ యొక్కఁ డున్నాఁడే? యా
దైవమవు నీవ చేయం
గావలసిన నీవ చేయఁగల వేర్పాటున్. 194

సీ. అల్లప్పు డొకచోటఁ జల్లనిసురపొన్న
నీవ మెచ్చుచును నాతోడఁ గూడి
యందుఁ బల్లవశయ్యఁ గందర్పకేళి నిం
పొందుచోఁ బడమటియంచు నొక్క
వనితయాక్రందనధ్వని వినఁబడుటయు
నీవు డిగ్గన లేచి పోవుచుండ
నేను నీతోడన యేతెంచుచో నొక
యిట్టి డాపలివంక నేఁగుటయును
తే. జూచి నిలిచితి నేను నిల్చుటఁ గనుఁగొని
యెచట నెట్లిది హా త్తైనో యెఱుకపడద
వేగిరించక నీవ భావించుకొనుము
కల్లనిజములు క్రమముగాఁ గానవచ్చు." 195

1. నడచున్.

చ. అనుడుఁ గుబేరసూను మొగమారసి తత్ప్రియ యొక్క కేలనా
తని మెడఁ గౌఁగిలించియు ముదంచితహారముతోడ ని ట్లనున్
"మనచరితంబుఁ జెప్పెను సమస్తము వేల్పులసాని చెప్పిన
ట్ల నిజము గాఁగ నివ్వరవిలాసిని యెచ్చటనుండి చూచెనో ?

తే. అచట నపు డట్లు నినుఁ గూడి యలరినదియు
నట్లు నీ వేఁగుచో వచ్చినదియుఁ దాన
యగుచుఁ దోఁప సం దదికి యె ట్లాడ నేర్చె!
మగువ గాదుర యిది పెనుడగర గాని. 197

ఉ. ఇప్పుడిదిన్ మదాకృతి వహించి నినున్ ననుఁ బాయఁ జేయ నే
చొప్పున నైనఁ దాఁగలయఁ జూచు దురాశలమాయలాఁడి వా
తప్పక [1]యింకఁ దత్తదుచింతపుఁగుయుక్తులమాట లెన్ని యే
[2]నొప్పఁగ నాడుకో నెఱుఁగ కుండెనె? యిట్టివి చెప్ప నేటికిన్?

క. "విను వల్లభ 'క న్నుండం
గనుపాపం దివియ నేర్పు గలమునిము' చ్చీ
వనిత; తగ దిచట నుండన్
వెనుకను దిద్దుకొన వచ్చు నే యొకట్టైనన్ ?" 199

వ. అని యచ్చటఁ దన్ను నిలువనీక పోఁదోలుటకు నిజవల్లభుని
సత్వరంబుగా బోధించునాచంచలాక్షిపలుకులకు నలుకబలియు
మనంబున సైరింప లేక యాకంబుకంఠి దాని నధిక్షేపించుచు
ని ట్లనియె. 200

క. త్రుళ్ళఁగ నేటికి ? నిలునిలు;
మిల్లలికినఁ బంపు వగునె ? యింతటిలోనే

1. యింత త. 2. నొప్పఁగ.

వల్లభునకుఁ గడు నచ్చిన
యిల్లాలవె ? యేను లాఁతినే పోఁదోలన్ ? 201

క. మగఁ డాపట్టంబునఁ దలఁ
దెగఁ గొట్టినఁ గొట్టుఁ గాక తెకతేరఁగ నీ
కెగవిడిచి పోయెదనె ప్రా
వగ నాకాణాచియైనవలపులపంటన్ ! 202

క. ఈరీతిని మద్వల్లభుఁ
గోరిక మెడఁ గౌఁగిలించుకొని నీ వుండన్
సైరించుట కొఱ గా దిది;
రార మ్మిఁక నోర్వఁజుమ్ము రావే" [1]యనుచున్. 203

క. "వెడదెరువు లిచటఁ జెల్లవు;
'పుడమి నహహా! దొంగ లాన వాడిచినఁ గోకల్
విడుతురె ?' గణింతునే యె
క్కడిగతిమాలినపిశాచికవొ నీమాటల్." 204

వ. అనుటయు నాయింతి సైరింపక. 205

మానినీవృత్తము. అంత మదింపకువే యని పల్కిన
నంత మదింపకువే యనుచున్
గంతు లడంచెద లె మ్మని పల్కినఁ
గంతు లడంచెద లెమ్మనుచున్
రంతుల నేమిఫలం బని పల్కిన
రంతుల నేమిఫలం ? బనుచున్
బంతము చూడఁగదే ! యని పల్కినఁ
బంతము చూడఁగదే ! యనుచున్. 206

---

1. యనుడున్.

సీ. ఒట్టు సుమీ! యన్న నొట్టుసుమీ! యంచు
నేమేమి? యనిన నేమేమి? యనుచుఁ
గానీ గదే! యన్నఁ గానీ గదే! యంచు
నిం కేల? యనిన నిం కేల? యనుచు
నోసి పోవే యన్న నోసి పోవే యంచు
నౌ నంటి వనిన నౌ నంటి వనుచు
మఱవకు మిది యన్న మఱవకు మిది యంచు
నీ వెంత? యనిన నీ వెంత? యనుచు
తే. నొకతె మగనికి నాసించు టొప్ప దనిన
నొకతె మగనికి నాసించు టొప్ప దనుచుఁ
బట్టి యాడె నారంభతోఁ బ్రథమరంభ
ప్రియుఁడు నిలు మన్న నిలువక పెద్దరొదగ. 207
వ. అంత. 208
చ. జగడపుఁగూఁతిసత్తువు సారెకుఁ గోరుచు వీరి వారినిన్
దగిలెడుతందనాలజడదారి పొరింబొరిఁ గుంచె వీచుచున్
మిగులఁగ వీణెమీటుచును నేఁడుపడంతుల[1]యొద్దనుంగడున్
నెగడెడుపొందు గల్గెనని నెమ్మది మెచ్చుచు వచ్చెఁ జెచ్చెరన్.
క. వచ్చిన గుబేరసూనుఁడు
నచ్చెలువలు నెదురుగాఁగ నరిగి యతనికిన్
నిచ్చల మగుతాత్పర్యం
బచ్చుపడఁగ మ్రొక్కి రతఁడు నల్లన నగుచున్. 210
క. "నలకూబర నీ కిం దే
చెలువ ప్రియవధూటి నాకుఁ జెప్పుమా? దానిన్

1. వడ్డెనన్.

దెలియక దీవింపఁగ రా
దలఁచుఁ డొకరొకళ్ల ప్రేమ" ననుచుఁ గిమ్మున్. 211

మ. "తనకంటెం బ్రియ నీకు లేదు తనసౌందర్యంబె సౌందర్య" మం
చును గర్వించుచు నున్న రంభమదముం జూడంగ లే కిట్టి దా
నిని నీవే సృజియించితో? యదియ తా నీతోడఁ గ్రీడింపఁగాఁ
దనమే నొక్కటి చాలదంచుఁ గడఁకన్ ద్వైరూప్యముం దా

తే. ఎట్లయిన నీదు ప్రేమ యీయిరువురందు [ల్చెనో?
సమ మగునో కాదో చెప్పుమా చాలఁ దడవు
వీరిఁ బోరించి? తద్వోడ్క విరియఁ జిమ్మ
లేక కనుఁగొంచు నుంటి నే నాకసమున." 213

క. "అనుటయు నే నెక్కడ వీ
రిని బోరించితి నయో విరించితనయ! నా
కును వీరలసమరూపత
యును బోసను వెఱఁ గొనర్చుచున్నది మిగులన్." 214

వ. అని పలికి మున్ను దా నందు నొక్కరంభఁ గూడి క్రీడించు
[1]చుండి యప్పుడనతిదూరంబున వనితాకృతం బైనయాక్రంద
నంబు వినంబడినఁ గారుణ్యసంభ్రమంబున నద్దిక్కునకై చను
టయు, నంతం దనదృష్టిపథంబునం బలాయమానుండ నగు
నన్నుం దఱిమి పట్టుకొని యొక కొంతదవ్వు దిరుగఁ గొం
పోవుటయు నచ్చటికిఁ దనకాంత గూడ వచ్చుటయుఁ
దత్ప్రార్థనంబున నన్ను విడిచి యిచ్ఛావిహారంబుల నదియుం
దానుఁ గొంత ప్రొద్దుపుచ్చుటయు నంత రెండవరంభ వచ్చు
టయు దానివచనప్రకారంబును గలహాభంగులుం జెప్పి
యానలకూబరుం డాయిద్దఱు రంభలయందు. 215

1. చున్న యెడకనతి.

సీ. తానటమున్న క్రొత్తగఁ దీర్చినట్టిక
స్తూరికాతిలకంబుసొంపుతోడఁ
గన్నె గేదఁగి రేకు లన్నువగాఁ గొనల్
గాన్పింప నిడినకీల్గంటుతోడ
బంగారుపస మించుపసనిపుప్పొడి రేఖఁ
జూపట్టుపాపటసొబగుతోడ
సరివాటు గాఁగఁ గేసరములు గ్రుచ్చిన
కురువింకవిరిగుబ్బసరముతోడ
తే. నొప్పు మీఱుచు నున్నట్టియొకతెఁ జూపి
"యీ సరోజాయతాక్షియు నేను నున్న
చోటి కింతకము న్నావధూటి వచ్చె"
ననుచు రెండవయింతి నమ్మునికిఁ జూపె. 216

ఉ. చూపిన నాలతాంగి యజసూనున కంజలి చేసి 'యోమహా
తాపస! యల్లనాఁడు మము ద్వారకచేర్పున నాడినట్టి మీ
యాపలు కింతచేసె' నన నన్యయు నట్ల యనన్ మునీశ్వరుం
డాపువుఁబోండ్ల నిద్దఱ 'యథార్థమ పల్కితి'రంచు నవ్వుచున్.

క. "ఆమాటలు సరిదాఁకెఁ గ
దా! మా కీవీక్షణోత్సవాతిశయంబుల్
బ్రేమమునఁ జూడఁగల్గెను
వామేక్షణలార! పోయి వచ్చెద నింకన్. 218

క. అనుటయు నలకూబరుఁ "డో
మునివర! యిద్దఱ యథార్థముగఁ బల్కితి రం
చును బల్కితి రెట్లొకో యిది
వినవలయుం దేటపఱచి విచ్చేయుఁ" డనన్. 219

సీ. నాఁడు తా నాత్మసౌందర్యవైభవపతి
వాల్లభ్యమహిమగర్వమున నాడు
కొనువాక్యములు నేను వినలేక సవతి యే
గతిఁ గల్గునో మీఁదు గంటివె యని
నట్టిమాటఁ దలంచి యాపలు కింతసే
సె నటంచుఁ దార్కాణసేసె నొకతె;
యొకతె రంభారూపయుక్తిచేఁ బ్రియుఁగూడఁ
గాంక్షించి యొకకార్యఘటనవేళ
తే. నాదియందును నాచేత నదివరముగఁ
దనకు నిచ్చితి ననిపించుకొనుట యిపుడు
హృదయమున నిల్పి యాపలు కింత సేసె;
ననుచుఁ దార్కాణ సేసె రెండును నిజంబు. 220

క. నా విని యిపు డీభావం
బీవనితకు నీవనితకు నిది యనుచు బయల్
గావించి తథ్యమిథ్యా
భావంబులు మీర లేరుపఱుపఁగవలయున్. 221

క. నావుడును "దథ్యమిథ్యా
భావంబుల కేమి? నీకు భావింపఁగ స్వా
భావికమే యీయాకృతి
భావము? నిజ మెద్ది యీప్రపంచమునందున్. 222

క. నీ పట్టురువడ నొక్కతెఁ
జూపి యొకతె గర్వ మడఁచుచున్ వలయుగతిన్
బ్రాపింపవచ్చు భోగము
నీపుణ్యం బినుమడించి నేఁడు ఫలించెన్." 223

ఉత్సాహ.—

అనుచు నోమహాత్మ పెద్దలైనవారిఁ దడవుగా
నునిచి యిట్టు నట్టు పలుక నొప్పు కేమి వచ్చునో?
చనుఁడు నిలుప వెఱతు ననినఁ జనియె నాతఁ డట్ల యా
ననుచు నుచితలీల నుండు మనుచు నల్ల నవ్వుచున్. 224

సీ. అర్థేశనందనుఁ డంతట నెప్పటి
తనపువ్వుఁబోఁడి కైదండఁ గొనుచు
'నిది యెంత లేదు నెమ్మది నిట్టివిఘ్నముల్
గుఱిచేసి మనకేలి మఱవ నేల?
ర'మ్మంచు రెండవరంభఁ గనుంగొని
'నీ వెంతనేర్పులు నెఱపితేని
మాయలే యని తోఁచు మాకుఁ గావున నీదు
సత్య మెఱింగింపఁ జాలినట్టి
తే. సాక్షిఁ దెమ్ము పొ'మ్మని తిరస్కారసరణి
దోఁపఁ బలికెఁ దాత్కాలిక దుర్నివార
మారకేళీకుతూహలమహిమచేత
నెచటి కేనియు నపుడు తా రేఁగఁ దలఁచి. 225

ఉ. ఆసుదతిం గనుంగొని తదంగన యప్పుడు హెచ్చినట్టి వే
రీసున నీసడించుచు "నొకించుక నీకును సిగ్గు లేదొకో!
దోసము గాదె యిద్దఱు వధూవరు లేకత మున్నచోటికిం
డాసిన? నిట్టియాసలఁ గడంగిన నే మని చెప్పు! నాపుడున్.

వ. ఆరంభ యమ్మాటలకుఁ గడునలిగి రోషకషాయితవీక్షణంబుల
నాపక్ష్మలాక్షి నీక్షించి. 227

శా. "ఓసీ నీకొఱఁగామిరయే యిది నిజం బూహింప కిట్లంగజ
వ్యాసక్తుం డగునాథుచేష్టితము గా నైనం గుబేరుండు లేఁ
డో సుత్రాముఁడు లేఁడొ పద్మజుఁడు లేఁడో ధర్మపుంబ్రాపులే
దో సత్యంబును నిల్ప నింతన కడుం ద్రుళ్లంగ నీ కేటికిన్?"

క. అనిన విని నాయకాదర
ఘనగర్వము [1]నిరసనంబుఁ గడుఁ జిత్తములోఁ
దనరఁగ నప్పలు కించుక
యును గైకొన కవ్వధూటి యుద్ధతిఁ బలికెన్. 229

క. అఱపు లుడిగి పోపో నీ
యఱచేతం బండ్లు వచ్చినప్పుడు మమ్ముం
గఱచెదవు గాని తగునెడ
మొఱయిడు మది యెట్టిదైవములు వినియెడినో. 230

వ. అనుటయు. 231

క. "కానిమ్ము వేగిరింపకు
నీనుడుటనె ప్రొద్దు వోడిచెనే యేదైవం
బైనను విన? కిప్పుడ యిదె
నానిజ మేర్పఱిచి నీ కొనర్చెద శిక్షల్." 232

వ. అని పలికి యచ్చోటు వాసి కొన్ని యడుగు లరిగి యంతటఁ
దనకోపంబును మించి దీపించుప్రియవియోగదర్పితానల్ప
కందర్పహేతిఘాతజాతచేతస్తాపంబున కోపక యాపదఁతి
కడుం గృశించి గళితకంకణ యగుచు నిలిచి యొక్క యుపా
యంబు చింతించి తిరిగి వచ్చి యి ట్లనియె. 233

1. నీరసంబు.

క. "నీ విచ్చో ప్రేమ యత వై
కావరమున వలసినట్లు గయ్యాళింపం
గా వెఱచి [1]పెద్దమొఱ గా
నే నీరిని వారిఁ దగిలి యేల వచింతున్. 234

క. నీవును రా ర మ్మిప్పుడు
దేవసభం దేటి యేఁగు దెంత" మనుచుఁ దా
నావనజాక్షిని డగ్గఱి
తీవరమునఁ గొంగుపట్టి తిగిచెం గినుకన్. 235

చ. తిగిచినఁ "జూచితే నిను మదిం గణియింపక యెంతసేఁతకుఁ
దెగియె భయంబు దక్కి వెనుద్రిమ్మరిరక్కసి గాక భూమిలో
మగువయె యీఁగయాళి? ప్రథమంబున నోర్చినతప్పు సూవె
యీ, పగిది ఫలించె ?" నంచుఁ బ్రియుఁ బల్కెఁ గరం బది
సంభ్రమించుచున్. 236

క. పలికిన "మన కేమీ ? విబు
ధులసభలోపలన తనదుదుండగ మెల్లం
దెలిపి తగుశిక్ష చేయుద
మలిగి యిపుడు పదర నేల ?" యని యతఁ డాడెన్. 237

తే. అంతఁ బ్రతిరంభ చూచి "నీయాత్మలోన
నింత యుండిన నీ [2]సత్వ మెఱుఁగవలయుఁ
దిరుగఁబడినను విడువఁ జూ ! దేవసభకుఁ
బద" మనుచు దానిఁ గూడి పోఁ గదలుటయును. 238

వ. కొంత చింతించి యతనికాంత యతని కి ట్లనియె. 239

---

1. పేద. 2. సత్య.

సీ. అప్సరస్త్రీలలో నగ్రగణ్యత్వంబు
జగదుపశ్లోకితంబుగ వహించి
యూర్వశీమేనకా ద్యుత్తమస్త్రీలు రా
వమ్మ పోవమ్మ నా నతిశయిల్లి
యెన్నండు నెచ్చోట నేవారిచే వ్రేలఁ
జూపించుకొనక ప్రస్తుతికి నెక్కి
నలకూబరుండు ధన్యతరుండు నాగఱు
వతనంబుచే నీకు వన్నె దెచ్చి
తే. యొప్పు[1]నే యింకఁ గడపట నిప్పిశాచి
నాకు సరిచేసికొని దేవలోకసభను
"నీవు సూ నీవు సు!" మ్మని యేవిధమునఁ
గలహ మాడెన? నిది నీవె తలఁచి చూడు! 240

క. కోపము పాపమునకుఁ బో
త్తీపెనుదగవునకుఁ దగఁగ నేటిట్లాటల్
ప్రాపించునో? పడంతుల
కోపురుషశ్రేష్ఠ యవియు నొక్కబ్రదుకులే? 241

వ. అదియునుం గాక. 242

క. "రంభకు నహాహా యొక ప్రతి
రంభ గలిగి తిగిచి తెచ్చె రచ్చల!" కనిసం
స్తంభింపనీకు హాస్య
రంభణ మీ పోరు నిర్జరవిటుల్ నగుచున్. 243

క. నానడకలకును యోగ్యము
కానిది యిపు డిచట [2]నైనకలహము బ్రదుకె

1. నేనింక. 2. నైనఁగల.

క్తైన నగుఁ గాని యిఁక నీ
యానన ధరణి విడిచి దివికి నడు గటువెట్టన్. 244

క. ఈకలహ మపుడ వినఁబడు
నాకంబున సురల యాననము లేగతి నా
లోకింతుఁ ? దెగినఁ దెగనీ
నాకు మరుఁడు నిన్ను [1]నిలు మనఁ డాకునికిన్. 245

వ. అనుచు రెండవకొమ్మ యమ్మాటలాకర్ణించి 'యోకాంతుండ! యీకాంతనేప్ప చూచితే! వేల్పులకడకు నేతెంచినఁ దన మాయ బట్టబయలంబడు ,ననియెడు తలంపున రాఁగూడక సురలయాననంబు లేగతి నాలోకింతు ? నని నాకగమనంబు పరిహరించె; నంమను ధరణి విడిచి దివికి నడు గటువెట్ట నని తోడిఁబడ నీమీఁది యాన వెట్టుకొనుట [2]ఖేచరత్వంబు కలిమియు సందియంబ. ఇంతతడవు ప్రియకాంత యనుచు నెట్లు నమ్మి?' తని పల్కిన నది వివేకమార్గంబ యగు నని. నలకూబరుండు తద్వాక్యంబులకు నిరుత్తర యైయున్న తన దండ చెలువ నుండనీక 'యోసి మాయలాడివిగదే!' యని మెడపట్టి పాయంద్రోయుటయు నదియ సందుగా నాయిందు ముఖి [3]యందంద దట్టించి 'యిట్టివెడనేఁతలచేత నాథుని కెడ నేసి చేతోజాత హేతిఘాతంబులపాలుపఱచి తని పలికి యాతరళాక్షిని హేతిఘాతనిమిత్తంబు చేతన కాయవియో గంబు నొందు మని శపించె.' నలకూబరుండును దత్కాల (గుణ)ం బెట్టిదియొకాని యాఁగాములు వివేకింపలేక యిది

1. నేలుమన. 2. వివేకింపఖేచ. 3. నందండ.

యిట్టి [1]శాపంబునకుఁ దగు నని పలికి "యోసి నీపే రెద్ది?
యెట్టిదాన?" వని యడిగె నప్పుడు తత్ప్రతిరంభ సైరింపక.

శా. "ఇందాఁకన్ నినుఁ జేరనీక నను న ట్లింతే మనోజవ్యథన్
గుందం జేయుట చాల కే మడిగె దీగొంటున్ వృథా"
యంచు "నా, కందర్పత్వరఁ గానలే" వనుచు నాకంజాక్షిఁ
బోఁ ద్రొబ్బెఁ దా, నెందున్ నిల్వఁగనీక పేరలుకతో నెంతేఁ
గడున్ దవ్వఁగన్." 247

వ. అని చెప్పి యాసిద్ధుఁ డాసుముఖాసక్తి కిట్లనియె. 248

తే. "అట్లు పోఁ ద్రొబ్బుటయు నతఁ డాత్మ నిచ్చ
గించుకొని యుండెఁ గాని తా నెంచఁ డయ్యె
రంభ యాఁగాము లా ప్రతిరంభ మీఁది
ప్రేమఁ "గాముకుల్ నూతనప్రియులు గారె?" 249

క. అనుటయు "నీ వం దేయిం
తిని సత్యపురంభ యనుచుఁ దెలిసితి? వాలా
గున భంగ మొంది యూరక
చను టరయఁగ నదియ కపటసతి గావలయున్. 250

క. త న్నట్లు పలికి ద్రొబ్బఁగ
మిన్నక చన నంత నోఁప [2]మెదపక యది యా
ము న్నాడినమాటలబిఱు
సెన్నఁగ? [3]నిది గనియె యతఁ డుపేక్ష యొనర్చెన్. 251

క. అది యట్టిద కాని మ్మా
తుద చెప్పుము సిద్ధపురుష! తొల్లి యొచటఁ గ

1. శాసనంబునకు. 2. మెంగయె. 3. నది.

న్నది విన్నదిగా దద్భుత
మిది వినవలయు" నన నాతఁ డిట్లని పలికెన్. 252

సీ. "ఇటమీఁద నింక నొక్కటి యద్భుతము విను
మోపయోజానన! యాపడంతి
నారీతి నెంతయు దూరంబుగాఁగఁ బో
ద్రొబ్బి యేతెంచి యాతోయజాక్షి
ప్రియుఁ జూచి "మగవారిప్రేమ లిట్టివిగదా!
యెట్లు నమ్మఁగ వచ్చు నిచ్చలోనఁ?
ప్రాణేశ యటు దండఁ బాసినమాత్ర నీ
ద్రిమ్మరి నెచ్చోటఁ దెచ్చుకొంటి?
తే. నిన్ను నే మన నున్నది నిరభిమాన
గుణత నినుఁ జేసు న న్ననుకొనుట గాక?
నాకునా యిన్నిపా!" ట్లంచు నాకులమతి
నడలెఁ గన్నుల బొటబొట నశ్రు లొలుక. 253

చ. అడలిన నాదరంబునఁ దదశ్రుజలంబులు కేల నొయ్యనం
దుడుచుచు "నాయెడం గలదె దోస మొకింతయు నెంచి
చూడ నో, పడఁతుక? దాని నీవ యనుభ్రాంతిఁ గరం బిటు
[1]లాదరించి యే, ర్పడినఁ బరిత్యజించితిని బట్టఁగరా దిది
తప్పుగా మదిన్. 254

మ. అని యింతిన్ నలకూబరుం డురముతో హత్తించుచున్
దుఃఖ మార్చి నికుంజంబునకున్ రతిక్రియకు నై చేర్పంగ
వేతొక్కఁ డం,తన వచ్చెన్ నలకూబరుం డచటికిన్ "నా

---

1. లాచరించి.

రూపముం దాల్చి వంచన నెవ్వాఁడుర చేరినాఁ [1]డిట
దురాశఁ రంభ ?" నంచుఁ వేసన్. 255

తే. ఇట్లు వచ్చినఁ గనుఁగొని యేను మిగుల
నుల్లమున వెఱఁ గందితి "నొకటి వెనుక
నొకటి రాఁ జొచ్చె మాయ లీయుర్వి మహిమ
తెలుఁగు గాదు గదా !" యని ధృతి చలింప. 256

సీ. అ ట్లేఁగుదెంచుచో నతని గన్గొని రంభ
బెదరు నాశ్చర్యంబు మది జనింప
విభున కి ట్లనియె "వల్లభ ! యిది యొక్కమా
యాప్రపంచము చూడు మద్భుతంబు !
నీదురూపముఁ దాల్చి ఖేద మొక్కించుక
యును లేక కాన్పించుచున్నవాఁడు
తనదురూపము నీవు ధరియించినాఁడ వం
చున్నవాఁ డిది గెల్వ యుక్తి చెపుము

తే. యపుడు నారూపుతో నది యన్ని వెతలఁ
బెట్టె నది గడచితి" మన బెట్టిదముగ
నిపుడు నీరూపుతోడ వీఁ డేఁగుదెంచెఁ
దిరుగఁ దొకమాత్రమున వచ్చుబిరుసు [2]జూడు. 257

క. మనయభిమత ఖేలనములు
మనమున సైరింప కిన్ని మాయ లకట యే
దనుజుఁ డొకో మాత్సర్యం
బొనరఁగఁ జలపట్టి పన్నుచున్నాఁడు కడున్. 258

వ. అని పల్కుచుండ. 259

---

1. దఁట. 2. చూడ.

శా. అంతం జేరఁగ నేఁగుదెంచి యతఁ "డోయబ్జాక్షి! యే
మంచు వి, భ్రాంతిం బల్కెదు కల్లయున్ నిజము వీడ్వా
టొండఁగా? నిప్డు నీ,కాంతున్ నన్నుఁ బరిగ్రహింపుము
మదాకారంబు వీఁ డెవ్వఁడో, యెంతే నొప్పుగఁ దాల్చె
వంచితవు నీ వేతన్మహామాయచేన్. 260

మ. మది నామాటలు నమ్మవేనియు నిఁకన్ మ మ్మిద్దఱన్ ధైర్యసం
పద పెంపారఁగ దవ్వులన్ నిలిచి యోపద్మాక్షి వీక్షింపు మే
నిదె ఖండించెద వీని మాయకమహాహేతిప్రకాండంబుచేఁ
దుదశోధించెదుగాని నీకుఁగలయుక్తుల్ మీఱి నాసత్యమున్."

చ. అన విని చాలఁ దల్లడిలి యాయక నాయకుకంఠమున్
రయం,బునఁ దనకౌఁగిటం బొదివె "భూరికృపన్ ననుఁ
గానరే ప్రియున్, మనుపరె వేల్పులార యొకమాయపు
రక్కసుఁ డాక్రమించి తాఁ, దునుముచు నున్న వాఁ
డలుకతోడ నిరాయుధు" నంచు నేడ్చుచున్. 262

చ. అది గని వాఁడు నవ్వి "యిది యూర వివేకము? గట్టిగాఁగ న
న్నె దనుజుఁ జేసితే ముగుద! నీవు దలంకకు నే నిరాయుధున్
మదమఱి పాఱువానిని బ్రమత్తునిఁ జంపెడువాఁడఁగాను 'నా
కెదిరిచి నిల్చునో' యనుచు నీతినిఁ ద్రుంచెద నంటి నిత్తఱిన్.

వ. ఎదిరించి నిల్వనోపునేని, తనకైదు వెచ్చట నున్నది? తెచ్చుకొమ్మను; మోకొమ్మ నెమ్మనంబున నితండ 'నిక్కపునలకూబరుం' డనియు, యుద్ధంబున జయాపజయంబు లెంచినట్టురావు; తొడింబడ నితని కొక్కటి యయ్యె నేని యే నేమి యగుదాన?' ననియు విచారించితేని నితనిసాధ్య

మిథ్యాభావంబు లేర్పడునందాఁక నేనును యుద్ధంబునకు వేగిరింపక సహించెద. ఇంకను మాయిరువురవాక్యప్రకారంబులు వినియు, నీ వెఱింగినపూర్వరహస్యంబు లడిగియు, మఱియు నుచితమగు తెఱంగులవలన మాకపటాకపటవర్తనంబులు దెలిసికొనుము. నాకుం బ్రియవనితవైన నీవు నాయెదుటన యిట్లు [1]పరునిఁ గంఠాలింగనం బొనర్చియుండ నిచ్చలోన మచ్చరంబు పెచ్చు పెరుఁగక యుండదు. పెచ్చు పెరిఁగెడు మచ్చరంబు సత్యాసత్యవివేచనపర్యంతంబు నిలువ కెట్లొనర్చునో యెఱుంగరాదు; కావున నాత్మహితంబుఁగోరితేని [2]యతని విడిచి యెడ గలుగ నిలిచి నాపలుకులు విను" మని పలికిన. 264

క. ఆచెలువ తనదుప్రియునిం
గాచుకొనఁగ నప్డు డదియె గతిగా మదినా
లోచించి చూచి మఱి త
ద్వాచాగతి నతని కెడగఁ దాఁ జని నిలిచెన్. 265

క. ఆతఁడు "నోతొయ్యలి యిపు
డీతనియాకత్తి గిత్తి యేను గణింపన్
భీతిలకు మన్న మానవు
భీతప్రకృతి" వని యొప్పెఁ బ్రియ యటు చనఁగన్. 266

శా. ఆవేళం గడ కేఁగి తా నిలిచి ప్రేమాంచత్కటాక్షంబులన్
ఘోరాసూయనిరీక్షలన్ వరుసఁ గాంతున్ దత్సమాకారు న
న్నారీరత్నము చూచుచుండె నెచటన్ వ్యర్థంబులత్యుజ్జ్వలా
కారశ్రీసమతల్ జనించు ననురాగంబుల్ మమత్వంబు చేన్.

---

1. పరునికంఠా. 2. యితని.

సీ. రెంటవనలకూబరుం డంత రంభఁ గ
    న్గొని "చెల్వ భావించుకొనుము నీవ
యమరేంద్రుఁ డంప నిం దరుగుదెంచితికద
    మణికంధరునితపోమహిమఁ దెలుప!
నతని నేచెట్టఁ గట్టితి? నీతఁ డెచ్చోట
    లంకించుకొనియె నలంఘ్యమైన
విరహతాపంబునఁ బొరలుచు నీరాక
    కెదురుచూచుచు నున్న యే నటుండ?
తే. నకట! సురకార్యవిఘ్న [1]మోయనుభయమున
వెంట రా లేనిపాప మిట్లైతలు దెచ్చెఁ
దేరకాఁ డిట్లు నిన్ను భ్రాంతిని బొరల్ప
బాస సేయంగవలసె నే భర్త ననుచు. 263

మత్తకోకిల. వెంటవచ్చిన నీవు నాపయి వేడ్కఁ జిక్కి తపక్రియల్
గెంటఁ జేయ నెఱుంగ కుంచినఁ గీడు వాసవుచేత నే
వెంట రా కటు నిల్చినన్ ననవింటివానికిఁ గోపి మీ
రెంటఁ జింతలు కొంత ప్రొద్దొనరించినన్ విపవీడుగాన్. 269

మత్తకోకిల. అంతఁ గంతునిసంత మెంతయు నంతకంత కనంతవి
క్రాంతిఁ బర్వఁగ నోర్వ "కట్టటు కాని యింద్రునియుక్కనై
రింతు" నంచును సాహసం బొనరించి యే నిటు వచ్చితిం
గొంత వెండియు నింద్రు నెంచుచుఁ గొంచితిన్ నిను డగ్గఱన్.

చ. "ఘనితపక్రియల్ చెఱిచి దైవతకార్యము నిర్వహించి నీ
వెపుడెపుడేఁ దెగుదెంతు;నిను నెప్పుడు కౌఁగిటఁ జేర్తు"నంచు నే
ననఘమితాశ నోజఁ విహీనన యివ్వనిచేసువం బ్రయాస
పడుచు నిల్చుకొంటిఁ ఒకసంచయపంచమవంచితాసువుల్.

---

1. మానవు.

క. ఇక్కడ నిను వీఁ డెవ్వఁడొ
యిక్కరణిఁ మోసపుచ్చి యేలుకొనంగా
నక్కట వలవనిశంకల
నక్కడ నే పొడుకాపు [1]లాగతి నుంటిన్. 272

ఉ. ఇంతకమున్ను నారదమునీశ్వరుఁ డచ్చటి కేఁగుదెంచి "నీ
వెంతయు మన్మథార్తిఁ బడి యేమిటి కిచ్చట నున్నవాఁడవో
భ్రాంతుఁడ ? నీదురూపమున రంభ నొకం డవలం గరంబు వి
భ్రాంతిని ముంచుచుం వివిధభంగుల నేలుచునున్నవాఁ"డనన్.

క. విని వచ్చితి "నే సమయం
బున నేగతి సందుకొనియెఁ బొలఁతుక యితఁ ? డీ
తని తెలుఁగుఁ జెప్పు" మన "నే
మనిచెప్పెద" ననుచుఁ జూచె నవప్రియు మొగమున్. 274

తే. చూచుటయు "నేమిచూచెదు శోభనాంగి ?
నిన్నుఁ జెందినపాల్లిన్నఁ జెంద
కుండునే నాఁటియలనారదోక్తి యరయ !
నాఁడు నీతోడ నమ్మునినాయకుండు. 275

క. "నినుఁ బోలువనిత నీకును
వనజముఖి ! యితనిఁ బోలువాఁ డితనికి నెం
దును గలిగి కలంచునొ ! యి
ట్టినిగాఢపుసొంపుమదము తీవ్రులు చనునే ?" 276

క. అని పలికెఁ గాదె ! యది వృథ
చనునే ? యైనను లతాంగి శంకింపకు నీ
మనమున నీగతి; నిప్పుడ
తునిమెద నాఖడ్గమునను దుర్దమలీలన్. 277

---

1. నాగతి.

వ. ఆఖడ్గం బప్పు డల్లయచటి కేళినికుంజంబునం బెట్టినవాఁడ;
నిదె తెచ్చుకొనియెద నని పోవం జూచినఁ దత్ప్రతిభటుండు
"నీ కింత బీరంబు గలిగినం బోరు దూరంబుచేసి యిటు నటుం
జన నేల? నిరాయుధుండ నంటేని నేను నాయుధం బిదె
విడిచితి నని విడిచి యడ్డంబుగా నడిచిన బెడిదంపు టీరసం
బును వీరరసంబును ఘోరంబులగుచు నుల్లసిల్ల మల్లయుద్ధం
బాయిద్దఱకుం దద్దయుం బ్రవర్తిల్లె; నప్పు డొండొరుల
యుద్దండదోర్దండ చండాస్ఫాలనాభీలఘోషవిజృంభణంబులు
కుంభినీధరగహ్వా[1]రసముద్ధత ప్రతిధ్వానంబులచేత నినుమడించి
ప్రళయజలధరవర్గనిర్గళితంబు లగుబలుపిడుగులమ్రోఁత ననుక
రింప నిశ్శంకనిరంకుశాహంకారహుంకారగంభీరారావంబుల
యార్భటులు [2]నిర్భరసముద్భటంబు లై దిగ్భిత్తులఁ బిక్క
టిల్లుచు ప్రక్కలింప నొక్కరొక్కరి మిక్కుటపువిక్రమంబుల
పెక్కువ లెక్కగొనని యక్కజపుఁ బెసుక్కున మిక్కిలి పేర్చు
నిచ్చలపుటగ్గలికలఁ దగ్గుమొగ్గు లేక డగ్గఱి యాగ్రహంబు
నెఱప [3]నొడ్డారించుచు గడ్డుఱుక సీక యడ్డంబుగా నొడ్డు
కొనియెడు నెదిరిపిడికిలి పోయం దట్టి బెట్టిదంపుటురువడిం
దోడింబడఁగఁదీసి కీలాగరిష్ఠనిష్ఠురముష్టిఘాత ప్రయోగనైపు
ణ్యంబులు దీపించుచుఁ గోపంబున నేపు చూపెడునాటోపంబుల
నాఁపరాని యనూనంపుబిఱుసునుం బిఱుసఁదనంబును హెచ్చఁ
జెచ్చెరఁ జొచ్చి పట్టుకొని హెచ్చుటెకం గచ్చు వదలక పెఱఁ
గెడి [4]యచ్చలంబును బలంబును బ్రబలంబుఁ జేయ గళం
బుల ముంజేతు లిడి పెనమఱ నొక్కి తెక్కలిఁ జెఱచి ...డ

1. సముత్థిత. 2. నిర్భట. 3. నొడ్డాణించుచు. 4. యచ్చలంబుబ
లంబును.

వైచుచుఁ, [1]బడవైచిన విడువక తోడన పరునిం బడం దిగు
చుచుఁ, దిగిచిన బిగి వదలక పయింబడి కదలమెదలనీక పొదివి
పట్టుచుఁ, బట్టిన నిట్టట్టుపెనంగి పట్టువదలించి కరంబుల నురం
బులనడిమి కిముడించి యొడముకొని బడిబడిం బొడుచుచుఁ,
బొడిచినఁ బొడువనీక కడిందికడిమి నడంగంబట్టి పగతు
చేతులు తొడల నిఱికి పరాక్రమించుచుఁ, బరాక్రమించి
నను విక్రమంబు దక్కక వెనుకటివట్టికట్టు పిడికిటఁ దొడికి
యెత్తి తెఱపిగొని పఱపి మోఁకాళ్లు వక్షస్స్థలంబుల నాని
వెల్లకిలఁ బ్రెళ్లబిళ్లమీటుగాఁ జిమ్ముచుఁ, జిమ్మిన ముమ్మరపు
వేగంబుతోడఁ దోడన లేచి పైఁబడఁ గడంగిన నెడయీక
పదంబులు చాఁచి యెదురొడ్డుచు, (నెదురొడ్డిన) నఱిముఱి
నొక్కింత తఱిఁ గని యద్భుతరయంబున దిగ్గన లేచి మెడ
యొడిసిపట్టి గ్రుడ్లు వెలికుఱుక నొక్కుచు, నొక్కినఁ జిక్కు
వడక యొక కేలఁ గోకకట్టు నొక్క కేలఁ దొడయుఁ బట్టి
కూలవైచి మఱియు మల్లచఱచి క్రమ్మఱ [2]రెమ్ము రమ్మని
గర్జిల్లుచు, గర్జిల్లిన నూర్జితరయంబున మగుడఁ దలపడి పౌరు
షంబు సేయుచు, వెండియుం [3]బాయుచు డాయుచు ననేక
ప్రకారంబులఁ బోరుచుండ. 278

ఆ. అట్టియెడను బచ్చుపట్టుకట్టిచేత
నొప్పుతనదుప్రియుని నుజ్జ్వలింపు
శిపి నెఱపు చంద్రకాపిపట్టిచేతఁ
బరుని గుఱు తెఱంగె సురవధూటి. 279

క. ఇక్కరణి నించుకంతయు
నెక్కువతక్కువలు లేక యిరువురు సరిగా

---

1. వైచియుఁ. 2. రెమ్ముహుమ్మని. 3. బాయుచు లాయుచు డాయుచు

నుక్కునఁ బోరాడి శ్రమం
బెక్కుడుగాఁజేసి నిలిచి రెడగా నంతన్. 280

ఉ. రంభయు వారిరూపు ననిఁ బ్రౌఢియుఁ దుల్యతఁ బోల్చి
సంశయా,రంభ మొనర్చ నెవ్వరిఁ దిరంబుగ నమ్మ "కహహో
నిలుండు సం,రంభము మాని యే నసుగుప్రాక్తనవర్తన
మొక్కటిన్ రహ,స్సంభవమైనదాని వసుసన్ వచియింపుఁడు
మీర లిత్తఱిన్. 231

క. దానన్ సత్యాసత్యత
లే నామతిఁగోలఁది నిశ్చయించుకొనఁగ నె
వ్వానికి నెయ్యది యుచితం
బానియతి నతండు పోవు టర్హం" బనియెన్. 232

వ. అని యాంవనిత యాడుమాటకు వార లీయకొన నిద్దఱం
బాయం బాయఁ బిలిచి యొకఁడు వినకుండ నొకనితోడ
"మనకుఁ బోల్లి కళాపూర్ణుం డనువానిప్రసంగం బెచ్చట
గలిగెఁ? దత్ప్రకారం బేమి నీవు వింటి?" వని యడుగుటయు
నందు ద్వితీయుండు దానికి సమ్మతంబుగా నుత్తరంబిచ్చెఁ
బ్రథముండు వెలవెలంబాఱుచు నూరకుండె; నయ్యతివయు
నతనిం జూచి "కటకటా! యిందాఁక నేను నిన్ను నిక్కపుఁ
బ్రియుం డనుచు నమ్మియుండితి. నీవు కపటరూపధరుండవే!"
యని యద్భుతంబును జుగుప్సయు భీతియు నాకారంబున
దీపింప నతని విడిచి యితరునిం బరిగ్రహించె; నతం డమ్మా
యావి నాలోకించి యతని నల్పావశిష్టాయువుగా శపియించె;
నప్పుడు రంభ యక్కపటవర్తనుం జూచి "నీ వెవ్వండ?
వెవ్విధంబున నిట్టిరూపంబు ధరియించి నన్ను వంచించి?" తని
యడుగుటయు, సత్యనలకూబరుండు. 283

సీ. ఇంద్రాక నినుఁ జేరనీక న న్నట్లల
యించుట చాలక యింక నిలిపి
వాని నే మడిగె దెవ్వఁడు [1]గాక నీ కేమి
యిది కాకదంతపరీక్ష సుమ్ము
నామన్మథార్తి యెన్నఁగ వలదే చాలు
రా రమ్మటంచు నారంభ నపుడ
తోడ్కొని చనియెను వేడ్కతో మోముఁ దా
మర వికసింపఁగా సురపథమున

తే. నంత నితరుండు చింతతో నంత నింత
గొంతవడి నిల్చి దీనతఁ గోమయ దలఁగఁ
జనియె మణికంధరునిపర్ణశాలదిశకు
నల్లనల్లన మిక్కిలి [2]యలసగతిని. 234

వ. అట్టియెడ మున్నతండు తనకేళికానికుంజంబునం బెట్టిన నా
పట్టంబుఁ బుచ్చుకొని తత్సంతోషంబున నుబ్బుచు నిచటికి
వచ్చితి; నిది యిచ్చునప్పుడు మద్గురుండు నాతోడ 'దీని
నెవ్వరి ప్రేయం బూనితి వవశ్యంబును వారిని వధియింపక
మాన' దని యానతిచ్చినవాఁ డేను నిమ్మహాయుధంబు కల
భాషిణికంతంబు ప్రేయ నట్లు పూన్చితిం గావున నప్పటికిఁ
దప్పి చనియు మీఁదట నవశ్యం బగు నని పలుకుచు నంతం
గలభాషిణిం జూచి కడమపలుకక తక్కుటయు నాకలభాషిణి
యతని నీక్షించి సంకోచం బేల ? భవితవ్యతావశంబునఁ గా
నున్నయర్థంబు కాక మాన దనుటయు; నమ్మాటకు మెచ్చుచు
నతండు. 235

---

1. గాఁగ. 2. నలస.

క. నీవు వివేకధురీణవు
కావున నమ్మాట యంటి గాక! యవశ్యం
భావి యగుదుఃఖమును జను
నే వారుఁ ద్రవ్వంగ నిజము నిష్ఠుర మెందున్. 286

తే. ఇంక నీవృత్త మెఱిఁగింపు మేను బలిమిఁ
బట్టి మొఱపెట్టునిను డించి పాఱిపోయి
క్రమ్మఱఁగ వచ్చి మఱి నిన్నుఁ గాన నెచట
నుండి? తది మొదల్కొని చెప్పు ముపిద యనిన. 287

శా. మేఘాంభోనిధికామధేనుసురభూమీజాతచింతామణి
శ్లాఘాలంఘనజాంఘికత్వసముదంచద్దానలీలా సఘుం
టాఘోషానిశఘోష్యమాణపరిపూర్ణశ్రీకటాక్షోదయ
ద్రాఘీయోధనసంపదార్జిత యనంతప్రాభవస్ఫూర్జితా! 288

క. కంజముఖీలోచన జీ
వంజీవాజీవా మృదునవస్మితశోభా
మంజులముఖచంద్రసదా
రంజితవిద్వత్కవీంద్ర ప్రణుతోపేంద్రా! 289

స్వాగతము.—

నిర్విరామఘరణీభరణాంకా, గర్వితారిజయకర్మవిశంకా
సర్వదిక్చరవిశంకటకీర్తీ, శర్వరీరమణసన్నిభమూర్తీ! 290

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళి యమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామ ధేయప్రణీతం బైనకళాపూర్ణోదయం బను మహాకావ్యంబు నందుఁ దృతీయాశ్వాసము.

---

శ్రీ ర స్తు

# కళాపూర్ణోదయము

## చతుర్థాశ్వాసము



సౌభాగ్యవిభూతివి
లాసాలంకార నిత్యలలితాకారా
భాసురయశఃప్రసూనసు
వాసితసకలాశ కృష్ణవసుధాధీశా! 1

సీ. ఆవధూమణి నవ్వి "నావర్తనము నీవ
    చెప్పితి; వింక నేఁ జెప్పఁగలదె?
గుహసత్త్వుఁ డగునలకూబరుచేఁ బట్టు
    వడి నీవు ననుఁ జూప గడఁగి యట్లు
వచ్చుచో నెదురుగా వచ్చినరంభ నేఁ
    జుమ్ము; నీ* విడిపించి యమ్మెయిఁ జని
యభిమతం బైనయ ట్లంగజలీలావి
    హారంబు సలిపితి నంతలోన

తే. నరుగుదెంచినయదియ సుమ్మావ్యరంభ
యారమణిఁ బ్రాణవిభుఁడండఁ జేరనీక
యవ్విధంబునఁ బోరాడి యంతమునను
దద్గతిని శాపమొందినదాన నేన." 2

* అవధరింపుము అను వచనము గలదు.

చ. అన విని వార లందఱును నత్యధికం బగువిస్మయంబునన్
మునుఁగుచు "నెట్టిటూ చెపుము ముద్దియ! యేగతినట్లు రంభరూ
పునుధరియింప నేర్చితివి? పొందుగ నెమ్మెయి సందుకొంటి? వా
యనఘుని నట్లుగూడఁగఁ జిరాభిమతం బిది నీకు" నావుడున్.

సీ. ఆకాంత సిద్ధు నాలోకించి నిన్నున
వ్విధమునఁ దఱిమెడువేళఁ దనదు
ప్రాణేశు వెంటన యారంభ గదలి తా
నేతెంచినంతట నిట్టి యొకట్టె
*యెదురుగా వచ్చుట కెంతయు శంకించి
యటముందు పోవక యచట నిల్చె
నప్పుడే వీక్షించి యదియు వచ్చినయట్లు
గాఁ దదాకృతి గట్టిగాఁగఁ దాల్చి

తే. వచ్చితి నతండు నినుఁ బట్టి తెచ్చుచోటి
కాచెలువ రాక మసలుట యతని కెఱుక
పడక యునికి నాకృతి వేషభాషణాదు
లాగతిన యున్కి నాచేత లమరె నట్లు. 4

తే. ఆచెలువరూప మెట్లట్ల యగుచు నుండఁ
దాల్చు నేరుపు మున్నొకతఱిని నాకు
నారదుం డిచ్చె; నదియు వినంగఁ బడియెఁ
గద యతఁడ చెప్ప నీకు మాకలహవేళ. 5

క. అమ్మెయిఁ జెప్పియు నతఁ డపు
'డమ్మాయారంభ యిది' యటంచు ననుఁ బ్రకా

* తనకు మిక్కిలిన నిల్చిన సుద్ది యది
చెప్ప నీవ వింటివకదా! యావధూటి.

శమ్ముగఁ జేయక కారు
ణ్యమ్మున మన్నించె మన్ముఖాకృతిఁ గనుచున్. 6

వ. అది యెల్లఁ జెప్ప నేమి? కడపట నిట్టిశాపంబునకుఁ గారణం
బైన యారూపురోసి 'యది యంతయు నుజ్జగించి యవశ్య
భోగ్యం బైన తచ్ఛాపఫలం బిద్దేవిసన్నిధి ననుభవించినఁ
బరోపకారం బగు' నని వచ్చితి" నని చెప్పి కలభాషిణి
యమ్మణిస్తంభున కిట్లనియె. 7

తే. "నీదుగురుఁ డన్న యట్ల నీనిశితఖడ్గ
పరివితథోద్యమ మగుట సువ్యక్త మయ్యెఁ;
దిరుగ నిన్నును నన్నును దెచ్చె దైవ
మిచ్చటికి; ధన్య నైతి; నీయిష్ట మొందు. 8

చ. అవియటులుండె నాపడుప్రయాసము లూరక పోకయుండ న
ట్లొదవెఁ బ్రియుం భజింపననియుండఁగఁ జెప్పితివిప్పు డానికిం
గొదవ గలుగంగ సత్యనలకూబరుఁ డొక్కఁడు వేఱవచ్చియా
తుద నతనిం శపించెనని తొల్లిటి యాకపటాత్ముఁ డెవ్వఁడో?"

క. అన విని "యేమియు మిక్కిలి
యనఁబోయెదు సుమ్ము తరుణి! యట్లపురూపం
బున నున్నవాఁడ నేఁ జు"
మ్మని మణికంధరుఁడు పల్కె నల్లన నగుచున్. 10

వ. ఇట్లు పలికినం గలభాషిణి యాశ్చర్యంబు నొందుచు. 11

క. విని "నీ వెపు డెట్లా రూ
పును దాల్చితి చెప్పు"మని తపోహాతి గావిం
చిన నేప్పునంద రంభయు
ధనదసుతుఁడు గూడె ననిరి తత్సఖు లెదురై. 12

సీ. అన "రంభ నట్లు కూడిన వాఁడ నేన; యే
రృడ నీను మట్లు తపంబు చెఱిచి
మున్ను నన్ను నడి గూడి తన రెడు తనమాన
సము నలకూబరాస క్త మగుట
ప్రకటంబు గాఁగ గోత్రస్ఖలితత్వంబు
చే నెఱింగించిన నేను రోసి
దాని వీక్షించి యెందేనిఁ బోయెద నని
వీడ్కొని చనుచు నవ్వేలఁది రతులఁ
తే. దనియమిఁ 'పదాత్మ రంజన దనరఁ గలయ
వలయు'; నని యంత మత్తపోవ్యయముచేఁ ద
దీయవిభురూపుఁ దాల్చి వే తిరిగి వచ్చి
పొసఁగఁ బల్కి రమించితిఁ బూర్ణరతుల. 13

వ. అత్తెఱంగున నద్దివ్యాంగనతో రమించు చునికిం జేసి తత్ప్రి కాలంబున నొదపిన నీతోడి క్రీడ లనుభవించి యమ్మాయా రూపంబునకు సద్యగ్గిఫలంబుగా నట్టిశాపంబుఁ దెచ్చుకొని. యంతట బుద్ధిమంతుండ నై యప్పటిపర్ణ శాలకుం జని యెల్ల మాయలుం జాలించి నావీణెయు రత్నమాలికయుఁ బుచ్చు కొని యిచ్చటి మహిమలు తొల్లి యెఱింగిన వాఁడ నై యిం దేమి విశేషంబులు దొరకునో యని వచ్చితి" నని చెప్పి నగుచు ని ట్లనియె. 14

చ. "నెలఁతుక రంభపొందు విడ నేరక యెంత ఘనప్రయత్నతన్ నెలకొని యే రమింప నది నీ వయి తే మని చెప్ప! నీవు న త్యలఘుతరప్రయత్నపరతన్ నలకూబరుఁ గోరి కూడి రం జిలఁగ నతండ యే నయితిఁ జిక్కితి వెట్లును నాదుకోర్కికిన్.

చ. జలజదళాక్షి యేను మునిశాపభయంబున నెందు నేరకిం
దెలివిపడంగనీక మది ధీరతఁ ద్రిప్పుదుఁ గాని నీపయిన్
గలదు సుమీ తలంపు మనగానకళాభ్యసనంబువేళలన్
ఫల మిటు లొందె దానికిని భాగ్యవిశేషవశంబునం దుదన్."

చ. అనుడుఁ గృతార్థ నైతిఁ గుటిలాత్మకు డెవ్వఁడు నన్ను
నట్లు వం,చనమునఁ గూడెనో! యనువిచారము వాసెను నీదు
పొందు నా, క నభిమతంబె నీకుఁ ఎగ నన్నతలంపున నీ
తలంపు నేఁ, గనమిని ద్రిప్పుదున్ హృదయకాంక్ష నిసుం
మును చూచు వేళలన్. 17

శా. నీసౌందర్యవిలాసభాసురతనూనిర్నిద్రసౌభాగ్యమున్
నీ సంగీతవిశేషకౌశలము నీ నిర్దోషనానాగుణో
ల్లాసంబున్ నను నప్పు డెంతపరమాహ్లాదంబు నొందించెనో!
యాసుద్దుల్ హృదయైకసాక్షికము లేమన్నన్ వృథాయిత్తఱిన్.

ఉ. ఆవిధి నుండునంతట నొకప్పుడు నిన్నును జూచుచో మణి
గ్రీవునిపేరు దోఁచె మదికిన్ మణికంధర! యేకదేశసా
మ్యావహగుణంబుచే నతని నాతనియన్నను మద్దిచెట్లుగా
దైవతమౌని తిట్టినవిధంబు తలంపునఁ బాఱె నంతటన్. 19

ఉ. దానన గుండె [1]గుబ్బురనఁ దా నెరియన్ విడిచెం ద్విదంగసం
గానుభవేచ్ఛ యొట్టిడిన [2]యట్లది యాదిగ నాదుచిత్త మో
మానితశీల యంతట సముంచితతావకరూపరేఖవో
ప్పే నొకకొంత గల్గఁ గని యిచ్చఁ గుబేరతనూజుఁ గోరితిన్.

క. శాపభయంబున నెఱయఁగ
నీపై కోరిక మరల్చి నిధిపతిసుతు నే

1. గుబ్బుమన. 2. యట్లు తదాదిన.

పాపపువేళను జూచితి
నో! [1]పరు సొబగేను మఱి కనుంగొన గుఱిగాన్. 21

క. ఆయతఁతనయుఁ డని ని
న్నే యేఁ బొందితిఁ దుదకు వినిర్మలభాగ్య
శ్రీ యే మని చెప్పుదుఁ! "బడఁ
బోయిన బూఁబొన్నునఁ బడుపోలిక" యయ్యెన్. 22

ఉ. శ్రీయుత మైనదివ్యమణి చేతికి నబ్బఁగఁబారవైచి తచ్ఛాయ
యొకింత యున్కిఁ గని చాలఁ గృశించితి గాజుపూసకై
నాయవివేక మే మనుకొనం? దుదఁ దన్మణి యబ్బె నన్న న
త్యాయతతత్సమాగమసుఖాప్తికి నోఁచమి నెంచి కుందెదన్.

ఆ. ఇట్టిమాట లిప్పు డే నాడుకొనుటయు
నుచితంబు 'వారవనితపలుకు
లిచ్చకంబు' లనక యెవ్వరు నమ్మెద?
రవియుఁ గాక దృష్ట మన్యవాంఛ. 24

వ. అని లజ్జాశోకంబు లడర నవనతముఖయైన కలభాషిణిం జూచి మణికంధరుం డిట్లనియె; "నోయుత్తమవిలాసిని నిన్ను నితర వారవనితలయ ట్లసత్యవాదినిగాఁదలంప నంత వింతవాఁడ నే! నీపలికినట్లు నీకు మున్ను నాయందుఁ గోర్కె గలుగుటకు గుఱు తొకటి యున్నది; యది యెద్దియం టేని నారదుండు కడపట నిన్ను నింటికి ననుపుచు నేను విన నీతోడ. 25

తే. కొమ్మ నీవార్తలో మును గోరినట్టి
కాంతు రంభామనోహరకాంతుఁ డగుచు

1. పయి.

మెఱయువానినిఁ గూడి రమింపఁగలవు
నమ్ము పొమ్మిఁక నీభవనమున" కనియె. 26

క. 'నలకూబరుఁ గూడెద' వని
పలుకక య ట్లనినసత్యభాషణుపలుకుల్
ఫలసిద్ధియు నరయఁగఁ దొ
య్యలి నను మును నీవు గోరు టనృతం బగు నే? 27

క. ఆకోరిక శాపభయో
ద్రేకవిశేషమున నెఱయఁ దెగు టరుదును గా
దోకామిని లోకమున వి
వేకింపఁగఁ గలవ యిట్టివియు నొక్కొకచోన్. 28

వ. రంభాసాన్నిధ్యశోభితాభినవవిలాసభాసురం బైన నలకూబరునిరూపున హత్తినట్టిచిత్తంబునకుఁ బరస్యం బెట్టిదియైనను మఱి యింపు గామియుఁ జిత్రంబు గాదు. పురుషులందు నొక్కొక్కవేళ గుణంబున నిట్టివి గలవు; తత్ప్ర[1]కాశకంబైనది యొక్క కథ గల దది పాప[2]నాశనం బై యొప్పుచుండుఁ గావునఁ దాత్పర్యంబున నాకర్ణింపుము తన్మూలంబు మొదలుకొని చెప్పెద నని యి ట్లనియె. 29

సీ. "కాంత యేఁ దొల్లి యనంతదేవవ్రతో
ద్యాపనకొఱకు ననంతపద్మ
నాభునిసన్నిధానమునకు వచ్చితి
వచ్చి యచ్చటఁ గరం బచ్చెరువగు
కవితచే నద్దేవు వివిధభంగుల నుతి
సేయుసత్కవుల నీక్షించి యిట్టి

---

1. కారం. 2. నాశనంబు నై.

సౌభాగ్య మేగతి సంభవించునో యను
వాంఛతో నచ్చటివారివలన
తే. నీమృగేంద్రవాహనసుద్దు లెల్ల వినుచు
నచటి కిద్దేవి యనతిదూరాంతరస్థ
యగుటయు నెఱింగి యేతెంచి తగ శిలాక్ష
రోక్తసాహసవిధి నిష్ట మొంది తిరిగి. 30

వ. అరిగి యద్దేవునియగ్రమంటపమున. 31

ఉ. అంతము గాఁగ గౌతమకణాదమతంబులు భేదవాదిసి
ద్ధాంతము జైమినీయ మురగాధిపశాస్త్రముఁ గాపిలంబు న
త్యంతము నాకలించి యవి యాత్మల మెచ్చనిపాంచరాత్ర రా
ద్ధాంతవిధాసమర్థనసమర్థకృతార్థమతిప్రదీప్తులన్. 32

సీ. శ్రీమహితాష్టాక్షరీమంత్రజపపరా
యణుల నారాయణధ్యానపరుల
దేవతాంతరచింతనావిదూరుల గామ
రోషాదిరహితుల రూఢమతులఁ
జివచిదీశ్వరతత్త్వవిదులఁ ద్రైలోక్యపా
వనచరిత్రుల బుధవంద్యపదుల
నకలంకశీలుర నఖిలశ్రుతిస్మృతి
శాస్త్రపురాణవిజ్ఞానఘనులఁ
తే. దమకుఁ జక్రికి నిత్యసిద్ధంబులైన
శేషశేషిత్వములు చింత చేసికొనుచు
నతనిదాస్యంబు గతిగాఁగ నరయుపరమ
వైష్ణవులఁ గంటి సభ్యయై ప్రవర్తిలంగ. 33

క. కని యే దండనమస్కృతు
లనేకము లొనర్చి వార లడుగఁగ నా పే
రును గంధర్వత్వంబును
వినిపించి హరిస్తవేచ్ఛవిధముఁ దెలిపితిన్. 34

ఆ. తెలిపి "యోసుబోధవిలసితులార! మీ
రాయనంతశయనునట్లు నాకు
నాకవిత్వసేవఁ గైకొనుఁ" డని తగు
వర్ణనకుఁ గడంగ వారు చూచి. 35

సీ. "ప్రకృతిపూరుషులందు బహిరంతరముల నె
ప్పుడుఁ జలింపక పరిపూర్ణుఁ డగుచుఁ
దనకు నాదియును మధ్యంబు నంతము సమా
నుఁడు నధికుండు నెందును గలుగక
సర్వజ్ఞుఁ డై సర్వశక్తి యై సర్వని
యంత యై సర్వాత్ముఁ డై వెలయుచు
సర్వంబుఁ దనకు శేషముగ సర్వమునకు
శేషి దా నగుచు లక్ష్మియును దాను

తే. రుచియు రవియుఁ జంద్రికయుఁ జంద్రుండువోలె
నయుతసిద్ధత్వ మొప్పంగ నాదిమిథున
మనఁగ సకల వేదాంత వేద్యతఁ దనర్చు
పరమపదనాథుఁ బొగడు నీప్రౌఢి కొలఁదె." 36

క. అని యిట్టు నాచేఁ ద
ద్వినుతులు సేయించి మెచ్చి విశ్వహితార్థం
బును జెప్పించిరి త్రిజగ
జ్జననీపరమపదనాథసంవాదకథల్. 37

క. చెప్పించి "యీకవితచే
నిప్పుడు గా కున్న నీకు నిఁక నొకమేనన్
దప్పక యొదవుఁ దిరంబుగ
నప్పరమునిపరమభక్తి" యని రథికవయన్. 38

వ. ఏనును దానృశంసుఁడై నమస్కరించి యఖండకవిత్వాధార శారదాపీఠంబునం దలియంకటివినుతి కెక్కునందాఁక మిక్కిలి మెచ్చుకొనన రా దని యచ్చోటికి నంత నరిగితి; ననిపలికి, యింకఁ బ్రకృత కథ వచ్చుచున్నది యాకర్ణింపు; మట్లు శారదాపీఠంబునకు నేఁ జనునప్పుడు తత్సన్నిధియందు. 39

సీ. ఋగ్వేదఘోషసమృద్ధి యెం దొకచోట
నొకచోట యాజుషాభ్యుదయమహిమ
సామగానధ్వానచాతుర్య మొకచోట
నొకచోట నాథర్వణోక్తిగరిమ
గృహ్యసూత్రనిపాఠఖేలనం బొకచోట
నొకచోట శబ్దతంత్రోపచయము
జ్యౌతిషసిద్ధాంతసంఘర్ష మొకచోట
నొకచోట ధర్మశాస్త్రకలనంబు
తే. లుభయమీమాంసల ప్రసంగ మొక్కచోట
నొక్కచోటను బటుతర్కయుక్తికథలు
యోగసద్గోష్ఠి యొకచోట నొక్కచోటఁ
గావ్యకలకల మొప్పారఁ గనుచు నంత. 40

సీ. పదవర్ణసౌష్ఠవప్రకటనం బెంతయు
నింపుమీఱఁగ వ ప్పొచ్చి యిచ్చి

తగ నుదాత్తాదిభేదములు గెంటక పర్వఁ
గనుబొమ్మచేష్టలఁ గలిపి కలిపి
యెడనెడలఁ గన్నఁ దడఁబడ కుండంగ
గుఱుతులు మదిఁ బాదుకొలిపి కొలిపి
నిజశిక్షలో బుద్ధి నిలక విస్వరములు
పలికిన బుగ్గలు నులిమి నులిమి
ఆ. యొక్కమండపమున నుజ్జ్వలబ్రహ్మవ
ర్చసముతోడ బ్రహ్మచారులకును
బరమనియమవృత్తిపరత వేదముఁ జెప్పు
చున్నయట్టి యొక్కయొజ్జఁ గంటి. 41

క. కని దగ్గఱఁ బోయిన నా
యన రారమ్మనుచు నెవ్వ రయ్యా మీరల్
ఘనతేజంబున నొప్పెద?
రనుచుఁ జోటిచ్చి మత్కులాఖ్యలు వినియెన్. 42

క. విని పూజ్యులు వచ్చినయపు
డు ననధ్యాయ మని యప్పుడు వటుప్రకరం
బును జదువు మాన్చి నాతో
ననుగుణవిహితోపచారుఁ డై వర్తిలఁగన్. 43

సీ. మెఱుఁగారుముంజియు మేనికోమలికంబుఁ
గడుఁదిట్టతనము గుల్కెడు మొగంబుఁ
బసుపుగోఁచులయొప్పు బ్రహ్మతేజంబును
జారుకృష్ణాజినధారణంబుఁ

దళుకుజన్నిదము మేధావిబొట్టును జన్ని
[1]పట్టెవర్ధనమును జిట్టితపు
మొలవంకయుంగరంబులసొంపు వండపుఁ
గోలయు సన్నపువ్రేలుసిగయు
ఆ. నొప్పు బ్రహ్మచారి యొకఁ డేగుదెంచెఁ బు
స్తకముఁ గొంచుమిగుల సంభ్రమమున
నొజ్జ యతనిఁ జూచి "యోరి యేమిర కడు
నాలసించి ?" తనియె ననిన నతఁడు. 44

వ. ఏ నాలసించుటకు నిమిత్తంబు చాలఁ గలదు; మీ కేమియు వినఁబడదు గావలయు! వినిపించెద, వినుం డని పలికి యి ట్లనియె; నట్లు మీరు ననిచిన నేఁ జనునప్పుడు శాలీనుండు తమపువ్వుఁదోఁటలోన నొక్క లతాగృహంబు నందుఁ దన పాదంబులు సుగాత్రి వేడుకతోడఁ దొడల మీఁద నిడుకొని యొత్తుచుండ నిష్టసల్లాపంబుల నలరుచుండి నన్నుం జూచి నగుచు "నుపాధ్యాయులు పుస్తకంబునకుఁ బంచిరే ? యది యిక్కడన యిదే డాఁచినాఁడ." నని తమ యుపరిభాగశాఖఁ జూపి "కొంచుఁ బోదువు గాని యటు గూర్చుండు"మని యెదుట నున్న యొక్క విహారవేదికతోడి లేఁపూవినీడఁ జూపినఁ గూర్చుంటి; నంతఁ దనయింతి మూఁపునఁ జేయిడి యాయమ కి ట్లనియె. 45

క. "అమృతము సేవించితివో
రమణీ యే మైనసిద్ధరస మబ్బెనొ నీ

---

1. పట్ట.

కౌమరుం బ్రాయము మిక్కిలి
కౌమరొందెడుదినముఁ గ్రొత్తక్రొత్తగ నెలమిన్. 46

క. మగవానికంటె మునుపుగ
మగువ కెడలుఁ బ్రాయ మండ్రు మానవతీ నీ
జిగిబిగువు లంతకంతకు
మిగులఁగ బొలుపొందుటకు నిమిత్తము చెపుమా!" 47

వ. అనుటయు నవ్వనిత చిఱునవ్వుతోడ నాయనం జూచి. 48

లయగ్రాహి.—
"ఏ నెఱుఁగ నేమియును దీనికి నిమిత్తము న
నూనమమతామహిమచే[1]నైనఁ దోఁచుఁ
లేనికౌమరుందనము లేనిచెలువంబు" నన
"నో నెలఁత! యాగతిన లేనియవిగా వి
ష్మేనివస లీవెఱుఁగ వేని వినుపింతు విను
దీనికి నిమిత్త మది యేన" యనుచుఁ శా
లీనుఁడు సుగాత్రిఁ దనపై నొరగ వంచి చెవి
లో నొకటి యే మనుచు నో నగుచుఁ జెప్పెన్. 49

ఉ. చెప్పిన మోముఁ ద్రిప్పి కడుఁజిత్రము నొందుచు నాథు
వక్త్రముఁ, దప్పక చూచి "యే నొకటి తఁ మును వేఁడిన
సమ్మతించెఁ దా, నప్పలు కేమి సేయునొకొ యాజగదంబ?
యిఁకఁ విను డదిఁ, జెప్పెద" నంచు మోము చెవిఁ జేరిచి
యేమియొ చెప్పెఁ జెప్పినన్. 50

క. ఘనరోషుఁ డగుచు నతఁ డా
వనితయుఁ దో నరుగు దేర వడిఁ జని యాచే

---

1. నయిన.

ర్పనను శతతాళదఘ్నం
బనుపేరన్ వెలసియున్న హ్రదమున నుఱికెన్. 51

క. పడఁతియు "నాకుం గతి దన
యడుగుందామరల కాక యన్యము గలదే?
విడిచెదనే తను ననుఁ దా
విడిచిన?" నని పాఱి యుఱికె విభుఁ డుఱికినచోన్. 52

క. కడు నెడ గావున నది యి
క్కడ వినఁబడ దేమొ? వీటఁ గలవారెల్లన్
వడి నేగి వలలచే న
మ్మడుఁ గిటు నటు నరసి యెపుడు మగిడిరి వగతోన్. 53

వ. ఏనునుం దిరిగి శాలీనుండు మున్ను చూపిన చోటిపుస్తకంబుఁ
బుచ్చుకొని వచ్చితి నని చెప్పిన. 54

క. విని యావిప్రవరేణ్యుం
డనయంబును శోకవిస్మయవిషాదములన్
మునుఁగుచు "నాశుభదంపతు
లను జెందెనె యకట యితరుల కెఱుం!" గనుచున్. 55

చ. "అదె శతతాళదఘ్న మనుసార్థపునామముతోడ నుత్తమ
హ్రదములలోఁ బొగడ్తఁ గనినట్టిది; యందును బడ్డవారికిం
బ్రదుకులె?యంచుఁ జప్పుడుపురాకృత మెవ్వరికైన"నంచుఁ గొం
తడవుగుందె నేనపుడు తద్ద్విజముఖ్యునిఁ జూచియొయ్యనన్.

క. "అనఘా! యాశాలీనుం
డనఁగ సుగాత్రి యన నెవ్వ? రాదంపతులన్
వినుతించెదు 'కడునుత్తము'
లని తత్కథఁ జెప్పవలయు" నంటి ననుటయున్. 57

క. "ఆయనఘులచరితము గా
దే యీపుస్తకములోనిదియు [1]మాకు నికన్
శ్రేయస్కర మది వినుటయ
పోయెం దద్దర్శనంపుఁబుణ్యోత్సవముల్." 58

వ. అని యాబ్రహ్మచారి తెచ్చినపుస్తకంబుఁ బుచ్చుకొని శిరం
బున మోపుకొని కన్నుల నద్దుకొని తిరుగ నతని చేతికి యిచ్చి
"చదువు మనుటయు నతం డి ట్లనుచుం జదివె. 59

సీ. కాశ్మీరభూమికిఁ గర్ణిక యగుశార
దాపీఠమున శారదను భజించు
పూజరి బ్రాహ్మణుపుత్రి యొకర్తు సు
గాత్రి నాఁ బరఁగెడుకాంత గలదు
దానివరుంను శాలీనాహ్వాయుం డిల్ల
టపుటల్లుఁ డత్తయింటను వసించు
నాతండు దనకడ కాకన్యఁ బ్రథమసం
గమవేళఁ గడు నలంకారకలితఁ

ఆ. జేసి యనిపి దానిచెలు [2]లింతనంతను
బొంచి యుండఁ దద్విభూషణాది
మహిమఁ దలఁకి పట్టు మదిని సంకోచించెఁ
దరుణి యుండియుండి తిరిగిపోయె. 60

ఉ. పోయినఁ దద్విధం బపుడు బోంట్లు తదంబకుఁ జెప్పి "భూమి
లో, నేయెడ లేనిచంద మిది యేమినిమిత్తమొ?" యంచు
"మంచిలే, బ్రాయపువాఁడు గల్గె బళిరా యితఁ!" డంచు
"నెట్టైన నేఁటికిఁ, బోయెనో కాక యెల్లి తమపోకలు
చూడమ!" యంచు నవ్విరన్. 61

---

1. మనకెల్లన్. 2. లింతలంతటుఁ.

క. "ఆయన పినఁ బ్రెలెవరు సుఁ
డీ యిట్లు గయాళులార! డిగ విడుతురు ల
జ్జాయుతులు సర్వమును దము
నేమెడ హాస్యాస్పదం బొకింత వొరసినన్." 62

తే. అని పలికి రెండుమూఁడునాళ్లట్ల యనిపె
నల్లునొద్దకుఁ బుత్రిక నపు డతండు
నాది నేభావమునఁ జూచె నట్ల చూచె
వట్టిరాకపోక లొనర్చె వానిసతియు. 63

వ. అంత లజ్జావతికిఁ దజ్జననియనుమతిఁ బ్రియవయస్య లేకాంతం
బున ని ట్లనిరి. 64

ఆ. "పొలఁతి యాలిమగనిపోఁడుము లేమియుఁ
గలిగినట్టిచొప్పు గానరాదు
మీ తెఱంగు చూడ మేల్తెలు దంపతు
లిపువురును వివేకు లేమి చెప్ప! 65

క. కాంతుఁ డుచితజ్ఞుఁ డైనను
గాంతకు సిగ్గువడఁ జెల్లుఁ గాక! కటకటా
కాంతుఁడు సిబ్బితికాఁ డై
కాంతయు నట్లయిన నెట్లు కాఁపుర మింకన్. 66

ఆ. నలినవదన! యెన్ని నాళ్లైనఁ బిన్నకూఁ
తురవు గావు నీవు తొడఁగి పతికిఁ
దగినసేవ సేయ కగునె యూరక యుండ
'నాతఁ డేమియు ననఁ' డనుచు నిట్లు? 67

క. మగవాఁడు భాగ్యవంతుఁడు
మగువకు నొ ప్పగునె యిట్లు మానపుబిగి గ

ట్టిగఁ దాల్పఁ? దనంతన యూ
డిగ మిటునటు సేయ నతనిడెందము గరఁగున్. 68

క. "గారామునఁ దోడ్తోడన
రా ర"మ్మనఁ డనుచు మగిడి రా నేటికిఁ? గ
ర్పూరంబుతోడిబాగా
లీరాదో యాకు మడిచి యీరాదో చెలీ? 69

క. వెంగలివి గాక నీ వో
యంగన! భోగములపంటయామని యగునీ
బంగారువంటిప్రాయము
సంగతియే యకట రిత్తశయ్యకు నొసఁగన్? 70

క. యౌవనము గలిగినప్పుడ
పూవుంబోఁడులకుఁ బతులభోగంబులు గా
కావిభవములకుఁ గొఱయే
యౌవనజాతాక్షి! ప్రాయ ముడిగినవెనుకన్." 71

క. అన విని "యీపెడమాటల
నను నేటికిఁ జంపెదరు? ఓనక్క సైఁపవు నా"
కని సిగ్గునఁ బలుకుచు నాఁ
డోనరిచి చూచెను దదీయయుక్తుల తెఱఁగున్. 72

వ. చూచి యెందును ఫలంబు గానక యాసుగాత్రి "యీయన
నిం కేమి ప్రపంచంబుఁజేసిన నెఱయ నెడసిపోవుట తక్కఁ
బ్రయోజనం బేమియు లేదు; నాకును మంగళసూత్రం
బీపాటి శుభస్థితి నుండుటయ పదివే"లనుచు నెంచుకొనియు
వేఱొక్కలాగున నుండక యతనికి నాయురభివృద్ధికరంబు
లని వివిధాలంకారంబు లెప్పుడు నేమఱక తాల్చుచుఁ దన

తల్లి యతని నేమియు నిట్టట్టాడకుండం బ్రార్థించుచుండెఁ;
నదియును దత్ప్రార్థనావశంబునఁ బెక్కుదివసంబు లెడనెడఁ
గూఁతుచేత నివారితదురాలాప యగుచు నోర్చి యోర్చి
యంత నొక్కనాఁ డమ్మెఱుంగుఁబోఁడితోడ. 73

ఉ. ఇట్టినిరర్థ నెందుఁ గన మే మనఁ బోయిన నీవు మిక్కిలిన్
దిట్టివి నాదుసంపదకు దిక్కగుచున్ మగమొల్క నీ కిఁకన్
బుట్టునొ యంటివే నితనిపోఁడిమిఁ గంటిమ 'వట్టిగొడ్డు తా
క'ట్టితెఁ డెంత యున్న నిసుఁ గాఱియ పెట్టుట వెళ్లఁగొట్టినన్.

ఉ. పూవులతోఁటకైన నటు పోయి విచారము చేసి రమ్మనం
గావలయుం గదా! యనుచు గారవ మొప్పఁగ[1]నల్లుఁబిల్చిము
న్నావిధి కంపి యందుఁ గలయట్టిపనుల్ సకలంబుఁ జేయ నే
ర్పావహిలంగఁ దా నతని నంతటఁ గట్టడసేసెఁ జేసినన్. 75

తే. "దివిజనుత గాయనశారదాదేవిపూజ
కుపకరించుకార్యం బిది యొప్పు" ననుచు
నధికమోదంబుతో నతఁ డాదరించి
సంతతంబు తదేకనిష్ఠతఁ దలిర్ప. 76

క. సమధికమధుమదగరిమా
సమచంచలచంచరీకసంచయసంచా
రమనోరమసుమనోరమ
నమరఁగ నాపూవుఁదోఁట ననిశము బెంచెన్. 77

సీ. నీ రెత్తువేళల నీ రెత్తుఁ బాదుపా
దునకుఁ గాలువలు పొందుగ నమర్చి
త్రవ్వటంబులతఱిఁ ద్రవ్వటంబులు వెట్టుఁ
దగినట్టికల్లు గుద్దలి గడించి

1. నట్లు పిల్చి.

యెరువుఁ జల్లెడు [1]వేళ నెరువుఁ జల్లు గతాభి
మానుఁడై గంపలఁ దాన తెచ్చి
యం ట్లొత్తుపదనున నంట్లొత్తు నెలమిఁ గా
న్పించు లేఁగొమ్మలు వంచి వంచి
తే. నారువోయంగవలయుచో నారువోయుఁ
గొమ్మ[2]నాటంగఁ దగునెడఁ గొమ్మనాటు
నొకటి విసువక యంతకంతకును హెచ్చు
హాళితోడను శాలీనుఁ డవిరతంబు. 78

లయగ్రాహి.—
అంగపరిఖేదము నెఱుంగ కతఁ డీ గతిఁ గ
డంగి తులసీవనముఁ జెంగలువలుం గే
దంగులును జంపకములుం గుసువకంబులు ల
వంగములు జాదులును లుంగతతులుం గొ
జ్జంగులును మల్లెలు సురంగములుఁ బాటలము
లుం గదళికాచయముః దుంగతతుల్ నా
రంగములు నాదిగ ధరం గలుగునట్టిహృద్య
యంగమబహుద్రుమకుడుంగములు పెంచెన్. 79
చ. రవికిరణాళి కెందును జొరంగ నగోచర మైననీడచే
నవిరళపుష్పరేణుయుత మై పొలుపొందుమరందవృష్టిచే
నివము గొనంగఁ దద్వనసమృద్ధిఁ గనుంగొని యవ్వసుంధరా
దివిజకులప్రసూతుఁడు మదిం బరితోషము నొందియుత్తఱిన్.
క. ఎంతయుఁ బ్రొద్దున లేచి ని
తాంతాచరితస్వజాతిధర్ముఁ డగుచు ని

1. సావి. 2. నాఁటగఁ... నాఁటు.

శ్చింతుఁ డయి గురుపరంపరఁ
జింతించి తదుక్తజపము చేసి ముదముతోన్. 81

తే. నియమమునఁ బుష్పములు గోసి నేర్పు మీఱఁ
బలుతెఱంగుల వింతవింతలుగ మాలి
కలును బొందులు కందుకంబులు రచించి
బ్రహ్మయిల్లాలికిని సమర్పణము సేయు. 82

వ. అప్పుడు సుగాత్రి పాతివ్రత్యధర్మనిష్ఠకతంబున. 83

తే. తల్లిమాటలచే నిట్లు తనవిభుండు
తనువు బడలంగఁ బూఁదోఁటపనులు సేయఁ
జూడ నోర్వక 'తాను నచ్చోటి కరిగి
తోడుపడియెద' నని చూచు వ్రీడ నుడుగు. 84

వ. అప్పు డొకనాఁడు శాలీనుండు తోఁటకుం జని యుండ నాసమయంబున. 85

క. తళతళ[1] మెఱుములు మెఱయఁగఁ
బెళపెళ నుఱుముచుఁ బెరిల్లు పెటిలఁ బిడుగుల్
నలుగడఁ బడ బెడిదపుధా
రలు గలబలువాన జలధరంబులు గురిసెన్. 86

చ. మిగుల జగంబు బెగ్గడిల మించెఁ దదుద్ధతవృష్టి యద్భుతం
బగుచు ఘనాఘనౌఘసముదగ్రనిరర్గళఘుర్ఘురార్భటీ
లగనఘనోచ్ఛలజ్జలఝుళంఝుళనిర్ఝరజర్జరీభవ
న్నగవిగళచ్ఛిలాగణఘణంఘణఘోషణభీషణంబుగన్. 87

సీ. ఉదధిసమేతపీతోద్వాంతబాడబ
జ్వాలాయితోగ్రశంపాలతంబు

---

1. మెఱుపులు మెఱయఁగ.

నిర్ఘాతరవసరంధ్రీకృతాజాండబ
హిర్జలభ్రమదధారోర్జితంబు
నిర్హ్రాదవ్యగర్జితస్ఫూర్జ[1]థూత్త్రరిత
ప్రళయభైరవరటత్పటహరవము
ఝంఝాప్రభంజనజాతసంఘట్టన
పరిగళత్తారకత్కారకగణము

తే. నగుచు ఘనఘనాఘనసంఘ మవ్విధమునఁ
బూని హోరున బెడిదంపువాన గురియఁ
గరము భూనభోంతరము చీఁకట్లు గొనియె
నఖిలలోకంబు నుదకమయత్వ మొందె. 88

క. అటమున్ను మొగులు బలియుచుఁ
జిటపాట మని పాటపాటచినుకులు పడఁజో
చ్చుటయాది గాఁగఁ దనపెని
మిటి తడియునో యని సుగాత్రి మిగులవగపుతోన్. 89

వ. అతనికి శుభంబుఁ గోరుచునికిం జేసి. 90

చ. అపుడు మనంబులోన ననయంబుఁ బతిం దలపోసి యిట్టిఘో
రపుఁ బెనువాన నెట్లయితొ ప్రాణవిభుండ యటంచు నీకుఁ
బాసపుఁబువుఁదోఁటపా ట్లిచటఁ బ్రాప్తము లయ్యె నటంచు
నెంతయుఁ, విపులతరార్తిఁ జేర్పడుచు నింగిఁ బొరింబొరిఁ
దొంగి చూచుచున్. 91

క. ఓశారద యోపరమద
యాశాలిని యోమదంబ యారసి మత్ప్రా
ణేశు నటు చూడుమీ నీ
వే శరణము గాని యేను వేఱొం డెఱుఁగన్. 92

---

1. దుర్జర్జిత; ధూర్జర్జిత; ధూత్తిర్జిత.

శా. ఈదేహంబునఁ బూర్వదేహములయం దేనిన్ వ్రతధ్యానదా
నాదిప్రోద్భవ మేమి యేమి గల దాయాపుణ్య మీవర్షపీ
డాదోషంబును మత్పతిం బొరయకుండన్ మానుపున్ గాత; నే
నౌదుం గావుతఁ దన్నిమిత్తపతిపాపాక్రాంతికిన్ బాత్రమున్!

వ. అని హృదయంబునఁ దమకులదైవతం బైనసరస్వతిం బ్రార్థిం
చుచు నంతట నిలువం జాలక తద్వర్షఘోరతయుఁ గైకొనక
యత్యంతసాహసంబునఁ దల్లియు నెఱుంగకుండ నిల్లు వెడలి
తనదుపాతివ్రత్యధర్మంబుచేత వృష్టిబాధఁ బొరయక త్రోలంగు
చుండఁ బొలపవెల్లి యైనజలపూరంబు పాయ యిచ్చుచుఁ
దెసవుపిడువఁ బ్రాణవల్లభుం డున్నవనంబున కరిగి కడన
యుండి పరికించి యప్పటి యవ్వాతవర్షోపద్రవం బొక్కించు
కయు లేక యాత్మసంప్రార్థితబ్రాహ్మీప్రసాదవిశేషంబున నెప్పటి
యట్ల శుభవర్తనంబున నున్న తనభర్తను సదారామంబును
జూచి "నాతల్లి యోసరస్వతీ! నీభక్తవాత్సల్యచింత ప్రక
టించితే!" యని తత్కారుణ్యంబునకు నుబ్బుచుఁ గ్రమ్మఱి
గృహంబునకు వచ్చి తన వచ్చుటయుం బోవుటయు నెవ్వరికి
నెఱుకపడనీక వ్రీడావశంబున నడఁగి మడఁగి యథాపూర్వ
స్థితిఁ బ్రవర్తిల్లుచుండె; నప్పు డప్పువ్వుఁదోఁట గాటంపు
గాలివానచేత నేకీడునుం బొరయకునికి జనులు వెఱఁగందు
చుండి; రాసుగాత్రియు మఱియుఁ గొన్నిదినంబులు లజ్జ
పెంపున వల్లభునియిడుమపాట్లు కోర్చి యోర్చె. 94

ఉ. అంతట లజ్జ క్రిందుపడ నత్యధికంబుగ మించి మానసా
భ్యంతరపూర్ణమైనపతిభక్తికతంబునఁ దల్లిమాట యొ

క్కింతయుఁ దానుగైకొనకయెప్పటియట్ల యలంకృతాంగియై
యెంతయునింపుతోడఁజనియెఁ బ్రియుఁడున్నవనంబులోనికిన్.

క. చని యాతఁడు దాఁ జలిపెడు
పనులకు నీయఁకొన కున్న బలిమిఁ గడంగెఁ
దనసొమ్ము లెల్ల నొకమఱుఁ
గున నిడి పిరిచుట్టు చుట్టుకొనినవలువతోన్. 96

వ. ఇట్లు కడంగి. 97

సీ. తోరంపుఁ జనుదోయి త్రుళ్లింతల నిడంగఁ
దగుచోట్లు గుద్దంటఁ ద్రవ్వి త్రవ్వి
వ్రేఁగైనపిఱుఁదు బల్విడిఁ జలింపంగను
వడి నిట్టు నట్టును నడచినడచి
[1]యడుసుతుంపురు చెక్కుటద్దంబులను బర్వ
మళ్లకు మడవలు మార్చి మార్చి
నడుములేఁదీవియ నకనకల్ గుడువ నిం
పునఁ దగుమోపులు మోసిమోసి

తే. చిఱుచెమటఁ బేర్చు చింతక్రొమ్మెఱుఁగుతోడఁ
గొమరుమే నొప్ప సారెకుఁ గొప్పు కదల
నేమిటికి నైనఁ దా మున్న యేఁగి యేఁగి
యెల్లపనులు నొనర్చె నిం పెసక మెసఁగ. 98

తే. పడఁతి సంభ్రమించుచు నిట్లుపనులు సేయఁ
బిఱుఁదుఁ బొలింపఁ గొప్పుఁ గంపించుచొప్పు
గనుఁగొనుచు నేర్చుకొనుగతిఁ గాంతు మదిని
బెల్లుశరముల వైచె దర్పించి మరుఁడు. 99

1. యడుసుఁ దువ్వర.

చ. అపు డతఁ డట్లు పేర్చుకుసుమాస్త్రునియుద్ధతి యాఁపలేక! "వె
ఱ్ఱిపనుచ! యెంత మాన్చిన నెఱింగెడు దానవు గావు; నీకుఁ దోఁ
టపనుల కెంతదూర మకటా!" యనుచుం దనయుత్తరీయవ
స్త్రపుముని కొంగునం దుడిచెఁ దన్వికపోలపుఘర్మబిందువుల్.

చ. తుడిచినఁ బోక మన్మథుని దుర్జనతామహిమన్ బొరింబొరిం
బడఁతిమెఱుంగుచెక్కుళులఁ బర్విడుఘర్మముఁ గాంచి యంత నా
బడలిక చూడలే [1]కిసుమసాట్లకుఁ జొచ్చి నలంగి తం చునె
క్కుడుతమకంబుతోడఁ దల గ్రుచ్చి కవుంగిటఁ గూర్చె నత్తఱిన్.

క. తదనంతరంబ మిక్కిలి
పొదిగొన్న చిగుళ్లజొంపముల సొంపగుపూఁ
బొదరింటికిఁ దార్చి సతిన్
మదనమహారాజ్యభోగమహిమం దేర్చెన్. 102

తే. అట్లు తేర్చుచు సతి నతఁ డపుడు విడక
కౌఁగిట బిగించెఁ బైపయిఁ గాముఁ డడర;
"నివి మిగులఁ గ్రొత్త లింటికి నేఁగవలదె"
యని ప్రియముఁ జెప్పి విడిపించుకొనియె సతియు. 103

క. విడిపించుకొని మఱుంగున
నిడినతనదుభూషణంబు లెల్లను బ్రేమన్
దొడిగి గృహంబున కల్లన
నడచెఁ బతిచరిత్రభావనల మన మలరన్. 104

క. వసివాళ్లు వాడి యప్పుడు
వసంతసమయంపుటెండవలనన్ నెఱివోఁ

1. కదుసు.

గసుగందులు గందిన నవ
కుసుమలతికవోలె మిగులఁ గోమలి యొప్పెన్. 105

వ. ఇవ్విధంబునఁ బతియనుగ్రహంబు వడసి భాసిల్లుసుగాత్రి
గృహంబునకుఁ జనియె; నప్పు డప్పడంతిసఖులు ముఖవికా
సాదులవలనం దన్మనోరథసిద్ధి యెఱింగి నర్మాలాపంబుల వినో
దించు చుండిరి; తల్లియుం బ్రమోదంబునొందె; నంత
నాఁటినిశాసమయంబున నయ్యంబుజాక్షికిఁ దద్వయస్యలు
కౌతుకాతిశయంబున నెప్పటికంటె మిగుల నలంకరించి కేళికా
భవనంబున నున్న తత్ప్రియునికడ కనిపి రప్పుడు. 106

సీ. గతిసంభ్రమంబునఁ గరము బెడంకుచు
నకనకల్ గుడుచు నెన్నడుముసొబగుఁ
గుఱుమాపువడిమంపుఁగోకలోఁ దొలఁకెడు
కంపమాననితంబకాంతిసొంపు
బిగువుపయ్యెదలోనఁ బిక్కటిల్లుచుఁ జాలఁ
ద్రుళ్లుచన్నుల నొప్పుముళ్ళపేపుఁ
జెమటచిత్తడిఁ జిల్లి యమరుకస్తురిచుక్క
బొట్టుతోడి పసుపు[1]ఁబట్టె సిరియుఁ
తే. గునిసి సారెకు వడఁకెడు గొప్పకొప్పుఁ
గలిగి యాకెత న్నొకటియుఁ జలుపనీక
[2]తోడఁ బలువులువాలుచుఁ దోఁటపనులు
సేయురూపు మదిఁ హత్తి పాయకునికి. 107

ఉ. అప్పటితద్విలేపనపటాభరణాదులవైభవోన్నతుల్
రెప్పలు విచ్చి చూడక చరింపయిట్టిపరాకుచేతఁ దా

1. బొట్టు. 2. తొలుతఁ.

నెప్పటియట్ల యుండె నత్త డింతి కడుం దడ వుండి యుండి
"నా,యొప్పమి యేమి సంఘటిలె నొక్కొ!"యటంచు విషాద
మొందఁగన్. 108

తే. తొలు దొలుత నట్లు సాధ్వసాద్భుతకరంబు
లగుచు మరుసుద్ది లేకుండ నెగయ మీఁటి
పెక్కునాళ్లు తద్వాసన ప్రిదులనీని
ఘనవిభూషాదు లపు డింపు గామి యనుదె! 109

వ. అది య ట్లుండె నాయింతి యంత. 110

ఆ. తిరిగి యనుగఁ జూచి "యరిగి యే నచట నె
వ్వారిదాన ? నిచట నూరక పడి
యుంప దైవ మెద్ది యొనరించె నది యగుఁ
గాక !" యనుచుఁ దలుపుకడన యుండె. 111

ఉ. ఆలిబాఁగి చాలఁ దడ వచ్చట నమ్మెయి నుండి సాహసో
ద్వేలత నంతఁ జేరి "కడుఁ ద్రిమ్మటచే శ్రమ మొందినారు గాఁ
బోలును! బోదునా? నిదురవోయెదరే?"యనికప్పురంపుఁదాం
బూలముతావి బుగ్గ రని ముంచుకొనం జెవిదండఁ బల్కనన్.

క. పైకొన్నపరాకున నత్త
"డేకోర్కిని వచ్చి ?" తనిరొ నింతియు వగతో
"లోకమువారలు పతికడ
కేకోర్కిని వత్తు ?" రనుచు నెంతయు సొలసెన్. 113

వ. పదంపడి తాలిమి యవలంబించి. 114

క. "ఓనాయక యితరంబులు
పోని మ్మాపాటి రైన బుద్ధి గలిగి నా

మానసములోని కోర్కుల
పూనిక యడిగితిరి లోకపూజిత నైతిన్. 115

మ. అకటా! యే మని దూఱుదాన మిము నాథా! వేగుజా
మయ్యెఁ బొం,దికగాఁ బాపము లోత్తర మ్మనుట గానీ
“యొంటి యేమో కదా, నికటస్థోణికి నేఁగుదె మ్మనుట గానీ
కొంతనెయ్యంపుఁ బూ,నికతోఁ గన్నులు విచ్చి చూచుటయొ
కానీ లేద యొక్కింతయున్. 116

ఉ. నేఁ డలతోఁటలో నపుడు నిబ్బరమైన మదీయభాగ్యపుం
బోఁడిమి యేమిపాకమునఁ బొందెనో? మీకృప యట్లు
గాంచి పె,న్వాఁడిఁ దనర్చు నాచనపున్ మిము నిమ్మెయి
నంటిఁ గాని యే,నాఁడును బుణ్యసాధ్వికి గుణం బిది గామి
యెఱుంగుదున్ మదిన్.” 117

వ. అని పలికి యంతరంగంబున నంతకంతకుఁ బ్రబలుకంతుసంతా
పంబున వంతనొందుచుఁ గొంత చింతించి. 118

క. రా“ గైనఁ గొంతమేల్ నా
రాయణ మీమనసుకంటె! రహిఁ నీక నెపుడున్
మీయంతఁ దడవెదరె?” యని
యాయంగన యతనిపాద మల్లనఁ బట్టెన్. 119

ఉ. పట్టి యొకింత యొత్తుచును పాన్పుకడన్ వెసఁ గూసుచుండి
హాం,బట్టున నొప్పుసూసపుల పై నిడి యొత్తి తదంఘ్రి
యంతఁ జ,న్కట్టుపయిన్ ఘటించుచును గన్నులు చేరుచు
కొంచుఁ జెక్కిటన్, గట్టిగ నద్దుకొంచుఁ దన గాటపు
గూరిమిఁ దెల్పె మిక్కిలిన్. 120

వ. అంత. 121

క. ఎందుఁ బరాకుడుగమికిఁ
సందియ మందుచు "నిదేమి చందమొకో!" యం
చుం దనడెందము గొందల
మందఁగ నిందుముఖి యతని నల్లన పలికెన్. 122

ఉ. "చిత్తము వేఱొకర్తుపయిఁ జేర్చి మరల్పఁగ నేరకేమొ మీ
రత్తరళాక్షిఁ దెచ్చుకొనుఁ డాయక నావశ మైనఁ బంపుఁ డేఁ
దెత్తు నవశ్యముఁ గాక మఱియు దేవరకుం బలె నవ్వధూటికిం
దొత్తగుచుంబనుల్ సలుపుదుఁ నిజమాడెద దైవసాక్షిగన్.

క. తుదఁ జిక్కులేల ? మీమది
కొదదీఱినఁ జాలు ! నమ్మికొనవలసిన న
చ్చొద నమ్ముకొనుఁడు నన్నో
హృదయేశ్వర ! యేమిచింత యిది ? దెల్పఁదగున్." 124

వ. అని యిట్లు పలుకుచుం బాదసంవాహనసేవలు సలుపుచుండ.

చ. అది యొకయించు కైన నరయంగ నెఱుంగఁడ యాతఁ
డత్తఱిఁ, మదిఁ గపు నాటియున్న ప్రథమంపుఁదదాకృతి
యొప్పిదంబు లా, చెదరినవన్నెయాపసులు సేయుఘనత్వర
యాచినీతి యా, పదిలపుఁ బ్రేమ యారతులభంగులుఁ జాల
విరాళి గొల్పఁగన్. 126

క. ఆసతియును దత్పదయుగ
ళీసంవాహనము విసువు లేక సలుపుచుఁ
భాసురపాతివ్రత్యగు
ణాసక్తిఁ దదన్యు మెన్న కన్నిశ గడపెన్. 127

తే. అంతఁ దొలునాఁటియట్ల యత్యాదరమునఁ
బోయి పూఁదోఁటఁ బను లెల్లఁ జేయుచుఁ బతి
మన్ననలు గాంచి యెంచెఁ "దన్మతికి నట్టి
సొంపులే కాని భూషణా లింపు గావు." 128

ఆ. ఎంచి దినము నట్ల యేఁగి యాతోఁటలో
నట్లు పనులు సేసి ప్రాణవిభుని
నట్ల యిష్టరతుల నలరించెఁ దద్విధం
బంత నంతయును దదంబ యెఱిఁగె. 129

వ. ఎఱిఁగి కూఁతుతో నేకతంబున నున్నవేళ ని ట్లనియె. 130

ఉ. "అమ్మ సరస్వతీ వరమహత్త్వమునన్ జనియించి తీవు నా
కిమ్ముగ సర్వధర్మములు నీవ యెఱుంగుదు; 'వంశ మెల్లఁ బూ
తమ్మగు నీదుచర్య' నని ధాతపడంతియె యానతిచ్చె స్వ
ప్నమ్మున వచ్చి తావకగుణంబులు చూచినయట్ల గట్టిగన్. 131

క. పెనిమిటి దేశాంతరి యై
చనినన్ 'భవదీయ మైనసంతతి నాము
ష్మిక యోగ్యుఁడు' ననుచును ద
జ్జననంబున కెదురుచూతు సతతము నాత్మన్. 132

సీ. ఆయాశ విఫల మై పోయెనో యనియెడు
బుద్ధిని జేసి యోపుత్త్రి యేను
నీపతి నిట మున్ను నిన్నుఁ జేపట్టక
యుండుకాలంబున నోర్వలేక
విసివి యే మాడిన విని సహింపక నీవు
నన్నుఁ గోపించుచందంబు దలఁచి

[1]నిలఁ బతివ్రతలలో నీలువు గలయట్టి
తల్లివి కొదవ వొకింతయును లేదు
తే. చిన్ననాఁడును బ్రియు నొకచిన్నమంత
మాట యాడిన విని తాపమగ్న వగుదు
తద్గుణము లెవ్వ రేపాటి తడవిన విని
యలవు దొండొరు బఱటి నెచ్చెలులు నగఁగ. 133

సీ. మఱచి తప్పియు [2]నవ్యమహిమ విమర్శింపఁ
జూడవు వినవన్య సొబగు వేడ్కఁ
బతిభక్తి యెంతఁ గీడ్పడ నీవు వేఁడుదు
తత్పుష్టి యేదైవతంబుఁ గనిన
నధిపుఁడు హర్షింప హర్షింతు చింతింపఁ
జింతింతు చిక్కినఁ జిక్కు దెపుడు
గడుఁ జన వచ్చిన గర్వింప వీక యుం
డిన ఖేద మొందవు డెందమునను.

ఆ. నిండు కడవరీతి నుండు దెపుడును గం
భీరతకుఁ గలంక చేరనీక
పతిప్రవాసవేళఁ దాటించుకొనవు నె
మ్మేన గరగరికలు మెఱుఁగుఁబోడి. 134

క. రాతిరిపగల్లు దృష్టనే
వాతాత్పర్యమున నున్న వారల టుంటఁ
నీతోడ మాటలాడుం
బాతివ్రత్యమునఁగాదె భారతి కృపతోన్. 135

1. బరమపతివ్రత వరిదియాలువుగలతల్లి. 2. నన్యమహిమ విమర్శించి, చూ.

క. ఓతల్లి ! కొదవ యొక్కటి
నాతలఁపునఁ దోఁచినది వినఁ వలయు గుణా
న్వితుండవు గానిసుతుఁడు ప్ర
సూతుండగు నఁట యకాలసురతక్రియలన్. 136

ఉ. నాఁటికి నెట్టిదైవఘటనంబుననో నిను నొల్ల కెంతయుఁ
గాఁటపుఁగోపముఁ బెనుపఁగాఁ దను నెమ్మెయి నంటెఁ గాక పూఁ
దోఁటకు జీతగాండ్రు మనతొల్లిటివారలు లేరె నీవిభుం
డేటికిఁ బోవఁగావలయు ? నీ వటు పోవఁగ నేల కూఁతురా?

క. ధవళాక్షీ ! వయసునఁ బి
న్నవు గాని వివేకగుణమునఁ మిక్కిలి పె
ద్దవు నీకుం దెలియని య
ట్టివిధినిషేధమ్ము లెక్కడివి తలపోయన్ ?" 138

వ. అని పలికిన మొలకనగవు మొగంబున నిగురొత్తఁ దల్లిం
జూచి సుగాత్రి యి ట్లనియె. 139

చ. "వరునకు నెద్ది యిం పది సువర్తన గాఁగఁ దదప్రియం బస
చ్చరితము గాఁగ నెన్నుదు నిసర్గము నా కిది మానరాద
యీ,శ్వరుఁడును వేదముఁ గురుఁడు సర్వము భర్తయ యేఁ
దదాజ్ఞ సు,స్థిరమతిఁ జేయుచుఁ విధినిషేధము లెవ్వియుఁ
గైకొనఁ మదిన్. 140

క. విను మెయ్యదియు నిషిద్ధం
బని విడుచుట లేదు ; విహిత మని చేయుట లే
దనుమానింపక యెద్దియుఁ
బెనిమిటి యొల్లనిది విడుతుఁ బ్రియ మొనరింతున్." 141

సీ. అని తల్లితోడ ని ట్లాయింతి పలుకఁ ద
త్పతిభక్తిమహిమ కెంతయును మెచ్చి
వాణి ప్రత్యక్షమై వాత్సల్యమున మిక్కి-
లిని గారవించి తజ్జననిఁ జూచి
"యీసాధ్వివర్తన కిట్టట్టు వంకలు
దిద్దఁ జూడకుము సుస్థిరత నొప్పు
పతిభక్తిచే నిజపాపంబ కాదు నీ
యుభయవంశముల పాపోత్కరములు
తే. నెఱయ నిర్ధూతములుగ నీనెలఁత చేసె
నిపెయ కాదింక నిమ్మీఁద నీసతికథ
వెలయు మత్ప్రీతికరముఁ బవిత్రము నయి
నేన వెలయించుదాన" నం చానతిచ్చె. 142

క. అని యిట్లు చదివి పుస్తక
మును గట్టిక వటువు విప్రపుంగవుఁడు నను-
గనుఁగొని "యిదిగో నయ్యా
యనఘము వారలచరిత్ర" మని యి ట్లనియెన్. 143

వ. "ఆసుగాత్రి శాలీనులయందు నరసింహభవునికాంత కెంత దయయో యెఱుంగము; నాకు నద్దేవియ కలలోన వచ్చి "యీపుస్తకంబు నిత్యంబును బ్రాతఃకాలంబున జదువుకొను" మని యిచ్చె. మఱియు నివ్విటం జదువ వ్రాయ నేర్చినవారి కెల్ల నాశాత్రి యంప యట్ల యిచ్చినది; యందఱు నిది యొండొరులతోడఁ జెప్పుకొని వెఱఁగుపడిరి. నిన్న నే నా పుణ్యదంపతుల సందర్శనంబుకొఱకుఁ దత్కుసుమోద్యానం బున కేఁగి వారలచేతం బ్రత్యుత్థానాసనార్ఘ్యపాద్యాదివివిధుల

నుపచరితుఁడ నగుచు నచ్చట నీపుస్తకంబు మఱచి వచ్చి
నేఁడు రేపకడఁ జదువంబోయి తలంచుకొని యది తెచ్చు
టకుం బంపిన నిట్టి ఘోరంపువార్త వచ్చె" నని వెండియు
నయ్యుత్తముల ప్రాపపాతంబునకుఁ బెక్కులాగుల వగచె.
నేను నా యధ్యాపకుని వీడుకొని యప్పటికి నప్పురంబు
తప్పి సంగాకులం బగుట యరసి నావిద్య యొరసి చూచుట
కిది సమయంబు గాదని నాగలోకంబున కరిగి యంతఁ గొంత
కాలంబునకు సంగీతవిద్య సవిశేషంబుగా నభ్యసింప వేడ్క
పుట్టిన నారదమహామునిం గొలిచి తిరుగ వొరఁగొంటి." నని
చెప్పి మణికంధరుం డో కలభాషిణి! యట్లు శాలీనునిచిత్తంబు
జానపదత్వముగ్ధత్వదోషంబునం జేసి మున్నత్యంతాపూర్వ
వస్త్రభూషణాద్యాడంబరంబునం దలంకి తదలంకృతపత్నీ
రూపంబునకు నెఱయం గొలుపకుండుటయు వెనుకఁ దోఁట
పనుల నాకులితం బైన యత్తన్వివిచ్ఛిత్తి విలసితాకారంబున
హత్తి యితరంబు నెఱుంగమియు భవదీయవృత్తంబునకు
దృష్టాంతంబు" లని పలికి సుముఖాసత్తిం జూచి. 144

తే. "నీకులస్థానవార్త గణించి చూడ
నాసుగాత్రిచరిత్రంబు నంతవట్టు
నీ వెఱుఁగ కున్కి యె?"ట్లన్న "నేల యెఱుఁగ
నాసుగాత్రిన యే"నని యాకె నగియె. 145

క. అమ్మాటకు వారంవఱు
నెమ్మనములఁ జోద్యమంది" నీ వా సతి వే
నెమ్మెయిఁ బ్రతికితి వేమిక
తమ్మున నిమ్మాఱు పేరు దాల్చితి ?" వనుచున్. 146

సీ. "శతతాళ దఘ్నసంజ్ఞిత మైన యట్టిపె
న్మడుపున నే నట్టు పడియెడు తఱి
మత్పతిపాదపద్మము లాత్మలోనఁ ది
రంబుగా నిడి తదన్యం బెఱుఁగక
మునుఁగుచో నడుమఁ గోల్మొసలి మ్రింగె నది మ్రిం
గినవెన్కనఱిగించుకోనఁగలేక
మఱునాఁడు తత్తీరమహిఁ బడి పొరలుచు
వెడలఁ గ్రాసినది యవ్వేళయందు
తే. నచట నున్న వా రిది చెప్పి రంత నేను
నెల్లజనులును వెఱఁ గంద నింటి కేఁగి
వాణికిని మ్రొక్కుకొనుచుంటి వదల కెపుడు
పతిఁ దిరుగఁ గూర్చ నింక సీభార మనుచు. 147

సీ. దేవి నాలీలఁ బ్రార్థించుచుండఁగ వచ్చె
నరలు నా కప్పుడె నాథుసేవ
యొక్కఁడె దీవాణి యెటుచేసె నట్లు గా
నిమ్మది యని విరాగమ్ము పొడమ
వేదాంతశాస్త్రకోవిదులగోష్ఠిని గొంత
యోగశాస్త్రజ్ఞులయొద్దఁ గొంత
ప్రొద్దుపుచ్చుచు యోగములకు నంగము లైన
యాసనాదులకు సమర్థమైన
తే. ప్రాయ ముడివోవుటకు వెతపడుచు నుంటి
నా కపుడు సుముఖాసత్తినామ మొదవె
సుముఖు లన శాస్త్రవిదులు నిత్యమును దత్స
మీపవర్తన గలిగి యే మెలఁగు చునికి. 148

తే. అట్టిపేరఁ బ్రసిద్ధ నై యంతలోనఁ
దల్లితగు లూడఁ దీర్థయాత్రగ ధరిత్రిఁ
గ్రుమ్మరుచుఁ దుద నిద్దేవిగుణములు విని
యిచటు చేరితిఁ గడమ మీ రెఱిఁగినదియ. 149

క. అమ్మాడ్కిని బాతివ్ర
త్యమ్మున నుతి గనియు నిట్టిదశ నొందితి నేఁ
గ్రమ్మఱ బ్రదికి యొకింతయు
నమ్మడుగునఁ గాంతుఁ డేమియయ్యెనొ యెఱుఁగన్." 150

మ. అనుడుఁ "గ్రాహము మ్రింగియుండ మఱునాఁ డాలీల
నక్లిష్టమూ, ర్తిని రా నేర్చిన నీయసంకుచితపాతివ్రత్య
మోయుత్తమాం, గన! నీనాథునిఁ బ్రోవకున్నె పెఱశంకల్
మాను ప్రాపించె దా, తనిపొంపుం దుద నాతఁ డే నని
మణిస్తంభంపు సూపెం దనున్. 151

సీ. చూపి యే బ్రదికినవో వెల్ల నను వట్లు
నీమాటఁ గడు నల్గి యేమికర్మ
వశతనో యాయల్కవడి యాఁపలేక వే
గోద్ధతిఁ జని నీట నుఱికితి గద
యా వెన్క నొక్కించు కంతసేపునకు జ
లస్తంభవిద్యావిలాసగుప్తు
నొకసిద్ధు నింటిలో నున్నట్ల యున్నమ
హాత్ముఁ డేజోవిధూతాంధకారుఁ
తే. జేరితిని జేరి యటమున్న దూరపాత
సంభవం బైనయప్పరిశ్రాంతిచేతఁ

ప్రక్క లెగయంగ రోఁజుచు నొక్కక్షణము
నిలిచి కనుఁగొంటిని సమాధినిష్ఠు నతని. 152

తే. అంతఁ గనువిచ్చి చూచె న న్నాతఁ డేను
ప్రణతి చేసితిఁ జేసి [1]తత్ప్రశ్నసరణి
వెంబడిని జెప్పితిని నాదువృత్త మతఁడు
నింతకోపివే యనుచు న న్కింత నవ్వి. 153

క. ఇది మిక్కిలి యేకాంతపుఁ
బని పని యిట్లున్నవాఁడఁ బరుల నునుపఁ గూ
డదు క్షణము నిందు నని మ
ద్వదనము దెస యంతఁ జూచి దాక్షిణ్యమునన్. 154

సీ. నాఁడెల్లఁ దనయొద్ద నను నుంచుకొని నాదు
గురుభక్తి తెలిఁగుఁ గన్గొనుచు నలరి
నాకు వయఃస్తంభనపుమణి యొకటియుఁ
దా నెక్కుసింగంపుదత్తడియును
దద్వశీకరణౌషధజ్ఞానమును వాద
విద్యయు నివ్వాలు వేడ్క నిచ్చి
పొమ్మని యనిపినప్పుడు గాదె యీపట్టి
మెవ్వారి ప్రేయంగ నెత్తఁబడును

తే. వారిఁ [2]జంపును దుద నను వాక్యమునకుఁ
గడు నలరి మ్రొక్కి యలనియాకర్షణమున
నటకు మును వచ్చినట్టిసింహంబు నెక్కి
మడమ యొక్కింత దాఁకించుమాత్రలోన. 155

1. తత్ప్రణతి. 2. జంపక మానదగ్.

శా. గంభీర ప్రాదముఁ వద్ద వెడలి యాకాశంబునం బౌలునా
కుంభిద్వేషిని మెచ్చి యెన్నిగల వీక్షోణిఁ విచిత్రంబు లా
శుంభద్వస్తువు లెల్లఁ జూతు నని పోచుఁ వేడ్కనుంటిఁ వయః
స్తంభంబుఁ మణిచేతఁ గాంచుటమణి స్తంభుండు నానొప్పుచున్.

ఆ. అతివ నాదుగురువు లంగీకరించిన
యట్టిది యని మిగుల నాదరమున
నేను నాఁడు మొదలు గా నిట్టిసిద్ధవే
షమున వలయుచోట్లు సంచరింతు. 157

క. ఆవేడ్కలతమి నెప్పుడు
నీవిధ మేఁదలఁప నంత నీపు నెఱుఁగు వి
చ్చోప్పి వచ్చియున్న తెలుఁగులు''
నావుడు నవ్వారిజాక్షి నగి యి ట్లనియెన్.

158

స్రగ్ధర.—

ఆశాలీనుండ వీవే యగుట గలిగెనా
యల్లనాఁ డంత క్రోధా
వేశం బేతేర నీ వేవికటపుఁబలుకుఁ
బింటి నాచేతఁ గన్నా
భ్యాశంబుం జేరి చెప్పఁ బ్రథమమున వయః
ప్రస్తుతుల్ సేసి గూఢం
బై శోభిల్లంగ నీ వే మని పలికితి మా
కానతి మ్మంతవట్టున్. 159

సీ. అని కలభాషిణిఁ గనుఁగొని నీ విటు
రమ్ము నీ కారహస్యమ్ము మునుపు
చెప్పి తార్కాణగాఁ జెప్పింపఁ దగు మటి

యాయనచే నని యప్పుడంతి
చెవిలోనఁ జెప్పంగఁ జేరి 'యోహో యది
గా దుపాయ' మతండు గట్టిగాఁగ
దూరశ్రవణశక్తిఁ దోడ్తోన వినియెడు
నటుగాక వ్రాసి నీ కది తెలిపెద

తే. నవిన దూరదృష్టిని [1]గను నదియుఁ గూడ
దనుచు మణికంధరునిఁ జూచి వినుము నీవు
మును పతనిచేతఁ జెప్పించు కొను తదర్థ
మంత నేఁ జెప్పెదను గాని" యనుడు నతఁడు. 160

వ. అమ్మణిస్తంభుని నేకాంతంబునకుం దోడ్కొని పోయి యతని
చేతఁ దొల్లిటి తత్కోపకారణంబును నట మునుపటిరహస్య
వాక్యంబులును జెప్పించుకొని వచ్చి సుముఖాసత్తిం జూచి
యింక నీ వేమని చెప్పెదో చెప్పు మనుటయు నవ్వనితామణి
యి ట్లని చెప్పె; నట్లు శాకినుండు మదువునం బయటకు
మునుపు నాతో నేకాంతంబున నుండి ప్రసంగవశంబున.161

క. "అమృతము సేవించితి వో ?
రమణీ యే మైన సిద్ధరస మబ్బెనొ ? నీ
కొమకుం బ్రాయము మిక్కిలి
కొమరొందెడు [2]మిగులఁ గ్రొత్తక్రొత్తగ నెలమిన్. 162

క. మగవానికంటె మునుపుగ
మగువ కెడలుఁ బ్రాయ మండ్రు; మానవతీ ! నీ
జిగిబిగువు లంతకంతకు
మిగులఁగఁ బొలు పొందుటకు నిమిత్తము చెపుమా." 163.

1. గాంచు. 2. దినముః.

క. అని యడిగిన నే "నెయ్యది
యు నిమిత్తం బెఱుఁగ"ననుడు "నూరక యిట్లం
టిని గాని యేన చెప్పెద
విను" మని మొగము చెవిఁ జేర్చి విభుఁ డిట్లనియెన్. 164

చ. "అనిశము నీదుయౌవనశుభాకృతిఁ గౌఁగిటఁ జేర్చువేడుకన్
దనియమిఁ జేసి వేఁడితిని దక్కక నీకును గర్భ మెన్నఁడున్
జనితము కాక యుండ నలశారదఁ బూజ యొనర్చువేళ; వా
రనికృప 'నట్ల యిచ్చితి వరం'బని యాయమ వల్కె నత్తఱిన్.

క. దానన సుమ్మీ నీనె
మ్మేనన్ సౌందర్యగుణసమృద్ధి దలిర్పం
గా నవయౌవన మెప్పుడుఁ
గానఁబడుట" యనుడు నేను గడు వెఱఁగొందన్. 166

తే. "నాదుసంగంబునన నీకు నందనుండు
గలుగువర మిచ్చె నాకు నన్నలువసతియు
నేను వేఁడిన నొక్కనాఁ; డిదియు నదియు
నొనఁగు టెట్లొకో?" యంటి నయ్యనఘుతోడ. 167

క. నాపుడు "నాయిష్టమునకు
నీవు విరుద్ధముగ వరము నిట్లడిగితె య
ద్దేవి"నని దుర్దమక్రో
ధావిలమతిఁ జని యతండు హ్రదమున నుఱికెన్." 168

క. అని చెప్పుటయు మణిస్తం
భునిమాటయు నదియు నైక్యమున శోభిల్లన్
విని మణికంధరుఁ "డోమా
నిని! సందియపడకు మితఁడ నీవిభుఁ" డనియెన్. 169

సీ. ఆవధూటియును సవ్యాకంపళత్రపా
లంకృతం బగుదృగ్విలాస మమరc
బతిc జూచి సంతోషభయభక్తివినయంబు
లుపయింపc దగురీతి నుపచరించి
"యిందాcక నెఱుcగ కే నేమియంటినో మిమ్ము!"
ననుచుc గన్నీళ్లు రా నడcచుకొనుచు
"నడపుల మాటల నగవుల మీయందుc
దొంటికైవడి కొంత దోcచుచున్న
తే. 'వసుధ మానిసిc బోలు మానుసులు లేరె?'
యనుచు నుండుదు భాగ్య మట్టునికిc జేసి;
యిప్పు డీయన్నచే ఫలియించె నదియు
"సజ్జనులగోష్ఠి యిహపరసాధనంబు?" 170

క. అని మణికంధరుc గనుcగొని
విను చండుడు మునుపు నిన్ను వేమఱు నిచ్చో
టన దూరశ్రవణబలం
బున నీయన నీదుగానముఁ విని పొగడన్. 171

శా. గంధర్వుండవు జాతి నెంచcగ; శుభాకారంబు చంద్రత్రపా
సంధానక్షమ; మద్వితీయుcడ విcకన్ సంగీతసాహిత్యధౌ
రంధర్యం బరయం; దపస్వి; వసురప్రద్వేషిభక్తుండవుఁ,
బంధం బొక్కటి గల్గె శాప మనcగా నాయన్న నీకుండుడన్."

తే. అనినc దచ్చాపగతి కాత్మయందు వగపు
తనరc గలభాషిణి మణికంధరుని జూచి;
"మును కళాపూర్ణుకథ నీవు వినవె? ధనదు
పట్టిచే నంత యశ్లీల పెట్టువడితి?" 173

చ. అన నతఁ "డెందు నే నెఱిఁగినట్టిది గాదది; నీకు నెచ్చటం
వినఁబడి యున్కినో యది వివేకము సేయఁగ లేక పల్కె"ది
ట్లనుచు మదిం దలంచుకొని "యౌనవు; నీ వెడ గాఁగఁ బోయి యుం
టి నిజము తత్ప్రసంగము ఘటిల్లినయ"ప్డని పల్కి యత్తఱిన్.

సీ. నారదు ప్రథమసందర్శనం బైనట్టి
నాఁడు తత్కథకుఁ బ్రశ్నప్రసంగ
మేతెంచినవిధంబు నాతపస్వియు నపూ
ర్వం బిది యని యద్భుతంబు నొంది
భూతభవద్భావిభువనవస్తువు లెల్ల
నిజయోగదృష్టిచే నెమకి కాంచి
'తన కది చెప్పరా' దని పల్కుటయుఁ జెప్ప
రాకయుండుటయుఁ గారణము గాఁగ

తే. నతఁడు దెల్పిన బహుసంపదాదిఫలము
దాను వినినంతవట్టొకింతయును వినక
పూస గ్రుచ్చినరీతి నాపుప్పుఁబోఁడి
చెప్పినది విని వారలచ్చెరువు నొంద. 175

వ. అప్పుడు. 176

క. మలయాళపుబ్రాహ్మణుఁ డొక
డలఘువ్రతనామధేయుఁ డచటికి సంప
త్కలనాకాముఁడు జపవిధి
తలఁపున నేతెంచి వినియెఁ దత్కథవిధమున్. 177

సీ. విని "యాకళాపూర్ణుఁ డన నెట్టిఘనుఁడో? త
త్కథయంతయును వినఁగలుగు టెపుడో?
సంపదర్థంబుగ జపము చేసిన నయ్య
పూర్వపుఁగథ వినుపుణ్య మబ్బె

దని వినుమష్టిభాగ్యంబు సాధించినఁ
దన్మహాత్వంబుచేతను సమస్త
భోగవైభవమాత్రములు గాక దీర్ఘాయు
వును బుత్రపౌత్రాదిఘనవిభవము

తే. గలుగునఁట! కడు మంచిమార్గంబు దొరకెఁ;
దత్కథాశ్రవణార్థ మీతల్లి నేఁ బ్ర
సన్నఁ గావింతు" ననుచుఁ దాఁజలుపఁ దొడఁగె
నుహితత మగుభువనేశ్వరీమంత్రజపము. 178

క. మనమునఁ గలభాషిణియుఁ
దనశాపముఁ దలఁచుకొని "వృథాహతి నెచ్చోఁ
జనఁబడునో తడసిన" నం
చును సిద్ధుని నతనివాలుఁ జూచి ఘనధృతిన్. 179

క. "ఏల యిఁకఁ దడయ? నీబలు
వాలు నియమమునకుఁ ద్రిదివవారాంగనయా
శీలపుశాపమునకు నను
కూలంబుగ నడచి చేర్చుకొను రాజ్యంబున్." 180

సీ. అన మణిస్తంభుఁ డాయకఁ జూచి "యీసుము
ఖాసక్తి యో హరిణాక్షి! తొలుత
నేను నీపైఁ గత్తియెత్తిన నిన్ను ప్రే
యక యుండ నీజగదంబమీఁది
యాన వెట్టదె? యటుగాన నే వెఱతు నీ
పయిఁ దెగ; మునుపటిపాట్లె చాలు"
నని మణికంధరుఁ గనుఁగొని "నాదువా
లొసఁగెదఁ; గొని యీపయోరుహాక్షి

ఆ. చెప్పినట్లు చేసి చేకొను మత్యంత
విపుల మైనరాజ్యవిభవలక్ష్మి"
ననుచుఁ బలికె నతని వనితయు "నోమణి
కంధర! యిది మంచికార్య" మనియె. 181

వ. అని యతనితోడ వెండియు ని ట్లను, "నలకూబరశాపాను భవంబునకుం గాచుకొనియున్నవానికి నేదుష్కర్మంబున సాధించినరాజ్య వైభవం బేమికీర్తి సుకృతంబులకు సాధకం బయ్యెడు నని చింతింపవల; దనివార్యం బైనశాపానుభవంబు పరోపకారంబున కెక్కింప నుద్యోగించి తనయంతన చేరి యత్యంత ప్రార్థనంబు చేయుచున్న యిన్నెలంతచేత మహా దేవికి సంతర్పణము సేయుట దుష్కర్మం బనరాదు; కావున నిప్పుడంతి చెప్పినచొప్పున నడపు" మని యత్తెఱంగున మఱియుఁ బెక్కుప్రకారంబుల నొడంబఱిచిన నెట్టకేలకు నాదయాళుం డియ్యకొని నియమపూర్వకంబుగా నవ్విధికిఁ గడంగెఁ; గలభాషిణియు మణిస్తంభునకుఁ బదంగనకుం బ్రణామంబుచేసి కన్నీళ్లు గ్రుక్కుకొనుచు నిక్కలంకపాటు తక్కినభయంబునకుఁగాదుసుండు; మిమ్ము నెప్పుడు గురుభావన నారాధించుచుండ లేమికిం గాని! యనుటయు సుముఖాసత్తి యోయమ్మ మన నెమ్మనంబులకూర్మి యింతటన పోయెనే? మీఁదట నైన నీపతియు నీవు నీకోరినట్లు మమ్ము గురుభావం బున నడపుకొనియెద రనినఁ, గలభాషిణి పునఃపునః ప్రణా మంబు లాచరించి ముకుళితకరకమల యగుచు ని ట్లనియె.

శా. "పూతం బయ్యె మదీయకర్ణయుగ మోపుణ్యాంపుటిల్లాల! నీ
పాతివ్రత్యముచందమున్ వినన మదిన్ భావింపఁగా నెట్టిదు

ర్నీతిప్రక్రియవారికైనఁ గృపతో నీ విచ్చినం గల్గుఁ ద
త్ప్రాతివ్రత్యము నాకు మీఁద నయినం బ్రాపింప దీవింపవే."

క. నావుడుఁ "బరమపతివ్రత
వై వెలయుము రాజ్యవైభవానుభవం బెం
తే వర్తిల్లఁగ నలరుచుఁ
బ్రోవుఁడు మముబోంట్ల నెవిభుం డనుచు నీవున్. 184

* ... ... ... . ...

ఉ. 'అట్టిటు చంచలింపకు దృఢాత్మత నుండు మటంచు నిప్పు డే
మిట్టివి నీకుఁ జెల్పునవి యెయ్యవి! పెండ్లికిఁ బోవునట్లు క
న్పట్టుచు నున్నదాన పతిభవ్యవికాసము నుబ్బుఁ జూడ నీ
గట్టిగ నెన్న దేవతవుగాక నరాంగనవే మృగేక్షణా!" 185

చ. అని తనుఁ బల్కునజ్జలరుహాక్షిని వీడ్కొని సిద్ధవక్త్రముం
గనుఁగొని "నన్ను [1]నంపితిరి ఖడ్గము నిచ్చెదరే!" యటంచునా
తనిబలుకత్తిఁ బుచ్చుకొని తా మణికంధరుచేతి కిచ్చి యో
గ్యనియమ గంధమాల్యవతి యై కలభాషిణి నిర్విశంకతన్.

క. తగ నాశక్తికి నభిముఖి
యగుచుం బద్మాసనస్థ యై కూర్చుండెన్
మొగ మెంతయు వికసింపఁగ
బిగి వసలక పొడలు మది గభీరత మెఱయన్. 187

ఉ. కాంత యనంతరంబ మణికంధరుఁ గన్గొని "నీ విఁకన్ విని
శ్చింతత దేవి కర్పణము సేయుము కొంకక దద్దరిల్లక కొ
క్కింతయు శంక లేక మెఱయింపుము చూచెద నుద్ధతద్విష
త్సంతతికంఠఖండనవిచక్షణదక్షిణబాహుశౌర్యమున్. 188

* అని ఘటియు. 1. నంపెదరె.

క. సమరంబున నెదిరించిన
సమదాహితవీరవరులఁ జక్కడఁచుట నై
జము నీకు నిట్టిగొనలఁ
బ్రమయక చేపఱవ కునికి పటుశౌర్య మగున్." 189

క. అని తెలిపెడికలభాషిణి
మనసు తెలివి కరుడుపడుచు మణికంధరుఁ డే
మని చెప్పు? నెట్టకేలకుఁ
దనమది నూల్కొల్పి నడపెఁ దద్వచనంబున్. 190

వ. అప్పుడు మృగేంద్రవాహన యతని నుద్దేశించి "యో మణికంధర! నీవు దయాకులత్వంబునం జేసి యీబలిసమర్పణ విధానం బోకించుక పిలంబనంబునం జేసితివి; కావున జన్మాంతరమాత్రవ్యవధానంబున సద్యోయౌవనుండ వగుచు మహారాజ్యవైభవంబు ననుభవించెదు; కలభాషిణియుఁ బ్రాణభయంబు లేశంబును లేక మత్ప్రీణనతాత్పర్యధైర్యాది గుణంబులచేత నన్ను మిక్కిలి మెప్పించెం గావున మామక ప్రసాదవిశేషంబునం జేసి యిపుడు పునస్సహితమస్తకయు, నిజపురీవర్తినియు నై తనబంధుమిత్త్రాదుల నలరించు"నని యానతిచ్చె; నచ్చెలువయు నట్లు బ్రతికి కను విచ్చి నలుదిక్కులు పరికించి యప్పుడు తా నున్నయది ద్వారకానగరవేశవాటీ భూషణాయమానస్వభవనారామభూమి యై యుండుటకు వెఱఁగందుచు "నిది యంతయు మృగేంద్రవాహనామహాశక్తి కృపావిలసనంబు గాఁబోలు!" నని యద్దేవిం గొనియాడి తన గమనాగమనప్రకారంబు సఖీప్రముఖనిఖిల జనంబులకు వినిపించి ఘనతరాద్భుతానందంబులు గావించుచునుండె; నిట మణికంధరాదులు నవ్వారవర్ణినీశరీరఖండంబు లదృశ్యంబు

లగుటకు వెఱఁగంది యయ్యాదిమశక్తిసూక్తిమహిమ
పలు దెఱంగులం బ్రశంసించి; యంత మణికంధరుండు మృగేంద్ర
వాహనకు దండప్రణామంబు గావించి సుముఖాసక్తి మణి
స్తంభులం దగువిధంబున వీడ్కొని శాపానుభవకాలంబుఁ
బ్రతీక్షించుచుఁ గృష్ణవక్త్రం బైన తన రత్నమాలిక యచ్చట
జపపరం బై యున్న యలసువ్రతునకుఁ గృష్ణార్పణబుద్ధిని
సమర్పించి విపంచి యద్దేవిగృహంబున నొక్క వలభివిశేష
వివరంబున నన్యులకుం గానరాకుండ గుప్తంబు చేసి. 191

క. అమ్మణికంధరుఁ డంత మ
నమ్మునఁ బ్రేరేచుచున్న నలకూబరశా
పమ్మునఁ జనియెను శ్రీశై
లమ్మునకును భృగునిపాతలంపటమతి యై. 192

సీ. తగసుముఖాసక్తి తనకు శుశ్రూష సే
యఁగ మణిస్తంభుండు నమ్మృగేంద్ర
వాహనాదేవినివాసంబునంద య
త్యంతజితేంద్రియత్వంబు మెఱసి
యష్టాంగయోగవిద్యాభ్యాసప్రౌఢిఁ
బనరె నజ్జలజనేత్రయునుఁ బటికి
వలసినపరిచర్య సలిపినతుదఁ దదా
జ్ఞను దాను మునుపటితనదుయోగ
ఆ. వర్తనంబు ప్రేమ వదలక తత్పరి
శీలనంబు నెపుడుఁ జేయుచుండెఁ
దదనిశప్రయత్నతాత్పర్యమున నల
బ్ధావకాశుఁ డగుచు నతనుఁ డుడుగ. 193

క. అంత మణిస్తంభుఁడు వన
యంతగికరణంబునందు వలరారెడు దే
శాంతరవస్తువిశేషా
త్యంతదిదృక్షఁ దిగంతయాత్రాపరుఁడై. 194

క. వరజవశాలిం దనకే
సరి నాకర్షించి యాత్మసతియుం దానుం
బరమోత్సాహమునం గ్రుతా
ధిరోహులై గగనమున యదృచ్ఛాగతులన్. 195

క. అరుగుచుఁ గనుఁగొనియెను భీ
కరమకరతిమింగిలాదిఘనజలజంతూ
త్కరవిహరణాభృశరౌద్రక
నిరుపమఘుమఘుమరవానిద్రు సముద్రున్. 196

వ. ఇవ్విధంబున నయ్యంబుధిం గనుంగొని తత్ప్రకారంబు కౌతుక
కారణం బగుచు సొంపుమీఱఁ దనవనిత కతం డిట్లనియె. 197

ఉ. "శీకరబృందవ మెంతయు నశీతమరీచి మరీచి జాలమై
శ్రీకృతధాళధళ్య మయి తేజరిలన్ నిజధర్మ మైనర
త్నాకర భావ మీజలధి యంబుజలోచన! చూచితే కడుం
బ్రాకట మై తనర్పుఁ దనబాహ్యవిభాగమునందుఁ జూపెడున్.

ఉ. ఓలలితాంగి! చూడు కడు నోప్పెడు నీరము[1] నిండఁగాఁగఁదాఁ
గ్రోలి తిమిప్రకాండము శిరోవివరంబున వెల్వరించును
ద్వేలపుటూర్ధ్వధార యలవేలుపు కోటిపయిం గుతూహల
శ్రీల[2]మరన్ సకవివిభుఁడు చిమ్మెడుచిమ్మన గ్రోవినీ రనన్. 199

1. నోరునిండఁగాఁ. 2. మడు నన్నదీ.

తే. ఉగ్రతిమిశిరోంధ్రనిష్ఠ్యూతమగుచు
నెగయుపలిలాఘుమది యొడ్డు మిగుల నొప్పె
నబ్ధిపేరిటికుండలితాంగభోగి
ధిష్ణనం బనఁబడగ యెత్తెనో యనంగ. 200

ఉ. ఔర్వముపేర ఘోరవిరహానల మెంతయు నంతరంబునన్
బర్వఁదరంగబాహువులు బారలుచాఁచుచు నీపయోధి యో
పర్వసుధాంశుబింబముఖి! భాసిలెడుం గడు నుల్లసద్రసా
ఖర్వసుపర్వసింధువును గౌఁగిటఁ జేర్పఁగడంగు కైవడిన్. 201

మ. వికచాబ్జానన! యీపయోధి శశియావిర్భావకాలంబునన్
సకలద్వీపవతీగణంబు యుగపత్సంప్రాప్తనవ్యోల్లస
న్నకరీభంగపయోధరత్వమునఁ గన్పట్టన్ రసోజ్జృంభణా
ధికతం జేయుచునాచరింపఁ గడఁగున్ దివ్యాపగాశ్లేషమున్.

చ. ఉదకముఁ గ్రోలఁ బ్రేలెడుపయోదము పౌరుషకేళిసంభ్రమా
భ్యుదయగళద్భ్రమాకబరిపాలిక నొప్పఁ దటిద్విలాసముల్
తదభివృతాంగకస్ఫురణలం దలపింపఁగ నీపయోధియో
ప్పిదము శయించినట్టిమురభేదితెఱంగు వహించెఁ జూచితే!"

క. అని పలుకుపతనదుపలుకుల
కును ముసిముసినగవుతోడఁ గోమలి లజ్జా
వనతముఖి యయినఁ దద్భ్వల
సనజృంభితకుసుమశరవశంవదుఁ డగుచున్. 204

తే. తనదుభావంబుఁ దెలుప నవ్వనిత "మీకు
వలసినవిధంబునం బ్రవర్తిలుట గాక
యొండు నాకు స్వతంత్రత్వ మెక్కడిది?"
యనియె ; ననుటయు నాసిద్ధుఁ డాత్మ నలరి. 205

మాలిని. కిసలయకుసుమాఘూకీర్ణనానావనాంతో
ల్లసదభినవకుంజశ్లాఘ్యభాగంబులందున్
బిసరుహదళనేత్రన్ బ్రేమతోఁ గూడి నానా
ప్రసవశరవిహారప్రౌఢిఁ గ్రీడించుచుండెన్. 206

క. అలఘువ్రతాహ్వయుం డగు
మలయాళపుబ్రాహ్మణుండు మహనీయసము
జ్జ్వలనియమంబున జపవిధి
సలిపెం బూర్ణముగ రెండు సంవత్సరముల్. 207

ఉ. శీతలసత్యభాషణ విశేషవిలాసనమార్జితాఖిల
శ్రోతృజనానురంజక విరోధినరాధిపగర్వభంజనా
నీతికలాతికౌశలవినిర్మితభార్గవదేవమంత్రివి
ఖ్యాతివిభూతిగర్హణ నిరంతరకల్పితవిద్వదర్హణా. 203

క. నరసింహప్రభునందన
నరసింహబలారిసమఘనస్థేమబలా
నరసింహకృపాస్పద కి
న్నరసింహాసనపదస్థ నతికృద్ధరిపుణా. 209

తోటకవృత్తము. మానసుయోధన మంజులనిత్యా
నూనయశోధన యుజ్జ్వలకృత్యా
దానసుబోధన ధర్మదకృత్యా
ధీనమహాధన దీపితసత్యా. 210

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ
పింగళి యమరనార్యతనూభవ సౌజన్యజేయసూరయనామ
ధేయప్రణీతం బైనకళాపూర్ణోదయం బను మహాకావ్యంబు
నందుఁ జతుర్థాశ్వాసము.

---

శ్రీరస్తు

# కళాపూర్ణోదయము

## పంచమాశ్వాసము



దఖ్యాతినిరాకృతి
వైదుష్యసుపుష్యదర్థవైభవ యపరి
చ్ఛేదప్రాభవ యాచక
ఖేదప్రశమనవిలోల కృష్ణనృపాలా. 1

వ. అవధరింపు మవ్విధంబున నలఘువ్రతుండు భువనేశ్వరీమంత్ర జపంబు రెండుసంవత్సరంబులు పరిపూర్ణంబుగాఁ జేయ నంతట మృగేంద్రవాహన "యోబ్రాహ్మణుండ! నీయభీ ష్టంబు వేఱొకచోట సిద్ధించు" నని పల్కె; నప్పలుకులు [1]వీనులంబడు నంతన యతం డాకస్మికోద్భూతతీవ్రవా[2]తనిహతి తుం డగుచు ననేకజనపదవ్యవహితం బైన యొక్క పురంబు నడుమ[3]రాజస్థానమధ్యంబునంబడి తదీయశోభాకులత్వంబున నొక్కింతతడ వుండి మూసినకనుతెప్ప లంత విచ్చి నలు దిక్కులుం బరికించి తన పతనప్రకారంబునకు వెఱఁగుపడుచుఁ జుట్టున నున్నసభాసదులఁ గొందఱను గట్టెదుర రెండవ దేవేంద్రుంబోలె నపూర్వవైభవంబున నున్నయొక్క రాజును నతని యగ్రభాగంబునఁ బసిండితొట్టియలోపలఁ బొత్తులలో నున్న యొక్క చక్కని బాలికనుం జూచి యొక్కింతతడవు

1. వినంబడు. 2. తానీతుం. 3. రాజాస్థాన.

నివ్వెఱపాటున నిశ్చలుం డగుచు నుండి పదంపడి దిగ్గున లేచి
మణికంధరద త్తం బైన తన రత్నమాలిక యాశీర్వాదపూర్వ
కంబుగా నారాజునకుఁ గానుకఁబట్టుటయు నతండు నత్యా
దరంబునం గైకొని కొంత సమీపంబునం గూర్చుండ నియ
మించి యిప్పటికిఁ దత్కులనామమాత్రంబు లడిగి తెలిసి,
"యిప్పుడు నీయాగమనప్రకారం బత్యద్భుతం బది చెప్పెదవు
గాని యిటు మాటలాడక యొక్కింత నిలువు" మని పలికి
"యిప్పటి కానుక లెవ్వియైనను దీనిసొమ్ముల" యని యమ్మణి
హారంబుఁ దనయొద్ద నున్న యాశిశువునకుఁ బెట్టించె. 2

క. ఆత్తఱిని తనకుల నా
పొత్తులలో శిశువు చిబుకము గళంబుపయిన్
హత్త నని చూచి తెలివళు
కొత్తుచు లేఁజెక్కు లమర నొయ్యన నగియెన్. 3

వ. నగి యిట్లనియె. 4

క. "తిరుగఁగ నెండేండ్లకు నీ
సుచరిహారోత్తమంబుఁ జూడఁగ నాకున్
దొరకెఁ గనుంగవ చేసిన
యురుపుణ్యము నేఁడు వెండియును ఫలియించెన్." 5

తే. అనిన విని యేమి చెప్పంగ నచట నున్న
వారలెల్లఁ జిత్తరువున వ్రాసినట్టి
ప్రతిమలనుబోలె నతినిశ్చలత నొకింత
తడవు గనుఁగట్టి రత్యద్భుతంబు నొంది. 6

ఉ. ఎంతయు విస్మయంబున మహీశుఁడు బాలికమోముఁ జూచి య
త్యంతము వింత లీలలకు లారయఁగా నిది యెట్టిదేవతా

కాంతవో? కాక యేవిధపుఁగారణజన్మవో? యింకమాట లా
డింపము గాక! యంచుఁ దనడెందమునం గలపోసి యిట్లనున్.

క. "ఓ యద్భుతంపుబాలిక
నీయుదయం బరయ రెండునెల లగునో కా
దో! యెట్లు పలికితిమ్మెయి?
నేమొద రెండేండ్లక్రింద నిది చూచితినో?" 8.

క. అన విని "యిట ముసుపటి
జననంబున నేను దీనిఁ జాల గుఱుతుగాఁ
గనుఁగొన్నదానఁ గావున
ననఘా యామాట యంటి" నని యది పలికెన్. 9.

వ. అమ్మహీపాలుండును నబ్బాలికం జూచి: 'నీవు కారణజన్మవు
గాని సామాన్యంబైనమనుజశిశువుమాత్రంబవు కావు; కావున
నీతెలుఁగంతయు నెఱుంగునందాఁక డెందం బమందకౌతుక
సంరంభంబున సంభ్రమించుచున్నయది. నీపూర్వజన్మవర్తనంబు
లెవ్వి? యేమికారణంబున నిచ్చటఁ బుట్టితి? వెఱింగింప
వలయు" నని ప్రార్థించుటయు; నది తన పూర్వజన్మవర్తనం
బును, దజ్జన్మనిమిత్తంబైన తత్పూర్వవర్తనంబును, సంస్మరణ
సంబంధపరంపరావశంబున సమస్తంబును గరతలామలకంబుగా
నాకలించి, తన పలుకు లాస్థానంబెల్ల సావధానం బగుచు
'వింజమాఁకిడి'నట్లు వినుచుండ నన్నరేంద్రచంద్రునకు నిట్లని
చెప్పం దొడంగె. 10.

సీ. వినవయ్య యోకీర్తిధన యిట ముసుపటి
పుట్టువు గాక తత్పూర్వమైన

పుట్టువునందు నంబుజగర్భదేవి పెం
చినయట్టి ప్రోదిరాచిలుక నేను
నాకుఁ దజ్జన్మజంబునఁ బాప మొక్కఁటి
తగుల రెండవమేను దాల్పవలసెఁ
పచ్ఛాకమూల మంతయు నీకు వినిపించె
దను నేను మది నిమిత్తముగ నైన
ఆ. నొకయపూర్వకథ సముజ్జ్వలరసభావ
మాయురభ్యుదయకులాభివృద్ధి
హేతు వతిపవిత్ర మిప్పుడు వినిపింపఁ
గలిగె జిహ్వాకలిమి ఫలము నొంద. 11

మత్తకోకిల.—
అంబుజాసను రాణివాసమునందు నేను వసించుకా
లంబునం దొకనాఁడు మోద మెలర్ప నాయన వాణితో
నంబరాభరణాంగరాగసుమంచితాకృతివైభవా
డంబరంబు కరంబు వింతబెడంగునం గనుపట్టఁగాన్. 12

క. భవనారామమునకుఁ జని
నవనానాఖేలనము లొనర్చుచు నరసిం
నవనామోదభరాలస
పవనామోదములచేత శ్రావము లెసఁగన్. 13

క. కృతకమరాళసమేతా
గ్రత నమరెడు నడిమిమానికపుఁ గంబముతో
నుత కాంచన సోపాన
ప్రతతులతో నొప్పు నొకసరసి తూర్పుదరిన్. 14

తే. తరుణసంతానకచ్ఛాయఁ దలిరుఁబాన్పు
నందు నాసరోవరమున కభిముఖముగఁ
బవ్వళించెను దనపాదపల్లవంబు
లూరువులఁ జేర్చుకొని వాణి యొత్తుచుండ. 15.

ఉ. అంతట నంతకంతకు నిరంతర మై తనరారు మోహదు
ర్దాంతతఁ గాంతఁ బాన్పునకు దార్చెను దన్మధురాధరామృతా
క్రాంతిరసోద్ధతిన్ దన మొగంబులు నాల్గును నొక్కమాఱు య
త్యంతముఁ దత్తఱిల్లఁగఁ దదాననముం దనకై మరల్చుచున్.

వ. అప్పుడు. 17

సీ. ఆలీలలకు నవ్వి "మేలు మే లెంతయు
నీవింత లన్యాయ మింత గలదె!
మీ మొగంబులు నాల్గు నీమాడ్కి నుస్వెళు
లూరిన నేకాస్య నొకతె నేను
జాలుదునే! యివి చాలించెదరో! మఱి
యేమైనఁ గలదో!" యం చామృగాక్షి
మెడ బిగించుచు నించు కెడగ వక్త్రము నిల్పి
యధరంబునకుఁ బాణి యడ్డమిడుచు
తే. మొలకనగవును గోపంబుఁ జెలువుఁ జిలుకు
తళుకుఁజూపులఁ జూపులోఁ దర్జనముల
వక్రితభ్రూలతాతాండవంబు సిరుల
మిగులఁ గెరలించెఁ బ్రియుమది మెఱయు మరుని. 18

ఉ. ఆయజుఁ డప్పు డంగనముఖాబ్జము బల్మిని వంచి మోవిపై
చే యటు పాఱఁద్రొబ్బి పలు సేర్చె నొకించుక నాటునట్లుగా

నాయమునకుం గళాభిధుర నై మది నింపొనరింప మోహనం
బై యుదయించె నొక్కమధురాంచితశబ్దము కంఠసీమలోన్.

వ. అంత నా వాగ్దేవి యీ విధంబున నొదవిన కళామత్స్యభేదన సామ్రాజ్యసంపదనుభవాశ్రద్ధమాన లాఘవశంక నప్రకాశంబుగాఁ గడపిపుచ్చుట కుపాయంబుఁ జింతించి తద్విరోధకారిణి యైన విభుని యభిమతకేళికి విఘాతంబుగ నధరపీడనాసహత్వనాటితకంబున నలుకఁ గల్పించుకొని యవ్వలిమొగంబుగాఁ[1] బొరలె నే నప్పుడు తదీయభావం బంతయు నూపశ్లేషనయనాంతమీలనాదులైన (కళా) శాస్త్రప్రసిద్ధలక్షణంబులచేత నూహించితి; నజ్జలజభవుండును దద్విరహదశావికలితధైర్యుండయ్యు నుల్లంబునం[2] గల్లగుట్టు నెట్టుకొలిపి యిట్టట్టు దెల్పుటకుం జొరకుండి యంతటఁ బురోవర్తిశాఖాసమా[3]సంజిత సమంజసరత్నపంజరంబున నున్న నన్నుం జూచి "యో చిలుక చెలువ! యుబుసుపోదు కథ యొక్కటి చెప్పవుగా!" యనుటయు నేను "నో దేవ! దేవరముందట నెట్టికథయుఁ జెప్ప నేను భాజనంబనే? మీరు చెప్పితిరేని వినియెద" ననుడు "నట్లని వినుము చెప్పెద" నని యిట్లనియె.

క. "కాసారసంజ్ఞతోడను
భాసిలుచున్నట్టి యొక్కపట్టణమున ల
క్ష్మీసంపద[4]నొప్పును సువి
లాసుఁడు రా జొక్కరుఁడు కళాపూర్ణుఁ డనన్. 21

క. ఈజగములఁ గలతనసరి
రాజుల నందఱను జయధురంధరుఁడు మహో

1. మరలిన. 2. నల్లుటనట్టు. 3. సంచిత. 4. నొప్పెడు.

రా[1]జతఁ డొనరించెను నిజ
రాజితకీలాకళాపరాజితు లనఁగన్. 22

క. ఆతఁడు సద్యోయావనుఁ
డై తోడన యొకస్వభావుఁ డనుసిద్ధునిచే
నూతన మొకమణియు సము
ద్యోతితకాష్ఠము మెఱుంగుఁదూఁపులుఁ బడసెన్. 23

తే. ఆమణిశలాక యనఁగ నై యద్భుతంపు
రంగు గలిగినయది యా మెఱుంగుఁదూఁపు
లక్షయము శాశరాసన మతనువిజయ
గౌరవానీకసంప్రాప్తి కారణంబు. 24

వ. అవి యట్లు వడసి యతండు తద్దాతృగౌరవంబునన యనవర
తంబునుం దాల్చియుండు. 25

సీ. అంతట నొకఁడు మదాశయుం డనుజగ
తీనాయకుండు రూపానుభూతి
యనుభార్యయును దాను దనమంత్రి ధీరభా
వాఖ్యుండు తోడ రా నట యదృచ్ఛ
నొక్కింత పొలయుటయును దత్కళాపూర్ణుఁ
డాత్తకోదండవిహారపటుత
ధీరభావునిఁ గడుదూరంబుగాఁ బలా
యనము నొందించి మదాశయాఖ్యుఁ
తే. దనకు శరణు చొచ్చినవానిఁ దత్కళత్ర
యుక్తముగ దాసుఁగా నేలి యూడిగంపుఁ

1. జిత.

బనులు సేయించుకొనుచు నింపెనయ నిలిపె
నతఁడు వర్తిల్లుచుండెఁ దదాజ్ఞలోన." 26

వ. అని చెప్పిన నప్పలుకులు సభ్రూవిలాసలోలలోచనాంచల
కషితకర్ణిక యగుచు నాకర్ణించి యించుక నగుచు శారద
నన్నుం జూచి "యాకళాపూర్ణుండు మఱియేమి యయ్యె ?
నతనికిఁ దల్లిదండ్రు లెవ్వ ? రడుగు" మని కఱప, నేను నట్ల
యడుగుటయు నజ్జగద్గురుం డి ట్లనియె. 27

సీ. "అభినవకౌముది యనుకాంతచే నంత
వరియింపఁ బడియె నవ్వీరవిలాసుఁ
డాతనికిని సుముఖాసత్తి యనునది
తండ్రియు మఱి మణిస్తంభుఁ డనెడి
వాఁడు తల్లియు" నన వాణి హాసంబుతోఁ
గ్రక్కున గ్రమ్మఱి కౌఁగిలించి
"యింతలోనన యారా యెన్నితబ్బిబ్బులు!
దద్దఱిల్లకుఁ" డంచు ధవునివీఁపు
తే. చఱచి "యెట్టెట్టు! లారాజుజనని మగడి
యును జనకుఁ డాఁడువాఁడునా!" యనుచు మఱియు
మిగుల నవ్వుచుఁ "జెప్పుఁ డామీఁదు ప్రాణ
రమణ మఱి యేమి యయ్యె నారా ?" జనుటయు. 28

క. ఆనర్మలీలచేత శ
తానందుం డధికసంభృతానందుం డై
తానును మే లొప్పఁగ న
మ్మానిని మెడఁ గౌఁగిలించి మక్కువ మీఱన్. 29

తే. వదనములు నాలుగింటికి వరుసఁ గలియ
మెలపుతోఁ దనకంఠంబు మలఁచి మలఁచి
యొసఁగెఁ దదధరపానమహోత్సవంబు
గళము కౌఁగిలితోన చెక్కులు నిమురుచు. 30

చ. చెలువయు నంత నం దొకఁటచే జనితాధరపీడ యై "మదిం
గొలఁది యెఱుంగ రెందు"నని కోపముసూపుచుఁ జాలుఁ
"జాలున,వ్వలఁ జెప్పుఁ డేమియయోధ్యను భవత్కథితుం డల
రా!" జటంచుఁ గౌఁగిలి విడిపించి మోము లిరుగేలను
బాయఁగఁ బట్టఁ బట్టినన్. 31

ఉ. దానఁ బ్రకాశితంబు లగునుత్కుచకుంభవిజృంభణంబు లేఁ
గౌనుబెడంగుఁ గొంతవడి గన్గొని చొక్కుచు నంత మోవితీ
పానె నజుంప వెండియుఁ బ్రియత్వముతో నిదియెల్ల నేస్త్ర
రానా! నృపుఁ డేమి యయోధ్యఁ! గథ యానతియిం డని
పల్కె వాణియున్. 32

వ. పల్కిన [1]నజుం డిట్లనియె. 33

సీ. ఏమియు నేల యయోధ్యేప! నమ్మహారాజు
సత్త్వదాత్తుం డనుపచిన్నుఁ డంత
రమణితో నంగదేశమునందు గ్రముకకం
ఠోత్తరం బనుపట్టణోత్తమమునఁ
దన్నుఁ బట్టము గట్ట నున్నతసామ్రాజ్య
వైభవశ్రీసముజ్జ్వలత నొప్పె
నతనియాపురికి మదాశయుండు పసిండి
కోట పెట్టించి మొక్కుడుగ నతని

---

1. నవ్విభుఁ.

తే. దయ వశనై నంతఁ దనదుభార్యయును దాను
నడుగ కభినవకౌముదీయుతుని నతని
గొలుచుచును దన్మణివిలోకగుణమహత్త్వ
మునను మధురాలస యనుతనయఁ గనియె. 34

సీ. కనినతన్మణిగుణంబునకు మెచ్చుచుఁ బ్రథ
మాగముండును ద్వితీయాగముఁడుఁ దృ
తీయాగముండుఁ దురీయాగముండు నాఁ
బ్రఖ్యాతి నొప్పువారలు నలువురు
తత్పురోహితులు సత్వరతఁ గళాపూర్ణుఁ
జేరి యాతఁడు దాల్చుచాను మణిని
బర్యాయమునఁ దాఁకఁ బట్టి తత్సంస్పర్శ
మహిమచే నానందమగ్ను లయిరి

ఆ. యతఁడుఁ దద్వశీకృతాత్ము లై వా రాశ్ర
యించి యునికిఁ దనదుహృదయమునకు
నియతివశతఁ జాలఁ బ్రియ మగుచునికిఁ ద
త్క్రియల కెల్ల నిచ్చగించి యుండె. 35

వ. అంత వారిలో నొక్కరుండు మిక్కిలి మందెమేలమ్మున నమ్మణిని గరంబు నొక్కి పట్టుటయుఁ గళాపూర్ణుండు కోపగించుకొని వారిఁ బాయందోలి తదపరాధంబునం జేసి తత్స్వామియైన మదాశయునికనకప్రాకారంబు నొల్లక విఘటితంబుగాఁ జేయించె; నతండును దానికిఁ దలంకక "యెందుల కేమి? తెమ్మైనను దనవాఁడన; తనదేశంబునంద యెందైనను బ్రదికెద" నని కళాపూర్ణుసేవ విడిచి కుటుంబసహితంబుగాఁ గ్రముకకంఠోత్తరపురంబు వెల్వడి యొక్కించుక చనుచుండె.

సీ. కట్టెదుటను బూర్ణకలశద్వయం బతి
శోభనస్ఫూర్తి మై సొంపు మీఱఁ
గని వేశ్య నుబ్బుచుఁ జని సుఖంబున మధ్య
దేశంబునను జిరస్థితిఁ దనర్చెఁ
గ్రముకకంఠోత్తరాఖ్యపురంబు వెడలున
ప్పాడు ప్రయాణశోభమునఁ గృశత్వ
మును బొంది [1]తేఱనిముగ్ధలపట్టిని
మధురలాలసఁ దలంపఁగ నెఱుఁగఁడ

ఆ. యప్పు డేమి సెప్ప! నాతఁ డా పూఁబోఁడి
"గొట్టి[2]వారును గణియింప రంత
మీఁదమీఁద సుఖనిమిత్తంబు లొదవుచో
నపుమఁ జెందు నిజజనంబుపీడ." 37

తే. క్రముకకంఠోత్తరపురోత్తమమున కంత
నరుగుదెంచెను దిరిగి మదాశయుంపు
నిజకుటుంబయుక్తముగ నన్నిసువు భాగ్య
మెట్లు ప్రేరేఁచెనో మఱి యెందు నిలక! 38

క. ఆసుగిది నేఁగుదెంచి క
ళాపూర్ణునిఁ గనుఁగొనం జెలంగె నిజకృశ
తాపగమోల్లాసిని యై
యేపునఁ దత్ప్రవృత్తి యంత నెంతయుఁ దెలిపిన్. 39

సీ. అంత మదాశయుం డట్లు తేఱి కరంబు
పొదలెడుసుతఁ గళాపూర్ణునొద్దఁ

1. తేరని. 2. వారిని గణియింప దంత.

దగ నిల్పి యాసనికిఁ బ్రత్యుపకారముఁ దెల్పి
యిట్టిచిత్రమహత్త్వ మేరికైనఁ
గలదె యెందును నీకకా! కంచు భార్యయుఁ
దానుఁ దన్మహిమయంతయును రసుగాఁ
బొగడుచు నింపునఁ బొదలి రత్యంతంబు
నతనిపురోహితు లపుడు వినయ

తే. పరతఁ బ్రథమాగమాదులు దిరుగఁ జేరి
రాకళాపూర్ణ నాతండు నాత్మ నిచ్చ
గించుకొని యుండె నోపుచ్చంచలాక్షి
సుప్రసన్నత్వ మెంతయు సొంపు మీఱ. 40

తే. మధురలాలస యంతఁ గ్రమంబుతోడఁ
దల్లిదండ్రుల ప్రోదిని దనయ యగుచు
నాకళాపూర్ణుచేత ననన్యసదృశ
మైనయౌవనఫలముఁ దా ననుభవించె. 41

వ. అని చెప్పిన నాకర్ణించి. 42

క. నిరవధికప్రేమోదయ
దురపహ్నవకంపళన్మృదుస్మితశోభా
సురుచిరకృత్రిమరోష
స్ఫురణంబున బొమలు ముడుఁచుచుఁ గా సతి పతితోన్. 43

చ. అటు గలఁ డౌర యెంతటిసుహృత్తులు మీరలు! నాదుమీఁదనా
కటకట మీవచోరచనకౌశల మోభువనప్రపంచసం
ఘటనధురీణ! యన్న నగి కామిని యిం దిపు డేమి కాంచి యీ
కిటుకు గడించి పల్కెఁ దెలిపింపుము కట్టన నాకు నావుడున్.

సీ. చెల్లఁబో మీసేవ సేయుచు నింతమా
త్రము నెఱుంగఁగ లేన ప్రాణనాథ!
యీదంటమాటలు నిట్టిభావంబుల
విధము నే నిచ్చినవిద్యల కద!
యిప్పటిమనవృత్తి మీకథ సర్వంబు
తుదముట్ట నేమి సెప్పెదరొ యనుచు
నూరక యిందాఁక నుండి నంతయుఁ జెప్పె
దను నది వినవలసిన వినుండు
తే. కొలఁదు కాసారపురముగాఁ బలికి యందు
బొలుచునామోమునీక సంపూర్ణశశియు
ననుతలంపునఁ బలికితి రవుసు దానిఁ
బ్రకటముగఁ గళాపూర్ణుఁ డను రాజు గాఁగ. 45

వ. ఆరాజు కళాపూర్ణుఁడు, పరిరాజుల నెల్ల లీలాకళాపరాజితులం జేసెననుట యాచదన ప్రతిబింబచంద్రుఁ డెల్ల ముఖచంద్రులకు నెక్కుడైనసౌందర్యముగలవాఁడని యతిశయోక్తినిమిాను ష(హా)త్త్వవిశేషంబుఁ దెలిపితి. ఇది యంతయు విస్పష్టంబు. మఱి యతండు స్వభావుం డను సిద్ధునిచేత ధనుర్బాణంబులు నొక్క యగుణశిలాకయుం బడసె ననుట భూశిలతావీక్షణంబులు, నధరంబును స్వభావంబుచేతన కలిగియున్నవి యనుట యని యెవ్వరికి తెలియఁగఁబడదు? మదాశయుం డను వాఁడు రూపానుభూతి యనుభార్యయుం దాను ధీరభావుం డనుమంత్రితో నలపోకగ నటులు పొరసినమాత్రన కళాపూర్ణుం డాధీరభావునిఁ దన ధనుర్విలాసంబునం బలాయనంబు బొందించి మదాశయు నతనిభార్యతోడం గూడ

నిజదాసునిం గావించి సేవ సేయించుకొనియెను నదుట యాకా సారంబునకయి మీహృదయంబు దృష్టియుం దానును ధైర్యంబుతోడం గూడ నొక్కించుక ప్రవర్తించినం మన్ముఖ ప్రతిబింబంబు నిజభూవిలాసంబున ధైర్యంబుం బాఱం దఱిమి మీహృదయంబును దృష్టిసహితంబుగా నాకర్షించి విడువ దనుటయై కానుపించుచున్న యది. అంత నిప్పలుకు లకు నాకు నవ్వువచ్చినది. అది తత్ప్రతిబింబంబునం దోంచిన యానవ్వును జూచి లేంతవెన్నెలతో సామ్యాతిశయంబు దోంపం దగ భేదాధ్యవసాయంబు గల్పించి యభినవకౌముదీ శబ్దంబునం బలికి, యది స్త్రీలింగత్వసామర్థ్యంబున స్త్రీనామ ధేయంబై కానుపింప నభినవకౌముది యను కాంతచేత నతండు వరియింపంబడె నంటిరి. ఆకళాపూర్ణునకు సుముఖా సత్తి యనునది తండ్రియు మణిస్తంభుం డనువాఁడు తల్లియు ననుట యా ప్రతిబింబంబు శోభనముఖసామీప్యంబు కార ణంబుగాం దత్కాసారమధ్య మణిస్తంభగర్భంబున నుద యించె నని చెప్పుటకాదె! అందు స్త్రీపురుషత్వంబులు మీర లేమి తడంబాటుననో విజ్ఞోదపడం గల్పించి పలికిన నేను హాసోత్సుక్యంబుల నాఁపలేక మీ కభిముఖంబుగాం బొరలినం గాసారమధ్యవిద్యోతమాన ప్రతిబింబంబు వోయి మన్ముఖంబు మీకు నెదుటం గాన్పించిన నది మదీయదేహంబు నందుం గంఠోపరిభాగంబునం గనుపట్టుటం జేసి యాకళా పూర్ణుం డంగదేశంబునం గ్రముకకంఠోత్తరపురంబునం బట్టంబుం గట్టుకొనియె నంటిరి. అది మదీయాత్మాధీనంబు గావున సత్త్వదాత్ముం డనుమంత్రి పట్టంబు గట్టుటగాం

జెప్పితిరి. సత్త్వదాత్మం గనంగ సమీచీనత్త్వదాత్మం డనుట తోఁచుచున్నయది. అంతట మీరు మత్కంఠపరిరంభణంబు గావించి యది యుష్మదాత్మాధీనం బగుటను, మీబాహువులు సువర్ణవర్ణంబు లగుటను మదాశయుండు క్రముకకంఠోత్తరంబునకుఁ బసిండికోటఁ బెట్టించె నంటిరి. మీయాత్మయు, దృష్టియు నెట్టి మమతావశంబుననో మన్ముఖంబునం బాయక వర్తిల్లుచు మధురాధరేచ్ఛ యార్జించుట యరసి, మదాశయుండు రూపానుభూతిసహితుం డై యాకళాపూర్ణునకు సేవఁ జేయుచుఁ దన్మణిశలాకమహత్త్వంబున మధురలాలస యనుతనయం గాంచె నంటిరి. అట్లు మధురలాలసఁ గనినం దన్మణిశలాకామహిమకు మెచ్చుచుఁ బ్రథమాగమప్రముఖు లయిన మదాశయునిపురోహితు లమ్మణిశలాకం బట్టి చూచుచుఁ, దత్సంస్పర్శనమహత్త్వంబున నానందమగ్ను లయి రనుట చుంబనేచ్ఛానంతరంబున మీముఖంబులు నాల్గును మదీయాధరపానంబున నింపొందె ననుట గాదె! ఆముఖంబులు ఋగ్యజుస్సామాథర్వణప్రాదుర్భావకారణంబు లగుటను, మీయాత్మకు నధీనంబు లగుటను గ్రమంబునఁ బ్రథమాగమాదినామధేయు లైన మదాశయునిపురోహితు లంటిరి. అంతట నేను మీముఖచేష్టలచేత నధరపీడ జనించినఁ గోపించి వాని వారించి కౌఁగిట విడిపించుకొనిన నది కళాపూర్ణుండు తన తాల్చిన మణిశలాక యాబ్రాహ్మణులయం దొక్కరునిచేతఁ గొంత పీడితం బైనఁ గనలి వారిం బాయఁ దోలించె ననియుఁ, దశాస్వామి యైనమదాశయుని కనకప్రాకారంబు విఘటితంబు

నేయించె ననియుఁ బలికితిరి. అంత దేవరచిత్తంబు దృష్టి
సహితంబై సమ్ముఖంబును విడిచి పరిరంభవిశ్లేషప్రకాశితంబు
లైన యితరావయవంబులకుఁ బోయిన, సమ్మదాశయుండు
నిజభార్యాసమేతుం డగుచు నాకళాపూర్ణుసేవ విడిచి
తదాశ్రయం బైనయంగదేశంబునకుఁ బోయె నంటిరి. అట్లు
పోవునప్పు డెదుట నొదవిన పూర్ణకలశద్వయశుభనిమిత్త
దర్శనంబున నుబ్బుచు నేఁగి మధ్యదేశంబునం జిరనివాసంబు
గావించె ననుట వక్షోజయుగళసందర్శనంబున నానందింపుచు
నరిగి వలగ్నభాగంబు నవలంబించి తడవు నిలిచె నని పలుకుట
గాదె. ముఖంబుఁ బాయుట యాదిగాఁగ నధరేచ్ఛ
యడంగినఁ బ్రయాణక్షోభంబున మధురలాలస కృశత్వంబు
నొందె నంటిరి. అంత దృష్టిసహితంబుగా నీయాత్మ తిరిగి
సమ్ముఖంబునకు వచ్చుటయు, దానఁ జుంబనేచ్ఛ మగుడఁ
బరితుష్టి నొందుటయును, నది ముఖపానంబుచేత సఫల
మగుటయుఁ గ్రమంబున మదాశయుండు కుటుంబసహితం
బుగా మరలి కళాపూర్ణునిసేవకు వచ్చె ననియుఁ, దత్కార
ణంబున మధురలాలసకుఁ గృశత్వంబు మానె ననియును నవి
యౌవనంబునఁ గళాపూర్ణు [1]ననుగ్రహంబు వడసె ననియు
[2]నీకాముకత్వ సముచితవచనరచనలఁ దేటపఱచితిరి. ఇది
యంతయు నిట్లు యగునో, కాదో యానతీయవలయు ననిన
నతం డట్లు తప్పదని నగుటయు నతని యథార్థవాదిత్వంబు
నకు మెచ్చుచు నిట్లనియె. 46

1. పరిగ్రహంబు. 2. కాముకత.

*జనుదెంచు నిర్జరేశ్వరుని వెంటను రంభ
చనుదెంచి [1]భారతీసతిని గొల్వ
నంతఃపురంబుకక్ష్యాంతరంబులు గొన్ని
సొచ్చి యేతెంచి యచ్చోట నొక్క
పంజరంబునను మున్నటియట్ల వాగ్దేవి
భణితవిశేష మాత్మకు సుఖముగ
తే. నొయ్యనొయ్యన వర్తించుచున్న నన్నుఁ
జూచి దగ్గఱవచ్చి "[2]యీ సొంపు మిగులఁ
జిత్ర! మిది యయ్య వారిసంసేవవేళ
నమ్మవా రుగ్గడించిరో?" యనుచు నడిగె. 52
ఉ. ఏనును దాఁపురం బెఱుఁగ కేర్పడఁ జెప్పితిఁ బత్స్వరోదయం
బైన తెఱంగుఁ బత్త్రిభవ మైనకథాకథనంబు; నంతటన్
మానఁగ నీక యవ్విబుధమానవతీమణి ప్రేమతోడఁ బై
పై నడుగన్ వివేక మొకపాటియె చిల్కల కేమి నేర్పినన్. 53
ఆ. ఇట్లు చెప్పి యంత నే నవ్విలాసిని
పలుకు మనఁగఁ దొంటి కులుకుపలుకు
రెండుమూఁడుమార్లు వెండియుఁ బలుకంగ
నచటి కేఁగుదెంచె నజునియతివ. 54
వ. ఇట్లేఁగుదెంచి కనుబొమలు ముడుచుచు నన్ను నవలోకించి.
చ. తలఁకక యోసి యేమిటికి తల్ తలపెట్టినదాన విచ్చటన్!
తెలియము గాని నీవు వెనుద్రిమ్మరికూఁతలదానవే కదే!
బళిబళి యీవికారములు [3]బ్రాంతి! యవిఘ్నతఁ జాగిలంబడై
యిలఁ బయిఁబుట్టుమంచుశపియించెమనంబుననల్క హెచ్చఁగన్.

* నరుదెంచు. 1. భారతీశ్వరుని. 2. యా. 3. బ్రాఁతె.

క. రంభయుఁ దత్కోకపుసం
రంభమునకు వెఱచి యొక్కసత్ప్రమదయోగు
స్తంభముమఱుఁగున నొదిఁగె వి
జృంభితతద్రోషభాష [1]వినఁబడ నంతన్. 57

సీ. నలువ యేతెంచి "యెన్నఁడు లేనియింతకో
పంబులు కిదియేమి పడఁతి?" యనుచుఁ
దనభార్యఁ బలికె; న వ్వనితయుఁ గోపంబు
మించి శోభిలుమృదుస్మితముతోడ
"వినరుగా యీచిల్కవిధము మున్నుద్యాన
వనములో మన మాట వినినయట్టి
యాకథామాటు లాద్యంతంబు రంభతోఁ
జెప్పుచున్నది; యేను నప్పలుకులు
తే. వింటి నిపుడు వచ్చుచు గోడ వెనుక నిలిచి"
యనుడు "నది యేమి యెఱుఁగు? నిట్టియవృత్తిఁ
దిట్టుదురె?" యంచు సతిఁ బల్కి యట్టిదాని
గతికిఁ గుందెడునన్నంతఁ గరుణఁ జూచి. 58.

వ. "మీయస్మదాశంబునకు నాఁగా నన నెవ్వరికి నెట్లు వచ్చు? నది యనుభవించి తదనంతరజన్మంబున మదాశయుం డనుజగతీపతికి మధురలాలస యనం దనయ యై జనియించి కళాపూర్ణుం డను రాజునకు భార్య యై యనన్యసాధారణం బైన యైశ్వర్యభోగంబు [2]లనుభవించుచు సహజం బైనపరమ పాతివ్రత్యంబున సకలధర్మంబులు సాధించి కృతార్థ వయ్యెదు; విచారింపకు" మని వారిజాసనుండు పలికిన శారద యవ్వి

1. చెవిఁబడు. 2. నింపొందుచు.

ఘనిం జూచి "యిది యేమయ్యా! వెండియు మదాళి
యుంపును మధురలాలసయును గళాపూర్ణుండును నంచుఁ
బల్కుచున్నవారు; దేవరకు నిప్పుడు నవియ కలవరింతలై
యున్నయవియె?" యనుచుఁ బలికి నవ్విన నతండు "భవ
దీయవదనవర్ణనాసంబంధికథలయందు నాకుఁ గలవరింతలు
సంతతంబును గలుగుట నిజంబ. ఐన నివి యట్లు గాదు; మేదిని
మీఁద నింక గళాపూర్ణుం డనురాజు పుట్టఁగలం డతని కిది
పత్నియుఁ గాఁగల" దనుటయు "నేతత్కథ వినవలయు
నానతి" మ్మని సరస్వతి పల్కిన నిట్లనియె. 59

సీ. "కాంత ము న్విన్నయాకథ యాకథయ [1]నాఁగ
నందు వాచ్యంబు తోఁచినట్టిదాను
జాతిక్రియాదికసకలపదార్థవా
క్యార్థాంతరము లెన్ని యట్టియ యుండు
గలయవి; యిందుఁ బత్కథకంబు దేపంబు
పంకింప నొనరించెఁ బడసె నిలికి
ననునివి మొదలైనయట్టి భూతార్థంబు
క్రియలట్టిన నొనరించుఁ బడయు
తే. నిలుపు ననునివి యాదిగాఁ గలభవిష్య
దర్థవచనంబు లైన క్రియాపదంబు
లనుచుకొనుటయె వాపిమొందును దలంప
నోసుధాంశువిలాసప్రహాసివదన! 60

వ. మఱియు శ్రోతృజనాపేక్షానుసారంబునఁ దత్తన్నిమిత్తో
పాఖ్యానంబులచేత నిదియు కొంత విస్తారంబు నొందఁగల;

1. నమ్ము మందు.

నది చెప్పఁ బనియేమి ? ప్రధానకథాభాగం బింతియే.
కావున." 61

సీ. అనిన సరస్వతి యద్భుతం బంది యొ
 క్కింత విచారించి కాంతుఁ జూచి
"యీరాజనకు సుముఖాసత్తి యనునది
 తండ్రియు మఱి మణిస్తంభనాముఁ
డగువాఁడు పల్లియు నయ్యెదరే ?" యన్న
 "నం దేమి సందియం ? బదియు నీదు
చేష్టావిశేషంబు చేతన కాఁగల"
 దని బ్రహ్మ పలికె నయ్యబ్జముఖియు
తే. మిగుల నెఱఁగంది యంతట నగుచు "మీరు
సృష్టికర్త: లెట్లైనను జేయఁగలరు
మనికి వలసినయట్లు చేయుదురు గాని
వట్టికోడిమెలు నాకును గట్టఁ జనదు." 62

క. తలపెట్టుకుఁ డిఁక నెన్నఁడుఁ
గల నైనను మత్ప్రసంగకారణమున వ
ర్తిలినట్టి యీకథాస్థితి ;
యిల నిట్టిది గోరఁ దివియ నేతె పాఱున్. 63

సీ. మన మంత నేకతంబునఁ జెప్పికొనినట్టి
 కథ యిదే తోన యిక్కడను బుట్టె;
నింతమాత్రము గాక యిటమీఁద నీకథ
 పృథివిపైఁ గలుగఁ జెప్పితిర మీరు
"తొలుతన యిది బ్రహ్మవలన వచ్చిన యది"
 యనఁగఁ దమ్మూల మెయ్యదియొ ?" యనఁగ

"వాఙ్ముఖప్రతిబింబవర్ణన" మనఁగ "ని
ట్టిప్రసక్తి నిది సంఘటిల్లె" ననఁగ
తే. వచ్చె నగుఁబాట్లు నాకు మీవలన నాథ!
నన్ను మన్నించి యింకనైనను వదవక
మీర లూరక యున్న నెవ్వారు నంత
వినను గాన గుప్తంబు గావింపవచ్చు." 64

మ. అనుకంపైపయిమాటగాక యిది యూహాయాత్మశృంగారశో
భనలీలాయశ మేరి కప్రియము? నీపల్కుల్ మనోవర్తనం
బును నేకం బగు నేని నాలుకతుదన్ ముక్కంటికొమ్మావిలా
సిని యే నమ్మెద నంచు బ్రహ్మ నగిపించెన్ మేలమాటల్ సతిన్.

శా. ఘనయత్నంబుననవ్వడంచికొనుచుం గంజాక్షియున్ "నాథ యే
మనినం గోపము వచ్చుచున్నది సుఁడీ యత్యంతమున్ నన్నిఁకం
జెనకన్ రాకుఁడుచాలు నవ్వ"లని పైఁ జెంగొంతుమీఁదన్ నిజ
స్తనగుచ్ఛప్రతిమల్ల హల్లకదళోద్వృత్కంపుకం బంతటన్.

మ. అనయంబుంజలమొప్పఁగా మఱియు నాయబ్జాసనుం డట్లయా
డెను "మానుం డిది" యంచు వాణియును వేడెన్ జేరి తా
నొక్కచేఁ దను గంఠంబును గౌఁగిలించి యొకచేతన్ గడ్డమున్
బట్టి చెక్కునఁ జెక్కానుచు నొక్కచన్నున యురఃకోణం
బుతోఁ రాయఁగన్. 67

తరల. అతఁడు నేల పెనంగె దోజలజాక్షి! పల్కెటు లున్నని
క్కత ప్రకాశిత మాట నీమదిఁ గాంక్షితంబ యవశ్యమున్
క్షితిఁ బ్రసిద్ధము గాఁగ నున్నవిచిత్రసత్కథ నీ కస
మ్మతమె? యట్లగు నేని యేమహిమం బ్రసిద్ధత గల్గెడున్?

సీ. వివరింప సకలవస్తువుల ప్రసిద్ధి వా
గ్జాలమూలంబు వాగ్జాల పెల్లఁ
దద్వాఙ్మయం బిట్లుండఁ దరుణి నీమది కస
మ్మత మైనయట్టిది మహి వెలయునె?
యాకళాపూర్ణమహారాజుకథ తావ
కీనశృంగారలీలానిమిత్త
మగుచు మన్ముఖజాత మగుచు నవశ్యంబుఁ
గరము ప్రసిద్ధంబు గాఁగలయది
తే. నీకుఁ బ్రియ మని వేఱ వర్ణింప నేల?
నీ విప్పుడు పల్కు పల్కు స్వాభావికంబ
పతుల యనురాగలీల లేపగిది నైన
వెలయఁ గోరియు దాఁచు టింతులగుణంబు. 89

వ. అనిన విని యాభారతీదేవి యావారిజాసనుం జూచి "మీర లింతచలముకొని సమర్థింప నాకు నేఁ గాదన నేల! యదియునుం గాక యారాజు వాలాయంబుగా ధరణిం బుట్టఁ గలం డఁట రాజ్యంబునుం జేయునఁట యతనిచరిత్రం బెట్టును వెలయంగల దఁట యిది సిద్ధంబు దానిసంగడిన యస్మద్రహస్యకథ వెలయుటకు నియమం బే?" యనుటయు నతం "డిది మునుపును నది వెనుకయుం గా వెలయు" నని పలుక నక్కని వెలయుభంగు లెవ్వియో యెఱింగికొనవలయు; మీర లెక్కడఁ దడవకుండుం" డని ప్రార్థించి "నుడువ" ననిపించుకొని నన్నుఁ గనుంగొని "యిది యిప్పుడు వారాంగనాజన్మంబునఁ బుట్టనున్నయది; యందు నేతద్బోధశంక నెఱయ లే" దని పలికి "రంభ యనునది యిప్పు డెందుఁ బోయె? దానికిఁ దగిన

బుద్ధి చెప్పవలయు" ననుచు నప్పుడంతి గడగడ వడంకుచుఁ గంబంబు మఱుంగు వెడలి వచ్చియసుగుడు కౌఁగిన" లే లెమ్ము నీ వీకథ యొక్కఁడం వదవిన నాలా గెఱుంగుదు గద!" యని పలికిన నలువ నగుచు "నీలాగు మఱి యెవ్వరు నే మెఱింగ దరు! ఈకథ యింకఁ జెప్పినట్టివారును వినినట్టివారును ధాత్రి యందుఁ బుత్రపౌత్ర ప్రపౌత్రాదిబహుసంతతిఁ దనర్చుచుఁ జిరకాలంబు ప్రచురసంపదభివృద్ధిశోభిత శుభసౌఖ్యంబులు గాంతు రిదియంతయు నావశ్యకంబుగ మదీయాశీర్వాదం" బని పల్కెన. 70

చ. సతి పతిఁ జూచి "మీచలము సాగినఁ జాలును మీర లన్నప
ద్ధతియ కదర్ నిరర్గళ ధాత్రిఁ బ్రవర్తిలనిం" డటంచు నిం
పతిశయిలంగ నవ్వె నపు డచ్చటు వాసి "తదాజ్ఞ నేను సి
క్షితిపయి ద్వారకాపురిని జెందితి జన్మము వారకాంత నై."

క. అని యాజన్మంబునఁ గల
తనవర్తన మింతకయును దప్పక యుండన్
వినిపించి విచిత్రజ్ఞా
ననిధానము శిశువు రాజునకు ని ట్లనియెన్. 72

క. కలభాషిణి యను పేరన్
వెలయుచు నే వాణిశాపవిధిఫల మాఱీ
లలఁ గడప నొకదె నంతట
నలినజువదయోక్తి ఫలము నా కీతను వై. 73

తే. శక్తి గుడిలోనఁ బ్రాగ్జన్మసమయమునను
నాకు నిద్దివ్యహారసంవర్ణనంబు

కలిమి వింటి గదా యది తలఁచి యిపుడు
"క్రమ్మఱంగ రెండేండ్లకుఁ గంటి ననుట." 74

వ. అని చెప్పిన. 75

క. అలరుచుఁ బ్రమదాశ్చర్యం
బులు మనమునఁ దనర వినయమున నుత్థితుఁ డై
యలఘువ్రతుఁ డాబాలిక
కిలఁ జాఁగిలి మ్రొక్కి లేచి యిట్లని పలికెన్. 76

క. "తొలుతటిజన్మమునందును
గలభాషిణి యనఁగఁ బరఁగి కావించిననీ
యలఘుచరిత్రలలో నా
తలఁపున నొకవర్తనంబు దార్కాణయ్యెన్." 77

తే. అనుడు "నీ కేమి తార్కాణ యయ్యెఁ జెప్పు"
మనుడు నానృపుఁ డడుగ నయ్యతివవలనఁ
దగఁ గళాపూర్ణువినినచందము జపంబు
తెలఁగు నాసభఁ బడినరీతియును జెప్ప. 78

ఉ. చెప్పి యతండు బాలికకుఁ జేతులు మోడ్చుచు "నీదువాక్యముల్, దప్పవ యెందు నామధురలాలస వైనవిధంబ యిప్పుడీ యొప్పిక నీకు నాథుఁడుగ నున్నమహామహు నానృపాలు నా, కెప్పుడు చూడఁగాఁ గలుగు? నింతయుఁ జెప్పుము నీవె" నావుడున్. 79

ఆ. "క్షితిసురవర్య! యేను జెప్పిన నీక లెస్స
యుండ దది యెఱింగి యున్నవారు
వీర లెల్ల నడిగి వీరు చెప్పఁగ వినుఁ"
డనియె శిశు వతండు నాదరమున. 80

తే. ఆసభాపతిఁ జూచి "యాయమ్మ యాడు
పలుకు వింటి నృపాల! యేర్పఱుపవలయు
నాకు మీపేళ్లు మీవర్తనములు నేత
దీయనామవర్తనములుఁ దెలియఁ బడఁగ. 81

మ. ఇది యేలోకమొ? యేపురంబొ? మఱి మీ రెవ్వారొ? యీ
బాల యెట్టిదియో? యేమియుఁ గాన కెంతయును నా
డెందంబు విభ్రాంతతన్, జెదరన్ బ్రాన్పడి యున్నవాఁడఁ
దెలియం జెప్పించుకో వేళ గల్గద యిందాఁకను దత్కథా
కథనలీలాభవ్యవైచిత్రి చేన్." 82

సీ. అనుడు నజ్జనపాలుఁ "డట్లయా వేళ గ
ల్గద యన్నమాట నీకతయు నాకు
నమరఁగఁగ నెడ లేద యంతకంతకు నద్భు
తపుఁగథ లోదవ నిందాఁక ననఘ!
వింటిమి కొంత నీవృత్తాంత మిపుడు మా
విధ మింకఁ జెప్పెద వినుము తెలియ
నేఁ గళాపూర్ణుఁడ నివి స్వభావాఖ్యఁ డి
చ్చినయట్టిమణియును సింగిణియును

తే. నమ్ములును వీరు ప్రథమాగమాదులైన
యట్టినలువురు మఱి సత్త్వదాత్మఁ డాతఁ
డాతఁడు మదాశయుండు రూపానుభూతి
యల్లయది యాకెబిడ్డ యీయరిదిశిశువు. 83

చ. తనగుఱుఁ డమ్మదాశయుఁడు తప్పక యట్లు మమున్ [1]భజించి
మున్, చని చనుదెంచినాఁ డిపుడు నాకడనుం దనూ నట్లు

1. త్యజించి.

'నాదుద,ర్శనమున సేద దేఱె' నని జాయయుఁ దాను ముద
ద్భుతంబులన్, దనరుచు నిల్లు ముంగట నగం డిడినాఁడు
పసిండితోఁ జైత్రోన్. 34

వ. దీనిపేరు మధురలాలస యనం బరఁగు నని యామాపేళ్ల
వారి నందఱం జూపి చెప్పి, యిది యంగదేశంబు నగు; నీ
పురంబును గ్రముకకంఠోత్తరనామధేయంబ; నే జనియించి
నదియుఁ గాసారపురంబ; యది యిచ్చటికి కనతిదూరంబున
నున్నయది; యిన్నియుం జెప్ప నేల? వెరసిమాట యొకటి
కల దని యిట్లనియె. 35

సీ. "అజుఁడు వాణికిఁ జెప్పినట్టియాకథలోని
వారిపేళ్లును వారివర్తనంబు
లొకటియుఁ దప్పక యుండ మాపేళ్లును
మావర్తనములు నై పదికి మిగులఁ
బరమాద్భుతం బొనర్పఁగ శారదావద
నప్రతిబింబాదినామకర్తృ
కల్పనాకేళిప్రకారమాత్రము లైన
యస్మదాఖ్యానక్రియాళికముల
తే. తోడ నెందు నొకింత విజ్జోడుపడక
పము మగుట యెట్లొ? యనువిచారము గలిగియు
నమమఁ దత్కథలకును విఘ్నంబు సేయఁ
జనమి నూరక యుంటిమి వినుచు నేము. 36

క. అంతటఁ దత్కథ తుదవృ
త్తాంతముచేఁ దీఱె మాకు నాసందేహం

బంతయు" ననుటయును మహీ
కాంతున కిట్లనియె నతఁడు గడుఁ జోద్యమునన్. 87

తే. "అజుఁడు చెప్పినకథలోనియట్ల తండ్రి
యాఁడుమానిసియును మగవాఁడు దల్లి
యునె మహీపాల నీకు ? నా యుల్లమునకు
నిది వెఱఁ గొనర్చుచున్నది యెఱుఁగఁ జెపుమ." 88

క. అన నాకును దద్వాక్యం
బనయము చిత్ర మగుచున్నయది యాశిశు నా
త్మ నెఱుంగనియది లే దీ
యనుభావము చూడ నడుగు మది దెల్పఁబడన్. 89

క. ఆవాక్యము నీబాలిక
యావనఫలకథయు నవిదితార్థము లిందుఁ
భావింప నొకటి పొసఁగుఁ
భావి యగుటను మొదలిది వినం దగుఁ దెలియన్. 90

వ. అని యారాజచంద్రుండు పలికిన. 91

క. అలఘువ్రతుఁ డపుడు కృతాం
జలి యై యాశిశువుఁ జూచి "సర్వము నీకుం
దలఁపఁగ విదితమ యీభూ
తలపతిజన్మము తెఱంగు దయఁ దెలుపఁ దగున్. 92

వ. మున్ను నీకారణంబుననీకళాపూర్ణకథాకర్ణనఫలమహత్త్వంబు
వింటిఁ; బదంపడి యిట్టినాజపంబునకు ఫలంబైన యితని కథ
వినికియు నీకృపనే కలిగె; నంతమాత్రంబును గాక యీ
కల్యాణచరిత్రుని ప్రత్యక్షంబు చూడఁ గంటి; నత్యద్భుతం
బైన యీతని జన్మప్రకారంబును సవిస్తారంబుగా నాకి

యిచ్చి నన్నుం గృతార్థునిఁ జేయు" మనిన నమ్మధురలాలస యిట్లని వినిపించె. 93

సీ. "భూవిబుధోత్తమ నీవు మృగేంద్రవా
హన గేహమునకు మున్నట్లు వచ్చు
నపుడు మణిస్తంభుఁ డనుసిద్ధుఁడును సుము
ఖాసత్తి యనియెడు నతనిసతియు
నాతోడిసంభాషణమున వర్తిలుచుండి
రెఱుఁగుదుగద! యని యేర్పడంగఁ
నత్పూర్వవృత్త మంతయుఁ దెల్పి యిట్లను
వారలు యోగప్రవర్తనమున
తే. నమ్మహాశక్తిభవనంబునంద కొన్ని
నాళ్లు విజితేంద్రియతఁ బ్రవర్తిల్లుచుండి
రదియు నీకును దెలిసినయదియె; యంత
వారచటు వాసి చని యొక్కవనములోన. 94

తే. రతి [1]సలిపి రందు సిద్ధుఁ "డోయతివ! నీవు
పురుషుఁడవుగమ్ము నారీత్వమును భజింతు
నే" ననుచు విపరీతరతేచ్ఛఁ బలికెఁ;
బలుకుటయు నాదరమున నజ్జలజముఖియు. 95

క. "స్త్రీత్వము నీ వొందుము పురు
షత్వము నేఁ దాల్తు" నని నిజప్రియుఁ బలికెఁ
సత్వరత నట్లు వారల
స్త్రీత్వము పురుషత్వము విపరీతము లయ్యెన్. 96

వ. అప్పుడు. 97

---

1. సలుపుచుండి.

మానినీవృత్తము:—
ఎక్కడనుండియొ కల్గెను సిద్ధన
క్షేమఱుపాటు కృశోదరముక్
జొక్కపుగుబ్బలు గొప్పపిఱుందులు
సోగకనుంగవ యొప్పిదముక్
చక్కనిముద్దుమొగంబు నితాంతల
సత్కబరీభరవైభవముక్
మిక్కిలి కోమలమైనశరీరము
మీఱఁగ నాఁడుఁదనంబుపసల్. 98

ఆ. చాల నద్భుతముగ నాలలితాంగియు
ధవునిరూపొకింత దప్పకుండఁ
బూనె నాక్షణంబ నూనూఁగుమీసలుఁ
గుఱుచపల్లజడలుఁ గొమరు మిగుల. 99

ఆ. [1]నలువు గిలువు సంపతులకొకప్పుడు దఢం
బడును గాని యెట్టియెడల నిట్లు
జగతి నాఁడుఁదనము మగతనమును దశం
బఱచుకొనుట యెందు నెఱుఁగఁబడదు. 100

తే. స్త్రీత్వపురుషత్వదశ లిట్లు చెందువేళ
వారి కొండొరులపై దృష్టి వర్తిలుటను
దొరకె నొండొరుచూపు లొండొరుల కట్లు
భావనయె ప్రధానం బెట్టిపట్ల నరయ. 101

ఆ. అమ్మెయిం బరస్పరాకృతివ్యత్యయం
బగుటఁ జూచికొని మహాద్భుతంబు

1. నలపు గిలపు.

హృదయముల వహించి లిది యేమి మాయయో
కో! యటంచు వారు గొంతదడవు. 102

సీ. అంతట నాసుముఖాసక్తి యాత్మలోఁ
దన్నిమిత్తంబును దాఁ దలంచి
తననాథువదనంబుఁ గనుఁగొని "యిప్పు డే
ననినట్టిమాట మహత్త్వమ యిది;
తప్పదు మును జరత్కారుయ మే నలశక్తి
సన్నిధి వీడ్కొనుసమయమునను
నను సత్యవచనఁగా నొనరింప నాయమఁ
బ్రార్థించితిని; వృథ యై చన దది
తే. శాసనస్తంభలిపిరీతిఁ జర్చసేయ"
ననిన విని "యింక నేమియు ననకు; మెద్ది
యాడఁబోవఁగ నెట్లౌనొ?" యనుచుఁ బలికె
నమ్మహీస్తంభుఁడు భవిష్యదర్థవశత. 103

వ. ఇట్లు పలికి వెండియు ని ట్లనియె. 104

తే. "నీకు గర్భంబు గాకుండ నాకు నాకుఁ
గొడుకు నీకూటమిని గలుగుటకు నీకు
వరము లిచ్చినయవ్వాణివాక్య మెట్లు
ఫలితముగ నున్నదియొ? యెందుఁ బదరఁ జనదు. 105

చ. అదియును గాక యంగనల కంగజసంగరకేళికావిశే
షదశలయందు నెక్కుడఁటసౌఖ్యగతుల్ మగవారికంటె! నా
కిదియు నెఱెంగికో నిపు డభీష్టము; గావున నిట్లయుండఁ గో
రెదనొకకొన్ని నాళ్లు;విహరింపుమునీవును బూరుషాకృతిన్."

వ. అనిన విని సుముఖాసత్తి "యోయనఘ! నీ వేరూపంబున నుండుమన్న నీదువాక్యంబు నాకు వేదవిధిసమానంబగు గావున నీపల్కినయట్ల చేసెద" నని తదుక్తప్రకారంబునఁ దన పురుషరూపంబుతోడ నడపుచుండె; మణిస్తంభుండును నట్టి నారీరూపంబున మదనక్రీడలు సలుపుచుండె; నప్పుడు తమ సుముఖాసత్తిమణిస్తంభనామధేయంబులు స్త్రీత్వపురుషత్వంబులవెంబడిన వీడ్పాటుగా సంకేతంబులు చేసికొని రంత నాకృత్రిమవనిత తన పురుషుండును దానును నానా విహారయోగ్యంబులైన యారామప్రదేశంబులు చూచు వేడ్కఁ దన సింహంబు నాకర్షించి తదారూఢులై దాని యథేష్టసంచారవేగంబునకు సంతసిల్లుచు నంతరిక్షంబునం జరియించుచుండి యెదుట నొక్క పురంబుఁ గని తన హృదయవల్లభున కిట్లనియె. 107

క. "పుర మల్లదె యేద్భుతగో
పుర మై వరణమిషలసితపుణ్యస్త్రీనూ
పుర మై విభవములకుఁ గాఁ
పురమై శోభిలెడు నగ్రమునఁ గనుఁగొంటే. 108

చ. కలకలహంసపారసబకప్రముఖాంబువిహంగమండలీ
కలకలనాదలీలఁ దనకైరవతామరసాదిలక్ష్మి జో
కల కలమానసాభ్యుదయగౌరవముల్ సరిరా వటంచుఁ దాఁ
గలకల నవ్వుచున్నపరిఖావలయంబువిధంబుఁ జూచితే. 109

క. ఈరమ్యపరిఖనడుమక్ష
సారపుశృంగములతోడ సాలము పద్మా

శారత నొప్పఁగ నిది కా
సారపురం బంద్రు గొలనిచాఁప్పన నునికిన్. 110

క. తోరణము లింద్రధనువుల
తో రణము లొనర్ప నొప్పు తోరపుఁబురముల్
సారపురీతుల నీకా
సారపురీతులకు రావు చర్చింపంగన్. 111

ఉ. తోరపువస్తుసంపదలతో రమణీయత నొప్పు నిప్పురం
బోరమణుండ రత్నఖచితోజ్జ్వలసౌధవిహారిణీసక
ర్పూరసువీటికారుచిరభూరిసుగంధసమేతవాతసం
చారకృతావిదూరసురసంప(స)దపూర్వమనఃప్రమోద మై.

క. ఇచ్చోటికిఁ దొల్లియు నే
వచ్చి యెఱుంగుదును; దీని వైభవమహిమం
బచ్చెరు; విందు వసింపఁగ
నిచ్చ యగుచు నున్న యది యధీశ్వర! నాకున్. 113

క. అని పలికి యంతటను "దీ
నిని దిగవలయు" నని యపుడ నేలకు డిగ్గం
బనసింహవాహనముఁ బ
ట్టి నిజేశుఁడుఁ దాను దాని డిగి నడచి చనన్. 114

వ. అప్పట్టణం బేలురాజు సత్త్వదాత్తుం డనెడువాఁడు వాహ్యా
ళిం బోయి తిరిగి యరుగుదెంచుచు నాపూవుఁబోఁడి రూపలా
వణ్యంబు లాపోవక నిర్నిమేషుండై నిరీక్షించి తన మనంబున.

క. "ఒంటనిరాజుల కప్పము
గొంటిఁ మే లేర్చి కలికిగుబ్బెతలను; వా

రింటఁ గల; రంతకంటెను
గంటికి నిం పైనవాలుఁగంటికా గంటిన్. 116

క. అనరాదు కాక నాయిం
టన కా దిటువంటిచెలువ నాకంబునఁ గ
ల్గునె ? చెప్ప నేల సకలా
వనితలనాయకులయిండ్ల వనితలసుద్దుల్ ? 117

క. ఆసిద్ధుని సంబంధం
బీసౌందర్యైకనిధికి నేరీతినొకో !
దోసం బిట్టటు భావన
చేసినఁ దెలియుదము వారు చెప్పిన నింకన్. 118

మ. అని చింతింప యదృచ్ఛ నచ్చెలువ తన్నావేళ నీక్షించినన్
ఘనసైన్యంబులు గొంత మించఁ దనతుక్ఖారంబు తేజీఁ జివు
క్కున దాఁటించి కుదించి [1]చిత్తరువుబాగుల్ మీఱ నాడించె
శో,భనతద్వల్గనవల్గదగ్రిమచుచిస్ఫాయత్కిరీటంబుతోన్. 119

వ. ఇవ్విధంబున ఘోటకంబు నొక్కింతవడి యిట్టట్టు ద్రొక్కించి
యాఁకించి కించిదుదంచితరత్నకంకణక్రేంకారంబులు కంద
ళింపఁ గందం బప్పళించుచు నిలిపి యప్పుడు. 120

సీ. కేయూరమాణిక్యకిరణముల్ మెఱయంగఁ
జెలికానిమూఁపునఁ జేయి చేర్చి
రత్నాంగులీయకప్రభ పేరెములు వాఱఁ
గేలిపద్మంబుఁ గెంగేలఁ ద్రిప్పి
లలితదంతాగ్రకాంతులు [2]వాలంకఁగదండ
ధరునితో రిత్తమంతనము నడపుఁ

1. చిత్తరపులాగుల్. 2. దాలంకఁ గరంక.

దెలినప్పుడాలు ముత్తియపుంజొకట్లఁ బెం
    చఁగ నర్మసచివుతో సరస మాడు

తే. మణికిరీటంబు [1]చాలించి మగుడ దిద్దఁ
దళుకుఁగొనగోర మీసలనులి [2]యెడల్చు
నాచకోరాక్షి తనుఁ జూచు టరసి యరసి
భావజవికారములు కడుఁ బరిఢవిల్ల. 121

ఉ. కంతువికార మాకరణి గాటముగాఁ దనయందు బ్రస్ఫుటా
క్రాంతిగ నున్న చో నొకఁడు కానుక యిచ్చినపూవుబంతి బా
హాంతరసీమ నద్దుకొని యామృగలోచనఁ జూచె దాన న
క్కాంత యొకింతజాలుచనుఁగప్పు ఘటించుచు మోము
వంచఁగన్. 122

వ. అంత నశ్వంబు డిగ్గి తా నొక్కరుండ యాసిద్ధునిఁ జేరంబోయి
"మహాత్మా! మీర లెచ్చటనుండి వచ్చితి? రెందుఁ బోవుచున్న
వారు? మీనామధేయంబు లెవ్వి? యివ్వనిత నీ కేమి యగు?"
నని యడిగిన నతండు తమ వచ్చినతెఱంగు చెప్పి "యే మణి
స్తంభుం డనువాఁడ; నీపూఁబోఁడి సుముఖాసత్తి యనుపేరం
బరఁగు" నని పలికి యది తన భార్య యని యెఱింగించిన, నీ
కురంగలోచన యేతెఱంగున నైన నసన్నిధి నున్నం జాలు నట
మీఁద భాగ్యవశంబున నైన నయ ట్లయ్యెడుఁగాని" యని చిం
తించుచు నతం డతనికిఁ గపటవినయంబునం గృతాంజలి యై.

చ. "హృదయము రంజిలంగ మిము నెంతయు భక్తిని గొన్ని
నాళ్లు మా,సదనమునందునుంచికొని శక్త్యనుసారకృతోపచా

1. జాలించి. 2. యడల్చు †.

రసం,పసఁ బరిచర్య సేయుటకు మామది నున్నది వేడ్కమీఱ
ర్లే, తదభిమతం బొనర్చు టుచితంబు మహాత్మక సిద్ధశేఖరా!

క. అనిన మణిస్తంభుం డం
గనవదనముఁ జూడ "నట్ల కాని మ్మెందుం
డిన మన కేమీ?" యని భ
ర్తను బలికెఁ నగుచు నాకురంగేక్షణయున్. 125

క. ఆరీతి ననుమతించిన
వారలఁ దోడ్కొనుచుఁ జనియె వసుధావరుఁ డిం
పారఁగ నవమణిమయశిబి
కారూఢులఁ జేసికొని నిజాలయమునకున్. 126

తే. ఇట్లు తోడ్కొని చని కరం బింపుమీఱ
నట్టి మణిగేహములఁ బైఁడిపట్టెమంచ
ములును సొమ్ములఁ బరిమళమ్ములును జేటి
కాజనంబులఁ గడు నధికముగ నిచ్చె. 127

క. ఇచ్చి పలుమాఱు వారల
నచ్చటికిం జని వినీతుఁడై కొలుచుచుఁ దా
నచ్చెలువను దనయొద్దకు
వచ్చుట కడిగించెఁ దగినవారలచేతన్. 128

ఆ. ఆలతాంగియుఁ దన కప్పటి కొక్కింత
గర్భజననశంక గల దటంచుఁ
జెప్పి "సిద్ధసుతుని సిద్ధున కీక యేఁ
గలయ నన్న" ననుచుఁ గడపి పుచ్చె. 129

క. ఆవారిజముఖి కంతన్
వేవిళ్లుదయించెఁ జిక్కె నెమ్మేను గనన్

భావము మృద్భక్షణవాం
ఛావర్తనఁ జెందె గర్భసంసూచనగాన్. 130

కవిరాజవిరాజితము.—

కడుఁ గృశమైనసనాభిని మధ్యముఁ
గన్గొని కన్గొని యేమొ బలం
బెడలఁగఁ జిక్కెఁ గరం బపు డంగము
లెల్లఁ దదీయకృశత్వము వోఁ
గడఁగుటయుం బొదలెన్ గఠినం బగు
కాంతచనుంగవ మున్నును దా
బడలదు తత్పరిపుష్టితఱిం గను
పట్టె మొగంబుల [1]న ల్పొదవన్. 131

మ. కడుఁ దోరంపుఁబయోధరంబుల మొనల్ గప్పారు సుంబర్వ్వన
ప్పుడు తద్వక్త్రసుధాంశుబింబ మనయంబుం బొంకరశ్రీ
గనం,బడియెన్ గార్తికపూర్ణిమాతిథిబలెన్ "భావించినాడ●
గ నె,య్యెడలన్ స్థానగుణంబునం గలుగవే యేమేనియుం
జిత్రముల్." 132

తే. అంతఁ గడుఁ గౌను వొదలె రత్యాశ వదలె
వళులు విరియంగఁ బాఱెఁ బేరలఁత మీఱె
నాభి వికసించె గతులమాంద్యంబు మించె
సతికిఁ బ్రొద్దులనెల చొచ్చె జడత హెచ్చె. 133

క. ఈరాజోత్తముఁ డంతట
నారమణికి నుచ్ఛవిల్లె నైమ గ్రహంబుల్

1. నవ్వొదవన్.

సారగుణాత సుచ్ఛస్థా
నారూఢిం దనర భవ్య మగులగ్నమునన్. 134

సీ. సకలదిక్కులును బ్రసన్నతఁ గాన్పించెఁ
జలువనెత్తావిగాడ్పులు చరించెఁ
గుసుమవర్షంబు లోకుల కద్భుతము చేసె
శుభలీల దివ్యదుందుభులు మ్రోసె
సర్వామరులజయశబ్దముల్ విలసిల్లెఁ
బరఁగఁ బ్రేతాగ్నులుఁ బ్రజ్వరిల్లెఁ
బరమసాధుజనంబు భావంబు లుప్పొంగెఁ
గలుషచారిత్రులబలిమి క్రుంగె

తే. శౌర్యగాంభీర్యధైర్యసౌజన్యనీతి
సత్యకీర్తిప్రతాపాదిసకలసుగుణ
పుంజరంజిష్యమాణభూభువనుఁ డగుచు
నిమ్మహారాజవరుఁ డుదయించినపుడు. 135

వ. బ్రహ్మదేవుం డితని తల్లిదండ్రులకు నాగంతుకంబు లైనవర్త మానస్త్రీత్వపురుషత్వనామధేయంబులు చూడక సహజ స్త్రీత్వపురుషత్వనామధేయంబు లవలంబించి యవ్విధంబున నివ్విభునకు మణిస్తంభుండు తల్లి యనియు, సుముఖా సత్తి తండ్రి యనియుఁ బలికిన వాఁ డతని వాక్యం బున కన్యథాభావశంక గలదే? యమ్మణిస్తంభుండు పుత్రో దయం బైనయనంతరంబ తన తొల్లింటి మగతనంబు తనకును, సుముఖాసత్తియాఁడుఁదనంబు సుముఖాసత్తికిని గలుగునట్లు లాయమచేతం బలికించి యాభార్యయుం దానుఁ దమ తమ పూర్వనామధేయంబులతోడన తియగ యోగాభ్యాసభాసురు

లగుచుఁ గాసారపురంబునన యున్నవార; లీరహస్యంబు వారివలనం దార్కాణగాఁ దెలియవలసినఁ దెలియుం" డని పలికి యి ట్లనియె. 136

ఉ. "ఎప్పు డితండు తల్లి కుదయించెఁ గరంబు విచిత్రలీలవై
నప్పుడ కల్గె యౌవనము; యౌవన మెప్పుడు గల్గె నిచ్చెఁ దా
నప్పుడ వచ్చి యొక్కమణి యమ్ములు విల్లు స్వభావసంజ్ఞతో
నొప్పెడుసిద్ధుఁ;డిందుఁ బ్రథమోత్తరభావముఁగాన రెవ్వరున్.

సీ. అంత గళాపూర్ణుఁ డనునాము మితనికి
నిడియె నాసిద్ధలోకేశ్వరుండు;
అప్పుడ తత్పట్టణాధీశుఁ డితనిస
ద్యోయౌవనాదిమహోన్నతి విని
"యితఁ డెవ్వఁడో మహాద్భుతవైభవుఁడు; దివ్య
పురుషవర్యుండు గాఁబోలు! నితని
తల్లి నే నితరసాధారణంబుగఁ జూచి
కామించి పాపంబుఁ గట్టుకొంటి;

తే. నిది మఱవఁ జేయఁ దగు నేమి యిచ్చి యైన?"
ననుచు నాసాధ్వికడ కేఁగి "యమ్మ! మిమ్ము
నెఱుఁగ కొనరించినట్టినాయొగ్గు లెవ్వి
గల్గినఁ గృపార్ద్రచిత్తవై కావు" మనుచు. 138

వ. తత్ప్రియంబుగా నితనికి నిజాధిపత్యం బెల్ల సమర్పించి తాను మంత్రియై కొలిచియుండె" నని చెప్పిన నలఘువ్రతుం డా బాలికం జూచి "స్వభావుం డనఁబరగు నాసిద్ధుఁ డెవ్వఁ? డేమికారణంబున నమ్మణియు శరచాపంబు లితనికిఁ దెచ్చి యిచ్చె?" నని యడిగిన నది యి ట్లని చెప్పె. 139

సీ. "ఓవిప్రవర! యాస్వభావాఖ్యసిద్ధుండు
విను సుముఖాసత్తిజనకుఁ; డాతఁ
డాపుత్త్రి జనియించినట్టిపిమ్మటఁ దన
కాంతను విడిచి దేశాంతరి యయి
తిరుగుచు మాహురీపురమున కేతెంచి
యందు దత్తాత్రేయు నిఖిలయోగ
విద్యారహస్యకోవిదు మహామహుఁ దప
శ్చర్యచేఁ దనకుఁ బ్రసన్నుఁ జేసి
తే. కనియెఁ దత్కృపచేత యోగప్రకార
ములు సమస్తంబు ; తద్యోగవిలసనమున
భావ మెప్పుడుఁ దనయందుఁ బాదుకొలుపు
చునికిఁ జేసి స్వభావాఖ్య యొనరఁ దాల్చె." 140
ఆ. అనుడు వినయ మొప్ప నలఘువ్రతుండు కే
ల్మోగిచి "సకలబోధములకు నిధివి ;
నీ వెఱుంగనియవి లే వెవ్వి ; యోగముల్
చెప్పవలయు" ననిన శిశువు పలికె. 141
క. "విమలాత్మక! వినుము ప్రశ
స్తము జీవాత్మపరమాత్మసంయోగము యో
గ మనఁ; దదంగము లెనిమిది
క్రమమున వినిపింతుఁ దత్ప్రకారము దెలియన్. 142
వ. ఆయోగాంగంబులు యమనియమాసనప్రాణాయామప్రత్యా
హారధారణధ్యానసమాధు లనం బ్రసిద్ధంబులై యుండు ;
నందు నొక్కటొకటి యనేకభేదంబు లగు, నవి యెఱింగిం
చెద వినుము. 143

మ. యమములు సత్యదయాక్షమాధృతి మితాహారార్జవ బ్రహ్మచ
ర్యము లస్తేయ మహింస శౌచ మన నొప్పారుణ్ ధరిత్రీసురో
త్తమ, యందుణ్ దశభంగు లైపరగు ల బాధంబెట్ట కింపారు బో
కమిసత్యంబుపరార్తికోర్వమిదయాఖ్యాజెంపుమీఱుంగడున్.

క. వినుమొదలతప్పులెందుం
గనలక సైరించి యునికి క్షమ యనఁ బరఁగుణ్;
ధనబంధువియోగాదుల
మను హృదయము కలఁగమికిని గొఱలు ధృతి యనన్. 145

క. ఎనిమిదికబళంబులు యతి;
కినుమడి వనవాసి; కతని కినుమడి గృహికిణ్;
విను లఘుభోజన మితిగల
కనఘు! మితాహార మనఁగ నభినుతి కెక్కున్. 146

తే. విహితకర్మంబు లెందుఁ గావించునెడల
మఱినిషిద్ధకర్మంబులు మానునెడల
వాఙ్మనఃకాయకర్తృకవర్తనంబు
సూవె యార్జవ మన మహీసురవరేణ్య! 147

సీ. సన్న్యాసికిని బ్రహ్మచారికి నైష్ఠికుం
డగువనస్థునకు నోయనఘచరిత!
స్త్రీసంగమంబును ద్రికరణంబులయందు
నొకయప్పుడును జేయ కునికి బ్రహ్మ
చర్యంబు; ఋతుకాలభార్యాభిగమనంబుఁ
దక్కిన [1]చోట్లతోఁ బద్విహార

1. చోటులఁ.

మును మానుటయు గృహస్థునకును బ్రహ్మచ
ర్యం; బింక నస్తేయ మనఁగ నెందుఁ

తే. చౌర్య మెఱుఁగమి; యెప్పుడు నేజంతువులకు
నెగ్గొనర్పక యునికి యహింస యనఁగ;
శౌచమును రెండు తెఱఁగు లై శాస్త్రములను
బాహ్యమును నాంతరంబు నాఁ బ్రణుతి కెక్కు. 148

ఆ. అందు బాహ్యశౌచ మనఁగ మృజ్జలములఁ
జేయఁబడినయది ప్రసిద్ధి కెక్కు;
నాంతరం బనంగ ననఘధర్మమున న
ధ్యాత్మవిద్యచేత నయినశుద్ధి. 149

క. విను నియమంబులు పది తప
మును సంతోషాస్తికత్వములు దానేశా
ర్చన సిద్ధాంతశ్రవణము
లును హ్రీయును మతి జపంబులును వ్రతము ననన్. 150

తే. కృచ్ఛ్రచాంద్రాయణాదిక క్రియలఁ గాయ
శోషణము సేత తపము; సంతోష మనఁగ
నెప్పు డేమి లాభము గల్గె హృదయవృత్తి
నదియ చాలు నం చునికి సు మ్మనఘచరిత! 151.

క. విను పుణ్యపాపములు గల
వనియెడువిశ్వాస మెద్ది యది యాస్తిక్యం
బనఁ బరఁగున్ న్యాయార్జిత
ధన మర్థుల కొసఁగు టొప్పు దానం బనఁగన్. 152

క. ఈశార్చన మన హరిఁ బర
మేశుం బూజించుటయును నెపుడును రాగా

వేశాన్యృత హింసాప్రము
ఖాశంకలు లెనిహ్మృద్వచోంగస్థితియున్. 153

సీ. అనఘాత్మ! వినుము సిద్ధాంతశ్రవణ మన
వేదాంతశాస్త్రంబు వినుచు నునికి;
వైదికలౌకికవర్తనలకు దూర
మగునింద్యకర్మంబునందు లజ్జ
యెయ్యది యది సుమ్ము హ్రీశబ్దవాచ్యంబు
విహితసదాచారవిధులమీఁది
శ్రద్ధ మతి యనంగఁ బ్రస్తుతి కెక్కును
వేదబాహ్యము గాని విమలమంత్ర

ఆ. మును గురూక్తమార్గమున జపించుటయు న
ధీత మగుశ్రుతిస్మృతీతిహాస
ముఖ్యవాఙ్మయంబు మునుకొని యావర్త
నంబు సేఁత జప మనంగఁ బరఁగు. 154

క. వినుము విశిష్టాచారం
బును ధర్మప్రముఖనిఖిలపురుషార్థకరం
బును నగునుపవాసాదిక
మనఘాత్మక! సుప్రసిద్ధ మగు వ్రత మనఁగన్? 155

క. ఈయమనియమంబులు గల
ధీయుతుఁ డధికారి వసుమతీసురవర! ని
శ్రేయసకరాసనప్రా
ణాయామాద్యుత్తరప్రయత్నంబులకున్. 156

వ. ఆసనంబు లనేకభేదంబులం బ్రవర్తిల్లు నందుత్తమంబులయిన కొన్నింటిని వివరించెద. 157

క. విను జానూర్వంతరభా
గనివేశితపాదతలుఁడుఁ గడు ఋజుకాయుం
డును నై కూర్చుంటు యో
యనఘాత్మక! వెలయు స్వస్తికాసన మనఁగన్. 158

తే. వామపృష్ఠపార్శ్వమునన వామగుల్ఫ
మమరఁ బార్శ్వాంతరమున గుల్ఫాంతరంబు
నునిచి గోముఖాకృతి దృఢాసనత నునికి
యమలగుణ! గోముఖాసన మనఁగఁ బరఁగు. 159

సీ. దక్షిణపాదం బదక్షిణాంకమున న
దక్షిణపాదంబు దక్షిణాంక
మున నిడి యిరుగేలు వెనుకగా వీడ్వడ
నిగిడించి బొటవ్రేళ్లు దగులఁ బట్టి
యురముపైఁ జిబుకాగ్ర మొనరంగహత్తించి
దృష్టి నాసాగ్రసంస్థితము సేసి
యునికి పద్మాసన మన నొప్పు నిందుఁ గొం
దఱు చిబుకవ్యవస్థానియమము

తే. చెప్ప రొకకొంద ఱూరుసుస్థితిగ నడుగు
దోయి యుత్తానముగ నిడ తొడలనడుమ
నట్ల పాణులు నిలిపి నాసాగ్రదృష్టి
యగుచు నునికి పద్మాసనం బండ్రు బుధులు. 160

తే. అనఘ! తుదఁ జెప్పినట్టి పద్మాసనవిధి
యందుఁ జిబుకాగ్రమును హృదయమునఁ జేర్చి
రాజదంతమూలంబున రసన చేర్చి
వాయుకర్షణ మొయ్యనఁ జేయవలయు. 161

క. కుడితొడపై వామపదం
బిడి యితరముమీఁద నితర మిడి నిశ్చలతన్
[1]గడుఁ గుదురై కూర్చుండుట
పుడమిన్ వీరాసనాఖ్యఁ బొలుచు మహాత్మా! 162

శా. అండాధఃస్థితమైన రేఖయుభయోపాంతంబులన్ గుల్ఫముల్
రెంటన్ వీక్షవడఁ జేర్చి బాహుయుగమున్ [2]వ్రేళ్లన్ గడుం
జక్కనై యుండన్ జానువులందుఁ [3]బూన్చి వివృతాస్యుం
డై సనాసాగ్రవి, ఖుండై యుండెడునట్టియాసనము మించున్
సింహాసంజ్ఞకమై. 163

మ. తనగుల్ఫంబులు రెంటి నండయుగళాధః[4]స్సేవనీపార్శ్వవ
ర్తన నుండన్ ఘటియించి హస్తములఁ దత్పార్శ్వంబు
లత్యంతయు, క్తనిరూఢిం గ్రహియించి వర్తిలుట యో
ధర్మాత్మ! భద్రాసనం, బనఁ బ్రఖ్యాతి వహించియుండు నది
సర్వారోగ్యదం బెప్పుడున్. 164

క. తగ మేహనంబుపై స
వ్యగుల్ఫ మిడి దానిపైఁ బదన్యం బిడి స
ట్టిగఁ గూర్చుండుట యోభ
వ్యగుణా! ముక్తాసనాఖ్యమై పెం పొందున్. 165

1. గడు గుబురై. 2. వ్రేళ్లన్. 3. జాఁచి. 4. శ్శేవనీ.

క. కొందఱు సిద్ధాసన మని
కొందఱు వజ్రాసన మని కొనియాడుదు రిం
పొందఁగ దీనిని మఱియొక
కొందఱు గుప్తాసన మనుకొందురు మహాత్మా! 166

చ. కరతలముల్ ధరిత్రిపయి గట్టిగ రెండును నూఁది వానికూ
ర్పరముల నాభిపార్శ్వములు [1]నన్పడ నాని శరీర మెల్ల నం
బరమున దండలీలఁ గనుపట్టఁగఁ జక్కఁగఁ [2]జాఁచి యున్కి సు
మ్మరయ మయూరసంజ్ఞ మగునాసన మోధరణీసురోత్తమా!

తే. జగతిపైఁ బాదములు రెండుఁ జక్కఁ జాఁచి
పాణులఁ దదగ్రములు బిగఁ బట్టి నుదురు
జానువులఁ జేర్చి యున్కి యోసాధుచరిత!
తాపసేంద్రులు పశ్చిమస్థాన మండ్రు. 168

క. ఈయాసనములు మిక్కిలి
కాయలఘుత్వమును సకలగదనాశనముం
జేయుచుఁ బాపనికాయముఁ
బాయం దోలుచును బరఁగు భవ్యచరిత్రా. 169

సీ. ధౌతి నేతి కపాల[3]భాతి వస్తిత్రాట
కములు [4]నౌలియు నాఁగ నమరు యోగ
షట్కర్మముల దేహసంశుద్ధికలితుఁడై
పరఁగ నీచెప్పినభద్రసింహ
పద్మాసనాదులపరిచయం బమరంగఁ
బ్రణవసంఖ్యాభేద గుణనిరూఢిఁ

---

1. గన్పడ. 2. జాఁగి. 3. భౌతి. 4. నౌలికి.

గోమరొందుపూరకకుంభకరేచకం
బుల విశేషంబుతోఁ బొలుపుమీఱు
తే. చున్నయట్టిప్రాణాయామము మోమహాత్మ!
సలుపఁ జలుపంగ మారుతజయము గల్గు
నంతకంతకు సంసిద్ధి నతిశయిల్లు
నాఁడునాఁటికి మేనిలో నాడు లెల్ల. 170

తే. విను మపానంబునకు రెండువ్రేళ్లయెడను
పై నెసఁగుపావకునియున్కిపట్టునకును
పైని తొమ్మిదివ్రేళులపాటియెడను
ధరణిసురవర్య! నాడికందంబు వొలుచు. 171

తే. ఉండుఁ దనువున డెబ్బదిరెండువేలు
నాడు; లొకటియు నూఱు గణ్యంబు లందు;
నందుఁ బదునాల్గు శ్రేష్ఠంబు; లందులోన
మూఁడు నుతి కెక్కు; నందును ముఖ్య మొకటి. 172

వ. పదునాల్గునాడులలోపల సరస్వతీప్రముఖంబు లైనయేకాదశ
నాడులు జిహ్వాది వ్యాపారకారణంబులై పరఁగు; నిడా
పింగళ లను నాడీద్వయంబు వామదక్షిణ నాసారంధ్రగామి
యగుచుఁ బ్రాణాయామసాధనం బై ప్రవర్తించుఁ; బ్రధాన
తమం బైనసుషుమ్నాహ్వయనాడి బ్రహ్మనాడి యనం బర
గుచు నాడీకందమధ్యవర్తిని యై బ్రహ్మరంధ్రగామిని యై
యుండు; నందుఁ బవనంబుఁ బ్రవేశింపఁ జేయుట యుత్తమ
యోగం బనం బరఁగు; నింకఁ బ్రత్యాహారప్రకారంబులు
విను మని యి ట్లనియె. 173

సీ. "ఇంద్రియార్థములందు నింద్రియంబులఁ బ్రవ
ర్తిలనీక కుదియించి త్రిప్పు టొకటి;
యవి యెందుఁ జరియించె నది సమస్తంబు నా
త్మయ కాఁగ మనసులోఁ దలఁచు టొకటి,
నిత్యకర్మంబు లన్నియు నాత్మయందు సం
తతము చిత్తముచే నొనర్పు టొకటి;
తనువునఁ గలపదునెనిమిది మర్మసీ
మలఁ గ్రమంబున గాఁపు నిలుపు టొకటి;
ఆ. యోగశాస్త్రశీలయుతులు ప్రత్యాహార
భేదరీతు లనుచు నాదరమున
సాంప్రదాయికముగఁ జలుపుచు నుందురు
రోవసుంధరాసురావతంస! 174

సీ. పాదాదిగా జానుపర్యంత మూర్వి యు
ర్వ్యాదిగాఁ బాయుపర్యంత ముదక
ముదకాదిగా మఱి హృదయాబ్జపర్యంత
మగ్ని యగ్న్యాదిగా నంసమీఁద
భ్రూమధ్యపర్యంతము మరుత్తు మరుదాది
గా మూర్ధపర్యంత మోమహాత్మ!
నభము వర్తిల్లుఁ; దానక మవిర్గొయ; భా
వింపగా వేర్వేఱ విహితగతిని
తే. ధాతృవిష్ణురుద్రేశసదాశివాఖ్య
దైవతములఁ బృథివ్యాదితత్త్వపంచ
కమున ధారణ మొనరింపఁ గా వలయును
బ్రణవమునను బ్రాణాయామభంగు లమర." 175

ఆ. అని మఱియును దద్రహస్యవిశేషంబు
లన్నియును వచించి ప్రాణముఖ్య
పవనగతుల తెఱఁగు పదునెనిమిదిమర్మ
ములును నాఁడు లుం బొలుపుఁ దెలిపె. 176

వ. తెలిపి యింక ధ్యానప్రకారంబు వినుమని యిట్లనియె. 177

క. "అప్రతిమముగ విజాతీ
యప్రత్యయవాసనానిరాసావిచ్ఛి
న్నప్రవహదురుసజాతీ
యప్రత్యయరూప మగుచు ధ్యానము వెలయున్. 178

క. అది సగుణధ్యాన మనఁగ
సమలగుణ వినుము నిర్గుణధ్యాన మనఁ
గా విదితముగ నివి [1]తెఱంగులు;
మొదలిటి యది చేయ నితరమును సిద్ధించున్. 179

చ. సగుణ మనంగ నింక విను శంఖసుదర్శనముఖ్యచిహ్నితం
బగుపురుషోత్తమాకృతి; తదన్యము నిర్మలనిత్యచిన్మయం
బగుపరమాత్మరూప; మది యబ్బుట దుర్లభ మెట్టివారికిన్
సగుణవిలాసచింతనము సల్పఁగఁ జల్పఁగఁ గాని భూసురా!

క. మానసము విష్ణునందుఁ
లీన మగుచు నించుకయుఁ జలింపక యుండం
బూనుట సమాధి యగు; వి
ద్యానిరతా! [2]యేకరూప మది భావింపన్. 181

వ. ఇది యోగవిద్యాప్రకారంబు; దీనిమహత్త్వంబునం జేసి

1. తెఱంగుల. 2. యుక్త.

యెత్తెఱుంగున భావంబుఁ దనయందుఁ దిరంబుగా నిలుపుచు
నాసిద్ధుండు స్వభావుం డనం బరఁగె. 182

తరల.—

అతఁడు నిత్యము నాత్మయోగసమాధికిం విజనస్థల
స్థితి మనంబునఁ గోరి పెక్కులు దేశముల్ చరియించుచుం
గతిచశంబున జన్మదేశము గాంచి యందుఁ గడుం వివి
క్తతల మంచు వసించెఁ దా శతతాళదఘ్న హ్రదంబులోన్.

సీ. అట్లు వసించి యోగారూఢి నుండుచోఁ
దనయల్లుఁ డాలిపై గినుకవలన
మడువున నారీతిఁ బడి తన్నుఁ జేర వ
యస్స్తంభమణి మొదలైనయట్టి
వానిఁ గొన్నిటి నిచ్చి తా నంపెఁ; గాని య
ప్పుడు దనబంధుత్వమును దెలుపఁడ
పోయిన బంధంబు పోనీక తగిలించు
కొన నేల మగుడఁగ ననుతలఁపున

తే. నంత నెంతయు బహుకాల మరుగ నతఁడు
నియతివశమునఁ దద్యోగనిష్ఠ వదలి
హ్రదములోపల వెలువడి యరుగుదెంచె
సకలబుధసేవ్య మైనశ్రీశైలమునకు. 184

ఉ. శీలితయోగవైభవుఁడు సిద్ధుఁడు వేడుక మించఁ గాంచె శ్రీ
శైలము నీలలోహితలసన్నిచిత్రితసానువైభవో
త్తాలము సేవకేష్టఫలదానవిధాననవీనదేవతా
సాలము నిత్య[1]వర్ణగుణజాలము ముక్తిలతాలవాలమున్.

1. వర్ణ్య.

ఉ. వెల్లగిలెన్ గుబేరుమల; వెంపఱెఁ ఘూర్ణిలె మందరంబు; తా
వి ల్లయి వంగె మేరుగిరి; వింధ్యమిలన్ నెఱియంగఁ గ్రుంగె; రూ
పెల్లఁ దుషారమాత్ర మగుచున్న హిమాద్రికి సాజమై ప్రవ
ర్తిల్లెను; గాన శ్రీనగము శ్రీనగ మన్ ఘనకీర్తికిం దగున్.

సీ. నవపుష్పవనము నానామణుల్ గ్రుచ్చిన
పచ్చపట్టుఁగబాయి బాగు నెఱప
ధాతుస్థలంబు లాతతకుంకుమాంగరా
గప్రకారంబునఁ గానుపింపఁ
దెలిడాలు పచరించు సెలయేటికాలువల్
హారవల్లరులసోయగముఁ దాల్ప
బహువిధోపలయుతోపత్యకాభాగంబు
భద్రాసనము [1]లీలఁ బరిఢవిల్ల

తే. నపరధరణిభృన్మూర్ధసమాదరార్హ
పాదకటకంబు లమరంగఁ బ్రణుతిఁ గన్న
యన్నగేంద్రుని కినకిరీటార్పణాకరి
యైనయుడిగంపుఁ గత్తె మధ్యాహ్నలక్ష్మి. 187

క. సిద్ధమణుల్ గనుగనులన్
సిద్ధౌషధమూలికా[2]విశేషపుఁబనులన్
సిద్ధరసధునులఁ గూడి ప్ర
సిద్ధిగఁ జేకొన్న రూపు శ్రీగిరి యన్యేన్. 188

క. పాతాళగంగ యనియెడు
కైతవమున నన్నగేంద్రు కాలికడియము

1. లీల నతిశయిల్ల. 2. విశేషపుపనులున్.

ద్యోతించు గండశైల
ప్రాతమిషస్థితనగాంతరప్రతిమలతోన్. 189

చ. ఘనపరిరంభసంభ్రమవికాసములం గను¹పట్టినట్టిమి
న్నను హరిపేటరంబు తనయందును దార్కొనకుండ ²నొత్తిప
ట్టిన నిధిగర్భబాహువు పన శిరిఁ బ్రవర్తిలు నన్నగంబు శో
భనఖచరద్రుమావిరళపల్లవతల్లజశోణపాణి యై. 190

వ. ఇవ్విధంబున నతిపవిత్రవిచిత్రమహిమంబున నతిశయిల్లుచున్న
యన్నగోత్తమంబు నత్యంతభక్తియుక్తుం డగుచు నధిరోహ
ణంబు నేసి మల్లికార్జునమహాదేవసేవావిధానం బనూనంబుగా
నడపి యదృచ్ఛావిహారంబున సంచరించువాఁ డందు నంతట
భృగుపాతంబున కాయత్తపడుచున్న మణికంధరుం జూచి
"నీ వెవ్వండ? నీసాహసోత్సాహంబునకుం గారణం బేమి?
యెఱింగింపవలయు" ననుటయు నతండు తన పేరునుం జాతి
యుం దెలిపి తద్భృగుపాతోత్సాహపర్యంతంబు తన పూర్వ
వర్తనంబు సకలంబునుం జెప్ప నందు వినంబడిన నిజపుత్త్రీ
జామాతల వృత్తాంతంబున నుత్కంఠమానమానసుం డగుచు
మఱియుం దద్విశేషం బతనికి నెఱుకపడినంత యడిగి తెలిసి
తాను సుగాత్రిజనకుం డగుట వినిపించి తనవర్తనం బంతయుం
జెప్పి శారదాదేవి యాసుగాత్రీశాలీనులకు నిచ్చిన విశుద్ధ
వరంబు లెట్లు ఫలితంబు లగునో యని యొకింత చింతించి
"యవి యట్టట్ట సఫలంబులు గాక మానవుగా!" యని నిశ్చ
యించి మణికంధరున కిట్లనియె. 191

1. పట్టు. 2. నెత్తి.

సీ. నారదుపరిచర్యచే రుక్మిణీకాంతు
శిశువు సంగీతసిద్ధిఁ గనుట
యమ్మౌనికరుణచే హరిభక్తితీర్థయా
త్రాదిపుణ్యంబుల నతిశయిలుట
నడుమఁ బ్రమాదంపునడకఁ జేకుఱినశా
పము రాజ్యఫలముగాఁ బనుపఱచుట
యధికపుణ్యప్రాప్య మైనగంధర్వజా
తిని సముద్భవ మంది తేజరిలుట
తే. యూహ సేయంగ నీ వింక నొందఁ జన్మ
మమితసాద్గుణ్యసంపన్న మగుట ధ్రువము
పుణ్యవాసన లూరక పోవు సూవె
యెట్లుఁ దమతమఫలముల నిచ్చుఁ గాని. 192

క. సుగుణగణైకనివాసం
బగుజన్మము నీకుఁ గలిమి కాదిను హేతూ
దగమంబ చాలు నిచ్చుట
భృగుపాతంబునకు నే మపేక్షిం చింకన్ ?'' 193

*చ. అనుడు నతండు "శ్రీమహితులై శుచివర్తనులైనవారికిం
దనయుఁడనై జనించుట[1] యెతత్ఫల మంచుఁ దలంచినాఁడ" నా
విని "యటులైన నెంతయుఁ బవిత్రచరిత్రత నీకుఁ గాన్పడం
గనకనవారు మత్సుతయుఁ దత్పతియుం దలపోసిచూడఁగన్.

ఉ. వారలు తల్లిదండ్రులుగ వాంఛ యొనర్చుట మేలు గావు
యిం,పారఁగ దానినాకునుస్త్రీ బ్రియం బగు టొక్కటి యొక్క

---

*౧౯౩, ౧౯౪ సంఖ్యలపద్యములు కొన్ని వ్రాతప్రతులయందు కానరావు.

1. యదఃఫల.

డాప్రియం,బూరక పోదు నీమదికి నొ ప్పగునట్టిమహోప
కార మో,సారగుణాఢ్య! యేఁ జలుప శక్తుఁడ మీఁదట
నీకు నెంతయున్. 195

* ... ... ...

సీ. తొల్లి యొకపుడు మద్గురువుల నే నాత్మ
పరిరక్షకొఱకును బట్టె మొకటి
కావలయు న టంచు దైవసంప్రేరణ
నడిగిన సృజియించి యట్లు నాకు
నొసఁగుచు "నిది యమోఘోద్యమం" బని పల్కి
వారలు నన్ను "నీవంశ మిఁకను
క్షత్రవంశంబు గాఁ గల" దని రావాక్య
మరసిన నీవు నాయల్లునకును
తే. గొడుకవై పుట్టుటకె యనుకూల మగుచు
నున్నయది క్షత్రధర్మ మత్యుజ్జ్వలముగ
జగతి యేలెదు తక్కిన సందియంబు
లన్నియును మాని నామాట యాచరింపు. 196

సీ. అనుడు "నట్లని నాయాత్మ చందము విను
మట్లను మాఱుమే నత్త నందు
రాజ నౌటకును గారణములు న్నవియ యిం
కను బవిత్రులయింట జనన మొందు
కాంక్షచే నిప్పు డీకరిమేశ్వరపుఁజటి
నుఱుకుచున్నాఁడను మఱియుఁ గొంత

---

*వ. అని మఱియు ని ట్లనియె.

మదిలోని మెరమెర మాన దేమిటికి నం
　　　జేని నెంతటిరాజనైన నట్టి

తే. పావనులయింటఁ బుట్టిన బహిరబహిర
రాతివర్గజయంబజస్రమును గలిగి
వర్తిలుట యబ్బురము గాన వగపు గలదు
చిత్తమున నాకు నోమహాసిద్ధవర్య ! 197

ఆ. అదియుఁ గాక రాజ్య మను మహాభూతంబు
సోఁకినప్పు డెట్టిసుజనులకును
లేనిచీఁకుఁదనము లేనిమూఁగతనంబు
లేనిచెవుడుఁ గొంత యైనఁ గలుగు. 198

తే. వేదశాస్త్రాదిసకలసద్విద్యలందు
నెందుఁ గొఁద యించుకయు లేక యెసఁగునట్టి
బ్రాహ్మణులగోష్ఠిచే నట్టిరాజ్యదోష
ములు నివారింప నగు నని తలఁచితేని. 199

ఉత్సాహ:—
భోగ్యవస్తుతృష్ణ లేమిఁ బుడమిఁ జేనిదానముల్
యోగ్యములును గామిఁ జేర నొల్ల రుత్తమద్విజుల్
మృగ్యతముల వారి వెదకి మెచ్చఁ గొలిచి తెచ్చికో
భాగ్య మతని కబ్బు టరుదు బ్రదుకె యదియు నక్కటా !

వ. అట్లుత్తమద్విజులచిత్తంబు నారాధించి చేర్చుకొనియెద
నన్నఁ దద్వివేకం బెన్నినాళ్లకుఁ గలుగవలయు ? నివియే
యెంచిచూచిన నొక్కటొకటియు మిగులనసహ్యంబు లగుచు
హృదయశల్యంబు లై యున్నయవి; నీవు సకలకార్య
ఘటనాతి సమర్థుండవు. నాకు నివ్విచారంబు వాయ నొక్క

తెరువు సూపి రక్షింపు మని మణికంధరుం డాస్వభావాఖ్య
సిద్ధు నెంతయుం బ్రార్థించిన నతండు నతనికి విషాదనివాశ
నంబుగా ని ట్లనియె. 201

క. "సతతముఁ బెంపొందుఁజయో
న్నతి యొసఁగెడు నొక్కవిల్లు నవశరములు నీ
మతికిఁ దగినవి సృజించెద
క్షితి దత్తాత్రేయుదయ కకృత్యము గలదే? 202

శా. నీ కింకన్ సృజియించి యద్భుతపుమాణిక్యంబు నే నిత్తుఁ దా
నాకర్షించును నీదుసేవ గొన సర్వామ్నాయ శాస్త్రాదివి
ద్యైకాధారత నొప్పువారి, నది యాత్మాలోకమాత్రంబునం
జేకూర్చున్ సకలాశ్రితాళి కఖలక్షేమాయురారోగ్యముల్.

క. అని యపు డొకసింగిణి వి
ల్లును వాడిమెఱుంగుటమ్ములును గెంజాయం
దనరారుమణిశలాకయుఁ
దనమాహాత్మ్యము ప్రకాశితముగ సృజించెన్. 204

తే. ఇట్లు సృజియించి "వీని నీ వెప్పు డుదయ
మొందితటమున్న యున్నయ ట్లొనర నిత్తు
నేను గనుపెట్టుకొని వచ్చి; 'యివి యొదవుట
యెట్లొ? యెన్నినాళ్లకొ?' యని యెన్నవలదు." 205

వ. అని పలుకుచుండ. 206

సీ. అప్పు డా చేరువ నరుగుచుఁ దద్వాక్య
ములు విని శివరాత్రిపుణ్యకాల
శోభితమల్లికార్జున దేవభజనోత్స
వాయాతు లైనమహాశయుం...

నతనిభార్యయుఁ బురోహితులు నచ్చోటికి
నరుదెంచి యాసిద్ధవరునినామ
మడిగి యెఱింగి మహాసమ్మదమున సా
ష్టాంగప్రణామంబు లాచరించి
ఆ. "మాకు ఫలిత మయ్యె మల్లికార్జునదేవు
సేవమహిమ యిపుడు సిద్ధవర్య!
నిన్ను వెదకివెదకి కన్నులు సాఫల్య
గరిమఁ జెందె నిచటఁ గనుఁగొనఁజేసి." 207
వ. అని పలికినంతలో నృపాలుండు. 208
మత్తకోకిల.—
"ఏ మదాశయుఁ డర్కమహీశుఁడ హైహయాన్వయజుండ; ని
బ్భామ యోయనఘాత్మ! మత్ప్రియభార్య; వీరు పురోహితుల్;
ధీమహత్త్వగుణాభిరాములు దివ్యతేజులు ఋగ్యజు
స్సామతుర్యమహాగమక్రమసంప్రదాయధురంధరుల్. 209
క. ఓయనఘాత్మక! దత్తా
త్రేయమహామునిని మాహురీపురనిలయుఁ
జాయయు నేనును వీరిస
హాయతఁ గొలిచితిమి బహువిధారాధనలన్. 210
తే. కార్తవీర్యార్జునుఁడు చక్రవర్తి యగుచు
నంత ఘనుఁ డౌట నాయోగి నాశ్రయించి
కాదె! తద్రాజకులజుఁడఁ గాన నేను
నమ్మునీంద్రు భజించితి నవ్విధమున. 211
వ. ఆదత్తాత్రేయుం డంతట నాకుఁ గలలోనం గానుపించి
మదీయభక్తుండవు స్వభావుం డనుసిద్ధుం డొక్కరుండు గలఁడు;

డతనివలన నీకాంక్షితార్థం బీడేఱు; నతని సందర్శనంబు సాధించునది యని చెప్పిన, నేను దేవర యున్న చోటును, స్వరూపంబును నెఱుంగక యనేకవిధంబుల నరయుచు నిచ్చ టికి నిద్దేవతామహోత్సవంబునకువచ్చి యిప్పటి మీమాటల దత్తాత్రేయశబ్దంబు వినంబడుట నిది దెలిసి పోదముగాక! యని చేర నేతెంచితిమి; మాకుం జిరప్రార్థితం బైనభవద్దర్శ నంబు దొరకె; నిఁక మాయభీష్టంబు సిద్ధించిన ట్లయ్యె." నన విని, యాసిద్ధుండు తను బ్రసిద్ధునిం జేయఁ బన్నిన గురువుల పన్నుగడకు నద్భుతసంతోషంబు లంతరంగంబున నెంతయుఁ గందళింప "నింత భక్తవత్సలుండవే!" యని యమ్మునిం దలంచి కేలు మొగిచి యంత నారాజునుం జూచి యి ట్లనియె. 212

క. ఏ నెవ్వఁడ నీకోరిక
లీ? నైనను మద్గురూక్తి మిది యంటి గదా!
యానియతిచేత నె ట్లైవి
గా నున్నవి య ట్లొదవెడుఁ గానీ చెప్పుమా. 213

క. అనుడు "జయంబును సంతతి
యును నాయభివాంఛితంబు లోయంచితవ
ర్తన" యనుచు విన్నవించెను
జననాయకుఁ డతని; కపుడు సంయమివరుఁడున్. 214

వ. అటమున్ను దాసృజించిన ధనుర్బాణంబులను మణికంధరునిం జూపుచు ని ట్లనియె. 215

సీ. "మానవనాథ! యీమణికంధరునకు భా
విభవంబునందును విజయసిద్ధి

గావించుకొంటకు నే నీవిల్లు నమ్ములు
నిట మున్నుగా సృజియించినాఁడఁ
గావున నీకని కొక్కనికిఁ దక్కఁగ నన్య
రాజుల కెందుఁ బరాజితుఁడవు
గాక నీవు జయింతు గట్టిగ" నన, "నట్ల
కానిండు; మీకృపఁ గలిగినదియ
తే. చాలుఁ; గడమకు మఱి యేన చాలుదు మఱి
కంధరుని కీధనుస్సాయకముల నవుడు
గాఁగలజయంబు తదితరకర్తృకత్వ
మునను సిద్ధింప నేర్చునే?" యనియె రాజు. 216
మ. అనఁ దద్గర్వపుమాటకుం గనలి "యీయస్త్రప్రభావంబుచే
నిను నజ్జన్మమునం దిశంపు గెలుచుట నిస్సంశయం; బట్లు గె
ల్చినమాత్రంబును గాక యూడిగము నీచేతం గళత్రంబుచే
తను జేయించుకొనంగలం"డనియె సిద్ధశ్రేష్ఠుఁ డారాజుతోన్.
ఉత్సాహ.—
అనుడుఁ [1]దత్పురోహితుల్ మహావినీతితోడ నా
తనికిఁ గేలు మొగిచి "యోయుదాత్తచరిత! యేమి యీ
యనకుఁ దెలియు? మూఁడుమాట లాడుతప్పు; లేము మీ
కొనరఁ బల్కఁగలమె? యస్మదుక్తి తెఱఁగు లెంతురే? 218
తే. [2]మీరు గురువుల [3]కుల మని మిమ్ము వెదకి
కొనుచు వచ్చుట యొకటియే గుఱిగఁ జూచి
యీనృపతికోర్కి లీడేర్పఁ డెట్లు లైన"
ననుచు వారలఁ జూచి యిట్లనియె సకుఁడు. 219

---

1. దమువు. 2. మీరుగురువుసేనకుల మని. 3. గగుటనుమి.

ఉ. [1]"తప్పదు నాదుమాటలు విధాత లిఖించిన వ్రాఁతసుం డిలం
దప్పక యెల్ల రాజులను దాను జయించును మీనృపాలుఁ డేఁ
జెప్పినవానిఁ దక్క నిఁక సేవయు వానికిఁ జేయుఁ జాలఁ బెం
పొప్పఁగ నాలుఁ దానుదనయుల్లమునందు విముక్తమానుఁడై.

క. మీనరపతిమదిఁ గలసు
తానప్పుఁగోర్కియు ఫలించుఁ దత్సేవతఁజేన్
దానును భార్యయు నేలిక
పూనినయొకమణివిశేషమును గనుఁగొనఁగన్. 221

వ. అనిన విని వార లొకింత చింతించి. 222

శా. "మాభోగంబులె యాత్మభోగములు గా మామాటయే
మాటగా, నోభవ్యాత్మక! మమ్ముఁ దా నడుపుకొం చున్నాఁ
డితం డిమ్మహా,సౌభాగ్యంబున నున్న మాకును దగన్
సంసేవ్యుఁ డెవ్వాఁడొ దా,సీభావంబున సీతఁ దట్లు పరుఁ
దా సేవించుకాలంబునన్?" 223

మ. అనినన్ "మీమహీభర్త యేలికయె మీ కారాధ్యుఁ డా
వేళ నా,తనిభూషామణి మీకు నెంతయుఁ బ్రమోద
స్ఫూర్తి గావించుచున్; దనరున్ మీరలు నిమ్మదాశయుఁడుం
డత్సాంగత్యనితోత్సవంబునఁ బూర్వోన్నతు లన్నియున్
మఱచి యుంపున్ గొంతు రత్యంతమున్. 224

వ. కావున మణికంధరుండు వసుంధరాపతి యగుచు జన్మించు
నందాఁక యథేష్టవిజయవిహారంబుల మీరాజు ప్రవర్తిల్లఁ
గలం; డటమీఁద మదుక్తప్రకారంబునం దత్సేవ సేయం
గలందు; మీకును దన్మణిస్పర్శమహిమంబున మహానందంబు

1. తప్పనే నాదుమాట యని ధాత.

నొందెద రని పలికి స్వభావనామసిద్ధుండు వారి నంపఱ ననిపి, తానును మణికంధరుని వీడ్కొని నిజేచ్ఛం జనియెఁ; దద్వచనప్రకారంబున సదాశయుండును సకలశత్రుజయం బునఁ దేజరిల్లె” నని చెప్పిన విని యలఘువ్రతుండు “మణి కంధరుం డట్లు సిద్ధుని వీడ్కొని యటమీఁద నేమి చేసెఁ? దద్వృత్తాంతంబు వినవలతుం జెప్పు” మనుటయు. 225

ఉ. కావ్యకళారసానుభవకౌశలనూతనభోజరాజ సం
స్తవ్యనవీనగానసరసత్వమహత్త్వమహత్తనూజ. క
ర్తవ్యవివేచనారచనధార్మ్యగుణాపరధర్మరాజ శా
స్త్రవ్యసనానుపాలన బుధప్రజపాలన పుణ్యఖేలనా. 226

క. కించిదుదంచితరాగదృ
గంచలరుచినూతనాతపాంకురరేఖా
వంచితసకలప్రతిభట
సంచయగర్వాంధకార జలధిగభీరా. 227

మణిగణనికరము. సమధికవితరణచతురిమగరిమ
క్రమజితరవిసుతఘనసితకిరణా
శమదమముఖగుణసముదయకలనా
విమలితనిజమతివృతగురుచరణా. 228

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళి యమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామ ధేయప్రణీతం బైన కళాపూర్ణోదయం బను మహాకావ్యంబు నందుఁ బంచమాశ్వాసము.

---

శ్రీ ర స్తు

# క ళా పూ ర్ణో ద య ము

## ష ష్ఠా శ్వా స ము



మత్పదనఖకాంతి
స్తోమప్రచిలానతారిచూడామణిని
ష్కామోద్దామప్రభావ
స్థేమ శ్రీకృష్ణ నారసింహానికృష్ణా. 1

వ. అవధరింపు మమ్మధురలాలస యలఘువ్రతుం జూచి శ్రీ
వడిగిన మణికంధరుని వృత్తాంతంబు సకలంబును వినిపించెద
విను మని యిట్లనియె. 2

క. అచలధృతి నతఁడు పజ్ఝుల
వచనసరణిఁ దగిననియమవర్తన మమరన్
శుచి యై యాచటి దగ్గఱి
యుచితస్థితి నిలిచి యుఱుక నుంకించుతఱిన్. 3

ఆ. మథనసమయఘూర్ణమానాబ్ధివోలెఁ బెన్
మ్రోఁత లడరఁ [1]బరుసమూఁక లెల్ల
బిట్టు కలఁగి తల్లి బిడ్డఁ బట్టక పాఱె
నతనిమది మహాద్భుతాకులముగ. 4

---

1. బరస.

వ. అంత. 5

మ. బిగిచన్నుత్తులు గుత్తపుం[1]బయెుఁటలోఁ బింపిళ్లు గాయంగ
ఘూర్ణిగతిన్ భామ యొకర్తు వచ్చి "యిదె యోగంధర్వ!
నీ వొందెదీ, భృగుపాతంబుఫలంబు నీపరుసవారిం గావు"
మంచున్ ధగద్ధగితాశాంతర మైనఖడ్గ మొకటిం దత్పాణి
కిచ్చెన్ వేసన్. 6

వ. తదనంతరంబ. 7

సీ. చుట్టుపట్టుల నున్నయట్టి పెన్మ్రాఁకులు
బలువడిమైఁ దూఱి పాఱునవియు
గండోపలంబు లుద్దండవేగాధికో
ద్ధతిఁ జెక్కులై రాలఁ దాఁకునవియుఁ
గరిసింహశార్దూలశరభాదిమృగముల
నుగ్గునూచంబుగా నులుచునవియు
నంతరిక్షమున నత్యంతంబు దట్టమై
పందిరిబాగుగాఁ బర్వునవియు
తే. నగుచు బలితంపుటినుపక ట్లమర నొప్పు
వెండిగునపంబులో కాక వెండికట్ల
యినుపగునపంబులో యనఁ దనరి కురిసె
నెంతయును జిత్తజల్లుగ నేదుముల్లు. 8

క. మణికంధరుండు తద్ధా
రణాశిలలీవృష్టి మిగులఁ గ్రొత్త యగుచు వీ
క్షణముల కత్యద్భుతకా
రణ మై తనరారఁ జూచి ప్రమదం బలికెన్. 9

1. పయ్యెట.

ఆ. "చెలువ! యీయపూర్వశలలీప్రవర్ష మె
క్కడిది? యీమహాసిఁ గార్య మేమి
సేయు మనుచు నాదుచేతికి నిచ్చి? తె
వ్వతెవు నీవు? వినఁగ వలయు నాకు." 10

ఉ. నా విని యింక నేమియు వినన్ రణకోవిద! నీ కొకింతయుం
దావల మెద్ది యాకపటదైత్యుఁడు చెప్పన కేఁగుదెంచునే
మో వడిఁ బర్వఁ జొచ్చెఁ గడు ముందలవాన యెదుప్ప
మింతటన్, నీవు మహాసి[1]చేతన నిర్భరవేగతఁ జక్కు
సేయుచున్. 11

ఆ. ఎదురాఁపుతోడ నిదిగో నొకించుక
దవ్వునందు వాఁడుదగ్రవృత్తి
నీకు నెదురు వచ్చు, నాకష్టు నిటు మించి
తాకయుండఁ దునుము రయముతోడ." 12

వ. అని సత్వరంబుగాఁ బ్రార్థించిన నాయింతిం జూచి. 13

చ. అమరవిరోధిఁ ద్రుంతు నిదె యంగన భీరుల కెల్ల భీతి తీ
ర్చుము వెసఁ బొమ్ము నమ్ము మనుచుం గదలెన్ రయ మొప్ప
దర్పదుర్దమరిపుఖండకాండభుజ[2]దండుఁ డతండు ప్రచండ
మండలాగ్రము జళిపించుచున్ గిరగిరన్ దిరుగన్ నెగవైచి
పట్టుచున్. 14

వ. ఇత్తెఱంగున నత్యంతోత్సాహసంభ్రమంబునం గదలి. 15

మహాస్రగ్ధర.—

శలలీసందోహముం దోస్సమధికలఘిమా
శ్చర్యచాతుర్యచర్యా

1. చేత నవి ని. 2. దండమునందుఁ బ్రచండ.

విలసద్ఘోరాసిధారావిహృతి హతము గా
వించుచుం బోయి కాంచెన్
శలభుంతానంబు మేనన్ గగురు పొడిచి క
[1]న్పట్టు నున్నట్టియేదుం
డులితానూనప్రసూనద్యుతి[2]శలలవసీ
ధుర్యధాత్రీధరంబున్. 16

వ. ఇట్లు కాంచి నిరంతరాసారం బైన తద్ఘోరశిలావృష్టిఁ దన కృపాణప్రహరణవిచిత్రవేగంబునఁ దుత్తుమురు సేయుచు నక్కపటదానవు నుద్దేశించి. 17

క. "ఓరి! యవివేకి రాక్షస!
కూరూపవికారవృత్తి నేమి గలఁడు? దు
ర్వారత నీవు జగద్ద్రో
హారంభము నిన్నుఁ జెఱుప కకట పిపింపనే! 18

సీ. దిగ్గజంబులకును దేఱి చూడఁగ రాక
యేపారుగజదైత్యుఁ డేమి యయ్యె?
మొగులలో నుండి యమ్ములవాన గురియించు
నింద్రజిద్దానవుం డేమి యయ్యె?
విశ్వమంతయు నిండ వృద్ధిఁ బొందుచు సురా
హితకారి యగు వృత్రుఁ డేమి యయ్యె?
జగ మెల్లఁ జాపచుట్టుగఁ జుట్టి ఘనశక్తి
నెసఁగుహిరణ్యాక్షుఁ డేమి యయ్యె?
తే. వెండియును బెక్కుమాయల వెలయునట్టి
వారు శంబరప్రముఖు లే మైరి వినవె?

1. పట్టుచున్నట్టి. 2. శబల.

యకట! యోరిదురాత్మ! యీవికృతరూప
మేమిటికి వచ్చు? నిదె వధియింతు నిన్ను." 19

చ. అన విని రక్కసుండు నగి "యక్కట! యెక్కడివాఁడు వీఁ?
డచేతనుఁడో మతిభ్రమార్తుఁడో మదస్ఖలితాత్ముఁడో పుట్టు
వెఱ్ఱియో?, తనభుజసత్త్వ మెక్కడ? యధగకృతదిక్కరి
విక్రమప్రవర్తను ననుఁ దాఁకు టెక్కడ? విధాత కడుం
[1]జెడ రేఁచెనో సుమీ!" 20

వ. అని యతని నుద్దేశించి. 21

క. బ్రదుకొల్లకున్న రాక
మెదురుగ నిటువంటిమాట లిమ్మెయి నేలా
వదరఁగ? "దొంతుల కోఁకని
గుదియలునుం గలవె?" నీదు క్రొవ్వడఁగింతున్." 22

చ. అనుచు నొకింత [2]మైమఱచి యత్యధికోగ్రశిలౌఘవృష్టి చే
మునుఁగఁగఁ జేయ దానిని సముద్ధతఖడ్గవిహారచాతురిన్
దునుముచుఁ జేరి తద్గళముఁ ద్రుంచె వడిన్ మణికంధరుండు త
ద్ఘనశిలజాల మాతెఱపిఁ. దన్ వెసఁ దాఁకి గతాసుఁ
జేయఁగన్." 23

క. అని చెప్పిన నలఘువ్రతుఁ
డనయంబును గుతుకయుక్తుఁడై "యెవ్వాఁ డ
ద్దనుజుం? డాతని నారీ
తిని దునిమించినది యెవతె? తెలియఁగ వలయున్." 24

వ. అనిన విని యా శిశువు వా రిరువురి తెఱంగును వివరించెద
విను మని యిట్లనియె. 25

1. బెడ. 2. మైమఱచి.

క. "మహితాత్మక! యాదైత్యుఁడు
మహిషాసురమాతులుని కుమారుఁడు దుర్గా
నిహతుఁ డగువాని విని తా
నహితము దుర్గకు నొనర్ప నాత్మం గోరున్. 26

తే. వాఁడు శల్యాసురుం డన వసుధఁ బరఁగు
శల్యమూహత నునికిఁ బచ్ఛలలచయము
గడ్డపాఱలకై వడిఁ గానుపించి
పేర్చుట ఖనిత్రశలుఁ డనుపేరుఁ గలఁడు. 27

వ. మహిషాసురునిఁ జంపినసూఁడు తన మనంబునం బాయక యివ్విధంబున దుర్గయందు బద్ధమత్సరుండై యారాక్షసుండు.

చ. క్షితితల మంతయుం వెదకి చెందుదునో వెసఁ గాళికార్చనా
వ్రతపరు లెంత ఱంపఱ నవారణ? నెయ్యెడలందుఁ జంపికా
యతనము పేరులేక ఖిలమై చనఁ గూల్తునొ? [1]యొర్చు కెట్ల
కో, మతి నొకయప్పుడుం విడక మండఁగఁ బెట్టుచు నున్న
కోపమున్. 29

ఆ. ఏను గినుకఁ బూని యిట్లు కావింప నే
మనుచు నుమకు [2]నొకొ బలాంతకుండు
పేదకోప మెందుఁ బెదవులచేటుగా
కుడికి యేమి సేయనోపు నన్ను? 30

క. భార్గవుదీవనఁ గన్నయ
నర్గళమద్విపులబలమహత్త్వము సుమనో
వర్గమునకు లోఁబడునే?
దుర్గాశక్తికిని వెఱవ దుర్దమశక్తిన్. 31

---

1. యొర్చు. 2. నో.

తే. ఏయుపాయంబుచే నైన నెచ్చరిలఁగ
నీక రాక్షసకులము రమేశ్వరుండు
దునుము ననుశంక యొక్కటి మనమునందు
నున్నయది; దీని కెద్దియో యుక్తి [1]యింక. 32

కం. దీనికిఁ దగినయుపాయము
గానంబడుదాఁక శాంతికంథ తనువునం
బూని చరించుట మేలౌ
దానవకులుఁ డయ్యు నితఁడు ధార్మికుఁ డనఁగన్." 33

తే. అనువిచారంబుతో నశోకవనములోన
వాఁడు వర్తిల్లఁగా దైవవశత వచ్చె
నచటి కభినవకౌముది యనుతుషార
కరకిరణజాప్సరోజాతికన్య యొకతె. 34

ఉ. వచ్చినఁ దద్విలాసవిభవంబున కద్దనుజేంద్రు మానసం
బచ్చెరువందె మున్నటిసమస్తవిచారముఁ దక్కి మిక్కిలిన్
హెచ్చినపచ్చవిల్తుపస నెంతయుఁ జంచలభావ మొందఁ దా
నచ్చపలాక్షి కిట్లనియె నద్దివిజప్రతిపక్షుఁ డయ్యెడన్. 35

ఉ. "కోమలి! నాకు నెట్టయెడఁ గొట్టినపిండి సమస్తలోకముల్
నీమది కింపు లైనయవి నిర్భరశక్తిని దే సమర్థుఁడన్
నీమహనీయరూపరమణీయతకుం దగునట్లు గాఁగ నే
నేమగరూపు లైన ధరియింపఁగ నేర్తును గామరూపి నై.

ఆ. నన్ను నేలుకొనుము" నావుడు నేమియు
ననక తన్నునాదరావలోక

---

1. యనుచు.

ములఁ దిరస్కరించి జలజాక్షి యటు వాసి
చనుచు నుండ నతఁడు కినుకతోడ. 37

ఆ. "నాతి! యిట్లు వేఁడు న న్నాదరింపక
పోవునిన్ను [1]నింకఁ బురుషుఁ డొక్కఁ
డేలెడునె తలంక? కేరికి నెన్నిగుం
డియలు గలవు నాదుప్రియను జేర?" 38

క. అని వెఱపించిన నది దన
మనమునఁ జల మొదవ "నిన్ను మడియించిన వా
నిని దక్క నే వరింపను
విను మది నాప్రతిన దీని విడ నీఁక" ననియెన్. 39

చ. అనుడుఁ దదుక్తిక్రూరతకు నద్దనుజుం డు గడుం ఘనంబుగాఁ
గినిసియుఁ బోవ నిచ్చె నొకకీడును జేయక యవ్విలాసినిన్
మనమున 'నెప్పు డే తెఱఁగునం దన కబ్బునొ దానిసంగమం'
బనునడియాస యాకినుక కత్యధికం బగుచుం బ్రవర్తిలన్. 40

తే. అది మొదలుగాఁగ నాకన్య యరయుచుండె
"వాని మడియింప శక్తుఁ డెవ్వాఁడొ?" యనుచు
వాఁడుఁ "దనుఁ జంపఁబూనినవానిఁ జంపఁ
దనకు వర మెట్లు సాధింతు" ననుచు నుండె. 41

తే. అంతట మృగేంద్రవాహనయాలయమున
కతఁడు దైవవశంబున నరిగి యందుఁ
బ్రస్తరస్తంభలిఖితాక్షరములు చూచి
చదువుకొనుచోఁ దదంతరసరణియందు. 42

క. "ఈమెఱుఁగుగందక త్తెర

---

1. నొక్కపురుషుఁ డింక, నే.

చే మిడిదల యిచ్చుసాహసికుండు శిరం బ
ట్లే మగుడంగ నదుకుకొనం
గా మని చంపుం దనుం జంపంగడంగినవానిన్." 43

క. అనియెడియర్థముం గనుంగొని
తనయభిమతసిద్ధి కది నిదానం బగుటన్
మనమునం గడు సంతోషము
ననరారం దదుక్తరీతిం దప్పక నడిపెన్. 44

తే. నడపి తత్ఫలసంసిద్ధి నమ్మికం దన
కెందు నెదు రింక లే దని డెందమునను
గరము గర్వించి యపుడ యాఖలుండు పూనె
నన్మహాశక్తి [1]తో గుడి నవనిం గూల్ప. 45

క. అభినవకౌముదియును స
ర్వభూమిమండలమునందు వానిం దునుమం జా
లుభుజాబలాఢ్యు నరయుచు
శుభ మగుతచ్ఛక్తిమహిమసుద్ది విని మదిన్. 46

క. తనకోర్కి కెద్దియే నొక
యనుకూలం బైనత్రోవ యచ్చో సమకూ
లునో యని యక్కడికిని దాం
జనుదెంచుచు నాఖనిత్రశలునిం గనియెన్. 47

క. కని "వీం డిక్కడి కెచ్చో
ట నుండి ప్రత్యక్ష మయ్యె డగ్గఱ ! కెడగాం
జను తెరువు లేదొకో ?" యని
మనమునం దలపోసె నంతమాత్రన మందున్. 48

1. తో గుడి.

తే. ఆచకోరాక్షిఁ జూచి "యోమలగుంబోఁడి !
యేను బ్రార్థింపఁ గైకోక యెట్టివానిఁ
గాని వరియింప నంటివి గర్వవృత్తి
నల్లనాఁ డోకవనములో ?" ననుచుఁ బలికె. 49

చ. తన కపు డబ్బినట్టివరదర్పము చే నతఁ డట్లు పల్కఁ, సి,సొనరఁగ
"మీర లెవ్వరును నూఁకొనకుం డిటు చూచిచెప్పెదర్, నిను
హరియించునట్టిమహనీయబలాఢ్యుని గానియే వరింప నను
చుఁబల్కితిం గలదె పల్కు నకే!" గ్గనియోర్విధూటియున్.

తరల. అనిన "నెగ్గన నింక నెద్దియొ యంబుజాక్షి! యెఱుంగ నే
ననుపుగా నలతాళికంబమునందు వ్రాసిన వ్రాఁతఁ గ
న్గొనుము మూర్ధము గండకత్తెరఁ గూలఁజన్నియుఁ గ్రమ్మఱన్
మనినయట్టినినుం గనుంగొను మాట లెవ్వియు నేఁటికిన్? 51

వనమయూరము. నా విని సుపర్వలలనామణి వెసం ద
ద్గ్రావలిఖితాక్షరకదంబకము నార
క్షోవరుని మస్తకము గొంత యదుకుర్ ర
క్తావనియుఁ జూచి కడు నాకులతఁ జెందెన్.

స్రగ్ధర. ఈరీతిన్ ఖిన్నయై "నాహృదయము వెత యూ
హించి వారింప దిక్కె
వ్వారున్ లే ; రింక నిద్దేవతకె యుపకృపా
వర్తనన్ నన్నుఁ బ్రోవన్
భారం" బంచున్ వెసం దత్పదములఁ గెరఁగెం
బున్వెసం బోయి గర్భా

గారంబుం జొచ్చి వాఁ డక్కడనే తనదురా
కం బ్రతీక్షించుచుండెన్. 53

వ. ఇవ్విధంబునఁ బాదంబులం బడి లేవక తన తొల్లింటి ప్రతిజ్ఞా ప్రకారంబును ఖనిత్రశస్త్రలుండు పలికిన యుల్లసంపుఁబలుకును నతని గర్వకారణంబును వినిపించి, "యోమహాదేవీ! యేను వెనుకముందరలు గానక [1]కళవళపడి యున్నదాన; నాకు నెట్లో ప్రతిజ్ఞాభంగంబు గాకయుండఁ ద్రోవ యొకటి సంఘటించి రక్షింపు" మని ప్రార్థించె. మృగేంద్రవాహనయు నమ్మహారాక్షసునిచేతఁ దన సద్యోమహోపద్రంబునకు నివారకం బగుచు నొదవిన యాయువిదరాకకు సంతసిల్లుచునికిం జేసి యప్పుడుఁ తత్ప్రార్థనంబునకు శీఘ్రప్రసన్న యగుచు ని ట్లనియె. 54

ఉ. "ఈదనుజుండు దన్ను వధియింపఁ గడంగినవానిఁ జంపుటో
స్సైదలి తప్పు; దుర్గ మగుపద్ధతి నిచ్చట నాత్మమస్తక
చ్ఛేద మొనర్చుకొన్న తనిఁ జెందుఫలంబును మాన్పవచ్చునే?
నీదు ప్రతిజ్ఞకుం బరిగణించి ఘటించెద నొండుపాయమున్."

సీ. అని కొంత చింతించి యద్దేవి యభినవ
కౌముదిఁ జూచి యోకమలవదన!
వీనిసాహసకర్మవృత్తికి ఫల మెన్నఁ
దనుఁ జంపఁ బూనునాతనిని జంపు
టింతియు కాని తా నెట్లును వానిచే
మడియకుండఁగ నియమంబు లేదు
కావున నధికనిక్రముఁ డగునాఁడు వీ

1. కలవర.

నిని జంపి చచ్చు నన్నియమశక్తి

తే. నీప్రతిజ్ఞయుఁ దలఁప వీనిని దునిమిన
తీవ్రశౌర్య వరించు టింతియ కదమ్మ!
యతనిమఱుమేననైన నీప్రతిన దప్ప
కుండ వరియింపవచ్చు నీ కుచితవిధిని. 56

ఆ. ఇంక నక్షిఘనుని నెన్నిక మీఁఱంగ
నిశ్చయింపవలయు నీరజాక్షి!
యని యొకింత చింత యొనరించి తదుపాయ
మాత్మఁ గాంచి మోద మలరఁ బలికె. 57

సీ. మణికంధరుం డన గుణనిధి యొక్కఁగం
ధర్వకుమారుఁ డో తలిరుఁబోఁడి!
తన కొకకారణంబునఁ జేసి యొదవిన
యవితథోద్యమము మహాసి యొకటి
యిదె నాదుసన్నిధి నిడి పోయినాఁ డని
యాయింతి కాఖడ్గ మపుడు చూపి
నీ విది కొనిపోయి యావీరవరుచేతి
కిచ్చి వే చంపింపు మిద్దురాత్ము

తే. వీఁపు నీరూపువసఁ జిక్కి వెంటవెంట
వచ్చు నెలయించి కొనిపొమ్ము వానికడకు
నెంత విసివియు నీమీఁద నించుకయును
వెగఁ డితఁడు డెందమున నీవు వెగడ వలదు. 58

వ. ఇమ్మహాఖడ్గంబుఁ దోడ్తదత్తాత్రేయుండు స్వభావనామధేయుం
డగుసిద్ధున కిచ్చె; నతండును మణిస్తంభుం డనుతనయల్లునికిచ్చె;
నతండును నిక్కడ నొక్క ప్రయోజనంబుకొఱకు గంధర్వుం

డైనమణికంధరున కిచ్చె; దానం జేసి యిద్దివ్యాయుధం బమ్మణి
కంధరునకు సంప్రదాయాగతం బగుచుఁ గార్యకారి యగు;
నితరులకుం బనుపు సేయదు; కావున నతనిచేతిక యీవలయు
నతండు నిప్పుడు శ్రీశైలంబున నొక్కశాపంబు కారణంబుగా
భృగుపాతంబున [1]కాయితపడుచున్న వాఁడు; నీవు వేగంబ
చని "తత్ఫలంబు దీనిచేతనే యగు" నని యాభృగుపాతంబు
మాన్పి యిద్దానవువధంబునకు నియోగింపు;మాగంధర్వుండు
రెండవ మేనఁ గళాపూర్ణుం డనం గాసారనామధేయం బగు
పట్టణమునఁ బుట్టఁగలం; డతని వరియించి ప్రతిజ్ఞఁ జెల్లించి
కొనుము పొ"మ్మని యనిపిన. 59

చ. పయటఁ బిగించి నెన్నడుముపైఁ బిరిచుట్టుగఁ జుట్టి కుంతలో
చ్చయము దృఢంబుగా ముడిచి చయ్యన నచ్చటిమండలాగ్ర
ముఁగ్, శయమునఁ బూని వెల్వడియె శక్తినివాస మవక్ర
విక్రమో, దయపరిభాసమాన యగు దర్పకవైభవలక్ష్మియో
యనన్. 60

తే. ఇవ్విధంబున వెలువడి యేఁగుదెంచు
నట్టియాయింతిఁ గనుఁగొని యసుర వెఱచెఁ
'దనుఁ దునుమఁ బూని వచ్చెనో!' యని తలంచి
'దానఁ దన్నాశ మగునొ!' యన్ తలఁపు [2]వొడమ. 61

చ. అతఁ డపు డాసుధాకరనిభాననఁ గన్గొని సంభ్రమించుచున్
మతి గలగంగ నిట్లనియె "నాపయి వచ్చిన నీకు నిష్టదై
వతములయాన సుమ్ము వరవర్ణిని! యెందుఁ దలంక నేను దు
ర్మతి వయి నీవు నాకుఁ జెగి ప్రగ్గడవో"యని తల్లడిల్లదన్."

1. కాయత్తపడు. 2. తోడ.

సీ. అనుచు నయ్యింతి "యోయసురేంద్ర! నీవు నా
పాణికి నోర్వ కి ట్లాన లిడఁగ
నకట నీమీఁద రా నంత యెఱుంగని
దాన నే! యేను సీతలఁపుబడిన
నడచెద" నని తన్నుఁ గడచి చనంగఁ ద
ద్వాక్యరీతి నిజాభివాంఛితమున
కనుకూల మైనయ ట్లాత్మఁ దోఁచుటయు నతఁ
డక్కన్య వెనువెంట నంత నింత
తే. నరిగె నెందును నిలువక యబ్జముఖియు
మిగుల నెడఁబాయ కొక్కొక్కమిషముతోడ
నప్పటప్పటి కొక్కింత యాఁగిసించి
కూడ నిచ్చుచు నెలయించికొనుచుఁ జనియె. 63
శా. ఆతండుల్ మదిఁ దత్ప్రియాణవుఁ దెఱంగాత్మానురాగక్రియా
రీతిన్ మానసముల్ హరింపఁ జనియెన్ శ్రీశైలపర్యంత
ము, దుర్ఘాతానంగవిజృంభణంబువలనన్ దూరత్వముం గాన
కా,నాతిం జూచుచు "మన్మథాతురుఁడ గానన్ నేర్పునే
యేమియున్?" 64
తే. అంతట విసివి యతఁ డాలతాంగిఁ బిల్చి
"నాతలంపు వెంబడి నీవు నడచెద నని
పలికి తిది యేమి చెపుము నీభంగు లిప్పు డు
వనిత నను భ్రమయించెదో?" యనుచుఁ బలికె. 65
చ. పలికిన "నేను సీతలఁపుపద్ధతి గా కిపు డేమి మీఱి వ
ర్తిలితిఁ? వాడింబడన్ నిను వధింపఁగ వచ్చునని యటంచు "నా
కలఁగుచు రాక మూసు"మని యాసలు పెట్టఁగ నప్పు డేను సీ
తలఁపుబడిం బ్రవర్తిలఁగ దానవ! పల్కితి నప్పు నిప్పుడున్."

సీ. అనినఁ గ్రోధించి "యేఁ బ్రాణభయంబున
నీ కలంగెడువాఁడ నే? వధింపఁ
జాలక నిన్ను నీసరణిఁ గరంబు ద
వ్వనుసరించుట నన్ను నసదు గాఁగఁ
దలఁచెదు గాఁబోలుఁ! దెలుప కేరికి నెట్లు
తెలియు యుక్తమ యిది తలఁచిచూడఁ
గావున నాలావుఁ గనుఁగొను" మనుచు నా
తరలాక్షి నప్పుడు దాఁకకుండ

ఆ. ఘోరశిలలవృష్టి గురియించె నొడలు వీ
గించి యతఁడు నికటగిరులు గాఁడ
గురుతరద్రుమములు గుది గ్రుచ్చునట్లుగ
నిఖిలజంతుతతులు నేలఁ గలయ. 67

తే. ఇత్తెఱంగునఁ దనశక్తి యెఱుకపఱచి
"యింక వరింపక చనియెదే యీవు చనిన
చోటు లన్నియు నాబలస్ఫూర్తిచేతఁ
బిడుగు పాటినడొంకయై పెం పడంగు. 68

ఆ. దాన నఖిలభయనిదానంబ వగుదు నీ
యన్వయమున లేనియట్టి తిట్టు
కుడువ నీకుఁ దగునె కోమలి? యిది యెంచి
యైన నను వరింపు" మనుచుఁ బలికె. 69

క. అన విని "యింక నిట్టట్టు తడ
సినఁ గార్యము తప్పు" ననుచు శ్రీగిరికి వడిఁ
జనియె సతి యింత నంతట
దనుజుఁడు దన్నొక్కనియె శిలలతతులు గురియుచున్. 70

వ. అంత నాయింతియు నత్యంతరయంబునం జని యప్పు డప్పర్వ తంబునందు శివరాత్రిమహోత్సవమునకుం జేరిన సకలదిగ్దేశ జనసముదయంబునకువాని రాక యెఱింగించి "మీకన్నగతులు చూచుకొం"డని పల్కి మణికంధరుం డున్నచోటు పరికించి వేవేగ నేఁగి యతనిచేలికిం దనచేతియమోఘోద్యమఖడ్గంబు నొసంగి యవ్విధంబున నాశల్యాసురుని జంపించి యతనిచేతఁ బొలిసిన మణికంధరుని రెండవజన్మంబు గనిపెట్టుకొనియుండె; నతం డంతఁ గళాపూర్ణుం డై జనియింప నుచితగతిం జేరి తనపూర్వవృత్తంబువివరించి దివంబునకుం జనక యావజ్జీవంబు నవ్విభుం డునిచినచోటనయునికికినొడంబడి గాంధర్వవివాహ విధిని వరియించె; నంతట మదాశయుండు స్వభావసిద్ధునివచన ప్రకారంబున సకలశత్రుజయగర్వితుం డగుచు నెందు నడ్డంబు లేక చరియించువాఁడు గతివశంబునఁ గాసారపురంబు పై నేతెంచి యిమ్మహారాజునకుఁ బరాజితుండై తనభార్యయు దానును దాసత్వంబునఁ బనులు సేయుచుండె; నక్కాలంబు నందు వారికి నేతదీయమణిసందర్శన మహిమవలన నే నుద యించితి; నంతట నాతల్లిదండ్రులు నేలికచిత్తంబున కెడసిరి. తత్ప్రకారంబు సరస్వతీకనకగర్భుల సల్లాపకథయందు వినం బడిన యదియ; య ట్లెడసి వార లీక్రముకకంఠోత్తర పురంబు వెలువడి పోయి ప్రయాణక్షోభంబునఁ గృశత్వంబు నొంది తేఱక యున్న నన్నుం [1]గొనుచుఁ దిరిగివచ్చి నేఁ డింతకు మున్నుగా నొదవిన యేతన్మాణిక్యవిలోకనమహత్త్వం

1. జూచి, గన్నుం గొనుచు.

బున నే నారోగ్యంబు నొంది మిక్కిలి యెలమిం బొదల హృద యంబులముదంబు నద్భుతంబు నొందుచు నివ్విధంబున నివ్విభు సన్నిధి నిడి మదీయదౌర్బల్యనివర్తన ప్రకారంబు విన్నవించి సన్నుతించిరి. తత్పురోహితులును మణిమహిమ వశీకృతు లగుచు నిమ్మేదినీశ్వరుఁ గ్రమ్మఱ నాశ్రయించి యిదె యున్నవా రని చెప్పిన, నలఘువ్రతుం డబ్బాలికకుఁ గేలు మొగిచి "యోదివ్యమహిమశోభిని! యాపురోహితు లెవ్వరు? వారి తెఱం గెఱుంగవలయు." నని యడిగిన. 71

క. "వారి తెఱం గే మెఱిఁగెదు?
సారగుణా! వారు నీదుసత్పుత్త్రులు; నీ
తోరపుభాగ్యము నిన్నును
జేరిచె" నని పలికె శిశువు చిఱునగ వెసఁగన్. 72

క. ఆపలుకున కత్యాశ్చ
ర్యాపూర్ణమనస్కుఁ డగుచు నలఘువ్రతుఁ డా
పాపం గనుఁగొని "వారలు
నాపుత్త్రకు లగుట యెట్లు? నవ్విక చెపుమా!" 73

వ. అనిన సభాపతిం జూచి యి ట్లనియె. 74

ఆ. [1]"అంటి కుంచి యాఁడునట్టిప్రాయ మొకింత
నడచునంతలోన నాదుసతులఁ
బుణ్యశీలవతులఁ బోకార్చుకొన్నట్టి
నాకుఁ బుత్త్రు లనుట నగవు గాదె! 75

చ. తలఁపఁగ వారిపోకయును దక్కినయట్టిది కాదు; వారిలోఁ
పలఁ బడి యందుఁ బడ్డవియె పాటుగఁ దీరమునింగిపోయి; రే

1. అంటకుండి.

నలఘుతదన్వయాకృతిగుణాదులమక్కువ నన్యసంగమే
చ్ఛ లడిగినాఁడఁ; బుత్త్రులను సంశయ మైనను గల్గనేర్చునే!

ఆ. నాకుఁ జూడ ధరణినాయక! యిది యసం
గతమ; యీవిచిత్రకథల తల్లి
దీని కొనర నేగతిని 'బట్టతలలు మోఁ
కాళ్లు ముళ్లు పెట్టఁ గలవొ కాని.' 77

వ. అనుటయు నట్లతప్ప దనుచు నవ్వి యవ్వసుమతీధవుండు నమ్మధురలాలస నాలోకించి "యోబాలికాతిలకంబ, యీసందియంబు దీర నీబ్రాహ్మణునిజన్మాదివర్తనంబు నితనికిఁ బ్రథమాగమాదులు పుత్త్రులైన ప్రకారంబును, వారు మదాశయునకుఁ బురోహితు లైన తెఱంగును నెఱింగింపు." మనిన నట్ల చేసెద" నని యబ్బాల యి ట్లని చెప్పె. 78

సీ. "జననాథ పాండ్యదేశమునందు నురగాఖ్య
పట్టణంబున నొక బ్రాహ్మణుండు
సోమశర్మాఖ్యుఁడు శ్రుతిపారగుఁడు తపో
యోగాధికుండు శ్రీయుతుఁడు గలఁడు;
తత్త్వజ్ఞుఁడయ్యు నాతఁడు గుప్తమాహాత్మ్యుఁ
డగుచు గృహస్థాశ్రమార్హ విధులు
జగదనుగ్రహణార్థముగ నడపుచు నందు
నతిముఖ్య మని సంతతాన్నదాన

తే. విధిని విప్రులఁ దనుపుచు వెలసె; నతని
యాత్మజుఁడు యజ్ఞశర్మాఖ్యుఁ; డతని కంట
దయ్యె వేదాదివిద్యలయం దొకటియుఁ
బరమయత్నంబుతో నెన్నిపాట్లు పడిన. 79

క. ఆదుఃఖము మఱపించుట
కై దివ్యాంగనలఁ బోలునతివలఁ గులశీ
లాదిగుణాఢ్యల నలువుర
నాదరమునఁ బెండ్లి చేసె నతనికి గురుఁడున్. 80

క. ఆకోడండ్రకు సొమ్ములుఁ
గోకలు నను లేపనములుఁ గొదవ యించుకయున్
లేక ప్రవర్తిల నడపె న
నాకులతం గొమరుఁ డెంత మలరారుటకై. 81

క. కడపటి దెసయం దాతఁడు
కొడుకుఁ బిలిచి యిట్టు లనియెఁ గోడండ్రు విన్న
"నడపుము నీ వెట్లైనను
విడువక మన యన్నదానవిధినియమంబున్. 82

క. దానను జతురాగమసం
తానం బుదయించు నీకుఁ; దప్పదు మద్వా
చానియమం బిది" యనుటయుఁ
గానిం డని యియ్యకొనియెఁ గడఁక నతండున్. 83

ఉ. ఆయన తండ్రియాజ్ఞఁదనయాత్మఁదాల్చియొకప్పుడున్ మదిన్
బాయక పెంచునట్టి పితృభక్తిపసం గలమాన్యముల్ హవిర్
పాయసపూపసూపబహుపక్వఫలాదుల నంత కంత కిం
పై [1]యమరంగఁ బెట్టె వసుధామరకోటి కనేకవర్షముల్. 84

చ. పయిఁబయిఁ బండుకొల్చు విరివైఁడియు గట్టినుస్సుఱాయి
ఱప్పయుమఱిబంటుబానిసలుఁ బైరముఁ బెయ్యయుఁ జేనుఁ

1. యతుదండ.

జెట్టులో,నయినసమస్తసంపదలు నన్నపతీర్థికి వెచ్చ[1]పెట్టఁగాఁ,
బ్రియులు ధరించుసొమ్ములకుఁ జేటనఁబెట్టఁ జలింప కంతటన్.

వ. ఇట్లు కడంగి పరమపతివ్రతలం దన సతుల నలువుర నుప
లక్షించి. 86

ఉ. "ఏకలకంఠిసొమ్ము హరియింతును ము"న్నని చింతిలెన్; సమ
స్తోకమనోనురాగత; సతుల్ దను నంతట "నాదుసొమ్మె ముం
గైకొను;నాదుసొమ్మును గైకొను;"మంచుఁగడంగి వేఁడఁగా
"నేకలకంఠిసొమ్ము హరియింతును ము"న్నని యట్లు చింతిలెన్.

వ. అప్పుడు. 88

ఉ. మంగళసూత్రమొక్కటియె మాని సమస్తవిభూషణంబులున్
రంగదభంగురప్రణయరమ్యత నొండొరుమీఱి నూడ్చుచుం
బొంగుచుఁ దెచ్చియుంపటనుఁ బోపిడు కాంతల రూపుతొంటికం
టెంగరఁగించెఁ గాంతుఁ; 'బ్రకటీకృతభక్తియె సొమ్ము సాధ్వికిన్'.

తే. వెచ్చ మన్న దానమ్మంట వేఁడువాఁడ
ధీశ్వరుండంట తాము పతివ్రతలంట
యొండొరుల మీఱి యిట్లు సొమ్మొసగు టదె
యది యలంకృతికంటె రమ్యంబు గాదె. 90

ఉ. "సొమ్ములు వేఁడి పుచ్చుకొనుచోట్ల సపత్నులమచ్చరంబు లో
కమ్మున నెచ్చటం గలదు గాని నిజాభరణంబు లెల్లఁ దా
రిమ్మెయి నాథు వెచ్చమున కిచ్చుట కొండొరు మీఱు పుణ్యపుం
గొమ్మలు వీరె" యంచు జనకోటి నుతించెను వారి నత్తఱిన్.

వ. ఇవ్విధంబునం దమ తమ సొమ్ములె మున్ను పుచ్చుకొనుటకుం
ద్రికరణైక్యంబు గానుపింపం బ్రార్థించు నిజసతులయందు

1. పోవఁగాఁ.

నెవ్వారి నతిక్రమింపం జాలక యాతం డందఱుఁ బ్రియంబునం
జేకొని తదాభరణంబు లన్నియు నొక్కమాఱె పుచ్చుకొని
వెచ్చపెట్టం దొడంగెఁ దత్కాలంబున. 92

క. మతిలో "జతురాగమసం
తతి నీ కుదయించు" ననిన తండ్రిపలుకు సు
స్థితముగఁ దదాశకతమున
సతతము నతఁ డుండు జదువుసంధ్యలదండన్. 93

క. దానికి ఫల మపు డేమియుఁ
గానక యుండియు "గురూత్క్రిక్రమ మెద్దియు యె
వ్వానికిఁ దెలియు" నటంచును
దా నెప్పటియట్ల యన్నదానము నడపున్. 94

క. ఆయజ్ఞశర్ముఁడే సు
మ్నాయలఘువ్రతుఁడు మేదినీశ్వర యీపే
రాయన్నదానసువ్రత
మేయెడ విడ కునికి నప్పు డితనికిఁ గలిగెన్. 95

ఉ. ఏ మని చెప్పవచ్చునపు డింతులసొమ్ములు చెల్లిపోవ ద
త్ప్రేమము నెక్కడం జదువఁ బెట్టెనొ గట్టిగ నిశ్చయించె నా
భామల జట్టి యిచ్చి తనపట్టినయట్లికడింది నేమముం,దా మఱి
కొన్నినాళ్లవిహతంబుగ నిల్పుకొనన్ మనంబులోన్. 96

వ. ఇట్లు నిశ్చయించి వారి కది యెఱింగింపక కపటమార్గంబున
నమ్ముకొనునుపాయంబు చింతించి యొక్కనాఁ డక్కొమ్మలతో
ని ట్లనియె. 97

ఆ. "తామ్రపర్ణి రేవుదండ నోడలు డిగి
యున్నవియఁట యేను నువిదలార!

యొకనిపొత్తుగూడి యోడబేరము వోయె
దను సదాన్నదానధనముకొఱకు." 98

చ. అనవుడు "నిన్నుఁబాసి క్షణమైన గృహంబున నుండ
నోప మే, మును నినుఁ గూడి వచ్చెదము మోదముతో
మముఁ దోడుకొంచుఁ బో", మ్మన "నిది లెస్సకార్య" మని.
యందఱి కొక్కబేహరిచే రహ, స్యనియతి మూల్య మందు
కొని యచ్చటికిం గొనిపోయె వారలన్. 99

క. విను మధిప యట్లు కొనిపో
యి నయంబున నొక్కనావ యెక్కించెఁ దాదం
దన కెక్కఁగ నెడ లేకుం
డను మునుపటిపదరుఁగట్టడం గల మరిగెన్. 100

క. పదిమైమబార లెడగా
నది యాగతిఁ గదలి పోన నపు డే మని చె
ప్పుదు నరవర! శోకమహా
భిదుర మితనిధైర్యగిరిని బిట్టు పగిల్చెన్. 101

వ. ఇట్లు విశకలితధైర్యం డై. 102

మ. "అతిదుష్టం బగు[1]నాథ నేచ్చ తుద నాహా యింతకుం దెచ్చె నే.
సతులారా మిము!" నంచు "రూపగుణవంశస్ఫూర్జితల్
మీర లి,ట్లతికష్టస్థితి నోడబేహరులపా లై పోవ నాచెట్ట ప
ట్టితి రే?" యంచు మహారవం బడర నేడ్చెన్ శోకవేగంబునన్.

క. ఆయేడ్పు విని సతుల్ "తము
నాయకు వంచించి యిట్లు [2]నావధిపతిఁ గొం

1. నాదుచేత తుశ. 2. నావధిపతి కొం.

పోయెదనో! యని ఘనశో
కాయత్తత నలువురును మహాసంభ్రమతన్. 104

క. జడనిధిలోఁ బడ నుఱికిరి
[1]పడ నెవ్వారలును నొడిసిపట్ట నిలుపఁగా
నేడఁ గానక హాహారవ
మడర మహాశోకసంభ్రమాకలితులు గాన్. 105

ఉ. పట్టఁగలేమి కొంపోవులఁ బల్లఱుఁ జాల దిసంతు గొట్టుచున్
దిట్టుచు నీటిలో వలలు తీవ్రరయంబున వైచియున్ గడున్
దిట్టల నీతకాండ్ర జడధిం బడఁ ద్రోసియుఁ దజ్జనుల్ గరం
బట్టియొడన్ గడంక మెఱయన్ వెదకించిరి వారిఁ బల్లరున్.

వ. ఇవ్విధంబునం దడవుగా వెదకి మునితలఁ గానరైరి. వారిం
గొన్నట్టిసెట్టి యంత నివ్వపురినిం బలాత్కారంబున నాక్ర
మించి "నీయేడ్పుకతన నింత పుట్టె" నని తన్మాల్యధనంబు
గ్రమ్మఱం గొని విడిచిపెట్టె; నట్టిపాట్లం బడిన యితండు
తనకు సుతు లనిమెడు నామాట నమ్మ కెట్లాడిన నుచితంబ.

క. అత్తలిరుఁబోండ్లయవ్వలి
వృత్తము వినిపింతు నింక విను మోభూపా
శ్రోత్తమ వారత్తెఱఁగునఁ
చత్తఱపడి నీట నుఱుకుతత్సమయమునన్. 108

క. బలుమీ నొక్కటి నోరన్
సలిలం బెగఁ గ్రోలుచుండఁ జని రాచెలువల్
నలువురు దద్వదనములో
పలి కాసలిలంబువెంటఁ బార్థివతిలకా! 109

1. బడిబడి నెవ్వారునాడి.

ఉ. అంతన దవ్వుగాఁ బఱచి యంబుచరంబు సయోషపూర్ణవ
క్రాంతరతోయ మూర్ధ్వముఖమై ప్రవహింపఁగ మూర్ధ
రంధ్రని, షాత్కృతము చేసెఁ దజ్జలము రాజిలె వారుణకేతు
లీల నా; యింతులు వొల్చి రందు లిఖయించినబంగరు
తీఁగలో యనన్. 110

సీ. ఆపీనజలవలాహకముతో గగనంబు
దిరుగఁ బ్రాఁకుమెఱుఁగుఁదీఁగ లనఁగ
సురనదిఁ జల్లఁ [1]బూఁచునముద్రచేతికా
శ్మీరజంబాలంపుఁజాఱ లనఁగ
బలుమిాలచముకు జొబ్బిలఁ బొగతోఁ బర్వ
తోయేంధనపుమంటతునుక లనఁగ
నందులకుఁ గూర్మి యన్వసిఁడిమేల్ దెలుపువా
రిధినిల్పు నొరగంటిరేక లనఁగ

ఆ. విపులమానమస్తవివరనిర్గమితోర్ధ్వ
గామితతమహోదకప్రవాహ
సంగతిని బయోదసరణికి నెగయునా
సతులు గానుపించి రతులలీల. 111

తే. మిగుల దవ్వుగ నెగసి యా మగువ లంత
నుత్తరంబుగఁ జను చున్నయొకవిమాన
వరమువిాఁదటఁ బడి రందు[2]గరిమ జూడ
మాడుచును బోవుయువయుగ్మ మదరిపడఁగ. 112

వ. ఇవ్విధంబున నద్దివ్యవిమానంబు మీఁదం బడి యొక్కింత
తడవునకు మూర్ఛఁదేఱి కనువిచ్చిన యచ్చెలువల తొడిపఁ

1. బూఁచు. 2. వగను.

వలచూచి యలఘుకారుణ్యంబున నద్దివ్యమిథునంబు దివ్యాం
బరంబు లొసంగి యూఱడించి, మీ రెవ్వ! రెచ్చటనుండి
యిచ్చటం బడితి” రని యడుగుటయు నప్పుడంతులు [1]వడవడ
వడంకులు గుడుచుకులుకు జిలుంగులతోఁ బలుకం దొడంగిన.

క. తాంబూలరాగకించి
చ్చుంబితతద్దంతకాంతిసొబగెంతయు ర
మ్యం బగుచు నందు దివ్యని
తంబినిచిత్తమున కద్భుతం బొనరించెన్. 114

తే. మున్ను తద్రూపలావణ్యములకుఁ దనదు
నాయకునిచిత్త మె ట్లగునో యటంచుఁ
వలఁకు దివ్యవధూటికి నాతలిఁబోండ్ల
పలువపుసయొప్పుఁ బలుకులుఁ గలఁచె మిగుల. 115

తే. ఇట్లు శంకిత యగుచు నాయిగురుఁబోఁడి
కాంతు నీక్షించి వాచాలకత యటుండ
నిచ్చి నీపంథె మాడుకొ మ్మేల యాల
సింప? నీయాట యోడవచ్చినది యనియె. 116

ఉత్సాహ—
అని యొకింత వారిఁ జూచి “యమ్మలార యిప్ప డే
ననిమాట మీకుఁ గోప మైన నయ్యెఁ; గాని యీ
యన ననుం బరాకుపఱచి యాటగెలుపు తనదిగా
వెనుక వాదు లాడ నేను వినఁగఁ జాల” నని తగన్. 117

వ. విభునిం జూచి. 118

ఉ. ఆడితె నీదు పందె మని హాస్తనఖప్రసరచ్ఛవిచ్ఛటా
మ్రేడితపాండురద్యుతిసమృద్ధి గరం బమరంగఁ జాచికల్

1. వడవడక లుడుఁగుచుఁ గుంబు.

వేడుకతోడఁ బుచ్చుకొని వ్రేళ్లను నిట్టు నటుల్ బొరల్చి వి
భ్రాడకలంకకంకణవిరావము మీఱఁ గదల్చి వైచుచున్.

సీ. నిలు మహాభ్రాంకకు నెత్తకమ్మా యంచుఁ
బతుకు లుల్కెడు నొయ్యఁ బలుకు మనుచుఁ
జిక్కె నీసారె నాచే నంచుఁ జిక్కె నో
నేనిపాలిటికూఁడు దిన్న ననుచు
నదె దుగ తివకుమీ సుదతి నీ వంచు నో
నిదె సారె దాఁకె నీ యిచ్చ యంచు
నినుమాటు దంచిన నెసటిపోఁత లటంచు
నో న ట్ల యుడికె(దు)డుఁగాని యంచు

తే. నిట్టిదంటమాటలు నేర్చి తెచట ననుచు
నంట నే నోట నీసంగతమున నంచుఁ
దమపరస్పరసరసవాక్యములు దనర
నెలఁత తనవల్లభుఁడు దాను నెత్తమాడె. 120

చ. కుపఁ గవ వాసి కుండుటను జక్కనజోళ్లమనోసు రాగ మే
ల పొగడ నతిపాతిశయ లబ్ధసుసంగమశారికల్ క్షణం
బపుడ వియోగమొంది యహాహా వెసఁ జావఁ దొడంగెఁ
దుల్యరా, గపుఁబసయుం బరిస్ఫుటము కాదె తదీయమ
యెల్ల వారికిన్. 121

ఉ. సారెకుఁ బోటు దాఁకినను జాడ్యము నొందక జోడు విచ్చిపో
సారెఁ గడంకతోఁ బొడిచి చాటుచుఁ దీవ్రరణస్ఫురన్మహా
శారిఫలప్రఘట్టనలఁ జాలఁగ మచ్చర మెక్క నయ్యెడన్
వారలు బోదులుంబలె నొనర్చిరిజూదపుఁబోరుమీఱుచున్.

తే. అంతఁ బతి గెల్చి తత్పణ మైనయట్టి
యాస్యమద్యసద్యోదాన మధురసంజ్ఞ
నడుగఁ దల యొయ్య నూఁచుచు నన్యసతుల
యునికి గనుసన్నఁ జూపె నాయుత్పలాక్షి. 123

ఉ. ఆమధురంపు[1]సొంపు కడు నాత్మఁ గెరల్ప నతండు చూడ్కి నే
వేమఱుఁ దా నదల్చియును వేఁడియు మ్రొక్కియు బుజ్జ
గించియుఁ, భామిని నప్పుడే తనదుహస్నిద మీఁ బుడికొల్పి
వాగు మార్మి మిడి చూడ కున్కఁ దన మో మొకకొంత
మఱంచి చూచుచున్. 124

చ. చెలువయు మున్న యాయితము చేసి సమీపమునందు
నిడ్డయుజ్జ్వలమణిపాత్రికామధురసంబు నిజాస్యమునందు
నించి నాఁ, జెలువునినోరి కిచ్చెఁ బెఱచెల్వలు చూచెదరో
యటంచుఁ జంచలితకటాక్షవీక్షణము సారెకు వారలపై
నిగుడ్చుచున్. 125

ఉ. అంతటఁ బోక పెచ్చుప్రణయవ్యసనం బెసకొల్పఁ గ్రోలి రా
కాంతుఁడుఁ గాంతయుం మఱియుఁ గల్పకుజాసవముం బర
స్పరా, క్రాంతమిథఃగి కపోలఫలకప్రతిబింబవిలోకనామృతా
త్యంతవితీర్ణనూతనరసానుభవంబుగ నేకపాత్రికన్. 126

ఉ. చెక్కునఁ జెక్కు హత్తి విలసిల్లఁగఁ దత్ప్రతిబింబవీక్షలం
జొక్కుచుఁ జెక్కువాసనలసొంపున నింపు జనింప జుఱ్ఱునన్
గ్రుక్కెఁడు గ్రుక్కెఁడే మధువు గ్రోలుచు మోవులు నంజు
కొంచు వా, రెక్కుడు గాఁగఁ దన్పిరి నిజేంద్రియపంచక దైవ
తంబులన్. 127

1. ఁజూపు.

ఉ. సిబ్బితిపేరు పోఁ గుడిచి సీధుమదం బపు డన్నుకొల్పుచుం
బ్రబ్బఁగ మాట లక్షరవిభాగము చాలక యేమొ యేమొ త
బ్బిబ్బిలుగాఁగ వెల్వడియె భేదిలెమానము సోలుచూపులున్
నిబ్బర మైన కెంజిగియు నేత్రములం దుదయించె [1]వారికిన్.

ఉ. అంతటఁ బానపాత్రమున నాత్మముఖంబు నధీశుమోము సీ
మంతిని చూచి "యోరి పరమానిని పానసహాయ మయ్యె నే
యింతటిలోన నీకు నిది యెవ్వతె" యంచును జిహ్వ యాడ
కత్యంతముఁ దోట్రిలం బలికెఁ బన్మథు వానక మానె
నల్కతోన్. 129

వ. అప్పు డతండు. 130

ఉ. చేడియ లెస్స చూడు మెఱచేడియ యెయ్యది యిందులోన నీ
నీడయ కాక ? యన్న నవనీసురభార్యలఁ జూపి యాకె "నా
నీడలె వీరు; న ట్లయిన నీవు ననుం బలె నౌర వీరలన్
వేఁడుకఁ జూతువో వలదు వీరికి నిచ్చుట"నంచు భీతిలెన్. 131

వ. ఇవ్విధంబున నవ్వధూమణిమధుమదంబున మది చెదర యుక్తా
యుక్తవివేకంబు లేక యాకొమ్మలవలనం దలంకుపుట్టి యిలకు
డింప నుద్యోగించి నిజవిమానయానానుసారంబున గోదావరీ
సరిత్సమీప[2]పరిదృశ్యమాన ధర్మపురీనామనగర వాస్తవ్య
వారముఖ్యా కేళిసౌధంబు గగనంబుతో నొరయుచు సమీ
పంబున దీపింపఁ దదీయచంద్రశాలాప్రాంగణంబు చేర
నాత్మీయదివ్యవిమానంబు నియోగించి యాగరితల నలువురం
గ్రమంబునఁ దాన కైదండ యిచ్చి యచ్చట దించి తనచేత

1. నాతికిన్. 2. దరీదృ.

కనుమతింపక యిట్టట్టు నట్టుకొట్టుచున్న వల్లభుం జూచి
యుల్లంబునం బక్కినచింత వదలి పొదంపు పొదండు; వీరల
చేరిక జారభావంబునం గోరువాఁడు నాచేత నవశ్యంబును
నొచ్చు ననుచు [1]వాహనారోహణం బొనర్చిన నతండు "నాకు
నిట్టి తలం పేమియు లే దిమ్మగువల కాహారాదు లెట్లని
విచారించెదం గాని" యనుటయు నాయువిద యతనికి నా
సౌధోత్తమంబులోపలి పలు తెఱంగుల [2]యరలు కరంబునం 132
జూపుచు.

చ. "అదె ఘృతతండులప్రకర మల్లదె చీరలు భూషణాదిసం
పదలవె రాజు రాక కులుపాయొనగూర్చినయట్లు మీ కెదుర్,
ముదితల కేమియచ్చికము మూషత నిం దొరు లెవ్విముట్టి
నక్, బ్రదుకనివారు వా రనుచు" భామిని యేఁగె నిజేచ్ఛఁ
గాంతుతోన్. 133

తే. ఆత్మవిభుచిత్తచలనశంకాంకురంబు
వలనఁ గాదంబరీమదాకులతవలన
వెడలుతద్వాక్యములచొప్పు విప్రసతుల
ప్రాణశీలాదిరక్షకై పరిణమించె. 134

క. ఆమగువ యట్లు పలుకుచు
నామేడన్ వారి నిలిపి యరుగు తెఱఁగుఁ ద
త్స్వామిని యగుగణికామణి
దా మఱుఁగున నుండి చూచి తలఁకెడునదితోన్. 135

క. "ఎవ్వారో దివ్యస్త్రీ
లివ్వరసౌధంబు నాశ్రయించి రిచటికిన్

1. విమానారో. 2. వస్తుప్రకరంబు కరంబునం.

నవైవ్రతి! మిచటివస్తువు
లెవ్వియు నాసించు టొప్ప దింక మా"కనుచున్. 136

మ. తలపోఁతల్ వొడమంగ గూఢసరణిం దత్సౌధముక్తాఁ డిగ్గి
యా, తలిసుంబోఁడి తదాభిముఖ్య మమరం దా మ్రొక్కి-
"యుష్మేశ నిం,పాలయక్షా నిల్చిన యమ్మలార! యిపు డిం
దున్నట్టి నాసర్వవ,స్తులు మీ కిచ్చితి ధారవోసి యిదె"
యంచుం [1]జల్లెఁ దోయాంజలుల్. 137

క. చెల్లి మదీయ మ్మయి వ
ర్తిల్లెడునీచుట్టుపట్టుగృహావనముఖ్యం
బెల్లను మీపా ల్మిఁక మముఁ
జల్లఁగఁ జలికాలఁ దన్ని సాకుం డనిచున్. 138

క. అని యాయాచోటులఁ దన
జనులం బిలుచుకొని వెడలి చని యాసుద్దుల్
వినిపించెఁ బట్టణములో
మనుజుల కంచుకు వెలుఁగు మనమునఁ దనరన్. 139

ఆ. ఆమెఱుంగుఁబోఁడిన్ నపు డవ్విధం బెల్లఁ
జూచి యిది కరంబు చోద్య మనుచు
దీనజనులపాల దేవుఁ డెంతుసు గలఁ
డనుచు సారెఁ జెప్పుకొనుచు నరిగి. 140

క. వారలుఁ దమతలవాకిటి
బోరుతలుపు లెట్టిసమయములఁ దెఱవక తా
రారసి పదిలము సేయుచు
నారూఢస్థితి వహించి రాసౌధములోన్. 141

---

1. వేగఁదో.

క. శకునాదులచే నిజనా
యకపునరభిసంగమాశ లపు డుదయింపన్
వికలత నొందనిధైర్యా
ధికతన్ వర్తిలి రభీష్టదేహాభరణలై. 142

ఉ. పురజను లప్పటప్పటికిఁ బుణ్యచరిత్రుల వారలన్ విభా
స్వరమణిసౌధమార్గములఁ వచ్చుచుఁ బోవుచు నుండఁ
జూచుచుం, గరములు మోడ్చి మ్రొక్కుదురు గాని
తదీయసురూపలక్ష్మి కెవ్వరుఁ బెఱపోకఁబోరు మనువార్త
విధం బెద నిల్చి పాయమిన్. 143

శా. గంధర్వాంగనలో మరుత్సతులో యక్షస్త్రీలో యిమ్మేడలో
నింధానద్యుతితో మెలంగుదు రహో! యెవ్వాఁడు పాపస్పృ
హా,గంధిస్వాంతతఁజూచినన్ మనఁ డటేకన్గొండటంచుం బ్రజా
బంధుల్ వేళలు గాచి చూతు రతితాత్పర్యంబుతో వారలన్.

సీ. "నభమున మణివిమానమునఁ గ్రుమ్మరువార
లిమేడఁ బెక్కునాళ్లిట్టు నిలిచి
యిలలోనిజనములఁబలె వండుకొని వార్చు
కొని గణికావర్త మనుభవింప
నేమివ్రత మొకొ? యిది యెన్నినాళ్లకొ?
యావేశ్య యెట్టిధన్యాత్మయొకొ?
యేము సమర్పింప నిల్లు కైకొని కరు
ణింతురో?" యని పౌరు లంతఁ దెచ్చి

తే. పెట్టసాగిరి తద్ద్వారపృథివి యలికి
ముగ్గతండులఘృతపయోముఖ్యవితతు

లప్పటప్పటికిని వ్రాయ నవి పరిగ్ర
హించి రాజను లతిదూర మేఁగి మ్రొక్క. 145

ఆ. అంతఁ గొన్నినాళ్ల కాపతివ్రతలకు
నలువురకును శోభనత్వ మొదవ
గర్భలక్షణములు గాన్పించెఁ బరిపూర్ణ
గర్భతయుఁ దనర్చెఁ గ్రమముతోడ. 146

ఉ. గర్భములందునుండియుఁ బ్రకాశిత నప్పుడు నేర్పెలర్పఁగా
నర్భకు లొక్కవేళఁ జతురాగమసూక్తుల నొక్కవేళ శా
స్త్రార్భటి నొక్కవేళ నితిహాసమయోక్తుల నొక్కవేళ నా
విర్భవదర్థశాస్త్రముల వేడ్కఁ జెలంగుదు రద్భుతంబుగన్.

వ. అంత. 148

క. జ్యేష్ఠానుపూర్వి నార్య
శ్రేష్ఠులు పుట్టిరి శుభోల్లసితలగ్నమునన్
నిష్ఠాగుణసౌభాగ్య గ
రిష్ఠుల కానలువురకు ధరిత్రీనాథా! 149

క. వారలకు యదృచ్ఛాసం
చారంబున నొదవి యొక్కసంయమి విహితా
చారము నడపుచు శుభసం
స్కారము లొనరించె జాతకర్మాదికముల్. 150

వ. నామకరణసమయంబున నతం డాశిశువుల యనుభావంబుఁ
దనదు విజ్ఞానదృష్టిం బరికించి 'వీరలు మూర్తిమంతంబు లైన
వేదంబు' లని నిశ్చయించియు జన్మాగమప్రకారంబు ననుసరిం
చియు వరుస నన్నలువురకుం బ్రథమాగమ ద్వితీయాగమ
తృతీయాగమ తురీయాగము లను పేళ్లు గల్పించెఁ; దన్మాతలు

పూర్వకాలంబునఁ దమ మామ పలికిన చతురాగమసంతాన శబ్దంబునకు నర్థంబు వీర యని తమలోఁ దారు సరిపుచ్చుకొని సంతసిలుచు నప్పటిసంయమీంద్రునియెఱుకకు వెఱఁగుపడుచు నక్కుమారులకు నుచితకాలంబున వచ్చి యుపనయనసిద్ధి యొదవించుటకు నాతపస్విని వేఁడుకొని యట్లు సేయించి, రా బ్రహ్మచారులు స్వయంప్రకాశిత సకలవిద్యలయ్యు శాస్త్రసిద్ధికొఱకు నతనియొద్దన యఖిలవిద్యలు నత్యల్పకాలంబులోపలన యధ్యయనంబు చేసి రంతఁ దన్మాత లెంతకాలం బిట్లున్నను దమ పెనిమిటి సమాగమంబు దుర్లభంబ యని విచారించి యచ్చోటు విడిచి యెచ్చటికేనియుం బోవఁ దలంచి యది తమ కుమారులఁ బిలిచి తెలిపిన వారలి ట్లనిరి. 151

క. "పెద్దతల లేక మీరి
నిద్దపురూపముల నెచట నిల్చిన మనకుం
బెద్దఱికము చాలదు; పెఱ
సుద్దులు గల్పింతు; రెందు సుజనులు గలరే! 152

క. కావున నిచటన మీ రి
'దైవతవనిత' లనుగుట్టు దప్పక యుండన్
ద్రోవుఁడు దివసము లే మొక
భూవరుఁ గని వైభవంబుఁ బొందెడుదాఁకన్. 153

తే. అపుడు గాని మాతండ్రి యున్నట్టిచోటు
నరసి సంధించుకొనుటకు వెరపుపడదు

తప్ప దిది" యని వారలు తమనివాస
మొదు లెఱుఁగ కుండ వెలువడి యరిగి రంత. 154

వ. అట్లరిగి యాబ్రహ్మచారులు నలువురు పురంబులోనం గొంత సంచారంబు చేసి యప్పు డది యేలెడురాజు మదాశయుండు గావున నతని వాఁకిటికిం జని "యతండు సకలవిద్యావిశేషజ్ఞుం" డనియుఁ, "దద్దర్శనంబు పురోహితునియనుమతి లేక బ్రాహ్మణుల కెవ్వరికి దొరక" దనియు; నతండు దాను విద్యాధికుండు కాకుండుటంజేసి నిజగౌరవశైథిల్యభయంబున నితరు లగువిద్యాధికులకు రాజగృహంబునఁ బ్రవేశంబు లేకయుండ దౌవారికాదిసకలపరిజనచక్రంబును వశ కట్టుకొని యుండుటయుఁ బ్రభువునకు యాగేచ్ఛ గలిగి తన తోడ విచారించినఁ "దదార్త్విజ్యసమస్థుల నెచ్చటం గాన" మని[1]పరిహరించుటయు నచ్చటి జనంబులవలన విని మఱి యును. 155

సీ. "ఎవ్వరి నేసుద్ది ద్రవ్వించి యెచ్చోట
నేశాస్త్రఘనుకల్మి యెఱిఁగికొనునొ
మను జేశుఁ?" డనుచు నేపనికి వెల్పలివారి
వాక్ప్రగల్భత లెనివారిఁ గాని
చొరనీరు రాజమందిరమును దౌవారి
కులు ; మఱి[2]యట్టివారలను "మిమ్ము
నరసి నేమము గీమ మడిగిన రాజుతో
[3]నీ విల యేలంగ నెపుడు శుభమ

1. పరిశోధించు. 2. యెట్టివారలని. 3. నీలీలశై.

తే. యనెడుమాటగా నాడుకొం" డనియు "వార్త
లేమి యడిగిన మేము మాయిండ్లలోనె
యుండుదు మెఱుంగ మనుఁ" డనియును దదర్థ
మాన లిడి కాని చొరఁగనీ" రనుచు వినిరి. 156

క. విని తదుచితమును బ్రభువున
కును దమమహిమంబుఁ దెలుపుకొన ననుకూలం
బునుగా నొకవాక్పద్ధతి
నొనరిచికొని నీచబాలయోగ్యాకృతితోన్. 157

ఉ. భూవ[1]రముఖ్యసన్నిధికిఁ బోయెడుమామిడిపండ్లపుట్టికల్
మోవఁగఁగూలిఁబుచ్చుకొనిమూఁకతగులెక్కుడుగ్రామ్యచేష్టితం
బావహిలంగ నేఁగి ప్రతిహారజనంబుల కిష్టమైనవా
చావిధి కొప్పి చొచ్చి ప్రభుసన్నిధిఁ బెట్టిరి పండ్లపుట్టికల్.

క. పెట్టి వెనువెనుక కటు చని
య ట్టిటు భయచపలచేష్టు లై [2]యరుగుచుఁ గన్
పట్టెడియాబాలురఁ గృప
యుట్టిపడఁగఁ జూచి నృపతి యొయ్యన నగుచున్. 159

క. "సంతోషమె కద యెయ్యెడఁ;
జింత యొకప్పుడు నొకింత చేకుఱదు గదా!
కొంత మఱుఁగిడక కలిగిన
యంతయు నిక్కముగఁ జెప్పుఁ" డనుటయు వారల్. 160

1. రుఁడున్నచోటికిని బో. 2. యలఁగుచు.

*క. "మాయ మ్మాన సు నీవే
రాయల వై కావ దేవరా జే జే జే!
మాయాతుమ లానినయది
పాయక సంతోస మున్న పల మిలసామిరా." 161

---

* తెలుఁగునను సంస్కృతమునను చదివి అన్వయింపవచ్చును.

ఈపద్యమునకు 1. అచ్చతెలుఁగున నన్వయక్రమము: దేవరా జే! జే. జే. ఇలసామీ నీవే రాయలవై కావ ఉన్నపలము సంతోసము పాయక మాయాతుమలు ఆనిన యది మాయమ్మానసు.

టీక. దేవరా = ఓరాజా! జేజేజే = జయజయజయ యని యాశీర్వచనము, (ఎల్లవారికంటె నుత్కర్షము గల్గియుండు మని యర్థము.) ఇలసామీ = ఓమదాశయుఁడా, నీవే, రాయలవై = రాజవై (బహువచనము గౌరవార్థము) కావన్ = రక్షింపఁగాన్, సంతోసము = ఆనందము, పాయక = విడువక, మాయాతుమలు = మామనసులను, (ద్వితీయార్థమునం బ్రథమ, ఆనినయది = ఆశ్రయించినది, ఉన్నపలము = తక్కిన ప్రయోజనముసహితము, ఆనినయది = (నీవు పాలనము సేయఁగా మాకు సంతోషముమ దక్కిన యెల్లప్రయోజనములును సమకూడె నని భావము.) మాయమ్మాన = మాతల్లియాన, సు = సుమా, సూచుధాతువు ప్రార్థనార్థకరూపాంతరము. మీఁదఁ జెప్పినయర్థము నిజ మని నమ్మించుటకీ వాక్యము లోకరీతి ననుసరించి చెప్పఁబడెను.

తా. రాజా! నీకు జయమగుఁగాక! భూమీశా! నీవు పాలకుఁడవై కాపాడుటవలన ఫలమగు సంతోషము మామనస్సులందు నెలకొని నది మాయమ్మ తోడుసుమా!

2. సంస్కృతమున పదవిభాగము: మా - అయమ్ - మాన - సునీవే - రాః - అలవా - ఏకం - అవత్ - ఏవ - రాజే - అజేజే-మా -

క. అన నమ్మాటలచందము
తనయప్పటివాక్యములకుఁ దగునుత్తరమై
యనయముఁ గ్రతుబుధసేవా
ఘనోపదేశంబు నగుచుఁ గాన్పించుటయున్. 162

ఆయాతు - మలాని న - యది - పాయక - సంతః - అసముత్ - న - పల- మిల - సా - అమీ.

అన్వయక్రమము : (హే) సునీవే, ఆయమ్ - మామాన. రాః అలవా ఏకా అవత్ ఏవ. అజేజే రాజే మా ఆయాతు; మలాని న. (హే) పాయక, సంతః యది అసముత్ నపల; మిల. అమీ సా.

టీక. సునీవే = శోభనమైన మూలధనము గలరాజా! ని. 'స్త్రీకటీ వస్త్రబంధేఽపి నీవీపరిపణేఽపి చ' అమ. ఆయమ్ = వచ్చుబడిని, మామాన= గౌరవింపకుము. (వచ్చుబడిని గౌరవించి మూలధనమును విశేషముగా వెచ్చింపకు మని యాశయము.) రాః = ధనము ని. 'అర్థ రై విభవా అపి' అమ అలవా = నాశములేనిదియు, ఏకా = ముఖ్యమైనదియు, అవత్ + ఏవ - అవదేవ = (తన్ను రక్షించువానిని) కాపాడునదియు (అగును.) అజేజే = (అజంయజతీతి అజేట్ తస్మై) విష్ణుని బూజించెడు, ని. 'అజశ్శంభౌ విష్ణుధాత్రోః కామేభాగేరఘూస్సుతే' నానా. రాజే = రాజుకొఱకు, మా= లక్ష్మి, ఆయాతు = వచ్చును. ని. 'ఇందిరాలోక మాతామా' అమ. మలాని = పాపములు, న=చేరవు, (విష్ణునుద్దేశించి క్రతువులుచేయువారికి సకలసంపదలు గల్గు ననియుఁ బాపములు తొలఁగు ననియు నాశయము.) పాయక=ఓరక్ష కుఁడా! సంతః = విద్వాంసులు, యది = (వచ్చిరి) యేని, అసముత్ = సంతోషము లేనివాఁడవై, నపల=తొలగిపోకుము, మిల = (సంతోషముతో వానిని) కూడికొనుము (విద్వాంసులు వచ్చినయెడ వారికి విముఖుఁడవు. గాక దర్శన మి మ్మని యాశయము. ఏల యన) అమీ=ఈవిద్వాంసులు,సా=అలక్ష్మి యే, (విద్వాంసులరాక సంపత్కర మని భావము.)

దీని తాత్పర్యము 166 వ. పద్యమున వివరింపబడినది.

చ. విరివిగ నంతరంగమున విస్మయ మావహిలంగ వారిరూ
పరయుచు భస్మసంవృతమహాగ్నికణంబులువోలె గూఢవి
స్ఫురణత నున్కిఁ గాంచి పరిపూర్ణవినీతి సుమోదభక్తిత
త్వరత దలిర్ప లేచి నరపాలుఁడు సాఁగిలి మ్రొక్కె వారికిన్."

క. అని చెప్పఁ గలాపూర్ణుఁడు
విని "యీతం డింతశబ్దవిదుఁడే యిటు లో
త్తె నెఱుంగ!" మని మదాశయుఁ
గనుఁగొనియెఁ సబహుమానగౌరవదృష్టిన్. 164

వ. కనుఁగొని "మదాశయుండ! కూర్చుండు" మని ముమ్మాటి దాఁక మునల పెట్టె యంతట బలిమిన కూర్చుండ నియమించి మధురలాలసం గటాక్షించి "యట మీఁదఁ జెప్పు" మనుటయు నది యి ట్లని చెప్పె "నట్లు మదాశయుండు మ్రొక్కి యానలువుర నాసనపాద్యాదివిధులం బూజించి నిజస్థాన జనులం జూచి "యిప్పటి వీరలవాక్యంబులం దేమివిశేషంబు గలుగఁ దెలిసి యింత పూజించె" నని మీవనంబుల నున్నది యేమొ? యవ్వాక్యంబులమహిమ వినుండు. 165

సీ. "ఆయంబు సరకుసేయకుము శోభనమూల
ధనుఁడ ధనం బచ్ఛిరంబు ముఖ్య
మైనయట్టిది తన్ను నదియ తేని కజు య
జించువానికి లక్ష్మి చేరఁ బాత
కములు చేరవు రక్షకా కోపదలు కల్గి
రాయసమోదుండ వై యసుగకు
సమ్మిశ్రభావంబు సలుపు మాయాలక్ష్మి
కోపదు" లనియెడు దేవభాష

ఆ. వయసుఁ బదవిభాగవిరచనతో నర్థ
మరయఁ దోఁచుచున్నయది గరంబు
తెలియఁ జూడుఁ డేతదీయాంధ్రవచనసం
దర్భమునను శబ్దతంత్రవిదులు." 166

వ. అని పలికి మదాశయుండు ప్రథమాగమున కభిముఖుండై వినయవినమితుండును ముకుళితకరుండును నగుచు "మీ రెవ్వ ? రిట్టి ప్రచ్ఛన్నవేషంబున నేల వచ్చితిరి ? మీ విధం బంతయు నాకుఁ దెలియ నానతీయవలయు" నని ప్రార్థించిన నతండు తమ తండ్రి యన్నదాననియమంబు మొదలుకొని పూర్వవృత్తాంతంబు తమ తల్లులవలన విన్నదియుం దాను గన్నదియుం దద్దర్శనపర్యంతంబు సకలంబుఁ జెప్పిన నతండు నిజపురోహితదోషాయత్తతం జేసి పూజార్హుల విచారింప నేరని తన దుర్వివేకంబునకు సిగ్గుపడుచు ని ట్లనియె. 167

క. "ఇది దెలిసియె కావలయుఁ గా
మదాశయుం డనుచుఁ జేయు నాకు నిపుట యే
నిదిగో కన నేరన కో
విదులఁ బురోహితునికపటవృత్తికి లోనై." 168

చ. అని యపు డమ్మహామహులప్రార్థనబల్మి ని దక్కినట్టిదం డనము నరేంద్రుఁ డాతని కొనర్పక యాత్మపురోహితత్వవర్తనమును మాన్పి తత్కపటతంత్రములోపలివార లైచరించినజనులఁ బ్రఘుప్రబలశిక్ష వినీతులఁ జేసె నెంతయున్.169

ఆ. ప్రార్థనం బొనర్చి ప్రథమాగమాదుల
ధర్మవిధిఁ బురోహితత్వమునకు

నిలుపుకొనియె వారు నిజమాతృయుక్తులై
తగినగతి గృహీతదారు లగుచు. 170

వ. ప్రభుసన్మానంబున నత్యంతవైభవంబునం బ్రవర్తిల్లుచు నతని కభిమతంబు లైన క్రతువులు సేయించుచుఁ దమ జనకుని యునికి యురగపట్టణంబు మొదలుకొని పాండ్యకేరళచోళ ద్రవిళాదిదేశంబులం బరికింపం దగినవారిం బనిచి యందు నలబ్ధవృత్తాంతు లయి చింతాక్రాంతు లగుచుఁ దల్లుల నుచిత విధిం గొన్నికొన్ని యాశలు చూపి యూరార్చు చుండి; రలఘువ్రతుండును నట్లు భార్యావృథావిక్రయలజ్జితుం డగుచుఁ బజ్జనపదంబుల సుహృజ్జనులకుఁ దలచూపఁ నోడి దూరదేశాంతరంబుల యాయావరవృత్తి నర్థార్జనం బొనర్చుచుఁ దత్పరిమితాన్నదానంబు నడపుచు నది నెఱయ సాగకున్న నన్నవర్జనంబు చేసి తాను గందమూలపయః ఫలాదుల దేహయాత్ర సలుపుచు నంతరాంతరప్రవర్తిత స్వల్పాన్నదానాచరణంబునం దనియక బహుధనార్జనంబు నకు నుపాయంబు వెదకుచు నంతట మృగేంద్రవాహనా మహాశక్తిమహిమ విని తదారాధనంబునకు నొకనివలన మంత్రోపదేశంబు సాధించి యద్దేవిసన్నిధికిం జని యచట భవత్కథాశ్రవణఫలంబైన సకలసంపదాయురభివృద్ధిపుత్ర పౌత్రాదిలాభంబు విని యందుఁ దనకుఁ "బుత్రపౌత్రాదు లనుమాట యటుండఁ దక్కినఫలంబు గల్గుట సిద్ధంబు గదా!" యనియెడు తలఁపున జపంబుచేత భవత్కథాశ్రవణంబు సాధించెఁ దుద నది. [1]యత్యంత

1. యత్యసంభావనీయం.

సంభావనీయం బైన పుత్త్రాదిలాభంబును గలిగింపక మాన వయ్యెం జూచితే ? యోమహీపస్తంభతనయ ! యిట్టిది సుమీ దేవరకథామహిమ!" యని పలికి మధురలాలస యూరకుండెఁ; గళాపూర్ణుండును నలఘుప్రతుం జూచి "నీసందియం బెల్లను దీఱెఁగదా!" యని పలికి ప్రథమాగమాదుల నిరీక్షించి "మీతండ్రికిఁ దగిన యుపచారంబులు నడపక యిప్పుడు నను మానించినం బాతకంబు రా(కా)దే!" యని పలికెఁ; బ్రథమాగమాదులును భయభక్తి వినయసమ్మోదసంభ్రమంబులతోడ నలువురును లేచి వచ్చి యలఘుప్రతుని పాదంబులకుం బ్రణామంబులు గావించి యానందబాష్పపులకవిలసితశరీరు లైన యాజనకునియాలింగనమూర్ధాఘ్రాణాదివివిధోపలాలనంబుల నానందించి యతనిచేరువం గొలిచి యుండి; రప్పు డమ్మహాత్ములతోఁ గ యాంధ్రగీర్వాణభాషాశ్లేషవైచిత్రి చిత్తంబునం బాఱఁ గళాపూర్ణుండు వారలం జూచి "యిట్టి విచిత్రకవిత మీమతులకు నిపుడుఁ దోఁచునో కో?" యని కౌతుకసంబంధగంధమందర హసితంబుతోడఁ బలికిన నంతఁ బ్రథమాగముండు. 171

*క. "తాఁ వినువారికి సరవిగ
భావనతోఁ నాను నతివిభాసితేజా

---

* మొదటినుండి పదవిభాగము సులభము:—అన్వయక్రమము: అతివిభాసితేజా, అధీశా, దేవరగౌరవమహిమన, మావలసినకవిత, తాన్, వినువారికి, సరవిగన్, భావనతోన్, మాను, మరిగి, అరున్.

టీక. అతివిభాసితేజా = మిక్కిలిగా వ్యాపించెడు మంచి ప్రతాపము కల, అధీశా = ఓరాజా! దేవరగౌరవమహిమన = మీ గౌరవాతి

దేవరగౌరవమహిమన
మావలసినకవిత మరిగి మాకు నధీశా!" 172

శయముచేతనే, మావలసినకవిత = మాకుఁ గావలసినకవిత్వము, తాన్ = అది, వినువారికిన్ = శ్రోతలకు, సరవిగన్ = అనుకూల్యము గలుగునట్లు, భావనతోన్ = తలఁపుతో! మాకున్, మరిగి = వశపడినదియై (మరగి యని యుండవలెను) అనున్ = ఆశ్రయించును.

తా. మిగులఁ దేజోవంతుఁడవగు రాజా! తమ గొప్ప మహిమాతిశయముచేతనే మేము కోరునట్టి కవిత్వము వినువారికిఁ దగినట్లు మాకల వడును.

ఈపద్యమును తలక్రిందుగఁ జదివిన సంస్కృత మగు.—
శాధీనకు మాగిరిమత, వికనసిలవమానమహిమ వరగౌరవదే
జాతే సువిభావితి నను, నాతో నవ భాగవిరసకిరివానువితా.

పదవిభాగము: శాధి - ఇన - కుమ్ - ఆగిరి - మత - వికనసి - లవమాన - మహిమవరగౌరవదే - జాతే - సువిభా - ఇతినను - నా - అతః - నవభాః - గవి - రసకిరి - వా - అనువితా.

అన్వయక్రమము: ఇన, ఆగిరి, కుమ్ - శాధి. మత, వికనసి. లవమాన, మహిమవరగౌరవదే సువిభా - ఇతి జాతే నను నా అతః నవభాః రసకిరి గవి అను వి తా వా.

టీక. ఇన = ఓప్రభువా ని. 'ఇనస్సూర్యేప్రభౌ'* అ. కుమ్ = భూమిని, ని. 'గోత్రాకుః పృథివీ పృథ్వీ,' అ. ఆగిరి = పర్వతము లున్నంతకాలము, శాధి=శాసింపుము. (చిరకాలము భూమిని బాలింపు మని భావము.) మత = ఓసర్వసమ్మతుఁడా! వికనసి = మిగుల శోభిల్లుచున్నావు. లవమాన = రాముని కుమారుఁడైన లవునకువలెఁ జిత్తౌన్నత్యము గలరాజా! ని. 'మానః స్త్రీణాంకోపభేదే గర్వేచిత్తోన్నతావసి' నానా. మహిమవరగౌరవదే = గొప్పతనముచే నెక్కువ గౌరవము నిచ్చెదు, సువిభా = మంచిరాజా, ఇతి = ఇట్లు, జాతే = కలుగఁగా, నను = ఓయి, నా =

చ. అన "బళిరా మహాకవిశిఖాభరణంబ మదుక్తభాషణం,బున
కిపు డిచ్చునుత్తరమ పూని విచిత్రపుఁబద్య మయ్యె మే"
లని విభుఁ డాడె; నట్లది యటంచుఁ గవీంద్రుఁడు 'నవ్వె
నవ్వె నా,యన "పఠియింపు మా తిరుగ" నంచుఁ దదుక్తికి
మెచ్చె విపుల్రిఁడున్. 173

క. ఆకీతిని దమలోనం
దా రే సరిపుచ్చుకొనఁగఁ దత్పద్యచమ
త్కారం బపుడు సభాజన
మారసి యేమియును గాన కద్భుత మందెన్. 174

వ. అంత నవనీకాంతుండు సభాసదులం జూచి "యప్పు డా
పద్యంబు తిరుగం బఠియింపు మనుట మఱియును బఠియింపు
మనుట కాదు వినుం" డని యి ట్లనియె. 175

సీ. "ఏలు మానాయక! యిల గిరు లెంతకా
లమ్మంతకాల మో సమ్మతుండ!
మిపుల శోభిల్లెదు లవకుమారసమాన
మానుఁడ మహిమ ననూన మైన

---

మనుజుఁడు, అతః = ఆరాజు చేయు గౌరవమువలన, నవభాః = నూతనమైన
తేజముగలవాఁ డై, రసకిరి = శృంగారాదిరసముల వెదఁజల్లెడు, గవి = వాణి
(విద్య యని యర్థము.) కలుగఁగా, అనువితావా = స్తోత్రము చేయనివాఁడా?
(చేయువాఁడే యని యర్థము.)

ఉదారబుద్ధి గలవాఁడును గౌరవించువాఁడును నగురాజు పాలింప
విద్వాంసు లందఱు స్తుతియింతు రని భావము.

దీనితాత్పర్యము. 176-వ పద్యమున వివరింపఁబడినది.

1. నవ్వె 'బల్కెనాయన పఠియింపుమాతిరుగ' నన్న దదుక్తికి.

గౌరవం బొసఁగు చక్కనిప్రభు విట్లు గ
ల్గఁగ నోయి, పురుషుఁ డీగౌరవమున
నభినవతేజస్కుఁ డై వాణీరసములు
గులికెడునట్టిది గలుగఁగాను

తే. వినుతి సేయనివాఁడె" యంచును మహార్థ
మున్నయది సంస్కృతంబునఁ జెన్ను మీఱ
వరుసఁ దుదనుండి మొదలికిఁ దిరుగఁ జదువ
నా తెనుఁగుపద్యమున బుధు లరసికొనుఁడు." 176

ఆ. అనుడు వారు నట్లు యవరోహమున దానిఁ
జదువుకొనుచుఁ దెలిసి సంతసిలుచు
నెఱయ మెచ్చిరి కవినృపులయాశువిచిత్ర
మృదుకవిత్వకృతియుఁ బదనగతియు. 177

వ. కళాపూర్ణుం డంత ననేకమణివిభూషణవిచిత్రాంబరప్రధానం బైనపారితోషికదానంబునం బ్రథమాగము నలంకరించె;నప్పు డతని యమాత్యుంఁడు సత్వదాత్మనామధేయుండు మధుర లాలసకుం బ్రణామంబు చేసి యి ట్లనియె. 178

ఉ. "ఓరుచిరాత్మ ! యోపరమయోగిని ! యే నటుపూర్వ మైన నా,పేరుఁ గులాదులుం మఱచి [1]పిమ్మట నొక్కెడ నుండఁ దెచ్చి కా,సారపురంబునా రిడిరి సమ్మతి నాకును సత్వదాత్ముఁ డన్ పే రవి దెల్పవమ్మ మఱి పెద్దలఁ గానమ యెందుఁ దద్జ్ఞులన్." 179

క. అని యడుగుచుండ బాలిక
కను నులుముచుఁ బెదవి విఱిచి కటకట వాపో

1. బిమిటి.

యొను మొగ్గవాలుచందం
బున నడు మెగనెత్తికొనుచుఁ బొత్తులమీఁదన్. 180

క. అపు డది గని "యింతన యీ
విపరీతపుఁజేత లేల ? వివరింపఁగదే
యిపు డే నడిగినయది చో
ద్యపుఁదల్లీ!" యనుచు మఱియు నాతఁడు మ్రొక్కెన్. 181

చ. "[1]కఱుదులపూపవై మునులుఁ గాననియట్టికతల్ వచింపఁగా
నెఱిఁగిననీకు నాఁకలియు నేడ్పులు నా?" యనువారు
"మాయలం,బఱచిన నేము పో మిఁక స్వభావపుదివ్యవిభూతి
తోడనే, వఱలుచు మమ్ముఁ బ్రోవు" మనువారును నై రపు
డాసభాసదుల్. 182

ఆ. "ఇంక నేమియైన నెఱుఁగంగవలయు సం
దేహపదము నీవు దెలిపె దనుచు
నమ్మి యున్నవార మమ్మ యీవెడమాయ
లం దనేల?" యనిరి కొంద అంత. 183

క. అమ్మాడ్కి మఱియు నెవ్వా
రెమ్మెయిఁ దనువేఁడుకొన్న నెఱుకకలిమి లే
శమ్మును గాన్పింపక స
త్యమ్ముగ నాఁకటన యేడ్చె నాశిశువు గడున్. 184

శా. "ఆవాక్ప్రౌఢియునాసుబోధముఁ చిరంబై యున్కి యెట్లబ్బెడై
వావేశం బపు డెద్దియో తపతిమాహాత్మ్యంబు రప్పించెఁగా
కావేళం దెలియంగ [2]లేమ తగ సంప్రార్థించి తద్దివ్యబో
ధావిర్భావనిధానముం గటకటా!"యం చుండెనుర్వీశుఁడున్.

---

1. కఱద. 2. లేదు.

వ. తదనంతరంబ యమ్మునిస్తంభనందనుండు రూపానుభూతిని మదాశయుం బిలిచి "మీబాలికకథలన్నియు వింటిరేకదా! మీభాగ్యవైభవంబునకు నెందు నీడు లే; దిది మొదలు నాకు మీర లత్తమామ లైతిరి; సందియంబు లేదు. మీర లింకఁ దక్కినశోలువు మాని యీశిశువు నింటికిం గొనిపోయి పోషింపుఁ" డనుటయు నతనికి సత్యవ్రతాత్ముం డి ట్లనియె. 186

ఆ. "పార్థివేంద్ర! వారి పడుచు మెచ్చిన ముని
హార మెప్పుడు వెట్టె తప్పుదు నీకు
వార లత్తమామ లై రని యున్నాఁడఁ
దనదుగుణము లయ్యెఁ దత్కథలును. 187

క. ఈశిశువు సులక్షణము ల
నూనంబుగఁ జూడ నిది నృపోత్తమ! నానా
భూనాథవధూమౌళిమ
ణీనిర్మితనూపురార్చనీయాంఘ్రి సుమీ." 188

చ. అని యతఁ డాడుమాటలకు నాత్మ కదంబ బలరన్ దరస్మితా
ననుఁ డగుచున్ మహీశుఁడు ఘనప్రమదంబున వారి నంతఁ
బ్రాననిపెఁ "జనుండు మీరలు గృహంబున కాత్మజఁ
గొంచు" నంచుఁ గాం,చనమణిభూషణప్రముఖసంపద
క్రొత్తగ వెంట నంపుచున్. 189

క. ఆమధురలాలసాకథ
లేమియు శుద్ధాంతమునకు నేఁగక యుండన్
భూమిపతి యడఁచె "నభినవ
కాముని ఒన నేల?" యనుచు ఘనయత్నముతోన్. 190

తే. అంత నలఘువ్రతుని యథేష్టాన్నదాన
కరణపర్యాప్తబహుధనగ్రామదాన
ముల మిగులఁ దన్పి యనిపె సపుత్త్రకముగఁ
దత్పురంధ్రినివాససద్మమున కతఁడు. 191

క. క్షితిపతి చేసినగౌరవ
మతిమోద మొనర్ప నింటి కాచందమునన్
సుతఁ గొనిపోయె మదాశయ
సతియుఁ బ్రయత్నంబుతోడ సతతప్రేమన్. 192

క. పలుమఱుఁ దలయంటి తగన్
నలుఁగిడి దోయిళ్లజలమునన్ బోర్కాడిం
చి లలిం జన్నిచ్చుచు ను
య్యాల నూఁపుచుఁ బెనుపఁ దొడఁగె నావరశిశువున్. 193

వ. బ్రహ్మవచనసామర్థ్యలబ్ధం బైనసహజపాతివ్రత్యంబునం జేసి యాసమయంబున. 194

చ. పొలుపుగఁ దన్ను వేనిదుర పుచ్చుటకై తమతల్లి పైఁడియు
య్యాల నిడి యూఁచుచోఁ గువలయాధిపుపాటలు పాడినం
గరం, బలరుచుఁ గేరి కేరి నగు నవ్వులపాటలు పాడినం గరం
[1]బలయుచు నేడ్చు లోకు "లవురా పతిభక్తి!" యటంచు
నవ్వఁగన్. 195

సీ. లీలఁ బొత్తులమీఁద లేచి కూర్చుండుచోఁ
దద్దయు నొకక్రొత్తముద్దుఁ జెలువు
క్షితిమీఁద లేఁతకెంగేలిడి తడవుచోఁ
[2]మొనరెడి యొండొకముద్దుఁ జెలువు

1. బలుకుచు. 2. మొనలిడు నొండొక; మొనరిడి; మొనలిడి.

నల్లనల్లన తప్పటడుగులు వెట్టుచో
నిద్దంపుబసలూరుముద్దుఁ జెలువుఁ
గొదలుమాటలు తేనె గులుకుచుఁ బలుకుచో
మోహనం బగునింతముద్దుఁ జెలువుఁ

తే. గలిగి యాబాల నవచంద్రకళ యనంగఁ
దిపుట నామనిఁ దనరు లేఁదీఁగ యనఁగ
నంతకంతకుఁ బ్రోదిచే నతిశయిలుచుఁ
బరఁగెఁ జూపఱకును గనుపండు వగుచు. 196

ఆ. ఎల్లబంధువులకు నల్లారు [1]బెల్లమై
యరిదిగారవంబు నతిశయిలఁగఁ
దల్లిప్రేమఁగరముఁ దనరారె ముంగిటి
ముత్తె మగుచుఁ గ్రొత్తక్రొత్తసిరుల. 197

ఉత్సాహ. చేతివ్రాలు సూచి "యిది యశేషరాజ్యవిభవభో
గాతిశయము గలిగి యలరు" ననియు మృదులచరణక
జాతరేఖ లరసి "రాజసతులనతుల కర్త యీ
నాతి" యనియు నపుడు లక్షణజ్ఞు లాడుకొని రెలన్. 198

చ. గలగలమ్రోయునందెలునుగజ్జెలు మువ్వలుఁ బైఁడియుంగరం
బులుఁ బులిగోరు సంకులును బొద్దులు గాజులు రావిరేకయుం
జెలు వలరంగ నెంతయును జెన్నెసలారుచుఁ గొన్నివాసరం
బులు ముద మందఁజేసెఁ గనుముద్దులచేతలఁ దల్లి
దండ్రులన్. 199

ఉ. విందులు విందు లంచుఁ దను వేడుక నెత్తుకొనంగఁ బిల్వ నిం
పొందఁగ నేఁగి పైఁబడుచు నుబ్బునఁ గేరుచుఁ జెంగ

1. చెల్లమై.

లించుచున్, సందిలి వట్టి యాడు మన నాట్యము లాడుచుం
ముద్దులన్ మఱి,నంద మొనర్చె బాలిక దినంబును జుట్టపుఁ
బూవుఁబోండ్లకున్. 200

క. "పుట్టకయ తొల్లి యెక్కడ
నిట్టివి నేర్చి?" తని చూప తొల్లను జెక్కుల్
ముట్టుచు లాలింపఁగ నా
చిట్టికలికి చిందులాడు క్షితిపతి దడవన్. 201

మ. దినముల్ కొన్ని చనంగ నంతఁగడునర్థిన్ బొమ్మపెండ్లిండ్లు గుం
జ్జెనగూళ్లచ్చనగండ్లు పింపిళులు కుచ్చిళ్ల్ గీరనంగింజ లో
మనగుంటల్ కనుమూసి[1]గంతనలు గంబాలాట లో నైనఖే
లనముల్ మీఱఁగ బోట్లతో నలరెబాలారత్న మెల్లప్పుడున్.

సీ. ఆపిన్నపాప దా నంత యై యింత యై
యోలి నొయ్యన బాల్యకేళిఁ [2]దనరె;
మగవారియెదుటఁ బల్మరు నుండుటకుఁ గొంకెఁ;
దఱచుగా రాదయ్యెఁ దండ్రి[3]కడకు;
నంగకంబులబాగు లరసి యోమఁ దొడంగె;
సడలనీ దయ్యె నెప్పుడును బైటఁ;
గ్రేళ్లచూపులకలికితనంబుపస నేర్చెఁ;
బలుకుచో బొమ లార్పుభంగు లెఱిఁగె;

తే. ముదురుఁ బ్రాయంపుఁబడఁతులమదనకథలు
పొడముచో సిగ్గుపడి పాఱిపోవఁ జొచ్చె;
శైశవముఁ బాఱ నొత్తుచు జవ్వనంబు
క్రమముతో నంతకంతకుఁ గానిపించ. 203

---

1. గంతులును. 2. వదలె. 3. తోడకు.

తే. స్తనజఘనభారములచేత జవ్వనంబు
మించి యిరుదిక్కులను నాక్రమించి బలియ
నడుమఁ జిక్కినబాల్యమో నాఁ గృశత్వ
మంతకంతకు నొందె నాయతివనడుము. 204

క. తోరపుఁగుచభారముఁ గుచ
భారముఁ గటిభారముఁ విభాసిలుచుండన్
మారుని త్రిభువనరాజ్యపు
భారములు వహించినట్లు బాలిక యొప్పెన్. 205

సీ. గురుతర స్తనకేళిగిరులును గంభీర
తరనాభికూపమతల్లికయును
జారురోమాళిశృంగారధారాసర
ణియు నంగుళీకిసలయచయంబు
సుకుమారబాహువల్లికలును రమ్యోరు
కదళికాస్తంభ ప్రకాండములును
సులలితాధరబింబఫలవిలాసముఁ జుప్ప
విసరపాండిమహాసవిభ్రమంబుఁ

తే. గలిగి పలుకులు శుకపికకలకలముగఁ
గుంతలంబులు మధుకరకులము గాఁగ
శంబరారాతికేళివనంబుఁబోలె
సుదతి యపు డొప్పె నొకవింతసోయగమున. 206

తే. ఆలతాంగియు నాలోన నభ్యసించె
వివిధసంగీతసాహిత్యవిద్య లెల్లఁ;
గావ్యరచన యొనర్చెఁ బ్రాగ్జన్మవాస
నాతిశయముచే ననతిప్రయత్నమునన. 207

వ. కళాపూర్ణుండు నమ్మధురలాలసను మున్ను తల్లిదండ్రుల
యింటను పెరుఁగని మ్మని యనుచుట యాదిగా నభినవ
కౌముదీవిహారవిశేషంబులవలనను రాజ్యకార్యవ్యాసంగం
బులవలనను మఱచి మఱి యెన్నఁడుం దడవఁ డయ్యె; మదాశ
యుండు నతనిచిత్తంబు తెఱం గెఱుంగక యూరకుండె; నంత
నామధురలాలసయు నవ్విధంబున జవ్వనంబు ప్రాపించి యంకు
రితమదనవికార యగుచు నా కళాపూర్ణుపాణిగ్రహణం
బభిలషించుచున్నంత. 208

చ. ముసుకొని కూర్మి నెచ్చెలులముచ్చటవేళలఁ దద్గుణౌఘముల్
వినివిని విన్నయర్థ మొకవేళను మాననినిత్యభావనం
గనికని కన్నయంతయును గావ్యవినిర్మితిచేతఁ దాప్చుచుం
గొనకొని మిక్కిలిం బెనిచెఁ గోమలి ప్రేమము నామహీశుపైన్.

క. అంతటఁ బ్రత్యక్షంబుగఁ
గాంతుం గనుఁగొనఁగ బిగువుఁగౌఁగిటఁ జేర్పం
గంతువిహారంబుల న
త్యంతము మోదింపఁ గోరె నంగన మదిలోన్. 210

క. అనలుం గొనలుం బాఱుచు
మనమున నాకోర్కి తీఁగె మగువకు మిగులన్
ఘనముగఁ దత్కుసుమద్యుతి
పనుపడ వెలిఁ బర్వె ననఁగఁ బాండిమ దోఁచెన్. 211

వ. అందు. 212

ఉ. ఒక్కతెఁ బిల్వఁ బోయి మఱియొక్కతెఁ బేరుకొనిపిల్చు; మేన సొ
మ్మొక్కటిఁ దాల్పఁబూని మఱియొక్కటి వీడ్వడఁ దాల్చు నర్థిమై

నొక్కెడ కేఁగఁ జూచి మఱియొక్కెడ కేఁగుఁ బయోరుహాక్షి దా
మిక్కిలిఁ బేర్చుభూవిభునిమీఁదిపరాకునఁ జేసి నిచ్చలున్. 213

సీ. ఏమి కన్నులఁ గన్న హృదయేశురూపంబు
దోఁపక యది మున్ను దోఁప కుండె;
నేమి వీనుల విన్న హృదయేశుమధురోక్తి
దోఁపక యది మున్ను దోఁప కుండె;
నేమి మై సోఁకిన హృదయేశుసంస్పర్శ
దోఁపక యది మున్ను దోఁప కుండె;
నేమి దాఁ జవిగొన్న హృదయేశుకెమ్మోవి
దోఁపక యది మున్ను దోఁప కుండెఁ;
తే. గాంత కంతట సంతతకంతుకేళి
వివిధసంకల్పవాసనఁ బవలు రేలుఁ
దనపులకలుఁ గలవరింతలును మాట
వీడుపాటులుఁ జెలులకు వెల్లఁ గొనర్చ. 214

ఆ. తరుణి తాఁ బగళ్లు తామరసాక్షి యక్క
పేరువోలె నుచితనియతిఁ బరఁగ
నిర్వహించె రేలు నీలోత్పలాక్షి యక్క
పేరు నృపునిమీఁదిప్రేమ నంత. 215

క. సితకరునిశుక్లపక్ష
ప్రతిపత్కళ చూచి చూడ భామిని నెమ్మే
నితనుత్వముఁ బాండిమసం
గతియును గడు నెక్కుడగుచుఁ గానంబడియెన్. 216

ఉ. వీణియ ముట్టుటల్ మిగుల వింతలు; పెంపుడుచిల్కబోదతో
రాణ దలిర్పఁ బల్కుటగరంబపురూప; మపూర్వ మెంతయుం

ప్రాణసఖీరహస్యములఁ[1] బ్రాఁతియుఁ; గ్రీడలు కానివావి; యా
యేణవిలోలలోచనకు హెచ్చిన మన్మథచేష్ట [2]నయ్యెడన్.

క. నిచ్చలు నీగతిఁ బైపై
హెచ్చి వియోగానలమున నెంతయుఁ బాపం
బచ్చుపడఁ బ్రవర్తిల్లఁగ
నెచ్చెలు లచ్చెలువఁ జూచి నెమ్మది గలఁగన్. 218

క. "పెక్కుదినంబులనుండియు
నిక్కన్నియవర్తనంబు లెల్ల నరయ వే
ఱొక్కగతిఁ దోఁచుచున్నవి;
మిక్కిలి నూహింపుఁ డానిమిత్తము మీరల్. 219

క. కొమ్మ కడుఁ జిక్కుచున్నది;
నెమ్మొగమునఁ బాండిమంబు నిబ్బర మయ్యెన్;
నెమ్మదిలోనివిచారము
ముమ్మర, మివి మన్మథకృతములు గావలయున్. 220

మ. మన మొక్కొక్కతఱిన్ సమస్తగుణసంపన్నుం గళాపూర్ణు శో
భనరూపున్ వినుతింపఁ గుంటిమది యిప్పాటన్ సఖిన్ నొంచె దు
ర్జనచూడామణి కాముఁ డిట్టికొమరుం బ్రాయంపుఁబూఁబోం
డ్ల నొక్కనిమిత్తం బిసుమంతఁ గల్గినఁ గడుం గాఱించు
దుర్వారతన్. 221

క. కావున నిపు డీ[3]భామిని
భావజు బారిఁ బడి మిగులఁ బడలుట నిజ మీ
భావంబును మఱపింపం
గావలయును వనవిహారకలనలచేతన్. 222

---

1. భ్రాంతియు. 2. నయ్యెడుక్. 3. కోమలి.

తే. అని విచారించి యాచంచలాక్షి మదికి
వేడ్క పుట్టించి తోడ్కొంచు వెలఁదు లేఁగి
రమితమకరందనిష్యందరమితముఖరి
తాళిసంతాన మైనయుద్యానమునకు. 223.

వ. అప్పు డయ్యుపవనంబు పవనంబునకుఁ దూఱరాక కాఱుకొనుచుం జూపఱ యిచ్చ మెచ్చు నచ్చెరువు హెచ్చఁ బచ్చపట్టు బల్లాపదట్టీలలీలఁ జాలనెఱపుచు నొఱపుమిగులు మొగలిగములగుముఱలనసుమఁ బొడవులుగ దీపించుతోఁపుగుడారంబులచెలువు నల(వ)రించు చిగురుటలమావితండంబులును, పండుతండంబు లై మెండుకొన నొదవుమదమునం బెనుఱొదలు పొదల మెదలు కొఁదమతుమ్మెదలపదువు లిసుపసరిపెణలపెనుపును బనుపఱచుచుఁ గనుపట్టు, దట్టం బగు చిగురుజొంపపుఁ గెంపుసొంపు సిందూరంపుఁ గెందూళిచందంబు నంకపఱప నుపరిభాగజాగరూకపల్లవ ప్రసూనఫలపటలశోభవిమవిలసనంబు లలితకుముకుత్పల్లికల యుల్లాసంబు వెల్లిగొలుప, వెలుతురు లేనిపూఁదేనెసోనవాన దానధారాప్రకారంబునం దోరం బగుచుఁ ఎనరార మారుతప్రచారంబుల నప్పటప్పటికి నుప్పతిల్లు పుప్పొళ్లు కేళిధూళిపాళికల పోలిక నేలికొనంగ నేనికబూమియలు పూని కానిపించుచున్న పొన్నలును, నవిరళవళకిసలయవిలసితలతాప్రతానంబులు మరకతకురువింద నిచయఖచితంబు లగు సతులపగిదిఁ జూపట్టుసమకట్టు జల్లులమొల్లమి నుల్లసిల్లుచు నిగుడల వ్రేలుడుసోగపూవుగెలలు పోలుపొంద, నగ్రభాగ పల్లవంబు లింద్రగోపంపుటుల్లారుల యోజ రాజిల్లఁ దేజీలపోల్కి

భాసిల్లు వాసంతికాకుడుంగంబులును, కడుపెళంబుగఁ బొదిగి యొదుగం గలభంగులఁ జెంగలించుచును నమద తములపాకుఁ దీఁగెయల్లికలమీఁద మించి వెల్లితలచుట్టుఁ గట్టడలు నెట్టుకొలుపుతోలుంబట్టల పొదుగుల్లపైఁ గ్రొమ్మడుఁగు నెఱిబిఱుసుచుంగుల నిక్కుటెక్కును మిక్కిలిం గడలు కొలుపుచున్న యరవిరిచిగురు మొగిలియాకులతోడ వీర భటులజోకలు జోకపఱచు లేఁబోఁకమ్రాఁకులును, వివిధజన కోలాహలంబులకరణిఁ బరిఢవిల్లు శుకపికశారికానికరకలకలం బులును గలిగి విరహిసముదయంబుపైఁ గదలిన కుసుమ కోదండు దండువిడుదుంబోలె నాలోకనీయం బగుచుండ నందు నిందువదనలు మందగమనస్వభావంబు సహకరించు కుతుకరయంబునకుఁ బ్రతికూలంబు లగుచుం బిగువుపాలిండ్ల వ్రేఁగును, బిఱుఁదులగరిమయుఁ బరము గాక కర మలయం జేయుచుండ నొండొరులం గడచుచు, నుద్దవిడి నడచుచుఁ గూడమికిం గేలిచేయుచుఁ, గ్రొవ్విరులు మించికోయుచుఁ, గమ్మగొజ్జంగులకుం జేరుచుఁ, గన్నెగేదంగులకుం బోవుచుఁ, బొన్నలకు మూఁగుచు, బొండుమల్లెలకు నేఁగుచు, సంపెం గలకు డాయుచు, జాతికుడుంగంబుల రోయుచు, మల్లెలకు నిగుడుచు, మరువంబునకు మగుడుచుఁ, గురువేరు గొల్లా డుచు, గంధంబులకు మల్లాడుచుఁ, బొగడలకు జరుగుచుఁ, బోఁకపాళికలకుఁ దిరుగుచుఁ, దిలకంబులకుం జనుచు, దిరిసెన పున్నలు సైకొనుచు, నవమల్లి(మాలి)కలఁ గ్రీడించుచు, నారం గంబులఁ గ్రీడించుచుఁ, గలిగొట్లకుఁ దత్తరిల్లుచుఁ, గంకేలి మంజరులకుఁ దంటిల్లుచుఁ, గ్రొమ్మావినీడలాశ్రయించుచుఁ,

గురువిందపందిరుల విశ్రమించుచు, నీరంబులఁ దూఱుచు, నెందేనియుం బాఱుచుఁ, బూఁదేనియలఁ దోఁగుచుఁ, బొదరిండ్ల డాఁగుచుఁ, గనిన నవ్వుచుఁ, గమ్మవిరులు రువ్వుచుఁ దీఁగెయుయ్యెలల నాడుచుఁ, దియ్యవిలుకానిం బాడుచుఁ, బరాగంబులు రాల్చుచుం, బయ్యెదలు విదల్చుచు, నంటని పూఁగొమ్మలకు నిక్కుచు, నలఁతిమ్రాఁకు లెక్కుచుఁ, గెంజిగుల్లకుం బదరుచుఁ గెరలు తెంట్లకు బెదరుచుఁ, గోకిల స్వరంబు లాలించుచు, గోరవంకల [1]లాలించుచుఁ, జిలుకలకుం బలుకు లందిచ్చుచుఁ, జిన్నిరాయంచలనడలు మెచ్చుచుఁ, బూబంతుల వేటలాడుచుఁ, బొసఁగనుద్దులు గూడుచు, నాట గెలిచి పోనీక పట్టుచుఁ గేకిసలుగొట్టుచు, నొకరొకరిఁ జీరుచు, నుబ్బునం గేరుచు, నిబ్బరంపుఁదమిని దమకుఁ దమకంబు హెచ్చింప నింపు మీఱు విహారంబులచేత నడరుబడలికలం బొడము వెడవెడ చిఱుచెమట తడి యొడళ్లం గడుఁ బ్రబలి గుబులుకొను మృగమదఘనసారగంధసార కాశ్మీర విలేపన పరిమళంబులు పరిమిళితదిగంతరంబు లగుచు నంతటం జోడు ముట్టి, సహజకృశత్వంబునకుం దోడు క్రీడలయలంత నెంతయు ఘనంబైన బడుగుదనంబునం దడఁబడుచు వడవడ వడంకులు గుడుచునడుములం దడబాటువలన సడలఁబాఱు నీవులు తావులం జిక్కం జెక్కుకొనుతఱిఁ బొక్కిళ్లం బ్రవేశించి సముదంచిత కురువిందకంవళ సందర్భసంగతాంగుళీయక ప్రచురరుచినిచయ కవచితకరతలరాగంబు లడుగుల నిర్గమింప నినుపడించెనో యనఁగ నతిమాత్ర సంచారసంక్షుభితంబు లగు చరణతలంబుల నత్యంతరక్తిమ యుట్టిపడ

1. నాలోకించుచు.

చుండఁ నిట్టట్టు పైఁటచెఱంగున విసరుకొన నెసఁగు కరకంకణ
మణిఝణత్కారంబులకు నులుకుకరిణిఁ గఱచుటూర్పుల
పెంపుననుత్కంపమానంబు లగుచుఁజెన్నొందు చన్నుఁజక్కవ
కవలకెలంకులఁ జొక్కపుఁదెక్కల కదలక పొదలికలు
మొదలకించుచు నిగుడు నిగనిగలతరఁగలయందంబు సంది
గుండ్లతళుకులకుఁ జెలికారంబు నెఱప నలయిక సొలయికల
నొక వింతయొయ్యారంబు చూపుచూపులపసకుం జూపోపక
యేపఱినలిఁ జాల వసివాళ్లువాడిన క్రీడావతంసిత కర్ణ
నీలోత్పలదళంబులు నిజప్రతిబింబకపటపరిదృశ్యమానసోప
రాలింగన లోలుపంబులువోలెఁ జెక్కిళ్ల మిక్కిలి నంటు
కొనుచుండ నొసల నసలుకొను కమ్మకస్తూరి యుమ్మలిం
బడి కదలమెదలలేని నీలాలకజాలంబుల నిజబాలకశంకం
జేరి పెడలఁ దివియ సంపడించుచందంబున నంపంద
క్రందుకొనిమొనయు నిశ్శ్వాసవాసనా సమాకృష్టచంచరీక
సంచయంబులకు సుదతి యదలించు మృదులంపుఁ గలికిపలు
కులు దమ నిసువులకొసపు బెలుంగులచవి కొసరక ముసురు
కొను పసిరాచిలుకగముల మొలంగం దోలుకేలు కెంజిగు
రాకులకు మూఁకలై కవియు కోకిలంబులచేత నాకులంబు
లగుచు మైదీఁగెల బాగుల వసంతాగమశ్రీవిభూషితవన
దేవతావిలాసవిశేషంబు నభినయింపనాత్మసాదృశ్యసంభావనా
గర్వంబు వెల్లునం బ్రుల్లుమల్లరపుఁగల్లరి తీఁగెతండంబుల కండ
క్రొవ్వు సైరింపక వానిజీవిక లాక్రమించి తదనుసరణంబున
నయ వొడమి కొంత నుగుడ విడుసువాపుపు గనంబడఁగ
నెడనెడం గులుకునవల బడిబడిం దొరఁగుసిరిగములు నడరెడి

యరపీఁకకొప్పులయొప్పిదంబు చెప్పనలవి గాక యతిశయిల్లఁ జెదరినసింగారంబులును [1]జిగురుంగొనలచేలలును నంటినపరాగంబులును నకసుపులతో డి పాపటలును వాడుదేఱెడి నెమ్మోములును వడఁకెడు కులుకుఁ బలుంగులునుం గలిగి యపూర్వవిభ్రమంబున సొంపుమీఱుచుం దదనంతరంబ. 224

క్రౌంచపదవృత్తము.—

చంచలవీచీసంచయలీలాసలలితతరళితజలరుహపాళీ
సంచితహాస్తోదంచితభంగీజనితమదనమతసరణిగుణవ్యా
ఖ్యాంచితగోష్ఠీసంచరణప్రత్యయసముచితహాళహాళికలతోఁ రా
యంచలు ప్రేమం గొంచలు గూయన్ వ్యవహితపరరవ
మయిన కొలంకున్. 225

ఉ. చేరఁగఁ బోయి రంగనలు చెల్వపుమోముల సోయగంబు త
ద్వారిజలక్ష్మిఁ గేరఁగ నవారితవారితరంగ రంగలీ
లారతహంససారసకులస్థలదారవసారవంచనా
పారగనూపురాదిబహుభవ్యవిభూషణఘోష మొప్పఁగన్.

ఉ. అంతట నంతరంగముల నంబువిహారకుతూహలంబు ల
త్యంతముమీఱ మెట్లుడిగి రామగువల్ మునికొంగులెత్తుగా
ధాంతరసీమఁ బట్టుచు జలాశయలక్ష్మిపయిన్ నఖచ్ఛటా
కాంతులచేఁ బదాబ్జములు కప్రపుధూళి వసంతమాడఁగన్.

సీ. అలఁతిగావులచేతఁ దొలఁగుపయ్యెదకడ
లిసువంకలను జిక్కునిఱికికొనుచుఁ
దరఁగల నిట్టట్టు దరలుముంగొంగులు
తిరుగ జంఘలను సంధించుకొనుచు

1. జిగురుకొనుచీరల నంటి.

మునుపుగాఁ జొచ్చినవనితలు చల్లెడి
యుదకంబునకుఁ జేతు లొడ్డుకొనుచు
నెడ నెడ మిట్టించి పసమీలబెళుకుల
కులికిపా టొదవంగ నోసరిలుచుఁ
తే. దొగలమలుఁగుననుండి బి ట్టెగయువిహగ
కులమువఁవలికి బెదరుచూపులు దలిర్పఁ
దమ్మికొలను ప్రవేశించు తలిరుఁబోండ్ల
విలసనము లెంత నెంతయు వింత లయ్యె. 228

ఉ. ఆరమణీమణుల్ సరసి నట్లు ప్రవేశ మొనర్పువేళఁ ద
త్కారణవీచికాచలితకంజములన్ మధులోలభృంగముల్
వారక సారెకున్ నెగసి వ్రాలుచు నొప్పెఁ దదంబుదేవతల్
నేరుపుతోడ నాఁడుహారనీలపుటచ్చనగండ్లకైవడిన్. 229

లయగ్రాహి:—
నెమ్మొగములం గరతలమ్ములఁ గుచమ్ములఁ గ
చమ్ములను జూచి నయనమ్ములఁ బరాభూ
తమ్ములను బోలె విరిసమ్ములును రక్తజల
జమ్ములును గోకమిథునమ్ములును శైవా
లమ్ములును భృంగనిచయమ్ములును మీననిక
రమ్ములుఁ [1]గలంగి చలనమ్ములు భజింపం
గొమ్మ లపు డెంతయును సమ్మదకుతూహలభ
రమ్ముల నొనర్చిరి కరమ్ము జలకేళిన్. 230

1. గలంగఁ జల.

లయగ్రాహి:—

ఓల! యనుచుఁ జలదు గేలి యనుచుం బఱవఁ
జాల వనుచుం గడుఁ బిసాళి వనుచుం బ
ద్మాళిఁ గొని కొట్టుచును దోలి వడిఁ బట్టుచును
మేలములఁ దిట్టుచు గయాళితన మింకం
జాలు నను చున్ బళిర గోల యను చుం బగట
నేల? యనుచుఁ ముగుదబాల వనుచుం గ
య్యాల [1]కెస పెట్టుచును హాళిఁ జలపట్టుచు సు
మాళములఁ గిట్టుచును బాలికలు వేడ్కన్. 231

కపిరాజవిరాజితము:—

గుభిలుగుభి ల్లనుఘోషణఁ దోయశ
కుంతతతుల్ గలగుంపువడన్
క్షుభితఘన స్తనకుంభపరిచ్యుత
కుంకుమచందనకుంతలసూ
నభరవిలాసమునన్ బహువర్ణము
నవ్యసుగంధగుణంబు కొలం
కభినుతిభాజన మై భజియింపఁగ
[2]నాగతి నంబువిహారిణు లై. 232

మాలిని. తడిసి తనువులన్ భేదంబు గాన్పింప కుండం
గడు నడఁగినచేలల్ [3]కల్మి స్రుక్కుల్లప ట్టై
రపుడఁ దెలుప ఘనాంభోభారతం గుంతలంబుల్
మడమలపయి వ్రేలన్ నుత్తమాంగయానల్. 233

---

1. కెసఁబెట్టు. 2. నంబువిహారిణులై పొసఁగన్. 3. కల్కి.

వ. కాసారంబు వెలువడి నవీనవస్త్రాభరణగంధమాల్యంబుల నలం
కృతులైరి; మధురలాలసయుం గాంతునిమీఁదిపరాకునం జెలి
కత్తియలబలిమిని వనక్రీడాదు లెట్టకేలకు నిట్టట్టు సలుపు
చుండె. 234

ఉ. వర్ణనపాత్రచిత్రగుణవైభవశోభితుఁ డత్తఱిం గళా
పూర్ణుఁడు డేగవేఁటతమిఁ బూన్పున వచ్చి ముదంబునం దద
భ్యర్ణమహిం జరించు చోకపక్షికిఁ బాఱినడేగఁ బిల్చుచుం
బూర్ణత నేఁగె నానిజవధూటియు బోటులు నున్నచోటికిన్. 236

వ. అప్పుడు.

ఉ. నిద్దపుఁజెక్కుటద్దముల నింపులుగాఁ బులకల్ జనింప న
మ్ముద్దియ బోటిమూఁపుపయి మోమరదోఁపఁగ నిల్పి యత్త
ఱిం, దద్దయుఁ బ్రేమఁ జూచె నిజనాథు నతండును దాని
జూచె నా,యిద్దఱచూపులున్ నడుమ నించుక తార్కొని
లజ్జఁ గ్రమ్మఱన్. 237

చ. వనజదళాక్షి చూచినను వల్లభుచూపు లతండు చూచినన్
వనజదళాక్షిచూపులు ఘనత్రపచే వెనువెన్కకున్ వెసం
జనుచు నొకళ్లొకళ్లకయి సారెకు వచ్చుచుఁ బొల్పుమీఱెఁ
గ,న్గొన రతిపంచబాణులవినోదపుటుయ్యెలచేరులో యనన్.

చ. వినుకలిచేత మున్ మిగుల వింతలుగాఁగ విరాళిఁగొన్న య
వ్వనజదళాక్షి యట్లు తనవల్లభురూపముఁ గన్నులారఁగాఁ
గనుఁగొని యేమి చెప్పఁ గడుఁ గంతుశరాహతిఁ దాప
మొందుచున్, మనమునఁ గుందె నప్పు డటు నాథునిఁ గౌఁ
గిటఁ జేర్ప లేమికిన్. 239

తే. అతఁడు మధురలాలసయందు నాత్మ దగిలి
మగిడి రా కలయింపఁగ మరలి వరలి
యొక్కొకనెపంబుతో దాని యొప్పిదంబుఁ
గనుఁగొనుచు నెట్టకేలకుఁ జనియెఁ దిరిగి. 240

వ. అంత నక్కాంతయు నంతరంగంబునం గాంతుఁ జింతించుచు.

ఉ. ఆమృదుపాదపద్మములు హస్తతలంబున నొత్తఁ గోరు నా
శ్రీమహనీయవక్షమునఁ జేర్పఁగఁ గోరుఁ గుచద్వయంబు నా
కోమలగండపాళికలఁ గూర్పఁగఁ గోరును గండపాళికల్
కామునిబారి కగ్గమయి కామిని తాలిమి చంచలింపఁగన్.

ఉ. అప్పుడు తత్పయోజముఖి యాకృతిచందము బోటు లంద
ఱుం, దప్పక చూచి "యక్కట! వృథా వనఖేలలహేళి నిం
దుచే, నిప్పుడుచుం దలంపము మృగేక్షణలార! గణించి
చూడుఁడా, యెప్పుడు నేసనోగములు నీచెలి కింపులుగా
వాకింతయున్. 243

ఉ. ఈనళినాక్షిచింత హరియింత మొకింత పరాకు చేసి యన్
ఫ్రానికతోడ వచ్చి మనపోకడ లేమని చెప్ప? నాటలే
కాని నృపాత్మజం దలఁపఁ గానము దీనివిచార మేమియున్
మానుట లేద మిక్కిలి ఘనం బగుచున్నది గాని యెన్నఁగన్.

వ. అదియునుం గాక. 245

స్రగ్ధర. శ్యైనంపాతావిహారాశ్రయణమధురవే
షంబుతోఁ జూడ్కి వేడ్కం
బూనంగా నింతకున్ మున్ పుషమునె కళా
పూర్ణఁ జేతెంచి పేర్మిన్

దా నిచ్చోటం జరించెం దరుణి యతని న
త్యంతమున్ వింతప్రేమన్
మే నుబ్బం జూచిన ట్లుండె నది మొదలు సుం
[1]డి కసుం దాప మొందెన్. 246

ఉ. కావున నీవసంతమదగర్వితకోకిలకీరశారికా
రావముఁ దేఁటిపిండురవపురావము మెల్లనిచల్లగాడ్పుఁబూ
దావులసొంపుఁ గెంజిగురుఁదండము లేఁబొదరిండ్లయొప్పులున్
భావజుపక్షమై మిగుల బాలికతాలిమిఁ గొల్లలాడెడిన్. 247

ఉ. ఇట్టిది గానలేము మన యిందభముం దరళాక్షికిన్ మదిం
బుట్టినపంచబాణువెఱపుల్ మఱపింపఁగఁ బూని వానికిం
బట్టపురాజధాని యనఁ బట్టగుతోఁటకుఁ దెచ్చు టొప్పునే?
'ఘట్టకుటీప్రభాత' మనఁగా నిది వో పరికించి చూడఁగన్.

క. అనునంతట నయ్యంగన
యనయముఁ బ్రబల మగునట్టియంగజతాపం
బున నుస్సు రస్సు రనుచుం
గనుఱెప్పలు దేల వైచి కడు సొలయుటయున్. 249

మణిగణనికరము. పడఁతులు చిడిముడి పడియెడు మదితో
నడుగులు తడఁబడ నడరెడునడపుం
గడఁకల నడుములు గడగడ వడఁకం
బడిబడిఁ బొడమఁగ బడలికఁ జెమటల్. 250

సీ. విరిదమ్మితావులు వెదచల్లుకొలనిచెం
గటఁ గమ్మపన్నీటికాలువలను

---

1. ఢీ కసుం.

గడు నివతాళించుకప్రంపుటరఁటుల
యిరవులఁ బూవుఁ జప్పరముఁ బన్ని
వట్టివ్రేళ్లను దడి గట్టి శ్రీగంధంపు
టసలున మెత్తి తదంతరమునఁ
గర్పూరవేదిక గావించి చల్లని
చెంగల్వరేకుల సెజ్జ దీర్చి

తే. చిలుకుఁదేనియతోడి గొజ్జెంగపూవుఁ
దలగడ యమర్చి యందు నాచెలువ నునిచి
జగతిఁ గలసర్వశైత్యోపచారవిధులుఁ
జలిపి యందును గడఁ గాన కలసి రంత. 251

ఉ. అప్పువుఁబోంట్లు వెండియుఁ బ్రయత్నముతోఁ బలుమాఱు
వీనులం, గప్పుర మూఁది పూవిసనకఱ్ఱలు గొజ్జెఁగనీట మాటి
కిం, దొప్పఁగఁ దోఁచి వీచుచు జనుంగవపై నఱకాళ్లఁ
బాణులన్, లప్పలు గాఁగ జందన మలందుచుఁ గొందల
మంది రంభలున్. 252

వ. అంత. 253

క. విరులుఁ జిగుళ్లును జోరువుగ
సిరిగంధపుటస లొకింత చిలచిల మని వే
గిరమ వఱువట్లు గొనఁ గడుఁ
బొరలెడితరలాక్షి తాపముం గని కలఁకన్. 254

తే. చతుర యగు[1]నట్టిబోటి యాసతిని జేరి
చలువచెంగావిపయ్యెద చక్కఁ గప్పి

1. నొక్క.

నేత్రయుగళంబుమీఁదు పన్నీటిచేతఁ
దుడిచి చెదరినకురులు దిద్దుచును బలికె. 255

క. "ఎక్కడ మే నంటినఁ గే
ల్వొక్కెడునం తగుచు [1]సెకలు వొదలెడుఁ బొరం
బెక్కువు శైత్యక్రియ; లో
యక్క యిఁకం బోదు కోర్కి యడఁచిన నెపుడున్. 256

తే. ఇంతి సిగ్గు గదా! యని యెంతదాఁకఁ
దలఁపు డాఁచి లోలోఁ గుమారిలఁగ వచ్చు?
నదియుఁ గా కేను లాఁతినే యకట నీకు
రమణి నాపట్టునను దాఁపురంబు వలదు. 257

క. ప్రాణములకుఁ బ్రాణం బగు
ప్రాణసఖికిఁ జెప్పరానిపనులుం గలవే?
యేణాక్షి కలిగ నేనిం
బ్రాణసఖియు నుసుఱు నొక్కపాటియ కావే?" 258

మ. అనినన్ మిక్కిలి సాహసంబున నభీష్టార్థంబు చెప్పన్ మనం
బున నుంకించుచు లజ్జచే నుడుగుచుం బూఁబోఁడియొక్కింత
సేపు నితాంతాకుల యయ్యె; నంతటనుదాఁబోనీకయాబోటి
యుం, దనపై నానలు వెట్టి వెట్టి యడిగెన్ యత్నంబు
సంధిల్లఁగన్. 259

క. ఇమ్మెయి నిర్బంధించుచు
నమ్ముద్దియ యడుగ నృపవరాత్మజ యనుమా
న మ్మొక్కభంగి నుడుపుచు
నెమ్మది నూల్కొల్పి పలికె నిజసఖితోడన్. 260

---

1. సెగలు వొద.

ఉ. "ఓహరిణాక్షి! నీకు నిఁక నుల్లము దాఁపఁగ నేటికిన్ ? జగ
న్మోహనమూర్తితోడ నిటు మున్నొకనాఁటినిశన్ విలాసస
న్నాహము మీఱ మద్విభుఁడునాకలలోపలవచ్చి[1] తేర్చెఁగా
మాహవకేళి; నద్భుతసుఖైకమయం బది, యేమిచెప్పుదాన్?

క. అనుచుఁ దదుత్సవలీలలు
మనసునఁ బాఱుటయు వివశమతియై మోడ్పుం
గనుఁగవతో నొక్కించుక
వనిత నిలిచి ఘర్మపులకవతియై యంతన్. 262

వ. ఆకూర్మి నెచ్చెలిం గటాక్షించి. 263

క. చెప్పెడి దేమె లతాంగీ!
యప్పురుషోత్తముఁడు నన్ను నట్లు రసాబ్ధిం
దెప్పలఁ దేలిచి "నిను విడ
నెప్పుడు" నని యూఱడించి యెందే నరిగెన్. 264

ఆ. అదియుఁ గాక యాధరాధీశుఁ డింతకు
మున్ను మనసమీపమునకుఁ దనదు
డేగఁ బిలిచికొనుచు ఠీవితో రాఁడె యా
యొప్పు మిగులఁ దాల్చి నుదురఁదోలె. 265

క. అది మొదలు వదల కొదవెడు
మదనవశావశత వివశమతి నైతి; నిఁకన్
ముదితా! చలువలు గిలువలు
మదికి నసహ్యంబు లతనిమన్నన దక్కన్. 266

క. కటకట! మీ రవివేకత
నటు నిటు శైత్యోపచార మని యేటికి ని

1. తేల్చె.

చ్చుటఁ దడసెద రిఁక! వెన్నెల
మిటమిటఁ గాయంగ మేను మిగుల నెఱియదే? 267

ఆ. కొఱవి చేతఁ బట్టుకొని చంద్రుఁ డదె వచ్చె
గ్రీష్మసమయభానురీతి మెఱయఁ
దనకు నేల యమృతధామాఖ్య? 'గోముఖ
వ్యాఘ్రి' యనఁగ నిట్టివాఁడె సుమ్ము! 268

క. 'చిలుక చదు' వనుట చదివిన
ములుచకు దృష్టాంత; మట్టి మూఢపుదుర్జా
తులచిలుకలఁ దెలిచినం దయ
గలదే మది బెదర వదరుఁ గాక నిజేచ్ఛన్? 269

క. కోకిలములఁ దెలిచినఁ బలు
గాకులపొదిఁ బొదలినట్టికష్టపుఁబులుఁగుల్
నాకు నసహ్యము లని యా
హా! కూఁతలు మానఁ గలవె యవి ప్రార్థనలన్? 270

ఉ. కావునఁ జంద్రు గింద్రుఁ జిలుకం గిలుకంబికముంగికంబునన్
గావు మటంచు వేఁడకుఁడు; నాబ్రతు కీరిపుజాతికిం బ్రియం
బే వివరింప మీకు బలెఁ బెంచినవారికి ముద్దుగాక పె
న్పావురుఁబిల్లికిం గలుగునా మొగమోటయొకింతచిల్కపైన్.

తే. వేయు నేటికి? శీఘ్రింబ విభునిపొందు
సంఘటింపఁగఁ గలవేని జలజవదన!
యాస నొక్కింత ప్రాణంబు లాఁపవచ్చు;
నన్యథాచింత లెల్ల నిరర్థకములు." 272

చ. అన విని పల్కు "నీవిభుసమాగమ మెంతయు శీఘ్రవృత్తినో
వనజదళాయతేక్షణ! యవశ్యముఁ గల్గుట కేను బూఁట; నా

కు నవల మాఱుపూఁట యవికుంఠితలీలఁ దనప్పు నాదరిం
కనిరతు దీనవత్సలత; గావున నెమ్మది నమ్ము మెంతయున్.273

క. అని పలికెను చెలిపలుకులు
దన కమృతమువోలె హృదయతాపము నడఁపఁగ
వనజాక్షి నేర దేఱుచుఁ
జనియెఁ నిజభవనమునకు సఖులుం దానున్. 274

ఉ. లోలవిలోచనాహృదయలుంఠనశూరతనూవిలాస! నం
ద్యాలపురీనివాస! సతతాత్మవికాస! నృసింహమేదినీ
పాలుప్రపౌత్ర! నారవిభుపౌత్ర! నృసింహునిపుత్ర! సర్వథ
ర్మాలయనిత్యవైభవమహత్తమ! కృష్ణనృపాలసత్తమా. 275

క. సంగీతాదికళారస
రంగన్మానస! మహాతురంగమమదమా
తంగారోహణచతురిమ
సంగతవనితామనోజ! సమధికతేజా! 276

తరల. కురు కరూశ విదేహ కోసల కుంత లాంగ కళింగ బ
ర్బర పుళిందక మత్స్య మాళవ పాండ్య కేరళ చోళ ఘూ
ర్జర శకాదిసమస్తదేశధరాతలేశసభానిరం
తరవిభాసురకీర్తినర్తన ధర్మనిర్మలవర్తనా. 277

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ
పింగళి యమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామ
ధేయప్రణీతం బైన కళాపూర్ణోదయం బను మహాకావ్యంబు
నందు షష్ఠాశ్వాసము.

శ్రీరస్తు

# కళాపూర్ణోదయము

## సప్తమాశ్వాసము





క. రమణీయస్వగుణక
థారంజితలోకహృదయ ! తతనిత్యదయా !
సూరిజనారాధన సము
దారస్ఫూర్తినయ ! కొండమాంబాతనయా. 1

వ. అవధరింపుము. 2

ఉ. కర్ణరసాయనోల్లసితకమ్రయశోమహనీయుఁ డాకళా
పూర్ణుఁడు నట్లు కేళివనభూమిఁ గనుంగొను టాది గాఁగ నా
పూర్ణసుధాంశుబింబముఖిపొల్పు మనంబున నిల్పి తద్గుణో
దీర్ణలతాంతసాయకవిదీర్ణమనోధృతియై యజస్రమున్. 3

క. తలపోయుచుఁ దనతలఁ పా
మొలనాఁగం బాయ కునికి నితరవిచారం
బులు విడిచి తాపమునఁ గడు
నలఁగుచు నేకాంతగృహమునన్ వర్తిలుచున్. 4

ఆ. తనకు నర్మసచివుఁడును దిథివారతా
రాదిశంసకుండు నైనయట్టి

యొక్కవృద్ధవిప్రుఁ డొకనాఁడు పిలిపించి
కొంతతడవు నర్మగోష్ఠి నడపి. 5

తే. అనుఁగుఁజెలికాఁడ! యొకటి ని న్నడిగి తెలియ
వలయు నని యుండుదాను నీవు వచ్చియున్న
యప్పు డది యేమి యడిగెద ననుచు విస్మృతు
నడుగకుండినఁ బో దింక ననుచుఁ బలికె. 6

చ. మననగరంబుతూర్పుకడ మంజులరత్నవినూత్నకాంతితో
ననయము నొప్పునట్టివి మదాశ్రయమున్నఁబురిగల్ గదా! తదీ
యనవసువర్ణసాలముల కవ్వల నున్నది నిత్యసాంద్రనూ
తనకుసుమప్రవాళలలితం బగుకేళివనం బెఱుంగుదే. 7

క. ఇటము నొక్కనాఁ డే న
చ్చటి కరిగితి వేటడేగ చనినఁ బిలుచుచుం
గుటిలాలక నొకతెను ముం
దటఁ గాంచితి నందుఁ జెలులుఁ దాను జరింపన్. 8

ఉ. ఆలలితాంగిరూపుసన యారసి చూడఁగ నెన్నియాత్మలుం
జాలవు; దానిసర్వగుణసంపద లెన్నఁగ నెన్నిజిహ్వలుం
జాలవు; తద్విలోకనరసస్థితిఁ జొక్కఁగ నెన్నికన్నులుం
జాలవు; వేయు నేల? యది చక్కఁదనంబులరాశి భూసురా! 9

క. ఎక్కడి యుపమాకల్పన
లెక్కడి యత్యుక్తిరచన; లెక్కడి మతి నే
ర్పెక్కడి వర్ణన? లెక్కడి
యెక్కడి వాఙ్మతుల కంద యింతి బెడంగుల్. 10

సీ. భువనంబులం దెల్ల మిథుల నెక్కుడుగ నీ
యిల యేమిపుణ్యంబు సలిపెనొక్కొ;

యిలలోనఁ గరము మిక్కిలిగ జంబూద్వీప
మేమిభాగ్యంబు వహించెనో కో!
తనర జంబూద్వీపమునకు భారతవర్ష
మేసుకృతంబు మఱి చేసెనో కో!
ప్రఖ్యాతి గాఁగ భారతవర్షమున నంగ
దేశ మేతపము సాధించెనో కో!

తే. అంగదేశంబునందు నేయధికనియతిఁ
గ్రముకకంఠో త్తరపురంబుఁ గాంచెనో కో!
తద్వధూపాదవిన్యాసధన్య మైన
యట్టియాపూవుఁదోఁటచే నతిశయిలఁగ. 11

చ. అవగతధైర్యఁ జేసె నను నత్తటి నాశుకవాణి వేణిచో
క్కపుఁబసకాముబల్కి రుసుకత్తియుఁబోలె నరాళపార్శ్వమై
యుపరికృత ప్రసూనరచనోజ్జ్వలతావిభవంబుచేత దం
తపుఁబిడికై వడిన్ మొనలుతద్దయు నింపుజనింపఁ జేయఁగన్.

ఉ. ఆకమనీయవేణిభర మాకురు లాబొమతీరు సోయగం
బాకనుదమ్ము లామృదులహాసకపోలము లాముఖాంబుజం
బాకుచకుంభజృంభణసమగ్రత యాంగ్యశమధ్య మాసల
జ్ఞాకుతుకావలోకముపసల్ మదిఁ బాయవు నాకు నెప్పుడున్.

ఆ. ఇంక నీకు డాఁపనేల యాకాంత గ
న్గొనుట యాదిగాఁగ గినిసి కినిసి
పంచబాణుఁ డిపుడు ప్రాణంబులకుఁ దెగి
నన్ను మిగుల నొంచుచున్నవాఁడు. 14

ఉ. ఆనలినాక్షి కన్నెగతి నప్పుడు దోఁచె మదీయదృష్టికిన్
దాని తెఱంగు నీ వెఱిఁగినన్ వినిపింపు మెఱుంగకున్న నీ

చే నయిన ట్లీకం దెలిసి చెప్పు మనఁగ మరుబాఱిఁ బడ్డవాఁ
డీనరనాథుఁ డన్యరస మే నొనరించెద నఁగ తలంపుతోన్. 15

వ. నవ్వుచు నావిప్రుం డతని కి ట్లనియె. 16

తే. ఇప్పు డాయమ్మ కన్నె గానిమ్ము గాక
మానని మ్మింత ని న్నేఁచుమాట వింటిఁ
జల్లనయ్యె నాయాత్మ యాతల్లి యేల
వలయుఁ బదివేలురాజ్యము ల్వసుమతీశ. 17

వ. ఇంత సంతసిల్లుచు నేల దీవించెద వంటేని. 18

సీ. ఓమన్యథా యంచునొనయు విద్వాంసుల
గోష్ఠి కెన్నఁడుఁ గడ గుఱుతు లేదు
పౌరాణికులు చేరి పచరించుశుష్కవా
చాలత విడువని[1]వేల మెప్పుడుఁ
జెవులు చిందఱవోవఁ జెలఁగుకవింద్రుల
పో రంటిమా శనివారపుజడి
మఱి ప్రధానులవట్టిమంతనా లెటు నన
రానివి ప్రేగులలోనితీఁట

తే. యంత నంతఃపురంబున కరిగి తేని
నీదుకొలువు బుధప్రకాశోదయంబు
మమ్ము నున్నారె! యనుమాటమాత్రకైన
నెడగలదె నీకు మాకొలు విపుడుగాక ? 19

వ. అదియునుం గాక. 20

సీ. స్థలశుద్ధిగా వసుంధరఁ ద్రవ్వి పూడ్చిరె
కట్టించుచును బచ్చకప్పురమునఁ ?

1. మేల.

గమ్మపన్నీటియగద్దలు దీర్చిరే
వెలిఁ బెక్కువరుసల విస్తరిలఁగ ?
బిసకాండములు లోని పసి యార్చి నిలిపిరే
మంచిగందమ్మున మదురుగోడ ?
నవచంద్రకాంతమంటపములోఁ బన్నిరే
తలిరాకుదళ్ళ చెంగలువచవికె

తే. యెన్నఁడైనను దొల్లి నీ కిపుడువోలె
నీమదిన్ నిల్వసాగనే యామృగాక్షి
వెతఁ బఱుపఁ బట్టి దినమును వింతవింత
లైన యీపనుల్ చూడ మాకబ్బెఁగాక." 21

క. అన నతఁ "డన్నియు నయ్యెన్
నిను నెఱుఁగమె 'యలపులకును నేర్పరి' వని ? నా
కును జెపు మే నడిగిన యా
వనితకులస్థానసామవర్తన" లనుడున్. 22

చ. "నరవర ! తత్కులాదులు వినం దమకించెదు; నాకుఁ జెప్పు
మా, విరహపుశీతలక్రియలవెచ్చము సర్వము నాయముం
గొనం, ద్వరపడులాగొ ? యట్లయినఁ గద్ధన మెత్తుద మూళ్ళ
మీఁదటన్, విరహపుఁబన్ను పేరిడి గణింపదు క్రొచ్వన
నెవ్వనిం బ్రజల్. 23

తే. ఇదియు నూరక యంటిఁ గా కేల నీకు
మాకతల్ విన బంటు కిల్లాకువోవఁ
దొత్తుకొడుకులువోలెఁ దోడ్తో దిగంత
భూమిపతు లంపుచున్నారు కామితములు. 24

సీ. "ఇవె చందనపుమ్రాఁకు లెన్నిక గొనరయా
కేరళదేశభూదాసుఁ డనిపెఁ
గట్టాణిముత్యాలపెట్టె లయ్యా యివి
పాండ్యదేశపురాజు పనిచినాఁడు
పన్నీరుచెంబులబండ్లయా యివి కామ
రూపదేశాధీశ్వరుండు పనిచెఁ
జంద్రకాంతంపురా[1]చలువలయ్యా యివి
యతులముల్ కాశ్మీరుఁ డంపినాఁడు
తే. కప్పురపుగోనె లివె తురుష్కపునిసేవ"
యనుజనులక్రందువాకిట నద్భుతంబు
నీకు విరహార్తి యగు కన్యనృపుల కెల్ల
నఖిలరాజ్యలక్ష్మీవిరహార్తి యయ్యె. 25
చ. తెలియరు గాని యన్యజగతీతలనాథులు నీకు నింతకీ
తలవిధి వెచ్చముల్ నడపుద్రవ్యములోన సగంబు చాలు నీ
తలఁపున బాయ కిట్లుఁ జుతన్వికి నిన్ను వరించులంచ మీఁ
గలిగిన నేల తోఁచు నది కారణ మీగతి [2]నుండ వారికిన్?"
క. అన "నిట్టిపలువయలఁపుల
కును గోటికిఁ బడగ యెత్తి గుటే యగు పెద్దగా
నిను నమ్మరాదు గాక
ట్లొనరిచితే నట్టిలంచ మొసఁగనె నీకున్?" 27
వ. అని పలుకు జగతీవిభుమొగంబుఁ దప్పక చూచి. 28
తే. "వట్టిటానాలు దర్భలు పుట్టెఁ డుప్పు
గడ్డపాఱయి మ్రింగినగతిని బిట్టి

1. చలువ. 2. నున్నవారికిన్.

బిగిసి కూర్చుండుటలు లేక పెద్దతనము
గలదె? యవిలేమి నను నీవు "పలువ" యంటి. 29

ఉత్సాహ.—

అనుచు నలుక దెచ్చుకొనుచు నతఁడొకింతమేర వే
చనియె "గంగిగోవుపంటిసాదుబాపనిన్ నినుం
జనునె పలువ యనఁగ నింక సారె కనము పోక ర"
మ్మనియె నృపతి యతఁడు దిరిగి యధిపుతోడ ని ట్లనున్. 30

సీ. నీ విప్పు డనినట్ల మావచనము నమ్మఁ
గారాదు నిజము మీవార మగుట
రాజకుంజర! 'యథారాజా తథాప్రజా'
యనుపల్కు వృథ సేయ నర్హ మగునె
"యత్తమామలు మీర లైతి రింతట నుండి"
యని యల్లనాఁడు రూపానుభూతిఁ
దద్విభుఁ బిలిచి యాస్థానంబునందు నీ
వాడినమాట యేమయ్యెఁ జెపుమ?
తే. యామ యప్పుడోస మిట్లు నీ యాత్మఁ బొడిచి
వేఁచుచున్నది! యి ట్లన్న వినుము తెలియ
దానఁ బరతత్త్వ యయ్యె రూపానుభూతి
తనయ లవవాప్తి నీయాత్మ తాప మొందె." 31

చ. అనుటయు "నెట్టటూ తెలుపవయ్య మహాత్మక! యేల నేసెది
ట్లనయము?నింపుసొం పెసఁగ నమ్మెయి నాపువుఁదోఁట నేను గ
న్గొనినది యామదాశయతనూభవయే? యది యింతవేగిరం
బున నె మనోజ్ఞ యౌవనముఁ బూనెనె? యద్భుత మెన్న!"
నాపుడున్. 32

ఆ. "ఏమి తెలుపు మనియె దింకను సందేహ
మా నృపాల? నీదుమనసు నింత
కొల్లలాడ సకలగుణరాశి మాయమ్మ
గాక వేఱొకర్త గలదె జగతి? 33

సీ. వివిధనిత్యాచారవిధిఁ గొంతతడవు షా
డ్గుణ్యాదినయచింతఁ గొంతతడవు
గరిడిసాధనలవేడ్కలఁ గొంతతడ విభ
ఘోటకారూఢిని గొంతతడవు
దేవవిప్రార్చనస్థితిఁ గొంతతడవు వే
దాంతవిద్వద్గోష్ఠిఁ గొంతతడవు
స్నానభోజనవర్తనలఁ గొంతతడ వింపు
గొలుపునాట్యనిరీక్షఁ గొంతతడవు

తే. మంత్రిసామంతముఖ్యసమస్తజనులు
గొలువ గొలు వుండుమహిమలఁ గొంతతడవు
చనఁగఁ గాలంబు నీవిన్కి కనఘ తోఁప
దేమొ? తగినజవ్వనమ యాయింతి కిపుడు. 34

ఉ. ఆయెలప్రాయముఁ భవము దంచితకీర్తియు గొల్లు రాచఁగాఁ
గాయజుఁ డాకెపై నలిగి కత్తులు నూఱుచు నుండు నంతటఁ
నీయవలోకనం బొదవ 'నేలకుఁ గోలకుఁ దెచ్చుచున్నవాఁ'
డాయెలనాఁగబోంట్లు తెలియఁ వినిపింతురు నాకు [1]నెంత
యున్. 35

ఉ. పాపపురాచజాతిగుణభంగు లెఱుంగుదు వేమి చెప్ప? న
య్యో! పెనుగోరముల్ త్రిభువనోత్తమరత్నము ముద్దుఁ

1. నింతయున్.

గూఁతుఁ బ్రాణాపద[1]లంత చెందుతఱి నైనఁ దలంపరు నీకుఁ
దెల్ప నీవై పరికింపవంచు దురహంకృతి నాయమఁ గన్న
దంపతుల్. 36

కం. ఆకన్నియ వెత చూడఁగ
లేక సఖీజనులె యుమ్మలించుచు నెపుడున్
నాకు వినిపింతు 'రౌకతఱి
నీ కేఁ జెప్పుదునొ' యనుచు నృపకులతిలకా! 37

సీ. ఏనును సముచితంబైన కాలము ప్రతీ
క్షించుచుండుదు నీదుచిత్తవృత్తి
దెలియక యాసుద్ది తలపెట్టవెఱతు 'రూ
పానుభూతికిని మదాశయునకు
మును నీ వనుగ్రహించినమాట తలఁపుచే
సినఁ జాలు బొంకవి' వనుచుఁ దలఁతు
బ్రాహ్మణజాతిచాపలమున మఱియుఁ గొం
కుదు నీవిరాళిభంగులు గణింతు

తే. 'నివి యితరమూలములొ' యంచు నెంతు నిపుడు
పిలిచి యడుగఁ దదాఖ్యలే తెలుప నైతి
'మనమదాశయుపుత్రియే' యనుచు సులభ
తావగుణమున వదలుదో యనుచు నీకు. 38

ఆ. తమ కసాధ్యమైనఁ దమితోడఁ గాంక్షింతు
రారనాళమును ధరాధినాథ!
తమకు సులభమైన నమృతంబుఁ గైకొన
"రెండుఁ బెరటిచెట్టు మందు గాదు." 39

1. లంతఁ జెందు.

క. ఇవి యితరులఁ దొప్పులు గా
ని విశేషజ్ఞతఁ దనర్పునీయందును గ
ల్గవ నిక్కువ మైనను నా
యవివేకము తెలుఁగు లిట్టి వవనీనాథా! 40

తే. అంత నాయింతి జాత్యాదు లడుగు టుడిగి
"దానిఁ గూర్చిన నే లంచ మీనె నీకు"
ననుచు నీవాడ మదిఁ గోర్కె యధిక మగుట
యరసి తెలిపితి నిపుడు తచ్చరిత మెల్ల. 41

తే. ఇంక సంబంధసాదృశ్య మెంచిచూడఁ
గొదవగలయది గాదు దిక్కులఁ బ్రసిద్ధ
మైనయది కార్తవీర్యార్జునాన్వయంబు;
దిగ్విజయశాలి యందు నితెఱవతండ్రి. 42

క. తనమహిమ నాశ్రయక్షితి
యొనరుచుఁ జనఁ జూచి సుగ్రహాంకురీనత యం
చు నుదాహరింతు రెఱుఁగుఁడి
యనుజుఁడు సుష్మాతఁ డిష్మదాశయుసతికిన్. 43

చ. కడు నుతి కెక్కునట్టియధికంపుఁ గులీనతచే నతండు న
ల్గడల జనాధిపుల్ దనకుఁ గన్యల నిచ్చెద మంచు నెందఱే
బడిబడిఁ జెప్పి పంప నది పాటిగఁ బట్టక వారియాసచే
నడపాడలేకపోయెనఁటయల్పములయ్యెఁగులాభిమానముల్.

క. జనివేళయందు నురుభా
గ్యనిమిత్తము లగుచుఁ బెక్కుగ్రహము లునికి నా
తని కిడినారఁట సుగ్రహుఁ
డనుపే రాశాస్త్ర మేమి యన్యోన్యో యెఱుఁగన్. 45

వ. అది యెట్టట్టు కాని మిప్పు డింతయు మధురలాలస యుభయ కులశుద్ధి చెప్పెడు ప్రకారం బింతియ" యని పలికి యి ట్లనియె. 46

క. "అవనితామణి నిప్పుడు
జీవితముగా నిలిపి ప్రోవఁ జిత్తము గలదే
నో వసుధాధిప! పూనుము
వేవేగం దద్వివాహవిధిమంగళమున్." 47

క. అని పంచాంగముపుస్తక
మును విడిచి కడుం బ్రయత్నమునఁ దిథివారా
దినిరీక్ష చేసి ప్రేల్లె
న్ని నిరూపించెఁ గ్రహాదినిఖిలబలంబుల్." 48

వ. ఇట్లు నిరూపించి సంతసిల్లుచు "దేవరసిద్ధసంకల్పత యేమి చెప్పుదు? నెల్లియ మీ యిరువురపేర నత్యుత్తమం బైన దివాలగ్నం బున్నయది; వివాహోత్సవంబునకుం దగిన సకల సామగ్రియు సార్వభౌమునకు నెప్పుడైననుం గలిగి యునికి చెప్పవలద; యిప్పరం బేప్రొద్దును సువిహితమంగళా లంకారంబ" యని పలికి మఱియు నతం డి ట్లనియె. 49

మహాస్రగ్ధర. "ఫలముల్ హారిద్రపంకప్రమిళితమణిశో
భఁగా వహింపఁగా గృహశ్రీ
గళసౌభాగ్యాభినీతిక్షమితపురముపైఁ
గంఠముల్ మించి యొప్పం
బొలుచున్ నిత్యోత్సవద్వాస్స్ఫురితము లగులేఁ
బోఁకమ్రాఁకుల్ కరం బిం

పొలయంగా దానఁ గాదే యొనరఁ గ్రముకకం
ఠోత్తరం బండ్రు దీనిన్. 50

శా. ఐనన్ దేవర పెండ్లికిం దగ వినూత్నాలంక్రియాసంపదం
బూనంగా వలదే పురం? బిపుడు సొంపుల్ మీఱఁ జాటింపు స
న్మానం బొప్పఁగ మామయింటికిని గన్యారత్నయాచ్ఞార్థ మ
న్యూన ప్రజ్ఞులఁ బెద్దలం బనుపు మోయుర్వీశ! ధర్మస్థితిన్."

చ. అనుటయు సంతసిల్లుచు ధరాధిపుఁ డవ్విధమెల్ల సత్వదా
త్మునిఁ బిలిపించి తెల్పి తదమోఘునయానుగతిన్ నిజాగ్రభా
ర్య ననుమతింపఁ జేయఁ బ్రథమాగమముఖ్యులఁ బంపె
నల్వురన్, జనపతిపూన్కి వాపుఁ దగుజాడను జెప్పిరి తద్వ
ధూటికిన్. 52

వ. చెప్పి దీని కుత్తరం బెయ్యది చెప్పు మనుడు నప్పురమపతి
ప్రత వారితో ని ట్లనియె. 53

ఆ. "చల్లఁదనముతోడ నెల్ల బంధువులకుఁ
దత్తదుచితమధురతరగుణములఁ
జిత్తరంజనంబు చేయుట నభినవ
కౌముది యనుపేరు గలిగె నాకు. 54

తే. చంద్రకిరణభవాప్సరోజాతిఁ బుట్టి
యట్టిపే రొంది వెలయునే నకట యిపుడు
తగ సతుల కెల్ల సామాన్యధర్మమైన
పతిమనోనుకూలతకును బాయఁ దెరువె. 55

క. కావున న న్నేమడిగెద
రావసుధాధిపున కేది యభిమత మదియే

నావాంఛితంబు నిక్కువ
మీవృత్తాంతంబు దెలుపుఁ డేర్పడ నచటన్. 56

వ. అని పలికి వీడ్కొలుపుటయు వారలు చని యావిధంబు
భూవిభునకు విన్నవించి తదీయనిదేశంబున మదాశయుని
గృహంబున కేఁగి యా కళాపూర్ణమహారాజునకుం గలిగిన
వివాహోద్యోగంబు దెలిపి సుముహూర్తంబున సాక్షి
తాంబూలాదిసముచితశుభవర్తనంబులు నడపి; రంత మంత్రి
జనులు తద్వివాహోత్సవంబునకు నాయితపడం బురంబు
లోనం జాటించిన. 57

సీ. ఎక్కడఁ జూచిన నిండ్లపైఁ బసిఁడికుం
డలు క్రొత్తమెఱుఁగిడి నిలుపువారు
నేవంకఁ జూచిన హిమవారితో గంధ
సారంబు కలయంపి చల్లువారు
నెచ్చోటఁ జూచిన నెలమిగోడలఁ దట్టు
పునుఁగుజవ్వాదియుఁ బూయువారు
నేదిక్కుఁ జూచిన నింపుగా మణివేది
కలఁ గమ్మకస్తురి నలుకువారుఁ

తే. బ్రేమఁ గప్రంపుమ్రుగ్గులు వెట్టువారుఁ
గలువడంబులు మేల్కట్లు గట్టువారుఁ
బచ్చఁదోరణములు పొందుపఱచువారు
నై రహోరాత్రసంభ్రమం బలర జనులు. 58

ఉ. పెండ్లి నృపాలునింట నని పేరఁటముల్ ప్రియ మొప్పఁ
జెప్ప నిండ్లిండ్లకు శోభనాక్షతలు హేమపుఁబాత్రలఁగొంచుఁ
పెద్దపూఁబోండ్లు చరించి రాకులును బోకలుఁ గుంకుమపాళ్లు

నూనెయుం,బండ్లును గొంచు వాద్యపుశుభధ్వనితోఁ దగు
వారు వెంటరాన్. 59

సీ. కర్పూరమృగమదగంధసారాదులు
విరివిగాఁ బసిఁడికొప్పెరలఁ గలిపి
మల్లికాకుంద చంపకజాతివకుళాది
పుష్పముల్ పేరాళముగను గూర్చి
మంచివాసనల వాసించిన నెలవ త్తి
బాగాలు రాసులువడఁగఁ బోసి
బంగారుచేఱపులపస మించుతములపా
కులమావటాలు కొండలుగ వైచి
తే. త త్తదధికారపురుషు లత్యంతమోద
గరిమ నేవీథిఁ జూచినఁ గ్రందుకొనుచుఁ
బురములో గంధమాల్యతాంబూలముల న
శేషజనములఁ దనియంగఁ జేసి రపుడు. 60

తే. అయిదువతనంబు సుతసమృద్ధియును గలుగు
సతులు శుభవేళ మంగళస్నానవిధులు
నడపఁ దొడఁగిరి బహువాద్యనాద మెల్ల
దెసల [1]నెఱపంగ మధురలాలసకు నంత. 61

ఉ. క్రొత్తగ నల్కెఁ గస్తురిని గోమలి యొక్కతె యొక్క
వేదిక,ముత్తెపుమ్ముగ్గు వెట్టె నొకముద్దియ తద్దయు [2]వేడ్క
మీఱఁగఁ,బుత్తడి పెండ్లిపీట యొకబోటి రయంబునఁ బెట్టె
దానిపై,నుత్తరపుంజెఱంగులుగ నొక్కతె గప్పె విశుద్ధ
వస్త్రమున్. 62

1. నెసఁగంగ. 2. నేర్పు.

తే. పెద్దముత్తైదువొక్కర్తు పెండ్లికూఁతుఁ
గాంత లికువుప తూర్పుమొగంబు గాఁగఁ
బెండ్లిపీఁటపైఁ గూర్చుండఁ బెట్టి నేర్పు
నెరయ సంపెంగనూనె యంటిరి మొకమున. 63

క. ప్రేమమున సంభ్రమించుచుఁ
గామిను లంతటను బసుపు గలపినశుభగం
ధామలకముఁ బెట్టిరి మఱి
హైమఘటాంబువుల జలకమార్చిరి సతికిన్. 64

సీ. దడిమంపుఁ జేలలఁ దడి యొత్తి పసుపుకొం
గుల తెల్లపట్టుదువ్వలువ గట్టి
తలవెండ్రుకలఁ బావడల నద్ది యద్ది శీ
ఘ్రమె తడియార్చి పుష్పములు ముడిచి
మలయజ మంగకంబులఁ బూసి ఘనవాస
నాశేషముగ నది నిలిచి వైచి
పాలిండ్లఁ గుంకుమపత్రవల్లులు వ్రాసి
కమ్మకస్తురితిలకంబు దీర్చి
తే. ముగుద తొంగలిఱెప్పల మొదల మిగుల
సన్నమై కనుపట్టఁ గజ్జల మమర్చి
లాతుఁ బాదాంబుజంబు లలంకరించి
యామదాశయతనయకు నతివ లంత. 65

సీ. తళుకుఁబిల్లాండ్లు [1]బబ్బిలికాయలును మట్టి
యలు వీర[2]ముద్దెలు నందియలును

1. బొబ్బిలి; బిబ్బిలి (శ. ర.) 2. మద్దెలు (శ. ర.) ప్రాను.

మొలనూళ్లు నొడ్డాణములు నేవళంబుఁ బుం
జాల[1]దండయు బన్నసరము మొగపుఁ
దీఁగయుఁ నాణెముత్తెపుఁబేర్లు సందిదం
డలు సూడిగములు గౌడసరములును
గడియాలుఁ జెక్కుజోకలయుంగరములు ముం
[2]గరయుఁగోలాటంపుఁగమ్మజోడుఁ

తే. చెవులపూవులు బవిరలుఁ జేరుచుక్క
కొప్పువలఁగాను సవరించి రొప్పు మీఱి
భూషణములకుఁ దా నొక భూషణ మయి
పడఁతి యపు డొప్పెఁ గన్నులపండు వగుచు. 66

సీ. ఇట్లు కైసేసి యాయింతులు తజ్జన
యిత్రిని బిల్చి నీపుత్త్రిసొబగు
లెస్సగాఁ జూడు మో లేమ మాచూ పొక
లాగు నీచూ పొకలాగు నీవు
రూపానుభూతినా రూఢి కెక్కినదాన
వెవ్వరు నీపాటి యెఱుఁగ లేరు
రూపవిశేషంబు రూపింప ననుచు నా
కొమ్మ నవ్వుచు నటు గొంత యెడగ

తే. కేఁగి తనకూఁతుసింగార మెల్లఁ జెక్కు
మాఱు లెగదిగఁ గ్రేఁగంటఁ బాఱఁ జూచి
"యింతకంటెను గయిసేయ నెవ్వ రింక
నేర్తు?" రనుచును వారల నేర్పు మెచ్చె. 67

1. దండయుఁబన్న. 2. గరయును గోలాటకమ్మ. (శ. ర.)

సీ. మెచ్చి యాచెలువంబు మిక్కిలిఁ జూడ్కికి
వెక్కసంబై తోఁప వెఱఁగుపాటు
గరము లోలోనన కప్పిపుచ్చుచు 'దృష్టి
దాఁకునో' యనుచును దల్లడిల్లి
'పువ్వుదండలనెపంబునఁ గొంత యిది మాటు
పఱచెద;' నని ముద్దుపట్టి యఱుతఁ
దగ నొక్కచెంగల్వదండ మున్నమరించి
యదిగుబ్బచనుఁగవయందు మిగుల
తే. వింత గాఁగ నొకానొకవిలసనంబుఁ
జూప నయ్యింతిఁ గడుఁ దాను జూడ వెఱచి
కడమపూదండలెల్ల నొక్కటిగఁ బట్టి
బాల కపుడు సురాళించి పాఱవైచె. 63

వ. అట్టిసమయంబునం గళాపూర్ణుండును వివాహంబునకుం గట్టాయితంబై ప్రథమాగమాదిభూదేవసముద యాశీర్వాదనాదంబులును, వివిధపుణ్యాంగనాసంఘాతమంగళగీతగానస్వనంబులును, వందివైతాళికసూతమాగధస్తుతికోలాహలంబులును, సందర్శనసమయాపేక్షసామంతసేవాప్రబోధ నాయాతవేత్రహస్తజనస్తోమవిస్తారితాలోకశబ్దంబులును, సర్వసర్వంసహాజనజనిత జయజయశబ్దంబులును, శంఖ కాహళ భేరీ పటహ ఝల్లరీపణవమర్దళతమ్మట ప్రముఖనిఖిలవాద్యనిర్ఘోషంబులును మిక్కుటంబగుచు నొక్కమొగి నలుదిక్కులుఁ బిక్కటిల్ల మిక్కిలి యెక్కుడగు వైభవంబున నగరు వెడలి శుభశోభనాభరణభరణాభి రామరూపంబున దీపించు నౌపవాహ్యంబు

నారోహణంబు చేసి భాసమానాసమాననానాదేశభూమీశ భాషాసంఘుసంఘుర్ష రేణుపటలంబులును, గరటిఘటా[1]కటత టోత్కటస్యందమానదానధారాప్రసారంబులునుసంకలితంబు లగుచుఁగుంకుమ[2]పంకాలంకారవాసీరనిర్వర్తితావిశేషసంవిధానంబునకుఁ జొనరుక్త్యప్రసంగంబు నొసంగఁ గుసుమకిసలయవిసరవిరచితనీరంధ్రనందనమాలికాబృందంబు పందిరిచందంబునందపఱచుచు నందిరుప్రక్కలఁ దరణికిరణమండలిచండిమ బెండువడి యుండుటం జేసి వీసరపోనిచలువ చెలువంద మకరందబిందుకందళ సందోహంబులపొందునఁ జంద్రికాసాంద్రధుర్యంబగుచు విస్తరిల్లు సమస్తపరివారతారహారప్రభావిభవంబునకు సముచితంబుగఁ బరిపూర్ణచంద్రమండలాయమానంబగు ధవళాతపత్రంబు ధాత్రీజనంబులకు నేత్రోత్సవంబు గావింప నింపులగుచు మిగుల దిగంతరాళంబునఁ బ్రబలి గుబులుకొను గంధసారగంధోపాయనంబులు పచరించి వెలయుచు మలయపవనుండును దండతండంబై మెండుకొని నదిశలును గుసుమైకమయంబుల యనిపించుచు నుల్లసిల్లు మల్లికాకుంద చంపకవకుళకురువకతిలకపున్నాగమాలికాశోకముఖ్యవిఖ్యాతవివిధసురభిప్రసూనమాలికలు కానుకలగుచుఁ బొసఁగ వసంతుఁడును మున్నుమున్నుగాఁ గొలిచి చిత్తంబు వడసియునికిఁ దనకు నవలంబముగఁగొలు వభిలషించుతలఁపు తోడఁ దోడుచూపెడుకొఱనుఁ బెఱకువిలుతుఁ డిపుగడలఁ బొజుదీర్చిన శుకపికమధుకరప్రకరంబులగతి నతిశయిల్లుచున్న యుభయోపాంతసంతతవితర్దికానిచయఖచితమరకతకురువింద

1. కర. 2. పంకసంకరాలంకారపన్నీరవీరనిర్వర్తితోర్వీసేచనవిధాన.

రాజావర్తహారినీలజాలంబులు నిజాలోకనాచరితంబులఁ జరి
తార్థంబు లగుచుండ నగణితవితానయవనికాది వివిధవిరచ
నోల్లసితపల్లవప్రసవతల్లజస్మానిహారిహారార్థంబుగఁ దగువిధం
బున ¹దీప్రభాగంబుల నిబంధించిన మంచుతిత్తులతుంపర లతి
సూక్ష్మంపువలిపెపుయ్యెదల యొయ్యారంబున బాగుమీఱు
చునికి²భోగత్వరాయాససముచితవేషవిస్ఫురితపురలక్ష్మీవత్షో
జసాక్షాత్కారసంతానంబునుంబోలెఁ బ్రతిగృహద్వారవేదికా
విశేషవిన్యస్తపూర్ణకలశవిలసనానుభవం బెడతెగక పాలుపు
మిగుల నగురుధూపధూమస్తోమసంరంభదంభ జృంభితాంభో
వాహసంభ్రమంబునకుసాఫల్యంబునాపాదించుప్రాసాదభాసుర
సువాసినీవారధారాయితలాజవర్షంబుల సంగడిసంగడికోల
మెఱుంగుల తెఱంగున రంగుమీఱుబంగారుజలపోఁతబెత్తం
బులనటన ఘటిల్లఁగటికివారుసారెకు బరాబరిసేయుచు నేఁగు
దేరజారుతరచతురిమతురంగలీలావృత్తవర్తితశ్రవణభూషణ
వినిస్సృతముక్తావర్గనిర్గచ్ఛచ్ఛవిగుళుచ్ఛంబులచేత నినుమడి
ముమ్మడి యగుచు రంజిల్లుసింజామరలు మంజుహాసామృతసరో
వరాయమాన గండస్థలసదేశంబులఁ గాశనీకాశంబులై ప్రకా
శింప నాకాశమణిఘృణిమతల్లికలయుల్లాసంబు నొల్లక యటు
వెనుక చేసినాళాగ్రంబునం దమకభిముఖంబున మగిడి నిలిచిన
పుండరీకంబునకుం బుష్పంధయబాంధవంబును మకరందంబు
మిసిమియుం బరాగంబుసరియు నసదృశంబుగా నొసలుగుచు
విశేషాధికతం బ్రకటించు ముకుటమహానీలహీరచామీకర
మరీచివీచికలవైచిత్రి లోచనపర్వంబు నాచరింప సమీచీన

---

1. దీప్రబంధంబుల. 2. రాగత్వరాసమయసముచిత.

సతతజయసుధాసేకంబున నాకులుఁ జిగుళ్లుఁ బువ్వులు మవ్వంబు
లగుచు నామూలచూడంబుగా నుప్పతిల్ల నొప్పుచున్న యీయో
యనంగ నప్రతిమరంగదంగుళీయకకంకణాంగదఖచితగారుత్మత
పద్మరాగమౌక్తికప్రభలశబలిమబలిమప్రబలబలబాహాస్తంభ
స్తంభముల జృంభణంబు నెఱప నపూర్వనిర్మలత్వయాచ్ఞాపేక్ష
నుంబోలె నక్షత్రమాలికలచేత బహిరుపాసితంబగుచు హృద
యంబు ప్రకటీకరించిన ఘనీభూతకరుణారసరేఖభావంబున స్వ
భావనామసిద్ధపిశ్రాణితశోణమాణిక్యశిలాకాపిలోకనమోహ
నంబగుచు బాహాంతరంబున గరంబుఁ గనుపట్టుచుండ నొండొం
టిఁ గదిసి నానావర్ణవిలసదవిరళప్రవాళజాలకసూన[1]సంపదలఁతో
డిమతీఁగలు దడివడుపున[2]బెడంగు నడపెదు విచిత్రాంబరాభరణ
విభూషితమృదుశరీరంబులును, దదగ్రభాగంబున శోభార్థం
బుగాఁ వెరలినయరవిందపంక్తియో యనంగ సోయగంబున నం
బొగడొందునగు మొగంబులును, దదుపరిక్రీడమానకలహంస
విభ్రమప్రాచుర్యసూచనాచాతురీప్రబలంబు లగుకబరీభరంబు
లుగలిగియొప్పారు వారనారీజనశ్రేణీకటాక్షవీక్షణంబులఁ క్షుద్ర
సౌరభాతిశయ సమాకృష్యమాణరోలంబజాలంబులుంబోలె
వదనాంబుజంబునఁ బరిభ్రమింప నవభ్రవిభ్రమభ్రాజివాజిన ర్తన
వర్తనోచ్చలితతచ్చరణకటక నాదంబులకు సహానువాదంబుగ
నిజపాదమంజీరమాణిక్యలక్ష్మీకరపల్లవంబులు వినయవినమిత
పరిసరచర కురుకరూశకోసల మగధమచ్ఛిల్లకమత్స్యవత్సాది
రాజకుమారుల చెక్కిళ్ల నల్లనల్లన తాళంబులొత్త నత్యం
తంబు నింపొందుచు ముంపటి ముంపటి భూభాగంబు నావ.

1. సంతతులతోడి లేఁదీఁగలు. 2. నడలిడు బెడం.

రించుసమంచితరత్ననూపురపారిహార్యనిర్యాతనూతన ప్రభా
పటలపరంపరలచేత నడుగులకు మడుగులొత్తుట దోఁప గభీర
గమనంబుల నడచు గుడజీరకహరిద్రాది శుభద్రవ్య పరిపూర్ణ
భాజనరాజమాన హస్తప్రశస్తపురంధ్రీలోకంబు లోకపావ
నత్వంబున విలోకనీయం బగుచు నొప్ప లోకాతిశాయి విభ
వాభిరాముండును, రామణీయక విశేషవిజితకాముండును,
గామనీయకాఖర్వ సర్వగుణసంపదుద్దాముండును నగుచు
నుచిత గాంభీర్యమనంబున మదాశయుని గృహంబున[1]కరిగె;
నతండు నఖండవైభవంబున దవుదవ్వులన యెదుర్కొలు
చేసె నప్పు డొకించుకవడి యత్యంత సంభ్రమంబున. 69

క. చెలరేఁగి రెండుతోయం
బుల పేరంటాండ్రు చిత్తముల నెంతయు వే
డ్కలు మీఱఁ జల్లులాడిరి
తలఁకక యభినవశుభాక్షతవ్రాతములన్. 70

వ. ఆసమయంబున. 71

సీ. కడువేగమునఁ బెండ్లికొడుకు నెమ్మొగమున
కరిగె నడ్డమువట్టుఁ గురువిభుండు
హయము [2]కేళ్లులుకునో యని రెండుకడలందు
వాగెఁ బట్టిరి మత్స్యవత్సపతులు
జతన యెచ్చరిక యం చతిరయంబునఁ జేరి
కైదండ యిచ్చెను జేదిభర్త
యశ్వలోచనముల కాత్మవస్త్రము కొంగు
మాటుగా నొనరించె మగధరాజు

1. కరిగిన. 2. క్రేళ్లు.

తే. "తమి నెదుర్కొలుసేయు మాతల్లిచెలుల
యక్షతలవాన సరకు సేయక చొరంగ
శత్రుశరవృష్టి గాదురా సామి" [1]యన్న
నవ్వెఁ గదుగ్ర మని నవ్వె నర్మసఖుఁడు. 72

ఉ. శ్రీలు దలిర్ప భూరమణశేఖరు నిట్లు మదాశయుం డెదు
ర్కోలొనరించి తెచ్చి మణికోమలపీఠిక నుంచి కూర్మి యి
ల్లాలు పసిండిగిండి గొని యాచటఁదోయము వోయఁగాఁబద
క్షాళన మాచరించి వరుసం జలిపెన్ మధుపర్కముఖ్యముల్.

మ. క్రమ మొప్పారఁగఁ బెండ్లిపెద్ద లిరువంకన్ వర్తిలంగాఁ బ్రగ
ల్భమనీషం బ్రథమాగముండు తమితో లగ్నాష్టకంబుల్ పఠిం
చి మనోజ్ఞం బగులగ్నవేళ శుభముల్ నేర్పించె శాస్త్రస్థితిన్
విమలశ్రీల మదాశయాత్మజకు మాణిస్తంభికిం బ్రేమతోన్.

క. మంగళసూత్రముఁ గట్టెఁ గు
రంగాక్షికి నంత నంగరాజేంద్రుఁడు పు
ణ్యాంగనల పెండ్లిపాటలు
మంగలికోళ్ల మృదుగీతిమధురిమ నెనయన్. 75

సీ. ఇరువంకఁ జెలు లెత్తు లిడుచు నుబ్బింపంగఁ
జిఱునవ్వుతోఁ గొంతసిగ్గు వదలి
ఘనతరం బగు గుబ్బచనుదోయి మీఁది కెం
తయు మిటారింప హస్తంబు లెత్తి
కడుఁ దీఁగె సాఁగుచు బడుగునెన్నడుము మి
క్కిలిఁ గృశంబుగఁ దత్తఱిలుచు నిక్క

1. పా. నవ్వెఁ గవుగ్ర. నవ్వె తేఁదుగ్ర.

ముత్తైదువలు దగ నెత్తుబంగరుపళ్లె
ములఁ బ్రాలు దోయిళ్ల ముంచి ముంచి
తే. ప్రియునిచేవేగిరము నొకింతయును మించ
నీక సాటికి నిందువదన
పోలుపు మీఱంగఁ దలఁబ్రాలు పోయుకడఁక
చూపఱులచూడ్కి కొకవింతసొబఁగొనర్చె. 76

ఉ. పావకుఁ డగ్రభాగమునఁ బ్రస్ఫుటకీలలఁ బర్వ లాజహో
మావసరోద్యతాం[1]జలిఁ దదంగన శోభిలె నందుకోఁగ హ
స్తావళి యెత్తి యాదెసఁ గణాధిపుముద్దులు చూచువేడ్కనిం
పావహిలంగ మీఁదఁ జలితాంజలిఁ బుట్టుభవానికై వడిన్.

చ. అలరుచు నాలతాంగి ప్రథమాంగముసంపున లాజహోమ ము
జ్జ్వలశిఖయందు సల్పుచును జాలఁగ నొప్పె సమీరలోలకో
మలనవమాలికాతిలకమంజులపల్లవతల్లజోల్లస
ల్లలితరసాలకోపరిగళత్కుసుమావళి నొప్పుచాడ్పునన్. 78

మ. చెలికత్తెల్ ధ్రువదర్శనంబునకుఁ జేముట్టి పల్లాఱు నె
త్తు లిడంగా మొగ మెత్తె నొయ్యనఁ దదస్తోకత్రపాభార
ముఖ, నెల దోడ్తోడన పైకిఁ బుచ్చుకొను చుక్కంబోలె
ప్రడావతీ, తిలకం బాశతి నమ్రభావముఁ గ్రమోత్తీర్ణంబుఁ
గావించుచున్. 79

చ. "మివులఁగ సూక్ష్మమై మినుకు మిన్కు మటంచుఁ బ్రకాశ
మొందెడుఁగా, ధ్రువుఁ గనుఁగొంటె యల్లదె యరుంధతిఁ
జూచితె" యంచుఁ దత్సమీపవిశదతారలం గుఱుతు

1. జలి పట్టు.

పల్కుచుఁ జెప్పుచు బోంట్లు తెల్పి తెల్పి వనితచేతఁ 'గంటి'
ననిపించిరి తత్సతి విస్ఫురంజిలన్. 80

*వ. అంత. 81

సీ. కలవంటకములు బూరెలు తేనెతొలలు చాఁ
పట్లు మండెంగ లొబ్బట్లు వడలు
కుడుములు సుకియలు కడియంపుటట్లు వె
న్నప్పాలు వడియంబు లప్పడాలు
పొంగరంబులు సొజ్జె బూరె తాగులు సేవె
లుక్కెర లరిసెలు చక్కిలములు
ఖర్జూరగోస్తనీకదళికాసహకార
ఫలములు కొబ్బెర పనసతొలలు
తే. తేనియలు జున్ను మీఁగడ లానవాలు
పానకములు రసావళ్లు పచ్చడులును
నాజ్య మొలుపుఁబప్పులు కూర లనుపమాన్న
మపుడు ప్రజ నెల్లఁ దనియించె నహరహంబు. 82

[1]ఉత్సాహ.—
సుచి భక్ష్యభోజ్యలేహ్యచోష్య పేయ భేదముల్
ధరణి నెన్నిగలవు వానిఁ దగ ఘటించి యందు నె
వ్వరికి నెప్పుడెద్ది వలసె వారి కపుడ యది కరం
బరసి యిడుదు; రెన్నఁ దరమె యచటి భోజనస్థితుల్. 83

వ. అది య ట్లుండె నంత. 84

సీ. వెలయ వియ్యా లంది పీడుకోళ్లు గుడిచి
నరఁ బువుల్ ముడిచిన నాపసాని

* కొన్నిటఁ గలదు. 1. ఈ పద్యము కొన్నిప్రతులఁ గలదు.

యొజ్జన మొనరింప సుచితక్రమంబునఁ
బుణ్యాంగనల్ గడఁబ్రోలు చొచ్చి
పొలుపు మీఱఁగ నాకబలికృత్యములు దీర్చి
యావధూవరుల నెయ్యంబుతోడఁ
బూర్ణకుంభాంతరస్వర్ణరౌప్యంబు లొం
డొరులకంటె మునుపు నరయువృత్తి
తే. బుచ్చుకొనుటకు నెచ్చెలు లెచ్చరింపఁ
గరము లిడి యిరువురును నొక్కటియె వొరకఁ
బెనఁగులాడుచుఁ జిఱునవ్వు లొనరఁ బులక
లడరఁ గనిరి మిథఃస్పర్శనానుభవము. 85

తే. ఎల్లభంగులఁ జిత్ర మై యెసఁగునట్టి
సతి కలాపూర్ణరాజసంగతిఁ దనర్చ
జగతికెల్ల మహాపర్వమగుచుఁ బరఁగె
నప్పు డావేళ మఱుఁ దేఁచు టరిదిగాదె. 86

క. అనుపమ[1]హర్షశ్రీలం
బునుపొందెడు పెండ్లికూఁతుఁ బెండ్లికొడుకుఁ గ
న్గొనుజను లప్పుడు దమలో
ననయముఁ బ్రమదాద్భుతంబు లావహిలంగన్. 87

తే. "కడుఁ గళాపూర్ణుఁ డనుకీర్తిఁ గన్న యాతఁ
డీసతివిశేష మెఱుఁగుట యెన్న వలదె?
యీమధురవస్తువును గొన నెఱిఁగెఁ గాన
మధురలాలస యనుపేరు మగువ కొనను." 88

---

1. రూప.

ఆ. అని నుతించి రిట్లు ఘనసమృద్ధిని వివా
హంబు సంపతిల మదాశయుండు
పెండ్లికొడుకువెంటఁ బ్రియపుత్త్రి ననిపె న
నంతవస్తుతతుల నరణ మిచ్చి. 89

వ. ఇవ్విధంబున నచ్చునప్పుడు సముచితలౌకికవైదికాచారంబు లన్నియును విహితంబులు గావించి రూపానుభూతి తన కూఁతుఁ బిలిచి యి ట్లని బుద్ధి చెప్పె. 90

క. "సుముఖాసక్తిమణిస్తం
భమహాయోగీంద్రు లుత్తమాంగులు నీ కో
రమణీమణి! నీకోడం
డ్రము నెఱుఁగరు వారు యోగరసనిశ్చలతన్. 91

ఆ. అత్తమామ లన్న నాచార్యుఁ డన్న స
ద్ధర్మ మన్న నిష్టదైవ మన్న
నీకుఁ బతియె సుమ్ము నెయ్యంపుఁగూఁతుర!
యిది మహోపదేశ మెఱిఁగికొనుము. 92

క. దివ్యాంగన! యొఱపరి కసు
భవ్యచరిత నీదుసవతి; పతికం బెను సం
సేవ్య సుమీ! యాయమయెడ
నవ్యయభయభక్తివినయ వై యుండఁదగున్. 93

క. సౌందర్యవిలాసాదుల
యందునె తగులువడి యితర మరయనిమగవా
రుం దఱచుగఁ గల రయినన
నిందితచరితములె సుమ్ము నీపతి కింపుల్. 94

ఉ. కొందఱు రూపసంపదనె కొందఱు సాధుచరిత్రశక్తినే
యెందుఁ బ్రసిద్ధలై పతుల కింపొనరింతు రనూనమైనచ
క్కందనముఁ సువర్తనముఁ గల్గినఁ జెన్నిటికేమి చెప్ప? నా
చందనగంధి జాదులు ప్రసాదముఁ గాదె చకోరలోచనా! 95

ఉ. కావున రూపయౌవనవికస్వరగర్వభయంబుచేతఁ గా
నీ విభుఁ డిచ్చుమన్ననల నెయ్యపుటాల నటంచు నమ్మి కా
నీ వినయాదు లేమఱక నీహృదయేశుఁ దదీయబంధుమి
త్రావళులన్ సపత్నిని యథార్హవిధిన్ ముద మందఁ
జేయుమీ." 96

మ. అని డగ్గుత్తిక పెట్టుకొంచు ఘనపక్ష్మాంతర్నిరుద్ధాశ్రువై
యనుపం జాలక చాల కంపె సుతఁ గన్యారత్నముం దల్లి వీ
డ్కొనఁగాఁ జాలక చాలకంతమది[1] నెట్లో యొక్క చందాన వీ
డ్కొనియెన్; వేమఱుపింపలేవు పతిభక్తుల్ మాతృవిశ్లేషమున్.

వ. ఇవ్విధంబున మధురలాలసాపాణిగ్రహణకల్యాణవైభవంబు
నవధరించి కళాపూర్ణుండు గృహప్రవేశమహోత్సవా
నంతరంబున దేశాంతరాయాతరాజలోకంబు నస్తోకసత్కార
విశేషంబులం బరితోషంబు నొందించి తత్తద్దేశంబుల కనిపెఁ
నంతఁ దద్వధూతిలకంబు వికసితవదన లగుసకియల గుసగుసల
వలన. 98

క. తన నవసంగమదిన మదె
యని విని యుబ్బుచుఁ బ్రహృష్టయై మాటికి వ
చ్చినచోటికి వచ్చుచుఁ బో
యనచోటిక పోవు[2]చుండె నేమో కలఁకన్. 99

1. యెట్లో. 2. చుండ.

సీ. "మధురలాలస! నేఁడు మగనిపా" న్ననుచును
నిజకోప మీక్షించి నిలుచువారు
"గోప మేలె? ఫలించెఁ గోర్కె నీ" కని తన
యదయప్రేతలకు మా ఱలుగువారు
"మాయమ్మ యివి కల్లమాట; లింతియె నీవు
గైకోకు" మని శాంతి గఱపువారు
"నిప్పటనుండి మా కేల? యెప్పుడు చూచె
దివ్వార్త నిజ" మని నవ్వువారు
తే. "నిజ మయిన నేమి యనఁగదే! నీవు వెఱవఁ
దలుముకొని వచ్చుచున్నారు తరుణి వీరు
సారె" కనువారు నై బోంట్లు సరసగోష్ఠి
సలుపఁగా నాఁటిపవ లెల్లఁ జెలువ గడపె. 100

క. అంతటఁ[1] దలమువ్వి గదుర్
యింతగ సింగారములు ప్రవీణతఁ జెలులా
కాంతకుఁ జేసిరి లజ్జా
క్రాంతత నొల్లమి నటింపఁగాఁ బ్రేమబలిమిన్. 101

సీ. ఇట్లు సింగారించి యెదుట నద్దము వెట్టి
'చూచుకొ' మ్మన లజ్జఁ జూడఁ గొంకుఁ;
జెలు లెడఁగాఁ జన్న నిలువుటద్దముఁ జూచి
కొనగోర నటు దిద్దుఁ గురులు విరులు;
నంత వారే తేర 'నెంతసూక్ష్మగ్రాహి
యిది?' యంచు ముకురపరీక్ష నెఱపు;

1. దలయంటిగదుర్.

నాయలంకారరమ్యత చెదరకమున్న
యధిపుఁడు తనుఁ జూడ నాత్మఁ గోరు;
తే. సిగ్గుకతమున సకియలచేర్పు [1]వాని
చనువుఁ బరికించుతోడవులయునికిమట్టు
మచ్చు మఱ లేకయుండ నేమఱక యోము
మిగుల మేగరగరిక నామెఱుఁగుఁబోఁడి. 102

చ. [2]అసదృశభూషణాన్వితవిలాసవిచిత్రత నొప్పె నాసము
ల్లసితసువర్ణ వర్ణగృహలక్ష్ములచెక్కిళులో యనంగ నిం
పెసఁగెడు నిల్పుటద్దముల నేణమదాదివిచిత్రలోచనా
రసమయపత్రవల్లరులప్రక్రియతోఁ దనసీడ యేర్పడన్. 103

శా. ఆసౌభాగ్యవతీవతంస మొకయేకాంతప్రదేశంబునం
బూసెజ్జన్ విహితోపవేశ యగుచుం బొల్పొందెఁ బత్త్రావళీ
న్యాసప్రచ్యుతభీత్యధోఘటితహస్తాంచత్కపోలంబుగా
న్యాసింగాముననిల్పుటద్దమునకుఁ సౌందర్యముల్ డిందఁగన్.

ఆ. ఇవ్విధమున నామృగేక్షణ యేకాంత
వర్తనమున నుండి వరసమాగ
మావిలంబసిద్ధి కభిలాష మెంతయు
మహిమఁ బొలయఁ దనదుమానసమున. 105

ఉ. విభుఁ డేఁక వచ్చు నెప్పుడోకో ? విఘ్నము లే మయినం
ఘటిల్లునో, యభినవకామునీయుతములైనవి? యా కెకు నాదు
సంగమం,బభిమత మాట కూడద యొకప్పుడు ? నట్టిది గాని
నాఁడు దుర్లభమ; గణించునే సురవిలాసినివల్లభుఁ డన్య
కాంతలన్ ? 106

1. వాని చనువు. 2. లసదురు; లసితవిభూష.

చ. తనకడ కేఁగినప్పుడు పదంబుల కేఁ బ్రణమిల్లి నవ్వ రాం
గన కృప గల్గినట్లు కడు గారవ మొప్పఁగఁ గౌఁగిలించుచుం
"దనరుము చాల నైదువతనంబున" నంచు నొసంగె దీవనల్
తనకును వాంఛితంబ యిది; తత్కృపభంగులు నమ్మవచ్చునే?

చ. అదియును గాక యా త్రిభువనైకసమాదరణీయరూపసం
పద గలవల్లభుం గలసి భవ్యసుఖంబులు గన్నయింతి తా
మదిని సహించునే నిమిషమాత్రముఁ బాయఁగఁ, బాయకుండఁ గ
ద, త్తదుచితనీతు లెప్పుడును దప్పక పన్నుచునుండుఁగాకిలన్?

శా. లోకుల్ కాముఁడు కాముఁ డంచుఁ గొలఁదుల్ రూపింప
కాయుత్తమ,శ్లోకుం బోలిచినం 'గతానుగతికో లోకో'
యటం చుండుటల్, గాక ట్లాతఁడు నొప్పునే నఖిలవృక్ష
ర్వాంబు గాకున్నె? ర,మ్యాకారుండఁట శంభుదృష్టి కహహా!
యామంట రప్పించునే? 109

మ. తరుణీశాతకటాక్షవీక్షఁ గోనల్ దార్కొన్న చోట్లుం బలెం
న్నురుశోభావిభవాకరంబు లగుచున్ రోమాంకురస్థానముల్
పరఁగన్ ముట్టినఁ గందునో యనఁగఁడుం బొల్పారుచున్నట్టి యా
ధరణీనాథు మెఱుంగుఁ జెక్కిళులు నేత్రప్రేమపాత్రంబు లై.

మ. పరమానందముఁ బొందఁజేయుచుఁ గడున్ భాసిల్లు నాభూపశే
ఖరు నేత్రాంబుజకోణశోణరుచిరేఖల్ నిత్యలక్ష్మీగుణా
దరణాధీనకనీనికానవమిళిందస్పందసందర్భని
ర్భరనిక్షిప్తపరాగనిర్గళనమార్గభ్రాంతియోగ్యంబులై. 111

శా. మారుం డద్భుతశంఖ మొక్కటిని సంపాదించి దోర్మధ్యక
స్తూరీచర్చ నెపంబునం దనదు కేల్ దోఁపన్ సువర్ణత్వశో
ధారిప్సన్ శశి కెత్తిచూప నతఁ డత్యంభోదుఁడై చేరి యిం

పారం బట్టుటఁ దోఁచుఁ బద్దళముఁ గేశౌఘంబు మోముం
గనన్. 112

మ. శమగాంభీర్యధృతిక్షమార్జవదయాశౌర్యప్రమోదాదికో
త్తమనానాగుణరత్నకోశనిలయోద్యత్కాంచనద్వారబం
ధమహాస్తంభదమానబాహుఁ డగునాథాత్రీశువక్షఃకవా
టముపై నెప్డాకొ గందపట్టగతి నుండన్నాదు కేల్ చేర్చుటల్?

క. ఏకలి యై తను రా జౌకఁ
డేలఁగ మని యునికి మెచ్చ కేమో [1]యల తా
రాళియుగ మఖిలరాజశి
ఖాలంకృతి యయ్యె మదధిపాంఘ్రినఖములై. 114

తే. ఆలలితచరణము లొత్తు కేలు కేలు
కోర్కెఁ దద్వక్షమునఁ జేర్చుకుచము కుచము
దివుటఁ దద్రహఃకథ వినుచెవులు చెవులు
పలుకు లేల? తద్రతిఁ గన్న బ్రదుకు బ్రదుకు." 115

చ. అని తలపోయుచుండ "నిజవయస్యలు పిల్వఁగ వేళయైన నం
దునికి యెఱుంగ కెందరయుచుం డెవరో తను!" నంచు లేచిపో
వ నలరుఁబోఁడి యించుక ప్రవర్తిలునంతన వేడ్కతో సఖీ
జను లరుదెంచి రచ్చటికి సంభ్రమ మొప్పఁగ నల్లనవ్వుచున్.

వ. అందు నొక ప్రౌఢ యగు సకి నయంబుతోడ. 117

సీ. "ఓచెలి యిక్కడ నున్నదానవె!" యంచు
నల్లన డాసి వాలారుగోళ్ల
నూరక ముంగురు లొకచోటు దువ్వి పా
పట చేరుచుక్కసంఘటన యరసి

1. యొక తా.

శ్రవణభూషల లేనిరవ వారఁ దుడుచుచు
"నిది వేళయఁట హృదయేశుసేవ
కేతేరవలయును రా తడయక" యంచు
నొడివి యొక్కించుకతడవు నిలిచి

తే. యింతి యామాట కేమంటి? వీ వెఱుఁగని
నీతి లేదు; ప్రియుఁ డదె నీదురాక
కెదురుచూచుచు నున్నవాఁ డిచ్చ మెఱఁగి
చనుట దగుఁ గేళిగృహమున" కనుచుఁ బలికె. 118

చ. పలికిన మాఱు పల్కక త్రపాభరనమ్రముఖారవింద యై
జలజదళాక్షి యొప్పెఁ దనచన్నవఁ గన్నవడాలు పర్వఁగాఁ
గలయఁగమంచిగంధముననఁ గస్తురిఁ దత్సమయోత్సవాంగమం
గళకలశార్చనాఖ్యశుభకర్మము సల్పెడుపొల్పు దోఁపఁగన్.

ఉ. ఆగతి నున్కి చూచి సఖు లందఱు "నేమిటు వచ్చుటేమి? నీ
లాగిది యేమి? యింతి కిది లక్షణమే? చనుదెమ్ము లె" మ్మనన్
హ్రీగరిమంబు నాఁపుచు నొకించుక లేవఁగఁబూను మానినా
లో గొదకొన్నసిగ్గునఁ జెలుల్ బలిమింపను [1]దివ్వఁగోరుచున్.

వ. అంత నొక్క మిక్కిలి ప్రగల్భ యగుమగువ మిగులఁ జనవు [2]వారసి. 121

మ. "పొదిదైనాథులుఁ దాకఁ గాఁపురము లింపుల్ మీఱఁగాఁ
జేయుచుం, గదు పెండేసికొమాళ్లఁ గూఁతులఁ దగం గన్నట్టి
యిల్లాండ్రకున్,మది లజ్జాదులు లెవె నీకు బలె? సన్మానంబుతోఁ
జక్క వ,చ్చెదో యేమేఁ గలదే?" యటంచుఁ దిగిచెం జేపట్టి
యాయంగనన్. 122

1. శేర్పఁ. 2. మెఱసి.

వ. అయ్యవసరంబునం గళాపూర్ణుండు తదాగమనంబున కెదురు
చూచుచుండి వారి గజిబిజి కొంతచేరువను వినంబడినం
బ్రేయసీవిలోకనోత్కంఠ యాఁపలేక లేచి వచ్చి కౌతుకం
బడర గవాక్షమార్గంబునం దద్రూపలావణ్యవిలాసంబు నిరీ
క్షించుచు నచ్చెరువంది యాపాదమస్తకంబుం గ్రమంబునం
బరికించుచుఁ దన మనంబున. 123

ఉ. "క్రిందను మీఁదనుం బడి యకించిదసూయఁ బెనంగులాడు న
ర్ధేందుఁడు నుల్లసద్బలసమృద్ధతమిస్రముఁబోలెఁ జాలఁ జె
న్నొందెడుఫాలముంగబరియుఁ గ్ర మఱిపాపటము ల్త్రియంపుఁ జే
రుం దులకించుకస్తురియు రూఢిగ బాహులలీల నొప్పఁగన్.

ఉ. ఎత్తినకోలగా మదనుఁ డేసిన వే చని వచ్చునర్ధచం
ద్రోత్తరబాణమో యనఁగ నొప్పెడుఁ బాపటతో లలాటమా
యుత్తముఁ డంత దానిఁ బడకుండఁగ విల్లిడుపెల్ల గౌతుకా
యత్తతఁ దన్ముఖంబునకు నానె నొకో యన నొప్పెడుం బొమల్.

లయవిభాతి.—

తనపడగకై భువనమున వెదకఁగాఁ జనిన
వినుతములు రెండు దొరకినను మరుఁ డందాం
బెనుగడఁక చూడ మొగమనెడుహసితామృతపు
ఘనసరసిఁ బాఱవిడిచిన సమత నొందాం
టని దఱుములాడునయననిభశుభమీనముల
కును బతనకృత్యవధి పనుపఱుప మధ్యం
బున నిడినచంపకపుఁగనవిషుధియో యనఁగ
వనితవరనాసపస [1]నలరెడు నిరూఢిన్. 126

1. దనరెడు.

క. సమదాక్షిమీనసంచా
రమునఁ దొలంకుచును ముఖసరస్సున లావ
ణ్యము వెల్లి వాఱఁ గ్రేవల
నమరించినపిల్లకొలఁకు లంగనపీనుల్. 127

తే. ఒనర మకరధ్వజుండు చేర్చినతదంక
విలసనముతోడఁ జిన్ని లేఁదళుకుటరిగ
బిళ్లలో యన మకరిసముల్లసత్క
పోలఫలకంబు లమరెను బాలికకును. 128

మ. [1]శిరసంపం బరయం బరాత్ములకు నీశీతాంశుబింబాస్య వా
తెర బింబప్రతిబింబభావము సమర్థించున్ నిరూఢంబుగా
వరబింబానుభవంబునుం బలె నధోవాప్తిన్ విశుద్ధామృతం
పురసం బానుచు నేశుకాదులు బలెన్ మోదింతుఁ జిత్రంబుగన్.

తే. సంజఁ గెంపారుసన్నంపుజలద రేఖ
యందు నొక్కింత మినుమిన్కు మనుచుఁ దోఁచు
చిన్ని తారలగతిని రాజిల్లుచున్న
చెలువపలుమోవిమఱుఁగునఁ బలుకుబడిని. 130

చ. ప్రతినవచారుకేసరపరాగశలాటుమిళిందబృందచి
త్రితకుహళీయుగంబుగతిఁ గ్రేవలఁ గర్ణకలాపరత్నని
ర్గతరుచిమంజులల్ దనరఁగాఁ గ్రముకద్రుమకంఠలక్ష్మికిం
బ్రతిభటవృత్తిఁ జూపెడునుభామినికంఠము సొంపు పెంపుతోన్.

సీ. లీలమై గదియ నిల్పినపైఁడితమ్మి మొ
గ్గలనాళయుగ మన నలరుకొను

1. సిరిచందం.

నవి వ్రేఁగుచేతఁ దిర్యఙ్ముఖంబునఁ గొంత
నతిఁ జెందె ననఁగఁ జన్గవబెడంగుఁ
బొలుపొందుతన్నాళములసంధిరేఖ యే
ర్పడుచోటుబలె రోమరాజిపొలుపు
నొండొంటిఁ బాసి పోకుండ దానికి నంట్లు
వైచిన చందాన వళులసొంపు
తే. నొప్పుచున్నవి యేమని చెప్ప నౌర
చాల నన్నివి కలఁచుట సముచితంబ
కామునకు బొట్టకోలలు గావె నాళ
ములఁ బ్రకాశించుతామరమొగ్గ లరయ. 132

చ. అనుపమముల్ రతిస్మరులయాటకు నర్మము లంచుఁ గప్పి పె
ట్టినపువుబంతు లీసతికడించిచనుంగవ; తేంట్లు క్రేవలం
డును జొరకుండఁ జేరిచినతోరపుసంపఁగిపూవుదండ లీ
వినుతభుజంబు లాతుదల వేడ్కకు నిడ్డచిగుళ్లు హస్తముల్.

తే. అతివయవలగ్నయష్టిఁ బెంపారు నాభి
ముకుపు కాంచనస్రుగ్బిలమో యనంగ
నుల్లమును నెల్ల హరియించుచున్న దౌర
యతనుశిఖియందు వ్రేల్వ హావ్యమునుబోలె. 134

ఉ. మానవతీవతంసము సమగ్రనితంబవిజృంభణంబు జం
బూనదిసైకతస్థలముపొల్పు వహించుచుఁ జాల నొప్పెడుం
బై నునుమంచువోలె వెలిపట్టుమడుంగు బెడంగుచూప నా
పై నవసారసాళిపరిపాటి నుదంచితకాంచి మించఁగన్. 135

తే. అతివతొడలును జఘనంబు [1]లరసి చూడఁ
గోమను మీఱెడుజమిలితొండములశిరసు
తోడివలరాచవారి యద్భుతపుహస్తి
యగ్రభాగంబు చూపఱ కాత్మఁ దోఁప. 136

మ. ప్రమదారత్నముజంఘలింపెసఁగెడుం బ్రాగ్ధ్మాయమానంబులై
నమనోజాతసువర్ణకాహళికలో నా; వానిఁ బూరించువా
రిమెఱుంగుం[2]గుఱుగుబ్బలో యన శుభశ్రీనొప్పెడున్ గుల్ఫ
దేశము; లాపైఁ బిడికిళ్లు నాఁ గనకభూషాపంక్తి యింపా
రెడున్. 137

చ. జలజదళాయతాక్షి మృదుచాపతరప్రపదద్వయీవిని
ర్మలరుచి [3]గల్లుగల్లుమనురత్నపుటందెలమ్రోఁత జృంభణం
బులనవకంపుఁగచ్ఛపముపోల్కినదల్చుచు గెల్పుఁదెల్పెడుం;
గలుగునె యింక దీనికి జగంబులలో నుపమాప్రసంగముల్?

చ. అకలుషతారలేతదబలాంఘ్రిని బట్టినతమ్ములన్ నఖా
త్మకతను గొల్చి పాయ; విది ధర్మము! యీజలజంబు లాడిఁ దా
రకములు [4]రాజు రాజు గ్రహరాజు కరం బిడనొప్పు పెంపుతో
సకలజయస్మరోదయము సల్పుట తెల్లమ నాకు నిత్తఱిన్. 139

తే. అతనుదశదిశావిజయకీర్త్యంకురముల
మీఁద మునుపుగ వెలువడి మెఱయువిత్తు
లతివపదనఖములు వానియంతికమునఁ
జలువ కిడినలతావిశేషంబు మేను." 140

క. అని వర్ణించుచు మిగులన్
మనము తదాలింగనంబునకుఁ దమకింపన్

1. నరసి. 2. జిఱు. 3. ఘల్లుఘల్లు. 4. రాజ రాజు.

జనపతికోరె నపిఘ్నత
ననయముఁ గొనసాగి రాఁ దదాగమనంబున్. 141

ఉ. ఆయెలనాఁగ యంతటఁ దదాలయసన్నిధిఁ బేర్చులజ్జపెం
రాయిడిచేత బోంట్లను గరం బలయించెను సాగిపోక భూ
నాయకుఁ "డేమి యప్రియ మొనర్చితి నీకును దోసకారి సి
గ్గా యుడికించెదింత నను గాంతను రావిడ!" కంచుదూఱఁగన్.

క. అంతటఁ దద్గృహదేహళి
చెంతకు నయ్యింతి చేర శీఘ్రితఁ జని భూ
కాంతుఁడు దనపానుపుపై
సంతసమునఁ బొదలుచుండె శయనించి తగన్. 143

144
వ. అంత.

ఆ. "ఓసి వెఱ్ఱిపడుచ యూరక రమ్ము పె
నంగ కెదుట నదె కనుంగొనియెడు"
ననుచు నొయ్యఁ బలుకుచును జూపెఁ బ్రియు నొక్క
ముగుద కేల నోరు మూసికొనుచు. 145

క. అడుగులు తడఁబడఁ బులకలు
పొడమఁగ సఖి వెనుక కొదుఁగఁ బోవుచు నరసె
నెడ మలఁచి పడఁతి యప్పుడు
కడగంటివిలోకనమునఁ గాంతునియునికిన్. 146

సీ. రేఖలై మీఁదటి రెప్పలయొప్పు ప
న్నాగంబు కడపల్లబాగు నెఱుప
నరిదిపట్టుపడాలయంచులగతిఁ గ్రింది
పక్ష్మమాలికలు చూపట్టుచుండ

వెలయింపఁ బన్నాగములకుఁ బైఁ నిడిన య
బ్బురపుదండెలుపోలె బొమలు దనర
నొఱగులదెసఁ దోఁచుచున్నట్టిశిరముల
బలెఁ గనీనికలు కొల్కులఁ దలిర్ప
తే. శుభ్రభాగముల్ బిగియముసుంగు దన్ని
యొసఁగుపెఱమేను లన నొప్ప నెదురఁ బచర
తిస్మరులయంచలము లనఁ దృష్ట్లు పొలిచె
వెఱపుతో నింతి క్రేఁగంట విభుని నరయ. 147
తే. అంత మరలంగ మరలంగ [1]నతివఁ జెలులు
బలిమిఁ బొడువంగఁ బట్టి లోపలికిఁ దెచ్చి;
రప్పు డొకబోఁటి నృపునిపాదాంతికమున
రెంపసందిళ్లు పట్టి కూర్చుండఁ బెట్టి. 148
ఆ. పెట్టి "యీలతాంగి ప్రియునంఘ్రి లొత్తు; మ
ఱిట్టు వెనఁగితేని రొయుఁగుదుగద!"
యని నృపాలుఁ జూచి "యటు పాదమిడఁగ ద
య్యా! పరాకుమాని" యనియె నగుచు. 149
క. అని తచ్చరణంబు విలా
సినియూరువులందుఁ జేర్పఁ జేసి బలిమి నా
వనజముఖిచేతఁ బట్టిం
చెను; సంవాహన మొనర్పఁ జేసెఁ గ్రమమునన్. 150
సీ. [2]"అది యెవ్వరే పిలిచెదరు న; న్నొ యేమొ
యరసి వచ్చెద" నంచు నంచు నరిగ నొకతె;

1. నపుడు చెలు. 2. అది యెవ్వరే పిలిచెదరు నన్నదియేమొ యరసి...సురిఁగె. (ప్రౌఢవ్యా. శబ్ద.)

"చిలుకయాఁకలిని దర్శింపరైతిరె; యదె
కూయుచున్నది." యంచుఁ బోయె నొకతె;
"మనజాలవల్లిక మఱచి వచ్చితిఁ; గొంచుఁ
జనుదెంతు నిదె" యంచు జాఱె నొకతె;
"యదివోయి యెంతసే పయ్యెఁ జూచితె? తోడు
కొనివత్తు నే" నంచుఁ జనియె నొకతె;
తే. "యంపఱును బోయెద రె నేను నరుగుదెంతు"
ననుచు నొయ్యనఁ బల్కుచుఁ బెనఁగి లేవ
మధురలాలస నప్పుడు మనుజవిభుఁడు
పదము[1]నఁ దదూరుభాగంబు లదిమిపట్టె. 151

ఉ. లేవఁ బెనంగ[2]వెండియును లేమ విభూషలు మ్రోయఁ దోడనే
యీవిధి మ్రోఁత లైన "శరదిందుముఖీ! వినువారు నిన్ను వ్రీ
డావతి యండ్రె?" యంచుఁ దను డాయఁగ హస్తము వట్టి
కొంచు గో,త్రావిభుఁ డొయ్యఁ బల్కెఁ జెవి దండఁ బెనంగఁ
దలంక [3]నింతియున్. 152

చ. "కదలఁగ రావొ కించుకయు ఘల్లున మ్రోయఁగ" నంచు నంది
యల్, మొదలుగఁ గొంతసొమ్ము ముద్దియ యొయ్యన
కీ లెడల్చి మె,ల్లొవదవఁగ నూడ్చి వల్లభుఁడు "నోసతి యా
యితపాటు లెస్స" యం,చు దయితతోఁ గపోలములు
సోఁకఁగ మంతన మాడె నవ్వుచున్. 153

వ. అప్పుడు. 154

ఉ. ఏపలుకుం జెవిం బడఁగ నీక పెనంగుచు మోము పవ్వగాఁ
బాపుచుఁ ద్రోపు లాడుసతి పాణితలంబుల మేళనంబ యు

1. లఁ దదూరు; నం దూరు. 2. వేఁడియు. 3. నెంత.

ర్వీపతి కింద్రభోగమటు వేడ్క నొనర్ప ముఖాబ్జముం గడుం
[1]బాపకయాలకించుటయె బ్రహ్మసుఖోదయమయ్యెనయ్యెడన్.

సీ. ప్రథితమిథోరాగకథలమంతనముల
హృదయంబులోపలి బెదరు దీర్చి
సవ్యాజకృతకుచస్పర్శాదిలీలల
నంగాంగమేళన మలవరించి
జిలిబిలి నెయ్యంపుఁజిట్టకంబులచేత
నెలనవ్వు చెక్కుల మొలవఁ జేసి
లజ్జాపదంబు లల్లన మాటిమాటికిఁ
జెనకుచు నొక్కింత సిగ్గుపఱచి

ఆ. యపుడు కుసుమసాయకాగమాధ్యయనాధి
కారసిద్ధిఁ గొంత కలుగఁ జేసె
నా వసుంధరాధిపావతంసుండు రూ
పానుభూతికనయ కావరమున. 156

తే. వసనిచిట్టింటు చేతలఁ గరము ప్రేమ
మెఱపువోలెఁ దళుక్కన మెఱచుఁ గాని
నెలఁత సిగ్గను మొగిలులో నిలువలేవ;
యదియు మిక్కిలి నింపయ్యె నతనిమదికి. 157

ఉ. భీతియు లజ్జయుం[2]దనరఁ బెంపఱి డాఁగుమనోజుఁ దేర్చి ధా
త్రీతలనాథుఁ డంగనమదిం దలచూపఁగ నట్లు సేయ వాఁ
డాతనికిం బ్రియాసచివుఁ డై సతినీవి వదల్చెఁ; బాదుకో
నాతని నిల్పె తేఁడు ప్రియయాత్మఁ గరంచుచుఁ జుంబ
నాదులన్. 158

1. బాపఁగనాల. 2. దఱుమ.

వ. ఇవ్విధంబున. 159

ఉ. మిక్కిలి మిక్కుటంబగు తమిన్ రతికిన్ సతి నూలుకొల్పుచుం
జెక్కిలి నొక్కి చుంబనము చేసి కవుంగిట నోలలార్చి తాఁ
జొక్కుచుఁ జొక్కఁజేయుచుఁ బ్రసూనశరాసనఖేలనక్రియ
ల్పెక్కుతెఱంగులం జలిపెఁ బ్రేయసియింపుకొలందినంతటన్.

క. దినదినమున కతిశమదిన్
ఘనగరిమన్ మరుఁడు తఱుమఁగా రతులతతిన్
దినదినమునకుఁ గృశించెను
గనుకనియును ద్రపయు నిరవకాశతఁబోలెన్. 161

వ. అప్పుడు. 162

మ. చనుకట్టంటఁగనీక మోవికి ముఖస్పర్శంబు గానీక తా
ఘన యంచున్ గ్రహియింపనీక జఘనక్రాంతిం బ్రవర్తిల్లనీ
క నితాంతంబుఁ బెనంగుటల్ క్రమమునం గంజాక్షి వేసారిన
ట్టొనరన్ మానుచు వేడ్కఁదేల్చె నృపముఖ్యుం గొన్ని రే
లంతటన్. 163

సీ. పరిరంభరోధంబుపైఁ బరాకునఁబోలె
నధరపానంబున కనుమతించి
నెమ్మోవి [1]నిడ్డఁ జింతిలుపరాకునఁబోలె
గోరొత్తులకుఁ జనుగుబ్బ లొసఁగి
కుచకలికలు చూచుకొనుపరాకునఁబోలెఁ
గటివస్త్రహృతి కవకాశ మిచ్చి
నీవి క్రమ్మఱఁగఁ బూనెడుపరాకునఁబోలె
జఘన మంటుటకును సమ్మతించి

1. పీడఁ జిం.

తే. చెలువ తనలజ్జ చెలిమియుఁ జెడక నడవఁ
దద్విరోధి యైనట్టిచిత్తజునిపనియు
హాసువు సేయుచుఁ గొన్నినా ళ్లాత్మవిభుని
హృదయవృత్తికి నొకవింత యింపొనర్చె. 164

చ. కపటపునిద్ర వోవుతఱిఁ గౌఁగిట నానుచు మోవిమోవిఁ జే
ర్చుచును గొన్నిరాత్రులు వరుం దనియించె లతాంగి
యంతఁ దత్కపటముఁ గాంచియుం గననికైవడి నట్ల
యొనర్చి కొన్నిరే, లపు డతఁ డాఁపలేక నగ నల్లన తానును
నవ్వె వేడ్కతోన్. 165

ఉ. అల్లన యంతఁ బ్రేమవిభవాతిశయంబున లజ్జ నోర్చుచున్
వల్లభుచేతు లాఁచుతఱి నవ్వులుఁ బల్కులుఁ బూనెనంత "నే
నొల్లకయున్న మానవిపు డోర్చుమ నీవిది" యంచు నవ్వుచుం
బల్లవపాణి యొత్తె మునిపంట నిజేశ్వరు మోవి నయ్యెడన్.

* ... ... ... ...

ఉ. "చెప్పినయట్లు [1]సేయ నిఁకఁ జెల్వ! కరంబుఁ బెనంగితేని నేఁ
జెప్పెదసుమ్ము నీ విపుడు సేసిన వాతెఱగంటి బోఁటితోఁ
దప్పక" యంచు వల్లభుఁడు దన్ వెఱపింపఁ దలంకినట్లు తా
నప్పతికోర్కి దీర్చె సతి యర్థిమెయిం బురుషాయితక్రియన్.

వ. అందు. 168

సీ. పాలిండ్లు ప్రియపడి పతి చూడ లజ్జఁ ద
ద్వక్షస్స్థలంబుపై వ్రాలి వ్రాలి
మగుడఁ ద న్వేఁడుచు నెగనెత్తి పట్టఁ గా
ముకునకు లిరుగేల మూసి మూసి

---

*వ. అంత. 1. చేయ కిఁకఁ.

"యిఁకఁ జూడఁ గప్పితి నిదె" యంచుఁ జనుముక్కు
లతఁడు పాణులనంట నలఁగి యలఁగి
"కటిభార మెగయ నెత్తుటకుఁ దోడ్పడియెడి"
నవి చూఁపఁ బతిచేతు లాఁచియాఁచి
తే. తనదుగోప్యాంగముల దాఁచికొనఁగరామి
యరసి కెలనికి డిగిపోవ మరలి మరలి
కొమ్మ పుంభావరతి కాదిఁ గొంచెఁగాని
కొలఁది యెఱుఁగద మది దొరఁకొన్న వెనుక. 169

సీ. తరళితతాటంకధాళధళ్యంబులు
మెఱపుదీఁగలరీతి మెరయుచుండ
బరిగళన్మల్లికాప్రసవవిలాసంబు
తరుణబలాకలసరవిఁ బరఁగ
నతిరభసచ్ఛిన్నహారమౌక్తికములు
వడగండ్లచందంబుఁ గదలుకొలుప
నూర్పుగాడ్పుఁతోడ నొలిమైఁ బస్వేఘు
ర్మకణోదయంబు వర్షంబు గాఁగఁ
తే. గాంతకబరీభరం బనుకారుమొగులు
వితతముగ నంతకంతకు విరియఁ బాఱె;
దన్నుఁ గని సుమాళించుచు ధవునిహృదయ
నవమయూరము చెలరేఁగి నాట్యమాడె. 170

చ. దరముకుళద్విలోచన ముదాస్యదుదంచితకాంచినాదముఁ
విరమదురోజవల్గనము విక్షిదమూరుకముం గళానిరి
త్వరమణితంబునై సతిరతంబు తదాత్వరతస్పృహాపునః
పురుషితపూరితం బగుచుఁ బొందెఁగడుం బరిపూర్తినంతటన్.

వ. ఇవ్విధంబునం గ్రమప్రవర్ధమానకందర్పదర్పశిల్పంబుల నొప్పు
నప్పడంతితోడి క్రీడల నాపుడమితేఁడు వేడుకం బ్రవర్తిల్లు
చున్నంత. 172

ఉ. పాటిలెఁ గృష్ణధర్మ మొకపాటిగ నంత వసంతకృంతనో
చ్చాటితహేతిసంపదల సత్ప్రసవప్రదరప్రతాపసం
ఘాటవహుతాశనోల్ముకనికాయమతి ప్రతిపాదనోదయ
త్పాటవపాటలాపటలపాటలితోపవనావనీక మై. 173

సీ. కమలసౌగంధికగంధవాసితసర్వ
దిక్కులంబు లగుకేళిదీర్ఘికలను
బన్నీటితుంపరఁ బరఁగించుధారాగృ
హంబుల ఖేలనాడంబరముల
వెలఁది వెన్నెలలఁ జిప్పిలుచంద్రకాంతంబు
మేడలమీఁదిసంక్రీడనములఁ
జెంగల్వరేకులసెజ్జల నొప్పుక
ర్పూరవేదికలవిహారములను

తే. వలిపెచెంగావులను ముత్యములతొడవుల
మల్లెపూవులదండల మలయజాంగ
రాగముల సంతతము ననురాగ మమరఁ
గడపి రాదంపతులు గ్రీష్మకాలమెల్ల. 174

ఉ. అందము గాఁగ నంతట ఘనాగమకాలము చాల నొప్పె ని
ర్నిందితగంధబంధనవనీపవనీకమనీభవన్నిజేం
దిందిరబృందముక్తనళినీమలినీభవనాగతారసా
స్పందజుగుప్సతద్ఘనయశాయితయాయిమరాళజాల మై. 175

వ. అక్కాలంబున. 176

క. మెఱపులకును నుఱుములకును
వెఱచుట నెపముగ లతాంగి విభుకౌఁగిటిలో
నెఱేఁ బొదివి విడువఁ; దతఁడున్
వెఱ పుడుపుట నెపము గాఁగ విడకుండె సతిన్. 177

క. ఇవ్విధమున నొండొరుపై
మవ్వంబుగఁ బ్రబలుప్రేమ మహిమంబులతో
జవ్వనపుఁబోఁడుములు కడు
నవ్విభుఁడున్ సతియుఁ గడప నంతటిలోనన్. 178

క. తనవిభుఁ డనిశము నవ్విధ
మున నాసతిఁ బాయ కునికిఁ బోలెన్ మహిఁ దా
ఘనఫలశాలిత్వశరా
సనబాణాక్రాంతిఁ జెందె శరదృతు వమరన్. 179

క. ఆరమణీరమణుల కా
శారదవేళలు కరంబు సరసతఁ బెనిచెన్
శారదగంధానయనవి
శారదపవనములు ఘర్మసలిలము నడఁపన్. 180

స్రగ్ధర:—
హేమంతం బంత నంతర్హితకమలబలో దీతవిస్ఫీతశీత
ఖోమాత్మస్వామిధామక్రమణకృశ[1]పిపూర్ష ప్రవిశ్రాణితాతి
క్షేమప్రేమ ప్రకామశ్రితరతముదితస్త్రీముఖవ్యూహసాహా
ర్ద్ధామందానందదిందూదయకలనబలెన్ యామినుల్[2] హెచ్చ
[వచ్చెన్.

క. అగలున జవ్వాదినిఁ దె
మ్మగఁ బూసినయట్టివజ్రమణిసౌధములన్

1. వపుర్ష ప్రవిశ్రాణి. 2. మెచ్చ.

బిగికౌఁగిటఁ జేర్చె విభుం
డిగురాకుంబోఁడి నట్టిహేమంతమునన్. 182

వ. అంత. 183

శా. అన్యోన్యోన్నతిఁబొల్చెమాఘములవంగాసంగభృంగౌఘమై
యన్యకాకరతుషారభృత్యపరశైత్యచ్ఛన్నకందర్పదా
ర్జన్యాసంగమసంప్రవర్ధితపరీరంభక్రియాసంభృతా
న్యోన్యాంగప్రసభప్రవేశయువయుగ్మాంతరకృతశ్లాఘమై. 184

తే. [1]మదతపసిమిడిగింటిముల్ మంజిరిజిగి
దోమతెరమంచములు హసంతులు జవాది
యగలుసిరులు చిన్నెలు గాఁగ నతఁడు గడపెఁ
జలినెలలు తద్వధూకుచశరణుఁ డగుచు. 185

వ. తదనంతరంబ. 186

మాలిని. వికసితఘనసూనోద్వేల[2]జాలప్రవాళ
ప్రకటకపటరూఢప్రౌఢకీర్తిప్రలాప
ప్రకటజయసమంచత్పంచబాణస్తవోద్గా
యకశుకపికకాంతంబై వసంతంబు వచ్చెన్. 187

ఉ. బాలికతో వనీరతుల భాసిలు జేనికిఁ గుంకుమాంకరే
ఖాలలితస్తనగ్రహణకాంక్షను వాలెఱవాంఛఁ బెంచెఁ ద
ద్వేళఁ గడుం బచేళిమభిదేళిమదాడిమకేళిమత్తకీ
రాళియు బాలపల్లవరసాకలనాకులకోకిలంబులున్. 188

తే. ఇవ్విధంబున నతఁ డెల్ల ఋతువులందు
నంతకంతకు [3]మఱి ప్రేమ యగ్గలింపఁ

1. మదఁత (శ. ర.); మదుత. 2. బాల. 3. మదిఁబ్రేమ.

దత్తదుపభోగ్యవస్తుసంతతులచేత
మిగుల నింపుగ రమియించె మగువఁ గూడి. 189

చ. అపుడుగఁ దెచ్చుకోలుపొలయల్క నొకప్పుడు మార్గ్గంబుగా
బొరలిన "నింతసాహసము పోలునె మీ"కని నవ్వ నవ్వధూ
వరులఁ బ్రవాళశయ్య యిరువంకలఁ దత్తనుతాపయోగని
స్సరదకలంక ఫేనలవజాలమిషంబున డాలు సంధిలన్. 190

క. ఆమనుజాధిపుఁ డభినవ
కౌముదికిని వరుస దప్పక సమానమనః
ప్రేమలు మీఱఁగ దక్షిణ
తామహనీయుఁ డయి నడపె దర్పకలీలల్. 191

చ. అభినవకౌముదీరమణి యంతటిలో నొకనాఁడు రాగసా
రభము దలిర్పఁగాఁ దనుఁదిరంబుగవీణియఁబూని పాడుచుఁ
శుభగతిఁ గొల్వఁ దత్పటిమ సొంపు వినం బిలిపించె భూమివ
ల్లభుఁ డొకయింతిచే మధురలాలస నచ్చటి కాదరంబునన్.

తే. ఇట్లు పిలిపించి తద్గాన మించుకంత
యాఁకె వినునంత నధిపుఁ, "డో యబల! నినుఁ బ్ర
వీణ యన వింటి నేను దద్వీణ నీవు
పుచ్చుకొని పాడు" మంచు నాపొలఁతిఁ బలికె. 193

క. పలికిన నాఁ గా దన భీ
తిలి యిటునటు నట్టుకొట్టు తెలివతెఱఁగు భూ
తలవిభుఁడు చూచి "యిది యే
మలికుంతల తెలుపు" మనుచు నడిగెఁ బోరిఁ బోరిన్. 194

తే. అడుగుటయు "నీవిపంచిపసంచితశ్రు
తిప్రకాండములకు జగతీతలేంద్ర!

మామకస్వరపటిమ సమాన మగునో
కాదో యనియెడుశంక యొక్కటి జనించె." 195

క. నా విని "యందుల కేమి ? స్వ
భావగతిం బాడు" మనిన భామిని గాన
ప్రావీణ్యముఁ జూపెను గడు
నావీణియ శ్రుతులు [1]జతులు నధరితములుగాన్. 196

క. విభుఁ డపు డాకంఠస్వర
విభవమునకు నేర్పునకు వెఱఁ గొందెఁ గడుం
"త్రిభువనదుర్లభ మిది" యని
యభినవకౌముదియు మిగుల నద్భుత మొందెన్. 197

వ. పదంపడి యొక్కింత విచారించి మేదినీనాయకుండు మధుర
లాలసం జూచి. 198

క. "నీ వాయించువిపంచికఁ
దేవలయుఁ దానికోలఁ దెలియుద" మనినన్
భూవలయాధీశ్వరునకు
నావనరుహదళనిభాయతాక్షి వినీతిన్. 199

ఉ. "ఏరికి నెట్లు దోఁచిన సహించుట గాని నిజంబు చెప్ప కే
నేర మఱుంగు పెట్ట ధరణీవర! [2]యింకను నీవు మత్స్వరో
దీరణ యెత్తికోలునకు నీడుగఁ బల్కెడువీణ లేద యెం
దారసి చూచినం గొలుప దాత్మకు దానను బాట మిక్కిలిన్.

తే. నగర నిర్వీణ యునికి భూనాథ! యేను
వినుచుఁ జూడంగవలయు నంచును దలంతు

---

1. గతు. 2. యింక వినుండు మత్స్వ.

దీనికొల్లఁది యేపాటియో దేవరకును
దెలియఁ [1]బరికించితిరె తేటతెల్లముగను." 201

వ. అనుటయు నమ్మహీపాలుం డబ్బాలికతో ని ట్లనియె. "నేఁటి వ ర్తమానంపు వీణియలందు నిదియె యు త్తమం బగుట చి త్తంబున నిడి యేను మొదలనుండియు దీనిపరిచయంబు నంద తగిలియుండుటం జేసి యిప్పటిదాఁక నెప్పుడు నధికంబు నకు బుద్ధి పొఱదు గాని యిప్పుడు భవదీయగానంబు వినంగ మంద్రమధ్యమతారస్వరవిలాసవిశేషంబుల కిదియ కడకట్ట్య యనియు నివ్వీణియపలుకులు సమగ్రంబులు గావనియు నామనంబునకు సరిదాఁకి యున్నయది" యని యభినవ కౌముదిం జూచి "దీని కంఠస్వరంబునకుఁ దగిన వీణియ యెక్కడనేనియుం గలదో కో!" యనిన విని యాభామిని "యోభూవర దేవరకు గానప్రసంగంబున ము న్నేను విన్నపంబు చేసితి. మదీయంబైన యీవల్లకి యెల్లవీణియలకు నెక్కు డని తొల్లి తుంబురుండు మెచ్చి ధరియించి యుండుఁ దనకుం బ్రియశిష్యురాలం గావున నతండు నాకు నొసంగె నింక నింతకంటె నుత్తమంబు లెక్కడం గలిగెడు" నని పలికి యొక్కింత చింతించి యి ట్లనియె. 202

క. ఆతుంబురుఁ డీసంమున
గీతకళ నారదునకుఁ గీడ్పడియె నన
భూతలనాయక! వింటివి
చేతోగతిఁ దెలియ మేవిశేషము గలదో ?" 203

వ. అనుటయు నమ్మాటవలనఁ గళాపూర్ణుఁడు మున్ను మధుర

---

1. బలికించిని దేట.

లాలసకథలలోనఁ దనకు వినఁబడిన నారదునితుంబురు జయో
ద్యోగంబు దలంచుకొని తత్ప్రసంగంబున నిజపూర్వజన్మ
వృత్తాంతంబు సంస్మృతంబైన నందు మృగేంద్రవాహనా
మందిరగుప్తంబైన తన విపంచియునికి చింతించి మదాశయ
పుత్రికంఠస్వరంబునకు 'నదియె తగినది' యని హృదయంబున
వితర్కించుచు దానిం బరికించి తెప్పించుట కుద్యోగించి
యాచంచలాక్షిం జూచి "యింక నొక్క వీణియ యొక్క
చోట నున్నయది" నీదుపాటకు ననురూపంబుగాఁ బోలు
నని పలికె నప్పలుకులకు మున్న యభినవకాముదిం దదీయ
సఖులు ప్రక్కబఱటియొక్కెడం బోలంగం దోడ్కొనిపోయి
యేకతంబున ని ట్లనిరి. 204

క. "అకటకట! ముగుద వన్నం
తకుఁ గలవు సపత్నిపాటతగులంబుఁ గదుం
బ్రకటించుపతికిఁ దోడై
వికసిల్లుచుఁ జెప్పె దేచటి వీణెలసుద్దుల్ ? 205

తే. ఆకె గానంబు నీవీణె నతికరించు
టాదియందునె యెఱిఁగిచు మ్మతఁడు నేఁడు
పిలిచి తెప్పించె ని న్నింతచులుకఁ జేయు
కొఱకె తప్పదు మామాట యెఱిఁగికొనుము. 206

ఉ. నేఁడు దలంప నీవఁడు నీభవనంబునఁ బాట వించు ను
న్నాఁడట యాకెమీఁదట మనం బిడెనే నిఁకఁ గాక
యంతటం, బోఁడిమిఁ బిల్వఁ బంచెఁ దలపోయఁగ నిం కొక
వింత యాకెపిల్లాఁడి కరంబుప్రేలఁ బదిలంబునఁ దాల్చిన
వాఁడు చూడవే. 207

చ. ఎఱుఁగవు గాక యొక్కపుడొ కించుక మార్గొక మిడ్డఁ
గూర్మికిం, గొఱఁతయె? యెంత చెప్పినను గోమలి నేరవ
యల్కఁ దెచ్చుకో, నెఱయ నధీనవా ఱటేఁగి నేఁడిదిగో
కయికొ్మ్మి మిక్కిలిన్, [1]నెఱినె యతండు నీవు విన నేర్చెదె
మాపలు కెప్పుడేనియున్. 208

క. పడఁతి యెటు లయినఁ బ్రాణముఁ
బిడికిటఁ బట్టుకొని నేఁడు ప్రియుతో నీ వె
ప్పుడుబలేఁ బలుకక యించుక
తడ వుండుము మాకుఁగాను దాలిమితోడన్. 209

తే. మధురలాలసపాటపై మదిని దనకు
నింత వేడుక గలిగిన నేకతమున
సతతమును వింట కాక యి ట్లతఁడు నిన్ను
నోటుపఱచుట తగునె? నీ కోర్వఁ దగునె? 210

క. కావున నీయోటమి నీ
కేవెరవునఁ బాయు నది యధీశుఁడు తానే
కావించు క్షణము పలుకక
నీ వుండిన నే మెఱుఁగమె నెయ్యము కొలఁదుల్." 211

వ. అని బోధించి యయ్యింతులు బుద్ధి మఱలించిన నాయించుఁ
బోఁడిఁ దన మనంబున. 212

క. నానెయ్యపుఁదమిమహిమము
చే నప్పుడు విభుని తెఱఁగుఁ జింతింపఁగ లేఁ
గాని సఖిజనకథితం
బైనది యింతయు నిజంబ యారసి చూడన్. 213

---

1. నెఱపెనతం.

క. "కావున నేఁ జనవులకుం
బోవుట యిఁక ననుచితంబు బుద్ధిఁ దలంపం
గా; వినువారలు నగరే
తా వలపున విభునిఁ బొంద వలఁచెనని కాంతన్." 214

వ. అని విచారించుచు వారి కప్పటికిం దగిన యుత్తరం బిచ్చి, నిశ్చలంబై నధైర్యంబున నెప్పటియట్ల ప్రవర్తిల్లుచుండె; నంత నాఁటి రేయి భూనాయకుండు తదీయగృహంబునకరుగునప్పుడు.

క. నాయకుని రాకఁ గనుఁగొని
యాయచ్చరపూవుఁబోఁడి యత్యంతపరి
స్ఫాయద్భక్తిః నీతి వి
ధేయత ఘనసంభ్రమమునఁ దేటపడంగన్. 216

శా. అత్యంతంబు నలంకరింపని మనోజ్ఞాంగంబుతోఁ దేనికిం
బ్రత్యుత్థానము చేసి మానికిబలెం బాద్యాదిసంపూజనా
కృత్యంబుల్ ఘటియించెఁ గాని సరసోక్తిస్మేరవీక్షాదిలా
లిత్యం బేమియుఁ జూపదయ్యె రతికేళీరాగరమ్యంబుగన్.

క. తలిమముపై నెరసులు గిర
సులు లేకుండంగఁ దుడిచి సుకిపడిమపుదు
వ్వలువ పయిఁ బఱచి తలగడ
నిలిపె విభునిశయనమునకు నెలఁతుక యంతన్. 213

వ. తదనంతరంబ యందాత్మేశుండు పవ్వళించియుండ నాచంచలాక్షి చేరువఁ దా నొక్క పసిండిగద్దియం గూర్చుండి యాకు మడిచి యొసఁగుచుండెఁ దత్ప్రకారంబు గనుంగొని యా భూరమణుండు [1]తన మనంబున. 219

1. కొంత యోజించి.

సీ. "శృంగారగంధి యై చిలునవ్వుతెలిడాలు
చెక్కుటద్దములపైఁ బిక్కటిల్లఁ
బుష్పబాణోద్ధతిఁ బుంఖానుపుంఖమై
తొలఁకుచుండుఁ గటాక్షవిలసనములు
నాకూతగర్భంబు లగుచుఁ దేనియ లుట్టఁ
గలికిపల్కులు ప్రవర్తిలుచు నుండు
గుబ్బచన్నులకెలంకుల నారు వోసిన
య ట్లుప్పతిలుఁ బులకాంకురములు
తే. వచ్చి యే నిట్లు నిలిచిన నెచ్చెలువకు
నిప్పు డవి మాని యేమొకో యిట్లు శుష్క
వినయభక్తిపాతివ్రత్యవిహితవిధుల
నన్ను వంచించుచున్నది నళినవదన ?" 220

వ. అని సంశయించి "నేఁటిపాట లీపాటలగంధికిం గౌటిల్యకార
ణంబుగాఁబోలుఁ; బరీక్షించి చూచెదం గాక !" యని యా
కమలవదన కి ట్లనియె. 221

ఆ. "నీ విదేమి చెప్పుము నేఁ డొకలాగునఁ
గానిపించుచున్నదాన వతివ !
యెపుడు నే నెఱుంగ నిట్టిది నీయందు"
ననుడు మాఱుపలుక కబల యున్న. 222

ద్వ్యక్షరికంద.—
నా నెమ్మన వినుమా నీ
మానినిమానమున మనను మన్నన ననునో
మానిని నీమనమున నను
మానము మానమును మాని మనుమను నెమ్మిన్. 223

వ. అనుడు నచ్చెలువ సొలయుచుఁ బతితో ని ట్లనియె. 224

ఉ. "పాటల గెల్చినట్టిసతిపల్కులు పల్కులుగాక యిట్లు నేఁ
డోటమి నున్నమాపలుకు లోనృప! యేటికి నీకు? వట్టి యీ
మాటల[1] కేమిపోదు? మఱి మక్కువ వే ఱొకచోట నుండఁగా
బోటుఁదనాలు చన్నె మిముబోంట్లకుఁ దక్కినవారికిన్ బలెన్.

ఉ. మాపని యేమి యున్నయది మానక యొక్కపు డీ తెఱం
గునన్, మీపాదగాన్పు గల్గుటయు మిక్కిలి యబ్బురమింత
నుండి మీ, కీపరిపాటిసేవ రచియించుటకే తగినట్టి[2] దాన నో
భూపవరేణ్య! యేను బెఱపోఁడుము లెంతటిదవ్వమాకిఁకన్.

చ. అనయము నట్టివన్నెలు నాబహుమానము నా ప్రియంబునా
చనవును గల్గి యున్నపుడ చచ్చుట యుత్తము మాకు నట్టిశో
భనగతికిన్ విరోధి యగుపాపపుటాయువు దిట్టుకొంట గా
కనియెడి దేమి యున్నది నరాధిప! నిన్ను గుణైకభూషణున్.

క. సంగీతకళలఁ జెలఁగుకు
రంగాక్షి బెడంగులం గరంగుట తప్పే
భంగించి యితరకాంతఁ దొ
డంగుట తప్పే తడంబఱచి పురుషులకున్." 228

క. నా విని "యేయపరాధము
నావలనం గలుగఁ దెలిసి నారీమణి! యీ
భావమున నెన్ని యేనియు
భావంబులు ముట్ట దూఱి పలికెదు గినుకన్ ? 229

చ. పయికొని నన్ను నిట్లు మఱి బాలికి లోనుగఁ జేయఁబూని యే
నియతియొ వట్టిసందియము నీకొనరింపఁగఁబోలుఁ! గాని య

1. కేది తోఁడు. 2. వార మో.

ట్టియహిత మేను నీకును ఘటింపను నీ చరణంబుమీఁదియా
న!" యనుచు లేచి వచ్చి సతి నాతిపదాబ్జము వట్టఁ బట్టినన్.

ఉ. "ముట్టకు చాలుఁజాలుఁ గడుమోహపుదేవులకాళ్లు పట్టుకో
నెట్టును జెల్లుఁ గాక! ధరణీశ్వర! యేటికి నట్టిదోసముల్
గట్టెదు నాకు?"నంచు నెడగాఁ జరణంబు దరల్చుకొంచుఁ దా
బట్టెఁ దదీయహస్తములు భామిని యాఁపుచు రెండుచేతులన్.

ఆ. అతఁడు "నోసరోరుహాక్షి నీకంటె మో
హంపుదేవు లెవ్వ" రంచు సతిని
గ్రుచ్చి కౌఁగిలించుకొని యెత్తి యక్కునఁ
గదియఁ జేర్చుకొనియె గారవమున. 232

ఉ. అత్తలిరాకుఁబోఁడి యపు డక్షుల నశ్రుకణంబు లొల్కఁ డ
గ్గుత్తికతోడ "నీదయకుఁ గూర్మికి లాలనకుం గొఱంత రా
జోత్తమ కల్గునే? కలుగ దొక్కపుడున్ మఱి యేమొ నేఁడు
నా చిత్తములోన మాన దొకసిగ్గును జిన్నఁదనంబుఁ
దాపమున్. 233

వ. అనుటయు నమ్మహీకాంతుం "డోకాంత! నీచింత తెఱం గే
నెఱుంగుదు; నేటిదాఁక నెందు నద్వితీయం బనఁ బొగడ్తం
గాంచిన నీవిపంచి యితరనారీగానంబుచేత నవమానితస్వానం
బగుటయె ట్లని వగచుచున్నదానవు; దానికంటె నత్యుత్తమం
బైనవిచిత్రవల్లకి యొక్కటి యేను మత్పూర్వజన్మంబున ధరి
యించినది యొక్కచోట నున్నది యని విన్నవాఁడ; నది
యెటు లయినను సాధించి తెచ్చి తద్వాదనాభ్యాసంబుతోడ
నైన ని న్నెంతటివారికిని మీఱ శక్యంబుగాని గాన విద్య
నుద్యోతించునట్లు చేసెద నమ్ము." మనియె; నవ్వనితయు

నతండు పూర్వజన్మంబున మణికంధరుం డనుగంధర్వకుమారుం డగుట దాను నెఱింగినది కావున నతనికి నట్టివీణె గలుగుట సంభవించునది యని మనంబునకు సరిపుచ్చుకొని సంతసిల్లెఁ; గళాపూర్ణుండు నివ్విధంబున నవ్వనిత డెందంబు కందు వాపి సాంద్రానందంబున నభిమతక్రీడల రమించె. మఱునాఁ డచ్చెలువ నెచ్చెలుల ముచ్చటవలనఁ గర్ణాకర్ణిక నవ్వార్త మధుర లాలసచెలికత్తెలు విని యన్నెలఁత కెఱింగించిన నయ్యంగన తన మనంబున. 234

క. గానాదికళలకొదవలు
దాన తగం దీర్చు పతి ముదం బొనరింపం
గా నునికి కెనయ పతిఁ దమ
గానామల మెచ్చఁ జేయుకాంతల బ్రదుకుల్ ? 235

ఆ. నాకుఁ దేఁ దలంచులోకోత్తరపువీణెఁ
దనకు నొసఁగఁ జేసికొనియె నార
వరునిప్రేమ నడుమఁ దెపవాటు గొట్టని
ట్లుండ వలదె జగతి నువిద యైన? 236

చ. అని తలపోయుచుణ్ జలరుహానన దాన నొకింత వింతరీ
తిని గనుపట్టఁ గన్గొని రతిక్రియవేళఁ దదీయ చింత మా
న్చె నతఁడు కాళ్లమీఁదఁ బడి శీఘ్రమ తత్పదభూష లబ్ధది
గ్జనపతిదారమౌళిమణిసంతతిఁ జేయఁ గృతప్రతిజ్ఞుఁ డై. 237

తే. ఈగతిం దనకాంతల కిరుపురకును
దా నొడంబడినట్టియర్థములు రెండు
తలఁపులోపల నుండఁ దత్సాధనార్థ
మొక్కవేళ నృపాలుఁ డిట్లూహ చేసె. 238

సీ. "అభినవకౌముది కావీనె యున్నచో
ఱేఁగించి పొమ్మన్న నిపుడ పోయి
తెచ్చుకోనోపుఁ దా దివ్యకామిని గాన
నైన నా కనుచితం బట్లు పనుప;
దాన మత్సామర్థ్యహీనత దోఁచుఁ; గా
వున నట్టుగా; [1]దేను జనులఁ దగిన
వారిఁ బంచిన విఘ్న కారు లెవ్వరు గల
రో; మాన్చుకొన సమర్థులుగ వలయు
తే. నింక నటు గాక తద్దేశ మేలువారకు
జెప్పి పంపిన నతఁడ యాసించునేమొ
యిన్నియును మాని యేనె దండెత్తి చనిన
నదియుఁ దన్మార్గరిపులసంపదలుఁ జేసు. 239

వ. ఇంక మధురలాలస కొడంబడిన యంచియలు సాధింప దిగ్విజయంబునం గాని శక్యంబుగా దని తోఁచుచున్నయది" యని విచారించి [2]యూహాపోహార్థంబు సకల నిజకార్యభారధౌరేయు సత్వదాత్మనామధేయుం బిలిపించి. 240

క. లోనికి నపు డెవ్వారిని
రానీ కుండంగ ద్వారరక్షుల నిడి ధా
త్రీనాథుఁ డేఁగె మంత్రవి
ధానోచితభవనమున కతండును దానున్. 241

తే. ఏఁగి తనతలఁపు ప్రకార మెల్లఁ జెప్ప
"నధిప సరిదాఁకెఁ గద నేఁటియత్న మెల్ల

1. కేను. 2. యూహాపోహార్థంబున.

నాఁడు మధురలాలసలక్షణములు చూచి
యే ననినమాట" కని ప్రీతి నెసఁగె నతఁడు. 242

తే. అనుడు "నతఁడట్లు యవు" నని యపుడు నగుచు
నింకఁ దీనికి గర్తవ్య మెద్ది మనకుఁ
బదియుఁ బదియునుగా నీతిపదవి నరసి
తెలియఁ దగు"నని యిట్లని పలికె మఱియు. 243

ఆ. "అనఘ శ్రుతిచతుష్టయైకాధిగమ్యమై
నిపుణమంత్రిసంప్రణీత మగుచుఁ
గడు నపూర్వఫలము గావించు మంత్రంబు
యజ్ఞశీలునకు ధరాధిపతికి. 244

క. నాకుం జూడఁగ నీతిక
శాకలనము లల్పశౌర్యులతెఱంగులు గా
కేకార్యమునకు వచ్చు జ
యైకపదము శౌర్యబలమ యనియుం దోఁచున్. 245

తే. ఎచట నెపు డెద్ది చేఁబూని యెట్టివానిఁ
బ్రబలశౌర్యంబు దాఁకి పరాక్రమించు
నదియె పోరికిఁ దగుదేశ మదియె సమయ
మదియె కైదువు శక్తుండు నతఁడె గెలువ. 246

ఉ. అల మొనర్పఁ బూనురిపు నగ్రమునం [1]గనుఁగొన్న నొక్క-
యా,భీలపుఁదేజ మప్పుడటు బిట్టుదయించును శౌర్యశాలి
కిఁ, జ్వాలలు మున్ను గూర్చుకొని వచ్చి దహించునె కాన
నంబుఁ దా,త్కాలికహేతిసంపదల, గాక హుతాశనుఁ డెంచి
చూడఁగన్. 247

1. గనుఁగొన్నయప్పు డా, భీలపుఁదేజ మొక్కఁ డటు.

ఉ. ఏనుఁగు శైలతుల్యత వహించియు మందగతిత్వదోషముం
బూనుట వధ్యభావమును బొందెఁ దనుస్థితి గొంచె మయ్యుఁ
బంచానన మెంతయుం శరభసాతిశయోత్పతనప్రభావముం
బూనుట ఘాతుకత్వమును బొందె జయంబులు శౌర్య
సాధ్యముల్. 248

క. సకలకళానిపుణులు సే
వకులై కొలువఁగఁ బ్రతాపవంతుఁడు గొలిపిం
చుకొనుం గావునఁ బోలవు
సకలకళలు నొకప్రతాపసంపదతోడన్. 249

చ. ఇనుఁ డొకచో నొకింత యుదయించినమాత్రన విచ్చిపోవు
హెచ్చిన పెనుఁజీఁకటుల్ నిరవశేషముగా నవి యట్లువిచ్చిపో
వనయము శతధామునికళౌఘమ్మృజాంధి నైన వీనిచే
తన కనరాదె యేరికిఁ బ్రతాపకళాగుణతారతమ్యముల్.

చ. ఒకఁ డొకకేల వంచె నధికోన్నతిఁ బేర్చిన మేరుశైలనా
యకుఁ బెఱవేల్పు లందఱుఁ జిరాశ్రయణంబున వంప లేరొకిం
చుకయును బుద్ధిలో నరసిచూడ జగంబుల నుగ్రుఁ డర్కప్రసి
ద్ధికి బుధు లన్ప్రసిద్ధికిని దెల్లముగా నివి సూ ఫలస్థితుల్. 251

మ. "ఇది యత్యంతము దుష్కరంబు సుకరం బీకార్య" మన్భేద
చింత దగుం గొంచెపుఁగార్యకర్తయెడ నత్యంతప్రతాపా
ఢ్యునం,వది యెంతే విఫలంబు "దాహపులశుష్కాశుష్క
తాభేద ము, ద్వదతిస్ఫూర్జితదావపావకునెడన్ వ్యర్థంబు
గాదే. కడున్." 252

క. కావున శూరుం డుత్సా
హావేశం బైనయపుడె యహితులమీఁదన్

వేవేగ దండు గదలం
గావలయుం [1]గదల నిపుడు కాలోచితమున్." 253

చ. అన విని సత్త్వదాత్ముఁడు ధరాధిపుతో వినయంబు మీఱ ని
ట్లను "మనుజేంద్ర! నీవు కనునట్లు నయస్థితి నేను గానవే
ర్తునె? యయినన్ మనంబునకుఁ దోఁచినలాగునవిన్నవింతు నీ
యనుమతిఁ జేసి నిశ్చయత నాప్తుల కిచ్చక మాడవచ్చునే?

ఆ. "ధరణినాథ! కసుఁ బ్రతాపోజ్జ్వలంబైన
నీదుభావమునకు నాదుమృదున
యోక్తి యొకటఁ గొంతయొప్పునఁ గైకొమ్ము
జ్వలితఖడ్గమునకు జలముపోలె. 255

ఆ. నృపతి నీతిపథము నీఁదువాఁడు తె
ప్పను గదాకులుండు పథ్యవిధిని
విడిచియును నొకొక్కయెడ జయించుట గల
దైన నింపఁ జెందు నజయమైన. 256

క. నీతిపథంబున నడచు మ
హీతలనాయకున కొక్కయెగ్గొదవినఁ దా
రాతని నిట్టట్టనరు వి
ధాతం దిట్టుదురు గాని ధరణిన్ లోకుల్. 257

తే. ఎందు నీతివిహీనుని జెందునట్టి
సిరిని దిట్టుదు "రెట్లు దాఁ జేరె నతని
ననుచు భూజనులందఱు" నినుముఁ గూడి
యున్న యగ్నికిఁ బెట్లు రాకుండు నెట్లు? 258

1. గదలయపుడు కాలోచితియున్.

ఉ. ఏయెడ నెంతయుర్ విసుతికెక్కినయట్టిబలంబునం దనూ
చ్ఛ్రాయము పేర్మి చేతఁ దముఁజాలఁగ మించినసామజంబులర్
ధీయుత యడ్డకట్టుకొని తెచ్చి నపల్ దమ కెక్కిరింతలం
జేయుట నీతిపై భవవిశేషముగాదె తలంచిచూడఁగన్? 259

ఉ. "ఇమ్మెయి నాచరింపఁదగు నీపని యీపని యిట్లొనర్ప సా
ధ్య మ్మగు" నన్నయుక్తియెకదా భువి నీతి యనంగఁ; దద్వివే
కమ్ము మహాబలాఢ్యునకుఁ గానఁగరాదు పురత్రయీజయా
ర్థమ్ము నగంబుఁ జాపముగఁ దాల్చినరుద్రుఁడె సాక్షి దీనికిన్.

ఆ. వింటఁ దొడిగి యేయ వెసఁ జను నెంతద
వ్వంతదవ్వు చనును నె యంపకోల
దేవుఁడైన రిత్తచే వైవ? నటుగాన
బలిమికంటె నీతిబలిమి లెస్స. 261

ఆ. విను నృపాల సంధివిగ్రహంబులు యాన
మాసనంబు ద్వైధ మాశ్రయ మనఁ
దనరుషడ్గుణములు దగువేళఁ జలుప మే
లొసఁగు నసమయప్రయుక్తిఁ గీడు. 262

ఆ. ధరణి సామభేదదానదండము లన
నాల్గుపాయము లని నామములును
లక్షణములుఁజెప్ప దక్షు లందఱు [1]ప్రయో
గాప్రయోగవిదులు గలుగు టరుదు. 263

ఆ. గోరఁ బోవుపనికి గొడ్డలియును దాన
సఱుపుపనికి గోరు బలె నృపాల

1. ప్రయోగ ప్రకారవిదులు.

గురులఘువ్యవస్థ యరయని చతురుపా
యప్రయోగకరణ మనుచితంబు. 264

సీ. సరిగాఁగఁ బదవు లొండొరులకు నడపఁగా
సమవిపక్షునియందు సామవిధియు
మూలబలంబు పెంపున దుర్జయుం డయి
పేర్చుశాత్రవునందు భేదవిధియు
నెందును సంధిని హితులబలంగంబు
చే నొప్పురిపునందు దానవిధియు
సాధునిశ్చితపరాజయుఁ డై విహీనబ
లుం డైనయరియందు దండవిధియు
తే. జలుపవలయు ధరాతలేశ్వరవరేణ్య
బుద్ధియందు క్షయస్థానవృద్ధు లను త్రి
వర్గము నెఱింగి పంచాంగవర్తనములఁ
దెలిసి శక్తిత్రయంబున వెలయవలయు. 265

సీ. మంత్రగోపనము నేమఱుటయు దీర్ఘచిం
తయు నిరర్థకంపుఁజింతయుఁ బ్రసాద
విరహితత్వము బుధావజ్ఞానము శుభాప్ర
యోగంబు విషయానురాగభరము
ననృతంబు నాలస్యమును నాస్తికత్వంబు
నర్థంబులందు ననర్థమతియు
దీర్ఘసూత్రత్వంబు దీర్ఘరోషంబు ని
ర్ణీతకార్యము లాచరింపమియును
ఆ. భూమిపతికి దోషములు నివి పదునాల్గు
వీనిఁ దెలిసి నెఱయ విడువవలయుఁ

గామరోషజంబులై మీఱినట్టిస
ప్తవ్యసనములందుఁ దగుల వలదు. 266

క. కొలిచినవారలజీతం
బులు వేళలు దప్పకుండఁ బూర్ణముగా నీ
వలయును వారలప్రేమము
బలము నృపాలునకు నెల్లపట్లను మిగులన్. 267

క. ఏయేకట్టడ లెవ్వరి
కాయాకట్టడలు దప్ప కధిపతి ప్రజలన్
నాయమునఁ బ్రోవవలయుఁ గృ
పాయుతుఁడై తస్కరాదిబాధ లుడుపుచున్. 268

క. దండార్హుల దండింపమి
దండానర్హులగువారి దండించుట యీ
రెండు నకీర్తిదములు భూ
మండలనాయకుల నిరయమగ్నులఁ జేయున్. 269

క. ఇవి యన్నియు నిపుడు ప్రసం
గవశంబునఁ జెప్పఁబడియెఁ; గాని సకలనీ
తివిదుఁడ వీ వలఘువిధ
ప్రవర్తనము నీక కలదు పార్థివముఖ్యా! 270

ఆ. సకలదిగ్జయంబు సలిపినయట్టిమ
దాశయుని జయించినపుడె సిద్ధ
మెల్లదిశల నీదుకిల్లాకు సాగుట
యైన నృపులశాంతి యస్థిరంబు. 271

వ. కావున నీవును జని యీనడుమ నంకురితదర్పు లగుచు
నెదుర్పడం గడంగు గడుసువార లెక్కడెక్కడం గలరో

వారి నుక్కడంచి దిక్కుల నప్రతిహతంబుగా భవత్ప్రతా పంబు నెఱపుట తగిన కార్యంబు; దేవర యానతిచ్చినట్ల తదుచితసమయం బిదియ: యె ట్లంటేని; నీవు మధురలాలసకు సకలదిగ్దేశాధీశశుద్ధాంతకామినీమాళిమాణిక్యనిర్మితనూపుర సమర్పణంబు శీఘ్రంబ చేయుటకుఁ బ్రతినపట్టుట చెప్పుచున్న వాఁడవు; తాదృశమంజీరధారణకారణంబైన యానారీమణి యదృష్టంబు [1]శీఘ్రభావిఫలం బగుచు నిన్ను నట్టిప్రతిన వట్టించెఁ దప్పదు; దానఁజేసి జయంబు నవశ్యలభ్యంబు; యభినవకౌముది ప్రయోజనంబును దదానుషంగికఫలం బగుచు సిద్ధించుట చెప్పవలదు. కావున నీతిచాతురీపూర్వ కంబు దండయాత్రసలుపు మని యిట్లనియె. 272

చ. బలములు గొంత శాత్రవునిబల్మి నడంగినపిమ్మటన్ ధనం
బులపస దండువెచ్చములఁ బొల్పఱి పోయినయట్టిపిమ్మటన్
గెలిచినగెల్పు గెల్పె యగు నీసతిభాగ్యము సార్థమే యగున్
బలధనహాని యంత కష్టఁ బాటిల కుండును నీతిమైఁ జనన్.

శా. ఓరాజేంద్ర! ప్రకటక్రమముగా యుక్తంబు దిగ్జైత్రయా
త్రారంభం బటుగాన గెల్వ మును ప్రాచ్యావాచ్య
పాశ్చాత్యులన్, నీరాష్ట్రంబున కెగ్గొనర్చుటకుఁ బార్ష్ణి
గ్రాహుఁ డివ్వేళకున్, సహోదరుఁడు మాగధుం డిపుడు
తత్సంధాన మర్హం బగున్. 274

వ. అని విన్నవించిన. 275

1. శీఘ్రం బావిర్భవం బగుచు.

శా. సారప్రస్ఫురితాంగపంచకలసత్సంధ్యాదిషాడ్గుణ్యవి
స్తారోద్యత్సచివైకమత్యకృతమంత్రప్రక్రియానిర్ణిరో
ధారూఢాయతశక్తియుగ్మభృతరాజ్యశ్రీపరిభ్రాజితా
చారుస్ఫూర్తికళావిరాజిత! సమస్తక్షోణీభృత్పూజితా. 276

క. బంధురభేరీభూరిధ
ణంధణరవచలితవలయనగధాతురజో
బంధుత్వప్రత్యుద్గమ
సంధుక్షితదోర్గప్రతాప శౌర్యకలాపా. 277

మాలినీ. గురుతరజయధాటీ ఘోటకస్తోమచంచ
త్ఖురపుటదళితక్ష్మాధూళిధూమ్యాపలాయ
త్పరనృపమశకౌఘా! ధర్మవిధ్వంసితాఘా!
నరవినుతచరిత్రా! నారభూపాలపాత్రా! 278

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళి యమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామధేయప్రణీతం బైన కళాపూర్ణోదయం బను మహాకావ్యంబునందు సప్తమాశ్వాసము.

---

శ్రీరస్తు

# కళాపూర్ణోదయము

## అష్టమాశ్వాసము





లాకీర్తిసతీసమ
లాలనఖేలనగుణాచలద్దాక్షిణ్యా
శీలితపుణ్యాజయత్కర
వాలా [1]నంద్యాలకృష్ణవసుధాపాలా! 1

ఆ. అవధరింపు మమ్మహామాత్యవరునీతి
సరణి విని కరంబు సంతసిల్లి
'యిద్ధతేజుఁ డానరేంద్రుఁ డప్పటికిని
మగధరాజుసంధి దగున' యనుచు. 2

ఉ. ఆనరపాలుపాలికి షడంతరరాతిజయంబు కల్మియుఁ
మానగుణంబు నాప్తతయు మాటలనేరుపు ధైర్యముం బరా
స్థానజనానురంజనసుదక్షతయుఁ వినయోద్ధతిస్థలా
నూనవివేకముం గలనయోన్నతు నంపెను రాయబాంగాన్. 3

సీ. ఆరాయబారియు నగ్రసంప్రేషిత
జనులచే మగధేశ్వరునిపురోహి
తప్రధానాదులఁ దగుసామ[2]దానవి
వర్తనంబుల నిజవశులఁ జేసి

---

1. నందేల. 2. దానాది, వర్తనంబు వశంవదులఁ.

యతిగౌరవప్రవేశితుఁ డై సభాస్థలిఁ
దద్విభుఁ బ్రశ్నోచితంబు గాఁగ
దేశకాలాదివార్త్తాశంసనము నిజే
శ్వరుమహిమ[1]త్వముఁ జరగ నడపి

తే. దాన నెదిరికి మానంబు దఱుఁగకుండఁ
[2]గడు సుదద్గుణస్తుతిఁ జేసి కలయనాడి
మఱియు గలనీతిపటిమ నాత్మప్రభునకు
నతనికిని దాను సంధాన మమరఁ జేసె. 4

చ. అనుపమనీతి శౌర్యనిధి యంగమహీరమణుండు నర్థ్వవ
ర్తనమునఁ జాల యంత్రధనధాన్యబలప్రముఖంబులందు నెం
దును గొఱఁత లేకయుండ గడిదుర్గములుం దనరాజధానియుఁ
ఘనపరిరక్షణక్రియఁ దనర్పఁగఁ జేసె దృఢప్రయత్నుఁ డై. 5

క. తనబలనాథుల కంపఱ
కును జెప్పించెను గరంబు కోర్కిఁ బ్రయాణం
బును; వారలు నుత్సాహము
దనరఁగ జాటించి రపుడు తమపాళెములన్. 6

ఉ. అంబుజమిత్రుఁ డంత నపరాంబుధిఁ[3] జేరఁగఁబోయె నాత్మబిం
బం బపు డంతకంతకుఁ గ్రమప్రభవన్నికటత్వతారత
మ్యంబున సంక్రమించుతదుదంచితవిద్రుమరాగవీచిశై
త్యంబులఁబోలెర క్తిమయుతద్దయుఁబూనఁగ వేఁడి మానఁగన్.

ఉ. కాలకృషీవలుం డు గడఁకం బరిణత్యరుణాతపచ్ఛటా
శాలిచయంబుగోసి పెలుచం బన మోయుచునున్న వాఁడు గాఁ

1. ధ్వమల్. 2. గడను. 3. డాయఁగ.

బోలును గుప్పగా నన నభోమణిమండల మంతకంతకుం
జాల విశాలమై చరమశైలము చేర్పున నొప్పెఁ జూడ్కికిన్.

ఉ. కాలకలాదుఁ [1]డింతయును గాంచనరేణువు ప్రత్యగాశనాఁ
గ్రాలెడుక్రోవిఁ గూర్చి కరఁగంగఁ బ్రవర్ధన మొందు జాళువా
మేలిమిపూదె నాఁబొలుపు మీఱె నినుం; డదిగాఁక యార్పఁగీ
లాలనిమజ్జితం బయినలాగునఁ గ్రుంకెను బశ్చిమాంబుధిన్. 9

చ. వడిఁ బనుఁ బొఱఁగాఁ దఱుము వాసరకర్షకుచేతిభానుఁ డన్
బెడిదపుదుందు మార్చి కడుఁ బేర్చుచు రోదసిపేరిపంటచే
నుడుగక చొచ్చు రే యనుమదోద్ధతహస్తిమొగంబునందు నొ
ప్పెడుమదబిందుబృందమనఁ బెంపెసఁగెం గడసంజ చూడ్కికిన్.

ఉ. కేశవుఁ డవ్విరాట్తనువు కృష్ణసమాఖ్య వహింపఁ జేసెనో
యీశుఁడు మూర్తులెన్మిదియు నేనికతోలునఁ గప్పెనో సమ
స్తాశలుఁ గూడి వృత్రదనుజాధిపభూమికఁ దాల్చెనో యనం
జేశలతం దమఃపటలి పేర్చి సమస్తముఁ గప్పె నంతటన్. 11

తే. నింగి యనియెడి ప్రత్తిచేనికిని రక్త
బలి యిడి రనంగ నెఱసంజ తొలుత నమరఁ
దఱుచుగా దాన విఱిసిన మెఱుఁగుఁబ్రత్తి
విళ్లు నాఁ జుక్క లెంతయు నుల్లసిల్లె. 12

చ. "అరయఁగ నూర్ధ్వలోకము ప్రభైకమయం[2]బయసంశయంబుగా
నరుదుగ నెంతయుం బ్రకటమై యదిగో గగనంపుఁ బ్రాంతచ
ప్పరము సుషీవ్రజంబున విభాసిలుచున్నది" యంచుఁ జూపరుల్
గరముకుతూహలంబు మెయిఁ గన్గొనఁగాఁ దనరారెఁ దారకల్.

1. డెంతయును. 2. బయి.

తే. అంత నమరాధినాథుగృహాంగణమునఁ
జాల గందంపుఁగలయంపిఁ జల్లి రనఁగఁ
దూర్పు దెలు పయ్యె; నంత నందును దదీయ
గజము నిలిపిరో యన సుధాకరుఁడు దోఁచె. 14

తే. కాల మనుకువిందుఁడు చంద్రికాపటంబు
నేయఁ బన్నినమగ్గ మొకో యనంగ
నవమయూఖాళి గొనసాఁగి మిగుల నొప్పె;
విధుఁ డమరె వానిగృహభిత్తిబవర మనఁగ. 15

ఆ. వెల్లమడుఁగుఁగోక విచ్చినరీతిఁ బా
లారఁబోసినట్టియందమునను
బిండి చల్లినట్లు పండువెన్నెలలు గా
యంగఁ దొడఁగెఁ జెలువ మమర నంత. 16

మ. కలయన్ లోకములందుఁబర్విన తమఃకాలుష్యముం జంద్రికా
ఖ్యలసత్సత్త్వగుణప్రకర్షమునఁ బ్రక్షాళించుచుం దద్దయుం
బొలుపొందెన్ ద్విజరాజమండలము; పెంపుల్మీఱ నొక్కొ
క్కచో, జలదంబుండెను మీఁదమీఁద భవదోషప్రక్రియం
బర్వఁగన్. 17

ఉ. ఇట్టిటు యామినీరమణుఁ డేచఁగ నెప్పటిలీలఁ జాలఁ జా
పట్టమిఁ జూచి శ్రీనెలవు పద్మినిఁ గైకొన కప్పు డక్కటా
గట్టిగఁ దత్ప్రియాళితతి కైరవిణిన్ వెసఁ జేరె "రాజు చే
పట్టినవారు దేవు"లనుపల్కు యథార్థము చర్చ సేయఁగన్.

సీ. "కొనుఁ డివే విరు" లన్నఁ "గొననేల? నినుఁ జూడ
మరుఁడు రువ్వఁడు విరు ల్వైరివి" నను చు

"నీవట్టిమాటల కా వచ్చు?" టన్న "న
ల్లేము రా; మిది వెల; యింద" మనుచు
"నిపుడు [1]మీాయిష్టంబు లిం దెవ్వి?" యనిన
"నా కవ్వి డాఁచినగుచ్ఛకములె" యనుచు
"నివి చెల్ల కవి యమ్మెడివి కావు తల్లఁ" డన్న
"నెఱుగుదు మిపు డంట మేము" ననుచు

తే. బైటివాని నొల్లక తడిపావడలను
బోదివిపెట్టినయవి దివఁ బోవునట్టి
యువజనులపంటమాటల కొప్పి నగుచుఁ
బుష్పలావిక లమ్మిరి పువ్వు లపుడు. 19

వ. అట్టిసమయంబునఁ బట్టణంబునం గల దండనాయకు లందఱుం దమయేలిక జయప్రయాణంబునకుం దగిన సన్నాహంబున నాయత్తపడుచుండిరి. కళాపూర్ణుండు నభినవకౌముదిమందిరంబున కరిగి యయ్యోగుఁ బొడఁగనిపోడ "నోకమలవదన! నీకు నొడఁబడినవీణియ సాధించుటకు దిగ్విజయం బొనర్పనంత వలసె; నేఁటివేకువఁ దత్ప్రయాణం" బని యెఱింగించి మధుర లాలసపాలికిం జని యాకంజనయనతో. 20

క. "నీనూపురంబుమణులకు
నై నిఖిలదిగంతవిజయయాత్ర యొనర్పం
గా నెల్లి మంచిదివసం
బో నెలఁతుక" యనుచుఁ జెప్పి యొగి నలరించెన్. 21

వ. అంత. 22

---

1. మీాకిష్టంబు. 2. కప్పి.

చ. తమతమయంగనల్ కరము తత్పరతన్ బిగియించుకౌఁగిళుల్
గమనపువేడ్కనించుకయుఁగైకొనకెప్పుడు తెల్లవాఱు నన్
తమకము మానసంబులను దాల్చుచు మాటికి నెల్లవారు సం
భ్రమమునఁ దూర్పు చూడఁగడు భాసిలె నాఁటిత్రియామ
మిక్కిలిన్. 23

సీ. సమకాంతిఁ జదలఁ దోఁచనిసీలి[1]గవిసెన
సిడిమ్రాఁకుతుద నిడ్డపడఁగ విధుఁడు;
వలసినప్పుడు దాని వ్రాల్చుటకై కట్టి
నట్టిపగ్గములు దీర్ఘాంశులతలు;
రతిరాజు సిరిహెచ్చు రజనికాళికి సిడి
యాఁడుకోకిలభటుఁ డంకశోభ;
యతనిమీఁద వసంత మాడుకప్రపుధూళి
చంద్రిక; విరులు నక్షత్రసమితి
తే. యారజనికాళి యెందేని న(య్య)రుగఁ దలఁచు
టెఱిఁగి వ్రాల్పించుచున్నవాఁ డేమొ యిప్పు
డతఁడు తల సిడికొమ్మునా నంతకంత
కొలఁ జంద్రుండు పడమట వ్రాలఁ జొచ్చె. 24

తే. కోడి తపతప ఱెక్కలు గొట్టుకొనుచుఁ
గూయుక్రమ మొప్పు మీఱె వేకువ యనియెడు
కనుమ గట్టి వధూమానధనము దోఁచు
నసమశరుఁడు [2]తప్పటఁ గొట్టి యార్చె ననఁగ. 25

---

1. గవుసెన. 2. తప్పెటఁ.

ఉ. పారదబద్ధసద్ఘుటిక పాకపరీక్ష గొనంగఁ జంద్రికా
క్షీరమునంచునట్టి సమయసిద్ధుఁడు పెట్టె ననంగఁ జాల నొ
ప్పారెను వేగుఁజుక్క యది యంటినచోటుసువర్ణమయ్యెనో
నా రమణీయమైనయరుణద్యుతిఁ దద్దయుఁ దూర్పు శోభిలెన్.

చ. హిమకరుఁ డప్పు డొప్పెఁ బ్రణయించి తుషావృతి నిడ్డ
గార్హపత్యము క్రియ దక్షిణాగ్నిగతిఁ దాల్చె నగస్త్యుఁ
డనూరుదీప్తి సొంపమరె సముల్లసద్ద్యుతిఁ గుణాహవనీయము
[1]నా నొకొక్కచో, నుముకలబూది చిందినదియో యనఁ
జిల్లరచుక్క లుండఁగన్. 27

వ. అంత. 28

సీ. సమయవ్యతిక్రమశంకాససంరంభ
జాగ్రదుత్థితసర్వజనచయంబు
రథ్యకేతనముఖ్యరథకార్యఘటనాది
సంభ్రమాకులసూతసంచయంబు
ఘంటాకుథాప్రముఖద్విపసన్నాహ
భూరితరత్వరాధోరణంబుఁ
బల్యయనఖలీనబంధాదిసైంధవ
కల్పనాలోలాశ్వికవ్రజంబుఁ
తే. చక్రదధ్యుపదంశాదివిక్రయకర
భామినీహుంకృతివాచాటభటకదంబ
సమవలంబితభోజనచాపలంబు
నగుచు నవ్వేళఁ దనరె నన్నగర మంత. 29

---

1. నాఁగనొక్కచో.

సీ. పొందుగా నందలంబులుఁ బల్లకీలు ద
క్షత నాయితము చేయు శైబికులును
దగువాహనముల నంతగిపురకాంతల
నిడి దిడ్డు వైపించు హెగ్గడులును
ద్రోవఁ జౌఁజుఁ బెట్టి తొలుతగాఁ దమతమ
మొనల గన్పఱచుచమూపతులును
నుష్ట్రవామీశకటోక్షాదివాహిత
భర్మపేటికు లగుభారికులును
ఆ. గరము సంభ్రమింప ఘనతరమైనత
త్కలకలంబు లపుడు పొలుపుమీఱఁ
గైరవప్రియోదయారంభఘూర్ణమా
నార్ణవారవంబు ననుకరించె. 30

సీ. ప్రస్థానసముచితబ్రహ్మమంత్రముల భూ
గీర్వాణపంక్తు లాశీర్వదింప
జయజయ దేవ యన శబ్దజృంభణముతో
బిరుదావళులు వందివరులు చదువ
వేత్రహస్తులు పేళ్లు వివరించి చూప సా
మంతభూనాథు లంతంత మ్రొక్కఁ
బట్టపేనుఁగుఁ బైఁడిపల్లకిఁ దేజీని
దగ నాయితము చేసి దండఁ బెట్ట
తే. జైత్ర భేరీధణంధణశబ్దమహిమఁ
గరము ఘూర్ణిల్లి దిక్కులు గ్రక్కదలఁగ
లలితగుణయుక్త మగుశుభలగ్నవేళఁ
దనదుభవనంబు వెడలె భూతలవిభుండు. 31

క. ఇత్తెఱఁగున వెడలి యతం
డుత్తమకరి నెక్కి దిగ్జయోత్సాహవిలా
సోత్తంభనకాహళికా
తుత్తుంభధ్వనులు వారిధులఁ గలఁగింపన్. 32

చ. గురుతరకేతుధూతఘనకూటము లైనమహారథంబులుం
జరదవనీధరేంద్రములచాడ్పున నొప్పెడుసింధురంబులున్
మురదవమాననాచతురిమస్ఫుటవేగము లైనవాజులున్
వరభటసంచయంబుఁ గొలువన్ వెడలెం బురమాతఁ డంతటన్.

వ. అప్పుడు. 34

సీ. మిళితభూగగనాంతములసందు విచ్చిన
గాన్పించుబ్రహ్మాండకాంతి యనఁగ
దిశ లెన్నుచిది పూర్వదిశ యని బ్రహ్మ ని
ల్పినయట్టి మొదలిట్టిలెక్క యనఁగ
నుదయాచలాధీశు నుత్తమాంగంబున
భాసిల్లుహొంబట్టుపాగ యనఁగ
గగనాఖ్యపనసవృక్షప్రకాండోపరి
భ్రాజితం బగుపక్వఫల మనంగఁ

తే. దారకాభర్త చంద్రికాక్షీరభోజ
నాంతమునఁ బూర్వసంధ్య యన్కాంత [1]వెలచి
లీలఁ జేర్చినపసిఁడిపళ్లెర మనంగఁ
దరణి బింబంబు గాన్పించె వరుసతోడ. 35

వ. ఇవ్విధంబున సూర్యోదయంబు సకలజనమనోరంజకం బగుచు
నొప్పుచున్నంత. 36

1. తొలఁచి.

చ. ధళధళనాయఁ ధధ్యుతివితానము గ్రమ్మఁగఁ జాలు నొప్పుచున్
వెలువడుసేనలం బురమువీథులు సన్మణిసౌధకోటితోఁ
బోలు వెసఁగెన్ దినేశరుచిపూగధగద్ధగితాంబుసారిణీ
విలసితపుష్పితోపవనవీథులువోలె సురాళిచూడ్కికిన్. 37

క. అంతటఁ బ్రాకారద్వా
రాంతము సమ్మర్ద మెసఁగ "నత్యంతాయు
ష్మంతులము గదా!" యనుచును
సంతసమునఁ గడచిపోవుజను లాడికొనన్. 38

వ. ఇవ్విధంబునం గ్రముకకంఠోత్తరపురద్వారంబు నిర్గమించి
తద్బలంబులు నడచు నప్పుడు. 39

తే. ఎంతదవ్వులవస్తువు నెదుటఁ గాన
రైరి ప్రథమనిమేషంబునందుఁ దక్క
దాని నంతన కడచురథవ్రజంబు
వేగమునఁ జేసి రథికులు వెఱఁగుపడుచు. 40

క. తురగప్రచారమును గుం
జరమదముఁ బరస్పరాతిశయభావ గుణ
స్ఫురణము [1]నొదవ నపంకము
నరజస్కము నగుచు మార్గ మపు డింపొసఁగెన్. 41

సీ. జల్లులతోడిపెన్బల్లెంబు లెగవైచి
పట్టుచుఁ బేరెముల్ వాఱువారు
మెఱుఁగులు చూడ్కుల మిఱుమిట్లు గొలుపంగఁ
జేకటాగుల బయల్ చిమ్మువారు

1. కణఁకు.

బెడిదంపుటరిగెలు బిఱబిఱఁ ద్రిప్పుచు
. వడిఁ బిల్లమెఱములు వైచువారుఁ
వెగ నిండఁ దిగిచి నర్దేసలకు [1]బొట్టకో
లలు చూపి పల్లటీల్ దాఁటువారు
తే. నొండొరుల కభిముఖు లైన సుబ్బువారుఁ
గడలు చాఁపుచు వేడుకకయ్యమునను
జెలఁగి తమవారలకు నింపు సలుపువారు
నగుచు వీరభటుల్ మించి రతిశయమున. 42
తే. మునుపుగా నేఁగి యసిమిగొల్లైనలు పన్ని
త్రోవ నెక్కడెక్కడ నేమి గావలసిన
యట్టిభక్ష్యభోజ్యాదులయమ్మకమునఁ
దనియఁ జేసిరి వణిజులు తద్బలముల. 43
చ. వలసినచోటనెల్ల నభివాంఛితవస్తుచయంబు గల్గుటన్
లలనలుఁ దారు సాంద్ర వరణంబుల నొప్పెడుపల్లకీలఁ బోఁ
గలుగుట నర్థవంతులకుఁ గట్టిగ నాన్నృపుదండయాత్ర యిం
పలరఁగఁ జేసెఁ బట్టణమునట్ల యనర్గళభోగహేతు వై. 44
చ. అలఘుబలప్రతాపయుతుఁ డై యతఁ డమ్మెయి వచ్చుచుండువా
ర్తలు వినుచుం దదగ్రదిశరాజులుకొందఱుముక్తమార్గు లై
వలసలు పోవువారుఁ దగువస్తువు లప్పనపంపువారుఁ గే
వలవినయంబుతోఁ గొలుచువారును నై రి యథోచితస్థితిన్.
వ. అంత. 46
సీ. "సకలసౌభాగ్యలక్షణధన్య యైనట్టి
మధురలాలసకు నత్యధికపుణ్య

1. (బొట్ట.

విభవకు జగదేకవీరపత్నికి నంతె
లఖిలదిగ్గేశ ధరాధిపతుల
పట్టపుదేవులు భరియించుమాళిర
త్నములఁ జేయింపఁ దన్నాథు ప్రతిన;
యేతదర్థంబు దండెత్తి తా నిదె యమ్మ
హారాజు వచ్చె; మీయర్థములను

తే. ప్రాణముల నిల్పుకొనుఁ డింక రాజులార!
యెదురుగాఁగఁ దదిష్టంబు లిచ్చి యనిపి"
యనుచుఁ దనపత్రికలు సత్వదాత్ముఁ డనిపె
నరపతుల కెల్లఁ; గొందఱు నడచి రట్లు. 47

క. ఇత్తెఱఁగునఁ దగఁ గానుక
పుత్తెంచిననృపుల నెల్లఁ బ్రోచుచు నారా
జోత్తముఁడు చని పరాక్రమ
వృత్తిని మత్తిలినగౌడవిభుపై విడిసెన్. 48

చ. విడిసిన నల్గి గౌడపృథివీతలనాథుఁడు క్రోధదీప్తుఁడై
పెడిదపులీలఁ దెచ్చుఘనభీషణసేనలతోఁ బురంబుఁ దా
వెడలి పరాక్రమించెఁ దనవిక్రమసంపద కోహటించి న
ల్గడల నరాతిసైనికనికాయము బిట్టు గలంగి పాఱఁగన్. 49

వ. అట్టి సమయంబునఁ గళాపూర్ణుండు. 50

క. తనదుగుడారముదాఁకను
గనుకని తలఁగఁబడి వచ్చుఘననిజసేనం
గనుఁగొని "యోడకుఁ డోడకుఁ"
డనుచుఁ "గౌడవిభుఁ డనికి నతిమెనె?" యనుచున్. 51

క. "కానుకలు గొనుచు నిట పొడ
గానఁగవచ్చునె యటంచుఁ గడుఁ దెగఁ దనపై
నే నిందాకం; గటకట
యీనెఱి దనకున్న నడఁతు నిప్పుడ" యనుచున్. 52

వ. పరిసరవర్తులం గనుంగొని. 53

శా. "తేజిం బల్లనకట్టి కూడఁగ వెసం దెం" డంచు "మత్సేనలన్
రాజొక్కండెకలంచిపోఁగలఁడె తాఁ బ్రాణంబుతో?" నంచు
"మ,త్తేజఃప్రౌఢి గణింపఁ డె?"ట్లనుచు నేదీయఃకృపాణం బతి
భ్రాజిష్ణుద్యుతిగా నొరం దిగుచుచుం బ్రస్ఫీతసంరంభుఁ డై.

వ. పటభవనంబు వెలువడి పగఱ కభిముఖంబుగాఁ జనుచుండ. 55

ఉ. సాహిణి యంతఁ గూడ రభసంబునఁ దెచ్చె సమిద్ధయుద్ధస
న్నాహముఁ జిత్రసత్త్వజవసత్త్వకృతార్యమఘోటకప్రభా
పోహము రోషభీషణవిపోషితహేషితభీషితాహిత,వ్యూహ
ము భూరిభూషణసముజ్జ్వలదేహము నొక్కవాహమున్. 56

ఉ. తెచ్చిన నెక్కె నవ్వసుమతీధవుఁ; డాతనిపూన్కి చూచి యు
ద్యచ్చతురంగవాహినులు దారుఁ దదీయబలాధినాయకుల్
హెచ్చినశౌర్యసాహససమృద్ధుల నొండొరు మీఱి తేనికిన్
-మెచ్చొనరించుచున్ వడి నమిత్రబలంబులఁ దాఁకి రంతటన్.

ఉ. అత్తఱిఁ దద్బలం బరిబలౌఘములన్ నుఱుమాడి వైచె ను
వ్వెత్తుగఁ జుట్టుముట్టుకొని యీఁటెల డొంకెనలం గటార్ల బ
ల్లత్తుల నత్తలంబులను గైదువు పక్కెర జోడు కాలు కే
లుక్కత్తుక డొక్క ప్రక్క చెవికొమ్మని యేర్పడకుండునట్లుగన్.

ఉ. ఈశితశక్తి నంగజగతీశ్వరుసైనికు లిట్లు చెండుచెం
డాడఁగ నాత్మసైనికచయంబు కకావికలై కలంగి య

వ్రీడతోఁ బాఱఁ జొచ్చుటయు వీఁకను గౌడధరాతలేశ్వరుం
"డోఁడకుఁ డోఁడకుం" డని పటూక్తులచే నిజసేన నిల్పుచున్.

చ. కడువడి మీఱఁ దాఁ దోలుతఁగా రథముం బఱపించి ఘోర
పుం, బిడుగులువోనితూపు లరిబృందముపైఁ బరఁగించె నాత
నిం, గడచి తదీయసేనలును గ్రమ్మె నరాతులమీఁద సాహసం
బడరఁగఁ జేప చేర్చి గిచినట్లు సమస్తము నొక్క మొత్తమై. 60

క. ఆకఠినపుఁ గోల్తలకుఁ
గాక కలంగఁబడి నాల్గుగడలకు విచ్చెన్
జీకాకుపడుచు నంగమ
హీకాంతునిసేన యెల్ల నెంతయు భీతిన్. 61

ఉ. ఆకరణిన్ గలంగి చనునట్టిబలంబును హాసభాసురా
లోకములం గనుంగొనుచు లోకజనస్తుతుఁ డంగభర్త యు
గ్రాకృతితో విపక్షనిచయంబుపయిం గదలించె నశ్వముల్
భీకరలీల వాలుజళిపించుచుఁ గెంపు వహించుచూడ్కితోన్.

వ. అప్పుడు. 63

చ. హయము నదల్చి 'ధే' యనుచు నాజికిఁ దోలుట యొండు
దోఁచె న,వ్యయరయశక్తి నంత మఱి వచ్చినత్రోవయుఁ
బోయినట్టిత్రో,వయు నొకటం గనంబడద వాడలువాడలుగా
నతం డసి, క్రియలను జక్కఁ జేసిన హారిద్వారదాదులచేతఁ
దక్కఁగన్. 64

ఉ. ఇక్కరణిం గడంగి యతఁ డెంతయు మిక్కిలి నక్కజంపుఁబే
రుక్కునఁ జక్కఁ జేయఁ గడు నోటమితో హతశేషసైన్య
ముల్, గ్రక్కున విచ్చి వీఁపువెనుకన్ మఱుమానిసి లేక

"యమ్మఁగాఁ జిక్కిన మేఁకవోలె" వగఁ జెంది నిజాధిపుఁ
డొంటి జిక్కఁగన్. 65

శా. ఆచందంబున నొంటిఁ జిక్కిననిజస్వామీశు నీక్షించి యా
త్రాచంగుం డనుదండనాయకుఁడు మాద్యద్ఘోటకారోహణ
ప్రౌఢాచాతుర్యధురంధరుం డగుచు ఖడ్గాఖడ్గిసంగ్రామవి,ద్యా
చార్యుం డనఁ బ్రస్తుతుల్ గనినవాఁ డత్యంతశౌర్యంబునన్.

క. తురగారోహణము[1]ను భీ
కరతరఖడ్గంబు నొప్పఁగాఁ దిరిగి నిజే
శ్వరునకు నడ్డం బై ని
ర్భరరభసముతోడ నంగపతి కెదిరించెన్. 67

సీ. వ్రేటున కనువైనరీతిమైఁ దమవాగె
సన్న వెంబడిన యశ్వములు మెలఁగ
నొండొంటిఁ గొట్టుచో ఖండాలు కంగు కం
గునఁ దాఁకి మెనుమిణుఁగుఱులు గ్రక్క
నొకచోటు సూపి వేఱొకచోటు వడివ్రేయు
పూవు లెచ్చరికలఁ బొల్లువోవ
నెక్కువతక్కువ లెందు నించుకయుఁ గ
ల్గక నేరుపు లొక్కలీలన తనర్ప

తే. వరణరణ[2]కౌతుకాకుల స్వర్గయువతి
జనకటాక్షనిరీక్షణానుసరణవశత
నిర్ధకాంక్షేయకద్యుతు లినుమడింపఁ
బోరి రప్పుడు వార లద్భుతము గాఁగ. 68

---

1. సభీకరఖడ్గము కేల నొప్పఁగా చేఁకి...నెది. 2. రణకా.

క. ఆయెడ యాత్రాచంగుని
యాయుద్ధముఁ జూచి మొత్తమై గౌడమహీ
నాయకుదండకు విజయా
శాయత్తతఁ దిరుగఁ జేరె నతనిబలంబుల్. 69

సీ. అమ్మహాయుద్ధంబు నట్లు ఘోరతఁ బ్రవ
ర్తిలఁ గళాపూర్ణుండు తీవ్రగతిని
గడుఁజిత్రహస్తలాఘవముఁ జూపుచును ద
త్ప్రిధిలోపల నాత్మరక్షయందు
నించుకేమఱుట దోఁపించి వ్రేటున కాస
యిచ్చిన వ్రేయ వాఁడెత్తినట్టి
[1]బలుకేలు నారౌతుఁ బల్లంబు నశ్వంబు
నెనిమిదితునుకలై యిలఁ బడంగ
తే. వ్రేసె నేటవాలుగ నొక్కవ్రేటునన గ
ఖరరయమున నసిధారఁ బెడమరల్చి
కలన వ్రేటాఱుతునియలుగాఁగ వ్రేయు
బిరుదురౌతులవార్తలు బెండుపడఁగ. 70

వ. అప్పు డాకసంబున నుండి విలోకించు నాకలోకనివాసు లాకళాపూర్ణుని భుజశక్తిశౌర్యసాహసహస్తలాఘవంబులకు నద్భుతంబు నొందుచుఁ దమలోన. 71

ఉ. వ్రేటున కెత్తినట్టిప్రతివీరునికత్తికి నొడ్డుకొంట యె
చ్చోటను గల్గినట్టిది యశోధనుఁ డీఘనుఁ డివ్విచిత్రదోర్గ
పాటవ మెంత నమ్మెనొకో వైరినిజాయుధ మెత్తి వ్రేసెఁ దా
వ్రేటిరునాల్గుతున్కలుగ వ్రేయుచలంబు ఫలంబు నొందఁగన్.

---

1. బలుపాలు పల్లంబు.

వ. అని కొనియాడి రట్టి సమయంబున. 73

క. సంగరకేళి నతం డీ
భంగిని విహరింప గౌడపతి సేనయుఁ దా
నుం గలఁగి పాఱె రేఁగులు
తంగేళ్లుగఁ ద్రొక్కికొనుచుఁ దద్దయు భీతిన్. 74

వ. ఇవ్విధంబునఁ బలాయనంబు నొంది యతండు నిజపట్టణంబు సొచ్చెఁ; గళాపూర్ణుండును బ్రచండతరసింహనాదబంధురజయదుందుభిధణంధణఘోషణభీషణం బగుసేనయుం దానును నతని వెనుకొని చని యతిరయంబునం బురంబు ¹చొర నురువడించినఁ దద్రక్షకులు తమకపడుచు గవఁకులు మూయించి దంచనంబులుఁ బిరంగులు జబురుజంగులుఁ దుపాకులు మొదలైనసాధనంబులముమ్మరమ్ముతోఁ గ్రమ్ముకొని ²కొమ్ముకొమ్ముకుఁ జెక్కుండ్రుగా నుక్కుమిగిలి లెక్కకు నెక్కుడగుచు విక్రమాటోపంబునఁ గోట బలసికొనుటయుఁ గటనటద్భ్రుకుటీవికటితముఖుం డగుచు సత్వదాత్ముం డను కళాపూర్ణుని ప్రెగ్గడ దమమొగ్గరంబు నగ్గలిక మెఱయ లగ్గలకు డగ్గఱించినఁ దదుగ్రతకుం గాక చీకాకుపడు ప్రజలగజిబిజులాలించుచు గౌడపతి వివిధోపాయనపురస్సరంబుగాఁ బురంబు వెడలి యాకళాపూర్ణమహారాజుం గని కొలిచి యతని దయ వడసె; నివ్విధంబున దుర్వారదోర్వీర్యభవగర్వంబున నాయుర్వీవల్లభుండు నవ్వల నడచి గడుసుఁదనంబునం దనకు మెండొడ్డిన యొడ్డనిపై బలంబుల విడియించె నప్పుడు. 75

1. ఁజొర. 2. కొమ్మ కొమ్మకు.

క. చతురంగబలోన్నతి సం
భృతగర్వత నెదురుపోఁజుఁ బెట్టె నతం డు
ద్ధతవీరరసావిస్ఫూ
ర్జిత మగురణ మప్పు డుభయసేనల కయ్యెన్. 76

వ. అంత. 77

ఉ. దుమ్మునఁ గొంతసేపు నది దుర్దమర క్తముచే నడంగ ద
ర్పమ్మునఁ గొంతసేపు నది పంబిన పేరలఁతం గలంగఁ గ్రో
ధమ్మునఁ గొంతసేపు నది తద్విషయారిహతిం దొలంగ గ
ర్వమ్మునఁ గొంతసేపుఁ బసువాసిగణిం[1]పఁగ బోరె నమ్మొనల్.

ఉ. అట్టియెడన్ సమగ్రబలుఁ డంగవిభుండు చరన్మహాద్రి నాఁ
బట్టగుచుం గడున్ మెఱయుపట్టపు టేనుఁగు నెక్కి మిక్కిలిన్
బెట్టిదపుంగడంకఁ గరిబృందముతో బలనాయకుల్ దనుం
జుట్టును గొల్చి రాఁ దనుచున్ నడిచెం బ్రతిపక్షసేనపై. 79

ఉ. అప్పు డెదిర్చి యుత్కలధరాధిపునాజ్ఞను దద్గజేంద్రముల్
చెప్ప నశక్యమైనమదజృంభణలీల దలిర్పఁ బోరె నే
ర్పొప్పఁగ శాత్రవద్విరదయూథముతోడను జూడ మెట్టిచో
నెప్పుడు నిట్టిబెట్టిదపు టేనికపో రని మెచ్చఁ జూపఱులు. 80

సీ. ఎడనెడ వడిఁ గూడి సుడిరీతిఁ దిరుగుచుఁ
దలపడి దర్పంబుఁ దెలుపునవియు
వెనువెన్క కొక్కింత చని యొక్కటొక్కటి
దంతముల్ ఛేదిల్లఁ దాఁకునవియు
[2]నెడఁ బాయనీయక బల్విడి నంటఁ గదుముచు
న ట్టిట్టు వడిఁ ద్రోపులాడునవియు

1. పకపాఁర. 2. నెడవాయె.

మావంతు లన్యోన్యమథితు లై కూలినఁ
బూఁపు తప్పక యల్కఁ బోరునవియు
తే. నగుచు నపు డగ్గజేంద్రంబు లతిశయిల్లె
దంతఘట్టననిష్ఠురధ్వానములను
జటులఘంటాఘణంఘణాశబ్దములను
గఠినఘీంకారములను దిక్తటము లదర. 81

క. ఆవేళ నంగవిభుదం
తావళ మురవడిని దిరిగి తాఁకినఁ బ్రతిదం
తావళము లెల్ల వెలికిల
మావంతులు క్రిందుగాఁగ మహిపైఁ ద్రెళ్లెన్. 82

వ. అపుడు నిజగజేంద్రంబు నత్తెఱఁగిఁ బఱపి నుఱిపించుక్రముక కంఠోత్తరపురాధీశునియాటోపవిజృంభణంబునఁ గలంగఁ బడునిజ[1]సైన్యంబుదైన్యంబు వారించుచు ఘోరాకారం బైనవారణంబు నారోహణంబు చేసి యుత్కళాధీశ్వరుం డక్కడింది వీరుని మార్కొని యక్కజం బైనవిక్రమంబు నెఱపె నట్టిసమయంబున. 83

మ. సమవృత్తిఁ జవసత్త్వముల్ నెఱపుచుఁ సవ్యాపసవ్యక్రమ భ్రమణం బొప్పఁ దటాలనం చలపడుం బల్మాఱు శుండా ప్రకాండము లొండొంటిఁ బెనంచు ఘీంకృతిమహానాదంబు రోదోంతరాళము ఘూర్ణిల్లఁగఁ జేయు నమ్మదకరుల్ సంరంభ ఘోరంబు లై. 84

వ. ఇత్తెఱంగున నత్యంతఘోరంబుగా నవ్వారణంబు లవార ణీయసారంబు లై పోరుచుండ నంతటఁ గళాపూర్ణుండు. 85.

1. సైన్యంబు వారించుచు.

క. ఎడనెడఁ దలపడుచో వడిఁ
గుడియెడమలఁ దిరుగు నేనుఁగుల పిఱుఁదులు నే
ర్పడునట్టిక్షణములోనన
పెడమరలి విపక్షు వెనుక బిట్టుఱికె వెసన్. 86

క. ఉఱుకుచునె కఠినముష్టిన్
నెఱి చెడ నడివీఁపు పొడిచి నిజభుజముల యే
త్తెఱ మెఱయ వానిసంధులు
బిఱుసున వెనుకకుఁ గుదించి పెడకేల్గట్టెన్. 87

క. వెండియు నట్టిటుఁ గదలక
యుండ నతం డతులబలరయోద్ధతిమహనీ
యుం డగుచు వానిఁ దద్వే
దండము నడికట్టుత్రాళ్లఁ దగ బంధించెన్. 88

ఉ. ఎంతయు విక్రమం బలర నిట్లరివీరునిఁ గట్టివైచి తా
నంతట వాని వానిమదహస్తిని జంగున దాఁటి మిక్కిలిన్
వింతగ నంతరాళమున నెవ్వడిఁ గ్రమ్మఱి వ్రాలె నప్పు డా
దంతి నెదిర్చి [1]పాఱుతనపంతిపయిన్ రణసమ్ముఖంబుగన్. 89

తే. అంత నొకపంట్రకోలచే నహితుకరిని
విఱిగి పాఱఁగఁ బొడిచి పోవిడక మగుడఁ
ద్రిప్పికొని [2]తెచ్చి తత్కుంభదేశపార్శ్వ
ములు చుఱుకుముట్ట నేయుచు[3]బలము లుబుక. 90

ఉ. ప్రాణముతోడ నుత్కళనృపాలకు నమ్మెయిఁ బట్టి తెచ్చి సం
హ్రీణునిఁ జేసి తా విడిచె "నెన్నఁడు నిట్లసమానయుద్ధపా

1. పోరుతన. 2. తెచ్చోఁదత్కుంభ. 3. బలములుఱుక.

రీణులతోడ నింక నెదిరింపకుమీ" యని బుద్ధి చెప్పి క
ల్యాణగుణాఢ్యుఁ డంగవసుధాధిపుఁ డీప్సితరత్నహారి య్యె.

వ. ఇవ్విధంబున నిరర్గళవిజయస్ఫురణంబున భాసిల్లునాసుముఖా
సక్తినందనుండు తనకు నంతటఁగళింగద్రవిళచోళపాండ్యాది
భూపతులు తమయంత నే వశవర్తు లగుచు నానావిధోపాయ
నంబులతోడ నెదుర్కొనుచు నునుప దక్షిణసముద్రతీరంబు
నకుం జని కేరళమహీపాలునిమీఁద [1]విడిసిన నతండు. 92

క. సూరత పాటించి చమూ
వారంబులుఁ దాను నతని వడి మార్కొనియెన్
భేరీభూరిధ్వానమ
హారభటిజితాబ్ధిఘుమఘుమారవుఁ డగుచున్. 93

ఉ. అత్తటి రెండుసేనలు రయంబునఁ దారసిలెం గడంకమై
నుత్తరదక్షిణార్ణవము లొండొక[2]ట్టన్ నడిఁ దాఁకెనో
యనం, దత్తరళత్వదీప్తతఁ, దనర్చు నవేంధనవహ్నియో
యనన్, నెత్తురు వాల్చె నంత మును నింగికిఁ బర్వఁగ ధూళి
ధూమముల్. 94

వ. అందు [3]నపుడు. 95

లయవిభాతి.—
తనదుసకలాయుధములును బరునిచేతఁ దుని
సినను బోలివోనిమగతనము కడుప్రాపై
తనర నని వేడ్క నహితునకు నెదు రేఁగి నిజ
తనువుశరముల్ వెఱికికొనుచు బలుమూర్ఛన్
మునుఁగుచుఁ దదీయ మగుతనువు ప్రథ[4]మంబుగుఱు

1. ఁగవిసిన. 2. టిన్. 3. అంత. 4. మంపు.

తునఁ బొడుచువీరవరుఁ గని తదుపభోగం
బునకుఁ దమకించుసురవనితలకుఁ బల్వురకు
ఘనపథమునందు నొకపెనుజగడ మయ్యెన్. 96

లయవిభాతి. సరయశరవృష్టి కెను రసుగుటకు విఘ్న మని
యరసి తన బెట్టిదపు[1]టరిగెఘనశౌర్య
స్థిరత నటు వైచి నెఱబిరుదుమగఁ డొక్కరుఁడు
సరభసగతిస్ఫురణఁ బరుఁ దునుమఁబోఁగా
నురమున నిమగ్నముగఁ బరఁగినపరాయుధము
చరమశిఖిపింఛ మవసరనియమలంఘి
త్వరితపరిరంభవిధిగరిమవలీనసుర
తరుణిజవభిన్నకచభర మనఁగ నొప్పెన్. 97

లయవిభాతి. [2]వడియుకరిహస్తమును బిడికిటనె క్రిందటికి
నడఁచి యది మెట్టుకొని వడిఁ జివచివర్ణ రెం
డడుగు లెదురెక్కి యొకబెడిదపుభటుండు తన
యెడమచెయి కుంభతటి నిడి తదుపరిస్థం
బొడుచుచును బోటువడి కడుఁ దలఁకె నాత్మఁగర
మిడినది కుచస్థలిగఁ గడుఁ గదిసి వేల్పుం
బడఁతి గనుపట్టఁగను జడిసి "యిపు డే నెచటుఁ
బొడిచితినొ దీనిఁ బోడిఁబడ!" ననుచు లజ్జన్. 98

సీ: మావంతుగర్వంపుమాటఁ గోపించి త
న్మదహస్తి కొక్కరొ తెదురు నిలిచి
సమకట్టుజల్లుల నమరు నిజోత్తమా
శ్వమును ధే యన నది చమరమృగము

1. టరిగ. 2. ఒడియు.

గిరిశేఖరంబుపైకిని దాఁటుకొనియెడు
గతిఁ జౌకళింప నాక్షణమునందు
యతఁడు వైచినఘనాయతశూల మహితుమూ
ర్ధముఁ గాఁడి దంతివక్షమున వెడలె

**తే.** నాఁడె మొడిదినట్టిశూలాయుధమును
హయయుగము గాఁడి యారొతు శిరముపైకి
వెడలె; నాశస్త్రకీలితద్విపతురంగ
వీరతనువులవొంతర వెఱఁ గొనర్చె. 99

**వ.** ఇత్తెఱంగున నత్యంతశౌర్యసాహసంబుల దేహంబులు సరకు
గొనక యుభయవాగును ఘోరంబుగాఁ బోరుచుండఁ గేరళ
భూవరుండు కళాపూర్ణునకడకు రాయబారిం బనిచి "యీ
వృథాబలక్షయంబువలన నయ్యెడుఫలం బెద్ది? మన మిద్ద
ఱము నుద్ధించుకొని కటాహల నెక్కటికయ్యంబు గావిం
చుచు శౌర్యంబులకొలంది నెఱపుద" మని చెప్పించిన నాతం
"డట్ల కాని"మ్మని యియ్యకొనియె; నంత నుభయబలంబుల
పోరు వారించి. 100

**ఉ.** భూరిధృతిన్ బసిండిజలపోఁతకటార్లుఁ గొఱళ్లుఁ బూని య
వ్వీరవరుల్ మిథోవితతవీరరసోగ్రకటాక్షభావగం
భీరతఁ బల్లటీల్ గొనుచుఁ బేరెము వాఱుచు నింతనంతనుం
జేరుచు నంపి చాఁపులను జిమ్ముకటార్లటు పాఱఁ దట్టుచున్.

**చ.** ప్రిదులనిశౌర్యసంపదఁ బెట్టినదండలు దివ్వ కేకదుం
గదుము చుహుంకరించుచును గైదువుఁబాపుచు "నట్ల యిట్ల";
యం "చదె యిదె"యంచుఁ "దప్పుకొను!"మంచుఁ "దగుల్

బళీ!", యంచు నెందఁ గఁగ, చెదరుట లేక యైదు పది
సేయక పోరిరి పేరువాలుచున్. 102

చ. బిరుదుకటారికాంద్రు పరభీకరసత్త్వులు వార లిద్దఱుం
బరుసఁదనంబు నేర్పు నెఱబంటుఁదనంబు నొకళ్లొకళ్ల కుం
సరి యగుచున్కి కోర్వ మని సంధిలురోషకటాక్షవీక్షణ
స్ఫురణకటార్లపై నడరెఁ జూపఱు లోహితశంక నొందఁగన్.

క. ఒకని నొకించుకయును సోఁ
కక యుండెఁ గటారిమొనలు కడు బెట్టువడిన్
[1]నెకబికలుగఁ బోట్లాడుచు
వికసిల్లెదునాకడిందివీరులయందున్. 104

క. అంతఁ గళాపూర్ణుఁడు కడు
వింతగ నతిచిత్రహస్తవేగతఁ బరభూ
కాంతుఁ దడఁబఱిచి పొడిచె నొ
కింతచొరఁ గటారిమొన ననేక స్థలముల్. 105

వ. అప్పుడు తత్ప్రతివీరుండు. 106

క. ఆనేర్పునకును జంపం
గానొల్లమికిని మనంబు గడు వెఱఁగుపడన్
దా నతనిపాదయుగళికి
నానతుఁ డయ్యెను గటారి యటు వైచి వెసన్. 107

వ. ఇట్లానతుండై కరకమలంబులు మొగిడ్చి "యోమహాను
భావా! నీవు రాజమాత్రుండవే దివ్యపురుషుండవు గాక!
యే నాంధ్రదేశంబున నుండి వచ్చినయొక్కయత్యంతచాతురీ
ధురంధరుండైన కటారిసాధనకానివలన ననేకకాలం బభ్య

1. కకవిక. (శ. ర.)

సించి పేరుగల బిరుదుమాస్ట్రీలఁ బెక్కండ్ర జయించి యెక్క
డను మొక్కవోనిమానుషంబున ననూనగర్వుండ నగు
చునికింజేసి నిన్ను నిట్టి పోరునకుం బిలిచితి; [1]న న్నిట్లు పరిభ
వించుట యత్యద్భుతంబు గాదె!" యని కొనియాడి యమ్మ
ధురలాలసారమణు సపరివారంబుగా నిజపురంబునకుఁ
బ్రార్థించి తోడుకొనిపోయి మహోపచారంబులం బూజించి
యతని కభిమతంబు లైనతనదు శుద్ధాంతకాంతల శిరోరత్నం
బులు సమర్పించి ప్రణయపూర్వకంబుగా ననిపె; నప్పు డం
గాధిపతి యతనివలన మృగేంద్రవాహానానిలయం బున్న
చోటు విని యచ్చటి కరిగి యమ్మహాదేవిని సేవించి తద్భవన
వలభులరసి తన పూర్వజన్మంబువీడియఁ గని పుచ్చుకొని
యత్యంతసంతు[2]ష్టుం డగుచు నంత నుత్తరాభిముఖంబుగా
యాత్ర గావించె. 108

తే. అప్పు డాచుట్టుపట్లధరాధిపతులు
తనకు నిష్టంబు లైనరత్నముల నిచ్చి
కొలిచి యనుప నాభూపతి ఘూర్జరేశు
పై నడచె వానిశౌర్యదర్పంబు వినుచు. 109

క. అతఁడును దద్వార్తలు విని
యతిభీషణ మైనయట్టియాత్మధ్వజినీ
తతితోడ వచ్చి తాఁకెం
బ్రతివీరుని దిశల ధూళిపటలము గ్రింగన్. 110

ఉత్సాహ. అబ్బలంబు లొక్కటొకటి నట్లు కవియునాప్పలా
గుబ్బు గాఁగ నడరె; వాద్యఘోష భీషణంబుగా

1. నట్టిన. 2. ష్టాంతరంగుం.

నిబ్బరంపుటార్భటిని జనించె నంత నెల్లచో
డబ్బుడుబ్బు ఖంగుఖంగు ఠంగుఠంగు మన్ధ్వనుల్. 111

వ. అప్పు డుప్పతిల్లు ధూమంబుదొప్పు నుత్పాదించుచు రోదోం
తరాళంబు నాచ్ఛాదించు ధరాపరాగంబువలన నంధీకృతం
బైన యుభయబలంబులు దమతమయేలికలబిరుదు లుగ్గడించు
టలకతన నాత్మపరస్వనికవివేకంబు లోకానోకభంగిని సంఘ
ట్టిల్లం బోరుచో ఖంగుఖంగున నొండొంటిం దాంకుచుం
దడంబడు బెడిదంపుటడిదంబుల వెడలుమిడుంగురులవలనను,
సాటోపంబులైనయీంటెపోటులచేత గాటంపుంబెల్లునం జిల్లు
చిల్లునవెళ్లు నుల్కాలజ్వాలామాలికల నాభీలంబులగుధారాళ
రక్తపూరోద్గమంబువలన నుభయసేనానాయకప్రతాప ప్రాదు
ర్భావనిర్భరార్భటీశంక లంకురింప బిరుదకాహళశంఖభేరీ
పటహారటితపటిమంబును బ్రతిఘటార్భటీ(ట)పటుత్వవిఘట్టన
సమయ సముదితసత్వరవిస్ఫురత్స్వరసింహనాదంబులును మద
చండిమోద్దండవేదండమండలాఖండఘీంకారఘోషంబులును
భీషణహయహేషితంబులునుఖర్వమార్వనిర్వారామటంకా
ర నిస్స్వనంబులును వికస్వరస్యందనబృంద నేమి శబ్దంబులును
నంబరంబు వగుల్ప నంకుండ జడిసి పుడమికి డిగిన నిబిడంపు
జలదసముదయంబులపగిదిం బొదలు మదగజంబులమదధారా
వర్షంబులకుం దగిన యందంబున నింద్రగోపబృందసందేహ
కందళనికరంబు లగుచు మాంసశకలంబులు గానిపింప నంత
కంతకు నంతయు నధికంబు లగు క్రోధంబులతోడ యోధ
వీరులు చేరి ఘోరాసిధారలం జక్కాడంచినం గలుక్కనం
దెగి బిట్టుమిట్టించిపడు ధవళోర్ణిమభూషితమస్తకస్తోమంబుల

భంగులు సంగ్రామరంగాంబరీషాభీలకాలరాత్రి భర్జ్యమాన సముజ్జృంభణలాజానుకారంబునఁ బరిఘవిల్లు నురస్స్థలంబులు నఱుకఱకుటలుఁగులకతన వెనుకకొఱగు నెఱమేటిబలువుగల ప్రథమకుణాకృష్టనిష్ఠురధనుర్వలయనిష్ఠ్యూతంబు లగుశర వ్రాతంబులు వెడవెడనాప్చు(చు)పగఱమొగములఁ బ్రవేశించి పెడతల వెడలుచు సముత్కటతాత్కాలిక రోషాధిక్య కర్కశామందసంనష్టపుంఖమూలంబు లై చిక్కియుం జిక్కు వడక యక్కజపుజవభరంబున [1]శరంబులతోడం బెకలించు కొని మొగయు విగళితచికురంబు లగుశిరంబులు గగనంపు జప్పరంబునకుఁ జల్లుచు ఫుల్లారవిందంబులు పూవుబండలు నై యొకవిచిత్రపుసొంపు సంపాదింపుచు మృత్యుదేవతా మహోత్సాహసన్నాహంబుఁ దలంపింప నకంపితశౌర్యసాహస సముద్భటు లగుభటులు నలుదెసలం బొదివి కదనవిపుణత నెఱప నిలువునన యసువులు విడిచి నిరంతర నిర్ఘాతశాత శక్తితోమరప్రముఖ శస్త్రచరమభాగాలంకరణచారుపింఛ మాలావిలసితంబు లై యధోభాగంబులఁ గెంబట్టుపఱపు పొలుపు నెఱపుపలలపంకిలరుధిరప్రవాహంబులతోడ వీర పురుషసంభోగవిలంబాసహరంభాముఖ్య దివిజకామినులకు నలంకరించియాయితంబుచేసినచతుస్స్తంభకుంభనికేతనంబులో యనం గానిపించు నేనుంగులమీఁద శిఖరంబులచాడ్పునఁ గనకమయ కిరీటకవచధారణాధోరణశరీరంబులు రాజిల్ల విదారితానేకచక్రంబు లగుచు నొకకడన నొత్తిగిల్ల త్రెళ్లిన యరదంబుల యితర చక్రంబులు కృష్ణముఖశిలీముఖ

1. నరంబు.

కృత్తనేమిఘట్టనంబుల బిఱుసున నిరుసులకొనల బిఱబిఱం దిరుగుచు నిపతితరథంబులు భూరితర వీరరసావేశంబున వైరివీరవ్రాతపాతనార్థంబు చక్రాయుధంబులు ద్రిప్పెడిపో యను తలంపుసంపాదింపఁ బెంపుమీఱుచు నొప్పుత్రిప్పుడు వడుపునం బరిఘవిల్లుచునుండఁ దొండంబు లెత్తి తిరుగండ్ల కరణి నురువడిం దిరుగుచు నొండొంటిం దాఁకు కరులపరిసర ప్రదేశంబునం దొట్టువగట్టి పొల్లుతోడియాఘకీకణరాసులుం బోలెఁ గానుపించు రుధిరపలలకరంభితాస్తోకకీకసలేశకూటంబులచేప్పన శూర్పంబులనేర్పున నేర్పరింపుచు సంపతిత సప్రాణసామజవిధూయమానకర్ణవ్యాపారంబులు దీపింపసంగ్రామభూమియుద్దామరౌద్రబీభత్సభయానకహేతువగుచు నుద్ద్యోతించె; నట్టిసమయంబున సుముఖాసత్తిపుత్త్రుండు. 112

చ. సరివడఁ బోరుచుండ నటు సైన్యము నేమియు మీఱనీనియా
యరిబలముం గనుంగొనుచు నల్కఁ గనుంగవ కెంపు పూన ని
ష్ఠురగుణటంక్రియానినదశుంభదిషుప్రకరప్రవర్షణో, ద్ధురుఁ
డయి తద్బలంబుపయిఁ దోలె రథంబుఁ గడున్ రయంబునన్.

ఉ. ఘూర్జరభూమిపాలుఁడును గ్రోధము మీఱఁగ నానృపాలు న
త్యూర్జితబాణవృష్టిఁ గడు నుగ్రతఁ గప్పుచుఁ దాఁకి తత్పరి
స్ఫూర్జితసాయకంబుల నిషూదితసూతుఁడు భగ్నకేతుఁడున్
నిర్జితబాహుశౌర్యుఁడు[1]వినిర్గతధైర్యుఁడునయ్యెఁ జెచ్చెరన్.

ఆ. ఇట్లు దలఁకి యతని కిచ్చె నాత్మయశ
ధ్వాంతకామినీశిరోవతంస

1. వినిర్జిత.

మణు లతండు నతని మన్నించి యవ్వల
నరిగె విజయవార్త లతిశయిల్ల. 115

ఉ. అంతటఁ గానుకల్ గొనుచు నానృపతిం గురుకాశిదేశభూ
కాంతులు వచ్చి కొల్చిరి జగత్పరిరక్ష[1]యొనర్ప రుక్మిణీ
కాంతుఁడు శౌరి చన్న వెనుకన్ మఱి దక్షుఁడ వీవ యెవ్వరిఁ
డింతయు నొప్ప సద్గుణసమృద్ధుల నీ కని సన్నుతించుచున్.

సీ. ఆరాజతిలకుఁడున్ ద్వారకానగరంబు
విషధి ముంచుట మున్న విన్నవాఁడు
కావున వారిఁ దత్కథ లాతరంబున
నడుగుచు యదుసింహు నంబుజాక్షుఁ
దనపూర్వజన్మ గాంధర్వవిద్యాగురుఁ
గనుఁగొనునట్టిభాగ్యంబు తనకు
దొరకమి కాత్మయందును జాల వగచుచు
నౌత్సుక్యమునఁ దత్పురాంతికమున

తే. కరిగి దండప్రణామంబు లాచరించి
వరుస మాళవబర్బరధరణిపతుల
పై నడచి భీషణం బైనభండనమున
బహువిధాయుధపటిమచే భంగపఱిచె. 117

శా. ఆవార్తల్ దవుదవ్వులన్ వినుచు హూణాదిక్షమానాయకుల్
వేవేగన్ వినయంబుతోడ నిజతన్వీమాళిరత్నాదినా
నావస్తువ్రజ మంపినం బనిపె స్నానంబు చేయన్ హిమ
గ్రావాతంబుగ నేఁగి[2]తాఁదిరిగెనా రాజంతటం దూర్పుగాన్.

1. యొనర్చి. 2. తోఁది.

లయగ్రాహి.—

ఆతనిమహాజయవిభూతిపస మించు "నవి
గీత రణకేళిపటిమాతిశయగర్వ
[1]శ్వేతునకు నా కితఁడు వో తగిన[2]జోడు వసు
ధాతలమునం"దనుచుఁ గౌతుకముతోఁ బ్రా
గ్జ్యోతిషపురాధిపుఁ డభీతి నెదు [3]రేఁగి ఘన
హేతినికురుంబమణి కేతనసముద్య
న్నూతనగభస్తి పరిపీతకకుబంతరము
లై తనకు దారుణచమూతతులు గొల్వన్. 119

*[వ. ఇవ్విధంబునఁ బ్రాగ్జ్యోతిషపతి యాయంగపతికి నెదురునడిచి యుద్ధసన్నాహంబు చెన్నుమీఱఁ బన్నిన సైన్యంబులుం దానును దర్శనార్గళంబరికట్టుకొనియుండె;నతనిసైన్యంబులప్పుడు.

సీ. రథకేతుపటములు రత్నాద్రిలంబమా
నాబ్దశంక నొనర్ప నలరుచోట్ల
కరులు గండోపలాకారతఁ దనరను
పత్యకాభంగిఁ గన్పట్టుచోట్లు
కంచుపక్కెరల కంఖాణపంక్తులను భే
నిలసింధుతటలీల నెఱపుచోట్ల
తలచుట్లు కోటకొమ్మలయొప్పు నగ నొప్పు
నరిగెలపట్టవణి నమరుచోట్లు

గీ. భటులు పొరిఁబొరి నెగవైచి పట్టుతేల్ల
జల్లుల పసిఁడిగడలు చంచన్మరాళ

1. శ్వేతు. 2. జోడు. 3. రేఁగె. * 119-వ పద్యము తరువాత కుండలీకరణములోని ఈపద్యములు కొన్ని ప్రతులయందుఁ గలవు.

త్రుట్యమాణపతద్బిసాకృతి వహింప
మానసముచోట్లునై యటఁ గానుపించె.

క. ఆహవపరతఁ దదీయ
వ్యూహమునై యంగసేనయును జనుదెంచెన్
లౌహిత్యోదకము రజో
బాహుళ్యముచేతఁ బంకభావము పొందన్.

ఉ. సింగిణిసింటకోల గతిఁ జిత్రరయంబునఁ దేలువాఱి సే
నాంగములన్వడిం గడచి యప్పుడు తద్విభుఁ డొక్కరుండుచొ
చ్చెంగడుఘోరమైనరిపుసేన సరస్స్యదగాహి మత్తమా
తంగముభంగిఁబొంగుచు నుదగ్రజయగ్రహణోగ్రగర్వతన్.]

ఉ. వైరిచమూసమూహము లవారణ నన్నియు నప్పు డాతనిన్
ఘోరతఁ జుట్టుముట్టుకొని కోయన నార్చెను దోన యద్భుత
స్ఫారతరార్భటిం బిరుదసంకులుఁ దారలు బూరగొమ్ములుం
భేరులుఁ దమ్మటంబులును భీషణావృత్తిని బిట్టు మ్రోయఁగన్.

చ. వెడిదపుభంగిఁ దధ్వనులపెంపు నడంచుచు నంత నెంతయున్
వడిఁ దనరారె నంగజననాథుగుణక్వణనంబు; దానిఁ దా
మడిమలు ద్రొక్కుచున్ విశిఖమండలి వెన్కొనియెన్ గరంబు బ
ల్విడిని సమస్తదిఙ్నృపులవీనులు మేనులు నుక్కు దక్కఁగన్.

వ. అట్టి సమయంబున. 122

ఆ. అతనివింట వెడలునమ్ములవేగవై
చిత్రి యేమి చెప్పఁ జేవలసిన
మురువు బిరుసుఁ గ్రోవి ముట్టించిన తెఱంగు
చెఱువుకట్ట తెగినబిఱుసు దోఁచె. 123

చ. దొనపయిఁ బాయ కెప్పుడును దూపు [1]వెడల్పుచునున్నరీతిఁ
దాఁ,జనుమఱచేర్పునం దెపుడు జాఱక యమ్మరిఁబోసి యున్న
చాఁ,డ్పున శ్రవణాంతసీమ నెపుడుఁ వలయాకృతచాపమై[2]న
శిం,జినిగతిఁ దోఁచెఁ దత్కరము చిత్రరయంబునఁ బెక్కు
రూపులై. 124

వ. ఇత్తెఱంగున నప్పార్థివోత్తముం డత్యంతచిత్రంబైన ధను ర్విద్యనేర్పు నిర్వహించిన సుసంచితంబులైన బాణపరంపరల చేత నరాతిసైన్యంబులందుఁ జింపఱవంపఱ లగు నరదంబులును, జినిఁగిన కేతువులును, జీకాకుపడు రథికులును, జడిసిన సారథులును, ద్రుంగిన యేనుఁగులును, దునిసిపడినమావంతులును, దుత్తుమురైన యంకుశంబులును, దునుకలైన పరిస్తోమంబులును, [3]బొలిసిన యశ్వంబులును, బొరలెడిరౌతులును, బొడ వడంగిన పల్లంబులును, బొడిపొడియైన పక్కెరలును, సుఱుమైన పదాతులును, సులిసిన కంకటంబులును, సుసియైన కైదువులును, సుగ్గునూచంబైన యరిగెలును, దెగిపడిన యాభరణంబులును, దెరలి పాఱురక్తంబులును, దెట్టువలు గొన్న మాంసంబులును, దెట్టెలు గట్టిన యస్థిశకలంబులును జూపఱకు నద్భుతభయానకబీభత్సరసంబు లావహిల్లఁ జేసె; నవ్విధంబున నమ్మణిస్తంభనందనునియమందవిక్రమంబునసుక్కు దక్కు రిపుసేనాంగంబులభంగిం గనుంగొని యతనిబలంబులు జయోత్సాహదుర్వారంబులై యురువడించె; నయ్యెడం గలంగి పాఱునిజబలంబుల నిలువరించుచుఁ బ్రాగ్జ్యోతిషాధ్యక్షుండు రోషకషాయితాక్షుం డగుచు నక్షయంబైన తన

1. వెడల్పు. 2. వసిం,చినగతి. 3. బొరిసిన.

విక్రమోత్సేకంబునఁ బరానీకంబులు కాందిశీకంబులై చీకాకు
పడ [1]భీకరంబుగఁ దనరథంబుఁ గళాపూర్ణుని దిక్కునకుం బఱ
పించిన నతనిఁ దలకడచి తత్ప్రియసఖుండు చండబాహుం
డనువాఁడు వాఁడిమిగిలి యాయంగపతితోడఁ దలపడియె
నపు డయ్యిద్దఱకుఁ దద్దయుం బ్రొద్దు మహాయుద్ధంబు ప్రవ
ర్తిల్లె నంత. 125.

తే. వార లతిచిత్రశ (క)రలాఘవంబు పేర్మిఁ
బేర్చి యొండొరుపయి నేయఁ బింజపింజఁ
గఱచుకొని పొఱితూఁపు లొక్కటియ వోలెఁ
గానిపించుచుఁ దలపించెఁ గడలపోరు. 126.

క. అనయముఁ గరలాఘవ మి
ట్లొనరఁగ నేయుచుఁ బరప్రయుక్తము లెల్లం
దునుముచుఁ బోరఁ దదంతర
మునఁ గుప్పలు వడియె బాణముల శకలంబుల్. 127

వ. అట్టిపమయంబున మధురలాలసావల్లభుఁ డెల్లవిధంబులం
దుర్లభుంచుఁ దనకు నెదిరించి కడుఁ దడవుగాఁ బోరుచున్న
యవ్వైరివీరు బరవసంబునకు వెఱఁగందుచు [2]నతని గెల్చు
టెట్లొకో [3]యనుతలంపు వొడమ ధనుర్గుణంబైన స్వాభావ
సిద్ధుం దలంచి మనంబునందు నమస్కరించి తదనుగ్రహాలబ్ధంబు
లైనయమోఘ నిజధనుర్బాణంబుల నుద్దేశించి "యేమీ
మీకును లోకంబులోని శరశరాసంబులు సరియగుచు నింత
సేపు పోరించుట సహింపవచ్చునే ? మీమహత్త్వంబు
జూపుట కిదియ యవసరం" బనుచు "హుం"మ్మనుచు నుత్సా

1. భీకరరయంబున. 2. నితని. 3. యని.

హంబున హెచ్చి మిక్కిలి యొక్కుడైన హస్తలాఘవ
విశేషంబున. 128

సీ. ఆవిభుఁ డేసెఁ గ్రూరాస్త్ర మట్టిన యేసె
దాని వెన్వెనుక క్రొత్తగఁ బరుండు
నది యొర్వ కమ్మనుజాధినాయకుఁ డాత్మ
విశిఖ[1]పుంఖము నేసె వేఱె యొకటి
విమతుఁడు తనదుబాణము పింజ [2]యేసె; న
న్నిపుపుఁ బైపయి నేయ నేయ
సొరిది నిక్షలవిండ్లు సోఁకుట కొక్కింత
కడమగా శరరాజి నిడుపు సాఁగెఁ

తే. దనవరుసయేటు వెస నేసి ధనువుఁ దునిమి
యంగవిభుఁ డంత రిపునియే పడఁచెఁ దద్భు
జాంతరముఁ దూఁటి పాఱె నాయంపచాలు
పుంఖముఖ మయ్యెఁ జేబల్మిఁ బొగడఁ దరమె? 129

క. దానం బ్రాగ్జ్యోతిషధా
త్రీనాథునిసఖుఁడు ధరణిఁ ద్రెళ్లుటయును ద
త్సేనలు చెల్లాచెద రై
నానాదిక్కులకు భయమునఁ బెసఁ బఱచెన్. 130

వ. అప్పు డాచండబాహునిపాటువలన నాటోపంబు దక్కి
ప్రాగ్జ్యోతిషపతి యంగపతి శరణుసొచ్చి తన శుద్ధాంత
కాంతాశిరోరత్నంబులు కానుక యిచ్చె; నంతఁ దద్వార్త
చేతన భీతిల్లి కోసలప్రముఖులును, మాగధుండును దమ
యంతన వశవర్తు లగుచు నమ్మణిస్తంభసుతు నభిమతార్థం

1. పుంజము. 2. చేసె.

బులం దనిపి యనుగ్రహంబు వడసి; రివ్విధంబునం గళా
పూర్ణుండు సకలదిగ్దేశాధీశుల జయించి తత్తత్ప్రియాంగనా
మౌళిమాణిక్యంబుల మధురలాలసాచరణమంజీరనిర్మాణంబు
కొఱకు సాధించి యెందును నెదురులేక యమందవిజయా
నందంబునం దిరిగి వందిమాగధవారంబులు కైవారంబులు
సేయ నిజపట్టణంబు చేర నరుగుదెంచె; నప్పుడు. 131

సీ. "ఇంక నించుకవడి కిండ్లన విశ్రమిం
తము కూడ రారంపు తడయ" కనుచు
"నలమిట్టు దాటినఁ ధళధళఁ గాన్పించు
మనవీటికనకహర్మ్యంబు" లనుచుఁ
"గంటిరే యల్ల గంగాసరయూసంగ
మప్రాంతవనరాజిమహిమ ?" లనుచు
"సకలదిగ్దేశముల్ చరియించితిమి కాని
యిట్టితోఁటలు గాన మెందు" ననుచుఁ

తే. "గనుఁగొనుం డోలిఁ గాన్పింపఁగాఁ బోడంగె
గోపురము లవె యవె పైఁడికోట" లనుచుఁ
గ్రముకకంఠోత్తరపురంబుఁ గ్రమ్మఱంగఁ
జూడఁ గంటిమి నేఁడు నీసొంపు" లనుచు. 132

క. ప్రమదమున సంభ్రమించుచుఁ
దమతమవా రెదురుకొనఁగఁ దత్తద్వాస్తు
క్రమవీక్షణముల నధ్వ
శ్రమ మంతయు మఱచి వేడ్కఁ జనుమర్క మఱియున్. 133

ఉ. తొల్లిటిప్రాంతపట్టణము త్రోవలు నల్లవె రోమపాదుఁ డం
దల్లుని ఋశ్యశృంగుని గృహస్థితి నింపుల ముంప సంపద

త్ఫుల్లసితంబు చేసి ప్రియమొప్పఁగ నిల్పినయట్టిమేడ తా
నల్లదె కంటిరే నవనవాకృతి నిప్పుడు నొప్పెడుం గడున్.

తే. పూని కర్ణాత్మజుఁడు వృషసేనుఁ డాత్మ
హయము దాఁటించినట్టివాఁ గల్లయదిగో
నాఁటి కది యబ్బురముగాని వీటిలోని
నేఁటికిగ్గాడిగుఱ్ఱాలు దాఁటుచుండు. 135

ఉ. హారిసమృద్ధితో నిచటి కామడ నున్నది తూర్పునందుఁ గా
సారపురంబు; తద్విభుఁడు సన్నుతశీలుఁడు సత్వదాత్ముఁ డీ
తోరపువీడు కౌతుకముతో నొనరించె; నతండు నిందుభూ
భారధురీణు నీయధిపుఁ బట్టముగట్టను దా నమాత్యుఁ డై.

వ. ఇవ్విధంబున మఱియుఁ దత్తత్ప్రదేశవస్తువిశేషదర్శన
ప్రసంగోచితభాషణంబుల నవిదితాయామంబులగుచుఁ దెరువు
జరుగ నరుగుచున్న సకల జనులు నక్కడక్కడం గడలకుఁ
దొలంగి కనుంగొనుచుండ నుద్దండభేరీపటహశంఖకాహళాది
నాదంబులు రోదోంతరంబున బిక్కటిల్ల మిక్కిలి యొక్కు
డైన యక్కజపువైభవంబున భూవిభుండు పురంబు ప్రవే
శించె; నయ్యవసరంబున. 137

ఉ. భేరులు లోనుగాఁ గలగభీరపువాద్యచయంబు మ్రోఁతలం
దోరపుఁ బ్రౌఢి మించెను గుతూహలసంభ్రమజృంభమాణరా
మారభసాధిరోహణసమాకులసౌధసమంజుహాసమం
జీరఝుళంఝుళధ్వనివిశేషము లెంత ప్రజాసమృద్ధియో ? 138

ఉ. ఆవిభుఁ జూచుకాంతలముఖావళి సోరణగండ్ల శోభిలం
గా విలసిల్లె సౌధము లఖండితదిగ్జయధామచిత్రిత

త్పావనచారుకీర్తికృతతర్జనభీతిసహస్రధావిభి
న్నావతరత్సహేమకమలామరసింధుజలౌఘమో యనన్. 139

తే. అతనిఁ జూడంగఁ బఱతేర నడరి జాఱి
యొకతె కొప్పువిరాజిల్లె నొకరిఁ బట్టఁ
బదరుమరునాజ్ఞఁ జని మెడఁ బట్టి ద్రొబ్బి
తెచ్చు రోలంబభటు లనఁ దేజరిలుచు. 140

ఉ. శోణితలేంద్రుఁ జూడ నొకకొమ్మ వడిం బఱతెంచె నుల్లస
ద్వేణిభరంబుతో మొగపుఁదీఁగె వలగ్నమునం బమర్చి యొ
డ్డాణము తీఁగెగా నిడి మెడన్ వలగో నది చాలమిం గొనల్
పాణుల నుండఁ గౌను మితిబాగుగఁగానుక [1]పట్టుకైవడిన్.

ఉ. గుబ్బెత యొత్తువచ్చె నృపకుంజరుఁ జూడ రతాస్తనీవిఁ బా
గొబ్బునఁ గట్టుచుం బయఁటకొం గది మాన్పఁగఁ బోలెఁ
గాళ్లపైఁ, బ్రబ్బికొనం గుచోద్ధతభరంబునకుం బయికొపు
పోలెఁ ద, బ్బిబ్బుగఁ జేతికిన్ దొరకి(తు) పెన్మిటివస్త్ర మురో
వృతంబుగాన్. 142

లయవిభాతి.—

జలక మపుడాడి యొకచెలువ నునుఁగావిజిగి
వలువ వెసఁ గట్టుకొని జిలుఁగురవమాదా
వళపుఁదడియొత్తుకచములఁ బెనఁచి చుట్టుకొని
కెలని కది కెంజడలమెలిపగిదిఁ దోఁపన్
గళితధృతి యోగినియు బలె నరుగు దెంచె నృప
తిలకుని గనుంగొనఁగ లలితకుచమధ్య

1. పెట్టు.

స్థలిఁ బరఁగ మౌక్తికము కలఁగి హృదయంబు వెలిఁ
దొలఁకిపడుసత్త్వ మన వెలుఁగు నటియింపన్. 143

ఉ. హారమణిం గనుంగొనఁగ నాటపువేడుకఁ బాలు వెంచె నో
య్యారి యొకర్తు ముక్తజలకమ్మాడుచు వైచినకీలుగంటు దా
సారెకు జంఘలం బెనఁగ సవ్యకరంబునఁ బాయఁ బట్టి శృం
గారరసంపుగిండి గలకాముని డూడెపుఁగత్తెయో యనన్.

తే. ఇత్తెఱంగునఁ బౌరులకెల్ల నేత్ర
పర్వ మొనరించు రూపవైభవముతోడఁ
గ్రముకకంఠోత్తరమహాపురప్రవేశ
మాచరించి ఘనైశ్వర్య మతిశయిలఁగ. 145

క. శుభతర మైనవిపంచిక
యభినవకామునికి నొసఁగి యాత్మసచివు న
వ్విభుఁడు నియమించె రూపా
సుభూతిజకు నూపురములనుం జేయింపన్. 146

వ. దానం జేసి యమ్మానవతియు నానందంబు నొందుచు నెందు నత్యపూర్వంబులైన నానాభూషణవిశేషంబుల నలంకృత యగుసమయంబునఁ బ్రసంగవశంబునఁ జెలులవలన నాత్మ బాల్యసమయసంప్రాప్తరత్నహారంబుసుద్ది విని ప్రాణవల్లభుని ప్రథమానుగ్రహవిశేషంబైన యాభూషణంబు ధరియించుటకు నభిలాషంబు వొడమ దానిం దెప్పించి నిజహృదయస్థలం బంటియగుటకుఁ దగినట్లుగా నిముగడలఁ గొన్ని మణులు నిలిపి నూతనసూత్రంబునం గ్రుచ్చి ధరియించి యంచితవిలాసంబు పరిఢవిల్ల సురటి గొని వరునికడ కరిగి పరిచర్య సేయుచుండె నంత. 147

సీ. ఆయితంబుగఁ జేసినట్టియందియజోడు
సత్యదాత్మజుఁడు కరాబ్జమునఁ బూని
యచ్చటి కేతెంచి యధిపు కన్బొమసంజ్ఞ
నయ్యింతియగ్రంబునందుఁ బెట్టి
స్వామి నీ కోడఁబడ్డ సకలదిగ్దేశభూ
నాథశుద్ధాంతకాంతాశిరోమ
ణిప్రకల్పితనూపురప్రకాండము లివె
యంఘ్రిలఁ బూను మా యమ్మ యనుచు
తే. వసుధఁ జాఁగిలి మ్రొక్కిన వలదు వలదు
మ్రొక్క నాకును వందనార్హుఁడవు నీవు
మేనమామకు వెఱుంగముగాని నేఁటి
దాఁక నిది యంచు నతని కాతఁడు మ్రొక్క. 148

క. మ్రొక్కిన నతఁ డరుదందుచు
మిక్కిలి వెనువెన్క కొదిఁగె మేను వడంకన్
నిక్కం బిది సంకోచము
దక్కమనియె సతియు లేచి తగువినయమునన్. 149

వ. అప్పుడు కళాపూర్ణుండు నవ్వుచు నతనిం జూచి యా చెలువ యన్నట్లు నిజంబు గావలయు సంకోచం [1]బేల, [2]తత్ప్రకారంబు తెలియ నడుగుటగాక యని యిట్లనియె. 150

తే. తనదుశైశవమున నీవు తను నడిగిన
నీకులాఖ్యాదు లింతికి నేఁడు తోఁచె
నేమొ ? మే లయ్యెఁ దెలియుద మిప్పు డడిగి
యనుచు నాపువ్వుఁబోడి యాననముఁ జూచి. 151

1. బైన. 2. తన.

ఉ. నీవగుచిన్న నాఁటియలనిర్మలబోధవిశేష మిప్డు ల
బ్ధోదయ మయ్యెనో తిరుగ నుల్లములోన; నితండు నీకు నో
పైదలి మేనమామ యగుపద్ధతి యెట్లడి నేఁడు చెప్పుట
ట్లాదట నాఁడితం డడుగ నప్పుడు చెప్పమి యెట్లు చెప్పుమా.

వ. ఆశైశవంబున నట్టివిజ్ఞానంబు గలుగుటకుఁ గారణంబు నాఁ
డడిగి తెలిసికొనలేమికిఁ బశ్చాత్తాపంబు నొందుచుండుదు;
నది యెఱింగింపవలయు. 153

క. అన విని యాసతి యంతయు
వినిపించెద వినుఁ డటంచు విభునకు లీలం
దనచేతిసురఁటి విసరుచు
వినయమధురఫణితి నిట్లు వినిపించెఁ దగన్. 154

సీ. అధిప మున్నితఁడు మహారాష్ట్ర దేశమే
లెడునుగ్రహుం డనుపుడమితేఁడు
మాతల్లి రూపానుభూతి యీతని[1]యప్ప
యితనికులీనత కెల్లనృపులు
కడు వేడ్కపడి తమకన్నెల నిచ్చి సం
బంధబంధువులుగాఁ బ్రణతనిష్ఠఁ
బత్రిక లంప నంపఁగ నిందు నెవ్వరి
వాంఛ యీడేర్తు నెవ్వరిని విడుతు

తే. ననువిచారముతోడ నిట్టటు నుఱుకక
గడపె బహుకాల మది యవగణన గాఁగ
వగచి యొక్కొక్కనెపమున వారు మేరఁ
దప్పి యితనిపైఁ జేసిరి దండయాత్ర. 155

1. యవ్వ.

క. ఈతఁడు దా వెలుపల నై
యే తెఱఁగున నైన వారి యే పడఁచి పరా
భూతులఁ జేయుదు నని ప్ర
ఖ్యాతజవహయాధిరూఢుఁ డై పురి వెడలెన్. 156

ఆ. ఇట్లు కడకుఁ దొలఁగు టెఱిఁగి యారాజులు
తిరిగి యరిగి రాత్మదేశములకు
'రాజు లేనియట్టిరాష్ట్రంబుపైఁ జని
జయము గొనుట యేమి శౌర్య' మనుచు. 157

వ. ఇతండు నయ్యహితభూపతులు తిరిగిపోవు టెఱుంగఁడు గావున నతిదూరంబుగాఁ జని [1]యొకవిపినమధ్యంబున నిలిచి యాశత్రువుల నెవ్విధంబున జయింతు ననుచింత నొక్కింత తడవుండి భవితవ్యతానుసారంబున నిట్లని తలపోసె. 158

సీ. మిగులంగ ముట్టుపా టగుటఁ జేసి కలంక
[2]నెఱిఁగి యొఱంగింప నెఱుఁగ కిట్లు
శీఘ్రింబ యేఁగుదెంచితి నసహాయత
నేమయ్యెనో పురం బేమి యైరొ
ప్రజ లేమియైరొ విపక్షభూపాలకు
లిది యెఱుంగ నుపాయ మేదియొక్క
చొప్పు మార్చితిఁ బెక్కుచోట్ల శాత్రవభీతి
నావారుఁ గనలేక నన్ను నరసి
తే. యేన తిరిగిపోయెద నంటి నేని శత్రు
లెచట నెట్లడ్డగింతురో యనియుఁ దగక

1. మహావిపి. 2. నేరికి నెఱి.

యున్నచోటనె యుండి తా నుల్లమునను
సకలమును గాంచువాఁ డెంత సుకృతియొక్కొ. 159

క. అట్టిమహత్త్వముఁ గాంచిన
యట్టి బ్రదుకు బ్రదుకుగాక యన్యమహత్త్వం
బెట్టిదియు నేల జనులకు
వట్టిప్రయాసంబు [1]దానివలనఁ దలంపన్. 160

వ. అని యట్టిసర్వజ్ఞత్వంబు సాధించుటకు దృఢనిశ్చయంబున మహోత్సాహుం డై తురగాధిరోహణంబు సేసి వాసుదేవ నిత్యసాన్నిధ్యసిద్ధి ప్రసిద్ధం బైన యమునాతీరంబున కరిగి యందు బృందావనంబున. 161

క. [2]తా నెప్పుడు నతిభక్తిం
బూని కొలుచు బాలకృష్ణుఁ బురుషోత్తము ను
త్తానశయు వటపత్రశ
యాను మది నిలిపి సలిపె నధికతపంబున్. 162

సీ. కొమరొందుమఱ్ఱియాకునఁ బవ్వళించి చూ
పట్టెడు బాలరూపంబుతోడఁ
బాణియుగ్మంబునఁ బదిలంబుగాఁ బట్టి
మొగమున నిడుపదాంబుజముతోడఁ
జరణాంగుళీపానజాతలాలాభిషి
క్తం బైనచిన్నిహారంబుతోడఁ
బూని చూడ్కులకు బ్రస్ఫానందశైత్యంబు
గులుకు నెయ్యపుముద్దుఁ జెలువుతోడ
తే. నతనిమనమున నవిరతధ్యానమహిమఁ

1. కానివలను. 2. తానయమునతి.

దిరముగాఁ బొడ[1]కొన్న యాదివ్యరూపు
వెలిఁ బ్రకాశింపఁ జేయుచు విష్ణుదేవుఁ
డధిక కారుణ్యలీలఁ బ్రత్యక్షమయ్యె. 163

క. ఆతెఱఁగునఁ బ్రత్యక్షం
బై తను "నిష్టమును వేఁడు" మని హరి పలుకం
బ్రీతివశత నించుకతడ
వీతం డేమియును బలుక నెఱుఁగక యుండెన్. 164

క. పదపడి ప్రబుద్ధుఁ డై త
త్పదపద్మంబులకు భక్తిఁ బ్రణమిల్లి తగన్
నుదుటన్ ముకుళితకరములు
గదియించి వినీతి దనరఁగా నిట్లనియెన్. 165

క. "అలఘుతరానందంబునఁ
బలుక నెఱుఁగకున్నవాఁడ బరమపురుష ! నీ
వలనన్ సర్వజ్ఞత్వము
గలుగుట నాకోర్కి ; దానిఁ గరుణింపు దయన్." 166

వ. అని విన్నవించుటయు నద్దేవదేవుండు తన మెడ నున్న రత్న
హారంబుఁ దిగిచి "దీని నాయకరత్నం బెవ్వరిహృదయస్థలంబున
నెంతతడవు సోఁకి యుండు వారికి నంతతడవును సర్వజ్ఞత్వం
బును, సకలవాక్పటుత్వంబును గలిగి యుండు" ననియును,
"బ్రాహ్మణమనోవ్యథఁ గాంచువారియొద్ద నిది యుండ"
దనియు నానతిచ్చి [2]యిది యితనిచేతి కిచ్చి యంతర్ధానంబు
నొందె ; నితండు నమ్మహనీయహారంబు వడసివచ్చువాఁ
డవ్వనంబులో నొక్క దేవాలయంబునందు. 167

1. కొన్నట్టి యరిది దేవురూపు. 2. యతనిచేతికి నద్దివ్యహారంబు నిచ్చి.

సీ. మెఱుఁ గెక్కి బిగువు లై మీటిన నవియున
ట్లింపొందుగుబ్బపాలిండ్లతోడఁ
గడుఁ గృశత్వంబునఁ బిడికిటిలోఁపల
నడఁగెడుబడుగు నెన్నడుముతోడఁ
జిఱునవ్వు తెలినిగ్గు చిలుకుచుఁ దనరారు
తళుకు లేఁ జెక్కుటద్దములతోడ
జగతి నెందును లేనిచక్కఁదనాన సొం
పగుచిన్నిముద్దు నెమ్మొగముతోడఁ
తే. గరము విలసిల్లుసకలాంగకములతోడ
రహిఁ దనర్చునలంకారమహిమతోడ
ద్వారశాఖలదండ నింపారుచున్న
ప్రతిమ నొక్కటి చూచె భూపాలచంద్ర! 168
క. చూచి మనంబున మెచ్చుచు
నాచేరువ నిలఁ డటుండ, నంతటిలో భ
వ్యాచారశీలుఁ డచటికి
వాచంయముఁ డొకఁడు మార్గవశమునఁ జేరెన్. 169
తే. చేరి కాషాయవస్త్రంబు చెఱఁగు విసరు
కొనుచు "హరిహరి" యనుచు నింపున నొకింత
తడవు గూర్చుండెఁ దత్సవిధప్రదేశ
మంటపంబున నధ్వశ్రమంబుకతన. 170
సీ. ఆయతీశ్వరుఁ డంత నతిరమ్య మైనయా
లెప్పంపుఁబూఁబోఁడి యొప్పు చూచి
"బళిర శిల్పికులేంద్ర! బ్రహ్మను మీఱి తే
సగిదిఁ జేసితిర యీప్రతిమ?" ననుచుఁ

దనమదిఁ గడు మెచ్చితల యూఁచుచును "నిట్టి
పడఁతులు గలరొకో పుడమి!" ననుచు
"నిట్టిది సన్న్యాసి కీర్తింపఁ దగ" దని
మార్మోము వెట్టుచు మఱియు మఱియు

తే. నిచ్చఁ గ్రమ్మఱఁ జూచుచు నేమి చెప్ప!
నతనువికృతికి లో నయ్యె" ననుచుఁ జెప్పి
కొంతసంకోచ మంద నాకొమ్మ తెఱఁగుఁ
గని తొలఁగి పోయె నొకనెపంబునను మంత్రి. 171

క. జనపతియు భార్యవచనముఁ
గనుఁగొని "యేమయ్యెఁ గడమకథ ? కౌతుకముం
బొనరించుచున్నయది నా
కును ; వినిపింపంగ వలయుఁ గోమలి" యనియెన్. 172

చ. అన "నిఁక నేమి చెప్పుదు జనాధిప! యాయతిముఖ్యుఁ డంతనె
మ్మనమునఁ బట్ట లేక ప్రతిమన్ బిగియారఁగ వుంగిలించె నిం
పొనరఁగ లేచి వచ్చి కడ నొక్కమఱుంగున నప్డు సుగ్రహుం
డునికి యెఱుంగమిన్; నగియె నుడఁగ లే కితఁ డుంగి కాకికన్.

వ. నగుటయు నతం డది వినియు వినవిచందంబుఁ గల్పించుకొని తత్ప్రతిమాలింగనం బొక యదృచ్ఛాచేష్టావిశేషంబుగాఁ గప్పిపుచ్చుటకుఁ దాత్కాలికయుక్తి నద్దేవాలయంబున వెండియుం గల దౌవారికాదిప్రతిమల నట్ల యాలింగనంబు చేయుచు నమస్కరించి తత్ప్రదక్షిణంబు సేయం దొడంగిన. సుగ్రహుండును నతని కపటచేష్టల తెఱం గెఱింగి "యిట్లింత చేసిన నీ పూర్వంపుఁజేఁత నే నెఱుంగుదును గదా! యది మఱవ" ననుచు మఱియుఁ బరిహాసించె; దాన నయ్యతి యతి

వ్యథమానమానసుం డగుచుఁ గడు నలిగి "యిది తుదగా నీమొదలిమొలుక యెంతగల దంతయు విహతం బయ్యెడు" మని శాపం బిచ్చె. సుగ్రహుం డతిభయాకులుం డగుచు శాపమోక్షంబు దయచేయు మని పాదంబులం బడి లేవకుండె నయ్యతీశ్వరుం డనును. 174

క. "నాయీరహస్యచేష్టిత
మేయెడ నేనియును నుబ్బనేని కలుగు నీ
పోయినమది గ్రమ్మఱఁగఁ ద
దాయత్తత వెలయు నప్రియము మఱి లేమిన్." 175

ఆ. అనుచుఁ జనియె; నతనియాశాపమహిమచే
నెఱయ సుగ్రహుండు మఱచిపోయె
నాక్షణంబుతుదగ నటు ప్రథమమున వి
జ్ఞాత మగుప్రపంచజాత మెల్ల. 176

తే. అట్లు విస్మృతసకలపూర్వాత్మచరితుఁ
డగుట నీతఁ డెఱుంగలేఁ డయ్యెఁ దిరుగఁ
గైకొనంగఁ దదాదిమక్షణమునం దె
యొకశుచిస్థలి నిడినహారోత్తమమును. 177

తే. "బ్రాహ్మణవ్యథ గాంచు నాపాపమతికి
నిది నిలువ" దంచు హరిపల్క మొదల వినియు
నతని వెతఁ బెట్టి కోల్పోయె హార మితఁడు;
"దైవఘటన యెవ్వారికిఁ దప్ప దరము." 178

క. ధర నెవ్వారలు సేసిన
దురితంబులు నుచ్చరింప దోసమ్మఁట మహా

పురుషుల కొకకొద యొకచోఁ
బొరసిన నది పగటుపాపము వృథా చనునే ? 179

ఉ. అంతట దైవసంఘటన నచ్చటు వాసి యతండు దివ్యదే
శాంతరముల్ చరించుచు నిజాహ్వాయవంశచరిత్రవిస్మృతిన్
భ్రాంతునిలీల మత్తుగతి బాలునికైవడి నెద్ది గన్న నత్యం
తము నద్భుతం బగుచు నాత్మకుఁ దోఁచుచు నుండవర్తిలెన్.

క. ఆదిమ సంకేతగ్రహ
ణాదులు విస్మృతము లగుట నాఖ్యాగుణజా
త్యాదివ్యవహారజ్ఞత
లేదయ్యెను నితని కపుడు లేశం బైనన్. 181

చ. వెనుకఁ గ్రమక్రమంబున నవీనముగా నుదయంబు నొందె పెం
పొనరె నృపాల! యీతనికి నుత్తమమధ్యమవృద్ధకర్మద
ర్శనమున ద్రవ్యకర్మగుణజాతివిశేషవివేచనంబు బా
లునకునుబోలె మానసములో నిఖిలవ్యవహారహేతు వై.

క. తనకులనామాదులు ద
క్క నశేషము నిట్లు వెలసెఁ గాని యితఁడు భూ
జనవర యవి యెఱుఁగడ యెం
దును వద్జ్ఞులు నేఁటిదాఁక దొరకకయునికిన్. 183

వ. ఇవ్విధంబున బరిభ్రమించుచు నొక్కనాఁడు గంగాసరయూ
సంగమప్రాంతవనంబు చేరి వర్తిలుచుండఁ దత్కాలంబునందుఁ
గాసారపురం బరాజకంబైన నందుఁ గలమంత్రిప్రముఖరాజ
పురుషులును బౌరులును రాజనిశ్చయార్థులై యుత్తమ
గజంబు నలంకరించి దానికరంబున నొక్క పుష్పమాలిక యిచ్చి

"యిది యెవ్వని కంఠంబునం దగులవైచు నతండు మనకు
రా"జని దైవప్రార్థనాపూర్వకంబుగా నియమంబు చేసికొని
దానివెంబడి నేతేర నది యేతెంచి తన తొండంబున నున్న
పుష్పమాలిక యీసుగ్రహుని మెడ వైవ నరాజకత్వదుఃఖ
దుర్బలులై యున్న యామంత్రిముఖ్యులకందఱకు నటమున్న
యితనిదర్శనమాత్రంబున నొక్కసత్త్వవిశేషం బుదయించె.
నయ్యుభయనిమిత్తంబుల నత్యంతసంతుష్టు లగుచు నతనిఁ
దద్గజారూఢునింగాఁ జేసి పురంబునకుం గొనిపోయి రాజ్యాధి
పత్యంబునకుం బట్టంబు గట్టి తత్స్వరూపమాత్రంబ తమకు
మున్ను సత్వదాయకం బగుట సంస్మరించి నత్వదాత్ముఁ డని
ప్రశంసించిరి; యితని నామజాత్యాదు లప్పటి కప్రసిద్ధంబు
లగుట నదియ పే రగుచు దిక్కులం బ్రఖ్యాతం బయ్యె; నట్లు
కాసారపురాధీశ్వరుం డై రాజ్యభోగంబు లనుభవించుచు
నంతట భవజ్జననీజనకు లయినసుముఖాసత్తిమణిస్తంభులఁ దన
పురంబున నిలుపుకొని సేవ సేయుచుఁ గ్రమంబున నీకు నమా
త్యుం డయ్యెఁ; దత్ప్రకారంబులు విస్తరంబుగా శైశవంబు
నంద యేను నీకు విన్నవించినదానఁ, దలంచికొను; మవ్విధం
బున నమాత్యుం డైన వెనుక నంగదేశం బాక్రమించి యందుఁ
గ్రముకకంఠోత్తరనామధేయం బైన యీపురంబు నూత
నంబుగ నిర్మించి నిన్నుఁ బట్టంబు గట్టినది నీకు విదితం బైనది.
చెప్ప నేల? యోవిశ్వవిశ్వంభరామండలేశ్వర! యీసత్త్వ
దాత్ముని కులనామాదిప్రకారంబులు పూర్వంబున నతఁ డడుగ
నపు డేను జెప్పకుండుటకు నిప్పుడు చెప్పుటకు మఱియు

నాఁటి సకలజ్ఞానోదయంబునకు నిమిత్తం బడిగితి; రది విన్న
వించెద; వినఁ నవధరింపు" డని యిట్లనియె. 184

సీ. అట్లు సుగ్రహుఁడు ము న్నా దేవతాలయం
బునఁ బెట్టి క్రమ్మఱఁ బుచ్చుకొనఁగ
మఱచినయట్టి యమ్మణిహారమును మధు
రాపురాశ్రయుఁ డొక బ్రాహ్మణుండు
దైవవశంబునఁ దా నచ్చటికి వచ్చి
కని పుచ్చుకొని పోయి తనగృహమున
బహువర్షములు వేల్పుబలె భక్తిఁ బూజించి
యంతట "నిది త్రిలోకాధిపతికి

తే. యదుకులాభరణంబున కచ్యుతున కు
పాయనంబుగఁ గొనిపోవు టర్హ" మనుచు
ద్వారవతి కేఁగి యతని సందర్శనంబు
వడసి కానుకగాఁ బెట్టె బార్థివేంద్ర! 185

చ. అనయముఁ బ్రీతితో హరియు నాతనికానుక యాదరించి కై
కొని తదభీష్టవస్తువులు గొబ్బునఁ దాఁ గృపచేసి యప్పు డిం
పొనరుచు దండకాకృతిసముజ్జ్వలసంస్తవలీల కెంతయుం
ఘనముగ మెచ్చి యిచ్చె మణికంధరనామునకుం ధరాధిపా.

చ. అతఁడు మహాప్రసాద మని యప్పుడు దానిఁ దగం ధరించి
బాలతఁ గనుపట్టువిష్ణునికలాపము గావునఁ దద్భుజాంతర
స్థితి కిది చాల కొప్పి గళసీమన నెంతయు గుప్తమై;
తదీయతరళ మీవ: చిద్గుణము నాతనికిం హృదయంబు
పోఁకమిన్. 187

ఉ. ఆమణికంధరుండు తుదియం దలఘువ్రతుఁ జేర్చె దాని; నా
భూమిసురుండు నీకొసఁగె; భూరికృపోన్నతి నిచ్చి తీవు నా
కో మహితాత్మ! తత్తరళ మొప్పఁగ నాహృదయంబు సోక ను
ద్దామసుబోధ నైతి శిశుతాసమయంబున నట్లు మిక్కిలిన్. 183

ఉ. క్ష్మావరచంద్ర! నీవు ప్రథమంపుజనిన్ మణికంధరుండ వై
యావిధిఁ గృష్ణుచేఁ బడసి యంతట నిజ్జననంబునందు భూ
దేవవరేణ్యుచేఁ బడసి దివ్యము నమ్మణిహారముం గృపన్
గావృతబుద్ధి న ట్లొసఁగి యంతగఁ జేసితి నన్ను మన్ననన్.

క. ఇటు నటు నేఁ గదలంగ నం
తట హృదయస్థలముఁ బాసి తన్మణి కడ కే
గుట నుడిగెఁ దెలివి య ట్లా
దట నీమంత్రీశుఁ డడుగుతతి నవనీశా! 190

వ. కావున నప్పుడు సత్త్వదాత్తుని నామజాత్యాదు లేను జెప్ప కుండుట కిది కారణంబు; నాఁ డట్లు బోధోదయం బగుటయు నుడుగుటయు నేతన్మూలంబు లని యెవ్వరు నెఱుంగకుండుట నిది సామాన్యహారంబ యను తలంపున మావారు దాఁచి మఱచుటఁ జేసి నాఁటనుండి నేఁటిదాఁక నిద్దివ్యహారం బెన్నఁ డును ధరియించుటయు లేదు; నేఁ డాభరణ భరణసమయం బున బ్రసంగవశంబునఁ దలంచుకొని చెలులు తత్ప్రాప్తి ప్రకారం బెఱింగింప నిది సుముహూర్తారబ్ధంబైన ప్రథమ భూషణం బనియు భవద్దత్తం బనియు నత్యాదరంబునఁ దెప్పించి హృదయభాగస్పర్శినాయకరత్నంబుగా నిప్పుడు ధరియించియున్నదాన నిచ్చోటికి నిప్పుడు నూపురంబులు గొనుచు సత్త్వదాత్తుం డేఁగుదెంచిన "నింతలోపలికొలువునకు

వచ్చుపాటిచనుపుకలిమికి నితం డెంతభాగ్యవంతుఁడో కో!"
యని యొక్కించుక భాషింప నితని జాత్యాదు లిన్నియు
మదీయహారనాయకమాణిక్యంబు మాహాత్మ్యంబున నిట్లు
చెప్పఁ దోఁచె; భూతభవిష్యద్వర్తమాన భువనప్రపంచంబు
నందు నెద్దియైన దేవరకుఁ దెలియవలసినయది కరతలామలక
సమానం బై కనంబడియెడు. దీని ధరియించి చూడుఁ" డని
యనుపమ స్తనకుంభ లక్ష్మి తెఱచాటున న ర్తకి తెఱంగునఁ గించి
త్ప్రకాశాప్రకాశరూపం బగుచు నపూర్వంబు నెఱపు నమ్మహా
నీయరత్నమాలికఁ దనదుపయ్యెద వెలుపలికిం దిగిచినం జూచి
యా జగతీవల్లభుండు. 191

ఉత్సాహ. "తివకు మట్లయుండనిమ్ము; తిరుగఁ బుచ్చుకొనుటయొ
ప్పవు నే నీకు నిచ్చినట్టిహార మట్ల యుండఁగా
నువిద దీనిమహిమఁ దెలుపఁ టొప్పఁ గాక యన? బలీ
యవనినాథ! జాణ; విది యుపాయ!" మనుచు నవ్వుచున్.

తే. ఒఱగుమీఁదటఁ జేరి కూర్చున్న ప్రియుని
యురము తరళంబు సోఁక మే నొయ్య వంచి
"కనఁగ వలసినయది కనుం" డనుచు నంతఁ
గుచభరాలసవోలె నక్కునను వ్రాలె. 193

క. "వనజాక్షి! యిపుడు గనవల
సినయది నా కిదియె" యంచుఁ జెలువుఁడు తమకం
బునఁ గౌఁగిలించె నిరు గే
లను బిగియారంగ మధురలాలసఁ బ్రేమన్. 194

చ. మదితమి నంతటన్ నిలక మానవనాథుఁడు చిత్తభావశం
వదబహుచేష్టితుం డగుచు వర్తిల "నేమిటికిం గడంగి యె

య్యది దొరకొంటి! మేలనుచు; నబ్జజుఁ డిద్దఱిఁ జంచలాత్ముల
సదృశుల లెస్స కూర్చె జతనంబున" నంచులతాంగినవ్వఁగన్.

ఉ. అంతట నెట్టకేలకుఁ బ్రియాంగనప్రార్థన నవ్వసుంధరా
కాంతుఁడు తేటతెల్లమిగఁ గాంచెఁ దదుక్తకథాప్రపంచ మ
త్యంతము సత్యమౌట మహితంబగుతత్కుచమధ్యరత్నసం
క్రాంతిని హృత్ప్రదేశ మెసఁగన్ మది నించుక పాఱఁ జూచు
చున్. 196

వ. అంతట సత్త్వదాత్ముండు శాపమోక్షంబున నాబాల్యానుభూత
పదార్థజాలంబంతయుఁ దనంతన యాత్మసంస్మరణగోచరం
బగుచు నటమున్న మధురలాలసచేతఁ దా వినిన [1]వి కలిగి సరి
దాఁకుచుఁ బ్రమోదంబు నద్భుతంబు నాపాదించుచుండ
నేఁగుదెంచి తగిన యవసరంబు దెలిసి యాకళాపూర్ణమహా
రాజుం గాంచి తనకుఁ బునఃప్రాప్తం బైన యామొఱుక
తెఱంగు విన్నవించి మాయమ్మ మధురలాలస దేవరకు భిక్షుక
కాముకత్వంబు కడముట్ట విన్నవించెనేమో? యిట్లు శాపవిము
క్తుండ నైతి నని యనేకప్రకారంబుల నాపుణ్యదంపతుల
సంస్తుతించి "తొల్లింటినాఁటి మహారాష్ట్రరాజ్యభోగంబు
కంటె ననేకగుణంబుల నధికం బై యిప్పటిదేవరపాదపద్మ సేవ
పరిపూర్ణసౌఖ్యంబు నొసంగుచున్నది; యది యెల్ల కాలంబు
నాకుఁ గలుగ ననుగ్రహింపవలయు" నని సాష్టాంగప్రణామం
బాచరించె; నతండు మధురలాలసాబంధుత్వవిశేషజ్ఞానంబున
నతని నెప్పటికంటె మిక్కిలి గౌరవించి గృహంబున కనిపి,
మఱియు నభిమతవస్తుబోధసాధనేచ్ఛల మధురలాలసాపరిరం
భణసుఖంబు లనుభవించుచుండె; నప్పుడు. 197

1. వినుకలికి.

ఆ. ఉభయహృదయదేశ యుగపన్మణిస్పర్శ
మహిమ నొక్కరొకరి మక్కువపస
లొక్కమాఱు యొక్క రొకరి కేర్పడఁ దదా
శ్లేషసుఖము మిగులఁ జిత్ర మయ్యె. 198

క. శుభధర్మ శీల యగువ
ల్లభయత్నముచేత నపు డిలాపతి దనపై
నభినవకౌముదికిం గల
సుభక్తి గని తదుచితంబు చొప్పడ నడపెన్. 199

చ. అలఘుతరానుభావ యగు హైహయకన్యక హారశక్తిచేఁ
దెలివియు వాక్పటుత్వమును దేజరిలన్ నిజపూర్వవాసనా
బలమున వల్లకీరణనపాటవ మెంతయు మీఱ దిద్దె భూ
తలవిభుఁ [1]డగ్రతం బనరి తద్దయు గానకళాప్రవీణగన్. 200

చ. సకలమహీజనావనవిచారము సంధిల నంత నోలిమై
నకలుషధర్మశోభిని మదాశయపుత్త్రిక యత్న మొప్ప భ
ర్తకుఁ దెలిపెన్ స్వరాష్ట్రపరరాష్ట్రగుణాగుణవర్తనల్ సనా
యకపరిరంభకాలముల నప్పటి కప్పటి కెచ్చరించుచున్. 201

సీ. "తా విన్న కన్నయర్థముఁ జెప్ప కడఁచెవీఁ"
డని తెల్పి శిక్షించుఁ దనదుచెలుల
"రిపులకు లోనిచ్చె; నపరాధి యయ్యె వీఁ"
డని యమాత్యులతప్పు లరసి యడఁచు
"మ్రుచ్చిలఁ దలఁచె వీఁ డిచ్చలో" నని మూఁద
లించి దండించు మలిమ్లుచులను

1. దప్పు డగ్రసతిఁ దద్దయు.

"నాలితో రే యీతఁ డతిమాత్రమున నల్గెఁ
దగ" దని చెప్పించుఁ దగినరీతి

తే. మధుర[1]లాలస సపరిరంభణవిశేష
సమయహృద్దేశఘటితతచ్చారుహార
తరళమాహాత్మ్యమున సమస్తజ్ఞుఁ డగుచు
భువన మరుదంద నాకళాపూర్ణుఁ డపుడు. 202

వ. అంత నొక్కనాఁ డతండు మధురలాలసతోడ నేకాంతంబున నుండి సర్వజ్ఞత్వకారణదివ్యమాణిక్యప్రశంసాప్రసంగంబున విష్ణుదేవునిమాహాత్మ్యంబు తలంపునం బొడమఁ దదీయకీర్తనం బిహపరసాధనం బని సంభావించుచుఁ దత్ప్రసంగవశంబున. 203

తే. ఆదిజన్మంబునందు ననంతశయన
పద్మనాభునిసన్నిధి భాగవతుల
వచనమున రమావిష్ణుసంవాదనకథ
తా నొనర్చుట మదిలోనఁ దలఁచుకొనియె. 204

క. ఈపగిదిఁ దలఁచుకొన సుక
లాపంబుగ దాని మధురలాలస మధురా
లాపములచేత వినుటకు
భూపాలునిమదిని వేడ్క పొడమెఁ మిగులన్. 205

ఆ. ఇట్లు వేడ్క పొడమ నిందుబింబానన
యాననంబుఁ జూచి యానృపాలుఁ
డాదరాతిశయము ననురాగమును గరం
బలరుచుండ నిట్టు లనుచుఁ బలికె. 206

1. లాలసాపరిరంభ విధివిశేష.

ఉ. "ఆదిమ మైనజన్మమున నంగన! యేను రమాముకుందసం
వాద్యము కావ్యరూపమున వర్తిలఁ జేసితి నంచు వింటి బా
లోచ్యదితత్రావకీనమధురోక్తులలో; నది నీమణీగుణ
శ్రీ దనరార నారసి యశేషము నిప్పుడు చెప్పఁగాఁ దగున్.

క. నీపరిరంభణమహిమను
దీపించు మగు తెలివివేళఁ జిరముగ నది యే
నోపఁడఁతి! కనుట లే దెవఁ
డైనపై నీమీఁదితమి విభాసిలు చునికిన్." 208

వ. అని పలుకు ప్రాణవల్లభుని పలుకులకు నగుచు నమ్మగువ యో
జగతీవర! దేవరమది కిపు డెయ్యది ప్రియం బదియ చేయుట
నాకునుం బరమప్రేమాస్పదంబు గావున నప్పావనకథ యెల్ల
వినుపించెద; విన నవధరింపు మని పలికి, తనకు సకలజ్ఞాన
నిదానం బగుచు హృదయప్రదేశంబు నలంకరించుచున్న
దివ్యహారనాయకమాణిక్యంబునకు నంజలిచేసి, తదీయప్రాప్తి
కారణంబులైన యాకళాపూర్ణు నలఘువ్రతు మణికంధరుఁ
గృష్ణుని విప్రుని సుగ్రహు వటపత్రశాయిని హృదయం
బునఁ దలంచి, యీగురుపరంపర నాకు ననుగ్రహకారిణి
యగుఁ గావుత మనుచుం బ్రణమిల్లి, యాలక్ష్మీనారాయణ
సంవాదకథ తొల్లిటి మణికంధరోక్తప్రకారంబున నిట్లని
చెప్పం దొడంగె. 209

సీ. అమృతపూరాశ్చర్యతమవిరజానదీ
సీమావరుద్ధసంసృతికథంబు
పరిగణనాతిగబ్రహ్మాండబుద్బుద
ప్రకృతిపాథోధిపారాయితంబు

సూర్యచంద్రాగ్ని తేజోనిరపేక్షణా
ప్రాకృతస్వప్రభాభాస్వరంబు
స్వేచ్ఛాభిగృహీతసమిద్ధవిశుద్ధస
త్త్వశరీరనిత్యముక్తవ్రజంబు
తే. నగుచుఁ బెంపొందునిఖిలవేదాంతసిద్ధ
పరమకళ్యాణగుణచణబ్రహ్మతత్త్వ
సతతసాక్షాత్క్రియావిభూషితనిజాను
భవసుఖితకోవిదము శౌరిపరమపదము. 210

తే. చిదచిదీశ్వరాత్మకము నశేషజగదు
పాశ్రయము తోయహుతవహపవనవియద
హంక్రియామహదవ్యక్తకావరణము
నగునజాండాలికవల నజ్జగము మెఱయు. 211

క. గణుతింపఁ బ్రకృతిదోషము
లణుమాత్రము లేవు; గాని యచటఁ బరగు స
త్ప్రణుతబ్రహ్మాదిజగ
ద్గణమహిమ లనంతకోటిగుణాత సమృద్ధిన్. 212

క. అరము నరణ్యము ననఁగా
శరధు లమృతమయము లచట[1]శతకోర్మిసము
త్కరశీకరశీతలతర
మరుదురుపులకిత తటద్రుమము లై యమరున్. 213

క. ఆవిష్ణులోకమున [2]కవ
మావాహిని విరజ యమరు మానితమోక్ష

1. c జటులోర్మి; సతతోర్మి. 2. సీ, మా.

శ్రీవరణారాగభాగవ
తావళి శుభలగ్నసమయ యవనికపోలెన్. 214

శా. ఆసింధూత్తముచేసువన్ సరసియుం గైరస్యవీయంబు నా
భాసిల్లున్ జలనీలికాకబరికాపద్మాస్య పుష్పంధయా
ళీసంవీక్షణవీచికావళి మృణాళీబాహుకాశోక స్తన
శ్రీసంపాదితమూర్తిము క్తిసలక్ష్మీమండలి [1]కర్తయై. 215

తే. ఆసరోజాకరముపొంత నతిశయిల్లు
బిల్వభూరుహ మొకటి శోభితపలాశ
విసరకిసలయసముదయోల్లసనమహిమ
నచిరళస్థితిశుకపుంజ మనఁగఁ దనరి. 216

ఆ. ఇంపు మీఱు నచట నెంతయు నశ్వత్థ
శాఖి యొకటి సామవన మనఁగ
మహిమతో సువర్ణమయము శాఖాత్రయీ
శోభితంబు నగుచు శ్రుతులు పొగడ. 217

చ. నెలకొని యమ్మహీరుహమునీడను బంచశతాప్సరస్సుమ
ధ్యలు సువర్ణకజ్జలపటాభరణంబు లనేకముల్ కరం
బుల ధరియించి వర్తిలుచు ముక్తత నచ్చటి కేఁగుదెంచువా
రల కెదురేఁగిచేయుదురు ప్రౌఢిమ సంధిలఁగానలంక్రియల్.

సీ. కలికికన్గొనలచూపుల పేరఁ బువ్వు మ
వ్వపునల్లఁగల్వలు వైచి వైచి
మందహాసము లను చందనోదకములు
పలుమాఱు మోములఁ జిలికి చిలికి
హారంబు లిడుచు బాహాసుచిహ్నలమున

1. తర్క్యమై.

భుజములందు హరిద్రఁ బూసి పూసి
శ్రుతిభూషణము లమర్చుచు హస్తకాంతికుం
కుమములు చెక్కిళ్లఁ జమరి చమరి

ఆ. యలరఁ జేయు నచ్చరలపిండు ముక్తిక
న్యలను బెండ్లియాడి బులియుచున్న
క్రొత్తపెండ్లికొడుకుఁ గోమరుల సయ్యాట
లాడుతద్వధూవయస్య లనఁగ. 219

వ. ఇవ్విధంబునఁ బరమాద్భుతం బైనయాభువనోత్తమంబునందు.

తే. ఉభయకర్మతంత్రులకు నయోధనీయ
మగుట నామ్నాయము లయోధ్య యని నుతింప
వాఙ్మనసగోచరము గాని వైభవమునఁ
బ్రబలు రాజీవలోచనురాజధాని. 221

సీ. ఘట మంచుఁ బటమంచుఁ గారుయుక్తులఁ బెంచు
దుష్టతార్కికులకు దూర మగుచు
శ్రుతి యంచు స్మృతు లంచు శుష్కకర్మము లెంచు
మీమాంసకుల కప్రమేయ మగుచు
ఝరి యంచు ఖరి యంచు జనులవీరుల నొంచు
శబ్దైకరతుల కసాధ్య మగుచు
మృష యంచు మిష యంచు విషయోక్తిఁ గలహించు
నద్వైతపరుల కప్రాప్య మగుచుఁ

తే. కృష్ణ! విష్ణో! హృషీకేశ! కేశవ! యను
భక్తుల కొకప్పుడును దుర్లభంబు గాక
పరఁగుఁ బ్రకృతవికారదుస్పర్శతరము
గురుతరానందఝరము వైకుంఠపురము. 222

చ. తడఁబడుచుండు నందు నమృతంబుఁగొలంకులు రౌప్యభూము
లున్, వెడలుపుపచ్చరాచలువనేలలు పచ్చికచోట్లఁ గెంజిగీ
జడిగొనుపద్మరాగమణిసౌధములుం దలిరాకుప్రాఁకులుం
బడఁతులపిండు భిత్తిగతభాసురతత్ప్రతిబింబజాలముల్. 223

క. పరమసుమనోమనోజ్ఞతఁ
గర మాత్మారామపరవికాసము దనరం
గరువపుఁజరితలగరితల
గరగరికలగరిమ నంగగరిమకు నమరున్. 224

చ. "విరులు రచింప నేల తమ వింతగునవ్వులసొంపు గల్గఁ? గ
స్తురికలయింపు లేల తమచొక్కపుఁజూపులయింపు గల్గఁ? గ
ప్పురముల మ్రుగ్గు లేల తమపుణ్యనఖద్యుతిపెంపు గల్గ?" నం
చదుదుగఁ జూపఱుల్ పొగడ నయ్యుయిలీలఁ జరింతురంగనల్.

సీ. విమలపాండిమ పేరఁ బరిశుద్ధసత్త్వంబుఁ
దలిరాకునెపమున నలఘుకృపయు
దళమిషంబున నాత్మఁ గలకృష్ణకాంతియుఁ
బుష్పాళి నాఁ గల్మిపొలఁతిడాలు
మధుకైతవమున సమ్మదబాష్పధారలుఁ
గలికాఫలంబునఁ బులకములును
సౌరభసంజ్ఞ సుజ్ఞానవాసనయుఁ జే
రెలమి పేరిట సౌఖ్యవిలసనంబు

తే. వెలఁ బ్రకాశింప నిత్యముక్తులు నిజేచ్ఛఁ
గొమరు మీఱంగఁ దమలతాకుంజరూప
ధారు లగుచు వర్తింతురు తత్పురంపు
బహువిధోద్యానవాటికాభ్యంతరముల. 226

చ. అలిశుకకోకిలాదివపురాశ్రయలీలఁ దముక్ భజించుని
త్ర్యల సుమనఃఫలాదిపరితుష్టులఁ జేయుచు వారుఁ దాము
ముక్తులకు వినోదశీల సమకూర్తురు వృక్షలతాదులైనవా
రలు "హరిదాసు లెప్పుడుఁ బరప్పరభక్తిపరాయణుల్ గదా!"

సీ. కొన్ని సౌభాగ్యసంపన్నలక్ష్మీపదాం
భోజలాక్షాలక్ష్మీపూజితములుఁ
గొన్ని భూదేవీవిఘూర్ణత్కటాక్ష వీ
క్షాపక్ష్మలితగుళుచ్ఛవ్రజములుఁ
గొన్ని నీళానఖాంకూరవిన్యాసచం
ద్రకితప్రవాళసంతానకములుఁ
గొన్ని భాగవతలోకోన్నతక్రీడాపి
భూషితచ్ఛాయా విశేషితములు

తే. నగుచుఁ బరవాసుదేవవిహారకుతుక
విభవముల కాస్పదంబులై వెలయుచుండుఁ
దత్పురోద్యానములు నిరంతరపరాగ
పుష్పరసవృష్టి శీతలభూతలములు. 228

వ. అట్టి దివ్యవస్తువైభవంబులఁ గరంబు గనుపట్టునట్టి యాపట్టణ
మధ్యప్రదేశంబునందు. 229

సీ. రవిచంద్రకోటితిరస్కారధౌరేయ
మహనీయదీప్తిసంపదలఁ బొదలి
వేదప్రసిద్ధమై వెలయునద్భుతరత్న
మయసహస్రస్తంభ మంటపమున
మహితవిభూతియుగ్మవిచిత్రరూపమై
ధర్మాదిసూరిపాదములతోడఁ

జెలువొందు మాణిక్యసింహాసనమున స
హస్ర [1]దళాబ్జమధ్యంబునందు
తే. శేషతల్పాధిరూఢుఁడై సిరియు ధరయు
నీళయును భజియింపంగ లీల నుండుఁ
గేవలభూరివిలాసానుభావభావి
తాఖిలాజాండవర్తనుం డచ్యుతుండు. 230
తే. ఆసహస్ర [2]పత్రంబు పూర్వాది గాఁగ
సకలదళముల విమలాదిసతులు నిలిచి
హరి భజింతురు చామరహస్త లగుచుఁ
గమలనిలయ లీలావతారములరీతి. 231
చ. అతులితభక్తిఁ బూర్వదిశయందు ననుగ్రహ యవ్వధూటి
దాఁ,గుతుకము మీఱఁగాఁ బసిఁడికుంచియవైచుచుఁ గొల్వ
సేయు సం,తతమును హస్తకంకణఝణత్కరణ క్వణనంబు
లవ్విభుఁగా, జతన "సరాకు స్వామి!" యనుశబ్దములాగున
నెచ్చరించఁగన్. 232
సీ. శయనాసనాంశుకచ్ఛత్రాదికంబులు
దాన యై ఫణికులోత్తముఁడు గొలువ
ధ్వజము వాహనము వీవనయు నాదిగఁ బెక్కు
రూపులై గరుడుఁ డాదూఢిఁ గొలువ
వఱలువిద్యాధిదేవత యైనవేత్రంబుఁ
బూని సూత్రవతీవిభుండు గొలువ
నారతకత్వ మింపారఁ దత్పురిఁ గాచు
కుముదాదినిత్యసంఘములు గొలువ

1. దళాఖ్యపద్మాంతరమున. 2. పత్రమునఁ బూర్వాది.

తే. భువనముల దుష్టనిగ్రహంబునకుఁ దాన
పాలు పడియున్న యాయుధపంచకంబు
జయజయధ్వను లెసఁగంగఁ జారుపురుష
భావమునఁ గొల్వ నావిశ్వభర్త మెఱయు. 233

మధురగతిరగడ.—

కెంపమ్ముల నడఁకించుపదంబులు
నింపు వైభవము నేలునఖంబులుఁ
గర మరుదగుచొక్కపుఁజిఱుతొడలును
గరికరవిభవముఁ గాదను తొడలును
బదియార్వన్నియ బంగరువలువును
మెదలెడితళుకుల మేఖలచెలువును
భువనజనకుఁ గనుపొక్కిలివిరియును
దవిలి యురంబునఁ దనరెడుసిరియును
నరయ జీవమయ మగుకౌస్తుభమును
నెరయు వైజయంతీ సౌరభమును
బ్రకృతిమయతఁ జొప్పడు శ్రీవత్సము
వికసిల్లఁగఁ బర్వెడు ఘనవత్సము
నహంక్రియాత్మక మగుశంఖంబును
మహనీయమనోమయచక్రంబును
దనర నొకవిచిత్రపుసోయగమును
ననువు పఱచుహస్తాంబుజ యుగమును
నురగతల్పమున నూఁదినకరమును
బరఁగిన జానువుపై నొకకరమును
నవ్యమకరకుండలసువిలాసము

భవ్యకపోల ప్రకటితహాసముఁ
బవడమును గణింపని నెమ్మోవియు
నవచంపకనిభనాసికశోభయుఁ
దెలిదమ్ముల నగుతీరునయనములు
పోలు పలరెడు కనుబొమలచెలువములుఁ
గనుఁగొన నింపగుకస్తురినామము
ననుపమాన మగునలకస్తోమముఁ
గలకల నగుచక్కనివదనంబును
ధళధళ మనురత్నకిరీటంబును
ననుకృతజలధర మగువర్ణంబును
నినకోటుల నగియెడుతేజంబును
గలుగుదివ్యమంగళవిగ్రహమును
నలశుభశక్తిని త్యానుగ్రహమునఁ
బరఁగురమావిభుఁ బరమపదేశ్వరు
నిరవద్యాత్మకు నిత్యు నిరీశ్వరు
నజు నచ్యుతు హరి నఘసంహారుని
త్రిజగన్నాథునిఁ ద్రిగుణవిదూరుని
నఖిలశేషిఁ గరుణైకపరాయణు
నిఖిలవేదవర్ణితు నారాయణుఁ
గొలిచి నిత్యముక్తులు ప్రమదంబున
నలరుదు రక్కడ నతివిభవంబున. 234

వ. అందు. 235

సీ. తనవిలోచనసంజ్ఞ దవునకు భువనస
ర్గముఖక్రియాచార్యకంబు నడపఁ

దనవిలాసంబు కాంతునకు శృంగారసా
    మ్రాజ్యనీతిధురీణమంత్రి గాఁగఁ
దనదర్శలీల నాథునకు దశాకృతి
    [1]ప్రకృతికాసూత్రధారత వహింపఁ
దనముద్దుఁబల్కు భక్తవితానవాత్సల్య
    కల్పిరాకారవికాసకారణముగ
తే. నఖిలకళలందుఁ దోడునీ డగుచు మెలఁగు
నధిపునకుఁ బాలమున్నీటియాఁడుబిడ్డ
యరిది మక్కువ [2]టెక్కున నపిరతంబు
నురము డింపక యతఁడు న న్నుపచరింప. 236

ఉ. ఆజగదేకమాత తగునట్టిప్రసంగవశంబునన్ సము
ద్వేజకభూరిసంసృతినవీనదవానలతప్యమాననా
నాజనకోటిఁ బ్రోచుకరుణారస మూర్త్యఁ గడుం దొలంక నీ
రేజదళాక్షుఁ జూచి మృదురీతిఁ[3] దలిర్పఁగ నప్పు డిట్లనున్.

క. దేవా యిప్పు డొకయర్థము
దేవర నడుగంగ బుద్ధి దివిరెను మిగులన్
నావిన్నపము ప్రసాద
శ్రీ వెలయఁగ నొకటి యవధరింపఁగ వలయున్. 238

ఉ. ఈభువనంబు లెల్ల సృజియింప భరింప హరింపఁ గర్త వై
శోభిలువాఁడ వీవ మధుసూదన! యంబుజసంభవుండుఁ జే
తోభవవైరియున్ క్రమముతో భవదీయకృపాసమర్పిత
ప్రాభవు లై కదా కనిరి పన్నుగ సర్గలయాధికారముల్. 239

1. ప్రకరణసూత్ర. 2. పెక్కువ. 3. వినీతిదలిర్పనిట్లనున్.

తే. జీవకోటుల నుభయకర్మావళీఫ
లానుభవమున దరి చేర్ప నాత్మఁ దలఁచి
నీవు బ్రహ్మాండసృష్టిరక్షావిలయము
లిట్లు గావింతు వని నుతియించు శ్రుతులు. 240

ఆ. అదియుఁగాక మొదలు తుద లేనిసుకృతిదు
ష్కృతిక్రియలు భోగమునఁ దరింపరామి
నరసి యాత్మబోధనార్థమై వేదశా
స్త్రములు గలుగఁ జేసె తమలకృపను. 241

ఉ. అట్టిశ్రుతిస్మృతుల్ దెలుపునట్టియుపాయము నాచరింప కి
ట్టట్టు చరించి ముక్తి కెడయైనజనంబులఁ బ్రోచుసత్కృపాక
నెట్టన రామకృష్ణముఖనిర్మలమూర్తులు దాల్చి తీవు ని
న్నెట్టు నుతింపనేర్తుఁ [1]బరమేశ! యకారణసత్కృపాకరున్.

ఉ. ఇంచుకయేని వేసరక యీగతిఁ జెక్కిలిగొట్టి పాలు ద్రా
గించువిధంబునన్ బలిమిఁ గేశవ! నీవు హితంబొనర్చుచో
నెంచఁ గృతార్థుఁ డొక్కఁ డొకఁ; డింతియె కాని సమస్తజీవు
లుం,గొంచకయంతకంతకును గ్రుంకెదరుగ్రభవార్ణవంబులోన్.

క. ఇది యంతయు నీమాయా
భ్యుదయవిలాసంబు దెలియఁ బురుషోత్తమ! నీ
మదిలో నెయ్యది దలఁచిన
నొదవక మాన దని తోఁచుచున్నది నాకున్. 244

ఉ. కావున నెల్లజీవులకుఁ గారుణికోత్తమ! నీయనుగ్రహ
శ్రీవిభవంబుచే నమృతసిద్ధిగఁ గోరెద సర్వశేషి వే

1. బరమేశు నకా.

దేవరకున్ విభేదము మదిం గలదే యొకకొందఱన్ భవా
భావముఁబొందఁజేయ భవబంధులఁ గొందఱఁజేయ నచ్యుతా!

వ. అని యివ్విధంబున సకలరక్షణార్థంబుగాఁ బరమకరుణావేశ
కలితహృదయ యగుచుఁ బలుకు తన నెయ్యంపుఁదొయ్యలి
తియ్యంపుఁబలుకుల కయ్యంబుజాక్షుం డిచ్చ మెచ్చుచు
నత్యాదరంబున నమ్మత్తకాశినిఁ బ్రసాదమేదురదరహసిత
లోచనంబుల వీక్షించి. 246

క. "జనకునకం టెను జననికిఁ
దనయులపై వత్సలత్వధర్మము మిగులన్
ఘన మం దుప్రగాన నీకీ
యనుపమకారుణ్య ముచిత మరవిందముఖీ! 247

ఉ. అంబుజపత్రాక్షి! నీపలికినట్లు యసంకుచితప్రభావధా
ర్ష్ట్యంబున నేఁ బ్రవర్తిలుట సత్యమ యైనను వారివారిక
ర్మంబులు చూడక కందఱి సమంబుగ నెవ్విధిఁ బ్రోవవచ్చు నెం
దుం బరికించిచూడ గుణదోషవివేక మనార్యకృత్యమే? 248

వ. ఆర్యానార్యకర్మంబు లేను బ్రియాంగంబులు గాఁ గొనుట
కును దదుభయవ్యవస్థానిమిత్తంబైన వేదరూపాజ్ఞ లోకం
బున నిలుపుటకును గారణంబు మత్స్వాతంత్ర్యంబ; కావున
వారివారికర్మంబుల వెంబడిన యేను శుభం బొనరించుట
స్వాభావికంబుగఁ దెలిసికొమ్మని యిట్లనియె. 249

క. విను మక్షీణసుశుభవ
ర్తన కించుక బుద్ధి జనుఁడు దలకొల్పినమా
త్రన యది యే నీడేర్చుచు
ఘనకారుణ్యమునఁ బ్రోతుఁ గంజదళాక్షీ! 250

చ. సుకృతములందునుం బరమశోభన మైనమదర్చనాదిసి
ద్ధికి [1]ధరణీజనంబుల మదిం దలఁపోల్పన కాదె యేఁ గృపా
ధికత దశావతారసముదీర్ణవిహారము పూనుటల్ దురా
త్మకులకుఁదన్మహామహిమదర్శనముల్ వృథయేమి సేయుదున్. 252

వ. మఱియును.

క. అమృతపదప్రాప్తి కుపా
యములగు మత్పూజనాదు లఖిలజనులకున్
సమకూర్పనె యుండుదు ని
త్యము శ్రీరంగాదిదివ్యధామములందున్. 253

తరల. ఇదియుఁ జాలక యింకనుం గృప నెల్లజీవులఁ బ్రోవ నీ
మదిఁ గడుం దమకించితేనియు మానసంబున నాకు స
మ్మదము మిక్కిలి ; యెంచి చూడ సమస్తజీవదయాళుతా
భ్యుదయ మెవ్వరి కింపు గాదు పయోజపత్త్రవిలోచనా! 254

వ. కావున నీప్రార్థనంబునం జేసి యిప్పు డొనర్చువిశేషంబు విను. మట్లు లోకానుగ్రహార్థంబుగా నేను నిత్యసన్నిధిస్థానంబులుగా నంగీకరించిన శ్రీరంగకాంచీవేంకటాచలాహోబలపురుషోత్తమాదిదివ్యస్థలంబుల కరిగి సేవింప నోపకున్నను దమ యున్నచోటనే యుండి తత్తద్దివ్యదేశనివాసు నన్ను నిజేచ్ఛానుసారంబునఁ దలంచి కేలు మొగుచువారిని సంసారంబునుద్ధరింపఁ జేయుదు" నని యానతిచ్చిన సంతసిల్లి "యదియె చాలు" నని యమ్మహాదేవుని దీనవాత్సల్యంబు ననేకప్రకారంబుల సన్నుతించె" నని చెప్పి, మధురలాలస యాకళాపూర్ణమహారాజుఁ గనుంగొని యిది యిప్పుడు మీర లడిగిన

1. ఁజలఁపుల్ జనం.

భవదీయపూర్వజన్మవిరచిత లక్ష్మీనారాయణసంవాద కథా ప్రకారంబు; దేవరప్రశ్ననిమిత్తంబున నిశ్శ్రేయససులభో పాయంబు దొరకె; నేఁడు సుదినం బయ్యె; మదీయజన్మంబు సఫలంబయ్యె" నని పలికి శ్రీరంగాదిదివ్యదేశమాహాత్మ్యంబు నకు వెఱఁగందుచు "నింత భక్తవత్సలుండవే!" యని పరమపురుషు నఖిలలోకైకనాథు నారాయణుఁ దలంచి ప్రణమిల్లె; గళాపూర్ణుండును దదాదిగా నత్యాదరంబున విష్ణుసేవ గావించుచు ధర్మమార్గంబున రాజ్యపరిపాలనంబు సేయుచు. 255

తే. సమ్మదము మీఱఁ దనయగ్రజాయయందు
మధురలాలసయందు నమర్త్యనిభుల
సుతులఁ గాంచెఁ గ్రమంబున సుప్రసాదుఁ
డనఁగ సరసుఁ డనంగఁ బెంపారు ఘనుల. 256

క. వల పమరఁగ నవవర్షం
బులసతిఁ దనకేళి కొదవి భోగక్రియ నిం
పల రెడునట్టుగఁ జేసెం;
దలఁపఁగ నిది చిత్ర మనఁగ ధర నతఁ డేలెన్. 257

తే. ఆయిలాతలవిభుమహనీయకీర్తి
పుండరీకంబుఁ బాయక యుండులక్ష్మి
వేడ్కఁ దాల్చినసంపంగివిరులబంతి
కరణిఁ గాన్పించు బ్రహ్మాండ మరసి చూడ. 258

ఉ. ఆయవనీశ్వరుల్ విమతు లాజి నెదుర్కొనుపాటివారు లే
రేయెడఁ; గల్గినన్ ప్రణము లించుక తప్పలపక్షకోటికిన్

జేయఁగ లేదు ; చేసినను జృంభితతన్మదకుంభికుంభవ(ం)
శ్యాయతనిర్ఝరీకుచములందనిశ యన్నఖఘాతమాత్రముల్. 259

శా. తద్ధాటీసమయంబులం జటులగంధశ్యావళీపాదాహతి
ప్రోద్ధూతక్షితిధూళి నింకెడుమహాంభోధిన్ ద్వీపన్మండలీ
శుద్ధాంతప్రమదావిలోచనము లశ్రుప్రాప్తిచేఁ గ్రమ్మఱన్
వృద్ధిం బొందఁగఁ జేయు మీనసఖతావిఖ్యాతి సార్థంబుగన్.

ఉ. రూపవిలాసవైభవనిరూఢిన శాంబసమాస్త్రకౌశలుం
డాపృథివీశుఁ డొండొకక్రియం బరికించిన మన్మథుండ యను
దీపితకాంతుఁ దద్ధనుపదీర్ణవిహారము చేత శాత్రవ
క్ష్మాపతులన్ నిలింపపురకాంతుల నొండొరుఁ దోడఁగూర్పుటన్.

ఉ. ధీరుఁడు శూరుఁ డక్షయవితీర్ణవిహారుఁడు బంధులోకమం
దారుఁడు నీతిమార్గసముదారుఁడు లోకపవిత్రకీర్తివి
స్తారుఁడు దోషదూరుఁడు నితాంతగభీరుఁడు నిత్యశోభనా
కారుఁడు ధర్మసారుఁ డవికారుఁడు తజ్జనపాలుఁ డెయ్యెడన్.

తే. అతనిగుణము లెన్నఁగఁ జతురాస్యుఁ డైన
నచతురాస్యుండు ధిషణుండు నధిషణుండు
ధర నహీనుండు హీనుండు దశముఖు ల
దశముఖు లని మఱి వేఱ తడవ నేల ? 263

ఉ. పూర్ణసమస్తసద్గుణవిభూషితుఁ డై పొలుపొందు నాకళా
పూర్ణుకథల్ వినం జనువఁ బొల్పుగ సంతతివైభవాదివి
స్తీర్ణశుభంబు కల్మి కజుఁ డీవన మున్నది గల్గెఁ గాన నా
నిర్ణయమార్యు లెల్ల మది నిల్పి వినుండు పఠింపుఁ డింపుతోన్.

ఉ. భవ్యత నెల్లదేశములఁ బ్రస్తుతి కెక్కుచు మీఱి యిమ్మహా
కావ్యము సుప్రసిద్ధ మగుఁ గావుత నిత్యము సర్వలోకసం

స్తవ్యనిజస్మృతిన్ వెలయుతాండవకృష్ణుకృపన్ పవిత్రశా
స్త్రవ్యసనాతిధన్య మగు సజ్జనకోటియనుగ్రహంబునన్. 265

శా. శ్రీరోచిష్ణుకటాక్షవీక్షజయలక్ష్మీసంతతాశ్లేషయో
గ్యారాజద్భుజ యారవీటిపురబుక్కక్షోణిపాలాన్వయ
క్షీరాంభోనిధికౌస్తుభాయితమహాస్థేమోదయప్రస్ఫుర
న్నారత్నావరపౌత్రగోత్రతిలకా నంద్యాలకృష్ణాధిపా. 266

క. శోభితవైభవ! రూపమ
నోభవ! కొండాంబికాతనూభవ! భూతి
శ్రీభవ! పరిశమితారి
ప్రాభవ! బుధవర్ణ్యమాన! రామసమానా! 267

వనమయూరము. శైలవరధీర! నిజసంగరపవిత్రా
ణాలఘువిచార! విచార! సకలాంగనుతగోత్రా
పాలనవిహార! యవిభంగజయయాత్రా
శీలనగధీర! నరసింగవిభుపుత్రా! 268

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళి యమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామధేయప్రణీతం బైన కళాపూర్ణోదయం బను మహాకావ్యంబునందు ప్రబంధపరిపూర్తిశోభనం బైన యష్టమాశ్వాసము సర్వంబును సమాప్తము.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1965—2000 కాపీలు.

శ్రీరస్తు.

# కళాపూర్ణోదయము

# *కఠినపదములకర్థము

పీఠిక

1. కాశ్మీరము = కుంకుమపూవు, ప్రకాండము = శ్రేష్ఠము, నాళీకము = పద్మము.

2. నర్తనము = నృత్యము, కిశోరుఁడు = బాలుఁడు తామరతంపర = ఎడతెగని అభివృద్ధి.

3. వలకేలు = కుడిచేయి, స్తబకము=పూగుత్తి, తెలచు = మ్రొక్కు.

4. ఆస్యము = ముఖము, యోగపద్యము = ఒక్కమాటే, నిగమము = వేదము.

5. మనసిజవైరిమౌళి = మన్మథునికి విరోధియైన శివుని సిగపూవగు చంద్రుఁడు, కటకము = కొండనడుము, వామలూరుభవుఁడు = పుట్టనుండి పుట్టిన వాల్మీకిమహర్షి, సాత్యవతేయుఁడు=సత్యవతి కుమారుఁడు వ్యాసుఁడు.

6. సుప్రథితంబు = లెస్సగఁ బ్రసిద్ధి నొందినది.

7. కృతిక్రియ = ప్రబంధనిర్మాణము, ఉపేక్ష = ఉదాసీనత, అజాగళస్తనసగోత్రులు = మేఁక మెడచన్నులకు దాయాదులు అనఁగా అప్రయోజకులు.

8. విశ్రామము=యతి, ఊఁత, సాహిత్యము=పాండిత్యము, కూడిక, సౌమనస్యము=మంచి మనస్తత్త్వము, పుష్పముల తెఱఁగు, ఆకులాత్మ=వ్యస

☞* ఈ అర్థములు విద్వాన్ శ్రీచదలువాడ జయరామశాస్త్రిగారు వ్రాసిరి.

నొందిన మనస్సు, పదబంధశిథిలత = మాటలకూర్పు సడలుట-కాళ్లబంధము వదలుట అనఁగా కాళ్లు తడఁబడుట. దోహాకరుఁడు = పాలుపితుకువాఁడు; మొదవు = ఆవు.

9. సరసము = రసముతోఁ గూడినది, జాతకౌతూహలుఁడు = పుట్టిన వేడుక కలవాఁడు.

10. అనంతము = అంతములేనిది, కాంతము=మనోహరము, చండిమము = తీక్ష్ణత, ఒజ్జ = ఉపాధ్యాయుఁడు, కందర్పుఁడు = మన్మథుఁడు, ఇంద్రనందనుఁడు=జయంతుఁడు, ఖండనవాది=ప్రతివాదము చేయువాఁడు, జిష్ణుతుల్యుండు = ఇంద్రునితో సమానుఁడు.

11. కిమ్మీరితము = పలువన్నెలు కలదిగాఁ జేయఁబడినది, అనులేపనము = మైపూఁత, పర్యంతము = చుట్టుప్రక్కలు, పంచనాచుంచువు = మోసము చేయుటయందు సమర్థము. పంచాంగము = అయిదంగములు గలది (ఉపాయము, సహాయులు, దేశకాలవిభాగము, వినిపాతప్రతీకారము, కార్యసిద్ధి.) నయము = రాజనీతి, వైయాత్యుఁడు = దిట్టరి - గట్టివాఁడు, అనూచానము=అంగములతోడ వేదాధ్యయనము, సంతాయమానము = విస్తరించుచున్నది, అత్యాహితము=ఉపద్రవము, కాణాదము = కణాదుఁడను మహర్షి వ్రాసిన వైశేషిక మను తర్కశాస్త్రము, గౌతమీయము = అక్షపాదుఁడు వ్రాసిన తర్కశాస్త్రము, జైమినీయము = జైమినిమహర్షి వ్రాసిన పూర్వమీమాంస, వైయాసికము=వ్యాసుఁడు రచించిన ఉత్తరమీమాంస. పాతంజలము= పతంజలి వ్రాసిన యోగశాస్త్రము, తంత్రము = శాస్త్రము, రాద్ధాంతము = సిద్ధాంతము, కరణచణులు = చేయుటయందు సమర్థులు, అంతర్వాణి = పండితుఁడు, కళ=ముప్పది కాష్ఠలకాలము, కాష్ఠ=పదునెనిమిది రెప్పపాట్ల కాలము, దస్రులు = అశ్వినీదేవతలు, అంగదకారులు = వైద్యులు, విస్మాపితము = ఆశ్చర్యపడఁజేయఁబడి, ప్రహరణము=వ్రేటు - దెబ్బ, కిణము =

ఒరిపిడిచే నేర్పడిన శరీరము మీఁదికాయు, కంటకము = కవచము, వేత్ర హస్తులు=వెండిబెత్తములవారు, నర్తకి=ఆటకత్తె, ఒడ్డోలగము = పెద్దసభ.

12. విశారదుఁడు=పండితుఁడు, మధురఫణితి=ఇంపైనపలుకు.

13. నిశ్ఛిద్రము=మేలొక్కన్నది - స్ఫుటమగు, వాలాయము=ఆవశ్యకము, సుధీవర్గము = పండితుల సమూహము.

14. సంహిత=చక్కఁగఁ గూర్చినది, ఉభయశ్లేష=ఒక్క పద్యమున రెండర్థములఁ దోపింపఁజేయుట.

15. కొలఁది = పరిమితి, కైకొను = అంగీకరించు.

16. అనుగుణము = తగినది.

17. కువలయపాలనము = భూమి నేలుట - కలువలఁ బాలించుట, చండధాముఁడు = సూర్యుఁడు.

18. అత్రిలోచనభవుఁడు - అత్రి యను మహర్షి కంటినుండి పుట్టినవాఁడు-చంద్రుఁడు-(మూఁడుకన్నులు లేనివానినుండి), తారక=నక్షత్రము - తారకుఁడను రాక్షసుఁడు. త్రిలోచనభవుఁడు = ముక్కంటి కొమరుఁడు.

19. చక్రవాళశైలము = జగమును జుట్టియున్నకొండ.

20. అసి = ఖడ్గము.

21. అజుఁడు = బ్రహ్మ, భానుసుతుఁడు = కర్ణుఁడు.

22. చందనవిశదయశుల్ = గంధమువలెఁ దెల్లనైన కీర్తిగలవారు. సంక్రందనుఁడు = ఇంద్రుఁడు

24. ఉదగ్రము = అధికము.

25. శ్రీనందనుఁడు = మన్మథుఁడు.

26. మీఱు=అతిశయించు, ఉద్వేలము=ఒడ్డు దాఁటి

28. మందాక్షము=సిగ్గు, నిర్వాణము = ఆకస్మి

భూతలము.

30. సుమకోశాసనుఁడు=పువ్వులు బాణ

31. స్వారాజభావము = స్వర్గమునకు రాజు ననుభావము, మిత్రపుత్రత = సూర్యునికుమారుఁ డగుట - స్నేహితునికుమారుఁ డగుట, వారుణీసేవ = వరుణదిక్కు (పశ్చిమదిశ)ను బొందియుండుట - మద్యమును సేవించుట, ధనదుఁడు = కుబేరుఁడు - ధనము నిచ్చువాఁడు.

32. పగలు = పగటిపూట - శత్రుత్వములు, నభఃకుసుమము = ఆకాశపుష్పము శూన్యము.

33. పట్టి = కుమారుఁడు.

34. ఈగి = దానము.

36. మన్కిపట్టు = ఉండుచోటు.

41. దేవవిభుండు=ఇంద్రుఁడు, తపనసూనుఁడు = కర్ణుఁడు, దైవతమేదినీధరము = మేరుపర్వతము.

44. నిద్దము = స్నిగ్ధము - నునుపు.

47. అపమతవాసవుఁడు = అవమానము చెందిన దేవేంద్రునిఁ గలవాఁడు.

48. అత్రాసము = నిర్భయము; సూరిరాట్టు = పండితరాజు.

49. సీమ = దేశము, ప్రాసము = బల్లెము - పద్యపాదమున రెండవ అక్షరము.

50. ఉత్తాలము = మిగుల పొడవైనది, సుమేరుశృంగము = మేరుశిఖరము, సపత్ని = సవతి.

52. అభివర్ణ్యుఁడు = చక్కఁగ వర్ణింపఁదగినవాఁడు, పితృవ్యుఁడు= తండ్రితోఁ బుట్టినవాఁడు.

సంగరపార్థుఁడు = యుద్ధమునందు అర్జునునివంటివాఁడు.

...వర్ణకేతనుఁడు = గరుత్మంతుఁడు ధ్వజముగాఁ గల విష్ణువు.

...రిపువు = సింహము, అధ్యంభఃస్థాపు = అధ్యుఁడుగఁ

...తము = చక్కఁగ నెలకొన్నది - నేర్పరి.

...ధి = వివాహవిధి.

61. ప్రోక = రాశి, నికురుంబము = సమూహము.

62. ప్రభూతము = విస్తారము.

63. ప్రతిపన్నుఁడు = దిట్ట, సన్నిధి = మంచిగని- సమ్ముఖము.

64. కరజశ్రీ = గోళ్లవలనఁ బుట్టిన సిరి - (రాజుపక్షమున) పన్ను వలనఁ గలిగిన ఐశ్వర్యము, ప్రహ్లాదభరణము = సంతోషమును భరించుట - ప్రహ్లాదుని భరించుట.

65. సహావస్థాన...వైభవంబులు = ఒకటి నొకటి కూడియున్న వెన్నెల యెండలు, అనిర్మర్యాదవైచిత్రి = హద్దుమీఱని విచిత్రము - అధిక మైన విచిత్రత.

68. కనకమహీభృద్వరుఁడు (శ్లేష) = మేరుపర్వతము - కనకరాజు (పేరు), విబుధులు=పండితులు-దేవతలు, పరహితధర్మభావము = ఇతరులకు మేలు గలుగుటకైన ధర్మబుద్ధి - శివునకు విల్లుగ నుండుట.

69. స్వస్త్రీసుఖక్రీడ=(అర్థిపక్షము)తమ స్త్రీలతోడి సుఖమైన క్రీడ- (శత్రుపక్షము) దేవతాస్త్రీలతోడి సుఖము, ప్రత్యర్థి = శత్రువు, ఉద్యత కృపాణుఁడు = ఎత్తినఖడ్గము గలవాఁడు - మించిన కృప గలవాఁడు.

70. సంతానము=కల్పవృక్షము, సురధేనువు = కామధేనువు, ఒజ్జ = ఉపాధ్యాయుఁడు, కోదండగురుఁడు=ద్రోణుఁడు, కుంభీనసము = సర్పము - ఆదిశేషుఁడు, క్రోడము = ఆదివరాహము, కుంభినము = గజరాజము.

72. వినీతి = వినయము.

74. సురావనీజము = కల్పవృక్షము.

76. హాలహలము = కాలకూటవిషము, లోఁచు = లోఁగఁజేయు, ఖచరుఁడు = మేఘుఁడు.

79. శ్రీపుత్రతులన = మన్మథునితో సరిపోలుట, అంగిరసుఁడు = బృహస్పతి, దావహేతి=దావాగ్నిజ్వాల, హేతి = ఆయుధము, మారుతి = ఆంజనేయుఁడు, కుభృత్తు = పర్వతము, ప్రతీపుఁడు = శత్రువు.

80. వెన్నెలకుప్పలు = క్రీడావిశేషము.

81. స్ఫాయ......ణంబు = విస్తరించిన అపకీర్తి యను నీలిరంగు పరదాను గప్పివేయుట.

82. నవ......లు = క్రొత్తగురుగు - పగడములు.

83. దానవారి=దాన మిచ్చునపుడు ధారపోయు నుదకము, దానవ+అరి=విష్ణుమూర్తి, ధ్రువస్థితి=నిలకడయైనయునికి - ధ్రువునియునికి, ప్రహ్లాద పోషిత=ప్రహ్లాదుని పోషించుట-అహ్లాదమును గలిగించుట, అశేషభోగపరత= అన్ని భోగములం దాసక్తి, శేషభోగపరత = శేషునిశరీరమునఁ బవళించుట.

84. గరిమ=గొప్పతనము, గారాపుఁబట్టి=ప్రియమైన కొమరుఁడు.

85. ఆఖండలుఁడు = ఇంద్రుఁడు, అహంక్రియ = అహంకారము, వారణారి=సింహము, త్రప=సిగ్గు, అవారణ = అడ్డులేని, మందేహరిపుదీప్తి = మందేహులను రక్కసులకు శత్రువైన సూర్యుని తేజము. అమంద+ఈహ = తక్కువకానికోర్కి, బంధురాజి=బంధువులశ్రేణి, బంధుర+ఆజి = మనోహరమైన యుద్ధము, పయస్సింధు = పాలకడలి, శ్రుతి = చెవులు, వళక్షమణిమతల్లి = తెల్లనిమేలి రతనాలు, ప్రతిమల్ల = ఎదిరి శత్రువు.

(౧) ఇంద్రుని గర్వ మడంచుటచే నొప్పు నిండువైభవమునఁ బొపు గన్నవాఁడు.

(౨) ఏనుఁగులకు వైరియగు సింహమునకు సిగ్గునకుఁ గారణమైన కయ్యములందు నడ్డులేని భుజబలము గలవాఁడు.

(3) మందేహులను పేరిరక్కసులకు శత్రువైన సూర్యుని తేజస్సునకును సందేహమును (తక్కువతనమును) గలిగించు మందము కాని కోర్కితో నొప్పు తేజస్సుతోఁ గూడుకొన్న వాఁడు.

(౪) బంధుగులమొత్తమను పాలకడలికిఁ జందురుఁ డగుచు మనోహర మైన సంగ్రామజయముతోఁ బ్రకాశించువాఁడు.

(గ) అన్నిదిశలకడల నున్నఱేఁడ్లు శిరము లూఁపుటచేఁ గదలికకన్న చెవులయందలి తెల్లని మేలిరతనాల వెలుంగులకు నెదిరిజెట్టి యగుచున్న విలసిల్లు కీర్తివైభవము గలవాఁడు.

86. కీర్తినదీమతల్లి=కీర్తియను శ్రేష్ఠమైననది, కవీంద్రులు = కవీశ్వరులు-నీటిపక్షులు.

87. నిత్యసువర్ణవర్షముల్=ఎడతెగని బంగారునాణెముల వర్షములు, హృద్య......త = మనోహరములైన గద్యపద్యములతోడి కావ్యస్వరూప మొంది, అనంత......ముల్=తుదలేని మంచి యక్షరముల ప్రవాహములు.

88. అప్రతిముఁడు = సరిలేనివాఁడు, సుర+మణీ+రతి = దేవతామణుల (చింతామణుల) సమూహము. సు+రమణీ+తతి=చక్కని చెలువుల మొత్తము, సప్తసంతానవృద్ధి=ఏడు సంతానములు-అగ్రహారము, పుత్త్రుఁడు, నిధి, ప్రబంధము, ఆరామము, తటాకము, దేవాలయము (వీనిఁ బ్రతిష్ఠించుట) ఏడు కల్పవృక్షముల పెంపు.

89. అర్థి = యాచకుఁడు, ప్రత్యర్థి = శత్రువు, ధనము=విత్తము, నిధనము=మరణము, ఆ రాజువలన నర్థులు ధనము ప్రత్యర్థులు నిధనముఁ బడయుదురు; అది యుక్తము; వర్ణాధికులు వర్ణాధికము గోరుదురు గదా, అర్థి అను రెండు అక్షరములు గలవారు ధనము గోరిరి. ప్రత్యర్థి అను మూఁడక్షరములవారు నిధనము గోరిరి. పైదానికన్న క్రిందిపదములు రెండును ఒక్కొక్క వర్ణ మెక్కుడుగ నుండుట చమత్కారము.

90. దానవారి = దానము నిచ్చునప్పుడు ధారపోయు నుదకము-కృష్ణుఁడు, ప్రద్యుమ్నుఁడు=ఎక్కుడు ధనము బలముఁ గలవాఁడు-మన్మథుఁడు.

91. మను=జీవించు, తటిల్లత=మెఱుపుఁదీఁగె, చూపఱు=చూచువారు.

92. వాలు = ఖడ్గము.

93. చర్చ = మైపూఁత.

94. సుధాంశుఁడు = చంద్రుఁడు, భావజుఁడు = మన్మథుఁడు.

95. కులగోత్రౌన్నత్యము = కులము, గోత్రము వీనియున్నతి-సప్త కులపర్వతముల యున్నతి, వరా......ణంబు=ఎన్నికకన్న యుద్ధమునందలి నేర్పు - ఆదివరాహముపై వసించునేర్పు, అనంతవిభవాధిక్యంబు = అంతము లేని వైభవముయొక్క అతిశయము - ఆదిశేషునితోడి వైభవము, అనేక... త్వము = పెక్కుపవిత్రమైన గుణముల యుదారత, అనేకప-అష్టదిగ్గజముల యొక్క రక్షణ యను మేలిగుణాతిశయము.

96. జోదు=యోధుఁడు, తగవరి = తీర్పు చేయువాఁడు.

98. ఆధిక్య......నకుఁ=అధికమై సమర్థమైన యుద్ధక్రియలందు రుద్రునివంటివానికి, అవిరతభద్రుఁడు=ఎడతెగని శుభములు గలవాఁడు.

99. హారిద్రాక్షతలు = పసుపుఁ బూసిన యక్షతలు, దిక్పురంధ్రి = దిక్కులను ఉత్తమస్త్రీలు.

100. దానోదకధార = దాన మిచ్చునప్పుడు ధారగా పోయు-నీటి ధార, శీతలీకృత=చల్లఁగాఁ జేయఁబడిన, అకించన్య = దారిద్ర్యము, జన్య+తాప+క్షతి = పుట్టిన తపన యను గాయము.

దానోదక......పక్షతికిఁ = దాన మిచ్చునపుడు ధారపోయు నీటిచే నెల్లప్పుడు చల్లఁగాఁ జేయఁబడిన ముంగిలియం దున్నయాచకుల దారిద్ర్యమువలనఁ బుట్టిన తాపముయొక్క గాయము గలవానికి.

101. బిడౌజుఁడు=ఇంద్రుఁడు, దైవతక్ష్మాజము=కల్పవృక్షము.

102. లవిత్రము=కొడవలి, జైత్రుఁడు = జయశీలుఁడు.

## ప్రథమాశ్వాసము

1. ఆకరము = గని, ఆలవాలము = పాదు.

2. ఊర్మిహస్తములు = అల లను చేతులు, అంకభాగము = ఒడి.

3. ఆత్మసామ్యము = తనతో సాటి, నిర్జరనగరి = స్వర్గము, సువర్ణ మయ = బంగారు మయమైన, సౌధకరప్రసరంబుచేత = మేడల హస్తముల (కాంతుల) ప్రసరించుటచే, భూరితర=మిగుల నధికమైన, పౌరజన+ఆరవ= పురజనుల సందడి.

మేలివస్తుల సంపదల సొంపుతోఁ బెంపు గాంచు నా ద్వారకా పురి బంగారుమయములైన మేడల కాంతులను హస్తములఁ జాచి నాకపురిని జీరపట్టి లాగుచు నీవు నాతో సరివత్తువా అను వివాదము తీర్చికొనుటకై పురములోని జనులు కలకల మను గద్దింపులతోఁ బిలుచున ట్లుండెను. అంబ రము = ఆకాశము, వస్త్రము.

4. ఈ పద్యమునఁ బురికోట చక్రవాళపర్వతముతో సరిపోల్పఁబడి నది. (కోటపక్షమున) అహి+మకర+ప్రచారసుదురాసదము = సర్పములు మొసళ్లు వీని సంచారముచే దగ్గఱ చేరుటకు వీలులేనిది. (పర్వతపక్షము) అహి మకర+ప్రచార సుదురాసదము = సూర్యుని ప్రచారమునకుఁ బొందరానిది (కోట.) నిబిడాంధకారసన్నహనము = కటికచీకటివంటి కవచము. (పర్వత) కటిక చీకటి యను కవచము - ప్రయత్నము.

5. పయికప్పుతాచయుకయెగ్గి=పైన కప్పియున్న చాపతాయువలె, నింగి = ఆకాశము, మరీచి = కిరణము, కొలువుచవికె = కొలువుండు చావిడి (చతుశ్శాల.)

6. భంగచయము = అలల మొత్తము.

7. శైవలము = నాఁచుతీఁగె. కరకంచు = కరకకాయరసముతో అద్దిన అంచు, శాటి=కావివస్త్రము, హర్మ్య......యము = ధనికుల మేడల బంగారుకాంతులు, అభ్ర......మౌళి = వెల్లువటేఱు (గంగ) సిగయందుఁ గల శివుఁడు.

8. వీచిక=అల, మిష=నెపము, శయచక్రి=శయనించిన విష్ణువు, రస వత్=నీరునిండిన (సరసమైన), పరిఖామిష = అగడ్త యను నెపమున బాహు బంధము = బాహువుల కౌఁగిలి.

ఫురమను లక్ష్మి పార్శ్వమున శయనించియున్న సముద్రుఁ డను విష్ణువుపై అలల పరంపరలోఁ బ్రతిఫలించి పొడవైన తన హాసమును జూచెను. ఆ విష్ణువు సైకతము నీరు నిండుకొన్న యగడ్త యను నెపమున తన బాహువుల కట్టుతో రెండు సంజలం దామెను గౌఁగిలించుకొని విడకుండెను. ఇది యెట్లుండె ననఁగా ఒజ్జల పుచ్చకాయవలె నుండెను. ఉపాధ్యాయుఁడు పుచ్చకాయ తినవల దని శిష్యుల కుపదేశించి తాను దిన్న ట్లున్నది. సంధ్యా కాలమున స్త్రీని ఆలింగనము చేసికొనుట నిషేధమైనను తా నాలింగనము చేయుట.

9. మృగమదము = కస్తూరి, పిటాకము = ఇండ్లచూరునం దుండు పెంపుడుపక్షుల గూఁడు.

10. నీలము=ఇంద్రనీలమణి, హరిన్మణి = గరుడపచ్చ, వితానము= మేలుకట్టు.

11. పోఁజు = పండు, మిళిందము = తుమ్మెద, మరందము = పూఁదేనె.

12. నందనసమృద్ధికిన్ = నందనవనమున కున్న నిండుసంపదకంటె (కొడుకుల సంపదకంటె), కోటిగుణాధికతన్ = తన సంపద కోటిరెట్లు గుణాధిక్యము చూపఁగా.

13. చాతుర్య=నేర్పుచే, అధిగత = పొందిన, అఖిలశ్రుతిచయుల్= అన్ని వేదములు గలవారు, షడ్దర్శనీ=ఆఱుశాస్త్రములయొక్క, పారగుల్=అవలి గట్టు సేరినవారు, శ్రౌతస్మార్తవిధి = వేదమునందును స్మృతియందును జెప్పఁబడిన కర్మలయొక్క, ప్రసిద్ధపదవి = సుప్రసిద్ధమైన మార్గమందు, సంచార = సంచరించు, లీలాధ్వగుల్ = విలాసముతోడి బాటసారులు, చేతోనామవిలోచన-మన స్సను ప్రసిద్ధమైన నేత్రముచే, అచలిత = చలింపని, లక్ష్మీనాథ సంజ్ఞ=మహావిష్ణువను పేరుగల, ఆదిమజ్యోతిన్ = మొదటి జ్యోతిని, నిత్య నిరీక్షులు = ఎల్లప్పుడు చూచువారు.

నేర్పుతో నన్ని వేదములు చదివినవారు - ఆఱుశాస్త్రముల తుదలం గన్నవారు. (తర్క-వ్యాకరణములు, పూర్వోత్తర మీమాంసలు, సాంఖ్యము, వైశేషికము-ఇవి షడ్దర్శనము లనఁబడుచున్నవి.) శ్రౌతస్మార్త కర్మమార్గమున సులువుగ సంచరించు బాటసారులు.

14. గుణ+ఆనందత్=తమ మంచి గుణములచే నానందము పొందుచున్న, జయశ్రీ=జయలక్ష్మియొక్క, నఖాంక=గోటినొక్కులను, అనూన భ్రమత్=ఎక్కువగ భ్రమను గల్గించు, ఆయుధ వ్రణకిణ=ఆయుధముల గాయములచే నైన కాయలచే, ఉదంచత్+శరీరులు=ఒప్పుశరీరము గలవారు.

గుణా......రుల్=తమ గుణములచే నానందించు జయలక్ష్మి గోటి నొక్కులను భ్రాంతి గలిగించు-ఆయుధములచేనైన గాయముల కాయలతో నొప్పుశరీరములు గలవారు.

15. గడించు = సంపాదించు.

16. ద్విజులు = విప్రులు, రెండుమార్లు పుట్టినవారు. సహజముగాఁ బుట్టుట ఒక జన్మము, వడుగైన తర్వాత మఱియొక పుట్టువు కావున ద్విజులనుట, సుజనులు = మంచిజన్మము గలవారు, అక్కజము = ఆశ్చర్యము, మంచిజన్మము గలవారు రెండుమార్లు జన్మము గలవారిం గొలిచి సుఖంబు గాంచుట వింతకదా.

17. ఘనసారపుఁ గుప్పలు = ఘన+సారపుఁ గుప్పలు, మేఘము యొక్క సారమైన కాంతికి స్థానములు-ఏనుఁగులు-అనఁగా నీలిరంగు గలవి. ఘనసారపుఁ+గుప్పలు = కప్పురమువలె తెల్లనివి - గుఱ్ఱములు, ఘనసారపుఁ గుప్పలు=దృఢమైన సత్తాగల (బలము) వారు - వీరభటులు.

18. గరగరికలు = సింగారములు.

19. విమానమానహర=విమానముల అహంకారము నడంచు, హరి+శిరోగృహ+భాగ=మనోహరమైన చంద్రశాలలప్రదేశములందు. భోగభాక్

=భోగము లనుభవించు,అమరభుజంగ=దేవతావిటులయందు, సంగ=ఆసక్తితో, హృదయంగమ=మనోహరమైన, రంగత్ =క్రీడించు, అనంగసంగర+క్రమ= మన్మథక్రీడసల్పు రీతియందు, రమణీమణీ = చెలువమిన్నలయొక్క, మణిత కల్పన = రతికూజితముల తీరు.

విమాన......పారువాలచే = దేవతల విమానముల పాగ రడంచు మనోహరమైన చంద్రశాలలో విటులతోఁ గ్రీడసల్పు వారకాంతల రతికూజితముల నేర్చిన పావురములచే ఆమేడలు వింతసొంపుఁ జూపును, భుజంగుఁడు = విటుఁడు.

20. గాటము = దృఢము, ఏనాఁటక్ = ఏనాఁడు.

23. శైశవము = బాల్యము.

24. కలభాషిణి = అవ్యక్తమధురముగా మాటలాడునది.

26. బాలిశకేళికత = పలువిధములైన చిన్నతనపు మాటలయందు, అలసతా = ప్రాలుమాలికఁ జూపుటచేఁ లసత్ = ప్రకాశించు, అచిరావతరణ = క్రొత్తగ నవతరించిన, తరుణిమ = యౌవనముగల, తరుణీ = ఆ జవరాలియొక్క, లోల = చంచలించునవియు, అలసాలస = మిక్కిలి మందములునగు, విలసనాలోకనములు = విలాసముతోఁ గూడినచూపులు.

27. కుచప్రరోహముల్ = మొలకచన్నులు, నితంబము = పిఱుఁదు, అత్యాక=నిర్బంధము, అఱవక్ = అఱచుటకు.

28. చనుబొగడలు = మొగ్గలవంటి చన్నులు.

29. తమకము = మోహము.

30. బలురేఖ = మంచితీరు, వంగడము = వంశము.

31. మించు = మెఱపు, లేఁగౌను = లేఁతనడుము (సన్నని), చంద్రిక = వెన్నెల, కప్పు = నలుపు.

32. బెళుకు=తళుకు, బిత్తరిచూపు = చంచలమైన చూపు, సరత్న + కుండల=రత్నాలకమ్మలయొక్క, అంచలకషణ = అంచుల యొరపిడిచే పదును. పెట్టుటచే, ఉజ్జ్వలత్వము పస = ప్రకాశించు సొంపు.

ఆమాటకత్తె తన చంచలపుఁజూపనెడి ఖడ్గము తన చెవుల ధరించియున్న రత్నాలకమ్మల యొరపిడిచే (పదునుఁబెట్టుట) తళతళ మెఱయఁగ జళిపించుచు ఆ కత్తితో విటులహృదయముల గ్రుచ్చి యాపోటులోవి గండిద్వారా తాను వారి మనస్సులలోఁ బ్రవేశించెను. కటారికత్తియ = ఖడ్గము గలది.

33. మిగుల వింతలగు మన్మథక్రీడలచే అచ్చరల కీర్తివలె.

34. చేటికావారము = పనికత్తెల సమూహము.

35. వలరాజు = మన్మథుఁడు, పాటలము = కలిగొట్టు, కుందము = మొల్ల, వాసంతిక = బండిగురివెంద.

36. పురుషాహ్వయము = పున్నాగము.

37. లికుచము = నిమ్మపండు, కీరము = చిలుక.

39. కుచకుట్మలము = చనుమొగ్గ, పల్లవ శిఖామణి = మంచిలేఁజివురు-విటరాజు. ఈ మామిడి తన కొమ్మ యను హస్తముతో నీపయ్యెంటను లాగుచు తుమ్మెద లను నెపమున తన చూపులు నీ స్తనము లను మొగ్గపైఁ బ్రసరింపఁగాఁ దాను విటరాజుగ నున్నాఁడు. ఈతనివలన నీవు పత్రము, పుష్పము (ఆకో, పువ్వో) ఏమైనఁ (కొంత పారితోషికము) గైకొన్నావా యేమి? పత్రము = సమ్మతిపత్రము, పుష్పమునందుట = భార్యగ నుండుటకు పూవు లందుకొనుట.

40. నేత్రపర్వము = కన్నులపండువు.

41. ప్రేంగు=బరువు, ప్రోది=పెంచుట - పోషణము, ఆయములు = మర్మస్థానములు, డోలావిహారము = ఊయెల నూఁగుట.

42. శతానందనందనుండు = నారదుఁడు.

43. నాకమృగీనేత్రలు = అప్సరసలు.

45. త్రైవిష్టపస్త్రీలు - అచ్చరలు, ఉచ్చలత్ + చరణముల్ = పైకి లేచుచున్న పాదములు.

46. మొగులు = మబ్బు.

47. కనలు = కోపము.

48. అభిమతము = ఇష్టము.

49. వారిధరము = మేఘము.

51. వాసించు = వాసన గలిగించు.

52. దరహాసము = చిఱునవ్వు.

53. సోడిమి = అందము.

54. ఈరసము = ఈర్ష్య, ఇరుకెలంకులు = రెండుప్రక్కలు.

55. బెడంగు = అందము.

59. అవ్యాహతి - అవ్యాప్తి - అన్నింట సంభవింపకుండుట, వరారోహ = ఉత్తమస్త్రీ, అర్థపతి = కుబేరుఁడు.

60. నిబ్బరము = అధికము.

61. నిగాఢము = మిగుల దిట్టమైనది.

62. ఈరమి = తీఁగెలు మొదలైనవాని జొంపము - పొదరిల్లు, ప్రాసాదము = రాచనగరు, తనియు = తృప్తిఁజెందు.

64. కైవసము = వశము.

69. అక = అక్క - పూజ్యురాలు.

71. పచరించు = ప్రవర్తించు లేక ప్రకటించు.

72. నలచు = కోరు.

73. పిరుపీఁకు = పీఁకులాట.

78. ఏకసంథ = ఒకమాఱు విన్నంతనే పద్యాదుల నొప్పఁజెప్పు బుద్ధిబలము.

80. అంకూరము = మొలక, కిమ్మీరితము=వివిధవర్ణములు కలిగినది. ఆమ్నాయము = వేదము, ఉదస్తము = అస్తమించినది, అపవర్గము = మోక్షము, వాచాటత = వదరుబోతుతనము, విందు = చుట్టము, తాత్పర్యము=ఆసక్తి, కైవడి = విధము, విరించుడు = బ్రహ్మ, తండతండములు = వేనవేలు, గ్రావము = కొండ.

81. వైఖరి = విధము, ద్యుతి = కాంతి.

82. పోహళించు = కూర్చు, దొరయు = దొర్లు, వాచ్యము = పదమునకుఁ గల సామాన్యమైన యర్థము. లక్ష్యము=వాచ్యార్థమునకు బాధ గలిగినప్పుడు వచ్చునర్థము, వ్యంగ్యము=తోఁచునర్థము. ఉదా:—౧. గంగ యందు గొల్లపల్లెయున్నది. ౨. ప్రవాహమునఁ బల్లె యుండ నేరదు - గట్టున నున్నది. 3. చల్లఁదనము, పావనత్వము; రసము = శృంగారము, వీరము లోనగు రసములు, భావము = రతి, ఉత్సాహము లోనగునవి, వైదర్భి = (కూర్పువిధమును దెల్పునది, రీతి) సుశ్లిష్టములగు వర్ణముల కూర్చుట వైదర్భి రీతి, ప్రాణంబులు = అచ్చులు, హల్లులు, ఉపమ = అర్థాలంకారములలో మొదటిది, యమకము = శబ్దాలంకారములలో నొకటి.

83. మలయపవనంపుఁ గొదములు = మలయపర్వతమునుండి వచ్చు పిల్లగాలులు.

85. అజస్రము = ఎల్లప్పుడు.

86. ఊడిగము = సేవ, ముదల = ఆజ్ఞ.

87. సుద్ది = వృత్తాంతము, ఉబ్బనిచ్చు = బయలుపఱుచు.

92. వీక్షణము = చూపు, ఉక్తి = మాట, మోవి = పెదవి, దంతశిఖ = పలుమొన.

93. విచ్ఛిత్తిక = శృంగారచేష్ట - సహజసౌందర్యము.

94. అలినీలవేణి = తుమ్మెదలవంటి నల్లని కురులు గలది.

96. పగిది = విధము, పెనయు = వ్యాపించు.

98. తావకాంగము = నీ శరీరము.

101. కువలయము = భూమండలము.

103. సంధ = ప్రతిజ్ఞ, సుజ్ఞానశ్రీమిథిలేంద్ర = చక్కని జ్ఞానమనెడు, లక్ష్మికి జనకునివంటివాఁడా.

104. ఇందిందిరము = తుమ్మెద, అరా.........వర్య=శత్రువుల ప్రాణవాయువులఁ బొట్టనింపుకొన్న మహాఖడ్గమనెడు సర్పరాజముగలవాఁడా.

---

## ద్వితీయాశ్వాసము

1. శ్రీఖండాద్రి=గంధపుఁగొండ, మేఖలిక=కొండనడుము,రింఖ=గిట్ట.

3. అంకురార్పణము = మొలక నాఁటుట, ఒక పని మొదలిడుట.

4. పోరించు = తగవులాడించు.

6. పవనేరితములు = గాలిచే రేఁచబడినవి, పాదపాంసువులు = కాలిధూళులు, నికటము = సమీపము.

7. అందలము=మేనా, వారువము=గుఱ్ఱము. బరాబరి = హెచ్చరిక.

9. వీచి=అల, చర్చరి=చప్పట (గొట్టు), మచ్చరిక=శ్రేష్ఠము, పుష్కరాహ్వయము=బెగ్గురుపక్షి, పరిశోకమానము=మముకులాడునది, డిండీరము=నురుఁగు, పరిఖ=అగడ్త, శీకరము=తుంపురు, అవకీర్యమాణము = చల్లుచుండునది, భోగవేష్టనము=సర్పశరీరముతోఁ జుట్టఁబడినది, వైశాఖపర్వతనితంబము=కవ్వంపుఁగొండనడుము, కపిశీర్షము = కోటకొమ్మ, ఆతపత్రము = గొడుగు, భక్తి=రచన,శాతకుంభకుంభినీధరము=బంగారుకొండ( మేరువు),హీరమయము=వజ్రమయము, భిత్తి = గోడ, తంతన్యమానము=విస్తరిల్లుచున్నది, గారుత్మత............యంబు = గరుడపచ్చలయరంగుల మొత్తము, కురంగనాభి = కస్తూరి, గోముఖము=ఆవుపేడచే నలికినది. రంగవల్లి=ముగ్గు, సంధుక్షణము=కూడిక, కలువడము = ధ్వజస్తంభమున వ్రేలఁగట్టు కలువదండ, మిళిందము =

తుమ్మెద విశరారువు = పీడినది, శ్యామిక = నలుపు, నికుంజము=పొదరిల్లు, ప్రత్యగ్రము=నూతనము, కురువిందము = కెంపు, జటావలితము=జడలుగాఁ బెనచుకొన్నది, నిస్తంద్రుఁడు = నెమ్మదిగ నున్నవాఁడు.

10. కురువిందము = కెంపు, మరకతమణి = గరుడపచ్చ, మరీచి = కాంతి, అకలంక=కళంకములేని, నవ్యమౌక్తిక=క్రొత్తముత్తెముల, చాకచక్య = చకచకలాడు. ప్రసూనసంపద=పూవులసిరి, ఇందిందిరశ్రేణి=తుమ్మెదలబారు, నభస్+తరువు = ఆకస మను వృక్షము.

శ్రీకృష్ణుని కొలువుకూటము కెంపులు మాణిక్యము లను చిగుళ్ల చేతను, గరుడపచ్చ లను ఆకుజొంపములచేతను, ముత్యములను పూవులచేతను, ఇంద్రనీలము లను తుమ్మెదలచేతను, ఆకస మను వృక్షమును బెంచినది. శిఖరముల మీఁది బంగారు కలశము లనుఫలములతో దానిని ఫలవంతముగఁ జేయుచున్నది.

12. కరంచు = కరఁగించు.

15. దసిలీనూలు పట్టె=ఒకవిధమగుపట్టు-మొగ్గపట్టు-తో నేసినవారు.

17. అడపము = వక్కలాకుల సంచి, పమ్మాళిగలు = పాదరక్షలు, హజారము = మొగసాల.

20. కొంకు = జంకు.

22. విపశ్చిద్వర్యుఁడు = పండితశ్రేష్ఠుఁడు.

26. వినీతి = వినయము.

30. వినయోత్సేకము = వినయముయొక్క అతిశయము.

33. జవరఁదనము = మృదుత్వము.

34. శ్రుతి = సరిగమాదిస్వరము, గ్రామము = స్వరసమూహము, మూర్ఛన = స్వరముల ఆరోహణావరోహణము, మంద్ర+మధ్యమ+తారములు = మెల్లనిస్థాయి, మధ్యస్థాయి, ఉచ్చస్థాయి.

36. అబ్దము = సంవత్సరము.

43. వరవర్ణిని = ఉత్తమస్త్రీ, చదురు = నేర్పు.

కళా—32

47. కొండిముచ్చు = మంచివానివలె దగ్గఱఁజేరి సమయముఁ జూచి దొంగిలించువాఁడు.

48. రంభామనోహరాకారుఁడు=రంభ మనస్సున కెక్కినరూపు గలవాఁడు, నలకూబరుఁడు; రంభకు మనోహరుఁడైన నలకూబరునివంటి రూపము గలవాఁడు, మణికంధరుఁడు అని మఱియొక యర్థము.

49. ఉడుగుట = తగ్గిపోవుట.

50. లాతపుఁగోల=చిన్నకఱ్ఱ (గోరగదండము),పొత్తము=పుస్తకము, కిన్నెర=వీణె, లాహిరి=గంజాయి, సింగినాదము=ఊదుకొమ్మువాద్యము, కక్షపాల=చంకకుఁ దగిలించుకొన్న చిన్న సంచి, సింగపువారువము = సింహవాహనము.

55. అపనయించు = పోఁగొట్టు, వీనులు=చెవులు, వేఁగు = తపించు, పారణ=ఏకాదశి ఉపవాస ముండి ద్వాదశినాఁడు భుజించుట పారణయనఁబడు.

56. అనుభావము = ప్రభావము.

59. తార్కాణ = దృష్టాంతము.

61. వేసరు = శ్రమపడు.

63. బృహతి = విశ్వావసుఁడను గంధర్వుఁడు - గానకళాకుశలుండు ధరించు వీణెపేరు, కళావతి = తుంబురుని వీణె, మహతి = నారదుని వీణె, కచ్ఛపి = సరస్వతి వీణె.

65. ఆవర్తించు = మరల మరలఁ జదువు.

66. నాకము=స్వర్గము, కాంచనగర్భుఁడు=బ్రహ్మ,పురద్విట్టు=శివుఁడు.

68. నాళీకప్రోద్భవుఁడు=కమలజుఁడు-బ్రహ్మ, అనీకము=మొత్తము, నిగమాంతసూక్తులు = ఉపనిషద్వాక్యములు, ఒడ్డోలగము = పెద్దసభ, సదవనవ్యాపారపారీణుఁడు = సాధుల రక్షించుట యను కార్యము చేయుటయందు శ్రేష్ఠుఁడు.

98. అంజనాచల=కాటుకకొండ, గర్వభంజనము=గర్వమడంచునది, పుండరీకము = తెల్లదామర, కుంఠితము = మొక్కవోయినది, మఘవుఁడు = ఇంద్రుఁడు, పతగరాజు+అధిరోహణ+ఉద్భాసి = పక్షులకు రాజైన గరుత్మంతు నెక్కి ప్రకాశించువాఁడు.

కాటుకకొండవలెఁ గనబడుచు నీలివన్నె మేనితో, తెల్లదామరల జయించు వాలుగన్నులతో, మొసలివంటి కుండలముల కాంతులు సూర్యుని తేజము నొదిగింపఁగాను వక్షమునందుఁ గౌస్తుభమణితో లక్ష్మి ఆటలాడుకొనఁగ శంఖచక్రాదు లగు నాయుధములతో ఇంద్రుఁడు లోనగు వేల్పులు సేవింప పక్షీంద్రుని వాహనముగఁ జేసికొన్న శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమయ్యెను.

108. వెఱ్ఱిదీరె రోఁకలిదలఁ జుట్టుమన్న క్రియన్=నాకు వెఱ్ఱిపోయినది. ఆరోఁకలిఁ దెచ్చి తలకుఁ జుట్టు మన్నట్లు. వెఱ్ఱి తీరనయెడల రోఁకలి తలకుఁ జుట్టుమనునా? అనఁడు. వెఱ్ఱి ముదిరిన దనవలయును. ఇట్లే కొంత వేద శాస్త్రముల పరిచితిగల్గినవారు పండితంమన్యు లగుదురు. కర్మ పువాసన=ఇంగువ, మల్లెపూవు ఇట్టివి వస్త్రము లోనగువానితోఁ జేరి యెడబాసినను వాని పరిమళము సామాన్యముగ విడిపోదు. అట్లే మనుజుఁడు తాను తొలిజన్మమునఁ జేసిన పుణ్యపాపకర్మముల అనుభవము, ఈజన్మమున స్మృతిరూపమున అతని మనస్సులో నిల్చియుండును. అందుకు అనుకూలముగనే జీవి ప్రవర్తించు నని భావము. చెడ్డగఁ బ్రవర్తించుటకును బూర్వజన్మవాసనయే హేతువు.

109. విదితార్థ కృతిలోలహృదయులు = వేదోక్తకర్మల యర్థమెఱింగి వానియందాసక్తి నొందినమనస్సు గలవాఁడు.

111. అవాప్తి = పొందుట.

114. ప్రతిషిద్ధ = నిషేధింపఁబడినది.

115. నిదానము = మొదటి కారణము.

116. చెంగలించు = ప్రకాశించు.

118. ఆలోకనము = చూపు.

119. వీచికాచయము = అలలమొత్తము గలది, ప్రాంచత్+ఘన+శ్యామ+తోయము=ఒప్పుచున్న మేఘమువలె నల్లనైననీరుగలది, సారస+కైరవ+ఉచ్చయము=కమలములు కలువలు వీనిమొత్తము గలది, స+ఆరావ+భృంగీ+నికాయము = రొదతోడి యాడుతుమ్మెదలమొత్తము గలది, చక్ర+మరాళములు = జక్కవలు హంసలు, వ్యాఘోషిత+అఘ+వ్యపాయము = మిక్కిలి ఘోషించు (బాధించు) పాపముల నెడబాపునది.

యమునన్ ......గన్ = గొప్ప అలలమొత్తముతో, మిక్కిలి ఒప్పుచున్న మేఘమువలె నల్లనైన నీటితో, పద్మములు, కలువలు వీనితో, రొదలతోఁ గూడిన ఆడుతుమ్మెదల సమూహముతో, జక్కవలతో, హంసలతో, మిక్కిలి ఘోషించు (బాధించు) పాపముల పోఁగొట్టుటతో ఎప్పుడు పుణ్యములఁ గలిగించు ననునిశ్చయముతోఁ గూడిన యమునానదినిఁ జూచెను.

120 నిధ్యాన+ఉత్సవ+కారణములు=చూచుటవలననైన సంతోషమునకుఁ గారణములైనవి. మధ్యేతీరవన = నడిమిగట్టుయందలి వనమునందు, ద్విజప్రకర - బ్రాహ్మణుల సమూహముచే, సమ్యక్+వర్తిత = చక్కఁగ వల్లింపఁబడిన, ఆరణ్యక+స్వాధ్యాయ=ఆరణ్యకము లనెడు వేదభాగముల యొక్క, అధ్యయన=అధ్యయనము చేయుటయందు, స్వర=ఉదాత్తము అనుదాత్తము లోనగు స్వరములకు, అభినయలీలా = తగినట్లు నటించు విలాసము చేత, ఆందోళనభ్రూలతా=కదలెడు తీఁగెలవంటి కనుబొమలను, బుద్ధి+ఆపాదన = బుద్ధిగల్గించు, నైపుణీ+విలసిత+అంభోవీచి=నేర్పుతోఁ బ్రకాశించు నీటియలలు.

మధ్యేతీర . చాంచల్యముల్ = ఆనదిగట్టునడుమ నున్న వనములోని బ్రాహ్మణసమూహములచేఁ జక్కఁగ వల్లింపఁబడిన ఆరణ్యకము లను వేదభాగముల నధ్యయనము చేయుటయందు, ఉదాత్తము లోనగు స్వరములఁ బలుకునప్పుడు విలాసముగఁ గదలు తీఁగెలవంటి కనుబొమలను బుద్ధిని గలిగించు నేర్పుతో విలసిల్లు నీటియలల కదలికలు, నిధ్యానోత్సవకారణంబులు =

చూచుటవలననైన సంతోషమునకుఁ గారణములైనవి. ఆయమునగట్టున బ్రాహ్మణులు వేదములు పల్లించుచుండఁగ ఆవేదాధ్యయనమునందు స్వరాదులన్నియు బాగుగనున్నవని మెచ్చుకొనుచున్నదా (అనది)అన్నట్లు ఆయేటిలోని యలల మీఁది తామరతీఁగెలు కదలుచు కనుబొమ లెగురవేయునట్లుండెనని భావము.

121. అహీశ్వరశయ్యా=ఆదిశేషుఁడను పాన్పు, నూతన పీతపటంబు= క్రొత్తపసుపువన్నెవస్త్రము, తరణితనూజ = యమున.

ఆవలి యీవలి గట్టుల పేరుకొన్న క్రొత్తనురుఁగుల మొత్తము నాగరాజు సెజ్జగను, ఆతామరల పుప్పొడి మొత్తము పీతాంబరమువలెను ఉండఁగా ఆ యమునానది శేషశయనుఁడైన విష్ణువువలె నొప్పెను. తరణి తనూజ = సూర్యునిపుత్రి (యమున.)

124. విపాకము = పరిపక్వము.

126. పాదనఖ+ఉడుజాలము=పాదమునందలి గోరులనెడి నక్షత్ర పంక్తి, ఫాలశశి=నొసలను చంద్రుఁడు, చరణ+అరవింద+గంధ=పాదకమలముల సుగంధమునందు, నందత్+ఇందిందిర+శ్రేణి+నైల్యము=సంతసించు తుమ్మెదలబారుల నీలిమ.

శ్రీమత్ ... శశికిన్ ఒసఁగి=అహోబలక్షేత్రమున వేంచేసి యుండు శ్రీనృసింహస్వామి పాదములలోని గోళ్లనెడు నక్షత్రములను దన నొసలను చంద్రునికి సమర్పించి. వేంకటేశ్వర......నిర్వహింపన్ = శ్రీ వేంకటేశ్వరులయడుగుఁదమ్ముల నానందించు తుమ్మెదల మొత్తముయొక్క నీలిమచేఁ దన సిగనన్నెకుఁ బుష్టిఁ గలిగింపఁగా.

127. కమనీయ+ఉజ్జ్వల+శీల+శాలి=మనోహరమై ప్రకాశించు స్వభావముచే నొప్పువాఁడు, ఘనప్రమద = గొప్ప సంతోషముతోడి, ప్రేమ విశేష=ప్రేమాతిశయముయొక్క, సంభృత = భరించిన, పరీరంభక్రియా = ఆలింగనము చేసికొనుటయందు, సంభ్రమభ్రమకార = తొందరపాటును భ్రమను గల్గించు, అభిముఖప్రసార = ఎదురుగ చాచుకొనివచ్చు, లహరీ

బాహాసమూహ = అల లనెడు బాహువులసమూహముతో, అసమాన మనో జ్ఞంబు=సరిలేని రామణీయకము గలది.

ఘన......కే = గొప్ప సంతోషముతోడి ప్రేమయొక్క అతిశయముచే నిండుకొన్న ఆలింగనము చేయుటయందుఁ దొంగరపడుచున్న భ్రాంతిని కలిగించుచు నెదురుగాఁ బ్రసరించుచున్న అల లను బాహువుల సమూహముతో సరిలేని మనోహరతగల స్వామి పుష్కరిణికి అనఁగా గొప్ప భక్తుఁడైన మణికంధరుఁడు వచ్చినాఁ డని ఆ పుష్కరిణి తన చేతులతో ఆయనను కౌఁగిలించుకొనుచున్నదా యన్నట్లు అలలు కనఁబట్టుచుండెను.

128. అన్యోన్యపావనత్వము = ఒకదానివలన నొకటి పవిత్రతఁ గాంచుట, మజ్జనసమయసమ్మేళనము = స్నానముచేయువేళఁ గలిసికొనుట.

హరి......న = విష్ణువుచే నెల్లప్పు డాశ్రయింపఁబడిన మంచి గట్టులు గలది (పుష్కరిణి). విష్ణువుచే నెల్లప్పు డాశ్రయింపఁబడిన మనస్సు గలది (భక్తుఁడు); విష్ణుభక్తుఁడు స్రుంకులిడుటచేఁ బుష్కరిణి ధన్య ఆయ్యెను; పుష్కరిణిలోఁ గ్రుంకుటచే హరిభక్తుఁడు ధన్యుఁ డాయెను. ఇరువురు హరి నాశ్రయించినవారు అని భావము.

129. భక్తి వినయ కౌతుకప్రమోద=భక్తి వినయము కుతూహలము సంతోషము వీనియొక్క, సంక్రాంతి=కలియుటచే, శబలతావిశేష=చిత్రవర్ణములయొక్క అతిశయముచే, కలితచిత్తవృత్తి = ఒప్పుతలంపు.

భక్తి...వృత్తియై = భక్తి, వినయము, వేడుక, సంతోషము వీనితో కలసి చిత్రమైన వన్నె గాంచుటచే మిక్కిలి యొప్పుచున్న మనస్సుయొక్క వ్యాపారము గలవాఁడై.

130. ఉదీర్ణము = అధికము, చారువు = సుందరము, వీజనము = విసనకఱ్ఱ. చతుర్విధవాద్యములు=వీణా వేణు మృదంగ తాళములు, స్వనము= ధ్వని, నీరవాహము = మేఘము.

132. మొలముప్పిడి = మొలను దోపుకొన్న బాకు. మణిమేఖల= రత్నాల మొలనూలు, వైజయంతి = తులసిమాల, తారహారము = ముత్యాల హారము, మకరకుండలను = మొసలివాకమ్మలు, నాస=ముక్కు, రత్నముకుట వరము = మేలిరత్నాల కిరీటము.

135. ఉగ్గడించు = వచించు.

136. ఉదరబంధము = మొలత్రాడు, శ్రీవత్సము=విష్ణువు ఱొమ్మున నుండు పుట్టుమచ్చ, గళశ్రీలు = కంఠలక్ష్ములు, గండమండలము = చెక్కిలి ప్రదేశము.

137. అస్తోక=తక్కువకాని, సమ్మద=సంతోషము, ఆశ్చర్య=అచ్చె రువు, వీనిని, సంభృత=భరించుటచే, స్తంభ=మ్రాన్పడిన, భావులు=మనోభావము గలవారు, లేక స్తంభధర్మము (స్తంభమువలె నిశ్చియుండుట) గలవారు.

విపంచి = వీణె, సమ్మదము = సంతోషము, అస్తోక............ భావులు = తక్కువకాని సంతోషము, అచ్చెరువు వీనిని భరించుటచేత మ్రాన్పడిన మనోభావము గలవారు.

138. ముక్తిహేతు = మోక్షమునకుఁ గారణమైన, సప్తపుర+ అంతర=ఏడు పట్టణములనడుమ, అభిగణన = లెక్కపెట్టుటచే, అతివిఖ్యాతి శాలి=మిగుల ప్రసిద్ధికెక్కి యొప్పునది, ఖేలత్ = క్రీడించు, ఏకామ్రవిభు శిరస్సింధు=ఏకామ్రనాథుని శిరస్సునందలి గంగానదితో, మత్సరి = మచ్చ రించు, సరః+శ్రీ+విభా=సరస్సనెడు లక్ష్మితోఁ బ్రకాశించునది, సముదీర్ణ = అతిశయమైన, కామాక్షీ = కామాక్షీదేవియొక్క, తపఃపరిపాక = తపస్సు యొక్క పండిన, సంపత్ విధాయి = సంపదను జేయునది, సరిత్+రూప = నదీరూపమైన, వాగ్దేవతా = సరస్వతీదేవియొక్క, సంశ్రయ=ఆశ్రయించు టచే, అంచిత = ఒప్పు, సమస్త+ద్విజ+ఆళి = అందఱు బ్రాహ్మణులు గలది, బ్రహ్మయజ్ఞ = బ్రహ్మ చేయు యజ్ఞమునందు, వపాహోమ = వపయొక్క హోమముయొక్క, పరిమళ = సుగంధముతో, సహజాత = తోడఁబుట్టిన,

సాక్షాత్ = ప్రత్యక్షమైన, పరబ్రహ్మసన్నిధాన = పరబ్రహ్మముయొక్క సమ్ముఖముయొక్క. సౌభాగ్యభాగ్య = సౌందర్యముయొక్క అదృష్టమునకు, యోగ్యము=తగినది.

ముక్తి.....శాలి = మోక్షకారణములైన యేడు పట్టణములను లెక్కించుటలో మిక్కిలి ప్రసిద్ధి గన్నది. అయోధ్య, మధుర, హరిద్వారము, కాశి, కాంచి, ఉజ్జయిని, ద్వారక ఇవి సప్తపురములు. ఖేల.....భాసి = క్రీడించు నేకామ్రనాథుని శిరస్సునందలి నదితో మత్సరించునట్టి సరోలక్ష్మి ప్రకాశించునట్టిది. సము.....ధాయి=మిక్కిలి అతిశయమైన కామాక్షీదేవి తపస్సుయొక్క పరిపక్వమైన సంపదను చేయునట్టిది. సరి.....శి = నదీ రూపమున నున్న సరస్వతీదేవి నాశ్రయించిన అందఱు విప్రులు గలది. బ్రహ్మ...యోగ్యము = బ్రహ్మదేవుని యజ్ఞమునందలి వపాహోమముయొక్క పరిమళముతోడం బుట్టిన ప్రత్యక్షమైన పరబ్రహ్మముయొక్క సమ్ముఖముయొక్క సౌభాగ్యమునకుం దగినది. (వరదరాజస్వామి.)

140. ప్రత్యుత్థానము=లేచి యెదుర్కొనుట, నెనరు = కనికరము.

142. సముద్యత్=వెలయుచున్న, పూగ=పోఁకలు; పున్నాగ=పొన్నలు, రంభా=అరఁటులు, కంకేళి = అశోకములు, రసాల=మావులు, సాల=మద్దులు వీని, సుమనః+పాళీజ = పూగుత్తులనుండి పుట్టిన, ధూళీ = పుప్పొడి; మధూళి=పూఁదేనె, కేళీ = వీని క్రీడయందు, పర = శ్రేష్ఠమైన, గంధవాహపృథుక=పిల్లగాలులయొక్క, చంక్రమ=సంచారములచే, అలంకృత = అలంకరింపఁబడిన, క్ష్మాక=వృక్షములుగల, ప్రాంగణ=ముంగిళ్లుగల, చోళమండల = చోళరాజ్యమునందలి, మహాగ్రామంబులు = గొప్పయూళ్లు.

సముద్య.........చుక్ = వెలయుచున్న పోఁకలు, పొన్నలు, అరఁటులు, అశోకములు, మామిడులు, మద్దులు వీని, పుష్పములనుండి పుట్టిన పుప్పొడి, పూఁదేనె వీనియందుఁ గ్రీడించు ననిలుండను బాలుని దాఁటులచే నలంకరింపఁబడిన నేలలతోడి ముంగిళ్లు గల చోళదేశమునందలి గ్రామములు చూచుచు.

146. పుణ్యా......మున్ = పుణ్యనదులలో నేనే మేటి నని ప్రసిద్ధి కెక్కితి నని గర్వించు, వేల్పు టేటితో మత్సరముతోడి వాదముయొక్క నేర్పులో నడ్డులేక దుముకులాడుచున్న హస్తము లను భావమును భరించు నలల మొత్తముచేఁ జుట్టఁబడిన ఆకసము గలది (కావేరి). తటినీ లలామము = ఏఱులమిన్న, అఘౌఘ......మున్ = పాపములఁ గడుగుటలో నతిశయ గుణము గలది.

147. ప్రవాహయుగళీనిభ = రెండు ప్రవాహముల జంటవలె, విభాసిత భుజా = ప్రకాశించు భుజము లనెడు, నియతరంగసత్ = ఎల్లప్పుడు శ్రీరంగ నాథుని, అనూనపరిరంభంబు = తక్కువ కాని ఆలింగనము గలది, భజత్ = సేవించు, నిఖిలమానవ = అందఱి మానవులయొక్క, మనః కలుషతా = మనస్సుయొక్క మాలిన్యము, నిరసన = తొలఁగించుటయందు, అతిపటుతా = మిగుల సమర్థమైన, నుతజలౌఘంబు = పొగడఁదగిన నీటి ప్రవాహము గలది, సమస్తతటినీనికర = అన్నినదుల సమూహముచే, దుష్కరతర = మిగుల కష్టమైన, అనుపమ = సరిలేని, చిత్ + విభవ = జ్ఞానసంపదను, దానమహనీయంబు ఇచ్చుటయందు గొప్పతనము గలది.

ప్రవాహ......బు = ౧. (కావేరి) రెండువంకల ప్రవహించు ప్రవాహము లనెడు బాహువులతో నెల్లపుడు శ్రీరంగనాథుని మంచిదైన తక్కువ కాని ఆలింగనము కలది. ౨. సేవించుమానవుల మనః కాలుష్యము బోఁగొట్టు నీరు కలది. ౩. నదులన్నిటికి చేయుటకుఁ గడిందియైన జ్ఞానదానము చేయునది.

148. పృషతమణినికాయము = నీటిబిందువు లనెడు మణుల సమూహము.

పృషత......యము = నీటిబిందువులను మణులమొత్తము.

149. భవ్యవిభా = శుభకరమై ప్రకాశించుచు, ఉత్సంగిత = పైనఁ గూడు కొన్న, శంఖసుదర్శనశార్ఙ్గగదాముఖ = శంఖము, సుదర్శనచక్రము, శార్ఙ్గమను విల్లు, గద మొదలైన, చిహ్నము = గుఱుతు.

పీతాంబరము, పుండరీకనేత్రములు, నాలుగుచేతులు, శంఖ. చక్రాదులు, నీలశరీరము కల విష్ణుస్వరూపమును కావలెనని దనలోఁ గ్రుంకు లిడువారికి నిచ్చును. అనఁగా నామానవులు చనిపోయినతరువాత విష్ణుస్వరూప మొందుదు రని భావము. సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములు.

150. నిరుత్తరీయ=పయ్యెటచెఱఁగులేని, వర్తుల=గుండ్రని, ఉత్తుంగ= ఎత్తైన, రంగత్ = చలించు, కుచయుగంబులు.

కుముదము = తెల్లకలువ, కల్హారము = ఎఱ్ఱకలువ, తల్లజము = శ్రేష్ఠము, కిశోరుఁడు=బిడ్డ, చక్రాంగము = హంస, సారసము = బెగ్గురుపక్షి, రజతాసనము = వెండిపీఁట, నిరు.........బుల = పయ్యెదలేని గుండ్రని నిక్కిన స్తనములు, షడ్దర్శనవ్యాఖ్యానము = వ్యాకరణము, తర్కము, పూర్వమీమాంస, ఉత్తరమీమాంస, వైశేషికము, సాంఖ్యయోగములు ఇవి షడ్దర్శనములు అనఁబడు. వీని వివరణము. అవ్యుత్పన్ననిర్వాణంబు = పుట్టని ఆరుటలు గలవి - ఎప్పుడు నారిపోవనివి, వికంకటము = విస్తరిల్లినది, వైన తేయుఁడు = గరుత్మంతుఁడు.

151. ఒనపరి=సుందరము, తెగడు = నిందించు, మరుల్ గొలుపు = ప్రేమింపఁజేయు, డంబరము = విజృంభణము.

152. అంగదము = భుజకీర్తి.

153. నిర్దళనము = ఖండించుట.

155. అహమ్మతి = అహంకారమును, నిర్మథనప్రవీణము=మథించుట యందు నేరుపు గలది, విలసితసౌధ=ప్రకాశించు మేడలయందలి, వజ్రరుచి= వజ్రమణుల కాంతి యను, నిర్ఝరనిర్ఝరిణీ=దేవగంగయొక్క, ప్రవాహ=ప్రవాహమునందు, సంవలనమిళత్ = తిరుగుచుఁ గలిసికొన్న, మత్తఝష=మదించిన చేఁపల,వార=సమూహమును, మతిప్రద=తలంపునిచ్చు, చంద్రశాలికా=మేడల.

పైభాగములందలి గృహములందు, లలితవతీ=సుందరులయొక్క, విలోలదృక్ = చలించు నేత్రములచే, అలంక్రియమాణము = అలంకరింపఁబడుచున్నది.

అహ......మక్ = అహంకారమును నశింపఁజేయుటయందు నేర్పు గలది. విలసి......ణము = ప్రకాశించు మేడలందలి వజ్రమణుల కాంతి యను దేవతలయేటి (గంగ) ప్రవాహమునందుఁ దిరుగుచుఁ గలిసికొన్న మదించిన జేడిసచేఁపలను తలంపు గలిగించుచు, మేడల పైభాగములందలి యందకత్తెల చలించు కన్నులచే నలంకరింపఁబడుచున్నట్టిది.

156. కందళత్ = మొలకెత్తు, అమందదీప్తి=తక్కువకాని కాంతియొక్క, ప్రవాహ=ప్రవాహముచే, సంక్షాళిత=కడుగఁబడిన, దిగంతరాళ=దిక్కుల నడిమప్రదేశములయొక్క, సాంద్రమసజంబాలంబులు = చీకట్లు అను బురుదలు గలవి.

కందళ......బులు = మొలకెత్తుచుఁ జక్కని ప్రకాశ మను ప్రవాహముచేఁ గడుగఁబడిన దిక్కుల నడుమ చీఁకటి యను బురద గలది.

157. హాటంబటుబటువు = బంగారుపట్టుతో నిర్మించిన బిళ్లతలగడ, పాంచజన్యము = విష్ణుదేవుని శంఖముపేరు.

158. నిర్నిద్రము = ప్రకాశించునది, మేదురము = దట్టమైనది.

159. నిశితశరము = వాఁడిబాణము, భూమిజ=సీత, పీనబాహునాగ=బలిసిన బాహువనెడి సర్పముగలవాఁడా, శరణపరణపరపరానుజుఁడు=శరణుకోరుటయందు ఆసక్తి గల శత్రువు తమ్ముడు-విభీషణుఁడు, సాదము = నాశము, కాండము = నీరు, లవిత్రము = కొడవలి.

162. దళ+కళికా=ఆకులుమొగ్గలు, పుష్పఫల+ఆది=పువ్వులుపండ్లు వీనియొక్క, గరిమకతనక్ = గొప్పతనముచే, సమీపశ్రీప = దగ్గఱ యున్న విష్ణువుయొక్క, కలాపమణీ=ఆభరణములయందలి రత్నములయొక్క, పటలీ=సమూహముయొక్క, పటిమస్పర్ధ = చక్కఁదనము తోఁచెడి మత్సరము.

దళ.........టిక్ = ఆకులు, మొగ్గలు, పువ్వులు, పండ్లు, లోనగువాని గొప్పతనముచేత చెంగటనుండు విష్ణువుయొక్క ఆభరణముల యందలి రత్నముల మొత్తముల చక్కదనముతోడి స్పర్ధతో వర్ధిల్లుచుండు వనప్రదేశము.

164. నిగాఢము = దిట్టమైనది.

165. కంజముఖి = పద్మమువంటి ముఖము గలది.

169. ప్రసవార్త = ప్రసవవేదన పొందినది, ఎత్తు = ప్రస్తావము.

171. వీడు = పట్టణము.

172. ఉప్పరవీది = ఆకసము.

174. నిత్యజల+అవగాహ=ప్రతిదినము నీట మునుగుట అను, నిష్ఠాగ్రహణ=నిష్ఠయొక్క గ్రహించుటచే, అభిపాటల = అంతట నెఱ్ఱనైన, జటాపటల = జడలమొత్తముచే, స్ఫుటలాలనా = చక్కగ లాలించుటచే, భృశవ్యగ్ర=ఎక్కువగ పైరేగిన, సమగ్రదీప్తి = నిండుప్రభలయొక్క నివహ = సమూహముచే, ప్రవహత్ = ప్రవహించు, దహన+అంకుర+ఛటల్ = చిన్నవై మొలకెత్తిన అగ్నిజ్వాలల మొత్తములు.

ప్రతిదినము స్నానము చేయుట అనునిష్ఠ గైకొనుటచే మిగుల నెఱ్ఱనైన జడల మొత్తముచేఁ జక్కఁగ లాలించుటచే మిగుల నెక్కువైన నిండు ప్రభల మొత్తముల వహించు అగ్నిమొలకమంటల మొత్తములు తపస్సుచే బోడమిన శిరస్సుమీఁద అగ్గిమంటలు ఎఱ్ఱనిజడలచేఁ బెంపొందినవి అని భావము.

176. అనిమిషవిభుఁడు = ఇంద్రుఁడు.

178. నితాంతము = ఎల్లప్పుడు (ఎడతెగక).

181. తరఁగలు = అలలు, ఉలివాఁడుచోపుడుఁగోల=చలించుచుఁ గలఁతపెట్టు బాణము, క్రీడామృగము = ఆటమెకము, దర్పము = గర్వము.

182. జంభవైరి = ఇంద్రుఁడు, అలరించు = సంతోషపఱుచు.

184. అచ్చరపదవు=అప్సరసల సమూహము, బెడంగు = అందము, వియచ్చరపదవి = ఆకాశము.

185. ఈపద్యమునందుఁ జిలుకనుగు శుకయోగికిని (భేదము చెప్పఁ బడినది. (శుకపక్షము) అఖిలము = అంతట, బలుక...=ఖిలముగాని చోటు లందు, అతి+ఉదార+ఆగమ = మిగుల పొడవైన చెట్లతో, ఆఢ్య...నక్ = ఒప్పివిస్తరించిన నందనవనమునందు నెక్కువగ నార్జింపఁబడిన ఆనందముతో, అతి+ఉదార+ఆగమి......నక్=మిగుల నెక్కుడైన వేదములతోఁ గూడిన వ్యాసునికొడుకై అధికమైన ఆనందముతో.

187. ఘనపక్షవిలసనంబునక్=గొప్ప ఱెక్కల ప్రకాశముతో, హరి తత్వంబు = ఆకుపచ్చఁదనము - గొప్పదైన పక్షపాతముతో శ్రీ విష్ణు తత్త్వంబు నెఱుంగు, విష్ణుపద+ఏకగతికత్వము=ఆకసమునందు ముఖ్యముగాఁ బఱచుట - శ్రీవిష్ణుపాదములె శరణని నమ్మియుంట.

---

## సప్తమాశ్వాసము

1. సీమంతిని=ముత్తైదువ, మదిరేక్షణ=మదము గప్పినకన్నులు గలది.

4. విపంచి = వీణె.

5. ఉబుసు = పనిలేనికాలము.

6. వనదచయము = మేఘముల మొత్తము.

7. విధుమండలము = చంద్రమండలము.

10. అళిపుంజముల్ = తుమ్మెదలగుంపులు, కచకలాపము = కేశ పాశము.

11. ఈపద్యమున వనలక్ష్ములును, అప్సరసలును పాలునీరులవలెఁ గలిసి వీరు వీ రని తెలియనివారైరి - వారి వీరి యవయవము లొక్కటిగఁ గన్పట్టి నవి. తుమ్మెదలు—జడలు, తీగెలు—మేనులు, పువ్వుగుత్తులు—స్తనములు. చిగుళ్లు—హస్తములు—ఇట్లు.

12. కీరభాషిత=చిలుకల పలుకులచే, పోషిత = పెంపఁబడిన, అఖిల తపస్వి=అందఱి తాపసులయొక్క, పటల = సమూహముయొక్క, తారక = తరింపఁజేయు, పరబ్రహ్మవిభావనంబు = పరమాత్మయొక్క ఎక్కుడు భావన (ధ్యానము) గలది.

హరులు=సింహములు, వై౹౹రి = విధము, బభ్రుతతులు = ముంగిసలు, కీర......నంబు=చిలుకల పలుకులచేఁ బెంపఁబడిన యెల్లతాపసులఁ దరింపఁ జేయు పరబ్రహ్మయొక్క ధ్యానము గలది, భావి......నంబు=భావింపఁబడిన మేలిరక్షణము గలది.

13. తచ్చరణనఖరచంద్ర=అతనియడుగుల గోళ్లనెడు చంద్రుల యొక్క, చంద్రికా=వెన్నెలచే, ముకుళిత=మోడ్పఁబడిన, చారుహస్తనలిన= సుందరములైన హస్తములను కమలములయందు, సంగ = కూడుకొన్నదై, భృంగాయమాణ = తుమ్మెదవలె అగుచున్న. భ్రమరక నికరలు=ముంగురుల మొత్తము గలవారు.

కరుడుగట్టు = గడ్డకట్టు, కరువు=మూస, పూదె = పూస, తచ్చరణ ......నికరలు = ఆమణికంధరు కాలిగోరులను నర్ధచంద్రుల వెన్నెలచే మోడ్చిన సొంపగు హస్తపద్మములందు నాసక్తితోఁగూడిన తుమ్మెదవలె నగు చున్న ముంగురులు గలవారు. (అనఁగా నచ్చరలు తమ నొసళ్లు సోక తామర కేలు దాక మణికంధరునికి నమస్కరించి రని భావము.)

15. గరుదాల్చు = గగుర్పాటు చెందు, ఇయ్యకొను = ఒప్పుకొను, దృగంచలచంచలత్వము = కడకంటి కదలిక.

17. లోఁగు = లోఁబడు, చొఁగు=ప్రవేశించు. తోఁగు = మునుఁగు, తూఁగు=ఊఁగు, ముసుఁగు=చుట్టుకొను, అడ్గు=అడ్డుపెట్టు.

18. కంకేళి=అశోకము, గుళుచ్ఛము=గుత్తి, కుందరాజి=మొల్లలవరుస, హాళాహాళి = కలకలము, రహ = ఆసంబరము, స్వానము = శబ్దము.

19. ఒయ్యారము=విలాసము. వెన్నడ=అందమగు గమనము, తూలు= చలించు, మిటారించు=నిక్కు, జలదరించు=కంపించు, వలగ్నము = నడుము.

21. విరతము = చాలింపు, రొద=ధ్వని, అక్షిపక్ష్మావళులు = కంటి రెప్పల వరుసలు, విచు = విరుచు, వికృతి = వికారము.

23. భావి......గతి = సంభవింపఁబోవు కార్యమునకు అనుకూలముగ, కంతుఁడు = మన్మథుఁడు, శోఘన......సంతతి=ఆతని గొప్ప ధైర్యమను దృఢమైన సంకెలలు, కుసుమశస్త్రిక = పూవను చురకత్తి.

24. దర్పక=మన్మథునియొక్క, ఉగ్రప్రతాప = తీక్ష్ణమైన శౌర్య (తేజ)ముచే, సంతప్తమైన = తపింపఁజేయఁబడిన తాపసుని చిత్తము = ముని మనస్సు.

దర్ప......దయ్యె = మన్మథుని తీక్ష్ణమైన ప్రతాపముచేఁ దపన పొందిన యాతపసి మనస్సు ఆస్త్రీయొక్క అందమనెడి సరస్సులో మునిఁగి పోయి తిరిగి రానేరదయ్యెను. అనఁగా అమణికంధరుఁ డాయచ్చరనే చూచుచుండె నని భావము.

27. పల్లవాధర = చిగురువంటి పెదవి గలది, పరిరంభణము = ఆలింగనము.

28. చంపకము = సంపెంగ, కురవకద్రుమము = గోరంటచెట్టు, కుజము = చెట్టు, ప్రేంకణము = ప్రియంగువృక్షము.

30. ఆసవము = మద్యము, పొగ+డంబు = ధూమముయొక్క విలాసము.

31. అపవర్గపదము = మోక్షస్థానము.

32. ప్రబోధవాసనలు = జ్ఞానసంస్కారములు.

34. చకోరాక్షి=వెన్నెలపులుంగు కన్నులవంటి కన్నులు గలది.

35. క్రీడార్థము = విలాసార్థము (రతి).

36. కెలను = పార్శ్వము.

40. కదుపు = మొత్తము, రాయిడి = ఒరయిక.

41. పెనఁకువ=పెనఁగుట, ఆస్ఫాలనము = చేయప్పళించుట, ఆఁక= నిషేధము, గొడగొను = త్వరపడు, నఖరరేఖాంకము = గోటిగీఱల గుర్తు, బెరుకు = భేదము, సాదు రేఁగినఁ దలపోలాననిలువదు=ఆవు, లేడి మొదలైన మంచితనమున నుండు జంతువులకుఁ గోపము వచ్చెనేని సరిహద్దున నిలువదు, ఎంతకైనఁ దెగించి పోరాడు. అట్లే సజ్జనుఁడు కామాదులకు వశుఁడయ్యె నేని వాని నిలువరింప లేఁడని భావము.

43. చిత్తజలీలల్ = మన్మథక్రీడలు.

45. పచరించు = వర్తించు.

49. జాతిప్రతిమకుఁ జక్కిలిగింత = జాతిబొమ్మకు చక్కిలిగిలి యున్నదా-మన సెట్టిచోటులను మాఱదు పిసుఁగుఁజెందదు-స్వస్థానచ్యుతిఁ జెంద దని భావము, గెంటు = చలనము.

50. బతము = వ్రతము.

51. కరఁచు = కరఁగించు, చెయ్వు = పని.

52. వాల్లభ్యము = ప్రియము.

54. విరాళి = విరహము.

55. చూతావళి = మామిడులవరుస, భూజము = వృక్షము.

57. పరాకు = తత్పరత.

60. క్షణభంగురము = నిముసములో నశించునది, తాల్మి = ఓరుపు.

62. డాఁచు = దాఁచు, ప్రోచు = పోషించు.

63. కౌబేరి = కుబేరునిదిక్కు - ఉత్తరము.

64. ఎక్కిరింత = వాహనము (సింహము.)

66. ఇతము = హితము.

67. పల్లము = జీని, పెనుఁబొఁపతట్టము = గళ్లపుజీని బిగించు పెద్ద సర్పముయొక్క టంగువాఱు, వాడపుఁ బసిండియంకవన్నెలు=రసవాదముతో

రాగి లోనగులోహముల నూర్చిన బంగారు అంకెములు - గుఱ్ఱమెక్కు-నప్పుడు కాలుంచునవి, ఏనికదిండివార్వము = ఏనుఁగును దిను పింగ మను గుఱ్ఱము, సంకుపేరు = శంఖములమాల, మరగొమ్ము = జీని ముందు వెనుకల నుండు నెత్తైన భాగము.

70. ఎద్దులు బడికం నేకమైనఁ గొండమీఁదికిఁ బోవును. తోలువాఁడు లేక వానిపని పూర్తి చేసికొనును. ఇరువు రొకటైన మూఁడవవాని సాయ మక్కఱలే దనుట.

71. మగులు=మదుపు, దోహదము = అకాలమునఁ బుష్పించుటకై వృక్షాదులకుఁ జేయు చికిత్స - పొగవేయుట ఇత్యాది.

72. దారున = తటాలున. మేఘరంజి = ఆపేరిరాగము, ఘన...... పలై = మిగుల నేర్పు నింపుగానకళకు వలయు వీణాదిపరికరము గలవార లై.

73. దుమదుమ = మిగుల వడిగల.

76. ఆకె = ఆమె.

77. వేళాకోళము = చిక్కైనది, కలాసము = తోలు, బీఱజడలు= పెద్దజడలు.

78. జోగి = యోగి.

81. నీమనము......వైచెదక్=నీమనస్సులో దుఃఖ మంతయు లేక చేసెదను - అనఁగాఁ జంపుదు నని భావము.

82. కుడువఁబోవుచుఁ గూరలచవి యడుగ నేల = పైశుణములో ననుభవింపఁబోవుదానినిగూర్చి యడుగుట మొదలగు.

83. అకుంఠితగతి = మొక్కవోనినడక.

85. ఉచ్చాటన......టు=పిశాచముల తోలుటకు వలయుఁబదనిక తీఁగెతోఁ జేసిన చముకు (బాటి)-చెట్టుమీఁద మఱియొక్క చెట్టు లేక తీఁగె పుట్టిన దానిని బదనిక యందురు; లివ = నట్టన, వాఁగె = కళ్లెము.

87. మేచెమర్చు = చెమటపట్టు, పల్లటిలు = చలించు.

88. మర్యాదావిస్మరణము = హద్దు మఱచిపోవుట, పారీంద్రము= సింహాము.

89. పల్లనము = జీని.

90. నరవెంద్రుకలు = నరసిన వెంద్రుకలు, చెలదిపురువ్వ = సాలె పురుగు, వళ్లు = పోగులు (వడి), పొక్కిలి=గుంట, వడువు = విధము, వక్షోజము = స్తనము, ఘూకరవము = గూబయఱపు, కాస = దగ్గు.

93. కూన = బిడ్డ, అసిపాలు = ఖడ్గము పాలు.

99. చక్రి = చక్రాయుధము గలవాఁడు - విష్ణువు, నిర్విశేషము = భేదము.

100. అడలు = దుఃఖించు, అనుభావ్యము = అనుభవింపఁదగినది.

102. తెగు = సాహసించు, గడించు = సంపాదించు.

104. కొఱఁకుకుబోవ బడిగల్లువడియె=మేకకొఱకుఁ బసులు మేయు కంచెకు పోగా చట్టురాయి మీఁదఁబడినది. (అనఁగా తన పని నెఱవేరలేదు సరికదా పైగాఁ జేటుపుగలిగిన దని భావము.)

111. బెగడు = భయపడు.

114. గోరుగల్లు=మంగలివానికడ నుండు గోరులు తీయు పనిముట్టు, నారసము=ఉక్కుబాణము, గోరుగల్లుతోఁ గన్నులు పెకల్చుకొని బాణములను జెవులఁ గ్రుచ్చుకొని దూరదృష్టి, దూరశ్రవణముల వశపఱచుకొన్నాఁడనుట.

115. దండ = సమీపము, సురియ = కత్తి, శాకంబము = ఱాతి స్తంభము.

116. దూరవీక్షార్థి = దూరదృష్టిని గోరువాఁడు, హృతాక్షుఁడు = హరింపఁబడిన కన్నులు గలవాఁడు.

118. మిడిదల = నడుము.

119. నిర్విపక్షము = శత్రువులు లేనిది.

120. నిధనశంక = మరణసందేహము.

123. పట్టి = బిడ్డ.

126. ముదిజంత = ధూర్తయైన ముసలిది, జెల్లి = వంచకురాలు, వగ్గు = బక్క, తివంబోవు = లాగఁబోవు.

127. కరు......మతి = కనికరముచేఁ గలంగిన మనస్సు గలది.

128. నుల్చు = పెడఁద్రిప్పు, వేసలి = జడ, తార్కొను = సమీపించు, ఒప్పనము=అర్పణము, ఒగ్గు = ఒడ్డు - చాచు.

129. పట్టెము = ఖడ్గము.

130. ఇరులు=చీఁకటి, బాహువల్లరి=తీఁగెవంటి చేయి, నూఁగారు=స్తనములనడుమ రోమావళి, నితంబము = పిఱుఁదు.

131. శక్తి...గాత్రుక్=శక్తిహస్తముచేఁ ద్రోయఁబడిన శరీరము గలవానిని.

133. భోగ్యార్థచింతనము=భోగింపఁదగిన వస్తువులయం దాసక్తితోఁ జింతించుట, యమనియమవర్తనములు = అహింస అస్తేయము సత్యము లోనగునవి యమ మనఁబడు, నియమము = తపము, సంతోషము, వేదాధ్యయనము లోనగునవి.

135. బంధుర=మనోహరమైన, వీణా=వీణెతో, సహిత=కూడుకొన్న, స్కంధముతో = భుజముతో, రత్నమాలికా = రత్నాలహారమును, ఘటిత = కూర్చిన, జటాబంధముతో = జడముడితో.

బంధుర......గలిక్ = మనోహరమైన వీణెను భుజముపై నుంచి రత్నమాలికచే నలంకృతమైన జడలముడితో మణికంధరుఁ డచ్చటికి వచ్చెను.

137. వ్యూహము = సమూహము.

138. మచ్చెకంటి = చేఁపలవంటి కన్నులు గలది.

140. చారు.........బు = సుందరమైన జూదమాడు భవనము, దచ్చౌక = ఎనిమిది, చౌపంచ = ఐదు, ఇత్తిగ = ఆఱు, బారా=పండ్రెండు, దుగ = రెండు.

141. కుటిలకచ = వంకరలైన కురులు గలది, పటికంపుగోడ = స్ఫటికములగోడ, మణిభిత్తి = రత్నాలగోడ.

146. బలి......రంబుసు = బలి యిచ్చుటకుఁ బశువుగాఁ జేయు ప్రయత్నముయొక్క రీతి.

150. ఆన = ఆజ్ఞ - ప్రమాణము.

151. దృఢముష్టి = బిగిపిడికిలి.

154. మ్రాన్పడు = మొద్దువలె నగు.

155. ఒజ్జ = ఉపాధ్యాయుఁడు.

158. పేరెలుఁగు = పెద్దకంఠస్వరము.

162. రయోద్ధతుఁడు = వేగముచే భయంకరుఁడు, ప్రకుపితుఁడు = మిగుల కోపించినవాఁడు.

163. పోతరము = పొగరు, నారి=స్త్రీ, దండ=చేరువ, అమర్షము= కోపము.

166. నీవి = పోకముడి, శ్రవణకల్హారము = చెవిని జెక్కిన యెఱ్ఱ కలువ, మూఁపు = భుజము.

167. కైదువు = ఆయుధము, ఇమ్మెయి = ఈవిధము.

168. పోఁడిమి = విధము.

174. పౌలస్త్యసుతుఁడు=కుబేరుని పుత్త్రుఁడు (నలకూబరుఁడు.) కట్టము = కత్తి.

175. దట్టించు = అదలుచు, పిరువీకు = పీఁకులాడు - బాధ.

176. కుచస్తబకము = చనుగుత్తి.

177. మనోభవక్రియ = రతి, కృపాణము = ఖ

178. విపినము = అడవి, ఈగడ = జాడ.

181. యక్షేశసుతుఁడు = నలకూబరుఁడు.

182. అవధానము = హెచ్చరిక.

187. అసురజంత = ధూర్త యైన రక్కసి - మోసగత్తె.

188. హత్తించు = కూర్చు, ఉత్తలపాటు = తల్లడపాటు.

189. అజ్కజము = వింత.

190. టొంగాములు = అగుట, కాకపోవుట.

194. ఆక్రందనము = ఏడుపుతో నఱచుట, ఇఱ్ఱి = లేడి, డాపలి వంక = ఎడమప్రక్క.

195. వేల్పులసాని = ఎఱుకఁ జెప్పువనిత.

196. పెనుదగర = పెద్దపిశాచము.

198. మునిముచ్చు = దొంగ.

199. కంబుకంఠి = శంఖమువంటి మెడ గలది.

200. ఇల్లలికినఁ బండు గగునే = ఒకపనిలోఁ గొంత యనుకూలించి నంతనే ఆపని నెఱవేరినట్లా? అని భావము, లాఁతి = ఇతరము.

201. పట్టెంబు = ఖడ్గము, కాణాచి = చిరకాల మున్నచోటు.

204. దొంగలానవాడిచినఁగోకల్ విడుతురె = దొంగ లొట్టు పెట్టుకొన్నంతమాత్రమునఁ జీరలు వైకొనరా? - చెడ్డవారి శపథములు నమ్ముదురా? - నీమాటలు నమ్మఁదగినవి కా వని భావము.

205. గంతు = త్రుళ్లు, రంతు = రతి (కాని కాఱుకూఁతలు అని తోఁచెదు,)

208. జగడపుఁ గూటిసత్తరువు = కలహ మను నన్నము పెట్టు ం, తందనాలు = మాటిమాటికి తానశబ్దపూర్వముగ చేసెడు రాగా

ంచ్చలము = నిశ్చయము - నిశ్చలము.

211. ద్వైరూప్యము = రెండురూపులు.

213. విరించితనయుఁడు = నారదుఁడు.

215. అన్నువ=కొంచెము, గుబ్బసరము = పలురకముల రత్నాలు గూర్చిన హారము-ఇచ్చట గురివిందపూవులదండ యని యెఱుఁగనగు.

216. అజసూనుఁడు = నారదుఁడు.

219. తార్కాణ = దృష్టాంతము.

220. తథ్యమిథ్యాభావంబులు = సత్యము, అసత్యము అను వీని ధర్మములు.

222. ఊరువడు = నెఱవేరు, ఇనుమడించు = ఇబ్బడియగు.

224. మారకేళి = రతి.

226. పక్ష్మలాక్షి=దట్టమైన ఱెప్పవెండ్రుకలుఁగల నేత్రములు గలది.

227. కొఱగామి = పనికిమాలినతనము, సుత్రాముఁడు=ఇంద్రుఁడు, ప్రాపు = రక్షణము.

228. అఱచేతం బండ్లు వచ్చినపుడు వమ్మున్ గఱచెదవుగాక = అఱచేతిలో దంతములు వచ్చినపుడు గఱవ మనుట-నీ కింత అధికారము వచ్చినపుడు చూపుము.

231. నీ నుదుటనే ప్రొద్దుపొడిచెనె = నీకే దేవుఁ డున్నాఁడా? నాకు లేఁడా? అని.

232. ప్రియవియోగ = ప్రియుని యెడఁబాటుచే, దర్పిత=పొగరెక్కిన, అనల్ప+కందర్ప+హేతి=కఠినమైన (బలమైన) మన్మథుని యాయుధములయొక్క, ఘాత=వ్రేటులచే, జాత+చేతస్తాపంబునన్ = పుట్టిన మనోవేదనచే.

ప్రియ......బునను = ప్రియుని యెడబాటుచేఁ బొగరెక్కిన మిక్కిలియైన మన్మథుని యాయుధముల వ్రేటులచేఁ బుట్టిన మనస్తాపముచేత.

233. మెఱియత = చలింపనిది.

236. దుండగము=తప్పిదము - కొంటెచేష్ట, పదరు=ఆక్షేపించు.

239. జగదుపశ్లోకితము = జగత్తునందుఁ బ్రసిద్ధి కెక్కినది, గఱువ తనము=గొప్పతనము.

242. సంస్తంభింపనీరు = నిలువనీయరు.

244. నాకము = స్వర్గము.

250. మెదపు = చలించు.

251. ద్రిమ్మరి = ఎప్పుడు దిరుగునది.

256. బెట్టిదము = ఉద్ధతి, బిరుసు = కఠినత.

257. అభిమతఖేలనము = ఇష్టమగు క్రీడ.

260. మామ......చే = నామేలి గొప్ప యాఁయుధము చే.

264. వాచాగతి = మాటతీరు.

267. లంకించుకొను = చిక్కించుకొను.

268. ననవింటివాఁడు = మన్మథుఁడు.

269. కొంచు = జంట.

270. పికసంచయ=కోయిలగుంపులయొక్క; పంచమ = పంచమస్వర ముచే, వంచిత+అసువుల్ = మోసగింపఁబడిన ప్రాణములు గలవారు.

పిక......వుల్ = కోయిలయొక్క పంచమ స్వరముతో సాటియగు కూఁతచే మోసగింపఁబడిన ప్రాణములు గలవారు.

277. బేడిదంపుటీరసము=గాటమగు నీర్ష్య, కుంభినీధరగహ్వరము = కొండగవి, ఒడ్డారించు=ప్రతిఘటించు, కీలా......బులక్ = మోచేతిపోట్లు పిడికిలి గ్రుద్దులు వీనిచే, అచ్చలము = పట్టుదల, కడిందికడిమి = దిట్టమైన పరాక్రమము, అఱిముఱి = సంభ్రమము.

279. ఉక్కు = బలము.

280. ప్రాక్తనవర్తనము = ముందు జరిగినది.

282. అల్పావశిష్టాయువు = కొంచెము మిగులుగల ఆయుస్సు గల వాఁడు.

283. కాకదంతపరీక్ష=కాకికిఁ బండ్లెన్ని అని పరీక్షించుట నిష్ప్రయోజనము.

284. భవితవ్యతావశంబు = కాఁదగిన దానికి లోనైనది.

285. అవశ్యంభావి = తప్పక కాఁదగినది.

287. జాంఘికుఁడు = వేగముగఁ బర్వెత్తువాఁడు, ద్రాఘీయము = మిక్కిలి పొడవైనది.

288. జీవంజీవ+ఆజీవ = వెన్నెలపులుఁగు జీవికయైనవాఁడా.

---

చతుర్థాశ్వాసము

1. ఆశ = దిక్కు.

2. దండ = సమీపము.

3. సందుకొను = సమయముఁ జూచి చేరు.

4. మసలుట = తడయుట.

7. ఉజ్జగించు = వీడు.

8. అవితథోద్యమము = వమ్ముగాని ప్రయత్నము.

19. ఏకదేశసామ్యావగుణము = రెండువస్తువులకు నొక్క విషయములో సాదృశ్య మున్నదను తప్పు, మణిగ్రీవుఁడు = మణికంధరుఁడు (ఈరెండుశబ్దము లొకే యర్థమును దోఁపించెడు.)

20. గుబ్బురను=గుండె దడదడ యని కొట్టుకొను, ఎరియు=మండు.

23. అత్యాయతము = మిగుల విస్తరిల్లినది.

24. ఇచ్చకము = ప్రియవచనము.

29. రంభా......రుండైన = రంభచెంగట విలసిల్లు క్రొత్తసొబగు మెఱుపు గలవాఁడై.

30. సుద్ది=వృత్తాంతము, శిలా......విది = ఱాతిమీఁద వ్రాయఁబడిన యక్షరములలోఁ జెప్పఁబడిన తెగించి చేయుపని.

32. భేదవాది సిద్ధాంతము = ద్వైతము, ఉరగాధిపశాస్త్రము = పాతంజలయోగశాస్త్రము, పాంచ......దీప్తులన్ = వైష్ణవసిద్ధాంతము సమర్థించువానిలో ధన్యమైన మనస్సుచే.

33. చిత్ + అచిత్ + ఈశ్వరులు = జీవుఁడు ప్రకృతి భగవంతుఁడు, శేషశేషిత్వములు = ప్రపంచము, ఈశ్వరుఁడు.

36. అయుతసిద్ధత్వము = ఒకటొకటికి సెడతెగని సంబంధము గలిగి యుండుట, సూర్యుఁడు + తేజస్సు, చంద్రుఁడు + వెన్నెల, విశేష్యవిశేషణము-నీలోత్పలము-నిత్యసంబంధము.

40. నిపాతము = పతనము.

41. సౌష్ఠవము=మంచిశబ్దముల చక్కని యుచ్చారణము, రువ్వ+ఇచ్చు=వల్లెవేయు, గెంటు=తొలఁగు, కొంత పదసామ్యముచే క్రమము దప్పి మఱియొకదానిం జేకొనుట, నిలక = నిలుపక.

43. అనధ్యాయము=చతుర్దశి పూర్ణిమ పాడ్యమి లోనగు నధ్యయన యోగ్యములుకాని తిథులు.

44. ముంజి = దర్భలమొలత్రాడు, జన్నిదము = జందెము, మేధావి బొట్టు = బ్రహ్మచారులు హోమముచేసి కడపట ఆయగ్నిలోని భస్మమును తీసికొని నేతితోఁ జాఁదిపెట్టుకొనుబొట్టు-ఇది బ్రహ్మవర్చస్సు నొసఁగును.

45. శాఖ = కొమ్మ.

47. ఎడలు = పాయు.

49. కొమరుందనము = అందము.

51. శతతాళదఘ్నము=నూఱు తాటిమ్రాఁకులంత లోతు, హ్రదము= మడుగు.

60. కర్ణిక = చెవికమ్మ, తలఁకు = భయపడు.

65. పోడుములు = గుర్తులు.

66. సిబ్బితికాఁడు = సిగ్గుగలవాఁడు

68. ఊడిగము = సేవ.

69. బాగా = తమ్ములపాకు మడుఁగు.

70. ఆమని = వసంతము.

71. ఉడుగు = కృశించు.

74. వట్టి గొడ్డుతాకట్టు = పాలు వట్టిపోయిన పసరము (ఆవు)ను గుదువపెట్టుకొనుట, దానివలనఁ బాలు లేదు, సరిగదా పైగా దానిమేపు దండుగ, కాఱియ = బాధ.

75. కట్టడ = ఆజ్ఞ.

77. సమధిక=మిక్కిలి యెక్కువైన, మధుమద = మద్యమువలని మదముయొక్క, గరిమా = ఆధిక్యముచే, అసమ=సరిలేక, చంచల=చలించు, చంచరీకసంచయ = తుమ్మెదల సమూహముయొక్క, సంచార = తిరుగుటచే, మనోరమ = మనస్సునకింపైన, సుమనోరమ‌క్ = పూవుల సిరితో.

సమ......రమక్ = మిగుల నెక్కుడైన పూఁదేనె ద్రావిన మత్తు పైకొని మిక్కిలి తిరుగాడు తుమ్మెదలతోడి చక్కని పూవులుగలిగి యింపైనది.

78. త్రవ్వటము = తొలికతోఁ ద్రవ్వట, అవిరతము = ఎల్లప్పుడు, హేళి = సంతోసము.

79. గేదంగి=మొగలివృక్షము, కురవకము=గోరంటవృక్షము, జాది= జాజివృక్షము, గొజ్జంగి = పన్నీరువృక్షము, సుంగము = పుష్పలతవృక్షము, లుంగము = మాదీఫలవృక్షము, కుడుంగము = పొదరిల్లువృక్షము.

80. అవిరళము = దట్టమైనది, ఇవము = మంచు.

81. నితాంతము = ఎడతెగనిది.

82. బొందు = పుష్పమాల, కందుకము = బంతి.

84. వ్రీడ = సిగ్గు.

86. జలధరము = మేఘము.

87. ఘనాఘన+ఓఘ = మేఘపంక్తులయొక్క, సముదగ్ర=మిక్కిలి గొప్పవై, నిరర్గళ=అడ్డులేనివై, ఘర్ఘర+ఆర్భటీ = ఘర్ ఘర్ అను ధ్వనితో, లగన=కూడిన, ఘన+ఉచ్ఛలత్ = మిక్కిలి పైకెగురుచున్న, జల = నీటి యొక్క, ఝుళంఝుళత్=ఝుళఝుళమను, నిర్ఝర=సెలయేటిచే, జర్ఝరీభవత్ = తాఱుమాఱగుచున్నవై, నగనిగళత్=కొండనుండి జాఱుచున్న, శిలాగణ = ఱాళ్లమొత్తముయొక్క, ఘణంఘణాఘోషణ = ఘణఘణ మను ధ్వనులచే, భీషణంబుగన్ = భయంకరముగ.

ఘనాఘనా......భీషణంబుగన్ = మేఘపంక్తులయొక్క మిగుల గొప్పవైన అడ్డులేని ఘుల్ ఘుల్ అను ధ్వనులతోఁగూడి మిక్కిలి పైకెగురు నీళ్లఝుళఝుళ మను కొండసెలయేఱులచే సడలిన కొండనుండి జాఱుఱాళ్లవరు సలయొక్క గణగణమను చప్పుడు భయంకరముకాఁగా వర్షము కురిసెను.

88. ఉదధిసమేత = సముద్రముతోఁగూడ (నీటితో), పీత=త్రాగి, ఉద్వాంత=వెడలఁగ్రక్క, బాడబజ్వాలాయిత=బాడబాగ్నిజ్వాలలవలెనగు చున్న, శంపాలతంబు=మెఱుఁగుదీఁగెలు గలది, నిర్ఘాంతరవ=పిడుగుల ధ్వను లచే, సరంధ్రీకృత=తూట్లతోఁ గూడినదిగాఁ జేయఁబడ్డ, అజాండ=బ్రహ్మాం డముయొక్క, బహిర్జలభ్రమద=వెలుపలినీరు అను భ్రమను ఇచ్చు-(కల్గించు), ధారా+ఊర్జితంబు = ధారల ఆధిక్యము గలది,, నిర్మాద్య = మాంద్యములేక, గర్జిత=గర్జించిన, స్ఫూర్జ = పిడుగు, ధ్వనులచే, తర్జిత = భయపెట్టిన, ప్రళయ భైరవ = ప్రళయకాలమందలి భైరవునియొక్క, రటత్ = మ్రోఁగు, పటహ రవము = తప్పెటధ్వని గలది, ఝంఝా ప్రభంజన = వానతోడి గాలివలన, జాత=పుట్టిన, సంఘట్టన=ఒరిపిడిచే, పరిగళత్=జాఱిపోవుచున్న, తారకల్ = నక్షత్రములగుచున్న, కరకగణము=వడగండ్ల మొత్తము గలది.

ఈబెడిదంపువాన—కర్త. దాని విశేషణములు క్రిందివి. ౧.ఉదధి... తంబు=సముద్రపునీటితోఁ ద్రావి వెడలఁగ్రక్కిన బాడబాగ్నియొక్క జ్వాల

లగుచున్న మెఱుఁగుదీవలు గలదియు. ౨.నిర్ఘాత......తంబు=పిడుగుల పెద్ద చప్పుళ్లచే తూటులుపడ్డ బ్రహ్మాండగోళమునకు వెలుపలిభాగమున నున్న నీరా అను భ్రాంతిని గలిగించు నీటిధారలతోఁ గూడుకొన్నదియు. 3.నిర్జాడ్య... వము=అలసతలేక తీవ్రముగా నుఱిమిన పిడుగుల ధ్వనులచే భయపఱిచిన ప్రళయకాలభైరవుని తప్పెటగలదియు-ఆతప్పెట ధ్వనికన్న ఉఱుము మించి యున్నదని భావము. ౪. ఝంఝా......గణము = వానితోఁగూడిన పెను గాలిచేఁ బుట్టిన యొరపిడి గలవై క్రిందికి జాఱిపడుచున్న నక్షత్రములా యన్నట్లున్న వడగండ్లుగలది,ఘనఘనాఘనసంఘము=గొప్పమబ్బులమొత్తము.

89. మొగులు = మబ్బు.

91. నింగి = ఆకసము, పోరింబోరి మాటిమాటికి.

93. వ్రత......ము=వ్రతములు, దానములు వానివలనఁ బుట్టినది.

94. పొరయు = పొందు, పొలపపెల్లి = వ్యాపించిన ప్రవాహము, పాయ = ఎడము, మడఁగు = వంగు - మరలు.

95. కతము = కారణము. పిరిచుట్టు = మెలికగాఁ జుట్టుకొనుట.

98. తోరము=స్థూలము, వ్రేఁగు = బరువు, గుద్దలి = మట్టిని త్రవ్వు సాధనము (కట్టు), అడుసుతుంపరు = అడుసుయొక్క చిన్నబొట్టు.

99. మరుఁడు = మన్మథుఁడు.

100. కపోల...ల్ = చెక్కిళ్లయందలి చెమ్మటబొట్లు.

101. తమకము = ఇచ్ఛ.

105. వసివాళ్లు = మిక్కిలి వాడిపోవుటలు, నెఱి = అందము.

106. నర్మాలాపము = పరిహాసోక్తి, వయస్య = చెలికత్తె.

107. బెడంకు = చలించు, కుఱుమాపుదడిమంపుఁగోక = కొంచెముగా మాసిన సన్నని చీర, ముళ్లపేరు = హారము, గనియు = నర్తించు.

108. ఒప్పమి = తప్పు.

109. సాధ్వసము = భయము, ప్రిదుఁలు = విరియు.

112. ఉద్వేలత=(అతిక్రమించు) - అగ్గలము. త్రిమ్మట=త్రిప్పట సంచారము, బుగ్గురను = పరిమళించు.

116. దూఱు = నిందించు, నికటక్షోణి = సమీపప్రదేశము.

118. కంతుసంతాపము = మన్మథవేదన.

120. హొరంబట్టు = బంగారుపట్టుజరీ.

123. తొత్తు = దాసి.

124. పాదసంవాహనము = కాళ్లొత్తుకట.

125. ఒప్పిదము = అందము.

131. ముప్పు = ముసలితనము.

133. ఈలువు = పాతివ్రత్యము, ప్రవాసము = దేశాంతరమున నుండుట, 134. గరగరిక = అందము.

136. అకాలసురతక్రియ = వేళగానివేళ చేసిన సంగమము, ప్రసూతుఁడు=పుట్టినవాఁడు.

138. విధినిషేధములు=చేయవలసినది విధి-మాతృసేవ-చేయఁఁగనిది నిషేధము - మద్యసేవ ఇట్టివి.

140. నిసర్గము = సహజము.

142. ఉత్కరము=సమూహము, నిర్ఘాతము = ఎగురగొట్టఁబడినది.

144. ఒరయు=పరీక్షించు, జాన......నంజేసి = సొగసుచేసికొనని పల్లెటూరి సహజసౌందర్యమునఁ బ్రీతి, విచ్ఛిత్తి = భూషణాదులు లేకున్నను అందముగాఁ గనుకట్టుట.

147. క్రాయు = వెడలఁగ్రక్కు - ఉమియు, ఉడివోవు = తగ్గు. తగులు = సంబంధము - ప్రేమ.

152. జల......గుప్తుఁడు = నీటిని స్తంభింపఁజేయు విద్యచే మెఱయువాఁడు, పరిశ్రాంతి = బడలిక.

153. ప్రణతి = నమస్కారము.

154. వదనము = ముఖము.

155. వయ స్తంభనపుమణి=యౌవనము నిల్పురత్నము-ముసలితనము రానీయనిది, తక్కడి = గజ్జము, వాదవిద్య = పాదరసముతో రాగి లోనగు తక్కువ లోహములను బంగారుచేయువిద్య, వాలు = ఖడ్గము, పట్టెము = ఖడ్గము.

156. గంభీరము = లోతు, కుంభిద్వేషి = సింహము.

159. కర్ణాభ్యాసము = చెవిసమీపము.

164. తనియమి = తృప్తిపొందకపోవుట.

170. సద్యః......తంబు=అప్పుడ మొలకెత్తిన సిగ్గుచేనలంకరింపఁబడినది.

172. చంద్ర......మము = చంద్రునికి సిగ్గుగూర్చుటలో సమర్థమైనది (మేలిరూపు.)

173. ధనదుపట్టి = నలకూబరుఁడు.

175. భూత......వులు=కడచినవియు, ఇప్పుడున్నవియు, ఉండఁబోవునవియు నగు లోకములోని పదార్థములు.

177. సంపత్ కలనా కాముఁడు = సంపదను బొందఁ గోరినవాఁడు.

178. చలుపు = చేయు.

180. త్రిదివవారాంగన = వేల్పులవేశ్య, అభీలము=ఉగ్రము.

183. పూతము=పవిత్రము,దుర్నీతిప్రక్రియ=చెడ్డనడవడి నుండుట.

186. వక్త్రము = ముఖము.

188. దద్దరిల్లు = తబ్బిబ్బుపడు, ఉద్ధత = ఉగ్రులైన, ద్విషత్ + సంతతి=శత్రువుల సమూహముయొక్క, కంఠ = మెడలయొక్క, ఖండనవిచక్షణ=ఖండించుటయందు నేర్పుగల, దక్షిణబాహుశౌర్యము=కుడిచేయిసత్తువ.

ఉద్ధర......ముక్=గర్వించి ఉగ్రులైన పగవా[illegible]షుక[illegible] కఱకుటయందు నేర్పుగల నీకుడిచేయి సత్తువ.

189. చక్కగచ్చు =

191. విలంబనము=ఆలస్యము, వ్యవధానము=ఎడము, సద్యోయావనుండు = పుట్టుకతోడనే వచ్చిన జవ్వనము గలవాఁడు, ప్రీణనము=తృప్తిఁబుట్టించు, పునః......క=మరలఁగూడిన శిరస్సుగలది, తాత్పర్యము=ఆసక్తి, ద్వారా......భూమి=ద్వారకానగరమునందలి వేశ్య లుండువీథికి అలంకారప్రాయమైన తన మేడయొక్క ఉద్యానవనప్రదేశము, వరవర్ణిని = ఉత్తమురాలు, వలభివిశేషవివరంబు=ఒకానొక గోడరంధ్రము.

192. భృగు=కొండమీఁది చఱియనుండి, నిపాత = పడుటయందు, లంపట = ఆసక్తిగల, మతియై = మనస్సుగలవాఁడై.

భృ......మతి = కొండమీఁది చఱియనుండి క్రిందికి దూకుట (ప్రాణములు పోఁగొట్టుకొనుట) యందు ఆసక్తితోడి మనస్సుగలవాఁడు.

193. అలబ్ధావకాశుఁడు=పొందఁబడని అవకాశముగలవాఁడు, అతనుఁడు = మన్మథుఁడు.

194. దేశాంతర......శుక్=ఇతర దేశములందలి వింతవస్తువులఁ జూడవలె నను కోర్కిచే.

195. వరజవశాలి = మంచివడి గలిగి యొప్పునది, కేసరి=సింహము, యదృచ్ఛాగతి = ఇచ్చవచ్చిన ట్లేఁగుట.

196. భీకర=భయంకరములైన, మకర=మొసళ్లు, తిమింగిల = తిమింగిలములు, ఆది=మొదలైన, ఘన+జలజంతు = గొప్ప నీటిజంతువులయొక్క, ఉత్కర=సమూహముయొక్క, విహరణ = విహరించుటయందు, భృశ=అధికమైన, శార్దుర్=రౌద్రగుణముగలవాఁడు - భయంకరమైన వాఁడు, ఘుమఘుమరవ=ఘుమఘుమ మను ధ్వనిచే, అపనిద్రుర్ = నిద్రలేని వాఁడును.

భీకర......ద్రుర్ = భయంకరములైన మొసళ్లు తిమింగిలములు ......రముచే మిగుల వెలుఁగొల్పునది-సరిలేక ఘుమఘుమ

198. శీకరబృందము=తుంపురుల మొత్తము, అశీతిమరీచి=సూర్యుని యొక్క, మరీచిజాల = కిరణముల సమూహముతో, మైత్రీకృత = స్నేహము చేయుటచే, ధాళధళ్యమై = ధళధళ మను కాంతులు గలదై.

శీతర......దుక్ = ఈసముద్రములోనుండి పైకెగురు నీటితుంపరల మొత్తమంతయు సూర్యుని కిరణములతోడి చెలిమిచే ధళధళమను కాంతులు గలదై మెఱయుచుండఁగా సముద్రుఁడు తాను రత్నాకరుఁ డన్న భావమును బైకిఁ గనపఱిచిన ట్లున్నది.

199. తిమిప్రకాండము=తిములను పెద్దచేఁపల మొత్తము. ఉద్వేలపు టూర్ధ్వధార=ఎక్కువైన పైకిచిమ్మిన నీటిధార.

ఓలలితాంగి.........రనక్ = ఓలలనా! ఈకడలిలోని తిమి యను మేలగు పెద్దచేఁప నీరు నిండుగఁ ద్రావి శిరోరంధ్రమునుండి నీటిని దీవ్రముగా పైకి వెలువరించుట ఎట్లున్న దనఁగా సముద్రుఁ డాకాశగంగతో వినోద క్రీడగఁ జిమ్మన గ్రోవి సెగజిమ్మనట్లున్న దని భావము.

200. ఉగ్ర=భయంకరమైన, తిమి=తిమి యను చేఁపయొక్క, శిరోరంధ్ర = శిరస్సురంధ్రమునుండి, నిష్ఠ్యూతము=వెడలఁగ్రక్కఁబడినది.

ఉగ్ర...యానంగ - భయంకరమైన తిమిశిరమునుండి వెడలఁగ్రక్కఁబడిన నీటిధారల మొత్తము ఆసముద్రపుటొడ్డునఁ బడి ఎట్లున్న దన సముద్రమును చుట్టుకొన్న పెద్దసర్పము ధిస్సుముని తన పడగ ఎత్తిన ట్లున్నది.

201. ఉల్లసత్ = ప్రకాశించు, రస=నీటిచే, అఖర్వ=విస్తరిల్లిన, సుపర్వ సింధువును = దేవగంగను.

ఔర్వము......కైవడి - సముద్రము తనలో బడబాగ్ని యను విరహాగ్ని తన్నెంతయు వెతపెట్టఁగా తన యల లనెడు బాహువులు పొడవుగఁ జాచుచు పైన నాకసమునందుఁ బొంగు నీటిప్రవాహము గల (ప్రేమరసము) దేవగంగను గౌఁగిలించుకొనఁబోవుచున్నదా అన్న ట్లున్నది.

202. సకలద్వీపవతీగణంబు = అన్నినదులసమూహము, యుగపత్ = ఒక్కమాఱే, సంప్రాప్త=పొందిన, నవ్య=క్రొత్తవైన, ఉల్లసత్ =ప్రకాశించు, మకరీభంగ=మకరికాపత్రముల రచనలుగల, పయోధరత్వము= స్తనములు గలుగుట, మకరీ=ఆడుమొసళ్లు, భంగ = అలలు, దివ్యాపగా = దేవగంగయొక్క, ఆశ్లేషము = ఆలింగనము.

వికచాబ్జానన...... = చంద్రోదయవేళ నీసముద్రుఁడు తన్ను ఎల్లనదులు (నాయికలు) ఒక్కమాఱుగా క్రొత్తవిలాసములుచూపు మకరికాపత్రరచనలతోడి స్తనమండలములుగలవై రాఁగా (మొసళ్లు అలలుగల నీరును వహించుట) అనురాగముయొక్క ఆధిక్యముచే దేవగంగనుమాత్ర మాలింగనము చేసికొనుచున్నాఁడు. (సముద్రపుటలలు పైకి నిగుడుచున్నవని భావము.)

203. పయోదము = మేఘము, పౌరుషకేళి = పురుషాయితక్రీడయందలి, సంభ్రమ=త్వరయొక్క, అభ్యుదయ=వృద్ధి (పెంపు)చే, గళత్ = జాఱుచున్న, రమాకబరిపోలిక = లక్ష్మి జడవలె, తటిద్విలాసము = మెఱుఁగుల కాంతులు, తత్-అభివృత = ఆమెను గూడియున్న, అంగకస్ఫురణలన్ = అవయవముల ప్రకాశములను, మురభేది = విష్ణువు.

ఉదకము......చూచితే - సముద్రముమీఁద మెఱుపులతోఁ గూడిన మేఘము వ్రేలుటను వర్ణించుచున్నాఁడు. సముద్రుఁడు క్రిందివైపు పడుకొన్న శ్రీమహావిష్ణువువలెను, తమకపుఁ బెంపుతో నాయనమీఁదికి బురుషాయితమున కుపక్రమించిన లక్ష్మీదేవికి ఆసందర్భమునఁ గదలికచే ముడివీడి పోయిన కురులక్రొమ్ముడివలె నామేఘము చూపట్టుచుండెను. మెఱుపు లామె యవయవముల తెలుఁగునను మెఱయుచుండె నని భావము.

204. తద్విలసన......వరుఁడు=ఆమె సింగారముచే విజృంభించిన మన్మథుని బాణములకు లోనైనవాఁడు.

206. కిసలయ = చిగుళ్లు, కుసుమ=పువ్వులు వీనియొక్క, ఓఘ = సమూహముతో, ఆకీర్ణ=కలిసిన, నానా = అనేకములైన, వనాంత = వనము

లందు, ఉల్లసత్ = ప్రకాశించు, అభినవ = క్రొత్తవైన, కుంజ=పొదరిండ్ల యొక్క, శ్లాఘ్య=పొగడఁదగిన, భాగములందు = ప్రదేశములందు.

కిసలయ......దుర్ = చిగుళ్లు పూవులు వీని మొత్తములు నెలకొన్న పెక్కు వనములందుఁ గ్రొత్తవైన పొదరిండ్లయందలి శ్లాఘింపఁదగిన మంచిచోటులందు (ఆమెతోఁ గ్రీడించుచుండెను.)

## పంచమాశ్వాసము

1. శ్రీద = కుబేరునియొక్క, ఖ్యాతి = కీర్తియొక్క, నిరాకృతి = తిరస్కరించుట యను, వైదుష్య = పాండిత్యముచే, సుపుష్యత్ = చక్కఁగాఁ బోషించు, అర్థవైభవ = ధనసంపద గలవాఁడు.

శ్రీద......భవ = కుబేరుని ప్రసిద్ధిని దిరస్కరించునట్టి పాండిత్యముచేఁ బెంపొందుచున్న నిండుకొన్న ధనము గలవాఁడా.

2. ఆకస్మిక = దడాలున, ఉద్ధూత = పైకెగిరిన, తీవ్ర = వేగము గల, వాత = గాలిచే, నిహతుండు = కొట్టుపడినవాఁడు.

ఆకస్మి......తుండు=అకస్మాత్తుగఁ బైకి విజృమ్ముచు వచ్చిన తీవ్రమైనగాలిచేఁ గొట్టఁబడినవాఁడు, జనపదవ్యవహితంబు=పల్లెపట్లకు నెడమైనది.

3. నతవీక్షలు = వంచిన చూపులు, చిబుకము = గడ్డము.

10. ఆకలించు=అవగాహనము చేసికొను, వింజము+అఁక+ఇడినట్లు వింధ్యపర్వతము పైకి పెరిఁగి (సూర్యచంద్రులమార్గము) అడ్డము పెట్టినట్లు.

11. అంబుజగర్భదేవి = సరస్వతి, ప్రోది = పెంచుట.

12. అంబ......రంబు=వస్త్రములు నగలు మైపూఁత వీనిచే నొప్పు సౌందర్యవిలాసము.

13. అరవింద = కమలములయొక్క, వన = వనములయొక్క, ఆమోద = పరిమళముయొక్క, భర+అలస = మోపుబరువుచే మందమైన, పవన = గాలియొక్క, ఆమోదములచేత = సంతోషములచే.

అరవింద.........చేత=తామరలతావి బరువుచే మెల్లని నడతోడి తెమ్మెరలవలననైన సంతోషములతో.

14. కృతమరాళ = శిల్పచాతుర్యముచే నిర్మింపఁబడిన హంసలతో, సమేత = కూడిన, అగ్రత = ముందుభాగముతో.

కృత......గ్రత=చలువతాయిలోనగువానిచే నిర్మింపఁబడిన అంచల విగ్రహములతోఁ గూడిన దరులు గలది.

15. తరుణ......చ్ఛాయ = గున్నకల్పవృక్షములనీడ.

18. ఏకాస్య = ఒక్క మొగము గలది, తర్జన్యము = బెదరించుట, వక్రి......బు = వంకరైన కనుబొమల నటనము, కెరలించు = రేఁచు.

19. కళాభిదురము = కళాస్థానము భేదిల్లిన వక్షము.

20. అధరపీడన = పంటిచే మోవి నొక్కుటచే, అసహత్వ=సహింపలేకపోవుటయొక్క, నాటితకంబు = నటియింపఁజేయుటచే, పురోవర్తి = ముందున్న, శాఖా = కొమ్మయందు, సమాసంజిత = చక్కఁగఁ గూడుకొన్న, రత్నపంజరము = రత్నాలగూఁడు.

అధర......కంబునన్ = పంటిచే మోవి నొక్కినదానిని సహింపలేకపోవుటను నటియింపఁజేయుటచే, ఊరు......దులు = తొడలకూడిక కనుఁగొనలుమూయుట లోనగునవి, కల్లగుట్టు = అసత్యమగు రహస్యము, పురోవర్తి......బునన్=ఎదుట నున్న కొమ్మయందుఁ దవిల్చిన చక్కని రతనాల పంజరమునందు (పక్షిని బెంచుగూఁడు), భాజనము=పాత్రము (యోగ్యము).

22. నిజ......జితులు=తనప్రకాశించు సౌందర్యకళచే నోడింపఁబడినవారు.

23. శార్ఙ్గము = విల్లు, తూఁపు = బాణము.

24. అక్షయము = నశింపనిది, శరాసనము = విల్లు.

26. పొలయుట = సమీపించుట.

27. సభ్రూవిలాస = కనుబొమల విలాసముతో, లోలలోచన = చలించు కన్నులయొక్క, అంచల = కడపటి భాగములచే, కషిత = ఒరయు కర్ణిక = కమ్మలుగల.

సభ్రూ......కర్ణిక = కనుబొమల విలాసముచే చలించు కడగన్నుల యొరపిడిగల కమ్మలు గలది.

29. నర్మలీల = పరిహాసముతోడి విలాసము, శతానందుఁడు = బ్రహ్మ.

31. భవత్కథితుఁడు = నీచేఁ జెప్పఁబడినవాఁడు.

32. లేఁగౌను బెడఁగు = సన్ననడుముయొక్క, అందము, అజుఁడు = బ్రహ్మ.

35. తురీయము = నాలవది.

36. మంచమేలము = చనువు, విఘటితము = పగులఁగొట్టఁబడినది.

37. తేఱని = తేరుకొనని - శక్తిరాని, నిమిత్తము = శకునము.

38. నిసువు = బిడ్డ.

39. నిజ......సిని = తన కృశించుటచేఁ బోఁగొట్టిన యుల్లాసము గలది, తాను తగ్గినట్లే - రా జుల్లాసము తగ్గినవాఁడై యుండెను.

40. పొదలు = అభివృద్ధిఁజెందు, తటిచ్చంచలాక్షి = మెఱుపువలెఁ జలించు కన్నులు గలది.

43. నిరవధిక = హద్దులేని, ప్రేమోదయ = ప్రేమపుట్టుకచే, దురపహ్నవ = కప్పిపుచ్చరానిదై, కందళత్ = మొలకెత్తిన, మృదుస్మిత = మెత్తని లేనగవుయొక్క, శోభా = కాంతిచే, సురుచిర = మిగుల సొంపైన, కృత్రిమ = తెచ్చుకొన్న, రోష = కోపముయొక్క, స్ఫురణంబునన్ = ప్రకాశముచే.

నిరవధిక......స్ఫురణంబునన్ = హద్దులేని ప్రేమయొక్క పుట్టుకచే గప్పిపుచ్చరానిదై మొలకెత్తిన లేఁతనవ్వుయొక్క కాంతిచే నందమైన తెచ్చుకొన్న రోసముయొక్క ప్రకాశముచే (ప్రకటనచే.)

44. భువన = లోకముయొక్క, ప్రపంచసంఘటన = విస్తరిల్లఁ జేయుటయందు, ధురీణ = దిట్ట.

తలఁడు = తొలఁగుడు, భువన......రీణ = లోకముల విస్తరిల్లఁ జేయుట యనుపనిని సమకూర్చుటలో దిట్ట.

45. దంట = నేర్పరి.

46. అలవోక=అవలీల, తదభేదాధ్యవసాయంబు=రెండు వస్తువులకు భేదము లేనట్లు నిశ్చయించుట, విజ్జోడుపడు = జతపడుదురకుండుట, సమీ చీనత్వదాత్ముండు = చక్కఁదనము నిచ్చునాత్మ, చుంబనేచ్ఛానంతరము = ముద్దుగొను కోర్కెకిఁ బిమ్మట, విశ్లేషము = కూడిక వదలిపోవుట, వక్షోజ యుగళము = చనుఁగవ, వలగ్నము = నడుము.

48. ప్రమోదమేదురహృదయుఁడు = సంతోషముచే దట్టమైన హృదయము (మనస్సు) గలవాఁడు.

49. కనకగర్భుఁడు=కడుపు బంగారు బొక్కసముఁ జేసిన మేటి.

52. కక్ష్య = తొట్టికట్టు (ాెఁగిలి), మణితవిశేషము = రతియందు స్త్రీయొక్క గళరవము.

56. వెను......దే=స్వేచ్ఛగ నిష్టము వచ్చినట్లు దిరుగుచు నోటికి వచ్చినట్లు వదరులాడుదానవు,

60. వాచ్యత=పదమునకుఁ గల సామాన్యార్థముఁ దోపించునది, నీవు మునుపు విన్నకథకు దీనికి నేమాత్రము భేదము, జాతి, క్రియ, లోనగునన్ని పదముల యర్థములు, వాక్యముల యర్థవిశేషములు అవియేకాని భూతకాల ముగాఁ జెప్పిన ఒనరించెను, పడసెను, నిలిచెను అను క్రియలను, ఒనరించు, పడయు, నిలుపు అని భవిష్యత్కాలముగా మార్చుకొనుట యభేదము.

61. శ్రోతృ......నక్ = వినువారికోర్కె ననుసరించి.

62. కొడిమె = నింద.

63. గోఁటదివియ నేత్రె పాయఁగా=గోటితోఁ గట్టినకట్ట నొక్కింత తీసిన నీ రేఖగఁ బ్రవహించును - స్వల్పప్రయత్నముననే బహుళమగు కార్యము సంభవించు నని భావము.

65. నీపల్కుగా......విలాసిని = నీవు సెప్పుమాటయు, నీమనస్సు లోని యభిప్రాయ మొక్కటి యగునేని నీనాలుక కొనతో ముక్కునంది కొమ్మా కాంతా అనుచున్నాఁడు. సామాన్యముగ నాలుకకొనతో ముక్కందు కొనుట సాధ్యముగాదు. కావున సరస్వతి తలంపు మాటయు నొక్కటిగాదని చమత్కారముగాఁ బల్కుట.

66. నిజస్తనగుచ్ఛ = తన స్తనము లను పూగుత్తులను, ప్రతిమల్ల = ఎదిరించు దిట్టలైన, హల్లక = ఎఱ్ఱకలువలయొక్క, దళ = రేకులతో, ఉద్యల్ + కందుకంబు = ఎగురుబంతి.

నిజ......కంబు = తన పువుగుత్తులవంటి చనుఁగవకు నెదిరియైన యెఱ్ఱగలువరేకులతోఁ గూర్చిన యెగురవేయు బంతి.

67. ఉరఃకోణము = ఱొమ్మునం దొక్క మూల.

69. వాగ్జాలమూలంబు = వాక్కుల మొత్తము ఆధారముగాఁ గలది, త్వన్మయము = నీస్వరూపము.

70. వాలాయము = అవశ్యము, సంగడి = స్నేహము.

71. నిరర్గళత = అడ్డంకి లేకుండుట.

82. తత్కథా = ఆకథయొక్క, కథన = చెప్పుటయందు, లీలా = విలాసముచే, భవ్య = శుభకరమైన, విస్మయముచేఁ = ఆశ్చర్యముచే.

విభ్రాంతత = విశేషభ్రాంతి గలుగుట, తత్కథా......చేఁ = ఆ బాలికయొక్క కథను జెప్పునట్టి విలాసముచే శుభకరమైన విస్మయముచేత.

83. సింగిణి = విల్లు.

84. ముత్ + అద్భుతము = సంతోషము - అచ్చెరువు.

86. పెరసి = మొత్తము.

88. శారదావదన = సరస్వతిముఖముయొక్క, ప్రతిబింబాది = ప్రతిబింబించుట మొదలగు, నామకర్మ=పేరు క్రియ, కల్పనాకేళి=కల్పించుట యను క్రీడయొక్క, ప్రకారమాత్రములు=రీతులుమాత్రము గలవి.

శారదా......లైన = సరస్వతి ముఖముయొక్క ప్రతిబింబము లోనగువానివలన నేర్పడిన పేరులు, క్రియలు, క్రీడలు వీనిరీతులను మాత్రము కలవి. అస్మదాఖ్యానక్రియాదికములు = మాపేరులు, క్రియలు లోనగునవి, విడ్జోడుపడక = ఎడము (భేదము) లేక.

89. అనుభావము = ప్రభావము.

90. అవిదితార్థము = తెలియని అర్థము కలది.

98. నితాంత......వైభవము = ఎడతెగక విలసిల్లు కురులక్రొమ్ముడి సొగసు, పల్లజడలు=పసుపు నెఱుపుఁ గలిసిన రంగుగల జడలు, వ్యత్యయము= తలక్రిందులు (తడబాటు).

103. భవిష్యదర్థవశతన్=రాబోవుప్రయోజనమునకు లోనగుటచే.

108. వరణమిష = కోటయను నెపముచే, లసిత = ప్రకాశించు, పుణ్యా = పవిత్రమైన, శ్రీనూపురమై = పురలక్ష్మియందె గలదై.

పుర......గొంటె = ఆపట్టణ మచ్చెరువుగొల్పు గోపురములు గలదియు, కోటగోడ యను నెపమునఁ బ్రకాశించు పవిత్రమైన పురలక్ష్మి కాలి యందెయై సిరిసంపదలకుఁ గాఁపురమై ముందుప్రక్కఁ గన్పట్టుదానిఁ గనుమా.

109. కల = అవ్యక్తమధురముగ కూయు, కలహంస = రాజహంసలు, సారస = బెగ్గురుపిట్టలు, బక = కొంగలు, ప్రముఖ = మొదలైన, అంబువిహంగ = నీటిపక్షులయొక్క, మండలీ = సమూహముయొక్క, కలకలనాద = కోలాహలధ్వనులయొక్క, లీలన్ = విలాసముతో, కైరవ = కలువలు, తామరస = కమలములు, ఆది = మొదలైనవానియొక్క, లక్ష్మీ = కాంతి, మానస+అభ్యుదయ = మానససరోవరముయొక్క, గౌరవముల్ = గొప్పతనములు, పరిఖావలయంబు = వలయాకారమైన అగడ్త.

కలకల......చూచితే = కలకల మని కూయు హంసలు, బెగ్గురు పక్షులు, కొక్కెరలు లోనగు నీటిపక్షుల మొత్తముల కోలాహలధ్వనుల విలాసముతోడి తనలోని కలువలు, తామరలు లోనగువాని కాంతిసొబగులకు ఆ మానససరోవరముయొక్క, పెంపు, గొప్పతనము లేదురా వని నవ్వుచున్నదో యన్నట్లు ఈపట్టణముయొక్క గుండ్రని యగడ్త తీరును జూచితివా.

110. సాలము = కోటగోడ.

111. తోరణము = బహిర్ద్వారము.

112. రత్నఖచిత = రత్నములుచెక్కిన, ఉజ్జ్వలసౌధ = ప్రకాశించు మేడలయందు, విహారిణీ = విహరించు స్త్రీలయొక్క, కర్పూరసువీటికా = కప్పురపు మేలితాంబూలముయొక్క, రుచిర = ఇంపైన, భూరి సుగంధ = మిక్కిలి మంచివానితో, సమేత = కూడిన, వాత = గాలి యొక్క, సంచార = నడకువ, కృత=చేయఁబడిన, అవిదూర = సమీపమైన, సురసంపత్ = దేవతాలక్ష్మికి (దేవతలకు, అపూర్వ = వింతయైన, మనః ప్రమోదమై = మనస్సునకు సంతసము గలదై.

రత్న......మోదమై = రత్నములు చెక్కిన మేడలలో విహరించు పూవుఁబోండ్ల కప్పురపుఁ దాంబూలముయొక్క కమ్మని పరిమళముతోఁగూడిన గాలుల సంచారమునకు దగ్గఱయున్న వేల్పులకు మనస్సంతోష కారణమైనది.

115. అహో(వృ=కదిసెఁజెందు, వాహ్యాళి = స్వారి, నిర్నిమేషుఁడు = ఱెప్పపాటు లేనివాఁడు.

117. సకల+జగతీతలనాయకుల యిండ్లక్ = అందఱి రాజుల నగళ్లయందు.

119. శోభన=మంగళకరమైన, తద్వల్గన = అగుఱయు దుముకులకు, వల్గత్ = (ముందు) దూఁకు, అగ్రిమరుచి = ముందుభాగపుకాంతిచే, స్ఫాయత్ = విస్తరిల్లిన, కిరీటంబుతో = కిరీటముతో.

తుఖారంబులేజీ = తుఖారదేశపు గుఱ్ఱము, చిత్తరువుబాగుల్ = చిత్తరువులో నున్న చక్కని తెఱఁగులు, శోభన......తోన్ = శుభకరము లైన యాగుఱ్ఱముయొక్క దూఁకులముందుఁ దుముకుచున్న తన మేలికాంతు లతో విస్తరించు కిరీటముతో.

120. ఘోటకము = గుఱ్ఱము, రత్నాంగుళీయకప్రభ = రతనంపు టుంగరముయొక్క కాంతి, దండధరుఁడు = సేనాపతి, రిత్తమంతనము = వట్టి యాలోచనము, చౌకట్లు = చెవిపోఁగులు.

122. బాహాంతరసీమ = వక్షఃప్రదేశము.

123. సదనము = ఇల్లు.

126. నవ......రూఢులు = క్రొత్తదైన రత్నఖచితమైన పల్లకి నెక్కినవారు.

127. చేటిక = దాసి.

128. వినీతుఁడు = అడఁకువ గలవాఁడు.

130. వేవిళ్లు = గర్భచిహ్నము.

131. సనాభి = బంధువు; బొక్కిలితోఁగూడుట, మధ్యము = నడుము - నడిమిప్రదేశము.

నడుముతో ల్తుఁ బొక్కిలితోఁగూడిచిక్కినప్పుడు తక్కిన యవ యవము లన్నియుఁ జిక్కియుండినవి. మరల నడుము బలిసినప్పుడు తక్కిన యంగములును బలిసినవికాని తొల్తుఁగాని మరలఁగాని యేమార్పు బొరయని చనుగవమాత్రము కఠినమైనది కావున నిప్పుడు సహింపక మొగము నల్లఁగఁ బెట్టుకొన్నది. అనఁగా చనులమొనలు నల్లవడ్డవనియు నడుము బలిసినది అనియు భావము.

132. పయోధరము = మేఘము - స్తనము, తద్వక్త్ర = ఆమె ముఖ మను, సుధాంశుబింబము = చంద్రబింబము, పాండురశ్రీ = తెల్లని కాంతి.

ఈ పద్యమున శ్లేష - పయోధరము మేఘము, స్తనము - గొప్ప మబ్బు లాకస మాక్రమించినప్పుడు చంద్రబింబ మేమాత్రము ప్రకాశింప నేరదు. అట్లుగాక ఇచ్చటఁ బయోధరములు (స్తనము లనిశ్లేష) చక్కఁగ బలిసి వ్యాపించియున్నను ఆమె ముఖ మనెడు చంద్రబింబము తెల్లనికాంతులఁ బ్రసరింపఁజేయుచు కార్తికశుక్లపూర్ణిమవలె స్వచ్ఛముగాఁ బ్రకాశించినది.

ఆకసము, చంద్రుఁడు, మేఘము స్వస్థానములందున్నప్పు డాధర్మము లుండునుగాని వెఱచోట్ల నుండనేరవేమో అని కవి చమత్కారముగఁ జిత్ర మనెను. అనఁగ ఆమె చనులు బలిసి మొనలు నల్లఁబాఱినవి. మొగము తెల్ల బాఱినది అని భావము.

133. కౌను = నడుము, వళులు = కడుపుమీఁది ముడుతలు.

135. త్రేతాగ్నులు = గార్హపత్యము ఆహవనీయము దక్షిణాగ్ని అను మూఁడగ్నులు, శౌర్య......డగుచు=శౌర్యాది సద్గుణములచే రంజింపఁ జేయుచున్న యన్నిలోకములు గలవాఁ డగుచు.

138. సద్యోయౌవనము=పుట్టినప్పుడ వచ్చిన జవ్వనము, ఎగ్గు=కీడు.

144. కొఱలు = వర్తిల్లు

147. ఆర్జవము = మంచినడక.

148. అస్తేయము = దొంగతనములేమి.

150. హ్రీ = సిగ్గు.

156. నిశ్శ్రేయసకరము = మోక్షమును గలిగించునది.

158. జానూ......తలుఁడు = మోకాలుతొడల నడుమ నుంచిన పాదములు గలవాఁడు.

159. గుదస్థానమునకు నెడమప్రక్క నెడమకాలి మడమ నుంచి. కుడిప్రక్కఁ గుడిమడమనుంచి కూర్చుండుట గోముఖాసనము.

160. ఉత్తానము = వెల్లకిల నుంట, చిబుకాగ్రము = గడ్డముతుద, రాజదంతము = మునిపల్లు.

163. అండము = వృషణము, ఉపాంతము=సమీపము, జానువు = మోఁకాలు, వివృతాస్యుండు = నోరు తెఱచుకొన్నవాఁడు.

164. శేఫసి = మేఢ్రము.

165. మేహనము = మేఢ్రము, సవ్యగుల్ఫము=ఎడమమడమ.

167. కూర్పరము = మోచెయ్యి.

169. గదనాశనము = రోగములు నశించుట.

170. ప్రణవము = ఓంకారము, మారుతము = గాలి-నిశ్వాసము.

171. నాడీకందము = నాడులకు మూలస్థానము.

175. తానకము = స్థానము.

178. అప్రతిమముగఁ = సరిలేక, విజాతీయ = ధ్యానము చేయుం (విష్ణుస్వరూపము) మూర్తికంటె నితరమైన స్వరూపములయొక్క, ప్రత్యయ= దర్శించుటయొక్క, వాసనా = మనస్సునందుఁ జిరకాలమునుండి యున్న భావముయొక్క, నిరాస = పోఁగొట్టుటచే, అనిచ్ఛిన్న = ఎడతెగక, ప్రవహాత్ = భావన ప్రవహించుచున్న, ఉరు=గొప్పదైన, సజాతీయ = సమాన జాతిగల (ఆమూర్తికి సన్నిహితమై పోలికగలవానియొక్క) ప్రత్యయ = దర్శించుటయే, రూప = స్వరూపముగాఁ గలది.

అప్రతి.........వెలయుఁగ = సరిలేక ధ్యేయవస్తువు (ధ్యానము చేయుం విష్ణుస్వరూపాదికము) కన్న నితరములైన స్వరూపాదులఁ దొలఁగింప తైలధారవలె నెడతెగక ఆస్వరూపము (సజాతీయము)నే చూచుట ధ్యానము చేయుట యనఁబడును.

185. నీలలోహిత = నీలవర్ణము ఎఱ్ఱనివర్ణముగల, లసత్+మణి = ప్రకాశించు ఇంద్రనీలములు పద్మరాగములు అను మణులచే, చిత్రిత = చిత్రవర్ణముగలదైన, సాను = చఱియలయొక్క, వైభవోపేతము = సంపదతోఁ గూడినది. సేవక=తన్ను సేవించువారియొక్క, ఇష్టఫలదానవిధాన = ఇష్టములైన కోర్కి లొసఁగుటకై, నవీనదేవతాసాలము = క్రొత్తవైన కల్ప

వృక్షములు గలది, నిత్యవర్ణ్యగుణజాలము=ఎల్లపుడు వర్ణింపఁదగిన గుణముల సమూహముగల, ముక్తిలతాలవాలము = మోక్షమను తీఁగెకుఁ బాదుగ నుండునది.

నీల......లముక్ = ఇంద్రనీలమణులు, పద్మరాగము లోనగు ప్రకాశవంతములగు మణులచే రకరకములైన వన్నెలతోఁ జిత్రమైన చలువ యలసంపదతో నతిశయించినది. సేవక......సాలము=తన్ను సేవించువారి యిష్టఫలముల నొసంగుటకై యున్న క్రొత్త కల్పవృక్షముగలది లేక క్రొత్త కల్పవృక్షమైనది.

186. కుబేరుమల = వెండికొండ, తుషారమాత్రము = కేవలము మంచుగా నుండుట, సాజము = సహజము.

187. ధాతుస్థలములు=గైరికాది ధాతువు లున్నచోట్లు, ఆతత = విస్తరించిన, కుంకుమాంగరాగప్రకారంబునన్ = కుంకుమ మైపూఁతరీతిని, హారవల్లరులు=తీఁగెలవంటి హారములు, బహువిధ=అనేకవిధములైన, ఉపల= రత్నములతో (రాలతో), యుత=కూడిన, ఉపత్యకాభాగంబు = కొండ దగ్గఱి ప్రదేశము, భద్రాసనము = సింహాసనము, అపరధరణిభృత్=ఇతరము లగు కొండలయొక్క మూర్ధసమాదర+అర్హా=శిరములచేఁ జక్కఁగ నాచరింపఁ దగిన, పాదకటకంబులు=అడుగుప్రదేశములు-చరియలు(కాలు కడియములు), ఇనకిరీటార్పణ=సూర్యుఁడను కిరీటము సమర్పించుటయొక్క, కరి=సాక్షి.

కబాయి = అంగీ.

౧. క్రొత్తపూవులు పూచిన పూఁదోఁట రకరకములైన రతనాలు గూర్చిన యంగీచక్కఁదనము చూపెను.

౨. గైరికాదిధాతువులున్నప్రదేశము కుంకుమమైపూఁతరీతిగఁ గనపట్టెను.

3. తెల్లనికాంతి వెదఁజల్లు సెలయేళ్లు తీఁగెలవంటి ముత్యాలహారముల సొంపు దాల్చిన ట్లుండెను.

౪. వివిధములైన శిలలతోఁ గూడిన కొండదగ్గఱి ప్రదేశము సింహాసనముగ నుండెను.

౫. ఇతర పర్వతముల శిరస్సుల యాదరణకుఁ దగిన అడుగుప్రదేశము లైన చరియలు చక్కఁగ నుండఁగ, (పాదకటకములు=కాలికడియము లని అర్థాంతరము.)

౬. ఆ శ్రీశైల మను పర్వతరాజమునకు మధ్యాహ్నకాల మనెడు లక్ష్మి ఆకసమునడుమ విలసిల్లు సూర్యుని కిరీటముగ నుంచు పనిసేయు పరిచారికగఁ గన్పట్టెను.

188. ధుని = నది.

189. కైతవము = నెపము, ఉద్యోతించు ప్రకాశించు, గండశైలవ్రాత = పెద్దబండల సమూహమను, మిషస్థిత = నెపముగనున్న, నగాంతరప్రతిమలతోఁ = ఇతరములైన కొండల విగ్రహములతో.

రాజులు శత్రురాజుల జయించి వారల దాసులుగఁ జేసికొన్నవారై యిట్లు జయించితి మను తమ ప్రతిష్ఠ ప్రకటించుకొనుటకై వారల రూపులు తమ గండపెండేరములఁ జెక్కించుకొని కాలికిం దగిలించుకొందురు. అట్లె యీ శ్రీశైలము పాతాళగంగ యను నెపమున కాలికి గండపెండేరము దాల్చినదై ఆనీటఁ బ్రతిబింబించు పెద్దబండ లను నెపమున నున్న ఇతర పర్వతములతోఁ గూడి నట్టిదిగాఁ జేసికొనెను.

190. ఘనపరిరంభ = గట్టికౌఁగిలియొక్క సంభ్రమవికాసము = త్వరయందలి లీల, నిధిగర్భబాహువు = గనులు లోపలగల చేయి, శోభన = మంగళకరములైన, ఖచరద్రుమ = కల్పవృక్షములయొక్క, అవిరళ=దట్టములైన, పల్లవతల్లజ = మేలిచిగుళ్లయొక్క, శోణి=ఎఱ్ఱనైనముగల - పాణియై= హస్తము గలదై.

మహావిష్ణువు భూదేవిని కౌఁగిలించుకొనఁ గోరినవాఁడై ఆకస మను తనవక్షస్థలమును భూమివంకకుఁ ద్రిప్పి చేరఁబోఁగా, భూదేవి అట్లు విష్ణువునకుఁ

చటాలునఁ గౌఁగిలి యీయక యద్దుమంగళకరములైన కల్పవృక్షముల దట్టమైన మేలిచిగురుంజొంపములచే నెఱసైన హస్తమో యన్నట్లు ఆ శ్రీశైలము ప్రకాశించుచున్నది. నిధిగర్భబాహువు=గర్భమునఁ (లోపల) నిధులు గలది, భూదేవి ఆమె హస్తమువలె శ్రీశైల ముండె నని భావము.

191. అనూనము = తక్కువకానిది, భృగుపాతము = కొండచరియ నుండి దూకి ప్రాణములు గోల్పోవుట, జామాత=అల్లుఁడు, వాసన=పూర్వజన్మమునఁ జేసిన కర్మల అభ్యాసము అంటియుండుట.

196. పట్టెము = ఖడ్గము.

197. బహిః+అబహిః = వెలుపలి లోపలివారైన, అరాతివర్గజయంబు=శత్రుసమూహముల గెలుపు, లోపలిశత్రులు = కామక్రోధాదులు.

మెరమెర = సంభ్రమము, బహిరబహి......యంబు = వెలుపలి శత్రురాజులను లోపలి కామక్రోధాదు లను శత్రువులను జయించుట.

198. చీఁకుఁదనము = గుడ్డితనము.

199. కొద = తక్కువ.

200. తృష్ణ = పేరాస.

204. కెంజాయ = ఎఱ్ఱనికాంతి.

207. ఆయాతులు = వచ్చినవారు.

209. తుర్యము = నాలుగవది.

210. జాయ = భార్య.

212. పన్నుగడ = ఎత్తు.

213. నియతి = విధి.

214. అభివాంఛితము = కోరిక.

216. భవము=పుట్టుక, సాయకము = బాణము, తదితరకర్మకత్వము నను = వానికంటె నితరములైనవి సాధనము లగుటచే జయ మబ్బునా అని భావము.

---

## షష్ఠాశ్వాసము

3. అచలధృతిన్=చలించని ధైర్యముతో-కొండవంటి స్థైర్యముతో.

4. బిట్టు=అధికము, మథన......వోలె=మథించు (చిలుకు) సమయమునందు ఘోషపెట్టు సముద్రమువలె.

6. పింపిళ్లుగూయు=నృత్యము చేయు, పరుసవారు = బాటసారుల సమూహము.

8. గండోపలంబులు = పెద్దబండలు, గునపము = త్రవ్వుసాధనము (కట్టు లోనగునవి.)

9. శలలు=ఏదుపందిముండ్లు, ఈక్షణములకున్=కన్నులకు.

10. అపూర్వశలలీప్రవర్షము = వింతయగు సేదుముండ్ల పెద్దవాన, మహాసి = పెద్దఖడ్గము.

11. చక్కసేయు = చంపు.

12. కష్టున్ = దుష్టుని.

14. దర్ప=గర్వముచే, దుర్దమ = కష్టముచే మడియింపనగు, రిపు = శత్రువులయొక్క, ఖండ = ఖండించునట్టి, కాండ = బాణములుగల, భుజ దండుఁడు = దండములవంటి భుజములు గలవాఁడు.

దర్ప......దండుఁడు = కావరమొంది గెలువ వలనుకాని పగఱం దెగటార్చునట్టి బాణములు గలిగినట్టి దండములవంటి భుజములు గలవాఁడు.

16. శలలీసందోహము = ఏదుముండ్లమొత్తము, దోః+సమధిక=భుజ బలాధిక్యముయొక్క, లఘిమా = సౌలభ్యముచే, ఆశ్చర్య = వింతగొల్పు, చాతుర్యచర్యా = నేర్పుచూపించు పనియందు, విలసత్ = ప్రకాశించు, ఘోరాసి = భయంకరమైన ఖడ్గముయొక్క, ధారా = వాదరయొక్క, విహృతిన్ = విహారముచే, తులిత = సరిపోలిన, అనూన = తక్కువకాని, ప్రసూనద్యుతి = పూవులకాంతులతో, శలల (శబల) = చిత్రవిచిత్ర

వర్ణములు గల, వనీ = వనమును, ధుర్య = ధరించు, ధాత్రీధరంబున్ = పర్వతమును.

ఆమణికంధరుం డానేదుముండ్ల మొత్తమును తన భుజబలాధిక్యముచే సునాయాసముగ నచ్చెరువుగొల్పు నేర్పునడకచే వెలుఁగొందు భయంకరమైన ఖడ్గముయొక్క దాదరయొక్క విహారముచే హతమార్పుచుఁ బోయి సరిపోలిన తస్కువకాని పూవులకాంతితోఁ బలువన్నెలగల వనమును ధరించు పర్వతము గలవాఁడు అనఁగాఁ గొండంతవాఁడు.

19. మొగులు = మబ్బు.

20. అచేతనుండు = తెలివి ప్రాణములేని జడపదార్థమువంటివాఁడు.
అధఃకృత... ర్తనున్ = క్రిందుఁజేసిన దిగ్గజముల పరాక్రమము గలవాఁడను.

22. దొంతుల కోపని గుదియలుం గలవే=ఒకదానిపై నొకటివంతున నిలఁబెట్టినట్టి కుండలను దొంతి యందురు. అట్టి దొంతికుండలఁ బడగొట్టలేని యినుపగుదియలు గలవా అని భావము. కుండలు పగల్చుట గుదియకు సులభమగునట్లే తనకు వాఁ డత్యంతము సులభముగ జయింపఁ దగ్గ వాఁ డని భావము.

26. మహితాత్మక = పూజ్యుఁడా.

27. ఖనిత్రము = గుద్దలి.

30. పేదకోప మొందుఁ బెదవుల చేటుగా నుడికి యేమి సేయనోపు నన్న=పేదవానికి కోపము వచ్చినను బలవంతు నేమి చేయగలఁడు. తన పెదవిఁ దానే కొఱకుకొనును, ఉడికి = కోపించి.

31.శుక్రాచార్యుల యాశీస్సు నొంది యడ్డులేక విస్తరించిన నాబలముయొక్క గొప్పతనము దేవతలకు లోనగునా? సుమనోవర్గము = వేల్పుల మొత్తము.

33. శాంతికంఠ = శాంతగుణ మనెడు బొంత.

34. తుషార...కన్య=చంద్రకిరణములవలనఁ బుట్టిన యచ్చరకన్నె.

35. హెచ్చిన పచ్చవిల్తుపస = అధికమైన మన్మథవేదన.

36. కొట్టినపిండి = లోఁబడినది.

38. తలంకు = భయము.

42. ప్రస్తరస్తంభలిఖితాక్షరములు = రాతికంబముమీఁద వ్రాసిన యక్కరములు.

43. మిడిసల = కూలదన్నుట.

50. వధూటి = స్త్రీ.

52. సుపర్వలలనామణి = వేల్పులేమ, తల్ + గ్రావము = అఱాయి, రక్తావని = నెత్తురైనవేల.

55. మైదలి=స్త్రీ, ఆత్మమస్తకచ్ఛేదము = తన తల నఱుకుకొనుట.

58. అవితథోద్యమము = వముకాని ప్రయత్నము.

59. భృగుపాతంబు=కొండచఱియనుండి క్రిందికిదూఁకిపడిచచ్చుట.

60. పిరిచుట్టు = మెలికగ చుట్టుట, మండలాగ్రము = ఖడ్గము (మేలైనది.)

62. సుధాకరనిభానన = చంద్రాస్య, వరవర్ణిని = ఉత్తమురాలు.

63. మిషము = నెపము.

64. ఉద్భూతానంగవిజృంభణము=పుట్టిన మన్మథుని చెలరేఁగుట.

67. అసదు = స్వల్పము, గాఁడు = గుచ్చు.

68. పిడుగుపాటినడొంకరైయె పెంపడంగు = పిడుగుపడినబాట చెట్టు చేమలతో నిర్మూలమై యెట్లెగుడుఁదిగు డైపోవునో అట్లు తన్నెదిర్చిన పగఱు సైతము రూపుమాసిపోదు రని భావము.

71. ఎలమి = సంతోషము.

72. తోరపుభాగ్యము = గొప్ప యదృష్టము.

77. బట్టతలలు మోకాళ్లు ముళ్లు పెట్టఁగలదా? వెండ్రుక లున్న రెండు తలలను ఆజుట్టులను ముడివేసి ముడిపురఁ జిక్కుపెట్టవచ్చునుగదా. అట్లుకాక బట్టతల వెండ్రుకలు లేక సున్ననిది. మోకాలుపై వెండ్రుకలు పెరుగవు. ఏల యన అది మాటిమాటికి నుసు నలుగుచుఁ జాచుచుచుండుభాగము.

ఆదియుం సన్ననిదైన రెంటి నెట్టు నొక్కటిగఁ జేర్చుట కనువగును? అసాధ్యముకదా. అట్లె అపురూపమగు నసంభవమగు కష్టలు కల్పించువారియెడను కారణములేకయే తగవులు పెట్టువారియెడను ఈసామెత నుపయోగింతురు.

79. గుప్తమాహాత్మ్యుఁడు = దాఁచఁబడిన మహిమగలవాఁడు.

81. అనులేపనము = మైపూఁత.

84. జౌదలన్ = శిరమున, కలమాన్నము = వరియన్నము; పూపము = పిండివంట.

85. కొల్చు = ధాన్యము, వరిపైడి = కమ్మలు నాను కడియము దండ ఇట్లు రకరకములుగాఁ జేయించుకొన్న నగలబంగారు (కూలియిచ్చి చేయించిన నగను కూలితోసి బంగారుగ నమ్ముట,) గట్టిదినుసు = మంచి విలువగల వస్తువు, ఱాయి ఱప్ప = ఇండ్లుకట్టుటకుఁ బనికివచ్చు ఱాళ్లు, బంటుబానిసలు = దాసదాసీజనము, పెయ్య = ఆవుఁగఱవు, వితీర్ణి = దానము, పెట్టనపెట్టు = (వానిని గూర్చి) ప్రయత్నించు.

88. సమస్తోక = ఏమాత్రము తక్కువకాని.

89. రంగదభంగుర...త = పెంపొందుచు నశింపని ప్రేమ సౌందర్యము.

91. సపత్నులు = సవతులు, కొమ్మ = ఆఁడుది, త్రికరణైక్యంబు = మనస్సు వాక్కు కర్మము ఏకమగుట.

96. చదుపఁబెట్టు = చంపు. అవిహతము = కొట్టఁబడనిది.

98. ఉవిద = యువతి, పొత్తు = సంబంధము.

99. బేహారి = వర్తకుఁడు, మూల్యము = వెల.

100. పదరుఁగట్టడ = త్వరతోడి ఆజ్ఞ, కలము = ఓడ.

101. శోక......రము = దుఃఖమనెడు పెద్ద వజ్రాయుధము, ధైర్యగిరి = ధైర్యమను పర్వతము.

103. నౌ+అధిపతి = ఓడనాయకుఁడు.

106. దిసంతుగొట్టు = తిట్టు, కడంక = ప్రయత్నము.

110. అంబుచరంబు = మీను, సయోష=స్త్రీలతో, పూర్ణ = నిండు కొన్న, వక్త్రాంతరతోయము=నోటిలోపలి నీరు, మూర్ధరంధ్రనిష్క్రాంతము= శిరోరంధ్రమునుండి వెలిఁద్రోయఁబడినది.

అంత నామీను ఆ వనితలతోఁగూడ నిండుకొని తన నోట నున్న నీరు పైకి నిగిడిపాఱునట్లు తన శిరోరంధ్రమునుండి వెలికి జిమ్మెను. ఆనీరప్పుడు వరుణుని టెక్కెముపోలె రాజిల్లెను. ఆయింతు లానీటివెల్లిలో బంగారు తీఁగెలు వోలె వెలింగిరి.

111. ఆపీతజల = నిండుగ నీరు గ్రోలిన, వలాహకముతోఁ=మేఘముతో, సురనది = దేవగంగ, కాశ్మీరజంబాలపుఁ జాఱలు = కుంకుమపూవు బురదరేఖలు, తోయేంధనపుమంటతునకలు=నీటిలో జ్వలించు నగ్నిజ్వాలల ఖండములు, ఒరగంటిరేఖలు = ఒరగల్లుపైని గీఱలు, విపుల = విస్తారమైన, మీనమస్తవివర = చేప తలలోని రంధ్రమునుండి, నిర్గత = బయలువెడలి, ఊర్ధ్వగామి=పైకి వెడలుచున్న, మహోదకప్రవాహ = గొప్ప నీటిప్రవాహముయొక్క, సంగతిఁ = కూడికచే.

ఆమీనుయొక్క వెడలుపైన శిరోరంధ్రమునుండి పై కెగఁజిమ్మిన నీటిమొత్తములో నున్న యాచెలువ లెట్లుండి రనఁగా.

౧. నిండుగ నీరు త్రావిన మేఘముతో నాకసమునందు సంచారము సేయు మెఱుంగుతీఁగ లనునట్లుగను.

౨. ఆకాశగంగపై మరులుకొని సముద్రుఁడు వసంతము చల్లుటకై ప్రయత్నించెను. అప్పు డానీటివెల్లి యను నాతని హస్తమున కుంకుమపువ్వు గలిపిన గందము వసంతమునీరు గనుక ఆచల్లుసందర్భమున నీస్త్రీలు కుంకుము పూవు టసలు గీఱలు గల్పించి రని భావము.

3. పెద్దచేఁపలచమురు తమ్ముఁ దడుపఁగా నాకారణమునఁ బొగతో వ్యాపించు నీటియందు జ్వలించు నగ్నిజ్వాలలఖండము లనునట్టును,

౪. తన కాంతలైన నదులకు సముద్రుఁడు తన యనురాగ మెవరిపై నెంత కొలఁది గలదో తెలుపుటకై ఆప్రేమను బంగారురూపొనర్చి యానీటి వెల్లువ నొరసిడిరాయిగ నొనర్చి ప్రేమగీఱల గీచినట్లు రేఖలుగ నాచెలులు గన్పట్టి రనుట.

112. యువయుగ్మము = యువతీయువకులు.

113. దివ్యాంబరంబులు = మేలివలువలు.

114. తాంబూలరాగ=తాంబూలముయొక్క రక్తిను చే, కించిత్ + చుంబిత = కొంచెముగ ముద్దుగొనిన, తద్దంతకాంతి = వారి పలువరుసకాంతి యొక్క, సొబగు = అందము, దివ్యనితంబిని = అచ్చరలేమ.

తాంబూల......కాంతి = విడెము కెంపుజిగిచే నించుక ముద్దుగొన్న వారి పలువరుస డాలు, ఆదివ్యనితంబిని = ఆ వేల్పుబోటి.

119. హస్తనఖ = చేతిగోళ్లయొక్క, ప్రసరత్ + ఛవి=ప్రసరించు కాంతులయొక్క, ఛటా = సమూహముయొక్క, ఆమ్రేడిత = పౌనరుక్త్య ముచే, పాండురద్యుతిసమృద్ధి = తెల్లనికాంతుల నిండుఁదనము.

హస్త......సమృద్ధి=చేతిగోరులనుండి ప్రసరించు కాంతుల సమూహముచే మాటికిమాటికి తెల్లనగు కాంతితోడి నిండుఁదనము, విభ్రా... వము=విరాజిల్లు స్వచ్ఛమైన కంకణముల చప్పుడు.

120. బొంకకుఁ=అసత్యమాడకు, నెత్తకమ్ము=పాచికలపందెము, పక్షు లుల్కెన్ = పక్షులు భయపడుచు, ఒయ్యన్=మెల్లగా, చిక్కెన్ = చేఁ జిక్కినది-కృశించినది. సారె=జూదమునఁ గాయ-గొరువంక; దుగ = రెండు-స్తనద్వయము, తివకుమా=లాగకుమా, ఎసటిపోతలు = మెఱమెఱలు, ఇను మాటు=రెండుమార్లు, దంచు=చంపు, ఉదుకు=అన్న ముదుకు - కినుకవహించు-శ్లేష, దంట = నేర్పరి - రెండు.

౧. నిలువవయ్యా అసత్యము చెప్పకుము. నీ వొడ్డినసొమ్ము తీసికొనకు. (నీ వోడితి వని భావము.)

౨. పక్షులు భయపడును. మెల్లగ మాటలాడుము.

3. నీకాయ నాచేఁ జిక్కెను. ఔను. దీనికూడు నీవు దినుటవలన నీపక్షి కృశించిపోయెను: అనఁగాఁ గాయను జంపుటవలన నది నిరుపయోగ మాయె నని భావము.

౪. ఆకాయలజతను దీయకుమా, స్తనములమీదికిఁ బయ్యెఁట లాగు కొనకుమా.

౫. సరి నీకాయ దాఁకినదికదా, నీహస్తము......

౬. రెండుమార్లు దంచినబియ్యి మెసటిలో పోయుటకుఁ బనికివచ్చును. రెండుమార్లు కాయను జంపఁగా మెఱమెఱలాడుచుఁ గోపగించుచున్నావు.

౭. అటులనే యుడుకును (అన్నము). కోపము హెచ్చును.

౮. దంటమాటలు=నేర్పరిమాటలు, దంట నే నాట నీసంగతముగన్ = నేను నీకూడికతోఁగదా జతనైతిని.

121. క్షప=రాత్రి, కప=జల, అక్షప=రాత్రికానిది (పగలు), అక్ష పాలి=పాచికలనడకగల, శయ = హస్తమునందు, లబ్ధ=పొందిన, సుసంగమ= మంచి లయికగల, శారికల్ = పాచికలు, అక్షప=పగలు, అతిశయ=ఎక్కు వగ, లబ్ధ=పొందిన, సుసంగమ=సాంగత్యముగల, శారికల్ = గోరువంకలు. క్షప=రాత్రి, అక్షప=రాత్రికానిది - పగలు, అక్ష+పాలి = పాచి కలపైఁబడు, రాతిరివేళ జతవీడిపోయి దుఃఖించు జక్కవదంపతుల ప్రేమనేల పొగడుచున్నావు. రాతిరి కానప్పుడు పగటివేళనే మిక్కుటము కూడిపొందు గాంచిన గోరువంకలు క్షణకాలములోనే యెడబాటు గాంచి ఔరా వెంటనే చావఁదొడంగెను. అర్థాంతరము—పాచికలపైఁబడు నఱచేతచే మిగిలిపొందిన మాటమిగల పగడసాలకాయలు (అనఁగా పాచికలు చేతితో దొర్లించిన తచ్చుపందెముచే గాయ లొక్కచో జతగూడును. మఱియెదుటివారి పందె ముచే ఆకాయఁలు చంపఁబడి యెడఁబాసిన వని భావము. చక్రవాకము లెడఁ

బాసి కుందుట, గోరువంకలు పొందుగాంచి యెడఁబాసి చచ్చుట. ఈ రెంటిలోఁ నెవ్వానికి ననురాగము సమానమో, ఎక్కుడో అను విషయము ఎల్లరకు స్పష్టమే కదా.

122. తీవ్రరణస్ఫురత్ = భయంకరమైన యుద్ధమునందుఁ బ్రకాశించు, శారి=ఏనుఁగుల అంబారీలపైని, ఫల=డాలువాలులయొక్క, ప్రఘట్టనలక్ = వ్రేటులతో.

సారెకున్ = మాటిమాటికి - కాయకు, పోటు = వ్రేటు-పొడుపు, జాడ్యము = మొద్దుతనము, జోడు = జత - కవచము, సారె = ఆటకాయ, మహాశారి=గొప్పఆటకాయ, మహాశారిఫల=గొప్పజూదమాడెడుపీట, జోదు= యోధుఁడు, మహాశారి = ఏనుఁగునంబారిపైఁ బఱపెడు గొప్ప గంత, ఫల = డాలువాలు, ప్రఘట్టనలు = త్రొక్కుడులు, పగవారు మాటిమాటికి తమపైకి యుద్ధమునకు రాఁగా వీరులు ప్రాలుమాలక పగవారికవచములు విడిపోవునట్లు తాము మాటిమాటికిఁ బ్రయత్నముతో యుద్ధమొనర్చి, తీక్ష్ణమైన రణరంగమున మెఱయునట్టి యేనుఁగులమీఁది అంబారీలపైనుండి డాలువాలుల వ్రేటులతో వారిని నొప్పించునట్లు తన కాయకు నెదుటివానికాయచేఁ బోటుపురాఁగా విసుఁగుకొనఁగా, ఎదుటి జూదమాడువాని జతగనున్న కాయలు విడిపోవునట్లు తన కాయతో దానిని జంపి జూదపుఁబలకలఁ జేతితోఁ దట్టుచు ఆదంపతులు జూద మను పోరొండొరుల మీఱి సాగించిరి అని భావము.

123. ఆస్యమద్య=నోటిలోని మద్యము, సద్యోదానము = అప్పుడ యిచ్చుట.

పణము = పందెపుసొమ్ము. ఆస్య......దానము = తన నోటిలోని మద్యము నప్పుడ యిమ్మని, అధరసంజ్ఞ = పెదవి కదలించి సైగచే.

124. (ప్రియురాలి నోటిమద్యము) పన్నిదము = పందెపుసొమ్ము, కెరల్చు = సంభ్రమింపఁజేయు.

125. ఆయితము = సిద్ధము.

126. ప్రణయవ్యసనము=ప్రేమమీఁది మరులు, కల్పకుజాసవము = కల్పవృక్షముయొక్క మద్యము, నిజ=తమయొక్క, ఇంద్రియపంచక=ఐదు ఇంద్రియములను (కన్ను, చెవి లోనగు జ్ఞానేంద్రియము లైదు), దైవతంబులఁ=దేవతలను, ఎసకొల్పు=పురికొల్పు. ఆపేల్పుదంపతు లిర్వురును ప్రేమ మీఱఁ దమ చెక్కులు లొండొంటి నానించి తమతమ పలకలవంటి చెక్కుల్లు ఆమద్యపాత్రమునఁ బ్రతిబింబింపఁగాఁ జూచుకొనుటవలన అమృతము యొక్క యెక్కువ యిచ్చుటద్వారా నైన క్రొత్తయానంద మనుభవించుచు నొక్క చిన్నపాత్రమునుండి కల్పవృక్షముయొక్క మద్యమును గ్రోలిరి.

127. మోవి = పెదవి, నిజేంద్రియపంచకదైవతంబులఁ = తమ జ్ఞానేంద్రియము లగు చెవుల ముద్దుఁబల్కులతోను, కన్నుల సౌందర్యవీక్షణ ములతోను, ముక్కుల గంధ మాఘ్రాణించుటతోను, జిహ్వలు మద్యము రుచి చూచుటతోను, త్వక్కు ఒండొరుల కౌఁగిలింతలతోను దేవతలబోలెఁ దృప్తిఁ బొందించిరి.

128. సిబ్బితి=సిగ్గు; ప్రబ్బు=వ్యాపించు, అన్నుకొల్పు = పరవశము సేయు.

129. సీమంతిని = ముత్తైదువు.

132. అవనతము = వంగినది, వాస్తవ్యుఁడు = నివసించినవాఁడు, ప్రాంగణము=ముంగిలి, గరిత=వనిత, కైదండ=చేయూఁత, అర=గది.

133. ఉలుపా = కానుక, అచ్చికము = ఇష్టము.

134. ఆత్మవిభు = తన ప్రాణనాథునియొక్క, చిత్తచలన=మనస్సు యొక్క చాంచల్యముయొక్క, శంకాంకురంబు=సందియంపుమొలక, కాదంబరీ=మద్యముయొక్క, మదాకులత=మదముచేనైన తొట్రుపాటు.

తన పెనిమిటి మనస్సు చలించునో యను శంకవలనను, మద్యము త్రావుటచే మత్తుగొన్నతొట్రుపాటువలనను వెడలిన యావేల్పులేమమాటలు ఆపాఱునియిల్లాండ్ర ప్రాణరక్షగఁ బరిణమించెను.

135. గణికామణి = ఉత్తమవేశ్య.

137. తదాభిముఖ్యము=వారియెదురు, తోయాక్షతల్ = నీటితోడి అక్షతలు.

138. చల్లగఁ జలికాలఁ దన్ని సొకుం డనియెుక్ = మీరు పిల్లజల్ల చల్లగ నున్నారా అని చల్లన అను పదమును క్షేమముగ సుఖముగ నుండుట గూర్చి ప్రశ్నించుట వాడుక. అట్లు నన్నుఁ జలికాలక్ అనఁగాఁ గాళ్లుకడిగి కొని యింటిలోఁ బ్రవేశించి సుఖముగ నుండి అని యర్థము. మఱి యిందుకు విపరీతము వేడికాలు "శ్మశానమునకుఁ బోయి దహనముచేసి వచ్చువానిని వేఁడి కాళ్లతో రాఁగూడ దందురు, వేఁడికాలితో వచ్చుట అశుభసూచకము. చలికాలు శుభసూచక మని తెలివిడి. చాకుండు = రక్షింపుఁడు.

141. బోరుతలుపు = పెద్దతలుపు.

142. నిజ......శ = తమ పెనిమిటి మరలఁ దము కలిసికొను నను కోరిక, అభి......లై = ఇచ్చవచ్చిన శరీరముల ధరించినవారలై.

143. మరుత్సతులు = దేవతాస్త్రీలు, ఇంధానద్యుతి = జ్వలించు కాంతి, పాప......తత=పాపపుఁగోర్కిని వలచు మనస్సు గలవాఁ డగుటచే.

145. ముద్గ......తతులు = పెసలు, బియ్యము, నెయ్యి, పాలు లోనగునవి.

148. అర్భకులు=పిల్లవాండ్రు, చతురాగమసూక్తులు=నాలుగు వేదముల సూక్తములు.

149. పెద్దభార్యకుఁ దొట్టిదొల్తఁ గుమారుఁడు రెండవభార్యకుఁ దర్వాత, మూఁడనామెకు నటుపిమ్మట ఇట్లు కుమారులు పుట్టిరి.

150. అనుభావము = ప్రభావము, సంయమి = ఋషి.

151. ఎఱుక = జ్ఞానము.

152. నిద్దపురూపములు = మిగుల సౌందర్యము గలరూపములు.

154. వెరవు = ఉపాయము.

155. దౌవారికుఁడు = హజారమునఁ గావలివాఁడు, వలకట్టుకొను = లోఁబఱుచుకొను, యాగేచ్ఛ = యాగ మొనరింప నిచ్ఛ, తదార్త్విజ్య సమర్థులు=ఋత్విక్కులుగా నుండి యాయాగము నిర్వహింప సమర్థులు.

156. ఆన = ఆజ్ఞ.

157. ప్రతిహారజనంబులు = వాకిటి కావలివారు.

162. క్రతు.........శంబు=యజ్ఞములఁ జేయు మనియు, పండితుల సేవింపు మనియు గొప్ప యుపదేశము.

163. భస్మ......పోలె = బూది గప్పిన గొప్ప నిప్పురవలువలె, వినీతి=వినయము, సుమోదము = లెస్ససంతసము.

164. శబ్దవిదుఁడు=శబ్దశాస్త్రము—వ్యాకరణము దెలిసినవాఁడు.

165. ముదల = ఆజ్ఞ.

166. ఆయంబు = ఆగాయము, సరకుసేయకుము = లక్ష్యముచేయ వలదు, అచ్ఛిదము=చెడనిది, తప్పక్ = తృప్తిపఱుచును. అజుక్=విష్ణువును (బ్రహ్మను), రాయ = రాయఁడా, సమోదుండు = సంతోషముతోఁ గూడు కొన్నవాఁడు.

167. ప్రచ్ఛన్నవేషము=గూఢమగు వేషము, దుర్వివేకము=చెడ్డతెలివి.

168. కోవిదులు = పండితులు.

169. లఘుప్రబలశిక్ష = కొంచెము తప్పుచేసినవానికి ఇంచుక శిక్ష, పెద్దతప్పు చేసినవానికి పెద్దశిక్ష గావించుట.

170. గృహీతదారులు = గ్రహించినభార్యలు గలవారు.

171. యాయావరవృత్తి=బిచ్చమెత్తుకొని జీవించుట,కౌతుక...... హాసితంబు=కుతూహలముయొక్క సంబంధముచే మెల్లగసాగు నగవు.

172. లవకుమారసమానుఁడు = శ్రీరాముని కొమరుఁడగు లవునితో సరివచ్చువాఁడు.

176. వాణి=విద్య-సరస్వతి, రసము = శృంగారాదిరసము.

177. అవరోహము = పైనుండి క్రిందికిఁ జదువుట, ఆశు...... కృతియు-ఆశువు=ఎక్కువ యోచనలేక ఏకధాటిగఁ బద్యములఁ జెప్పుట, విచిత్రము=అనులోమవిలోమము - బంధకవిత్వము-గర్భకవిత్వము లోనగునది, మృదుకవిత్వము=రసవంతములగు పద్యములు మెల్లఁగ నల్లుట.

180. వాపోవు=ఏడ్చు, పొత్తి = పిల్లలు పండుకొనుటకుఁ బఱచిన చిన్నగుడ్డ.

182. కఱదు=నేర్పు-చాతుర్యము, పూప = బిడ్డ.

185. దైవావేశము = దేవత ఆవేశించుట.

188. నిసువు = బిడ్డ, నానా.........యాంఘ్రి = అనేకులైన రాజులయొక్క భార్యల పాపటిరత్నములచే నిర్మింపఁబడిన యంచెలచేఁ బూజింపఁదగు పాదములు గలది.

190. శుద్ధాంతము = అంతఃపురము.

191. యథేష్ట = ఇష్టమువచ్చినట్లు (అవారిగ), అన్నదానకరణ = అన్నదానము చేయుటయందు, పర్యాప్త = చాలినంత, బహుధన = మిగుల ధనము, గ్రామ=ఊళ్లు, దానములన్ =వీనియొక్క యిచ్చుటలచే, తత్పురంధ్రి= ఆయుత్తమురాలి, నివాససద్మమునకున్ = నివాసమున్న మేడకు.

యథేష్ట......నముల = ఇచ్చవచ్చినట్లన్నదానము చేయుటకుఁ గావలసినంత యెక్కుడు ధనము గ్రామములు వీని నిచ్చుటలచే, పురంధ్రి = మంచి నడవడిగల సతి.

193. దోయిలి = దోసిలి (అంజలి), పోర్కాడించు = స్నానము చేయించు.

194. కువలయాధిపుఁడు=రాజు, (చంద్రుఁడు), కళాపూర్ణుఁడు.

196. కెంగేలు=ఎఱ్ఱనిచేయి, తివుట = కోరికచే, ఆమని=వసంతము, చూపఱు=చూచువారు, ముంగిటిముత్తెము = ముంగిలియందున్న ముత్తెము - నలుగడలవారికిఁ గనఁబడుచుఁ జెలువారు ముత్తెము.

198. మృదు......లు=మెత్తని పాదములందలి పద్మరేఖలు, నతులు = నమస్కారములు.

199. వాసరము=దినము, సందిలి=రెండు బాహువులు చుట్టుకొన్న భాగము.

200. చిట్టికలికి = నేర్పుగల చిన్నబిడ్డ.

202. అచ్చెనగండ్లు=బాలికల ఆటలు, పింపిళులు = పెదవిమీఁదుగ ధ్వని గలిగించుచు నాడునాటలు, కుచ్చిళ్లు=క్రీడావిశేషము, గీరనగింజలు = క్రీడావిశేషము.

203. శైశవము=బాల్యము, క్రేళ్లు = దుముకులాడు, అంగకము = అవయవము.

205. కచభారము = తలవెండ్రుకల కొప్పుబరువు.

206. గురుతరస్తన=మిక్కిలి గొప్పవియైన స్తనములను, కేళిగిరులు= క్రీడాపర్వతములు, గంభీరతరనాభి=మిగులలోఁతైన పొక్కిలి యను, కూపమతల్లిక=మంచినూయి, చారురోమాళి = అందమైన నూఁగారు, శృంగార = సింగారమైన, ధారాసరణి = నీటిధారలదారి, అంగుళీ = వ్రేళులను, కిసలయచయంబు=చిగుళ్ల మొత్తము, సుకుమార=మృదువులైన, బాహువల్లికలు=చేతులను తీఁగెలును, రమ్య+ఊరు=సుందరములైన తొడలను, కదళికా=అరఁటుల యొక్క, స్తంభప్రకాండములును = మేలికంబములును, సులలిత = సుందరమైన, అధర=పెదవి యను, బింబఫలవిలాసము = దొండపండుకాంతియును, పుష్పవిసర' = పూవుమొత్తములయొక్క, పాండిమ = తెల్లఁదనమువంటి, హాసవిభ్రమము = నగవువిలాసము, శుకపికకలకలము = చిలుకలు కోయిలలు వీని కోలాహలము, మధుకరకులము = తుమ్మెదల మొత్తము, శంబరారాతి = మన్మథునియొక్క, కేళివనము = క్రీడావనము.

ఈనాయిక యీపద్యమున శృంగారవనముగ వర్ణింపఁబడినది. స్తనములు క్రీడాపర్వతములుగను, (ఇట్లే) లోఁతైన పొక్కిలి మంచినీటి నూయి,

సొంపైన నూగారు సింగారపు నీటిధారగలదారియు, వ్రేళులు చిగుళ్లు, లేఁత చేతులు తీఁగెలు, లెస్సైనన తొడలు అరఁటి కంబములు, చెన్నైన పెదవి దొండపండు, నగవు పూవుల తెల్లఁదనము, పలుకులు చిలుకగోరువంకల కలకలములు, తలవెండ్రుకలు తుమ్మెదలు గాఁగ, శంబరారాతి కేళివనంబుఁ బోలె-మన్మథుని క్రీడోద్యానమువలె నైనది.

207. ప్రాగన్మవాసన = పూర్వజన్మపు సంస్కారము, అనతిప్రయత్నము=ఎక్కువ ప్రయత్నము లేమి.

208. వ్యాసంగము=ఒక్క పనిలోనె మునిఁగి తేలుచుంట.

209. కొనకొను = ప్రయత్నించు.

213. పరాకు = తత్పరత.

214. సంతత = ఎడతెగని, కంతుకేళి = మన్మథక్రీడయందలి, వివిధ=రకరకములైన, సంకల్పవాసన=తలంపుల తగులము, వీనులు = చెవులు, పులకలు = గగుర్పాటులు, వీడుపాటు = వదలుట.

215. ఆమె పగలుగాని రాత్రిగాని కన్నుమూయక నిద్రింపదయ్యె. (ప్రియునిమీఁది మోహమున) అది యెట్లుండె ననఁగా: ఆమె-తామరసాక్షి=కమలములవంటి కన్నులు గలది కావునఁ బగలు కమలము వికసించును గావున ఆమెయుఁ గన్నులు మూయక (నిద్రింపక)యుండి ఆపేరు సార్థకము చేసికొనెను. అట్లె-నీలోత్పలాక్షి = నల్లగలువలవంటి కనులు గలది. రాత్రులు చందురుపొడుపుతోఁ గలువలు వికసించునుగదా. ఆవిధముగనే ఆమె రాత్రులు కనులు మూయక (నిద్రింపక) ఆపేరునుంగూడ సార్థకము చేసికొనెను అని తాత్పర్యము.

217. చిల్కబోద=చిలుకపిల్ల, బ్రాంతి=ప్రేమ, వావి=వరుస.

218. అచ్చుపడు = స్పష్టమగు.

220. నిబ్బరము = అధికము.

221. భావజుబారి = మన్మథునికి వశమగుట.

223. అమిత=ఎక్కువైన, మకరంద=పూఁదేనెయొక్క, నిష్యంద=స్రవించు ప్రవాహమున, రమిత = రమించుచు, ముఖరిత = మ్రోఁగుచున్న, అళిసంతానము = తుమ్మెదలమొత్తము గలది.

అమిత...తానము = మిక్కిలి పూఁదేనెజాలులో రమించుచు రొద పెట్టు తుమ్మెదల మొత్తము గలది.

224. సరిపెణ = గొలుసు, జాగరూక = వికసించిన (చిగిర్చిన) పల్లవప్రసూన = చిగుళ్లు పూవులు, దళ=ఆకులు, పటల = వీని సమూహము యొక్క, శబలిమ = పలువన్నెలయొక్క, విలసనంబు = ప్రకాశము, కేళి ధూళిపాళికలు = క్రీడకై చల్లు దుమ్ముమొత్తము, బూమియలు=వేషములు, అవిరళదళ=చిక్కని యాకులు, కిసలము=చిగుళ్లు వీనిచే, విలసిత-ప్రకాశించు, లతావితానంబులు=తీవెల మొత్తములు, మరకతం=గరుడపచ్చలు, కురువింద = కెంపులు, నిచయఖచితంబులు=వీని మొత్తములచేఁ జెక్కఁబడినవి. సగతులు= జీనిసగిషీపని, ఉల్లారు=గుల్లపుజీనిపైనుండు పఱుపు, వాసంతికాకుడుంగములు= బండిగురివెందపొదలు, మృగమద = కస్తూరి, ఘనసార=పచ్చకప్పురము, గంధసార=గంధము, కాశ్మీర=కుంకుముపూవు, విలేపనము=వీనిపూఁత, సముదంచిత= ఒప్పు, కురువిందకందళ = కెంపుతునకల, సందర్భ=కూర్పుతో, సంగత=కూడుకొన్న, అంగుళీయ = ఉంగరములయొక్క, ప్రచురరుచినిచయ = విస్తారమైన కాంతుల మొత్తముచే, కవచిత=క్రమ్ముకొన్న, కరతలరాగంబులు=అరచేతుల కెంపుచాయలు, అతిమాత్రసంచార=మిగుల నడచుటచే, సంక్షుభితంబులు = కందినవి, క్రీడావతంసిత = ఆటకై చెవిఁ జెక్కుకొన్న, కర్ణ=చెవులయందలి, నీలోత్పలంబులు = నల్లకలువలు, నిజప్రతిబింబ = తమ ప్రతిబింబములను, కపటపరిస్పృశ్యమాన = నెపముచేఁ గన్పట్టు, సోదర+ఆలింగన = తోఁబుట్టువుల కౌఁగిలియందు, లోలుపంబులు = ఆసక్తి గలవి.

పవనంబు=గాలి, బల్లాడదట్టి = ఒక దినుసు కాసె, ఆయుద్యానవనము

మన్మథుని దండు దిగినచోటువలెఁ జూపట్టెను. కాఁబట్టి శిబిరమునకు వనమునకును గల సాధర్మ్య మిందుఁ బొందుపఱుపఁబడుచున్నది.

౧. పచ్చని పట్టుకాసెలవలె మొగిలిచెట్లు గుంపుగాఁ బెరిఁగియుండెను. వానిఁదుమ నెఱ్ఱని డేరాలవలెఁ గెంజిగుళ్లతోడి లేమావిగున్నలు చెలువారుచుండెను.

౨. గుంపులై మత్తెక్కి రొదవెట్టు తుమ్మెద లినుపగొలుసులుగను, చిక్కని చిగురుల కెంపుచాయ చెందిరపు ధూళిగను, సొంపగు తెల్లకలువలు పూవురేకుల ముత్తెంపు పలువన్నెల వెలుంగుగాను,

3. చిక్కఁగఁ గాఱు పూఁదేనెచిన్నవర్షము మదధారలుగను, అప్పుడప్పుడపుట్టికన్పట్టు పుప్పొడుల క్రీడావశమునఁ జల్లు దుమ్ములుగను విలవిల్లఁగఁ బొన్నచెట్లేనుఁగుల భూమికలు (వేషములు) వహించినట్లు గన్పట్టఁగా,

౪. చిక్కని యాకులుగల చిగుళ్లతోడి తీఁగెజొంపములు, గరుడపచ్చలు కెంపులు చెక్కిన జీని నగిషీపనివలెఁ గనుపట్ట,

౫. రెండుప్రక్కల పూచి సోగగా వ్రేలుచుండు పూవుగుత్తులు వింజామరలవలె సొంపొంద,

౬. ముందున్న చిగు ళ్లార్ద్ర)పురుషులవలె నెఱ్ఱనైన గుఱ్ఱపు జీనిలమీది పఱుపువలెను,

౭. బండి గురివెందలపొదలు గుఱ్ఱములవలెను,

౮. పైభాగమున దట్టముగా నల్లుకొన్న తములపాకులతీఁగెలు తలపాగలవలెను, ఆ తీఁగెల లోపలినుండి పైకి నిక్కఁబొడుచుకొన్న మొగిలియాకు లాతలపాగలచుంగులుగను గనుపట్టు లేఁతపోఁకచెట్లు వీరభటులవలె నుండెను.

౯. చిలుకలు, కోకిలలు, గోరువంకలు పీసికలకలములు తక్కినవాని సందడిగను జూపట్ట విరహులమీఁద దాడివచ్చిన మన్మథుని సేనాశిబిరము దండు (దిగినచోటు)వలె వనము గన్పట్టెను. అతకరించు = క్రిందుఁజేయు, ప్రేఁగు = బరువు, గరిమ = గొప్పతనము, గూఢమి = కలిసికోక పోవుట,

కుడుంగములు = చిన్నపొదలు, మల్లాడు = పెనఁగులాడు, క్రీడించు = అలక్ష్యము సేయు, కురము=పొద, తోఁగు = తోలు, ఉగ్గ=జత, కేకిసలు = చప్పట్లు, రువ్వు=విసరివేయు, పరాగము = పుప్పొడి, చీరు=పిలుచు, కేరు = చెలరేఁగు, మృగ......లు = కస్తూరి పచ్చకప్పురము కుంకుమపూవు వీని మైపూఁతచే వచ్చు సువాసనలు, అలంత = అలసట, నీవి=పోకముడి, తావు= స్థానము.

౧౦. ఆయువతులు కట్టుకొన్న కోకలముడులు వీడిపోఁగా వానికొంగు లను మరల బొక్కిళ్లదగ్గఱఁ జెక్కుకొను సమయమునందు వారివ్రేళులయందలి కెంపు ఉంగరముల కాంతులఁ బైకి రానీక వారియఱచేతు లాటంకపఱుపనా కెంజాయ లాపొక్కిళ్లఁ బ్రవేశించి పాదతలములనుండి బయలువెడలెనో యన్నట్లు మితిమీఱినడచుటచే నలఁగిన యఱకాళ్ళను మిక్కిలి యెక్కుడైన రక్తిమ (ఎఱ్ఱనిచాయ) యుట్టిపడుచుండెను. కెలంకు = పార్శ్వము, ముదలకించు = మార్కొను, తరఁగ=అల, సంది = రెట్ట-మోచేతిపైభాగము, వసివాళ్లు=మిక్కిలి వాడుటలు.

౧౧. చెవులఁ జెక్కిన నల్లగలువలరేకులు చెక్కిళ్ళచెమ్మట నంటుకొని యెట్లుండె ననఁగా: ఆచెక్కిళ్ళకాంతియందుఁ దమప్రతిబింబములు గన్పట్టఁగా నవి తమతోఁబుట్టువు లని వాని నాలింగనము చేసికొన్నవా యన్నట్లుండెను.

లోలుపంబులు = మిగులనాసక్తిగలవి, ఉమ్మలి = ఉబ్బలి (బురద), నీలాలకజాలంబు = నల్లనిముంగురుల మొత్తము, చంచరీకము = తుమ్మెద, వసంతాగమ......పంబు = వసంతుని రాక యనుసిరిచే నలంకృతమైన దేవ తలవలె, చేరు = దండ-హారము, ఆకరువు = కేసరము - తామరదుద్దులోని కింజల్కము.

225. చంచలవీచి = చలించు అలలయొక్క, సంచయ = సమూహముయొక్క, లీలా = విలాసముతో, సలలిత = సుందరములై, తరళిత = చలించు, జలరుహపాళీ = తామరల మొత్తముతో, సంచిత = కూడిన,

హాస = హస్తములతో, ఉదంచిత = ఒప్పుచున్న, భంగీ=విధముచే, జనిత= తోఁపించు, మదనమత = మన్మథుని సిద్ధాంతముయొక్క, సరణి = మార్గము యొక్క, గుణ=గుణములయొక్క, వ్యాఖ్యా=వ్యాఖ్యానము చేయుటయందు, అంచిత=తగినట్టి, గోష్ఠీ=సంభాషణము, సంచరణ = నడపునట్టి, ప్రత్యయ = విశ్వాసమునకు, సముచిత = తగిన, హాళహాళికలతోఁ = కలకలధ్వనులతో, కొంచేలు=క్రౌంచపక్షులు, వ్యవహిత=భిన్నమగు, పరరవము=అధికమగు ధ్వని.

కదలుచున్న యలల మొత్తముయొక్క విలాసముచే నందముతోఁగూడి చలించుకమలములపరుస యను హస్తములయొప్పిద మగువిధముచేఁ బుట్టినమన్మథునిమత మైన కామశాస్త్రపద్ధతిని వ్యాఖ్యచేత నొప్పు గోష్ఠీసంచార మను విశ్వాసమునకుఁ దగిన కలకలధ్వనితో రాయంచలు క్రౌంచపక్షులు వేఱువేఱుగఁ గూయుటచే నొప్పుసరస్సును.-వారొక సరస్సును గాంచిరి. దానియందు అలల కదలికలకుఁ దామరలు కదలుచుండెను. అది ఎట్లుండె ననఁగా ఆసరస్సు కామ శాస్త్రమును వ్యాఖ్యానించు సందర్భమున ఆకమలములు హస్తములుగను రాయంచల కూయుటలు ఆసరస్సు కంఠరవముగను నుండె నని భావము.

226. ఆ యంగనలాసరస్సునకుఁ జేరఁబోయిరి. అందు నడ్డులేని తరంగములపైఁ దేలియాడు నంచలు బెగ్గురుపిట్టలులోనగువాని కూఁతలను దుదముట్టఁ జేయుచు వారి కాలియందెలు లోనగు నాభరణముల యులివు విన్పించెను.

227. మునికొంగులు = కోకయొక్క ముందటి యంచులు.

228. అలంతి=ఇంచుక, తరలు=పోవు, జంఘలు = పిక్కలు, రవలి= చప్పుడు, కంజము = పద్మము, ఓసరిలు = ప్రక్కకుఁ దొలఁగు.

229. హరినీలపుటచ్చనగండ్లు=ఇంద్రనీలమణులతో నిర్మింపఁబడిన ఆటకాయలు.

230. కోకమిథునములు = జక్కవదంపతులు.

వారి ముఖములు, అరచేతులు, స్తనములు, కేశపాశము, చూపు, కన్నులు వరుసగా కమలములు (వికసించిన పద్మములు), ఎఱ్ఱదామరలు, జక్కవ దంపతులు, నాచుతీవెలు, తుమ్మెదలమొత్తములు, మచ్చెములను బరాభవించినవి.

231. ఓల=జలక్రీడయందు ఉసిగొ అను మాట, పిసాలి = ఉక్కారి, మేలము=పరిహాసము, ఎసపెట్టు=పురికొల్పు, గోల=స్త్రీ, పగటు=ప్రకాశము, సుమాళము = పారవశ్యము, హాళి = సంతసము.

232. క్షుభిత = కొట్టుబడిన (నీటిచే), ఘన స్తనకుంభ = గొప్పవైన కుండలవంటి చన్నులనుండి, పరిచ్యుత = జారిన, కుంకుమ చందన=కుంకుమ పూవు-గంధము, కుంతలసూన=కేశపాశమునందలి పూవులయొక్క, భరవిలాస మునన్=భరించునట్టి విలాసముచే, బహువర్ణము = పలువన్నెలు గలది. నవ్య సుగంధగుణంబు = క్రొత్తపరిమళ మనెడు మంచిగుణము, ఘోషణ = ధ్వని, తోయశకుంతతతుల్ = నీటిపక్షుల మొత్తములు, కలగుండు = కలత.

జలములచేఁ గొట్టుబడిన స్తనకుంభములనుండి జారిన కుంకుమపూవు తోడి గంధమును, జెడలందుఁ గీల్కొన్న పూవుల మిక్కుటంపుఁ దావి విలాస ముతో ఆ కొలను పలువన్నెలు గలదై, క్రొత్తావుల మేలిగుణముతోఁ బొగడఁదగినదై చూపట్టెను.

233. స్రుక్కుల్లపట్టు=ముడుతలతోడి కడుపుభాగము.

235. పూన్పు=పూనిక,అభ్యర్ణమహి=సమీపప్రదేశము, తూర్ణతన్= వేగముగ, వర్ణ......తుఁడు=వర్ణించుటకుఁ దగ్గ నచ్చెరువుగొల్పు గుణముల యాధిక్యముచేఁ బ్రకాశించువాఁడు.

237. మూఁపు = బుజము.

238. ఘనత్రప = గొప్ప సిగ్గు.

239. వికకలి = వికట.

240. ఒప్పిదము = అందము.

242. గండపాలి = చెక్కిలిప్రదేశము.

246. శైవ్యాసం......వేషంబు = వేఁగవేఁటలో విహరించుటకుఁ దగిన మధురవేషము.

247. తేఁటిపిండు+ఉరపురావము = తుమ్మెదల మొత్తముయొక్క శ్రేష్ఠ మగు ధ్వని.

248. ఘట్టకుటీప్రభాతము = సుంకము చావిడికడఁ దెల్లవాఱుట. ఒకఁ డొక పట్టణమునఁ గొన్నివస్తువులు గొని సుంకము చెల్లింపక పోఁగోరి సగము రేయి వేళఁ బయనమై పట్టణమంతయుఁ గలయఁదిరిగి దారి గానక తెల్లవారుసరికి సుంకము చావిడికడనే సుంకము వారికిఁ బట్టువడెను. అనఁగా నేదేని వల దని మనము తప్పించుకొని పోఁజూచినను అది విధిచెయ్యమున సంప్రాప్తించు నని తెలియనగు.

251. ఇవతాళించుకప్రంపుటరఁటులు=మంచువలెఁ జల్లనైన పచ్చకర్పూరము నిచ్చు నరఁటిచెట్లు, అసలు = బురద.

252. లప్ప = రాశి, ముద్ద.

254. చొరువు=ఎండినయాను, వఱువట్లుగొను=మిక్కిలి ఎండిపోవు.

257. కుమారిలు = కుములు, లాఁతి = ఇతరుఁడు.

258. ఏణాక్షి = లేడికన్నులు గలది, ఉసులు = ప్రాణము.

259 నితాంతాకుల = ఎడతెగక కుందునట్టిది.

261. కామాహవకేళి = సంగమము.

262. ఘర్మపులకవతి = చెమటతోటి గగుర్పాటు గలది.

265. కీవి = గాంభీర్యము. ఉదురఁదోలు = లేవఁదోలు.

267. నెఱియు = నుండు.

268. అమృతధామాఖ్యా = అమృతకిరణుఁడు, లేక అమృతమునకు స్థానమైన వాఁ డను పేరు నిరర్థకము. ఏల యనఁగ నితఁడు తపింపఁజేయుచున్నాఁడు. గోముఖవ్యాఘ్రము - మొగము మాత్ర మావు మొగము, పని మాత్రము బెబ్బులిది అని భావము.

269. ములుచ = మూఢుఁడు,

273. పూఁట=బాధ్యత వహించుట-ప్రతినిధిని అగుట.

---

## సప్తమాశ్వాసము

3. కర్ణరసాయన=చెవులకింపై, ఉల్లసిత = మెఱయు, కమ్ర=మనోహరమైన, యశోమహానీయుఁడు=కీర్తిచే గొప్పవాఁడు, తద్గుణ = ఆమె గుణ

ఘులను అల్లైత్రాటిచే, ఉదీర్ణ=అతిశయించిన, లతాంతసాయక=పూవిల్తునిచే, విదీర్ణ=చెక్కలైన, మనోధృతియై = మనస్సుయొక్క దిట్టతనముగలవాఁడై.

చెవుల కింపైన సద్గుణములచే మనోహరమైన యశస్సుచే గొప్పవాఁడు. తద్గుణో......ధృతియై = ఆమధురలాలసగుణముచే (అల్లైత్రాడు) నతిశయించిన మన్మథుని బాణములచేఁ బగిల్చిన మనోధైర్యము గలవాఁడు.

5. శంసకుఁడు = సూచించువాఁడు.

7. ఉప్పరిగ=మేడ, సాలము = ప్రాకారము, ప్రవాళము=చిగురు.

8. కుటిలాలక = వంకరలైన ముంగురులు గలది.

10. వాక్+మతి=మాటలు, మనస్సు.

12. కిరుసుకత్తి=రెండుప్రక్కల పదును గలకత్తి, ఆరాళపార్శ్వము=వంకరలైన ప్రక్కగలది, ఉపరి = పైభాగమునందు, కృత = చేయఁబడిన, ప్రసూనరచనా=పూవుదండలయొక్క, ఉజ్జ్వలతా=ప్రకాశించుటయొక్క, విభవంబుచేతన్ = సంపదచే.

ఆ చిలుకపలుకులు గల మధురలాలసయొక్క జడ ఇరువైపుల పదును గల మన్మథునిఖడ్గమువలె నాధైర్యమును దెగటార్చెను. ఆ జడ కొంత ప్రక్కకు వంగియుండెను. పైభాగమున నలంకరించిన పూవుబెత్తుల ప్రకాశించు వైభవము ఖడ్గమునకు దంతముతోఁ జేసిన పిడివలె నుండెను. అనఁగాఁ బొడవుపాటిజడ ఖడ్గము. పైని పూవులుంచిన భాగము పిడి అని తెలియనగు.

15. అన్యరసము = ఇతరమగు తలంపుతోడి యనుభవము.

19. ఓమ్+అన్యథా=అదిసరి ఇది సరికాదు, కడగుఱుతు=తుదముట్టు చిహ్నము, శనివారపుజడి = శనివారమునాడు వర్షము పట్టినఁ గొన్నినాళ్లు విడువక కురియు నని పెద్ద లందురు (అది స్థిరవాసరము గనుక),మంతనాలు=ఆలోచనలు, ప్రేగులలోనితీఁట = గోకిపోఁగొట్టుకోలేని నవ, బుధప్రకాశోదయము = బుధుఁడు ప్రకాశించుచు జగమునకుఁ గన్పడి యుదయించుట. బుధుఁ డెప్పుడును సూర్యునితోఁగూడి సంచరించువాఁ డగుటచే లోకమునకు నెప్పుడుఁ గన్పడఁడు. అట్లోకవేళఁ గనిన నది యతివిచిత్రము గదా.

మఱియు "బుధప్రకాశో జగదప్రకాశః" అని బుధుఁడు లోకమునకుఁ దెలిసినట్లు ప్రకాశించెనేని లోకమున కరిష్ట మనియుఁ బెద్దలు చెప్పుదురు. కాఁబట్టి రాజుతోఁడి ముచ్చట యెప్పుడును సమకూరుట లే దని భావము.

21. స్థలశుద్ధి...రే=సాధారణముగా నిల్లుగట్టువారు ముందు ఆకట్టు స్థలమును ద్రవ్వి శల్యములు, వెంద్రుకలు లేక శుద్ధిచేయుదురు. దీనిని స్థలశుద్ధియందురు, దడి=ఆకులతో నడ్డముగట్టుట, చవికె=నాలుగు స్తంభములతోఁ జెరగాఁ గట్టునిల్లు.

22. ఆఱుపులకుఁ = వాగుటకు.

23. తమకించు=త్వరపడు, వెచ్చము=వ్యయము, విరహాపుఁబన్ను = రాజు విరహవేదన పడుచున్నందుకైన పన్ను.

24. కిల్లాకు = చీటి, కామితము = కోరిన వస్తువు.

25. భూదారుఁడు=రాజు, కట్టాణిముత్యాలు = పెద్దముత్యములు, చంద్ర......లు=చంద్రకాంతమణులు, చలువఱాలు. విరహమును శాంతింపఁ జేయు గందము, ముత్యములు, పన్నీరు, చంద్రకాంతమణులు, పచ్చకర్పూరము వీనిని సామంతరాజు లంపి రనుట, వారికిని విరహమయ్యె ననుట చమత్కారము.

26. నీకు విరహవేదన యడంగుటకై చాల ద్రవ్యముల నంపి వ్యయ మధికము చేయుచున్నారు. వానిలో సగము పంపినను నీకుఁ జాలునన్నాఁడు. అది ఏ మనఁగా పైపద్యమునందు.

౧. చందనపు మ్రాఁకులు.

౨. కట్టాణిముత్యాలపెట్టెలు.

3. పన్నీరుచెంబుల బండ్లు.

౪. చంద్రకాంతపురాచలుపలు.

౫. కప్పురపుగోనెలు.

అను వీనిలో సగము చాలు ననుట ఎట్లు? పైపదములలో రెండవ పదములగు మ్రాఁకులు, పెట్టెలు, బండ్లు, చలుపలు, గోనెలు అను వానిని

దీసివైచిన మొదటి వస్తువులుమాత్రము మిగులును. ఇవి చిత్రముగాఁ జెప్పి నాఁడు కవి—కయఁడు.

27. కోటికిఁ బడగ యెత్తు=అందఱు నాణెవారి కోటిసంఖ్య (నూఱు లక్షలు) గలిగెనేని వారిమేడమీద నొక పాముపడగమాదిరి కట్టింతు రట. అట్లు మాటలు వాగుటలోఁ గోటికి బడగయెత్తినవాఁ డనుట.

29. ఊరక మంత్రతంత్రములు లేక స్నానముచేసి చేత దర్భలుపట్టు కొని మౌనము వహించి యున్నంత నాతఁ డుత్తమబ్రాహ్మణుఁ డగునా? మఱియు నొక పుట్టెడునుప్పు దిని గడ్డపాఱ మ్రింగినవాఁడువలె బిఱ్ఱబిగిసి కొని కూరుచుండిన గొప్పతనము వచ్చునా? అట్లు నే నుండలే దని నన్ను నీవు పలువ యంటివి.

30. గంగిగోవువంటి సాదుబాపఁడు=పూజ్యమైన ఆవువలె మంచి బ్రాహ్మణుఁడు. అట్టి యావును బూజింపవలయును గాని ఏమాత్రము కీడు చేయ రా దని భావము.

31. తదవాప్తి = దానిని పొందమి.

34. షాడ్గుణ్య......చింత=సంధి, విగ్రహ, యాన, ఆసన, ద్వైధ, ఆశ్రయము లను నాఱు రాజకీయములగు గుణములు.

34. ఘోటకము=గుఱ్ఱము, నాట్యనిరీక్ష = నాట్యము చూచుట.

35. ఆకె=ఆమె, ఎలప్రాయము=జవ్వనము, నేలకుఁ గోలకుఁ దెచ్చు చున్నవాఁడు = పలుపాట్లకు లోను జేయుచున్నాఁడు.

37. ఉమ్మలించు = దుఃఖించు.

38. ప్రతీక్షించు = ఎదురుచూచు, సులభతావగుణము = ఇది సుల భముగాఁ బొందఁదగిన దను చెడ్డగుణము.

39. ఆరనాళము = గంజి.

42. సంబంధసాదృశ్యము=వియ్యపువారికిఁ బరస్పరము గల పోలిక తెఱవ = స్త్రీ.

44. అడపొడ = జాడ.

45. జని = పుట్టుక.

49. దివాలగ్నము = పగటిలగ్నము.

50. హారిద్రపంక=పసుపుద్రవముచే, మిళిత=కలిసిన, మణిశోభన్ = రత్నకాంతిని, గళసౌభాగ్య = కంఠసౌందర్యముయొక్క, అభినీతి = అభినయించుటయందు, క్షమిత=నేర్పొందిన, పురముపైన్=పట్టణముపై, నిత్య+ఉత్సవ = ఎల్లప్పుడు మంగళకరమై కనపట్టు, ద్వాస్స్ఫురితులు = ద్వారములందుఁ బ్రకాశించునవి.

౧. ఫలముల్......భన్ = పండ్లు పసుపు గందము బూసిన రత్నముల కాంతి వహింపఁగా, ౨. గృహశ్రీ......ల్=గృహలక్ష్ములయొక్క కంఠసౌందర్యముల నభినయించుటయందు నేర్పుగలిగి పట్టణముపైకి నెత్తుగ వ్యాపించి, నిత్య......ల్=ఎల్లప్పుడు కళ్యాణమును గలిగించు ద్వారముల కడ మెఱయు లేఁతపోఁకచెట్లు మిగుల మెఱసి యుండుటంజేసి యాపట్టణము గ్రముకకంఠోత్తర మండ్రు. ఆపట్టణమందలి మేడలద్వారముకడఁ బసుపు రంగుతోడి పండ్లతో నొప్పుచెట్లు ఆగృహలక్ష్ముల కంఠసౌందర్యముల నభినయించు చున్నట్లుండుటవలన నాపేరు గలిగె నని భావము.

51. అలంక్రియ=అలంకారము, అన్యూనప్రజ్ఞులు = తక్కువగాని ప్రజ్ఞగలవారు.

52. నిజాగ్రభార్య = తన పెద్దభార్య.

58. హిమవారి = పన్నీరు, గంధసారము = గంధము. కలయంపి = దుమ్మడఁగుటకై చందనాదులను గలిపి చల్లునీరు, కలువడము=ధ్వజస్తంభమున వ్రేలఁగట్టు కలువలదండ, మేల్కట్టు = చాందిని - పందిళ్లపైభాగమునఁ గట్టు చిత్రవస్త్రము.

60. పసిఁడికొప్పెర = బంగారు గంగాళము; వెడల్పుముఖము గల పెద్ద పాత్రము - కటాహము, హేరాళము = అధికము, బాగాలు = వక్కపొడి, బంగారు చఱపుపస = ఆఱచేతితోఁ దట్టిచేసిన పిడకలోనగునవి చఱపు అనఁబడును. అట్లు చదునుగ సాఁగఁగొట్టిన పలుచని రేకు బంగారుచఱపు. దాని చక్కఁదనము, మావటాలు = తములపాకుల కట్టలు.

62. వేదిక = అరుగు.

64. గంధామలకము = సువాసనగల ఉసిరికపండ్లు నూఱిన ముద్ద.

65. దడిమము=సన్ననిది. మలయజము=గంధము, కజ్జలము=కాటుక.

66. పిల్లాండ్లు=కాలి నాలుగవవ్రేలికిఁ బెట్టు ఒకనగ, బబ్బిలికాయ-వీరముద్దె-అందియ=కాలియాభరణములు, సేవళము=మణులు గ్రుచ్చిన హారము; పుంజాలదండ = నాలుపోగులదండ, బన్నసరము = వివిధములైన రత్నములు గ్రుచ్చిన హారము, మొగపుఁదీఁగె = నొసటియందు నడ్డముగాఁగట్టు బంగారు తీఁగె, ఆణిముత్తెపుఁజేరు=పెద్దముత్తెములదండ, సందిదండ=రెట్టకుఁ గట్టునది, సూడిగము = చేతిగాజు, కోలాటంపుఁ గమ్మజోడు = ఒక దినుసు కమ్మలజత, ముంగర = ముక్కునకు వేసికొను నత్తు, బవిర=గుండ్రని కమ్మ.

67. కైసేయు=అలంకరించు, జనయిత్రి = తల్లి.

68. అఱుతన్=కంఠమునందు, చెంగల్వ = ఎఱ్ఱకలువ, సురాళించు= తృష్టిదోషము పోవుటకై దిగదుడుచు.

69. కట్టాయితము=సిద్ధము. వంది=స్తుతిపాఠకుఁడు, వైతాళికుఁడు= మేల్కొల్పువాఁడు, సూతుఁడు=రథము నడుపు సారథి, మాగధుఁడు=వంశావళిఁ జదువువాఁడు, వేత్రహస్తుఁడు = వెండిబెత్తమువాఁడు, సర్వంసహా = భూమి, కాహళము=ఊఁదునట్టి వాద్యము (బాకా). పటహము = తప్పెట, ఝల్లరి=డోలు, పణవము=మద్దెల, తమ్మటము = ఒకవిధమగు తప్పెట, ఔపవాహ్యము=గుఱ్ఱము, కరటిఘటా=ఏనుఁగుల సమూహము, వానీరము=ప్రబ్బలి, చండిమ=తీక్ష్ణత, సురభి = పరిమళము, తరణి = సూర్యుఁడు. ఆతపత్రము = గొడుగు, ఉపాయనము = కానుక, పౌఁజు=దండు, ఉపాంతము=సమీపము, వితర్దిక=అరుగు, కురువిందము = కెంపు, రాజావర్త=వజ్రము, హరినీలము= ఇంద్రనీలము, వితానము = మేలుకట్టు, యవనిక = తెర, దంభము=నెపము, లాజలు=అక్షతలు, గుళుచ్ఛము=పూలగుత్తి. కాశనీకాశము = జెల్లుపూవుతో సమానమైనది, ఆకాశమణి = సూర్యుఁడు, పుండరీకము = తెల్లదామర, పుష్పంధయము = తుమ్మెద, మిసిమి = కాంతి-పై నిగనిగ, మకుటము = కిరీ

టము, మహానీలము = ఇంద్రనీలమణి, హీరము = వజ్రము, చామీకరము = బంగారు, ఆమూలచూడము = చెట్టుమొదలుకొని తుదవఱకు, బాహ్యాంతరము= వక్షస్థలము. ప్రవాళము = చిగురు. జాలకము = మొగ్గ, సూనము=పువ్వు, అంగుళీయము=ఉంగరము, అంగదము=భుజకీర్తి, గారుత్మతము=గరుడపచ్చ, శబలిమ=చిత్రవర్ణము, విశ్రాణితము=ఈయఁబడినది, కబరి=జడ, రోలంబము= తుమ్మెద, వాజి=గుఱ్ఱము, మంజీరము=అందెయ, నూపురము=అందియ, పారిహార్యము=చేతిగాజు, కామనీయకము=మనోహరము, అఖర్వము=మేలైనది.

70. తోయము = తెర.

72. తరిగె = కేడెము-డాలు, వాగె=కళ్లెము, జతన=యత్నము.

73. తోయము = నీరు, గిండి = చిన్నచెంబు, ఆదట=ప్రేమ.

75. కురంగాక్షి = లేడికన్నులవంటి కన్నులు గలది.

76. మిటారించు = నిక్కు, బడుగు=చిక్కని, ప్రాలు=బియ్యము - తలఁబ్రాలు.

77. భవాని = పార్వతి.

78. లాజహోమము = పేలాలహోమము, ఉజ్జ్వలశిఖ = జ్వలించునగ్ని, సమీర=గాలిచే, లోల = చలించు, కోమల=మృదువైన, నవమాలికాలతిక=క్రొత్తమల్లెతీఁగె, మంజులపల్లవతల్లజ=అందగించు మంచిచిగుళ్లతో, ఉల్లసత్=ప్రకాశించు, లలిత=సుందరమైన, రసాలక+ఉపరి=మావిగున్న పైభాగమున, గళత్కుసుమావళి = జాఱిపడు పూవులమొత్తము.

సమీర.............చాడ్పునన్ = అతఁ గెబోఁడి హోమకుండమునందుఁ జక్కఁగ మండుచున్న యగ్నియందు లాజల (బొరుగుల)హోమము కావించుట యెట్లుండె ననఁగా మెల్లనిగాలికి నటునిటు కదలు క్రొత్తమల్లెతీఁగ చక్కని చిగుళ్లతో నొప్పారు సొంపైన మావిగున్నపై పూవులు గ్రమ్మించు నట్లుండెను.

79. వ్రీడావతి = సిగ్గు గలది, త్రప = సిగ్గు.

82. గోస్తని = ద్రాక్ష, సహకారము=తీయమామిడిపండు, ఆజ్యము= నెయ్యి.

83. లేహ్యము = ఊరుగాయ లేక పచ్చడి, చోష్యము=పులుసు, నర=నరసిన తలవెండ్రుకలయందుఁ బువ్వులుపెట్టి, నరఁ బువులు ముడుచు.

85. ఒజ్జనము=ఉపాధ్యాయత్వము, నాపసాని=నాగవల్లి నడపెడు ముత్తైదువ, నాకబలి = నాగవల్లి. రౌప్యము = వెండి.

86. చిత్ర = చిత్రానక్షత్రము, రాజు=చంద్రుఁడు-నృపాలుఁడు - చిత్రానక్షత్రముతోఁ గూడి చంద్రుఁ డుండు పూర్ణిమ గలదిగాన చైత్రమాసము అన్నివిధములఁ జిత్రవిచిత్రసౌందర్యము గల మధురలాలస (చిత్ర యను నక్షత్రము) కళాపూర్ణుఁ డను రాజుతో (చంద్రునితోఁ) గూడుట వలన జగతికి (ప్రజలకు+లోకమునకు), మహాపర్వము = గొప్ప పండుగు (పూర్ణిమ గావున పర్వము) అయ్యెను. అనఁగా నెల్లవారలు సంతోషమునఁ జెలరేఁగుదురు. ఒక్క మన్మథుఁడు, నిక్కియుంట ఒక్క ఆశ్చర్యమా, వసంతఋతువునందు చైత్రపూర్ణిమ యెల్లరకు నానందదాయకము. మన్మథునికి మంచి యదను. అట్లు చిత్రాచంద్రులవలె మధురలాలసా కళాపూర్ణు లొప్పియుండి రని భావము. లోకమెల్ల సంతసిల్లె ననియుఁ దెలియనగు.

89. అరణము = పెండ్లికూఁతునకుఁ దండ్రి యిచ్చు ధనాదికము.

91. కోదంట్రము = కోడటికను.

93. ఒఱపరి = సౌందర్యవతి.

95. జాదులుప్రసాదము=దేవాలయమున కేఁగి భగవంతుని సేవించినపుడు భగవంతుని ప్రసాదముగ జాజిపూవుల నొసంగె ననుకొందము. అవి శిరోధార్యములు, సువాసనాప్రదములు. తులసి, అక్షతలు. శిరోధార్యములే కాని జాజిపూవువలె నెల్లరకు మనోరంజకములు గావు. జాజిపూలు కోరి కొందురు. ఇపు డాపూవులు దేవతాప్రసాదముగ లభించినవి గావున రెండు విధముల మేలు కలిగినది. ఒకటి కోరినవస్తువు నలంకరించుకొని యిహమున నానందించుట. రెండు దేవతాప్రసాదము కావునఁ బరమున సుఖము గాంచుట.

96. వికస్వరము = విజృంభణము.

97. ఘన......వై=గొప్ప ఱెప్పల లోపల నరికట్టుకొన్న కన్నీళ్లు గలదై.

100. అదరుప్రేత = అదిరిపడునట్లు ప్రేటువేయుట - అట్టిమాట. మాటలాడుట.

102. ముకురపరీక్ష = కన్నెపడుచులకు సింగారించి నిలువుటద్దము నెదుట ప్రతిబింబ మీక్షింపఁజేయుట. ఇదియొక యుత్సవదినముగఁ బ్రాచీనులు పాటించునట్లున్నది. మట్టు=మితి, మచ్చుమర=కపటము, గరగరిక=అందము.

103. ఏణమదము = కస్తూరి.

104. పత్త్రావళీ=మకరికాపత్త్రముల వరుసయొక్క, న్యాస=చిత్రించుటయందు, ప్రచ్యుత=జాఱుటచేతనైన, భీతి = భయముచే, అధోఘటిత = క్రిందిభాగమునఁ జేర్పఁబడిన, హస్త=హస్తముచే, అంచత్+కపోలయై = ఒప్పుచెక్కిలి గలదై.

పత్త్రా.........బు = (చెక్కిళ్లయందు) మకరికాపత్త్రములు చిత్రించునపుడు జారి భయముచేఁ గ్రిందివంకఁ జేర్చిన హస్తముతోడి చెక్కిలి గలది.

109. గతానుగతికో లోకః=లోకమున నెవ్వఁడైన తెలిసియో తెలియకయో ఒకపని కావించెనేని అది యేదో పరమార్థకారణ మని వాని యాచరణమును దక్కినవారు ననుసరింతురు. అనఁగా విమర్శించి చేయ రని భావము.

111. ఆభూపశేఖరు = రాజశ్రేష్ఠునియొక్క, నేత్రాంబుజ=కన్నుఁదామరలయొక్క, కోణశోణరుచి = మూలలందలి యెఱ్ఱనికాంతులయొక్క, రేఖల్=గీఱలు, నిత్య=ఎప్పుడు నుండు, లక్ష్మీగుణ = సంపదయొక్క గుణముయొక్క, ఆదరణ=గారవమునకు, అధీన=లోనైన, కనీనికా=నల్లగ్రుడ్డులను, నవమిళింద = ప్రాయపుఁదుమ్మెదలయొక్క, స్పంద = చలించు, సందర్భ = సమయమునందు, నిర్భర = దట్టమై, నిక్షిప్త = ఉంచిన, పరాగ = పుప్పొడియొక్క, నిర్గళన = త్రోసివైచినట్టి, మార్గభ్రాంతి = దారులను భ్రమను, యోగ్యంబులై = తగినవై.

ఆ ఱేని కనుదామరల మూలలందలి (కడగన్నులందలి) యెఱ్ఱని రేఖలు, ఎడఁబాయని సిరికి లోనైన నల్లగ్రుడ్డులను తుమ్మెదలు కదలించు సమయము.

నందు దట్టముగా నుండిన పుష్పొడిని దీసివైచి యడ్డులేక పోవుటకుఁ దగు దారులా యను భ్రమకుఁ దగియుండెను.

112. దోర్మధ్యకస్తూరీచర్చ = వక్షస్థలమునందలి కస్తూరిపూఁత, సువర్ణత్వ=మంచి వన్నెయొక్క (బంగారువన్నె), శోభారిప్స=కాంతియందలి ఆశచే, అత్యంభోదుఁడై = మేఘమండల మతిక్రమించినవాఁడై.

మన్మథుఁడు రాజుకంఠ మను నద్భుతశంఖమును సంపాదించి దాని నాతనియెడ నలంచిన కస్తూరిపూఁత యను నెపమునను తన హస్తముతోఁ బట్టి పైనున్న జేనిమొగ మను చంద్రునికిఁ జూపి దాని మంచివన్నె తిల కింపఁ బ్రయత్నింపఁగా నాముఖచంద్రుఁ డాజేనికురులను మేఘమండలము దాఁటివచ్చి కనవట్టిన ట్లుండెను. దీనింబట్టి చూడఁగా ఆరాజుకంఠము శంఖము వలెను, ముఖము చంద్రునివలెను, శిరోజములు మేఘములవలెను శోభిలు చుండె నని భావము.

113. శమ = మనశ్శాంతి, గాంభీర్య = భావమును బైకిఁ దోపనీ కుండుట, ధృతి = దిట్టతనము, క్షమా=సహించుట - ఓర్పు, దయా=కరుణ, శౌర్య = పరాక్రమము, ప్రమోద = సంతోషము, ఆదిక = మొదలైన, ఉత్తమ = మేలైన, నానాగుణరత్న=అనేక గుణములను రత్నములకు, కోశ నిలయ=ధనాగారమై, ఉద్యత్ =ఎత్తైన, కాంచనద్వారబంధ=బంగారు ద్వార బంధముయొక్క, మహాస్తంభత్ = గొప్ప స్తంభములుగా నగుచున్న, అనూన బాహుఁడు=గొప్ప బాహువులు గలవాఁడు, అధాత్రీశు = ఆరాజుయొక్క, వక్షః కవాటముపైన్ = తలుపువంటి వక్షఃస్థలముపై.

శమము, గాంభీర్యము నగు మంచిగుణములను రత్నాల బొక్కస మునకు గృహమై అగృహమునకు నిక్కిన బంగారు ద్వారబంధముయొక్క స్తంభములై యొప్పారు బాహువులతోఁ గూడిన యామహారాజు వక్షస్థల మను తలుపుమీఁద నెన్నఁడోకదా గందపుఁబట్టెగా నాహస్తమును జేర్చుట.

114. తార+ఆళి=నక్షత్రము (నక్షత్రములు)-తుమ్మెద.

115. తివుట = అభిలాష.

118. వాలారు = వాఁడి గలవి, చేరుచుక్క = పాపటబొట్టు.

120. హ్రీగరిమంబు=సిగ్గుయొక్క మిక్కుటము, గొదకొను = అతిశయించు, కదుపు+ఎండు+ఏసి = కదుపెండెసి = ఒక గుంపంత.

124. అకించిదసూయ = ఎక్కువ యీర్ష్య, అర్ధేందుఁడు = సగము చందురుఁడు, ఉల్లసత్ +బల=పొంగుచున్న బలముగల, తమిస్రముంబోలె = చీఁకటిరాత్రివలె, కబరి = (జడ) కేశపాశను, చేరు = సరము.

తమిస్ర=రాత్రి, చంద్రునికిని జీఁకటికిని సహజవిరోధము. చంద్రుఁడు ఉదయింపఁగనే చీఁకటి మాయమగును. ఇది పూర్ణచంద్రుఁడు వచ్చినప్పుడ జరుగును. అర్ధచంద్రుఁడు కటికచీఁకటి నంతటిని బోఁగొట్టలేఁడు. ఇప్పుడా అర్ధచంద్రునికి గటికచీఁకటిని బాహాబాహి పోరాటము జరిగినట్లున్నది. (ఒకరి బుజములు మఱొకరు పట్టి నెట్టి కొట్టుకొనుట) ఆలేమ అరచందమామవలె నుండెను, ఆమె పాపటలోనికి ముత్యాలసరము జతపోయియుండెను. అది చంద్రునిబాహువులు చీఁకటిని నెట్టునట్టుగను,ఆమె నొసటిమీఁద కస్తురిబొట్టు నిలువుగనుండి అది కటికచీఁకటియొక్క బాహుద్వయముగను గన్పట్టెను. ఇట కేశపాశము చీఁకటిగను, నొసలు అర్ధచంద్రుఁడుగను. పాపటిముత్యాల సరము చంద్రుని బాహువులుగను, కస్తురిబొట్టు చీఁకటి బాహువులుగను కవి సరిపోల్చి వర్ణించినాఁడు.

125. కోల = బాణము.

126. పగడ=ధ్వజము, నయననిభ = కన్నులవంటి, శుభమీనము= తెల్లనిచేఁప, పనుపఱుపన్ = అలవాటుచేయు, పతనకృత్యవధి = ఎగిరిపడుటకు హద్దు, కనత్ +ఇషుధి=ప్రకాశించు నమ్ములపొది, నాస = ముక్కు.

మన్మథుఁడు తన ధ్వజమునకై లోకము వెదకివెదకి కడకు రెండు చేఁపల సంపాదించి వానిని వనిత చిఱునగవుతోడి మొగ మను నమృతసరస్సునఁ బెంచి ధ్వజములుగాఁ బనుపడఁజేయుచు రెంటిమధ్య నిడిన బంగారు నమ్ముల పొదియో యన్నట్టు లామె నాసిక యొప్పియున్నది.

127. ప్రాయము వచ్చినప్పుడు చెలువలకనులు మెఱుఁగెక్కి చలనదశఁబొందును. దానిని గవి వర్ణించుచున్నాఁడు. ఈయువతి కనుఁగవ యను మదించినచేఁప లీమె మొగ మనుసరస్సున నిరాఘాటముగ సంచరింపఁ దొడంగి

నవి. అప్పుడు ముఖలావణ్య మను నీరు ప్రక్కల కెగఁబ్రాఁకినది. ఆనీరు పోకుండ నిరువంకల నేర్పఱచిన చిన్నసరస్సులా యన్నట్లీమె చెవు లున్నవి.

129. శీతాంశుబింబాస్య=చంద్రబింబమువంటి నెమ్మొగము గలది, వాతెఱ=పెదవి, పరాత్ములు = ఆత్మజ్ఞానముగలవారు, శుకాదులు = చిలుకలు లోనగునవి - శుకమహర్షి లోనగువారు, అధోవాప్తి=క్రిందినుండి పొందుట.

చంద్రబింబములో దీటైన నెమ్మొగము గల యీయింతికెమ్మోవి బింబ ప్రతిబింబభావమును (ఆదొండపండుయొక్క ప్రతిబింబమే యిది యని) సమర్థించును. ఆదొండపండును జిలుక లోనగుపక్షులు క్రిందినుండి నొక్కి తమపండులోని యమృతరసను నాస్వాదించి యానంద మొందునట్లు నేను గూడ నీనలినాక్షికెమ్మోవి మధురామృత మానెదను. అర్థాంతరము:—పరాత్ములు=రసికులు, ఆత్మజ్ఞానముగలవారు-పరమాత్మయొక్క ప్రతిబింబమే యెల్ల ప్రాణులహృదయమునఁ బ్రకాశించు నని వేదాంతసిద్ధాంతము. దీనినే బింబ ప్రతిబింబభావ మందురు. శుకుఁడు లోనగు యోగులు తమయాత్మ లాపరమాత్మసి ప్రతిబింబము లని యెఱిఁగి జీవధర్మమగు సాంసారికదుఃఖమును వీడి ఆత్మధర్మమగు బ్రహ్మానందమును గాంతురు.

130. జలదరేఖ = మేఘములచాలు.

131. ప్రతినవ = క్రొత్తవైన, చారుకేసర = సుందరమైన, అకరు= పూవులు, పరాగ=పుప్పొడి, శలాటు = కాయలు, మిళిందబృంద=తుమ్మెదల సమూహము, చిత్రిత=వీనితోఁ గూర్చి వ్రాసిన, కుహళీయుగంబుగతి = పోక పూగుత్తుల జతవలె, కర్ణకలాపరత్న = చెవికి భూషణములైన కమ్మలయందలి రత్నములనుండి, నిర్గత=బయలువెడలిన, రుచిమంజరుల్ = కాంతుల గుత్తులు, క్రముకద్రుమ=పోఁకచెట్టుయొక్క, కంఠలక్ష్మికిన్=కంఠమనెడు లక్ష్మికి, ప్రతిభటవృత్తి=శత్రువుగ నెదురు నిల్చుట, కుహళి=పోకికపొత్తి (పోఁకపూగుత్తి మీఁదిపట్టు), క్రొత్తసొంపైన అకరువులు (కింజల్కములు), పుప్పొడి, కాయలు, తుమ్మెదలు వీనితో లిఖించిన పోకపొత్తుల జతవలెఁ జెవుల నిడి కొన్న పూవుగుత్తు లొప్పఁగా నాభామినికంఠము పోఁకచెట్టుకంఠ లక్ష్మి కెదురు నిల్చిన ట్లుండెను.

133. కౌను=నడుము, ప్రేగు=బరువు, తిర్యఙ్ముఖము=అడ్డముగా.

134. అవలగ్నయష్టి = కట్టువంటినడుము, కాంచన స్రుగ్బిలము = హోమము చేయు సాధనమైన బంగరు స్రుక్కుయొక్క రంధ్రము (స్రుక్స్రువములు హోమసాధనములు).

135. జంబూనది = జంబూద్వీపమునకుఁ బేరైన నేరేడుచెట్టు జన్మస్థానమునఁ గలది, కాంచి = మొలనూలు.

136. జమిలి = జంట.

137. ప్రాఘ్రాయమాణంబులు = ఊఁదఁబడుచుండునవి.

138. గుల్ఫము = చీలమండ.

139. అకలుషతారలు = స్వచ్ఛమైన నక్షత్రములు, ఏతత్ + అబలా + అంఘ్రి)తక్ = ఈస్త్రీయొక్క పాదములుగా, తమ్ములక్ = కమలములను, నఖాత్మకతక్ = గోరుల స్వరూపము పొందుటచే, తారకముల రాజు = నక్షత్రముల రాజు, సకలజయస్మరోదయము = అన్నిగెలుపులతోఁ గూడిన మన్మథుఁ డుదయించుట.

స్వచ్ఛమైన నక్షత్రములు(కర్త) ఈవనితపాదములుగాఁ బుట్టిన పద్మములను జేరి గోరుల రూపొంది సేవించుచున్నవి. అది న్యాయమే. మునుపు కమలములును నక్షత్రములకు రాజగు చంద్రుఁడును నిరువురు సూర్యునికరావలంబమున (సూర్యునికిరణములకాంతియే చంద్రునియందుఁ బ్రతిఫలింపఁగాఁ జంద్రుఁడు ప్రకాశించును. సూర్యుఁ డుదయించి తన కిరణముల వ్యాపింపఁ జేయ నాకిరణముల తాఁకుడుచేఁ గమలములు వికసించును. దీనిని గమనింప వలెను.) మెఱయుచు మదనోద్దీపము గావించుచుండినది. ఇప్పుడు నక్షత్రములు తమ ప్రభు వగు చంద్రునివలెఁ బద్మములు సూర్యుని సాయముం బొందుటం జేసి చంద్రపద్మములకు నొక్క సాధర్మ్యముండుటవలన నాతారకలు గోళ్ళై పద్మముల సేవించుచుఁ దమ ప్రభువును సేవించినట్లు భావించుచున్నవి. ప్రభువులస్నేహితుల సేవించుట యొక్కరీతిగఁ బ్రభువును సేవించుట యగు.

140. అంతికము = సమీపము.

142. రాయిడి = ఒరపిడి.

143. దేహళి = కడప.

147. ఈపద్యమున మధురలాలస కడకంటిచూపులను రతీమన్మథు లెక్కివచ్చు పల్లకీలుగ వర్ణించినాఁడు. అరిది=అచ్చెరువు, పన్నాగము=అంద లముమీఁది కప్పు, కడపల = తుద, పడాల = అందలముమీఁది పన్నాగము, బొమలు = కనుబొమ్మలు, అబ్బురపుదండెలు = అచ్చెరువగు మోయునట్టి వెదురుబొంగులు, ఒఱగు=(వీఁపు) ఆనుకొనుదిండు, కనీనికలు=నల్లగ్రుడ్డులు, వెఱమేనులు = ఇతర శరీరభాగములు.

తా. చాలుగనున్న యామెకంటిమీఁది ఱెప్పల చక్కఁదనము అంద లములొని పైభాగముననున్న బొంగువెదుళ్లకుఁ గ్రిందిభాగమునఁ గట్టిన మేలు కట్టు కుచ్చులవలెను, క్రింది ఱెప్పల వెండ్రుకల చాళ్లు అందలములోఁ బఱచిన పట్టుతివాసీయంచులవలెను, కనుబొమలు పల్లకిపై నున్నబొంగులవలెను, (కడ కంటఁ జూచునప్పుడు నల్లగ్రుడ్డులు కన్నులమూలలకుఁ జేరును గనుక) కనుల మూలలందుఁ గనుపట్టు నల్లగ్రుడ్డులు కన్నులకొల్కులను ఒఱగుదిండుల నాను కొనియున్న రతీమన్మథులయొక్క శిరస్సులవలెను, తెల్లని గ్రుడ్డులభాగములు తెల్లదుప్పట్లు కప్పుకొన్నవారి తక్కిన శరీరభాగములుగను జూపట్టెను.

150. సంవాహనము = పిసుకుట.

151. జాలవల్లిక = చిత్రపుఁబని చేసిన తములపాకులతట్టు.

152. గోత్రావిభుఁడు = భూపతి.

155. మేళనము = కలుపుట - కలిసికొనుట.

156. కుసుమసాయక = పూవుటమ్ములవానియొక్క (మన్మథుని), ఆగమ+అధ్యయన = వేదము చదువుటయొక్క, అధికారసిద్ధ = అధికార మును బొందుట యనుకార్యసిద్ధి, చిట్టకము=శృంగారచేష్ట, వ్యాజము=నెపము, కుసుమ......సిద్ధి=పూవుటమ్ములవాని వేద మధ్యయనముఁ జేయుటకుఁ దగిన యధికారమును గల్గించుట యను కార్యసిద్ధి.

157. చిట్టంటుచేత = విలాసము, మొగిలు = మబ్బు.

158. సీవి = పోఁకముడి, చుంబనము = ముద్దు.

161. కనుకని = ప్రయత్నము.

163. కనయము = పోఁకముడి.

164. కుచకళిక = మొగ్గవంటిచన్ను, హరువు = అందము.

168. వాతెఱగంటి = పెదవియొక్క గాయము.

169. గోప్యాంగము = రహస్యావయవము.

170. ధాళధళ్యము = ధళధళ మను కాంతి, బలాక=కొంగ, కబరి= కేశపాశము, కారు మొగులు = నల్లనిమేఘము, తాటంకము=కమ్మ, ప్రసవము = పుష్పము, ఘర్మకణము = చెమ్మటబొట్టు, సుఖాళించు=సంతోషాశ్రుల వలనఁ గలిగిన పారవశ్యమొందు, హృదయనవమయూరము = ఎదయను నెమలికొదమ. ఆమె చెవికమ్మలు మెఱపుఁదీఁగలుగను, దండనుండి జారు మల్లె పూవులు ఆడుకొంగలుగను, తెగిన హారముల ముత్తెములు వడగండ్లుగను నిట్టూర్పులతోడి చెమ్మట నీటిబొట్లు వర్షముగను, కేశభారము (కొప్పు) వానకాలపు మబ్బుగను నై చెలువుని హృదయ మను నెమలికొదమ చెలరేఁగి నాట్య మాడెను. వానకాలము నెమళ్లకు హర్షదాయకము. ఇట అలంకృతయైన ఆమెను వానకాలముగను, చెలువుని హృదయమును కొదమనెమలిగను కవి ఆరోపించి వర్ణించినాఁడు.

171. దరముకుళత్ = ఇంచుక మొగిడ్చిన, విలోచనము = కనుఁగవ గలదియు, తార్యత్ = తునియుచు, ఉదంచిత = ఒప్పు, కాంచినాదము= మొలనూలు చప్పుడు గలది, విరమత్ = చాలించుచున్న, ఉరోజవల్గనము= స్తనములదూఁకు గలది, విస్ఖలత్=బిగిసడలు,ఊరుకమ్ర=తొడలు గలదియు, కళానిరిత్వరమణితంబు = కళాస్థానము లంటుసమయమున మృదువైన రతికూజితము గలది. తదాత్వ = ఆసమయమందలి, రత=రతియందు, స్పృహా= కోరికచే, పునః = మరల, పురుషితపూరితంబు = పురుషాయితముచే సంపూర్తి చెందినది.

ఇంచుక మోడ్చిన కనుఁగవ గలదియు, తునియుచు నొప్పు మొలనూలు గలదియు, చాలించిన చనుఁగవ కదలిక (దూఁకు)గలదియు, బిగిసడలిన

లేఁదోడలు గలదియు, కళాస్థానము లంటుసమయమున మృదువైన రతికూజితము గలదియు నై యాచెలువకూటమి యుండియు అప్పటి రతియందలి కోరికను మరల బురుషాయితముచే నిండుకొన్న దయ్యె.

172. కందర్పదర్పశిల్పము=మన్మథుని గర్వముచేనైన విం శెయము.

173. వసంత = వసంతఋతువునందు, కృంతన = తునుమఁబడి, ఉచ్చాటిత = వెలుపలికిఁ బంపఁబడిన, హేతిసంపదలక్=ఆయుధముల సంపదలచే, సత్వ్రీవ=ముంచిపూవు లను, ప్రదర=బాణములయొక్క, ప్రతాప=ప్రతాపమును, సంఘాటహుతాశన = మండునగ్నియొక్క, ఉల్ముకనికాయ=కొఱవుల మొత్తమును, మతి=భావమును, ప్రతిపాదన = ప్రతిపాదించుటచే, ఉదయత్ = పుట్టుచున్న, పాటవ = చక్కని, పాటలా = కలిగొట్టుపూవుల యొక్క, పటల = సమూహముచే, పాటలిత = ఎఱ్ఱగాఁ జేయఁబడిన, ఉపవన = ఉద్యానవనములు గల, అవనీకమై = భూమి గలదై.

గ్రీష్మర్తువర్ణనము - మన్మథుఁడు వసంతఋతువునందుఁ దునిఁగి గాలి కెగిరిపోయిన యాయుధముల సంపద గలవాఁ డయ్యెను. (అనఁగా వసంతఋతువునందలి పూవు లన్నియు గ్రీష్మఋతువు వచ్చుసరికి మాయమయ్యెను.) మఱి యా మేలిపూవుటమ్ములవాని ప్రతాప మను ప్రజ్వలించిన యగ్నియందలి నిప్పుకొఱవులో యను భ్రమ గలిగించుచు నప్పటప్పటికి పూచుటకు మొదలిడిన కలిగొట్టు పూవు మొత్తములతో నెఱ్ఱవాఱిన పూఁదోఁటలు గలదై గ్రీష్మఋతువు వెలుఁగొందును.

174. సౌగంధికము = ఎఱ్ఱకలువ, కమల......ఋలు = తామరలు, ఎఱ్ఱగలువలు వీనితావి వలచు నెల్లకడలు గల డిగ్గియలును.

175. ఘనాగమకాలము = వర్షాకాలము, నిర్నిందిత = ఇంపైన, గంధబంధ = పరిమళముతోఁగూడిన, నవనీప = క్రొత్త కడిమిచెట్లతోడి, వనీ= ఉద్యానవనములందు, కమనీభవత్ = మనోహరముగ నగుచున్న, నిజ = తన యొక్క, ఇందిందిరబృంద = తుమ్మెదల మొత్తముచే, ముక్త = విడువఁబడిన, నలినీ = తామరతీఁగ లను, మనీషిభవన = పండితులేని గృహములందు,

ఆగత = వచ్చిన, అరస = రసములేని, అస్పంద=తొణకని, జుగుప్స = అసహ్యమైన, శ్లఘ్నయశాయిత = వాని గొప్పకీర్తివలె నగుచు, యాయి = పోవు, మరాళస్తో = హంసలు గలదై.

వర్షఋతువువర్ణనము:—ఇట్లైన తావితోఁ గూడిన గున్నకడిమి చెట్లులయొక్క వనమునందుఁ గోరిక గలవగుచున్న తన తుమ్మెదల మొత్తముచే విడువఁబడిన తామరతీఁగ లను పరిశుభ్రతలేని యిండ్లయందు వచ్చిన రసము లేమి (ఆనందము. పూఁదేనె) తొణకని రోఁతగలవాని గొప్ప కీర్తివలె నై పోవుచున్న హంసలసమూహము గలదై వర్షఋతు వొప్పెను.

భావము. వానకాలము వచ్చినది. తామరలు ముకళించినవి - కడిమి చెట్లులు పూచినవి. తామరలందుఁ బూఁదేనె లభింపమి తమ గృహములైన యాతామరల వీడి తుమ్మెదలు కడిమిచెట్ల నాశ్రయించినవి. వానకారున నీరు కలఁతఁజెందును గావున నప్పుడు హంసలుకూడ నందములేని తామరతీఁగ లను నిండ్లను (తుమ్మెదల యిండ్లు) వదలిపోవుట ఆ తుమ్మెదల తెల్లని కీర్తివలె నుండె నని భావము.

177. ఉదుపు = పొఁగొట్టు.

178. మవ్వము = కోమలత, పోడిమి = సౌందర్యము.

179. ఘనఫల = కఠినమైన మొనచే, శాలి = ఒప్పు, ఇక్షుశరాసన= చెఱకుగడ యను వింటినుండి, బాణ+ఆక్రాంతిన్ = బాణములయొక్క క్రముటచే, ఘనఫల=గొప్ప పంటతోడి, శాలి = రాజనాలవరిపైరు, ఇక్షు= చెఱకు, శర=జెల్లు, ఆసన = వేగిసచెట్లు, బాణ=నల్లగోరింటలు, ఆక్రాంతి = వీనిచేఁ గ్రముకొన్నది.

తన విభుఁడైన కళాపూర్ణుఁ డెల్లప్పుడు మధురలాలసతోఁ గ్రీడించుచు నామెను వీడకపోఁగా భూమిని (అను స్త్రీని) శరదృతువు (పెఱవాఁడు), ఘనఫలశాలీక్షుశరాసనబాణక్రాంతిన్ = కఠినమైన ములికి గలిగి చెఱకుగడ వింటినుండి (వదలిన) బాణముల కముటచేఁ బొందెను. అనఁగా: నిజభార్యను వీడ పోఁకగాని. ... ... పరభార్యను పెఱ ... సాధనసంక్రమో

లోఁబఱుచుకొను నని భావము. శరదృతువు రాఁగా, ఘన......క్రాంతికి = గొప్ప పంటతోఁగూడిన రాజనాలపైరు, చెఱకుఁదోఁటలు, ఱెల్లు, వెగిసచెట్లు, నల్లగోరింటలు భూమి నెల్లెడలఁ బెంపొందినవి.

180. శారదవేళలు = శరదృతువునందలి పగళ్లు రేలు, శారద = పచ్చకప్పురము, గంధ = చందనము, ఆనయన = వీనిఁ గొనితెచ్చుటయందు, విశారద = దిట్టలైన, పవనములు = గాలులు.

181. అంతర్హిత=లోనడంచిన (మాయమైన), కమలబల=తామరల బలఁగము గలదై, ఉదిత = పుట్టిన, విస్ఫీత = విస్తరించిన, శీత = మంచుచే (చలిచే), క్షామ=కృశించిన, ఆత్మస్వామిధామ=తమ రాజుయొక్క తేజము యొక్క, క్రమణ = ఆక్రమించుటచే, కృశవపుః = కృశించిన మేనులుగల, ఘస్ర = పగళులచే, విశ్రాణిత = ఈయఁబడిన, అతిక్షేమ = మిక్కుటమైన సేమమగు, ప్రేమప్రకాను=ప్రేమాధిక్యమును, శ్రిత = ఆశ్రయించి, రత = రతిగల, స్త్రీముఖ = స్త్రీల నెమ్మొగములయొక్క, వ్యూహ = మొత్తముల యొక్క, సౌహార్ద = స్నేహముచే, అమందానంద = మిక్కిలి యానందించు, ఇందూదయకలనబలె = చంద్రోదయములచే నొప్పునట్లు.

హేమంతఋతువర్ణనము:—మాయమైన తామరలను (మంచుకాలమునఁ దామరలు పూయవు.) సైన్యము గలదై, కర్త హేమంతము. తామరల బలము నడంచినదై, జనించి విస్తరించిన మంచుచేఁ గృశించిన తమ యేలిక యైన సూర్యుని తేజముయొక్క ఆక్రమించుటచే (మంచు సూర్యుని తేజమడంపఁగా) తగ్గిన మేనులుగల పగళ్లచే (సూర్యునిచేఁ బెంపొందునట్టి పగళులు) నీయఁబడిన మిక్కిలి మంగళకరమైన ప్రేమయొక్క ఆధిక్య మాశ్రయించిన రతిక్రీడలచే సంతసించిన వనితల నెమ్మొగపు మొత్తముల నెయ్యముచే మిక్కిలి ఆనందించుచున్న చందురుల సొంపువలె రాత్రులు హెచ్చుకాఁగా హేమంతము వచ్చును. (శీతకాలమున రాత్రులు పగళ్లకంటె నెక్కుడుగ నుండును.)

అగలు = అగరు.

184. లవంగ = లవంగపుఁ దీఁగెలందు, ఆసంగ = కూడుకొన్న (ఆసక్తిగల), భృంగ+ఓఘమై = తుమ్మెదల మొత్తము గలదై, అన్యక్కార= తిరస్కరింపని, తుషారభృత్య = మంచు అను గొప్ప బంటుయొక్క, శైత్యచ్ఛన్న = చల్లఁదనముచేఁ గప్పఁబడిన, కందర్పదౌర్జన్య = మన్మథుని దౌర్జన్యముచే, అసంగమ = కూడిక లేకపోవుటచే, సంప్రవర్ధిత = చక్కఁగఁ బెంపొందిన, పరీరంభక్రియా = ఆలింగనము లను చెయ్వులను, సంభృత = ధరించిన, అన్యోన్య+అంగ = ఒకరొకరి మేనులయొక్క, ప్రసభప్రవేశ = గట్టిగఁ గట్టుకొన్న, యువయుగ = జవరాండ్రు కోడెకాండ్రు వీరి జతలచే, అంతఃకృత = మనస్సులో ననుకొన్న, శ్లాఘమై=పొగడ్త గలదై.

మాఘమాసము, లవంగపుఁదీఁగెలందు నాసక్తిగల తుమ్మెదల మొత్తము గలదై. తిరస్కరింపరాని మంచను మేలిబంటుయొక్క చల్లఁదనముచేఁ గప్పఁబడిన మన్మథుని దౌర్జన్యముచేఁ గూటమి లేకయే పెంపొందిన కౌఁగిలింత లను చెయ్దముల వహించి యొకరి నొకరు మేనుల గట్టిగఁ గట్టుకొన్న జవరాండ్రు కోడెకాండ్రు. వీరల జతలచే మనస్సులో ననుకొన్న పొగడిక గలదై యొప్పెను.

185. మడతపసిమిడిగింటెము = మడతవేసిన పసుపువన్నెగల జంట నేకవస్త్రము, హసంతి = కుంపటి, మంజిడి జిగి = పలురంగులుగల వస్త్రము యొక్క కాంతి, అగలుసిరులు = అగరుశోభలు.

187. వికసితఘనసూన=వికసించిన పెద్దపూవులయొక్క, ఉద్వేల = ఎక్కుడైన, జాల = సమూహము, ప్రవాళ=లేఁజిగుళ్లు, ప్రకట = కనఁబడు చుట యను. కపట= నెపముచే. రూఢ=నెలకొన్న, ప్రౌఢ=దిట్టమైన, కీర్తి+ ప్రతాప=యశస్సు (తేజస్సు) ప్రతాపము, ప్రకట=ప్రసిద్ధమైన, జయ = విజయముచే, సముంచత్=ఒప్పు, పంచబాణ=ఐదు బాణములు గలవాఁడైన మన్మథునియొక్క, స్తవ=స్తోత్రముయొక్క, ఉద్గాయక = గొంతెత్తి పాడు పాటగాండ్రైన. శుకపికకాంతం బై = చిలుకలు కోయిలలు వీనిచే మనోహరమైనదై.

వికసించిన పెద్దపూవులమొత్తము లేఁజివుళ్లు అను నెపమున నెలకొన్న దిట్టమగు కీర్తియు, ప్రతాపము (కీర్తి తెలుపు, ప్రతాపము ఎఱుపు అని కవి సమయము.) వీనివలనఁ బ్రసిద్ధజయ మొందిన పంచశరుని (మన్మథుని) పొగడు పాటగాండ్రవోలెఁ బలుకుచుఁ గూయు చిలుకలు, కోయిలలు వీనిచే సొంపొందువసంతము వచ్చెను.

188. కుంకుమాంకరేఖా = కుంకుమరసము పూతుటచే గుఱుతైన గీఱలచే, లలిత=సుందరమైన, స్తనగ్రహణకాంక్షన్ = చనుఁగవ దాఁకి యంటు కోర్కెని, పచేళిమ = పండినవియు, భిదేళిమ=కోయఁదగినవియు నై, దాడిమకేళి=దానిమ్మపండ్లను తిను క్రీడయందు, మత్తకీరాళియున్=మదించిన చిలుక గుంపును, బాలపల్లవ = లేఁతచిగుళ్లయొక్క, రస=రసముయొక్క, ఆకలన = కొఱికి తినుటయందు, ఆకుల = త్వరపడు, కోకిలంబులున్ = కోయిలలును,

చక్కఁగఁ బండి పగిలిన దానిమ్మపండ్లఁ దిను క్రీడయాందు మత్తగొన్న చిలుకలును లేఁజిగుళ్లరస మానుటలోఁ ద్వరపడుకోయిలలును, ఈరెండును నాయికతోఁగూడిన యాతనికిఁ జనుఁగవ నంటఁ గోర్కెయుఁ గెమ్మోవి ముద్దుఁగొను మక్కువయుఁ బెంచెను.

190. పొలయల్క = ప్రణయకలహము, ప్రవాళశయ్యా = చిగురుటాకులసెజ్జ, తత్+తను+తాప = వారిశరీరముల విరహతాపముయొక్క, యోగ=కూడికచే, నిస్సరత్ = వెలుపలికి జారు, అకలంక = స్వచ్ఛమైన, ఫేనలవ=నురుఁగుబొట్లయొక్క, జాలమిషంబునన్=సమూహ మను నెపముచే.

ఆ వధూవరు లొకప్పుడు చిగురుటాకులపాన్పుపైఁబడి యొకరిపై నొకరు పొలయల్క నొంది యది తీరి నవ్వఁగా వారి నవ్వువారి దేహతాపముతోఁగూడిన తెల్లనురుఁగునెపమున కాంతి యొడఁగూర్చును.

191. దక్షిణతామహనీయుఁడు=ఇరువురి ప్రియురాండ్రయందును సమానప్రేమ నెఱపు దక్షిణనాయకుఁడు.

194. పొరిన్ = మాటికి.

195. విపంచి = వీణెయందు, సమంచిత = జతగూర్చిన, శ్రుతిప్రకాండములకున్=స్వరసముదాయమునకు, విపంచి.........లకు=ఈ వీణె

యందు జతగూర్చిన మేలిస్వరములను నా కంఠస్వర మీఁదు కాదో యేమో అని జంకుదును.

196. జతులు = పాటయందలి శబ్దములు, అధరితము = క్రిందుఁ జేయఁబడినది.

197. విపంచిక=వీణె, మత్స్వరోదీరణము=నా కంఠస్వరము భంగి పలుకుట. ఎత్తికోలు = ప్రయత్నము.

202. మంద్ర - మధ్యమ - తారములు=మెల్లగ - గట్టిగ - మిగుల గట్టిగ పాడుస్థానములు, కక్ష్య = తరగతి.

203. కీడ్పడు = ఓడు.

204. ప్రక్క బఱతి = ప్రక్కను గోకి.

206. అతకరించు = అధఃకరించు.

207. పిల్లాఁడి=కాలికడపటివ్రేలికిఁ బెట్టుకొను మెట్టెవంటిది (నగ).

208. నెఱి = అందము - న్యాయము.

216. అత్యంత = మిక్కిలి, స్ఫాయత్=విస్తరించిన, భక్తివినీతి = భక్తి వినయమును, విధేయత=విధేయత, ఘనసంభ్రమయినక్=గొప్ప విశ్వాస ముచే, అత్యంత......విధేయతక్ = మిగుల విస్తరించిన భక్తితోను వినయ ముతోను, అడఁకువతోను.

217. సర......త్వంబు = సరసపుమాట, చిఱునగవుతోడిచూపు వీని అందము.

218. తలిమము = పాన్పు, నెరసు = నలుసు, సుకిదడీమపు దువ్వలువ = సుఖకరమైన (మెత్తని) విలువగల సన్ననివస్త్రము.

220. పుంఖానుపుంఖము=ఒక బాణముపిడి వెంబడించి మఱియొక బాణము ప్రయోగించుట, ఆకూతగర్భంబు=అభిప్రాయముతో నిమిడిన మాట.

223. నా నెమ్మనము............నెమ్మిన్ = నామనస్సును కొన్నావా? (కఠినమా?) నీవు విడువని మానముతో నుండుటకు, గౌరవముతో నున్న, ఓ అభిమానము గలదానా! నీ మనస్సునందు అనుమానమును అహంకారమును వీడి ప్రవర్తింపు మని యనుము నన్ను సంతోషముతో.

224. సొలయుచున్ = వెసట నొందుచు.

225. పోటుఁదనాలు = ఎత్తిపొడుపుమాటలు, మీపొడగాన్పు = మీదర్శనము, పెడపోడుములు = ఇతర సౌఖ్యములు.

227. మోహపుదేవులు = ప్రేమ కాస్పదమైనరాణులు, తరల్చు = తొలఁగించు.

233. విన్నఁదనము = వైవర్ణ్యము.

234. అవమానితస్వానము = పరాభవముఁబొందిన ధ్వని గలది, వల్లకి = వీణె, ఉద్యోతించు = ప్రకాశించు, కందు = తాపము (మచ్చ.)

236. తెరువాటు = దారిదోపుడు.

237. అష్టదిగ్జనపతి=ఎనిమిదిదిక్కులందలి రాజులయొక్క, దార = భార్యలయొక్క, మౌళిమణిసంతతి = శిరస్సులందలి రత్నముల సమూహము.

అష్ట.........డై = ఎనిమిది దిక్కులందుఁ గల రాజుల భార్యలైన రాణుల పాపటలందలి మణులఁ దెచ్చి, తత్పదభూషలు = ఆమె కాలి యందెలు చేయించెద నని ప్రతిజ్ఞ సేసినవాఁడై.

243. పదియుఁ బదియునుగా = మాటిమాటికి.

244. శ్రుతిచతుష్టయ = నాలుగు వేదములచే- నాలుగు చెవులచే, అధిగమ్యము = పొందఁదగినది. నిపుణమంత్రిసంప్రణీతము = నేర్పరియైన మంత్రిచే బోధింపఁబడినది - నేర్పరియై వేదమంత్రము తెలిసినవానిచేఁ బొందింపఁబడినది, అపూర్వఫలము = ఆశ్చర్యము గొల్పునట్టి కార్యసిద్ధి - కర్మచేఁ గలుగు నపూర్వ మను ఫలము.

నాలుగు చెవులచేతనే పొందఁదగినదై, నేర్పరియైన ప్రెగ్గడచేఁ బొందింపఁబడినదైన రాజుయొక్క ఆలోచనము అచ్చెరువు గలిగించునంత ప్రయోజనకారి యగు నాలుగు చెవులు = ఇద్దరుమాత్రమే యోచన చేయఁదగ్గది, శ్రుతి = చెవి. మంత్రము = ఆలోచనము, అర్థాంతరము, శ్రుతి = వేదము, మంత్రి=మంత్రములు గలవాఁడు - తెలిసినవాఁడు, అపూర్వము = ముందు లేనిది. నాలుగు వేదములచేఁ దెలియఁదగినదై, ఆ వేదమంత్రములఁ గర్మలయందు నేర్పుగాఁ బ్రయోగించునట్టి యజ్ఞము చేయునట్టి వాని మంత్రము, అపూర్వఫలము (స్వర్గాది) నొసఁగును.

246. కైదువు = ఆయుధము.

247. ఆలము = యుద్ధము, బిట్టు=అధికము, హేతి = ఆయుధము. యుద్ధమున కెదురువచ్చు శత్రువును జూచినంతమాత్రమున శూరున కప్పటి కప్పుడ మహాతేజస్సు (ప్రతాపము) పుట్టుచున్నది. అది సహజమే. ఎట్లనఁగ కానలఁ గాల్చు కారుచిచ్చు ముందుగ నేమైన జ్వాలలను జేకూర్చు (మంటలు) కొనివచ్చి కాల్చునా !

248. శైలతుల్యత=కొండతో సరిపోలుట, మందగతిత్వదోషము = మెల్లన నడచు దోషము, పంచాననము=సింహము, సరభస = వేగముతోడి, అతిశయ=ఆధిక్య మొందిన, ఉత్పతన=పైకిదూఁకు, ప్రభావము = మహిమ-సామర్థ్యము.

ఏనుఁగు కొండంతదైనను నడక మందమునఁ జిన్నదైనను బైకెగిరి దూఁకునట్టి సింగముచేఁ జచ్చును. జయము లెప్పుడును శౌర్యసాధ్యములే. పంచాననము = సింగము - తెఱచుకొన్న నోరు గలది.

250. ఇనుఁడు = సూర్యుఁడు, నిరవశేషముగఁ=మిగులులేకుండ, అనయము = ఎల్లపుడు, శీతధాముని = చంద్రునియొక్క, కళా+ఓఘు = కళలమొత్తముయొక్క, మృజాविధిఁ = తుడిచివేయుపనిచే, ఏరికిఁ =

ఎవ్వరికిని, ప్రతాప=ప్రతాపము, కళా=కళలు, గుణ=వీని గుణములయొక్క, తారతమ్యముల్ = హెచ్చు తగ్గులు.

సూర్యుఁ డొకకొంత యుదయించినంతనే కటికచీఁకట్లు సైతము మాయ మగుచున్నవి. చలివెలుఁగువాఁడు (చంద్రుఁడు) తన పదునాఱు కళలతో వెలిఁగినను నాచీఁకట్లు అభంగి విచ్చిపోవుగదా. సూర్యుఁడు వేడివేల్పుగాన యట్లగుట, దీనింబట్టి ప్రతాపమునకుఁ గళలకు హెచ్చుతగ్గులు నిర్ణయింపనగు.

251. ఉగ్రుఁడు (రుద్రుఁడు) ఒక్క చేతితోనే పెద్దబంగారు కొండ వంచి విల్లుగాఁ జేసినాఁడు. తక్కినవేల్పు లట్లొనర్చిరా. ఉగ్రుఁడు, బుధుఁడు (తెలివి గలవాఁడు) అను పేళ్లే సార్థకములుగ నున్నవి.

252. దారువుల శుష్కాశుష్కతా భేదము = కొయ్యలయొక్క ఎండుతనము పచ్చితనము (ఎండు, పచ్చి) అను భేదము. ఉద్యత్=పైకెగసి, అనుస్ఫూర్జితపావకుసెడక్ = మిక్కిలి మండునగ్ని విషయమునందు.

ఈపని శక్యమగు; ఇది కా దనునది చేతగానివాని దగఱనే మహా ప్రతాపశాలి కేదియు నసాధ్యములేదు. జ్వాలలు గ్రక్కుచుండు దావాగ్నికి ఇది పచ్చికొయ్య ఇది ఎండుకొయ్య యను మాట లేపాటివి? వ్యర్థముకాదా అనఁగా క్షణములో వాని దగ్ధము సేయ వలంతి.

255. జ్వలితఖడ్గము=కాలి మండుచున్న కత్తి, జలము = నీరు.

256. రాజునకు రాజనీతి, ఈఁదువానికి తెప్ప, రోగికి వైద్యము వీని వలన జయము దాఁటుట ఆరోగ్యము కలుగును. అట్లు లేకయ ఫలము సిద్ధించు టయుఁ గలదు. అది సందియము నింపకుఁడావు. గదాకులుండు=తెవులుఁగొంటు.

258. పెట్టు = దెబ్బ.

259. తను+ఉచ్ఛ్రియము = శరీరముయొక్క ఎత్తు, సామజము= ఏనుఁగు, ఎక్కిరింత = వాహనము.

260. పుర......మ్ము = త్రిపురముల జయించుటకో అను, నగము= పర్వతము, చాపము = విల్లు.

261. అంపకోల = బాణము.

264. గురులఘువ్యవస్థ = బరువు తేలిక అను విచక్షణ-ఈపని కష్టసాధ్యము ఈపని సులభసాధ్యము అను తెలివి.

265. సమవిపక్షుండు=తనతో సమానుండగు శత్రువు, బలంగంబు= సేన, క్షయస్థానవృద్ధులు = తగ్గుట యథాస్థితి పెంపొందుట. పంచాంగవర్తనలు ఐదు. ౧. కార్యప్రారంభోపాయము, ౨. పురుషసహాయసంపద, 3. దేశకాలవిభాగము, ౪. వినిపాతప్రతీకారము, ౫. కార్యసిద్ధి. మంత్రగోపనము= ఆలోచనల రహస్యముగా నుంచుట.

266. ౧. దీర్ఘచింత = తడవు యోచించుట, ౨. ప్రసాదవిరహితత్వము = అనుగ్రహములేమి, 3. బుధావిజ్ఞానము = బుద్ధిమంతులను దెలుపమి, ౪. శుభాప్రయోగము = మేలుగలుగునెడ దండెత్తిపోవమి లేక యేదేనుపాయము ప్రయోగింపమి, ౫. విషయానురాగభరము = ఇంద్రియభోగములందు నెక్కుడు ప్రేమ, ౬. నాస్తికత్వంబు = దేవుండు లేండు స్వర్గము లేదు వేదము ప్రమాణముకాదనుట. సప్తవ్యసనములు-ఏడు. వెలంది, జూదము, పానము, వేంట, వాక్పారుష్యము, కఠినదండనము, అర్థదూషణము.

268. కట్టడ = ఆజ్ఞ.

269. అకీర్తిదము = అపకీర్తి నిచ్చునది, నిరయమగ్నుండు = నరకమున మునింగినవాండు.

271. కిల్లాను = చీటి.

272. సకలదిక్ = అన్నిదిక్కులందలి, దేశాధీశ = దేశాధిపతుల యొక్క, శుద్ధాంతకామినీ = అంతఃపురస్త్రీలయొక్క, మౌళి = శిరస్సులందలి, మాణిక్య = రత్నముల చే, నిర్మిత = నిర్మింపంబడిన, నూపురసమర్పణంబు = అందెల సమర్పించుట.

అప్రతిహతము = కొట్టువడనిది, సకల......ణంబు = అన్ని దిక్కులందలి దేశముల ప్రభువుల యంతిపురములలోని రాణుల శిరస్సులందలి మాణిక్యములచే నిర్మింపఁబడిన యందెలు సమర్పించుట, మంజీరము=అందియ, అనుషంగికఫలము = ప్రధానమగు ప్రయోజనమునకుఁ దోడుగ మఱియొక ప్రయోజనముగూడ సిద్ధించుట.

273. తనకున్న సేన పగతుని బలిమి నడంగిపోయిన పిమ్మటను, దండు నకైయున్న సామంతయు వ్యయమై పోయినతర్వాతను జేకూరిన జయము జయమా ?

274. ప్రదక్షిణముగాఁ జనుట దిగ్విజయమునకు లెస్స - ప్రాచ్య+అవాచ్య, పాశ్చాత్యులు = తూర్పుననున్న రాజులు పడమటనున్న రాజులు దక్షిణమున నున్న రాజు, పార్ష్ణిగ్రాహుఁడు = దండెత్తిపోవు రాజునకు వెనుక నున్నరాజు, సంధానము = సంధి.

---

## అష్టమాశ్వాసము

1. శ్రీలా = సంపదగలవాఁడా ! అనవచ్చును, శ్రీ+ఇలా+కీర్తి... క్షిణ్యా=శ్రీదేవి, భూదేవి, కీర్తి యనుకాంత ఈ ముప్వురు సతులను సమానముగ లాలించుట, క్రీడింపఁజేయుంట యను గుణములచేఁ జగింపని దాక్షిణ్యమగు (సమానుఁడగుట) ధర్మము గలవాఁడా!, శీలి .....వాలా = మంచి స్వభావము పొందికచేఁ బవిత్రజయ మిచ్చు ఖడ్గము గలవాఁడా !

2. సరణి=పద్ధతి, షడంతరరాతిజయంబుకల్మి = ఆఱుగురైన లోపలి పగఱ గెల్చుట గలిగియుంట, పరా......యంగ్=పెఱరాజుల యాస్థానములందలి జనుల రంజింపఁజేయుటయందలి లెస్సనేర్పును, విన......ముగ్ = అడఁకువ గర్వము చూపఁదగినచోట్లయొక్క తక్కువకాని తెలివి.

3. పరాస్థాన=ఇతర రాజుల యాస్థానములయందలి, జనానురంజన=జనుల సంతోషపెట్టుటయందు, సుదక్షత=చక్కనినేర్పు, వినయ=అడఁకువ,

ఉద్ధతి = గర్వము, స్థల = చూపదగిన చోట్లయొక్క, అనూనవివేకము= తక్కువకాని తెలివి.

4. అగ్రసంప్రేషితజయుఁడు = ముందుగా లెస్సఁ బంపఁబడ్డ మను జుఁడు, శంసనము = సూచనము, సంధానము = సంధి.

5. గడిదుర్గము = సరిహద్దున నుండుకోట.

7. క్రమప్రభవత్=క్రమక్రమముగఁ గలుగుచున్న, నికటత్వ=సామీప్యముయొక్క, తారతమ్యంబుల్=హెచ్చుతక్కువలచే, తత్+ఉదంచిత= దానిచే నొప్పు, విద్రుమరాగ=పగడముల రక్తిమ, వీచిశైత్యము = అలల చల్లఁదనము.

తామరల చెలి (రవి) పడమటి సంద్రముఁ జేరఁబోయెను. తన బింబ మప్పటప్పటికిఁ గ్రమముగ నగు చేరువయొక్క దరిదాపులచేఁ (దూరము,కొంత దూరము, సమీపము, ఇంకను సమీపము ఇటు) చక్కఁగ వచ్చి క్రమ్ముకొన్న (సముద్రములోని) పగడపుఁ గెంజాయయు, కడలిలోని యలల చల్లఁదనము దన్నుఁ జేరినవా యనంగ సూర్యబింబము మిగుల నెఱ్ఱవాఱుచు వేఁడి వీడుచుండెను—(కొంత చల్లనయ్యె నని భావము.)

8. కాలకృషీవలుఁడు=కాల మను వ్యవసాయముచేయు రైతు, పరిణతి=(పగలు పూర్తియగువేళ) సంజవేళయందలి, అరుణాతప=ఎఱ్ఱని సూర్య కాంతులయొక్క, ఛటా=సమూహమను, పరిణతి=పండి, అరుణ=ఎఱ్ఱఁబాఱిన, శాలిచయంబు=వరిపైరు, పన=కోసి క్రిందివైచినపైరుకట్టలు, చరమశైలము= పడమటికొండ.

కాల మను పంటకాపు సంజవేళయందలి సూర్యుని యెఱ్ఱటి యెండ యను పండి యెఱ్ఱవాఱిన వరిపైరు కోసి వడివడిగాఁ బనమోపులు మోయుచు నొక్కచోఁ గుప్ప వేయుచున్నాఁడా యనునట్లు, అంతకంతకు చేదలుమానిక మైన సూర్యమండలము మిగుల విస్తరిల్లి పెద్దదగుచు పడమటి కొండదాపునఁ జూడ నొప్పెను.

9. కాలకలాదుఁడు = కాల మను కమసాలి. కాంచనరేణువు = బంగారురజము, ప్రత్యగాశ = పడమటిదిక్కు. జాళువాపేలిమిపూఁత=అప రంజిపూఁత, కీలాలనిమజ్జితము = నెత్తురులో మున్గుట, నీటిలో.

కాల మనెడు కమసాలి సాయంకాలపు టెండ యనెడు బంగారు రజమును, బడమటి దెస యను మూసయందుఁ బోసి కరఁగించెను. ఆ కరఁగు నప్పటి యపరంజి మేల్మిపూఁతయో యనునట్లందమున సూర్యమండల ముండెను. ఆ తర్వాత కాక చల్లార్చుటకై నీట ముంచినట్లు పడమటికడలిలోఁ గ్రుంకెను.

10. వాసరకర్షకుఁడు=పగలను రైతు. జడిదపుమందు = భయపెట్టు దివటీ, రోదసి=భూమ్యాకాశములు, రేయను=రాత్రి యను, మద+ఉద్ధత హస్తి = మదించి సివమెత్తిన యేనుఁగు.

పగలను రైతు ఏనుఁగును భయపెట్టి పాఱఁదోలుటకై సూర్యుఁడను నొక చక్రాకారపు దివటి వెలిఁగించి పెట్టియుండెను. రాత్రి యను నేనుఁగా దివటీనార్చి భూమ్యాకాశమునడిమిచోటను పంటచేనును వెనుదీయక చొచ్చి మేయుచుండెను. అట్లుండ నా యేనుఁగు మొగమునఁ గనుపట్టు మదముచే నైన యెఱ్ఱటి మచ్చల మొత్తమో యనునట్లు చూడఁజూడ సంజ యొప్పెను.

11. విరాట్తనువు=ప్రపంచ మంతయు భగవంతుఁడుగాఁ గనఁబడు రూపము, కృష్ణసమాఖ్య=కృష్ణుఁడు (నల్లనివాఁడు) అను పేరు చక్కని పేరు. మూర్తులెన్మిది=పంచభూతములు సూర్యచంద్రులు సోమయాజి ఇవి యెనిమిదియు శివునిమూర్తులు, సమస్తాశలు = అన్నిదిక్కులు, వృత్రదనుజాధిక = వృత్రుఁడను రాక్షసరాజుయొక్క, భూమికా = వేషము, తమఃపటలి = చీఁకట్ల మొత్తము.

శివుఁడు తన విరాట్స్వరూపమును కృష్ణుఁడను తన నామము సార్థక మగునట్లు నల్లగాఁ జేసెనా లేక శివుఁడు తన యెనిమిది మూర్తులను

నేనుగులతోలుతోఁ గప్పఁగొనెనా. అన్నిదిక్కులు వృత్రుని వేషము వేసినవా యన్నట్లు కాఱుచీఁకట్లెల్లెడ వ్యాపించెను.

12. ప్రభా+ఏకమయము = తేజోమయము, చప్పరము = దేవుని నూరేగించునది - చతురస్రమండపము వంటిది, సుషిరవ్రజంబు = రంధ్రముల సమూహము, చూపరుల్=చూచువారు, విరిసిన మెఱుఁగుఁ బ్రత్తివిళ్లు=పగిలి ప్రకాశించు ప్రత్తికాయలు, విడి=ప్రత్తికాయ.

13. పైనున్న లోకసమూహము నిజముగాఁ దేజోమయమే. ఎట్లన: ఆకాశమను ప్రాంత చప్పరము తూట్లుపడినది. వానిగుండా ఆలోకముల తేజఃకాంతులు కనఁబడుచున్నవి. అవియే నక్షత్రములు.

14. సుధాకరుఁడు = చంద్రుఁడు.

15. కువిందుఁడు = సాలెవాఁడు, నవమయూఖాళి = క్రొత్త కిరణముల గుంపు, గృహభిత్తి వివరము = ఇంటిగోడ క్రంత - రంధ్రము.

17. పర్విన తమఃకాలుష్యముఁ = వ్యాపించిన చీఁకటి (తమోగుణము) యొక్క మాలిన్యము, చంద్రికాఖ్యలసత్సత్త్వగుణప్రకర్షమునఁ = వెన్నెల యను పేరి ప్రకాశించు సత్త్వగుణాతిశయముచే, ప్రకాశించు = కడుగు, జలదంబు = మేఘము, భవదోషప్రక్రియఁ=సంసారదోషమువలె. ద్విజరాజమండలము = చంద్రమండలము, (బ్రాహ్మణశ్రేష్ఠుల సమూహము) లోకము నావరించిన (ప్రజల నావరించిన) చీఁకటి యను కశ్మలము (తమోగుణముయొక్క కలుషత్వము) వెన్నెల యను వెలుంగు సత్త్వగుణము యొక్క ఆధిక్యముచేఁ గడిగివేయుచున్నదై ప్రకాశించుచుండెను. కాని సంసారదోష మున్నట్లటనట మబ్బుండెను.

18. యామినీరమణుఁడు = రేరాజు - చంద్రుఁడు, శ్రీ నెలవు=లక్ష్మీస్థానము, పద్మిని = తామరతీఁగెను.

ఈరీతి శేరాజు చెలరేఁగ మున్నటిభంగి సిరికి నెలవైన తామరతీవె గన్పట్టకపోఁగా ఆతీవె చెలికత్తెలై తేఁట్లు కలువతీవె నాశ్రయించినవి. రాజు (చంద్రుఁడు) చేపట్టినవా రెల్లదేవేరులు కాదా యన్నమాట యిచ్చట సత్య మయ్యెను. సూర్యుఁడు = పద్మినీవల్లభుఁడు, చంద్రుఁడు = కైరవిణీప్రియుఁడు.

19. రువ్వు = విసరివేయు, వెల = విలువ - పందెము, డాఁచిన గుచ్ఛకము = దాఁచియున్న పూవుగుత్తులు - స్తనము లని శ్లేష. తివుచు = పట్టుకొని తీసికొను, దంటమాట = నేర్పుమాట, పుష్పలావికలు=పువ్వులమ్ము స్త్రీలు, తలఁచు = తొలఁగుఁడు.

20. దండనాయకుఁడు = సేనానాయకుఁడు.

23. గమనము=ప్రయాణము, తమకము = ప్రేమ, సంభ్రమము = త్వర, త్రియామ = రాత్రి.

24. చదలన్ = ఆకసమందు, నీలిగవిసెన = నల్లనియొర, విధుఁడు = చంద్రుఁడు, దీర్ఘాంశులతలు=పొడవులైన కిరణము లను తీఁగెలు, రతిరాజు=మన్మథుఁడు, రజనికాళికిన్ =రాత్రి యను కాళికాదేవికి, అంకశోభ=చంద్రుని నడిమిమచ్చ, కప్రపుదూళి = కర్పూరపుదుమ్ము.

చంద్రుఁ డస్తమించుట వర్ణించుచున్నాఁడు. సమానమగు కాంతిగల దగుటచేత నాకసమందుఁ జక్కఁగఁ గన్పట్టని యొరవంటి నల్లని వన్నెగల మసకచీఁకటి సిడిమ్రాను ["గ్రామదేవత జాతరలో నొకని వీఁపున(=జంతువును సైతము) గాలము గ్రుచ్చిగాని, ఒకనిని (ఒక జంతువును) గంపలోఁ గూర్చుండఁబెట్టిగాని త్రిప్పునట్టి దూలము"] ఆసిడిమ్రాని కొనయం దుంచిన టెక్కెము చందురుఁడు, ఆసిడిమ్రాని టెక్కెమును గావలసినప్పుడు క్రిందికి వ్రాల్చుటకై కట్టినట్టి పగ్గములు, నిడుపాటుచంద్రుని లతలవంటి కిరణములు, రతీదేవి ప్రియుఁడైన మన్మథుని సంపద హెచ్చుటకై రాత్రి యను కాళికా దేవి ముందు వీఁపున గాలము గ్రుచ్చుకొని సిడి దిరుగువాఁడు కోకిల యను

బాటు చంద్రునిలోని నల్లటి మచ్చే. ఆకోయిల బంటుమీఁద వసంతముగఁ జల్లు కప్పురంపుధూళి వెన్నెల, పువ్వులు నక్షత్రసమూహము ఆరాత్రి యను కాళికాదేవి యెచ్చోటికైన నరుగఁదలంచుట యెఱింగి మన్మథుఁడా సిడిమ్రాఁకు తుదనుండు నా టెక్కెముకు వ్రాల్పించుచున్నవాఁడో యనునట్లు చంద్రుఁడప్పటప్పటికిఁ బడమటికెసకు వ్రాల జొచ్చెను.

25. కనుమ = రెండుకొండల నడిమిదారి. సప్పుట = తప్పెట.

26. పారదబద్ధసద్ఘుటిక = పాదరసముచే బంధించిన మేలిమాత్ర, పాకపరీక్ష=ఉడికినదా అను పరీక్ష, చంద్రికాక్షీరము=వెన్నెల యను పాలు, సమయసిద్ధుఁడు = కాల మను రసిద్ధుఁడు, అరుణద్యుతిన్=ఎఱ్ఱనికాంతిచే.

కాల మను రసిద్ధుఁడు పాదరసమును గడ్డ కట్టించి ఘుటికగఁ జేసి వెన్నెల యను పాలలో నుడికించి యా ఘుటిక (గచ్చకాయంతమాత్ర) పక్వముగా నుడికినదో లేదో పరీక్ష చేయుచున్నాఁడో యనంగ వేగుఁజుక్క (వేగుజామున నుదయించు శుక్రుఁడు) వెలిఁగెను. ఆ చుక్క యంటినచోటు బంగారయ్యెనో యన్నట్లు తూర్పుదిక్కున సుందరమైన బంగారుకాంతి ప్రకాశించెను.

27. హిమకరుఁడు = చంద్రుఁడు, ప్రణయించి = (ఒకచోటినుండి) కొనిపోయి పెట్టి, తుషావృతి = పొట్టుయొక్కచుట్టుటచే, అనూరుదీప్తి = అరుణోదయకాంతి, ఊముకలబూది = పొట్టుయొక్క బూది.

చంద్రుఁడస్తమించుతఱి (ఆహవనీయ మను నగ్నినుండి) తీసి పొందించిన (ప్రతిష్ఠించిన) ఊముకపై నుంచిన గార్హపత్యమను నగ్నివలె చంద్రుఁడు దగియుండెను. అగస్త్యుఁడను నక్షత్రము (దక్షిణపు దిక్కున) దక్షిణాగ్నివలె నుండెను. అరుణోదయకాంతి చక్కఁగ శోభిల్లు కాంతితోఁ గూడిన ఆహవనీయ మను నగ్నిగ నుండెను. ఆకాలినబూది చెదరి నలువంకలఁ బడినదో యనఁ జిన్న చిన్న నక్షత్రములు కనఁబట్టెను.

వ్యా॥ 29. సమయవ్యతిక్రమ=సమయ మతిక్రమించునను, శంకా=సందేహముచే, ససంరంభ=త్వరతోఁగూడి, జాగ్రత్+ఉద్ధిత=మేలుకొని లేచిన, సర్వజనచయంబు=అందఱుజనులుగలది, రథ్య+కేతన+ముఖ్య=గుఱ్ఱములు, టెక్కెములు మొదలగు, రథకార్యఘటనాది = రథములయొక్క పనులు సమకూర్చుట లోనగు పనులందు, సంభ్రమ+ఆకుల = తొందరచే తొట్రుపడుచున్న, సూతచయంబు = రథసారథులు గలది, ఘంటాకుథాప్రముఖ = ఘంటలు, పైనఁబఱచు కంబళ్లులోనగు, ద్విపసన్నాహ=ఏనుఁగుల సిద్ధపఱచుటయందు, భూరితరత్వర+ఆధోరణంబు=అత్యధికముగఁ ద్వరపడు మావటీండ్రు గలది, పల్యయన = జీనులు, ఖలీని = కళ్లెములు, బంధ = కట్టువారులు, ఆది=మొదలైన, సైంధవ = గుఱ్ఱములయొక్క, కల్పన=పన్నుటయందు, ఆలోల=అటునిటు మిక్కిలి సంచరించు, ఆశ్వీశవ్రజంబు=గుఱ్ఱపురౌతుల కూటువ గలది, తక్ర+దధి = మజ్జిగ పెరుఁగు, ఉపదంశ+ఆది = ఊరుఁగాయ లోనగువాని, విక్రయకర = విక్రయించు, భామినీహూతి = స్త్రీల పిలుపులకు, వాచాట = వదరుచున్న, భటకదంబ=బంటుల సమూహముచే, సమవలంబిత = చక్కఁగ నవలంబింపఁబడిన, భోజనచాపలంబు = భోజనమునందలి చాపల్యము గలది.

౧. ప్రొద్దయ్యె ననుచుఁ దొందరతో జనులు నిద్ర లేచుచుండిరి.

౨. గుఱ్ఱములు, టెక్కెములు లోనగు పరికరములతో సారథులు రథములఁ బన్నుచుండిరి.

3. గంటలు, ఆస్తరణములు (ఏనుఁగుపైఁ బఱచు కంబళ్లు) లోనగు వానితో మావటివాండ్రు ఏనుఁగుల సిద్ధపఱచుచుండిరి.

౪. జీని, కళ్లెము, పగ్గము లోనగువానితో గుఱ్ఱము నలంకరించుచు గుఱ్ఱపురౌతు లుండిరి.

౫. మజ్జిగ, పెరుఁగు, ఊరుఁగాయలు లోనగు వస్తువుల విక్రయించు స్త్రీల పిలుపులకు వదరుచున్న బంటులు భోజనము చేయుచుండిరి—ఉదయకాలమున నానగర మిట్లుండెను.

30. భాసికలు = బంగారు ఖజానాకు అధ్యక్షులు, కైరవప్రియ+ ఉదయ=చంద్రోదయముయొక్క, ఆరంభ = ప్రారంభమునందు, ఘూర్ణమాన+ అర్ణవ+ఆరవంబుల్=మ్రోయుసముద్రముయొక్క ధ్వనిని, అందలము=పార్శ్వముల మఱుఁగులేని పల్లకీ, పల్లకీ = పార్శ్వముల మఱుఁగు గల పల్లకీ, శైబికుఁడు = పల్లకీ మోయువాఁడు, హెగ్గడి = అంతఃపురపుఁ గావలివాఁడు, దిడ్డి = చిన్నవాకిలి, చమూపతి = సేనాపతి, ఉష్ట్రము = ఒంటె, వామి = ఆఁడుగుఱ్ఱము, ఉక్షము = ఎద్దు, భర్మపేటిక = బంగారునాణెముల పెట్టె.

31. వేత్రహస్తులు=వెండిబెత్తాలవారు, ప్రస్థానము = యుద్ధమునకు బయలుదేఱుట, బ్రహ్మమంత్రము = వేదమంత్రము. భూగీర్వాణపంక్తి = బ్రాహ్మణసమూహము, తేజి=గుఱ్ఱము. జైత్రభేరి=జయభేరి.

32. దిగ్విజయమునందలి యుత్సాహముతోడి విలాసముతోఁ బైకెత్తి యూఁదఁబడిన తుతారాల తుంభ, తుంభ యను ధ్వనులు సముద్రములను సైతము కలఁతపెట్టెను.

34. గురుతర=మిక్కిలి పెద్దవైన, కేతు = టెక్కెములచే, ధూత = ఎగురఁగొట్టఁబడిన, ఘనకూటములు = మేఘసమూహములు కలవి, చరత్+ అవనీధరేంద్రముల చాడ్పునన్ = సంచరించు పర్వతరాజములవలె, సింధురంబులున్=ఏనుఁగులును, మరుత్+అవమాననా = వాయువు నవమానించునట్టి, చతురిమ = నేర్పుచే, స్ఫుటవేగములు = స్పష్టమైన వేగము గలవి.

35. మిళితభూగగనాంతంబులందు=కలిసికొన్న మన్ను మిన్నులయంచులందు, ఉదయాచలము=తూర్పుకొండ, గగనాఖ్య=ఆకస మను పేరి, పనసవృక్ష=పనసచెట్టుయొక్క, కాండోపరి=కొమ్మమీఁద, భ్రాజితంబు = ప్రకాశించునట్టి, తారకాభర్త = చంద్రుఁడు, క్షీరభోజనాంతము = పాలన్నము తిన్నకడపట, పూర్వసంధ్య=తొలిసంజ, ఉత్తమాంగము=శిరస్సు, హొంబట్టుపాగ = బంగరు జరీతలపాగ, ప్రకాండము = చెట్టు మొదటి పెద్దకొమ్మ వెలచు = తోఁచు. ఆసమయమున దండయాత్రకుఁ బోవు సైనికుల ధళధళ

మను నాయుధముల కాంతులు ఆ పట్టణమునందలి రత్నాలమేడలపైఁ గ్రమ్మి ప్రకాశించుచుండునట్టి యా పురమునందలి రాజవీథులు పైనుండి చూచుచు దేవతలకు, రవికిరణముల కాంతులచే ధగధగ మెఱయు నీటికాలువలతో విలసిల్లు పూవులతోఁటల నడిమిబాటలవలెఁ గన్పట్టెను.

37. ధళధళన=ధళధళ మను, ఆయుధద్యుతివితానము=ఆయుధముల కాంతిసమూహము, సన్మణిసౌధకోటి = మేలిరతనాలమేడల మొత్తము, దినేశరుచిపూగ=సూర్యకాంతుల సమూహముచే, ధగద్ధగిత = ధగధగ మని మెఱయు, అంబుసారిణీ = చిన్న నీటికాలువలచే, విలసిత = ప్రకాశింపఁ జేయఁబడిన, పుష్పిత+ఉపవనవీథులువోలెన్=పూచిన పూఁదోఁటలవీథులట్లు.

41. తురగప్రచారము = గుఱ్ఱముల సంచారము, కుంజరమదము = ఏనుఁగుల మదము, పరస్పర+అతిశయభావ=ఒండొంటి నతిశయింపవలె నను భావమును. గుణస్ఫురణము = గుణముయొక్క ప్రకాశము, అపంకము = బురదలేమి, అరజస్కము = దుమ్ములేమి.

ఏనుఁగుల మదోదకము స్రవించుటచే సేనపోవు మార్గమంతయు నడుసడు సయ్యెను. గుఱ్ఱములు బహుళముగా సంచరించుటచే మార్గమంతయు దుమ్ములు రేఁగెను. అడుసును మించి దుమ్ము, దుమ్ము నణంచు నడుసు నిట్లయి మార్గము బురద లేనిదియు దుమ్ము లేనిదియు నై పోవ ననుకూలించె నని భావము.

42. జల్లి = వింజామర, పేరెములువాఱు = పరుగెత్తు, చేకటారి = చేతిఖడ్గము, అరిగె = డాలు, పిల్లమెఱము = గ్రుచ్చుకొన్న బాణము లోనగువాని నటునిటుఁ గదల్చుట, పొట్రకోల=తామరమొగ్గవంటి మొన గల బాణము, పల్లటీ = ఎగిరి గంతువేయుట.

43. ఆసిమిగొల్లెన = రెండుప్రక్కల సాలవలె నేర్పఱచిన చిన్న గుడారము.

44. సాంద్రవరణంబు = దట్టమైన కప్పువస్త్రము.

46. ముక్తమార్గులు = విడువఁబడిన మార్గము గలవారు, అప్పున = కానుక.

49. ఓహటించు = వెనుదీయు, అరాతి = శత్రువు.

51. అఱుము = ఆక్రమించు.

52. నెఱి = ఉపాయము.

54. పల్లనకట్టు=గుఱ్ఱపుజీని బిగించు, నేదీయఃకృపాణంబు=తన చేతి దగ్గఱ నున్న ఖడ్గము.

55. పటభవనంబు = గుడారము.

56. సమిద్ధ=ప్రకాశించు, యుద్ధసన్నాహము = యుద్ధముయొక్క సంసిద్ధతయు, చిత్రసత్వ = పలువన్నెలు గలుగుటచేతను, జవసత్త్వ=వేగము బలము వీనిచేతను, కృత = చేయఁబడిన, అర్యమఘోట=సూర్యుని గుఱ్ఱముల యొక్క, అపోహము = మాపోవమి గలది, రోషభీషణ = రోషము భయంకరమై, విపోషిత=హెచ్చైన, హేషిత = సకిలింపులచే, భీషిత=భయపఱుపఁబడిన, అహితవ్యూహము = శత్రులసేన గలది, సాహిణి=గుఱ్ఱపురౌతు.

ప్రకాశించు యుద్ధసంసిద్ధత గలదియు చిత్రవర్ణముచేతను జవసత్త్వములచేతను సూర్యుని తేరిగుఱ్ఱములకు అపోహగలిగించినదియు రోషము యొక్క యుద్ధతిచేఁ బెంపుగాంచిన సకిలింపుచే భయపఱుపఁబడిన పగటిసేన గలది.

57. వాహిని = సేన.

58. సువ్వొత్తు = సువ్వగింజ నెత్తినంత తేలికగ, డొంకెన = వంకర అలుఁగు గల యీఁటె, అత్తలము=బల్లెము, కైదువు=ఆయుధము, పక్కెర = జీని, జోడు = కవచము, కుత్తుక = మెడ.

59. ఈడితశక్తి=స్తుతింపఁదగ్గ బలము గలవాఁడు, వ్రీడతః=సిగ్గుఁ బొందుటచే, కకావిక = చెల్లాచెదరు.

60. చేఁపచేర్పిగిచినట్లు=చేఁపలు పట్టువారిదగ్గఱ విసరు వల అనునది యుండును. అది పద్మాకారముగ నుండును. దానిని జుట్టుకొని ఒక్కటే

త్రాఁడు గలదు. ఆ త్రాటికొనను జేఁతఁ బట్టుకొని ఆ వలను దటాలున జెస్త వాఁడు నీటిపై విసరివేయును. అది నీటిపై క్షణకాలము గుండ్రము పఱచి కొని దానికిఁ గట్టియుండు కండెల బరువునకు నీటిలో మునుఁగును. ఆ మునుఁగుటలో దాని వైశాల్యములోనం గల చేఁప లన్నియుఁ దానిలో నడం గును. ఆ వలగుడారము నారీతిని జేఁపలపైఁ గ్రమ్ముకొనును. జెస్తవాఁడు తన చేతి పగ్గమును మెల్లఁగ లాగును. రానురాను వల ముడుచుకొనును. అప్పు డాచేఁపల మొత్తమంతయు వలలోఁ జిక్కిపోవును. అట్టుల నిచట రాజు నొకప్రక్కనుండి తన రథమును బగవారిపైనఁ బఱుపఁగా నాతనిసేనలు నొకవంక గ్రమ్ముకొన్నవి. అప్పుడా రిపు సేన చిక్కుకొనె నని భావము. సేనలు క్రమ్ముట (చేఁప చేరు దిగిచినట్లు) కవియఁబడుట అని అర్థము.

61. కోల్తల = యుద్ధసన్నాహము.

62. విపక్షుఁడు = శత్రువు, వాలు=ఖడ్గము, కెంపు = ఎఱ్ఱఁదనము.

65. వాడ = వీథి, చెక్కు చేయు = ఖండించు, హరి = అశ్వము, ద్విరదము = ఏనుఁగు, అక్కజము = ఆశ్చర్యము, పేరు+ఉక్కు=మిక్కిలి శౌర్యము, అమ్మఁగాఁ జిక్కిన మేఁకవోలె = మందలోని మేఁక లన్నియు నమ్ముడు వోవఁగా మిగిలిన యొక్క మేఁక జనజాతివి పోఁగా నెట్లు దిక్కుఁ జూపులు చూచుచుఁ ద న్నేమి సేయుదురో అని ప్రాణములు పిడికిటఁ బట్టు కొనునట్లు శత్రురాజు తన సేన లన్నియుఁ బక్వొత్తిపోఁగాఁ దా నొంటిఁ జిక్కి య ట్లయ్యెను.

66. యాత్రాచంగుఁడు = దండయాత్రయందు సమర్థుఁడు, మాద్యత్......డు=మదించిన గుఱ్ఱములను శిక్షించుటయందు నేర్పు వహిం చినవాఁడు, ఖడ్గాఖడ్గి = కత్తికత్తిగూర్చి పోరుట.

68. నాగె=క్షేమము, ఖండాలు = తునుకలు, పొల్లువోవక = వ్యర్థ కాఁగా, వరణరణ = వరుల వరించుటకైన యుద్ధమునందలి, కౌతుకాతుల = కుతూహలముచేఁ దొట్రుపడుచున్న, స్వర్గయువతిజన = దేవలోకమునందలి

యప్సరసలయొక్క, కటాక్షనిరీక్షా = కడగంటిచూపులయొక్క, అనుసరణ వశతన్ = అనుసరించుటకు వశమగుటచే, ఇద్ధకౌక్షేయకద్యుతులు = ప్రకాశించు ఖడ్గముల కాంతులు, ఇరుమడింపన్ = రెండింతలు కాఁగా.

క్షత్రియయుద్ధవర్ణనము:—ఒకరి నొకరుఁ గొట్టుట కనుకూలముగ గుఱ్ఱములు వెనుక ముందులకు నడచుచుండెను. కత్తి కత్తిని దాఁకి తునిఁగిన యుక్కుతునుకలు మెఱయుచు మిణుఁగుఱుఁబురువుల దలఁపించెను. ఒక ప్రక్క వ్రేటు వేయునట్టు లూఁపు జూపి మఱియొకవంకఁ గత్తితోఁ గొట్టఁగా గవచములఁ దాఁకి పుట్టిన కాకరవత్తులు లోసగు బాణసంచులలోని పూవులవంటివి కత్తి వాదరలనుండి పుట్టిన గుత్తి వెలుఁగులు వారి జాగ్రత్తలచే వ్యర్థము కాఁగా, అనఁగా వీరులు కత్తివ్రేటుల గాయపడ లేదని భావము. వారిపోరు నేర్పు తులదూగియుండెను. రణనిహతులైన వీరులను స్వయముగ వరింపవచ్చి ఆకసమున నుండి యాకయ్యము గాంచు వేడుకలో నాకులపడు దేవలోకము నందలి యువిదల క్రేఁగంటిచూపుల ననుసరించునట్టు తళతళ మెఱయు ఖడ్గముల మెఱుంగులు రెండింతలు కాఁగాఁ బోరిరి.

70. పల్లంబు=జీని, అసిధార = ఖడ్గముయొక్క వాదర.

ఈపద్యమునఁ గళాపూర్ణుఁడు పగతునియెడఁ జూపిన యచ్చెరువు మిగులఁ గొల్పు హస్తలాఘవము కవి కన్పఱిచినాఁడు. తొలుతొల్త గుఱ్ఱపురౌతొకఁడు గత్తితోఁ బోరఁ గళాపూర్ణునిపై రాఁగాఁ గొంత యేమఱియున్నట్లు (రక్షణమున) కన్పడెను. ఆరౌతు గుఱ్ఱముపైనుండి కళాపూర్ణునిఁ బడఁగొట్టఁ గత్తి పైకెత్తినంతనే పూర్ణుఁడు తన ఖడ్గము నేటవాలుగఁ బ్రయోగించి యొక్క వ్రేటుతో ఆరౌతు చేతిఖడ్గమును రెండుతునుకలు, రౌతును రెండు తునుకలు, జీనిని రెండుతునుకలు, గుఱ్ఱమును రెండు ఖండములు మొత్తమేని మిది తునుకలు చేసెను. ఇది చూచి ఆపెండులోని గుఱ్ఱపురౌతులు మన మంద అము ఖడ్గము వెనుకకుఁ ద్రిప్పివేసియు నాఱు తునుకలు చేయఁగలము. (ఎట్లన నెదిరి ఖడ్గము ఖండింపక తక్కిన వాని మూఁడు నాఱు తునుకలు)

కాని యితఁడు ఖడ్గముచేఁగూడఁ దునుకలుచేసెను. లేక కేలుచు (హస్తము) అనుకొన్నను ఒకటియే. ఇది చిత్రము.

72. ఇట్లు శత్రుఖడ్గమునకు దెబ్బకు గుఱియైపోయిన ట్లాసఁజూపి చివాలున నెనిమిది తునకలు ఛేయుట చిత్రముకదా.

74. ఇట్లు భయంకరముగఁ గళాపూర్ణుఁడు యుద్ధము సేయఁగా శత్రుని సేనయంతయు రేఁగుచెట్లును, దంగేడుచెట్లునుబోలె నడఁగి ద్రొక్కి దాఁటిపర్వెత్తిపోయెను. తంగేడుచెట్టునకు ముండ్లు లేవు, త్రొక్కిపోవునంత పొట్టిది. ఎగిరి దూఁకను వచ్చును. రేఁగుచెట్లు మనుష్యుని పొడవుకన్న మించినవి. పైఁగా ముండ్ల నిండినవి. ఇట్టివానిని దంగేడుచెట్లువలె భావించి సేనలు పోవుచున్న వనుట వారి సంభ్రమము కని ప్రత్యక్షముగాఁ జూపుచున్నాఁడు.

75. ఉరవణించు = దాఁటు, గవను, గవఁను = కోటవెలుపలి పెద్ద ద్వారము, దంచనము=పెద్దఫిరంగి, ఫిరంగి = సాధారణమైన ఫిరంగి, జబురు జంగు=మఱియొక్క చినుసు ఫిరంగి, ముమ్మరము= అధికము, కొమ్ము=శిఖరము, ప్రెగ్గడ=మంత్రి, మొగ్గరము = వ్యూహము. అగ్గలిక = ఆధిక్యము, లగ్గ = కోటపై కెగఁబ్రాఁకుట, మెండొడ్డు=ఎదిరించు, ఒడ్డిఁడు = ఓఢ్రదేశపురాజు.

76. పోఁజు = దండు.

77. పంబిన+పేరు+అలఁతక=అతిశయించిన యెక్కు డలసటచే, మొన = సేన.

80. యూథము=మొత్తము, చూపఱు = చూచువారు.

81. సుడి=నీటిసుడివలె గుండ్రముగ, తలపడు = తాఁకు, బల్విడి = క్రోధము, పూఁపు=పూనిక-ఉద్యమము, ధ్వానము = ధ్వని.

84. సవ్యాపసవ్యక్రమ భ్రమణంబు=ఎడమ+కుడి+వరుసగ+తిరుగుట, శుండాప్రకాండము = మేలితొండము లేక పెద్దకొమ్మంత తొండము, రోదోంతరాళము = భూమ్యాకాశముల నడిమిచోటు, అవారణీయసారము= నివారింపరాని సత్తువ.

86. పెడమరలు = వెనుకకుఁ దిరుగు.

87. కఠినముష్టి = దృఢమైన పిడికిలి, ఏడ్తెఱ=పరాక్రమము, పెడ కేలు=మీఁజేయి, చేంగు=దాఁటుటయం దనుకరణము.

90. పంట్రకోల = చిల్లులుగల మూఁడు నాలు గెలుగులు గల బల్లెమువంటిది - కఱ్ఱ.

91. మెయి=విధము, సంహ్రీణుఁడు=మిక్కిలి సిగ్గు పొందినవాఁడు, ఈప్సితరత్నహారి = కోరిన మేలివస్తువుల మణులను హరించినవాఁడు.

92. ఉపాయనము = కానుక.

93. భేరీభూరిధ్వాన=దుందుభుల గొప్పధ్వనియొక్క, మహారభటి= ఆడంబరముచే, జిత=జయింపఁబడిన, అబ్ధిఘుమఘుమారవుఁడు = సముద్రము యొక్క ఘుం ఘుం అను ధ్వని గలవాఁడు, చమూవారము = సేనాసమూహము, భేరీ......రవుఁడు=జయభేరుల యొక్కడు మ్రోఁతయొక్క గొప్ప ధణంధణధ్వనులచే జయించిన సముద్రముయొక్క ఘుమ ఘుమ యను ధ్వని గలవాఁడు.

94. తారసిలు = సమీపించు, అర్ణవము = సముద్రము, కడంక = ప్రయత్నము, నింగి = ఆకసము.

96. పొలివోవు = వృథయగు, ప్రాపు = రక్షకము, అని=యుద్ధము. ఉపభోగము=సుఖానుభవము, తమకించు = ప్రేమచే నాయితపడు, ఘన పథము = ఆకసము.

97. సరయశరవృష్టి = వేగముతోఁగూడిన బాణవర్షము, సరభసగతి స్ఫురణ = ఎక్కువ వేగముయొక్క ప్రకటించుటచే, నిమగ్నముగ = గ్రుచ్చుకొన్న, పర+ఆయుధము = పెఱవానికైదువు, చరమశిఖిపింఛము = వెనుకటి కొనయందలి నెమలియీఁకల కుచ్చు, అవసరనియమలంఘి=సమయము యొక్క నియమమును దాఁటి, త్వరిత=వేగముతోడి, పరిరంభవిధి = ఆలింగన

మను క్రియయందలి, గరిమ = గొప్పతనముచే, వలీన=వంగిన, సురతరుణి = అచ్చరలేమయొక్క, జవ = వేగముచే, భిన్నకచభరము = విడిపోయిన కేశపాశము, అరిగె = డాలు.

ఒక్క వీరభటుండు వడిగఁ గురియు బాణవర్షమున కెదురుపోవుట తన పనికి భంగ మని విచారించి తన చేతిడా లటు పాఱవైచి పగవాని బంటుమీఁదికి మాఱ్కొనెను. ఆశత్రు వీరుఁడు వీనిఱొమ్మున నొక నిడుపాటి చేయమ్ము నాటుకొనునట్లు వేసెను. అది యీవీరుని ఱొమ్ములోఁ బూర్తిగ నాటుకొనెను. అప్పు డీవీరుని ఱొమ్ము నాచేయమ్ము మొదలు కనఁబడు చుండెను. ఆమొదటికి నెమిలియీఁకలు కుచ్చుగా (అందమునకు) గట్టియుండినవి. ఆయీఁకలమొత్తము (నెమలిపింఛము) ఎట్లుండె ననఁగ ఈ మరణింపఁబోవు వీరుని నచ్చరలేమ యొర్తు పెఱయచ్చరలకన్నఁ దాను ముందు వరింపఁగోరి ఎవరు ముందు. ఎవరు వెనుక వరింపవలె ననునియమము నుల్లంఘించి తటాలున వచ్చి యీవీరు నాలింగనము చేసికొనినప్పుడు త్వరగ వచ్చుటలో నామె క్రొమ్ముడి వీడిపోయి యీబంటుఱొమ్మున వ్రాలి ప్రకాశించినవా యన్నట్టుండెను. (చేతితో విసరు బాణము చేయమ్ము.)

98. ఉపరిస్థుఁడు = పైనున్నవాఁడు. ఒక వీరుఁ డేనుఁగుపై నున్న వీరునిఁ బొడువఁబోయి యాయేనుఁగు తొండముమీఁదుగాఁ బై కెక్కి తన యెడమచేతిని దాని కుంభస్థలముమీఁద నుంచి యేనుఁగుమీఁదివానిఁ బొడిచెను. ఇంతలో వాఁ డీ వచ్చినవీరు నసువులు గోల్పోవునట్లు గ్రుమ్మెను. వీఁ డట్లు చనిపోవుసరికి వీనియెదుట నప్సరస కన్పట్టెను. వీఁ డేమనుకొనుచున్నాఁ డనఁగా నేను ముం దెడమచేయి యుంచిన దీమె స్తనముల మీఁదనా యేమి? నేను దెలియక యీమె నెచటఁ బొడిచితిని అని సిగ్గుపొందెను. యుద్ధమునఁ జనిపోయిన వీరుల నచ్చరలు వరింతు రని భావము.

99. మావంతుఁడు=మావఁటివాఁడు, సమకట్టు = సిద్ధపఱుచు, జల్లి= గుఱ్ఱమున కిరువైపుల వైచిన వింజామరలవంటి కుచ్చులు, చౌకళించు = దుముకు, గాఁడు = గ్రుచ్చుకొను.

100. వాగు=దండు, కటారి = పెద్ద కత్తి, ఉద్దించు = జళిపించుచు, ఎక్కటి కయ్యము=ఇతరుల సహాయము లేక యొక్కొక్కరు నిల్చి పోరుట.

101. మిథః=పరస్పరము, వితత = విస్తరిల్లిన, వీరరస = వీరరసముచే, ఉగ్ర=భయంకరమైన, కటాక్ష = కడకన్నులయొక్క, భావగంభీరత = అభిప్రాయముయొక్క గాంభీర్యముచే, పసిండిజలపోఁతకటారి=అపరంజి మేలాము పూసిన పట్టాకత్తి, కొఱడు=ఆయుధవిశేషము, మిథః......త = పరస్పరము విస్తరిల్లిన వీరరసముయొక్క యుద్రేకముతో భయంకరమైన క్రేఁగంటి చూపులచే నభిప్రాయముతోడి గాంభీర్యము.

102. ప్రదులు = తగ్గు, దండ = ఒకరొకరి బుజములు పట్టుకొని యుండుట, తిప్పక=వెనుకకుఁ దీయక, ఐదు పది సేయు=నమస్కరించు-చేతుల వ్రేళ్లు నొక్కటిగాఁ జేర్చిన బడి యగు నని భావము.

103. వీరులు కత్తులతోఁ బోరుచుండ వీరి రోసముతోఁ గూడిన కన్నుల చూపులు కత్తులపైఁ బ్రసరింపఁగా నా కత్తులు కెంపులచాయఁ దోఁపించెను. అద్దానిని జూచువారు నెత్తు రని సందియపడిరి. ఎకబికలు, కకవికలు = ఉండురీతి మారకుండు. కడిది = దిట్ట.

108. సాదనకాఁడు=అభ్యాసి, మాస్టీఁడు = మల్లుఁడు - శూరుఁడు, తద్భువనవలభులు = ఆ యాలయపుగోడలు.

110. ధ్వజిని = సేన.

112. సంగ్రామరంగ = యుద్ధరంగ మను, అంబరీష = మంగలమందు, అఖిలకాళరాత్రి = భయంకర మగు కాళరాత్రి, భర్జ్యమాన = వేయించుచుండగ, సముజ్జిహాన = పైకెగురు, లాజానుకారంబునక = బొరుగులవలె, నిర్ఘాత = చక్కఁగఁ గొట్టునవైన. శాత = వాడిగలవైన, శక్తి = చిల్లకోలలు, తోమర = పెద్దచిల్లకోలలు, ప్రముఖ = మొదలైన, శస్త్రచరమభాగ = కైదువుల వెనుకభాగములందు, అలంకరణ = అలంకరించిన, చారుపింఛ మాల్య+

ఆది=సుందరములైన నెమలియీఁకలు పూదండలు లోనగువానిచే, విలసితం బులు = ప్రకాశించునవి. పలలపంకిల = మాంసము బురదగను, రుధిర ప్రవాహము=నెత్తురుప్రవాహము, కృష్ణముఖ=నల్లని గట్టి యుక్కుమొనలు గల, శిలీముఖ = బాణములచేత, కృత్త = నఱుకఁబడిన, నేమి=చక్రముల యంచుపట్టాలయొక్క, ఘట్టనంబుల బిఱుసునన్ = తాఁకుటల గట్టిచే, అంధీ కృతము = గ్రుడ్డిగాఁ జేయఁబడు, అడిపము = ఖడ్గము, ఉల్క = కొఱవి, రటితము = మ్రోఁత, విస్పృత్వరము = వ్యాపించుట, వేదండము = ఏనుఁగు, మార్వి = అల్లెత్రాడు, వికస్వరము = వికసించు - వ్యాపించు, నేమి = చక్రముయొక్క అంచు, ఇంద్రగోపము = ఆరుద్ర పురుగు, ధవళోష్ణీషము= తెల్లని తలపాగ, మస్తకము = శిరము, సంగ్రామ.........బున = యుద్ధ రంగ మను మంగలములోఁ గాళరాత్రి వేచుచుండఁగఁ బైకెగురు బొరుగులు వోలెఁ గనుపట్ట (తెల్ల తలపాగల శిరస్సులు), అలుఁగు = ఖడ్గము, నిష్ఠ్యూ తము = వెడలఁ గ్రక్కఁబడినది, పెడతల = మున్చెనగుంట, సందష్టము = కొఱకఁబడు, చికురములు = తలవెండ్రుకలు, చప్పరము = మీఁదఁ బందిరివలె నేర్పఱిచిన నలుచదరపు మ్రానిచట్టము, జల్లి = వింజామర, కదనము = యుద్ధము, నిర్ఘాత.........లై=చక్కని ప్రేటుగొట్టు పదునైన, చిల్లకోల, మఱియొక విధమగు చిల్లకోల మొదలగు కైదువుల వెరుకటి భాగముల నలంకారములచే నందగించిన నెమలి పురులు మాలలు లోనగువానిచేఁ బ్రకాశించునవై, పలలపంకిలరుధిరప్రవాహము = మాంసమడుసు నెత్తురు వెల్లువ, అక్షోరణుఁడు = మావటివాఁడు, విదారితము = పగుల్పఁబడినది, కృష్ణ......బిఱుసు = నల్లని గట్టి యుక్కుమొనలు గల యమ్ములచే నఱుకఁ బడిన తేరి చక్రములయొక్క యంచుల యొరయికచే నైన గట్టితనముచే, వడువు=వలె, తొట్టువగట్టు=నీటిలోఁ దేలిన గడ్డి లోనగువాని మొత్త మొక్క ప్రక్కకుఁ గొట్టుకొనివచ్చుట, పొల్లు = పొట్టు - తరక, అఘకీకణరాశి = తూమెడుకొలఁది ధాన్యపుగింజల ప్రోగు, రుధిర......చేర్పునన్=నెత్తురు

మాంసము వీనితోఁ గలిసిన యెముక తునకల గొప్పప్రోవు దగ్గఱ, శూర్పము= చేట.

113. నిష్ఠురగుణటంక్రియా = కఠోరమైన అల్లెత్రాటి టంకారము యొక్క, నినద = ధ్వనిచే, శుంభత్ + ఇషువుకర = ఎగిరిపోవు బాణసమూహ. ములయొక్క, ప్రవర్షణ=జడిచే, ఉద్ధురుఁడు=భయంకరుఁడు, నిష్ఠుర...... ద్ధురుఁడు = కఠినమైన నారి టంకారధ్వనులతోఁ గదలిచను తూఁపుమొత్త ముల వర్షించుటచే భయంకరుఁడు.

114. నిషూదితసూతుఁడు = చంపఁబడ్డ సారథి గలవాఁడు, భగ్న కేతుఁడు = విఱిగిన టెక్కెము గలవాఁడు.

115. తలఁకు = భయంపడు.

117. విషధి = సముద్రము, గాంధర్వవిద్య = సంగీతవిద్య, భండ నము = యుద్ధము.

118. తన్వి = స్త్రీ, హిమగ్రావాంతము = మంచుకొండ తుద.

119. అవిగీత = శ్లాఘింపఁదగిన, రణకేళి = యుద్ధక్రీడయందలి, పటి మాతిశయ = సామర్థ్యాతిశయముయొక్క, గర్వశ్వేతునకున్ = గర్వముచేఁ దెల్లనైననానికి, ఘనహేతినికురుంబ=గొప్పవైన యాయుధముల సమూహము లందలి మణిరత్నములచేతను, కేతన = ధ్వజములందు, సముద్యత్ = పైకి లేచు, నూతనగభస్తి = క్రొత్తకాంతులచే, పరిపీత = త్రాగఁబడిన, కకుబంత రములై = దిక్కుల నడిమిభాగములు గలవై.

120. రథకేతుపటములు = అరదములయొక్క ధ్వజములయందలి వస్త్రములు, రత్నాద్రి = రోహణాచలముపైన, లంబమానాబ్దశంక = వ్రేలు మేఘమను సందేహము, గండ + ఉపలాకారత=పెద్దనల్లని బండలరూ పొందు టచే, ఉపత్యకాభంగి = పర్వతసమీపస్థలమువలె, కంచుపక్కెర = కంచుతోఁ జేసిన జీని, కంఖాణపంక్తులు=గుఱ్ఱముల వరుసలు, ఫేనిల=నురుఁగులు గ్రక్కు,

సింధుతటలీల = సముద్రతీరముయొక్క విలాసము, చంచత్ = ఒప్పు, మరాళీ = హంసలచే, త్రుట్యమాణ = త్రుంపఁబడుచున్న, పతత్ + బిసాకృతి = పడుచున్న తామరతూండ్లరూపు. సరః + స్యద = ప్రవహించు ప్రవాహముయొక్క వేగమునందు, గాహి = మునుంగు. మత్తమాతంగముభంగిక్ = గుణించిన యేనుంగువలె.

120. ౧. అరదములపైని టెక్కెములవస్త్రములు మేరుపర్వతమునందు ప్రేలాడు మేఘములను సందేహము గలిగించెను.

౨. ఏనుఁగులు పెద్దబండలరూపున నుండు నాచోట్లు పర్వతసమీప ప్రదేశములుగఁ గనుపట్టఁగాను,

3. కంచు (అను లోహము)తో నిర్మించిన జీనులు గల గుఱ్ఱముల బారులు నురుఁగులుగ్రక్కు సముద్రముయొక్క యొడ్డు సొంపును గన్పఱుప,

౪. కేడెములు (డాళ్లు) వ్యాపించుట గల (పటవణి = వ్యాపనము) చోట్లు, తలపాగాలు చుట్టుకొన్న కోటపైబురుజుల యొప్పు నొప్ప,

౫. పొరిఁబొరి = త్వరగ, పట్టుతెల్లజల్లి = పట్టుతోఁ జేయఁబడిన తెల్లని వింజామరము, పసిఁడిగడలు = బంగారు ధ్వజములు,

౬. చంచత్......కృతి = సంచరించు నంచలచేఁ ద్రుంపఁబడుచుఁ గ్రిందఁబడు తామరతూండ్లరూపు గాంచ,

౭. మానసముచోట్లు = మానససరోవరప్రదేశములు. లోహితోర్వరకము = రక్తమను నీరు, సరస్స్య.........భంగి = వడిగఁ బాఱు నేటి ప్రవాహమున కెదురీఁదు మత్తకరిభంగి.

121. బిరుదుసంకులు = జయశంఖములు, తార = పిల్లనగ్రోవివంటి వాద్యము, బూరగొమ్ము = వంకరగా నుండు (కొమ్మువలె) వాద్యవిశేషము, భేరీ = నగారా, తమ్మటము = తప్పెట.

122. గుణాస్ఫాలనము = నారిమ్రోఁత, విశిఖమండలి=బాణసమూహము, బల్విడి = మిక్కిలి ప్రతాపము, వీనులు = చెవులు.

123. ఆకర్ణపూర్ణముగ వింటినుండి వెడలు బాణముల వేగముయొక్క చిత్రమే మని చెప్పవచ్చును. విరుసు గ్రోవి యనునది బాణసంచులో నొక విధమగు బుడ్డివంటిది. దానిని గాల్చినతోడనె చివాలున నింగి వంకకు లెక్కలేనన్ని రంగురంగుల పువ్వులు వడివడిగాఁ బోవును. అధంగిని నిండిన నీరుగల చెఱువుకట్టు తెగినప్పు డానీరు పల్లమునకుఁ బ్రవహించుభంగిని దగియుండెను.

124. దొన=అమ్ములపొది, తూఁపు = అమ్ము, చనుమఱ = బొమ్మ, అరిఁబోయు=ఎక్కుపెట్టు, శ్రవణాంతసీమ = చెవికి దగ్గఱిచోటు, శింజిని = నారి.

125. పరిస్తోమము = ఏనుఁగుమీఁదఁ బఱచు నెఱ్ఱకంబళి, పల్లము=జీనిమీఁది పఱుపు, పక్కెర=గుఱ్ఱమునకువేయు అంగీ, కంకటము = కవచము, అరిగె = డాలు, ఉరువణించు=వేగిరముగఁ జను, పరానీకము = శత్రుసేన, కాందిశీకము = వెనుదిరిగి పరువెత్తునది.

126. పింజ = పిడి.

128. బరవసము = ధైర్యము.

129. భుజాంతరము = వక్షము, అంపచాలు = బాణపంక్తి, విమతుఁడు = శత్రువు.

131. కైవారము = పొగడ్త.

132. వీడు = నగరము,

135. కిగ్గాడిగుఱ్ఱాలు = అంబేవగుఱ్ఱములు (బక్కవి).

136. ఆమడ = పదమైళ్లు, తోరపువీడు = సుందరనగరము, అవిదితాయామము = తెలియఁబడని నిడివి.

138. కుతూహల=వేడుకతోడి, సంభ్రమ=త్వరచే, జృంభమాణ=చెలరేఁగు, రామా = స్త్రీలయొక్క, రభస+అధిరోహ = తొట్రుపడుచు

నెక్కుటయందు, సమాకుల=కలకలముతోడి, సౌధ = మేడలయందు, మంజు హాస = ఇంపైన చిఱునగవుతోడి, మంజీర = అందెలయొక్క, ఝుళఝుళ ధ్వనివిశేషము = ఝుళంఝుళమ్మను ధ్వనులయొక్క యాధిక్యము.

భేరులు లోనగు వాద్యములు చెలరేగెను. వేడుకతోడి త్వరపాటు మించు స్త్రీల సందడితో నెక్కుటలోఁ దొట్రుపాటుగల మేడలయందు సొగసైన లేనగవులతోడి యందెల ఝుళఝుళ మను మ్రోఁతల యెక్కువలు.

139. అఖండిత = సంపూర్ణమగు, దిగ్జయ = దిగ్విజయము చేతనైన, ధామచిత్రిత = తేజస్సుచేఁ జిత్రింపఁబడిన, పావన = పవిత్రమైన, చారు కీర్తి=సుందరమైన యశస్సు, కృత = చేయఁబడిన, తర్జనభీతి = బెదరించుట వల్లనైన భయముచే, సహస్రధావిభిన్న = వేయివిధములుగా వేఱైన, అవత రత్ = క్రిందికి దిగు, సహేమకమలామరసింధు = బంగారుతామరలతోఁ గూడిన దేవగంగయొక్క, జలౌఘమో యనఁగ = ప్రవాహమో యనఁగా, సోరణగండ్లు = గవాక్షము.

ఆ నృపాలునిఁ జూచుటకు వచ్చి మేడలపై నున్న కాంతల నెమ్మొగములు కిటికీలనుండి శోభిల్లఁగా, ఆ మేడ లెట్లుండె ననఁగా, సౌధములు = పాలగారచేసిన తెల్లనివన్నె మేడలు సంపూర్ణముగా దిగ్విజయము చేయుట వల్లనైన తేజస్సుతోఁ జిత్రింపఁబడి పవిత్రమైన సుందరమైన కీర్తిచేఁ జేయఁబడిన బెదరుచే భయము పొంది వేయి విధములుగఁ బాయలై చీలి పైనుండి క్రిందికిఁ బడు బంగారుతామరలతోడి దేవగంగయొక్క ప్రవాహమో యన్నట్లుండెను.

140. రోలంబభటులు = తుమ్మెదబంట్లు.

ఒక లేమ యాయనను జూడ వచ్చుచు త్వరలో వీడిన కొప్పు గల దాయెను. అది యెట్లుండె ననఁగా మన్మథుఁ డను ఱేఁ డొకరిని బట్టుకొని రమ్మని యానతీయ నీ తుమ్మెదలను బంటులు మెడఁబట్టి త్రోసికొని యామెను బట్టుకొని వచ్చుచున్నట్లుండెను.

141. వలగ్నమునఁ = నడుమునందు, కొమ్మ = స్త్రీ, పఱతెంచు = వచ్చు, వేణిభరము=గొప్ప జెడ, మొగపుఁదీగె=ముఖమున నడ్డుకొను బంగారు తీఁగె. వలగోఁ=చుట్టుకొనుటకు, కౌను=నడుము.

142. రతాస్తనీవి=రతియందు,వీడిన చీరపోఁకముడి, ఉరోవృతము=పయట.

ఒక గుబ్బెత (యువతి) ఉన్నతస్తనములు గలది ఈ రాజును జూడ వచ్చెను.ఎట్లనఁగా ప్రియునితోడి క్రీడయందు బోఁకముడి వీడిపోఁగా దానిని మరలఁ గట్టుకొనుచుండఁగ నది ముడి సరిగఁ బడక పైఁటకొంగు సైఁము జార్చునదివలెఁ గాఁగ నప్పుడా వనిత పైఁట దొలఁగినదే యని భావించి యేమియు లేకపోఁగా తన నిక్కిన చనుఁగవ బరువునకుఁ బైరక్షణగఁ దన పెనిమిటి పంచె దొరకఁగా దానిని బయ్యెఁటగా వేసికొని వచ్చెను.

143. కావిజిగి = ఎఱరంగు, కచము = జెడ, గళితధృతి = జాఱిన ధైర్యముగల, లలితకుచమధ్య = సుందరమైన చనుఁగవనడిమి, ఘనపక్షము = ఆకాశము, జిలుఁగురవ మాదావళపు. పడిరెయొత్తు కచములఁ=మిగుల సన్నని కపిలవర్ణముగల వస్త్రముచేఁ దడియొతు సిగుం కలను, కెలను = పార్శ్వము, తరళమూక్తికము = నాయకమణిగ నున్న ముత్తెము.

ఒక చెలువ యప్పుడ స్నానము చేసి నున్నవి కావిరంగుకాంతి గల వలువ త్వరగఁ గట్టుకొని, గోరోచనపువన్నె సన్నినవస్త్రముతో శిరోజములఁ దడియొత్తుచుఁ బెనవేసి చుట్టుకొని వచ్చుట యె ట్లుండె ననఁగా, ఆ పెనవేసి కొన్న వెండ్రుకలచుట్ట ఎఱని జేడల మేలి వేసికొన్నట్టుగ నుండ దిటవు వదలి వదలి చపలురాలైన జోగురాలువలె నుండెను. ఆమె సొగసైన చనుఁ గవనడుమ నున్న హారములోని నాయకమణి యైన దొడ్డరత్నము హృదయ ములో నుండి పైకి వచ్చి కనఁబడు సత్త్వగుణమో నా నెలుఁగొందెను.

144. గిండి = చెంబు, ఊడెపుఁగత్తె = దాసి, సవ్యకరము=ఎడమ చెయి, జంఘ = మోఁకాలు.

146. విపంచిక = వీణె, నూపురము = అందె.

147. సురఁటి = వీవన, పరిచర్య = శుశ్రూష.

148. సకలదిగ్దేశ=అన్ని దిక్కులందలి విదేశములయొక్క, భూనాథ= రాజులయొక్క, శుద్ధాంత కాంతా=అంతిపురమునందలి కాంతలయొక్క, శిరోమణికల్పిత=శిరస్సులందలి రత్నములచే కల్పింపఁబడిన, నూపురప్రకాండము= మేలియందెలు, సకల......ములు = అన్ని దేశముల రాజుల యంతిపురముల లోని రాణుల శిరస్సులందలి రత్నములచే నిర్మింపఁబడిన మేలియందెలు.

152. పైదలి = స్త్రీ, ఆదట = ప్రేమ - అభిలాష.

154. వినయమధురఫణితి = అడఁకువతోడి తీయనిమాట.

155. అప్ప=అక్క, ప్రణతనిష్ఠ = నమస్కరించుటలో నియమము, అవగణన = తిరస్కారము.

156. ఏపు = విజృంభణము.

158. భవితవ్యతానుసారము = కాఁదగినదానిని ననుసరించి.

159. ముట్టుపాటు = సంకటపాటు, చొప్పు=విధము, ఉల్లము = మనస్సు.

162. ఉత్తానశయుఁడు = వెల్లకిల పండుకొన్నవానిని, వటపత్ర శయానుఁడు = మఱ్ఱియాకునఁ బవ్వళించినవానిని.

163. చరణాంగుళీ=కాలివ్రేలియొక్క, పాన=నోటనిడుకొని రుంజుటచే, జాత=పుట్టిన, లాలా=ఎంగిలినీటిచే, అభిషిక్తంబు=అభిషేకింపఁబడినది.

చరణాంగుళీ......షిక్తంబుతోడ = కాలివ్రేలిని నోట నిడి పాలు త్రాగినట్లు కుడుచుటచేఁ బుట్టిన యెంగిలిచేఁ దడిసిన మెడయందలి ముత్యాల హారములతో, విరచితము = చేయఁబడెను.

168. అవియు = పగులు-చిట్లు, బడుగు = బక్క, అంగకము = అవయవము.

169. వాచంయముఁడు =ముని.

170. సవిధము = సమీపము, అధ్వశ్రమంబు = దారిబడలిక.

171. లెప్పంపుఁ బూఁబోఁడి = శిలతో నిర్మింపఁబడిన స్త్రీప్రతిమ, సున్నము (లోనగువాని పూఁతతో నిర్మితమైన ఆఁడుబొమ్మ), అశమవిస్మృతి= మన్మథవికారము.

174. యదృచ్ఛాచేష్ట = ఇచ్చ వచ్చినట్లు చేయు వ్యాపారము, ఎఱుక = జ్ఞానము.

175. ఉబ్బు=ప్రకటమగు. తదాయత్తతర్క=అతని కధీన మగుటచే.

179. పగటుపాపము = ప్రకటమైన పాపము.

181. ఆఖ్యాగుణజాతి+ఆది = పేరు, గుణము, కులము మొదలగు.

182. బాలురు (లోకముఁ దెలియనివారు) తల్లిదండ్రులు మొదలగు పెద్దవారి మాటలను వర్తలను విని చూచి వారు నవలంబింతురు. బ్రాహ్మణుఁ యితఁడు శాపవశమున నంతయు మఱచి తర్వాత, ఉత్తముఁడు, మధ్యముఁడు నైన వృద్ధులుచేయు పనులు చూచుటచే. ద్రవ్యము, పృథివి, జలము-లోనగునవి. కర్మము—కాలు-చేయి చాచుట, ముడుచుట త్రిప్పుట మొదలగునవి. గుణము-శబ్దము, స్పర్శము, రూపము లోనగునవి. జాతి-మనుష్యుఁడు, జంతువు, పక్షి.

183. తత్‍జ్ఞులు = దానిని దెలిసినవారు.

184. అరాజకము=రాజు లేనిది, సత్త్వవిశేషము = బలము, మంచి గుణము వీని ఆధిక్యము.

185. ఉపాయనము = కానుక.

[illegible]. ఉదక [illegible]

187. కలాపము = భూషణము, తదీయతరళమీఁదు చిద్గుణము = ఆహారములోని నాయకమణి పైభాగము ననుజ్ఞానశక్తి.

188. శిశుత = బాల్యము.

189. జని = పుట్టువు.

190. హృదయ......బుగాక్ = వక్షస్థలమును దాఁకుచుండు నాయకమణి కలదిగా-ఆ నాయకమణి ఱొమ్ము దాఁకుచుండు నని భావము.

191. అను.........క్ష్మి = సరిలేని కడవలవంటి చనుఁగవ సంపద, నర్తకీ=ఆటకత్తె, కించిత్......పంబు=ఇంచుక కనఁబడి కనఁబడక యుండు రూపు గలది.

195. చిత్తభూవశంవదుఁడు=మదనునికి లోనైనవాఁడు, జతనము=ప్రయత్నము.

196. సంక్రాంతి = క్రముట.

197. ఉభయహృదయదేశ = ఇరువురి వక్షఃప్రదేశములు, యుగపత్ =ఒక్కమారు, మణిస్పర్శమహిమ = మణి తాఁకిన ప్రభావముచే.

ఇరువురవక్షము లొక్కసారిగ మణితాఁకు మహిమచే, ఆశ్లేష సుఖము = ఆలింగనసుఖము.

ఆమధురలాలసా కళాపూర్ణు లొక్కమాఱుగఁ గౌఁగిలించుకొనఁగా మధురలాలస మెడలోని యీ దివ్యహారములోని నాయకమణి మీఁది భాగ మిరువురి వక్షముల కొక్కమాఱు దగిలి వారి కపూర్వజ్ఞాన మబ్బెను. దాని వలన వారిలో నొకరిపై మఱియొకరి కేమాత్రము ప్రేమ గలదో యని యెఱుంగుట కవకాశము గలదై మఱియు నచ్చెరువు గొల్పెను. పరస్పర ప్రేమ సహేతుకమా, నిర్హేతుకమా అని దెలియనయ్యె ననియు, నిజమైన ప్రేమ యని తెలియుటచే వారు మురిసిపోదు రనియుఁ జమత్కారము.

200. వల్లకీరణనపాటవము = వీణ వాయించునేర్పు.

201. ఓలి = క్రమము.

202. మధురలాలస = మధురలాలసయొక్క, సపరిరంభణవిశేష = ఆలింగనముతోఁ గూడిన ముఖ్యమైన, సమయ = సమయములందు, హృద్దేశ ఘటిత=హృదయ ప్రదేశములందుఁ దాఁకిన, తచ్చారుహార = ఆసుందరమైన హారముయొక్క, తరళమాహాత్మ్యమునన్=నాయకమణిప్రభావముచే, నిరూప లించు=నిరూపించు, అడఁచు=దాఁచు, అడఁచు = శిక్షించు, మలిన్లుంచు..ను = దొంగ. మధురలాలస......డగుచు=ఆ మధురలాలసయొక్క కౌఁగిలింతతోఁ గూడిన విశేషసమయములందు వక్షమునందుఁ గూర్చిన సొగసైన ముత్యాల హారముగాని నాయకమణి మహిమచేత నన్నియుఁ దెలిసినవాఁ డయ్యెను.

207. బాల్యోదిత = చిన్నతనమునందుఁ జెప్పిన, తావకీనమధు రోక్తులలో = నీ తీయనిమాటలలో.

బాల్యో......లోన్=చిన్నతనమునఁ జెప్పిన నీయింపైనమాటలలో.

210. అమృతపూర=అమృతప్రవాహముచే, అశ్చర్యతను = మిగుల నచ్చెరువుగొల్పు, విరజానదీ=విరజయనునదియొక్క, సీమావరుద్ధ=సరిహద్దుచె నరికట్టఁబడిన, సంసృతికథంబు = సంసారపువృత్తాంతములు గలది, గణ నాతిగ=లెక్కింపమించిన, బ్రహ్మాండబుద్బుద = బ్రహ్మాండగోళము లను బుడ గలయొక్క, ప్రకృతి = విష్ణుమాయయైన ప్రకృతి యను, పాథోధి = సముద్రమునకు, పారాయితంబు=ఆవలిగట్టైనది, సూర్యచంద్రాగ్ని=సూర్యుఁడు చంద్రుఁడు అగ్ని వీరియొక్క, తేజనిరపేక్షణా = వెలుఁగుయొక్క అపేక్ష కము లేని, ప్రాకృతస్వప్రభా=స్వభావసిద్ధమైన తన తేజస్సుచే, భాస్వరంబు= ప్రకాశించునది, స్వేచ్ఛాగృహీత=తమ యిచ్ఛమై గైకొన్న, సమిద్ధ=ప్రకా శించు, విశుద్ధ = నిర్మలమైన, సత్త్వశరీర = సాత్త్వికశరీరములుగల, నిత్య ముక్తవ్రజంబు=నిత్యముక్తులైనవారి సమూహము గలది, నిఖిలవేదాంతసిద్ధ = అన్నివేదాంతములందును నిర్ణయింపఁబడిన, పరమకల్యాణగుణచణ = ఉత్త

మములైన మంగళకరములైన గుణములచే సమర్థమైన, బ్రహ్మతత్త్వ = పర బ్రహ్మతత్త్వముయొక్క, సతతసాక్షాత్క్రియా=ఎల్లప్పుడు సాక్షాత్కరించుటచే, విభూషిత = అలంకృతమైన, నిజానుభవ = తమతమ సుఖానుభవముల, సుఖిత = సుఖితములు బొందిన, కోవిదము = పండితులు గలది; శౌరిపరమపదము = వైకుంఠము.

౧. అమృత.........కషంబు=అమృతంపు వెల్లిచే మిగుల నచ్చెరువు గొల్పు విరజ యను నదియొక్క హద్దుచే నరికట్టఁబడిన పుట్టుట గిట్టుట యను రూపుగల సంసారపుఁగథలు గలది.

౨. పరి......తంబు=లెక్కింపమించిన బ్రహ్మాండములను బుడగలను బుట్టించు మూలప్రకృతి (విష్ణుమాయ) యను సముద్రమున కావలిగట్టునై యున్నదు...

3. సూర్య......భాస్వరంబు=సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్ని అను తేజోమూర్తులయొక్క అపేక్షలేని అప్రాకృతమైన (ప్రకృతికి మించిన) స్వయంప్రకాశముతో వెలుంగునది.

౪. స్వేచ్ఛా.........వ్రజంబు=తమ యిచ్చవచ్చినట్లు గైకోఁబడి చక్కఁగఁ బ్రకాశించుచు "రజోగుణము, తమోగుణము" వీనితాఁకుడు లేని శుద్ధసత్త్వగుణసంబంధము లైన శరీరములు గల నిత్యముక్తుల సమూహము గలది.

౫. సిఖిల......కోవిదము = అన్ని యుపనిషత్తులయందు సిద్ధాంతీకరింపఁబడిన ఉత్తమములైన కల్యాణగుణములతో నిరూఢమైన బ్రహ్మతత్త్వము నెల్లప్పుడు సాక్షాత్కరించుటచే నలంకృతమైన తన యనుభవముచే సుఖానందములు పొందిన సుజ్ఞానులు గలది.

౬. శౌరిపరమపదము=విష్ణుని మేలిస్థానము (వైకుంఠము.)

211. చిత్తు, అచిత్తు, ఈశ్వరుఁడు, (జీవుఁడు, ప్రపంచము, పరమాత్మ) గలది. నీరు, నిప్పు, గాలి, మిన్ను, అహంకారము, మహత్తత్త్వము,

ప్రకృతి అను నేడావరణములు గలది. బ్రహ్మాండముల మొత్తమున కీవల ఆ లోక ముండును.

212. సత్ప్రీణిత = సత్పురుషులచేఁ బొగడఁబడిన, బ్రహ్మాది జగత్ = బ్రహ్మ లోనగువారి లోకముయొక్క, గుణమహిమలు = గుణముల ప్రభావములు, ప్రకృతిదోషములు ప్రపంచమునకుఁ గల కష్టసుఖములు, సత్......లు = సత్పురుషులచేఁ గొనియాడఁబడిన బ్రహ్మ లోనగువారి లోకముల గుణమహిమలు.

213. శతకోర్మి=నూర్లకొలంది యలలయొక్క, సముత్కర = సమూహముయొక్క, శీకరశీతలతర = తుంపురులచే మిగులఁ జల్లనైన, మరుత్ = గాలిచే, ఉరుపులకిత=ఎక్కువగ గగుర్పాటొందిన, తటద్రుమములై = గట్టునందలి వృక్షములు గలవై,

అరము, అరణ్యము అను రెండు సముద్రము లటఁ గలవు. వాని జల మమృతము. శత......లై = నూర్లకొలంది పెద్దయలల మొత్తంపుఁ దుంపురుల యొక్కడు చల్లఁదనముతోఁ గూడిన గాలిచే దట్టముగ గగుర్పాటొందిన (పెరిఁగిన) యొడ్డులయందలి చెట్లు గలవి యై.

214. ఆ వైకుంఠలోకమునకు నెల్లయైన యేఱై విరజ దగుచు మాని......పోలై=పూజ్యయైన మోక్షలక్ష్మిని వరింపఁ బ్రియంపడు భగవద్భక్తుల వరుసలకు శుభకరమైన లగ్నవేళయందలి తెరవలె నా విరజానది విలసిల్లును. ఆ నది దాఁటిన పెండ్లికూఁతురు మోక్షలక్ష్మి యున్న దని భావము.

215. జలనీలికా = నాచుతీవలును, కబరికా = జడలు, పద్మాస్య = కమలము లను ముఖములు, పుష్పంధయాళీ = తుమ్మెదల మొత్తములను, సంవీక్షణ=చక్కని చూపులు, వీచికావళీ=అలల వరుసలను, బాహు=హస్తములు, కోకస్తన=జక్కవ లను స్తనములు, శ్రీసంపాదిత = వీనిసంపదచే సంపాదింపఁ

బడిన, మూర్తి = స్వరూపముగల, ముక్తపదలక్ష్మీ = మోక్షస్థాన మను లక్ష్ముల యొక్క, మండలీకర్తయై = సమూహములయొక్క చేయునదై.

ఆ విరజానదీమతల్లిక సమీపమున మేఘజ్యోతులఁ గ్రుమ్మరించు వెలుంగుల సరస్సు గలదు. అందు నీటిలోని నాచుఁదీవెలు కేశపాశము, తామరలు నెమ్మోములు, తుమ్మెదలచాలు చక్కని చూపులు, అలలు త్రివళులు (కడుపుమీఁది ముడుతలు) తామరతూఁడులు హస్తములు, జక్కవలు చనుంగవలు అను సిరులు వొండించిన రూపుల నున్న మోక్షంపుఁజోట్లను లక్ష్ముల మొత్తముల కర్తయై.

216. బిల్వభూరుహము = మారేడుచెట్టు, శోభిత = ప్రకాశించు, పలాశవిసర=ఆకుజొంపములచేతను, కిసలయసముదయ = చిగురుల మొత్తము చేతను, ఉల్లసన = ప్రకాశించు, మహిమన్ = గొప్పతనముచే, అవిరళ = దట్టమై, స్థితశుకపంజరము = ఉన్న చిలుకగూడు.

ఆ తామరకొలనిచేరువ మారేడుచెట్టొకటి విలసిల్లును. గాని కాంతుల నొప్పారు నాకు జొంపములయుఁ, లేఁజివుళ్లయు మొత్తములు ఉల్లాసించుచు మహిమతో దట్టముగఁ జేరియున్న శుకముల సమూహమా యన్నట్లుండును (శుకమహర్షి).

217. అశ్వత్థశాఖ = రావిచెట్టుకొమ్మ, శాఖత్రయీశోభితము = మూఁడు కొమ్మలతో నొప్పినది.

మఱియు నట నొక రావిచెట్టు సామసదన మను పేరుగలది, మహిమ గలది, బంగారుమయమై మూఁడు పెద్దకొమ్మలతోఁ దనరారి వేదములు పొగడెడిది గలదు.

218. పంచశత = అయిదువందలైన, అప్సరస్సమధ్యలు = లేనడుములు గల యచ్చేరలు, సుమచూర్ణ = పువ్వుల గందవొడి, కజ్జల = కాటుక, పటాభరణంబులు, వస్త్రములు, నగలు.

ఆ రావిసీడ నైదువందలు లేనడుముల యచ్చరలలేమలు పువ్వులు, గందవొడి, కాటుక, కోకలు, సొమ్ములు పెక్కులు కేలుదోయి ధరించి యుండుచు సంసారముక్తి నొంది యట కేఁగుదెంచినవారికి నెదురువోయి నేర్పుతో నలంకారము సేయుదురు.

219. బాహారుచిచ్ఛలమునన్=బాహువుల కాంతి యను నెపము చే సయ్యాటలు = పరిహాసములు.

వారలా వచ్చిన ముక్తులపై తమ కలికి చూపులను నల్లఁగల్వలు ధరింపఁజేసి చిరునవ్వులను గంధపునీరు మోములందుఁ జిలికి కేలుగవ డాలు నెపమున ముత్యాలహారములు కంఠముల వైచుచు వారి బుజములఁ బసుపుఁ బూసి, వీనుల సొమ్ము లుంచుచు అఱచేతుల కాంతులను కుంకుమపుఁ బూఁతలు చెక్కిళ్లు దుద్ది సంతసింపఁజేయు నా యచ్చరల మొత్తము ముక్తికన్యలను పెండ్లియాడి పండ్లు పులియ (అనంగ సుఖానుభవమునకై యువ్విళ్లూరు) నూతన వధూవరుల పరిహాసముల చేయు ముక్తికన్యల చెలు లనంగ నుందురు.

220. ఉభయ......కు = శ్రౌతములగు జ్యోతిష్టోమాది యాగములు, స్మార్తములగు పంచ మహాయజ్ఞములు అయోధనీయము=లోని కేఁగరానిది.

222. ప్రకృతవికార=ప్రాపంచికసంబంధమైన మార్పులకు, దుస్స్పర్శ తరము = తాకరానిది.

౧. ఘటము (కుండ), పటము (వస్త్రము), ఘటమునకు మృత్తు ఉపాదానకారణము, కులాలుఁడు, చక్రదండములు నిమిత్తకారణ మనియు; పటమునకు తంతువు లుపాదానకారణము, సాలె, తురీవేమాదికములు నిమిత్త కారణము అనియు వాదించు తర్కశాస్త్రజ్ఞులకు దూరము.

౨. ఇది శ్రౌతకర్మ, ఇది స్మార్తకర్మ అని కర్మనుగూర్చి వాదించు పూర్వమీమాంసను దెలిసినవారికిఁ గొలఁది కాదు.

3. ఝురి, ఖరి శబ్దము లేధాతువులవలన జనించినవి. వాని కా రూప మట్లేల రావలయు నని వాదించు వ్యాకరణశాస్త్రజ్ఞులకు సాధ్యము కాదు.

४. జగన్మిథ్య, బ్రహ్మసత్యమ్, ఇది రజ్జు సర్పభ్రాంతి అను విషయము లైన మాటలఁ గయ్యమాడు నద్వైతవాదులకుఁ బొందఁగాదు.

౫. కృష్ణ, విష్ణో, హృషీకేశ అనునట్టి భక్తులకు లభ్యమై ప్రకృతి వికారము లంటక బ్రహ్మానందప్రవాహమై వైకుంఠపుర ముండును.

223. ఆ వైకుంఠపురమునందు ఇవి అమృతసరస్సులా, లేక రజత భూములా? ఇవి గరుడపచ్చలు దాపిన చలువచోట్లా లేక పచ్చికబయళ్లా? ఎఱ్ఱడాలు గ్రుమ్మరించు కెంపురతనాల మేడలా లేక చివురాకు జొంపముల ప్రాఁకులా? వీరచ్చరనవలాలా, లేక గోడలలోఁ బ్రకాశించువారి ప్రతి బింబములా? అని చూచువార లొకొక్కకదాని నిర్ణయింపలేక తడబాటు నొందుచుందు రని భావము.

224. (శ్లేష) పరమ..... జ్ఞత=మేలగుపూవుల యంద మొందు టచే ఉత్తములగు దేవతలు లేక మంచి మనస్సుగలవారికి మనోహరమగుటచే, ఆత్మ......సము=తన యుద్యానవనముల యొక్కడు ప్రకాశము, అత్యయం దంతట రమించు గొప్ప జ్ఞానుల ప్రకాశమును, గరుఁపుఁ జరితల గరితలన్= మురిపెంపు నడకలు గల స్త్రీలచే, గౌరవనీయమైన నడవడి గల పతివ్రత లచే, గరగరికలగరిమ = అందముల గొప్పతనము, అంగగరిమ = ఆ పట్టణ స్వరూపముయొక్క గొప్పను, అమరున్ = తగును.

225. కలయంపి = కస్తురి గలిపిన నీరు.

226. విరులపాండిమ = పూవుల తెల్లఁదనము, దళమిషము = ఆకు లను నెపమున, కృష్ణకాంతి = నల్లనికాంతి, కల్మి పొలఁతి = లక్ష్మి, డాలు = ప్రకాశము, మధుకైతవమునన్ = తేనె యను నెపమున, సమ్మదబాష్పధారలు= ఆనందబాష్పములధారలు, కలికాచ్ఛలంబునన్ =మొగ్గలను నెపముచే, పులక

ములు=గగుర్పాటులు, సౌరభసంజ్ఞ=పరిమళముపేర, సుజ్ఞానవాసన=మంచిజ్ఞాన సంగతియు, తరులతాకుంజరూపధారులు=వృక్షములు తీవెలు పొదరిండ్లు వీని రూపుల నొందినవారు, కల్పిపోలఁతిడాలు=కలుముల జవరాలి మేని కాంతి.

227. అలి+శుక=తుమ్మెదలు చిలుకలు, కోకిల+ఆది = కోయిలలు మొదలైన వానియొక్క, వపురాశ్రయలీలన్ = రూపములు గైకొనుటచేత, సుమనఃఫలాది=పువ్వులు పండ్లు లోనగువానిచే, పరితుష్టులన్=తృప్తిపొందిన వారినిగ.

ఆ వైకుంఠమునఁ బూఁదోఁటలందు హరిదాసులు కొందఱు చెట్లు, తీఁగలు లోనగు రూపునను, గొందఱు తేంట్లు, చిలుకలు, కోయిలలు లోనగు రూపులను బొందియుందురు. ఆ చిల్కలు లోనగునవి ఈ వృక్షలతాదులపైఁ జేరి వానికి నందముఁ జేకూర్చును. ఈ వృక్షలతాదు లాశుకాదులకుఁ దాము తమ సువాసనల పూవులు, తీయని పండ్లిడి సంతోషపఱచును. కావున హరి దాసులు పరస్పరము సహాయము చేసికొందురు.

228. సౌభాగ్యసంపన్న=అదృష్టవంతమైన లక్షణములతోఁగూడిన, లక్ష్మీపదాంభోజ=లక్ష్మీదేవి పాదకమలములయొక్క, లాక్షాలక్ష్మీ=లత్తుకసిరిచే, పూజితములు = అర్చింపఁబడినవి, భూదేవి = భూదేవియొక్క, విఘూర్ణత్ + కటాక్ష=మిక్కిలి చలించుచున్న (తిరుగుచున్న) కడగన్నులయొక్క, వీక్షా= చూపులచేత, పక్ష్మలిత=ఱెక్కలు పుట్టించిన, గుళుచ్ఛవ్రజములు = పూగుత్తుల మొత్తములు, నీళా=నీళాదేవియొక్క, నఖాంకూర=గోళుల చివరలయొక్క, విన్యాస=ఉంచుటచే, చంద్రకిత=చంద్రవంకలుగ గుర్తుపడిన, ప్రవాళసంతా నకములు=చిగురుజొంపములు గలవి, భాగవతలోక = భగవద్భక్తులయొక్క, ఉన్నతక్రీడా = మేలియాటలచే, విభూషిత = అలంకరింపఁబడిన, ఛాయా విశేషకములు = నీడల ఆధిక్యము గలవి, పరవాసుదేవ=పరబ్రహ్మమగు మహా విష్ణువుయొక్క, విహార = విహరించుటయొక్క, కుతుకవిభవములకు = వినోద

సంపదలకు, నిరంతర=ఎల్లప్పుడు, పరాగ=పుష్పరస = పుప్పొడి మకరందము వీనియొక్క, వృష్టి=జడిచే, శీతలభూతలములు = చల్లని నేలలు గలవి.

ఆ వైకుంఠమునందలి వనములు కొన్ని సిరియడుగుఁదామరల లత్తుక సంపదచేఁ బూజింపఁబడినవి. (అశోకము స్త్రీల కాలితాఁకునఁ బుష్పించును. అట్టి దోహదక్రియ చేయఁబడిన వని తెలియవలయును.) కొన్ని భూదేవి యొక్క తిరుగుడువడు కడగంటిచూపులచేఁ బూచిన పూగుత్తులు గలవి (బొట్టుఁగుచెట్లు యువతుల చూపులచేఁ బుష్పించును. దోహదము.) కొన్ని నీళాదేవి చేతిగోళ్ల మొనలుంచుట యను నర్ధచంద్రాకారములుగఁ జేయఁబడి చిగుళ్లు గలవియు (మామిడులు కరస్పర్శచేఁ జిగిరించును) కొన్ని భక్తుల ఆటలచే నలంకృతములైన నీడలు గలవియునై. నిరంతర......లు=ఎల్లప్పుడు పుప్పొడి పూఁదేనె వీని వర్షించుటచేఁ జల్లనైన భూములు గలవి.

229. ౧. అచ్చట (మహావిష్ణువర్ణనము) కోటి సూర్యచంద్రుల కాంతిని సైతము తిరస్కరించు తేజస్సుతోను,

౨. రత్నాల వేయిస్తంభాలమంటపమునందు,

3. పూజింపఁదగిన యైశ్వర్యములజంట యనఁగ ధర్ముఁడు లోనగు జ్ఞానుల రూపమే పాదములై యొప్పుచుండ.

230. రవిచంద్రకోటి=కోటిసూర్యచంద్రులయొక్క, తిరస్కార = తిరస్కరించుటయందు, ధోరేయ = బలువైన, మహనీయదీప్తి సంపదలన్ = గొప్పతేజస్సంపదలను, అద్భుత=అచ్చెరువు గొల్పు, రత్నమయ = రత్నములు చెక్కిన, సహస్రస్తంభమంటపమునన్ = వేయిస్తంభాలమండపమందు, మహితవిభూతి = పూజార్హమైన ఐశ్వర్యములయొక్క, యుగ్మవిచిత్ర రూపమై = జంటచేఁ జిత్రముగలవై, ధర్మ+ఆది సూరిపాదములతోడన్ = ధర్ముఁడు లోనగు విష్ణుభక్తుల రూపమైన పాదములతో, సహస్రదళాబ్జమధ్యంబు నందు=వేయిరేకుల తామరపూవు నడుమ, కేవలభూ)విలాసానుభావ = కను

బొమలీలయొక్క ప్రభావమాత్రముననే, భావిత=సంకల్పింపఁబడిన, అఖిల+అజాండ+వర్తనుఁడు=బ్రహ్మాండగోళముల యన్నింటి ప్రవర్తనలు గలవాఁడు.

మాణిక్యసింహాసనమందు వేయిరేకుల తామరపూవు నడుమ ఆదిశేషుఁ డను పాన్పుమీఁదఁ బవళించి, శ్రీదేవి, భూదేవి, నీళాదేవి సేవింపఁగ-కేవల......నుండు = కేవలము కనుబొమలయొక్క విలాసముతోడి కదలికమాత్రమున మహానుభావతచే (మహిమచే) భావింపఁబడిన (సృజింపఁబడిన) బ్రహ్మాండము లన్నింటి ప్రవర్తనలు గలవాఁడు, అచ్యుతుఁడు = చ్యుతి (జాఱుట) లేనివాఁడు-విష్ణువు.

233. శయన + ఆసన + అంశుక+ఛత్రంబులు = పడక పీఠము వస్త్రము గొడుగు ఇవి యన్నియు, ధ్వజము = టెక్కెము, వీవన=విసనకఱ్ఱ, వేత్రంబు=వెండిబెత్తము, సూత్రవతీవిభుఁడు=విష్వక్సేనుఁడు, కుముదాదినిత్యసంఘములు = కుముదుఁడు లోనగు ద్వారపాలకుల సమూహములు, ఆయుధపంచకంబు = శంఖము చక్రము చాపము గద ఖడ్గము - (పాంచజన్యము, సుదర్శనము, శార్ఙ్గము, కౌమోదకి, నందకము అని క్రమముగా వీని పేరులు.)

శయనాం..................బులు = పాన్పు పీఠము వస్త్రము గొడుగు, ఫణికులోత్తముఁడు = ఆదిశేషుఁడు.

234. మేఖల = మొలనూలు, భువనజనకుఁడు = బ్రహ్మ, పొక్కిలివిరి = నాభిపద్మము, వైజయంతి = తులసిమాల, నవచంపకనిభము = క్రొత్తసంపెఁగవంటిది, ఇనకోటులు = సూర్యుల కోటిసంఖ్యలు, అలకస్తోమము = ముంగురుల మొత్తము.

236. భువనసర్గ=లోకముల సృజించుట, ముఖ్యక్రియా=మొదలైన కర్మలకు, ఆచార్యకంబు = ఉపాధ్యాయత్వము, శృంగారసామ్రాజ్యము = శృంగారక్రీడ, శృంగారసామ్రాజ్యనీతి=సింగారపుఁగ్రీడలను నేలుబడియొక్క నీతియందు (రాజనీతి), ధురీణమంత్రి=పండితుఁడైన సచివుఁడు, నర్మనీల=పరి

హాసముతోడి విలాసము, దశాకృతిప్రకృతికా=దశావతారముల ప్రకరణము నకు (ప్రకరణము రూపకములలో నొక భేదము). సూత్రధారత=సూత్రధార పాత్రను, భక్తవితాన = భక్తులసమూహమునందలి, వాత్సల్యకర్ణికార = వాత్సల్యమను కొండగోగునకు, వికాసకారణము = వికసించుటకు హేతువు.

భువన............కంబు = లోకముల సృజింప మొదలిడుటకు గురువై, తన విలోచనసంజ్ఞ = తన కంటిసైగ, నర్మసీల=పరియాచకముతోడి విలాసము, దశా......రత = పది యవతారముల నెత్తుటకై సూత్రధారుని పదవిని, భక్త.........ముగ=భక్తుల సమూహముపైఁ గల వాత్సల్య మను కొండగోఁగుచెట్టునకు వికసింపఁ గారణము కాఁగా, ఉవిదపలుకులకుఁ గొండ గోఁగు పూచును-దోహదము, పాలమున్నీటియాడుబిడ్డ = లక్ష్మి, టెక్కువ = యౌవనాదులవలనఁ గలుగు గర్వచేష్ట.

237. సముద్వేజక = మనస్సున కెక్కువ వేదన కల్పించు, భూరి సంసృతి = అత్యధికమైన సంసారముయొక్క, నవీనదవానల = క్రొత్తకారు చిచ్చుచే, తప్యమాన = తపించుచున్న, నానాజనకోటిక్ = సమస్త ప్రజా సమూహమును.

సము......కోటిక్ = మనస్సులో మిగుల వేదనతో బాధపడుచు నంతములేని సంసారమను క్రొత్త కారుచిచ్చులోఁ దపించుచున్న రకరకము లైన జనముల మొత్తమును.

239. చేతోభవవైరి = శివుఁడు, పన్పడు = వాడుకపడు.

240. ఉభయకర్మావళీ = పుణ్యపాపకర్మల సమూహముయొక్క, ఫలానుభవమునక్ =ఫల మనుభవించుటచే, ఉభయ......మునక్ = పుణ్య పాపకర్మల ఫలానుభవముచే.

241. సుకృతిదుష్క్రియలు = పుణ్యపాపకర్మలు

243. వేసరు=శ్రమపడు - పసిబిడ్డ పాలు త్రాగుటకు నోరు తెఱ వకపోఁగా బిడ్డతల్లి యా బిడ్డనిచెక్కిలి చేతి చిటికెతో మెల్లగఁ గొట్టి



**మవసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA106B189 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 693 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 2. |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Susmitha |
| పేజీలు విడదీసినది | Trivani |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| పరిస్థితి | good |